# గ్రహ సంహిత

సర్వజనుల భవిష్యత గ్రంధము



గ్రహసంహిత - ఉత్తరార్థము - ప్రథమ, ద్వితీయ స్కంధములు - రూ. 150-00

# గ్రహసంహిత

(జన్మజాతకము)

# HUMAN ASTROLOGY FOR ALL

ఉత్తరార్ధము

ప్రథమ స్కంధము

&

ద్వితీయ స్కంధము

గ్రంథ కర్త

ఆళ్ళ సుబ్బారావు

డెప్యూటీ కమర్షియల్ ట్యాక్సు ఆఫీసరు (రిటైర్డు)

Publishers

*A.S. Rao & Co.,*

Rama Krishna Santhi Samithi

5th Line, Nehru Nagar, GUNTUR - 1

Ph. No. 221861, 221699

# అవతారిక

భూమిపైగల చరాచర సృష్టికి రవ్యాది గ్రహకిరణ ప్రభావమునకు యెంతో సంబంధమున్నట్లు గ్రహించి మన ప్రాచీన మహర్షులైన పరాశర, వ్యాస, వసిష్ట, సూర్య, యవన, వరాహమిహిరాచార్య మొదలగు మహామహు లెందరో వారి స్వానుభవములతో జ్యోతిష శాస్త్రములను రచించియుండిరి.

ఇట్టి విజ్ఞాన శాస్త్రములలో ప్రాచీన ఋషి సాంప్రదాయక గ్రంథములైన భృగు సంహిత, పరాశర సంహిత, శుక్రనాడి, చంద్రనాడి, ధృవనాడి, సరస్వతినాడి మొదలగునవి భారతదేశము నందేగాక ప్రపంచమందంతట వ్యాపించి గ్రీకులు, రోమనులేగాక యితర దేశవాసులు అనేకులు యిప్పటివరకు అవలంభించుచుండిరి. ఇట్టి ప్రాచీన శాస్త్రములు రాజపోషణలేని కారణముచే రానురాను అనుభవములేని అజ్ఞానుల చేతులలోపడి శాస్త్ర విజ్ఞానము నశించి బజారుపాలై నందులకు మన మెంతగానో చింతించవలసియున్నది.

ప్రాచీన ఋషి సాంప్రదాయక గ్రంథములలోకొన్ని లభ్యముగాక పోవుటయు, మిగిలినవి ఆంధ్రవాఙ్మయమున లేని కారణముచే ఆంధ్ర లోకమునకు నిరుపయోగముగా గోచరించబడుచున్నది. నాచే నూతనాంశము లతో రచింపబడిన గ్రహసంహిత పూర్వార్థము రెండు భాగములుగా విభజింపబడి చదువరులకు అనుకూలించునట్లు వేర్వేరుగా ప్రచురింప బడినవి. మొదటిది ప్రథమ స్కంధము, రెండవది ద్వితీయ స్కంధము, ఇందు ఉత్తరార్థము మరల రెండు భాగములు ప్రథమస్కంధము, ద్వితీయ స్కంధము విడివిడిగాయున్నవి.

ప్రథమ స్కంధము జ్యోతిషప్రారంభకుల ఉపయోగార్థమై సంజ్ఞాప్రకణము చక్కగా విశదీకరించ బడియున్నది. నవగ్రహ జాతి మత స్వభావము, ఉచ్ఛనీచలు, మిత్రశత్రుత్వములు, గ్రహవీక్షణములు, గ్రహముల దశావస్థలు, గ్రహగతులు గ్రహదోషములు, మేషాదిరాశి స్వభావము, గ్రహబల నిరూపణ, గ్రహముల దృష్టి ఫలములు, చాదక వేదక బంధక ప్రతిబంధక యోగములు, పంచాంగ వివరములు, యపెమెరీస్సును బట్టి గ్రహముల యొక్క స్థానములు నిర్ణయించు విధానము, రాశి, అంశ, అరూఢ, భావ

చక్రములు వేయు విధానము, గ్రహాష్టకవర్గులు, గ్రహముల మహాదశ భుక్తి అంతర్దశ కాల ప్రమాణములు మొదలగు అనేక విషయములు యిందు వ్రాయబడి యున్నవి.

ద్వితీయ స్కంధమున బాలారిష్టము, అల్పమధ్యమ దీర్ఘాయు విశేషములు, మారక నిర్ణయము, నిర్యాణ హేతువులు, తను, ధన, భ్రాతృ, మాతృ, పుత్ర, శత్రు, కళత్ర, ఆయు, భాగ్య, రాజ్య, లాభ, వ్యయ భావ విశేషములు, స్త్రీ జాతకము, జైమినీ జాతక లక్షణములు, ఆరువందల యోగావయోగములు వ్రాయబడియున్నవి.

ఉత్తరార్థము ప్రథమస్కంధమున జ్యోతిషాభిమానుల ఉపయోగార్థమై గ్రహముల మహాదశలు, భుక్తులు, అంతర్దశలు, సూక్ష్మదశలు, ప్రాణదశల శుభా శుభ ఫలములు, తాజక సిద్ధాంతరీత్యా చెన్నకేశవులు, నీలకంఠునిచే వ్రాయబడిన సౌరసంవత్సర దశాఫలములు అనేకములు విశదీకరించబడినవి. వీని సహాయమున జాతకుని జీవిత విశేషములు భవిష్యత్తులో యెట్లు జరుగ బోవునది సులభముగా చెప్పవచ్చును.

ఉత్తరార్థము ద్వితీయస్కంధము ప్రశ్నతంత్రమునకు సంబంధించి నదై యున్నది, ఇందు నానావిధ ప్రశ్నలకు ఫలములు చెప్పు విధానములు, గోచార ఫలవిశేషములు యిందుగలవు.

అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలు నా యీ గ్రంథమున గల మంచి చెడులను పరిశీలించి యేవేని దోషములున్న దయతో నాకు తెలిపిన తరువాత ముద్రణమున సవరించుకొందునని సవినయముగా మనవి జేసుకొనుచున్నాడను. ఇదియేగాక, నాయీ ప్రయత్నములో సహకరించిన నా సోదరుడు శ్రీ ఆళ్ళ సాంబశివరావు, అసిస్టెంటు మెకానికల్ యింజనీరు (రిటైర్డు) రైల్వేస్, విజయవాడ వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాడను.

ఇట్లు

గుంటూరు
1-8-1996

ఆళ్ళ సుబ్బారావు
గ్రంథకర్త

# గ్రహ సంహిత

is

MOST RESPECTFULLY DEDICATED

TO



HIS AL-MIGHTY

**LORD SRI VENKATESWARA**

AND

HIS BELOVED CONSORT

**SRI PADMAVATHI**

శ్రీకర! శ్రీనివాస! సరసీ రుహలోచన ! పాపమోచనా!
ఓ కరుణా సముద్ర! పురుషోత్తమ ! మాదవ ! లోకనాయకా !
నే కలగన్న నాదు రచనల్ 'గ్రహసంహిత' గ్రంథరాజమున్
ఈ కలిలోన కీర్తి గడియించగ చేయుము శాశ్వతంబుగన్ ||

ఇట్లు
గ్రంథకర్త: ఆళ్ళ సుబ్బారావు
ధర్మపత్ని: రంగనాయకమ్మ

# నాడీ రహస్యాలు

గ్రంథకర్త
ఆళ్ళ సుబ్బారావు

# గ్రహసంహిత
# &
# దత్తనాడి

## అనుబంధం

జాతకుడు కోరిన జ్ఞాతుల పేర్లు, స్త్రీ, పురుష సంతాన సంఖ్య, జన్మతేది, వార, తిథి, నక్షత్ర, యోగ, కరణములను సులభముగా తెలుసుకొను నాడీ రహస్య విధానములు, లగ్న, భావ, అంశ, అరూఢ చక్రములు వేయు పద్ధతులు, ముఖ్య పట్టణముల యొక్క అక్షాంశ, దీర్ఘాంశరేఖలు, ప్రతి పట్టణమునకు లగ్నములు వేయు పట్టికలు అనేకము యిందు గలవు.

**Publishers :**

**A.S. RAO & CO.,**

**RAMAKRISHNA SANTHI SAMITHI**

**5th Line, Nehru Nagar,**

**GUNTUR - 522 001.**

**Phones : 221861, 221699**

**Rs. 60-00** పోస్టేజి అదనము

# విషయ సూచిక

## గ్రహసంహిత - ఉత్తరార్థము - ప్రథమస్కంధము

# విషయ సూచిక

## గ్రహసంహిత - ఉత్తరార్ధము - ద్వితీయస్కంధము

# గృహసృష్టి

## ముహూర్త, వాస్తు, నిర్మాణ భాగములు

## Science of House Building in Ancient & Modern Theory

## పూర్వార్ధము – ముహూర్త, వాస్తు భాగములు

ముహూర్త భాగము:-

ఇందు భూగోళ, ఆకాశగోళ పరిస్థితులు, వాని నమూనాలు, గ్రహములు, నక్షత్రములు, వాని వివరములు, రాశులు, లగ్నములు, అవి యేర్పడు విధానములు, పంచాంగమును చూచు లక్షణము, లగ్న నిర్ణయము, లగ్న ప్రశంస, నిర్ణీత లగ్నకాల సాధన, ఏక వింశతి మహాదోషములు మొదలగునవి యిందు గలవు.

వాస్తు భాగము:-

ఇందు గృహారంభము చేయవలసిన కాలము, భూశోధన, వివిధ గృహనిర్మాణములు, వాస్తు సంగ్రహము, గృహగర్భ నిర్ణయము, శుభవర్గు పట్టికలు, శంకుస్థాపన, స్తంభ ప్రతిష్ట, ద్వార నిర్మాణము, కూప నిర్మాణము, జలనిక్షేప జాడలు తెలుసుకొను విధానము, వన లక్షణము, గృహప్రవేశము, 103 గృహవేధలు పద్యతాత్పర్యములతో అనేక విషయములు యిందు గలవు.

లిమ్ బైండు — రూ. 90-00

## ఉత్తరార్ధము - నిర్మాణ భాగము

పునాది త్రవ్వకము మొదలు భవన నిర్మాణము పూర్తియగునంత వరకు జరుగు కంకర, యిటుక రాతిగోడ పనులు, లాదులు, కప్పులు, స్లాబులు, ప్లాస్టింగులు, ఫ్లోరింగులు, కఱ్ఱపనులు, రంగు పనులు, ప్రభుత్వ షెడ్యూల్సు, పనివాండ్ల, కూలీల వివరములు, యినుము, ఉక్కు, సిమెంటు రేకులు, జింకు రేకులు బరువు వివరణ పట్టికలు, బిల్డింగు ప్లానులు అనేకములు యిందు గలవు.

లిమ్ బైండు — రూ. 75-00

Publishers

*A.S. Rao & Co.,*

Rama Krishna Santhi Samithi
5th Line, Nehru Nagar
GUNTUR - 1
Phone : 221861

# గ్రహ సంహిత
(జన్మజాతకము)

## సర్వజనుల భవిష్యత్ గ్రంథము

## HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్ధము

## ప్రథమ స్కంధము

## గ్రహముల మహాదశాభుక్తి అంతర్దశా ఫలములు

పూర్వజన్మ యందు పుణ్య పాపరూపంబున యెట్టి కర్మ సంపాదించబడెనో యట్టి కర్మకు ఫలమీ జన్మయందు జాతకునికి ఆయా గ్రహముల యొక్క దశాభుక్తి అంతర్దశల వల్ల తెలియబడును. గ్రహదశా సంవత్సరములలో గతించిన దశా కాలము పూర్వజన్మలో గతించిన ఆ గ్రహదశాకాలమనియు మిగిలిన దశాశేషము ఈ జన్మలో జనన కాలమునకు ప్రారంభమై గతించుచున్నదని గ్రహించవలెను. ప్రతి గ్రహమునకు శుభ దశాఫలమనియు, పాప దశాఫలమనియు రెండు విధములుగా నుండును. గ్రహములకు శుభత్వ పాపత్వములను షడ్బల సాధనములతో సాధించి యే గ్రహము శుభుడో యే గ్రహము పాపుడో యేర్పరచుకొని ఆధిపత్యస్థితి సాహచర్య వీక్షణాదుల వల్ల గ్రహము శుభుడై యున్న శుభదశా ఫలములను, పాపుడుగా యున్న పాపదశాఫలములను నిర్ణయించవలెను.

దశాభుక్తినాథుని ఫలము నిర్ణయించునపుడు మహాదశానాథుడున్న రాశిని లగ్నముగా కల్పించుకొని అట్టి లగ్నమునకు భుక్తినాథునియొక్క యాధిపత్య స్థితి, దృష్టి మొదలగు వాని వల్ల బలమును యాలోచించి మహాదశ భుక్తినాథు లిరువురి కిని పరస్పర షష్టాష్టమ స్థిత్యాది దోషములు లేకున్న నాభుక్తినాథుని ఫలము శుభమగును. ఒకవేళ షష్టాష్టమాధి దోషము గలిగి యున్న నా యిరువురిలో బలాధికుని ఫలమునే చెప్పవలయును.

జన్మలగ్నమునకు కేంద్రకోణభావముల కధిపతులగు వారి మహాదశలును భుక్తులును మిక్కిలి శుభము నిచ్చును. 2-3-11 భావాధిపతులు దశాభుక్తులు సామాన్య ఫలముల నిచ్చును. 6-8-12 బావాధిపతుల దశలుకష్టఫలములు నిచ్చును. దశానాథుడున్న స్థానమునకు 6-8-12 స్థానములలోనున్న గ్రహము దశానాథునికి శత్రువగును. 2-3-4-5-9-10-11 స్థానములయందున్న గ్రహము దశానాథునికి మిక్కిలి శుభుడును, సప్తమమందున్న గ్రహమును, దశానాథునితో గూడిన గ్రహమును శుభుడగును. దశానాథుడు పాపుడై యుండగా వానితో సంబంధములేని శుభుని భుక్తి పాపమునిచ్చును. వానితో సంబంధించిన శుభుని భుక్తి మిశ్రమ ఫలమునిచ్చును. వానితో సంబంధములేని రాజయోగ గ్రహముయొక్క భుక్తి మిక్కిలి

పాపఫలము ధైర్యము నిచ్చును. దశానాధుడు యాధిపత్యాదుల వల్ల నతిపాపుడై, మారక సంబంధము వలన మారకుడై, రాజయోగసంబంధము వలన రాజయోగ లక్షణములు గలవాడై యుండును. ఒక దశానాధునికే మారక లక్షణంబును, రాజయోగ లక్షణమును గలిగియున్న యెడల అట్టి దశానాధుడు ప్రవేశించగనే ముందుగా వచ్చెడి తన భుక్తియందే మహారాజయోగము జేయును. ఆ దశయందలి మారకమును మరియొక దశలోనికి త్రోసివేయును.

మేషము మొదలుగా గల ప్రతి లగ్నమునకు అష్టమాధిపతి కొంత కష్ట ఫలము నిచ్చును. ఒకప్పుడు మారకుడు గూడ నగును. అష్టమాధిపతి కంటె వ్యయాధిపతి తక్కువ పాపఫలము నిచ్చును. ఈ వ్యయాధిపతికి రెండవ కోణాధి పత్యమున్న శుభము నిచ్చును. కోణాధిపత్యము గలిగిన గ్రహమునకు రెండవ యాధిపత్యము 3-6-11 స్థానములలో నేదైనను యొక పాపాధిపత్యము గలిగిన యట్టి గ్రహము మిశ్రమ ఫలము నిచ్చును. కోణాధిపత్యము గలిగిన గ్రహమునకు రెండవది అష్టమాధిపత్యము గలిగిన అట్టి గ్రహము కేవలము శుభఫలమునే యిచ్చును. రెండు పాపస్థానములకు ఆధిపత్యము గలిగిన గ్రహము పాపఫలమునే యిచ్చును. ఒక గ్రహమునకు యొక కోణాధిపత్యమును, యొక కేంద్రాధిపత్యము గలిగిన నా గ్రహము శుభుడైయున్న మిశ్రమఫలమును, పాపుడైయున్న శుభఫలము నిచ్చును. ఒక గ్రహమునకు యొక కేంద్రాధిపత్యమును రెండవది పాపాధిపత్యమును గలిగిన ఆ గ్రహము శుభుడైనచో క్రూరఫలము, పాపియైనచో మిశ్రమ ఫలము నిచ్చును. ఒకే గ్రహము లగ్నకేంద్రము గాక మిగిలిన కేంద్రములలో రెండు కేంద్రములకు అధిపతి యైన యెడల ఆ గ్రహము పాపఫలమునే యిచ్చును. లగ్న కేంద్రములతో కలసి రెండు కేంద్రములకు ఆధిపత్యము గలిగిన గ్రహము మిశ్రమ ఫలము నిచ్చును.

యే విధమైన దోషములులేని కేంద్రకోణాధిపతు లిరువురు నొకచో గలిసిన రాజయోగము నిత్తురు. నవమ, దశమ స్థానాధిపతులు రెండును నొకచోట గలసి యున్న ప్రబలమైన రాజయోగము గలుగును. ఈ భాగ్యరాజ్యాధిపతులలలో నొకరికి పాప స్థానాధిపత్యము గలిగిన మంచి ఫలము నివ్వజాలదు. పాపసంబంధము గలిగి యున్న గ్రహములు యోగభంగము జేయును. భాగ్యరాజ్యాధిపతులు శుభులైన మిక్కిలి శుభఫలముల నిచ్చును. పంచమాధిపతియు, లగ్నాధిపతియు శుభులును, శుభ ఫలములనిచ్చును. తరువాత సప్తమాధిపతియును, చతుర్థాధిపతియును పిమ్మట ద్వితీయాధిపతియు శుభులగుదురు. పాపగ్రహము లన్నిటిలో వ్యయ స్థానాధిపతి యెక్కువ పాపఫలము నిచ్చును. ఈ వ్యయాధిపతి కంటె 3-6-8-11 స్థానాధి పతులు నొకరి కంటె నొకరు క్రమముగా తక్కువ పాపఫలము నిచ్చువారగుదురు.

ఆరోహవీర్యాది గ్రహములను, భావతుల్య బింద్వధికులను, కర్మ భవోదయ ముల యందున్నవారును, ఉచ్చాతి వర్గముల యందున్నవాడును, షడ్బలములుగల వారని యును, నిట్టివారు శుభఫలముల నిచ్చువారగును.

మాంధిరాశిపతియును, మాందిభావములను పొందినవారును, స్వల్ప బిందువులుగల వారును, రిపు నీచ మూఢభావముల యందున్నవారును, పాపగ్రహ యుతులును, భావసందుల యందున్న వారును రాశిసంధులను పొందిన వారును, అనిష్ట ఫలముల నిచ్చువారగుదురు. లగ్నమునందున్న వాడును, లగ్నమునకు

మూడు, ఆరు, పది, పదునొకండు స్థానముల యందున్న వాడును, స్వకీయమైన సప్తమ వర్గమునందున్నవాడును, మిత్రక్షేత్రము నందున్నవాడును, అయిన పాప గ్రహము యొక్కయును, లగ్నము నందున్న శుభగ్రహము యొక్కయును, దశ శుభఫలము నిచ్చును. దశాధిపతికి మిత్రక్షేత్రము నందున్నవాడును, దశాధినాధుని యొక్క యుచ్చరాశి యందున్న వాడును, సప్తమస్థానమునకు త్రికోణోపచయ స్థానముల యందున్న వాడును, అగు చంద్రుడు సత్ఫలముల నిచ్చును. ఈ రాశులు మినహా యితర రాశుల యందున్న చంద్రుడు అశుభ ఫలముల నిచ్చును. చంద్రుడు దశా ప్రవేశ కాలమునందు స్వగృహము నందుండెనేని పైన చెప్పబడిన శుభఫలము లన్నియు కలుగును. కావున సకల గ్రహములకును దశాప్రవేశ కాలము నందలి లగ్నములను బట్టి శుభాశుభ ఫలముల చెప్పవలయును. భావఫలము లన్నియు దశా నాధుని యిష్టకష్టములను చక్కగా యోచించి ఆ ఫలములను దశాకాలముల యందు జెప్పవలయును. శుభగ్రహాదుల యొక్క సంబంధము ఆధికముగా గలిగి యున్న శుభఫలము లధికముగా గలుగును. పాపగ్రహముల యొక్క సంబంధము అధికముగా గలిగి యుండెనేని కష్టఫలము లధికముగా గలుగును. శుభపాపగ్రముల యొక్క సంబంధమధికముగా గలిగి యుండెనేని శుభాశుభ ఫలములు గలుగును. ఏ గ్రహము బలహీనమై యుండునో ఆ గ్రహమునకు చెప్పబడిన ఫలము ప్రత్యక్షానుభవమునకు రాకబోయినను స్వప్నము నందైనను మనోరధమునందైనను అనుభవింపబడును.

సాధారణముగా రాజస్థాపన రాజకారక గురుదశయందు రాజ ప్రసాదమును, దేవగ్రహము యొక్క దశయందు దేవప్రసాదమును, ధర్మాధిపతి యొక్క దశయందు ధర్మాభివృద్ధియును, కర్మాధిపతియొక్క దశయందు యజ్ఞాది సత్కర్మములు సిద్ధించును. సత్వ, రజ, తమో గుణములు గల గ్రహముల యొక్క దశాభుక్తుల యందు సత్వాదిగుణములు గలుగునని తెలియ వలయును.

జన్మనక్షత్రమునకు తొమ్మిదవ నక్షత్రమునందున్న గ్రహము యొక్క దశ వలన భూతకాల ఫలమును, కర్మర్షము మొదలుకొని తొమ్మిదవ నక్షత్రమునందున్న బలవద్గ్రహము యొక్క దశయందు భవిశ్యత్ఫలితమును, ఆధానాదిగతమైన గ్రహమును బట్టి సప్తమఫలమును జెప్పవలయును.

షష్టాధిపతి యొక్క దశవిలాసమును గలిగించునదియు, మృతువును గలిగించుననియు, తన ప్రభువునకు నాశము గలుగుజేయుననియు తెలియవలెను. సప్తమాధిపతి యొక్క దశాభుక్తుల యందు బంధుమరణము గలుగుననియు, సంవత్సాధిక మైత్రాధిపతులు తమతమ దశాభుక్తుల యందు సంవత్సవృద్ధి గలిగింతురని తెలియవలయును. జన్మకాలమందు నీచయందున్న వారును, నీచ గ్రహముతో గూడుకొనిన వాడును, శుభఫలముల నీయజాలరు. రాహువుతో గూడు కొనిన వాడును, రాహువున్న రాశినాధుడును శుభఫలముల నీయజాలరు. బాధా స్థానమును పొందిన గ్రహము యొక్క దశ శోకాది రోగములను గలుగుజేయును. కేంద్రమునందున్న గ్రహము యొక్క దశాభుక్తుల యందు దుఃఖములును, విదేశ సంచారము మొదలగునవి ప్రాప్తించును. పరస్పర షష్టములను పొందిన గ్రహముల

యొక్క దశాభుక్తుల యందు దేశ త్యాగమును అనర్థమును గలుగును. ఇట్లు గాక గ్రహములు శుభకరములై మిత్రక్షేత్రము లందుండిన శుభఫలములు గలుగును.

దీప్తావస్థయందున్న గ్రహము యొక్క దశయందు రాజగును. ధన యశోదాన విద్యలతో వినోదించువాడగును. స్వస్థానమునందున్న గ్రహముల వలన ఆచారము, ధర్మముచ సద్వాక్యశ్రవణము, నానావిధ సుఖములు, ఆరోగ్యము, ధనము గలుగజేయును. ముదితావస్థ యందున్న గ్రహముయొక్క దశ రాజప్రీతిని, విభూతిని, సుఖమును గలుగజేయును. శాంతావస్థ యందున్న గ్రహముల యొక్క దశ ఆరోగ్యము, సౌఖ్యము, సంపదలను, రాజప్రీతిని యుత్సాహమును గలుగ జేయును. శక్తావస్థ యందున్న గ్రహము యొక్క దశాభుక్తుల యందు విద్యావినయ ధనతపస్సిద్ధులును, ధర్మ ప్రవృత్తియు గలుగును. పీడావస్థ యందున్న గ్రహము యొక్క దశయందు దొంగలు, శత్రువులు, రాజులు యనువారి చేత భయము గలుగును. తమ్ముని మరణము గలుగును. దీనావస్థ యందున్న గ్రహము దైన్యము గలుగ జేయును. వికలావస్థ యందున్న గ్రహము శోకరోగములను గలిగించును. ఖలావస్థ యందున్న గ్రహము చిత్త దుఃఖమును గలుగజేయును. భీతావస్థ యందున్న గ్రహము ప్రతి దినమందును శత్రుభయము గలుగ జేయును.

జనన కాలమున గుళికుడున్న నక్షత్రము వలన గుళికుని దశను కల్పింప వలయును. గుళికుడున్న భవనాంశేశులును గుళికునితో గూడిన గ్రహములు సహకారులును, మృత్యువు నిచ్చువారు నగుదురు.

పాపగ్రహము లగ్నము నందుండెనేని అట్టివాని దశయందు పాపులయొక్క భుక్తులయందు నానావిధములైన శోకరోగములు గలుగును. ధననాశనము, రాజ భయము, శత్రుభయము మొదలగునవి గలుగును. శుభగ్రహము యొక్క భుక్తి యందు సకల శుభములు కలుగును. లగ్నాధిపతి దశాకాలమందు పాపగ్రహ భుక్తిలో రోగభయము, మృత్యుభయము లేదా స్థాననాశనము గలుగును. ధనాధిపతి యొక్క దశాకాలముందు శని భుక్తియందు ధననాశమగును. ఇష్టబంధు విరోధము గలుగును. ధనాధిపతి పాపగ్రహమైన శని, కుజ, రాహు, రవుల భుక్తులలో ధననాశము గలుగును. ధనస్థానమున పాపగ్రహమున్నను నదేఫలమగును. ధన స్థానమునందున్న పాపగ్రహము యొక్కయు ధనాధిపతి యొక్కయు దశయందు రాజకోపము వలన మానార్థములకు నాశము, బంధము, స్థానభ్రష్టత, మిత్రవిరోధము గలుగును. తృతీయాధిపతి పాపగ్రహమై పాపులతో గూడుకొని యుండెనేని యతని యొక్క దశయందు పాపగ్రహముల యొక్క భుక్తులయందు శత్రువులు, చోరులు, ఆయుధముల మూలకముగా దుఃఖము గలుగును. శుభగ్రహములతో గూడి యుండిరేని శుభఫలము గలుగును. తృతీయాధిపతియొక్క దశయందు శని, కుజ, రాహు, కేతు, రవి భుక్తులయందు సహోదరులకు నాశమైనను, సహోదరులతో విరోధమైనను గలుగును.

పాపుడైన చతుర్థాధిపతి యొక్క దశయందు పాపగ్రహముల యొక్క భుక్తికాలము నందు స్థానభ్రష్టతయును, బంధుజన విరోధమును, కృష్యాది గోవిత్త నాశమును గలుగును. పుత్రస్థానాధిపతి యొక్క దశయందు పాపగ్రహముల యొక్క భుక్తులయందు రాజభయము లేక ప్రియపుత్రునకు రోగము గలుగును. కాని

పంచమాధిపతి యొక్క దశలో శుభగ్రహముల యొక్క భుక్తుల యందు పుత్ర, ధన లాభములును, రాజబంధు లాలనమును, యిష్టసిద్ధియును గలుగును. షష్ఠాధిపతి యొక్క దశలో పాపగ్రహముల యొక్క భుక్తియందు రాజాగ్ని భయములును, వ్యసనమును, రోగమును గలుగును. సప్తమాధిపతియొక్క దశయందు పాపగ్రహము యొక్క ఖలాపహార దశయందు భార్యానాశము, దేశాటనము గలుగును.

అష్టమాధిపతి యొక్క దశయందు పాపగ్రహము యొక్క భుక్తియందు ఆయుర్విత్త యశోవినాశమగును. దేశాటనము, స్థానచ్యుతియును సంభవించును. మరియు ధర్మాధిపతి యొక్క దశయందు పాపగ్రహము యొక్క భుక్తియందు తల్లి దండ్రులకు మరణము గలుగును. అధర్మములను జేయుట, బంధనము, ధన నాశము గలుగును.

కర్మాధిపతియొక్క దశయందు ఖలస్థితి పాకమందిన పాపగ్రహ భుక్తియందు యిష్ట నాశనము, స్థానభ్రష్టత, సుఖయశోనాశము, రాజభయము, ధననాశము, గలుగును. లాభాధిపతి యొక్క దశయందు, శని, కుజ, రవి, రాహుకేతువుల భుక్తి యందు సుఖ నాశము, కృష్యాది నాశము, రాజభయము, ధననాశము గలుగును. ద్వాదశాధి పతి యొక్క దశయందు రవి, శని, కుజుల భుక్తుల యందు భార్య తోడను, పుత్రుల తోడను, బంధువులతోను, వైరము గలుగును. బలనాశమగును. మాన ధనములకు వినాశ మేర్పడును. రాహుభుక్తిలో విషభయము గలుగును.

పరస్పరము షష్ఠాష్టముల యందున్న గ్రహముల యొక్క భుక్తియందు స్థానభ్రష్టతయైనను మరణమైనను గలుగును. మరియు నొక్కచోటనున్న గ్రహములు బల రహితులై యుండి రేని వారిలో నొకని యొక్క దశయందుమరియొక్కని దశాభుక్తి యందు మరణము గలుగును. క్రూరగ్రహము యొక్క దశాకాలమునందు క్రూర గ్రహము యొక్క భుక్తియందు మరణము తప్పక గలుగును. దశాధిపతి శత్రువైన వాని యొక్క ధశయందు అతనికి శత్రువైన పాపగ్రహముల యొక్క భుక్తియందు మరణము గలుగును.

పాపగ్రహమునకు ఉచ్చాతి జన్యమైన ఫలము దశాప్రవేశకాలము నందు గలుగును. భావ జన్యమైన ఫలము శుభగ్రహములకు దశాదియందును, స్థానఫలము దశామధ్యమందును, చూపువలన గలుగు ఫలము దశాంతమందును గలుగును.

## భావాధిపతుల దశాఫలము

లగ్నాధిపతి యొక్క దశ బహుధనము నిచ్చును. ద్వితీయాధిపతి యొక్క దశ మృత్యువును, తృతీయాధిపతి దశకష్టములనుగలుగజేసిపాపఫలములనిచ్చును. చతుర్థ పంచమాధిపతుల యొక్క దశలు విద్యను, సౌఖ్యమును యిచ్చును. షష్ఠాధిపతి యొక్క దశ శత్రు భయమును, సప్తమాధిపతియొక్క దశ శోకమును, విచార దుఃఖములను గలిగించును, అష్టమాధిపతి యొక్క దశ యొల్లప్పుడు మృత్యుప్రదమై యుండును. నవమాధిపతి యొక్క దశ మంచికార్యములు జేయుట యందు మనస్సును పోనిచ్చును. దశమస్థానాధిపతి యొక్క దశపాలకుల యొక్కయు, రాజుల యొక్కయు సంబంధము గలిగి శుభఫలముల నిచ్చును. ఏకాదశస్థానాధిపతి యొక్క దశ లాభము పొందులాగున చర్యను నడిపించును. ద్వాదశస్థానాధిపతి యొక్క దశ ద్రవ్యనష్టము, రోగబాధలు, మొదలుగాగల కష్టనష్టములను గలుగ జేయును.

పంచమ నవమాధిపతుల యొక్క దశలలో మిక్కిలి శుభఫలముల నిచ్చును. రాజ్యము, పుత్రాదులను గలిగించును. చతుర్థదశమాధిపతుల యొక్క దశలు గూడ యీ ప్రకారముగనే శుభఫలముల నిచ్చును. నవమస్థానాధిపతితో యున్న భావాధిపతుల దశలు గొప్ప శోభనయోగమై అనేక విలాసాది శుభములు, సౌందర్యము, దారా పుత్రాదుల సంపత్తి, గౌరవము, సౌఖ్యము, రాజ్యాధిక ప్రభుత్వము మొదలగు శుభఫలముల నిచ్చును. పై దశాగ్రహములకు పాపగ్రహ వీక్షణమున్న యెడల రాజ్యము, పాలనము యిచ్చు దశలగును. శుభగ్రహములతో గూడి యున్న ధనము, మంచి పదార్థములు మొదలగు వాని నిచ్చు దశలగును. పంచమాధిపతితో రాజ్యమును గలిసిన లగ్నమై అందలి గ్రహదశలు రాజయోగము గలిగించును. పంచమ నవమాధిపతులు కలిసియుండగా వచ్చుదశ రాజరికము, సౌఖ్యము, ధన లాభము మొదలగు శుభఫలముల నిచ్చును. ఈ ప్రకారమే దశమ పంచమాధిపతుల కలయిక గల దశ శుభఫల ప్రదమైయుండును. పంచమాధిపతితో కలసియున్న దశమాధిపతి యొక్క దశయును, చతుర్థస్థానాధిపతితో కలిసియున్న నవమాధిపతి యొక్క దశయును పంచమస్థానములో నుండిన దశమాధిపతి యొక్క దశయును పంచమస్థానములో నుండిన దశమాధిపతి యొక్క దశయును శుభకరములై యుండును.

షష్ఠ సప్తమాధిపతులు ఒకే గ్రహమై ఆగ్రహము దశమస్థానమునందున్న అట్టి వానిదశ శుభఫలముల నిచ్చును. అట్లుగాకున్న విపరీత ఫలముల నిచ్చును. శని వృషభరాశి యందుండి లగ్నము సింహమైన పై అంశములకు సరిపోవును. ద్వితీయ సప్తమాధిపతులు ఒకే గ్రహమై ఆగ్రహము దశమస్థానము నందున్న అట్టివాని దశ శుభఫలముల నిచ్చును. అనగా మేషము జన్మలగ్నమై శుక్రుడు మకరరాశి యందున్నను, తుల జన్మలగ్నమై కుజుడు కర్కాటకము నందున్నను అట్టివాని దశలు శుభఫలముల నిచ్చును. షష్ట, అష్టమ, ద్వాదశాధిపతులు పంచమాధిపతితో గూడియున్న అట్టివానిదశలు శుభఫలమునిచ్చును. దశమస్థానములో చతుర్థాధిపతి యుండి, చతుర్థ స్థానములో దశమాధిపతి యున్న యిరువురి దశలయందు శుభఫలము గలుగును. చతుర్థ, పంచమ, నవమ, దశమ స్థానాధిపతులు ఒక్క రాశిలో కలిసి యున్న అట్టి వాని దశలయందు రాజయోగము గలిగి రాజపూజ్యత, సన్మానములు, ప్రభుత్వాధికారము మొదలగు సత్ఫలములు గలుగును. పంచమాధిపతి చతుర్థస్థానము నందుండగా వాని దశయందు రాజయోగము గలిగించి శుభఫలము నిచ్చును. అట్లే దశమ స్థానాధిపతి చతుర్థస్థానము నందున్నను వాని దశయందు రాజయోగ సంబంధమైన శుభఫలముల నిచ్చును. చతుర్థ పంచమ స్థానములలో యితర గ్రహము లుండి రాజ్యాధిపతి యొక్కయు లేక కోణాధిపతుల యొక్కయు సంబంధ వీక్షణాదులతో గూడియున్న ఆ గ్రహదశల యందు రాజ్యప్రదమగును. దశమస్థానమునందుపంచమాధిపతియున్న అట్టివాని దశయందు ధనము, సంపత్తు, సౌఖ్యము, ఐశ్వర్యము మొదలుగా గల సత్ఫలములు గలుగును. దశమ స్థానమునందు నవమాధిపతియున్న అట్టి వానిదశ రాజ్యప్రదమగును. గ్రహములన్నియు పంచమ, నవమ, కోణాధిపత్యము గలవియగుచో అట్టివాని దశలు శుభ ఫలము నిచ్చును. అవి తృతీయ, షష్ఠ, ఏకాదశ స్థానాధిపత్యము గలవియగుచో పాప ఫలముల నిచ్చును.

శుభగ్రహములు కేంద్రాదిపత్యము గలవియగుచో వాని దశలయందు శుభ ఫలముల నీయజాలవు. అట్లే క్రూరగ్రహములు కేంద్రాధిపత్యము గలవియగుచో వాని దశల యందు పాపఫలముల నీయక తరతరభేదముగల శుభఫలముల నిచ్చెదరు. అనగా లగ్న కేంద్రాధిపత్యము కంటె చతుర్థ కేంద్రాధిపత్య ఫలమును, చతుర్థ కేంద్రాధిపత్యము కంటె సప్తమ కేంద్రాధిపత్య ఫలమును, సప్తమ కేంద్రాధిపత్యము కంటె దశమ కేంద్రాధిపత్యమును హెచ్చు శుభత్వము గలదియై యుండును. కేంద్రాధిపత్యము నొందు శుభగ్రహముల యొక్క పాపఫలములు గూడ యిట్లే యుండును. ఆ గ్రహములు కోణాధిపత్యము నొందునప్పుడు వాని శుభఫలములు, లగ్న కోణాధిపత్యమున కన్న పంచమ కోణాధిపత్యమును, పంచమ కోణాధి పత్యమున కన్న నవమ కోణాధిపత్యమును హెచ్చుగా నుండును. త్రిషడా యాధిపత్య క్రూరఫలములు గూడ తృతీయాధిపత్యము కంటె షష్టాధిపత్యము, షష్టాధిపత్యము కంటె లాభాధి పత్యమును. ఒక దానికంటె నొకటి శక్తివంతమై యుండునని గ్రహించవలెను. ద్వితీయాధి పతియును, వ్యయాధి పతియును స్వతంత్రముగా తమ ఆధిపత్యముల నీయజాలవు. ఇతర గ్రహ లేక స్థాన సంబంధమును బట్టి వాని ఫలములుండును. రవి. చంద్రులకు ఒక్క ఆధిపత్యమే యుండుట వలన ఆ గ్రహములు వాని స్థితి సంబంధము లను బట్టి ఫలముల నిచ్చుచుండును. రెండు ఆధిపత్యములు గల గ్రహములు అనగా శుక్రుడు ద్వితీయ సప్తమాధి పతియై నప్పుడు పంచమ వ్యయాధి పతియై నప్పుడును. గురుడు ద్వితీయ పంచమాధిపతి యగునపుడును, ఇట్టి విషయములలో ఆయాగ్రహముల కుండు ద్వితీయ వ్యయాధిపత్యఫలములు ప్రచ్ఛనమై వాని యొక్క కేంద్రకోణాధి పత్య ఫలములు ప్రస్ఫుటమగును.

అష్టమాధిపతి శుభఫలముల నీయడు. కాని అష్టమాధిపతికి లగ్నాధిపత్యము గలిగినపుడు శుభఫలములు గలుగును. అనగా మేషలగ్నమునకు లగ్న, అష్టమాధి పతియైన కుజునకును, తులాలగ్నమునకు లగ్న . అష్టమాధిపతియైన శుక్రునకును అష్టమాధి పత్యదోషము లేదు. కుజునకు పంచమాధిపత్యదశలో కేంద్రాధిపత్యము గూడ యుండునపుడు అట్టి కుజుడు శుభఫలముల నిచ్చును, పంచమాధిపత్యము లేకుండి దశమ కేంద్రాధి పత్యము గల కుజుడు అశుభుడు అగును. కుంభ లగ్నమునకు కుజుడు శుభప్రదుడు కాడు. కర్కాటక లగ్నమునకు శుభయోగము నిచ్చును. కేంద్రాధి పతులకును త్రికోణాధిపతులకును అన్యోన్య సంబంధము గలిగి తృతీయ షష్ట లాభాధిపతులతో యెట్టి సంబంధము లేకున్న ఆ కేంద్ర త్రికోణాధిపతులు, అధిక శుభఫలముల నిచ్చు వారగుదురు. కేంద్ర త్రికోణాధి పతులు, దోష స్థానాధిపతుల సంబంధమున్నప్పటికి బలవంతులై యోగకారకు లగు చున్నారు. భాగ్య రాజ్యాధిపతులు దోష స్థానాధిపతుల సంబంధము గలిగినప్పటకి, యెవరికి వారు తమ స్థానములలో నున్నను, ఆ అధిపతులు విపర్యయగా సిచను పొందినను, పరస్పరముగా నొకరి యింటిలో నొకరున్నను రాజయోగ కారకు లగుదురు. విపర్యయస్థితి యనగా రెండు గ్రహములును నవమస్థానము నందుం డుట, లేక దశమ స్థానము నందుండుట భాగ్యాధిపతి దశమ స్థానము నందును, రాజ్యాధిపతి నవమ స్థానము నందును యుండుట, యివి అన్యోన్య సంబంధ

రాజయోగ కారకములు. భాగ్యాధిపతి రాజ్యాధిపతి స్థానమునందుండి, రాజ్యాధిపతి యితర స్థానమున నుండుట.రాజ్యాధిపతి భాగ్యాధిపుని యింట యితర స్థానము నుండుట. ఈ యిద్దరిలో నొకరు స్వక్షేత్రమందుండి రెండవ అధిపతి యితర స్థానమునందుండుట. యివి యును రాజయోగము లనబడును.

భాగ్యరాజ్యాధిపతులైన గ్రహములే అష్టమ లాభాధిపత్యములు గూడ గలిగి నపుడు అవి జాతకునకు యోగమివ్వజాలవు. మిధున లగ్నమునకు అష్టమ భాగ్యాధి పతి శని యగును. మేషలగ్నమునకు రాజ్యలాభాధిపతి శని యగును, అట్లు శని యోగించ జాలడు. ఇట్టిది రాజయోగభంగ లక్షణమగును.

3-6-8-11-12 స్థానాధిపతులు యోగకారక గ్రహసంబంధము గలిగినప్పుడు అట్టి గ్రహదశలలో రాజయోగఫలము నిచ్చును. కేంద్రకోణాధిపతులు కలిసి యున్నపుడు మరియొక త్రికోణాధిపతి సంబంధము గూడ యున్నయెడల అది విశేష యోగకారకమగును.

రాహు కేతువులు స్వతంత్రముగా ఫలముల నీయజాలరు. ఈ గ్రహములు యే భావమందుండునో యే భావాధిపతులతో గలిసియుండునో ఆ భావాధిపతుల ఫలముల నిచ్చును. రాహు కేతువులు కేంద్రస్థానముల యందుగాని త్రికోణస్థానము లందుగాని యున్నపుడు కేంద్రముందున్నపుడు త్రకోణాధిపతి సంబంధమును త్రికోణమందున్నపుడు కేంద్రాధిపతి సంబంధమును యున్నయెడల అట్టి రాహు కేతువులు రాజ యోగమును గలుగజేయును.

గురు శుక్రులకు కేంద్రాధిపత్యము గలిగినప్పుడు పాపఫలము నిచ్చుటలో బలవంతు లగుచున్నారు. అట్టి ఆధిపత్యముతో ఆ శుభగ్రహము ద్వితీయ లేక సప్తమ స్థానమందున్న మారకదోషము గలిగించును. బుధుడును చంద్రుడును కేంద్రాధి పత్యము వలన పాపఫలములనిచ్చువారగుచున్నారు. ద్వితీయ లేక సప్తమ స్థానమందున్న మారకదోషము గలిగించు వారగుచున్నారు. ఈ అశుభత్వాది దోషముల నిచ్చుటలో అన్ని గ్రహములలో గురుడు మిక్కిలి బలవంతుడు., అంత కంటె తక్కువ బలవంతుడు శుక్రుడు, తరువాత బుదుడు, తరువాత చంద్రుడు, యింకను తక్కువ బలవంతుని ఫలనిర్దేశముతో తారతమ్యమును గ్రహించ వలసి యుండును.

సూర్యచంద్రులకు అష్టమాధిపత్య దోషము లేదు. మకర లగ్నమునకు సూర్యుడును, ధనుస్సు లగ్నమునకు చంద్రుడును అష్టమాధిపత్యము గలవారగుటచే అట్టి ఆధిపత్య దోషము ఆ గ్రహములకు లేదు. సప్తమస్థానము కంటె ద్వితీయ స్థానము మారకదోషము గలిగించుటకు అధికబలము గలది. అట్టి సప్తమ స్థానా ధిపుని కంటె ద్వితీయస్థానాధిపతి మారకత్వము నిచ్చుటకు అధిక బలవంతుడు మారక స్థానాధిపతులను ఆ మారక స్థానాధిపతులతో గూడిన పాప గ్రహములును, మారకస్థానములలో నుండు పాపగ్రహములును ఆయా గ్రహదశలలో మారకత్వము నిచ్చును. ఈ గ్రహములన్ని దశలలో మారకత్యము గలుగునప్పుడు వ్యయాధిపతి యొక్క దశలో నైనను మృత్యువును సంభవింపజేయును. వ్యయాధిపతి యొక్క దశయందును, వ్యయాధిపతితో గూడిన పాపగ్రహ దశయందును మారకము సంభవింపని యెడల వ్యయాధిపతితో గూడిన శుభగ్రహ దశలోనైనను మారకము

సంభవించును. అట్లుగూడ కానియెడల అష్టమాధిపతి దశలోనైనను మృత్యువు సంభవించును. మారకదశలో శుభగ్రహ భుక్తి మారకాధిపతితో సంబంధమున్నప్పటికి జాతకునకు మారక మివ్వదు. సంబంధము లేనట్టి పాపగ్రహ భుక్తి మారకమిచ్చును. మారకగ్రహ సంబంధము గల పాపశని యితర గ్రహముల నతిక్రమించి తానే మారకత్వము నిచ్చును.

దశానాథుడు లగ్నమందుండి తన ద్వాదశాంశమునందు గాని, తన ద్రేక్కాణము నందుగాని యున్న యెడల అట్టి దశా కాలములో శుభములు గలుగును. దశానాథుడు లగ్నమందుండి తన త్రింశాంశమందు గాని, మిత్రగ్రహము యొక్క త్రింశాంశమునందు గాని యున్న యెడల అట్టిగ్రహము యొక్క దశాకాలములో శుభఫలము గలుగును. దశానాథుడు లగ్నము నందుండి మిత్రక్షేత్రమైన నవాంశము నందున్నను, మిత్రగ్రహము యొక్క ద్వాదశాంశమునందున్నను అట్టి దశాధిపతి యొక్క భుక్తి శుభములనొసంగును. దశానాథుడు పంచమాధిపుని నవాంశము నందున్నను లేక వాని ద్వాదశాంశము నందున్నను లేక వాని మిత్ర ద్రేక్కాణము నందున్నను అట్టి దశాధిపుని భుక్తి శుభఫలము నిచ్చును. దశానాథుడు మిత్ర నవాంశమును పొందినపుడు లేక భాగ్యాధిపుని ద్వాదశాంశమును పొందినప్పుడును లేక గురు ద్రేక్కాణ గతుడై నప్పుడును అట్టి దశాధిపుని దశ శుభఫలము నిచ్చును. దశా నాథుడు చతుర్థాధిపుని నవాంశమును పొందినట్టిగాని, చతుర్థాధిపుని ద్వాదశాంశము పొందినట్టిగాని, చతుర్థాధిపుని ద్రేక్కాణమును పొందినట్టిగాని గ్రహము యొక్క దశ శుభఫలముల నిచ్చును.

## గ్రహభుక్తి ఫలము

గ్రహములన్నియు వాని స్వదశలో స్వభుక్తులందుగాని అంతర్దశాధి స్వభుక్తులందు గాని తామివ్వగల శుభాశుభఫలములను పూర్ణముగా నీయజాలవు. ఒక గ్రహ మహాదశలో యితర గ్రహభుక్తులు వచ్చునపుడు, భుక్తినాథునకు మహా దశానాథుని తో చతుర్విధ సంబంధములలో నేదైనా యున్నపుడును లేక యే సంబంధమును లేకుండా తన సహజభావ ధర్మములలో గలవాడైనప్పుడును, ఆ గ్రహము యొక్క భుక్తిలోను, మహాదశానాథుడు స్వభక్తులలో నెట్లు పూర్ణఫలము నివ్వజాలడో అట్లే భుక్తినాథుడు తన శుభాశుభఫలముల నీయక మహా దశానాథుని యొక్క ఫలయోగములనే గలిగించును. దశానాథునితో యితర గ్రహ భుక్తి నాథునకు చతుర్విధ సంబంధములలో నేదియు లేనప్పుడు, విరుద్ధ ఫలము నిచ్చే దశాభుక్తినాథుడై నప్పుడును, అనగా యిద్దరిలో ఒకరు శుభఫలముల నిచ్చుట యును, రెండవది అశుభ ఫలమిచ్చుటయు రెండు సమాన శక్తి వంతమైనప్పుడు భుక్తి నాథుని ఫలమే గ్రహింపదగును.

కేంద్రకోణాధిపుల దశాభుక్తులు వచ్చునపుడు యిద్దరికి చతుర్విధ సంబంధములలో నొకటియున్నపుడు ఆ భుక్తి శుభఫలముయిచ్చును. సంబంధము లేనప్పుడు పాపఫలము నిచ్చును. యోగకారక గ్రహముతో నొక శుభగ్రహమునకు సంబంధముండగా ఆయాగ్రహభుక్తులలో అప్పుడప్పుడు కొంత శుభయోగ ఫలముండును. రాజయోగ గ్రహదశలో సుయోగము ప్రారంభమైనచో ద్వితీయ,

సప్తమాధిపుల మాకర గ్రహభుక్తుల యందును, పాపగ్రహ భుక్తుల యందును శుభ యోగమభివృద్ధి జెందకుండ అశుభమును, అంతరాయములను గలిగించును. యోగ కారక దశలో దశానాధునితో సంబంధమున్న శుభగ్రహ భుక్తిలోను, శుభఫలము నిచ్చును. సంబంధము లేని శుభగ్రహదశభుక్తిలోను, శుభఫలము నిచ్చును. సంబంధము లేని శుభగ్రహ దశభుక్తిలో ఉన్నతిగాని హీనతనుగాని గలిగించక యధా ప్రకారము గా యుండును. పాపగ్రహదశలో ఆ దశానాధునితో సంబంధమున్న శుభగ్రహ భుక్తులు మిశ్రమఫలముల నిచ్చును. సంబంధములేని శుభగ్రహభుక్తులు పాప ఫలముల నిచ్చును. సంబంధముగల యోగకారక భుక్తులు అత్యంత పాప ఫలముల నిచ్చును.

శని శుక్రులు పరస్పర దశాభుక్తులయందు శుభాశుభఫలములు విపరీతముగా నుండును. శనిదశలో శుక్రభుక్తి శని యొక్క ఫలమును, శుక్రదశలో శనిభుక్తి శుక్రఫలముల నిచ్చును. కేంద్రకోణాధిపుల దశాభుక్తులలో శుభఫలములే గలుగును. లగ్నము లగాయితు 2-3-11 స్థానాధిపతుల దశాభుక్తులు సామాన్యముగా యోగించును. 6-8-12 స్థానాధిపతుల దశాభుక్తులలో యెల్లప్పుడు కష్టములు గలిగించును.

### రాహుకేతువుల దశా విశేషములు

లగ్నమునకు కోణములైన 5-9 స్థానములందు రాహువు లేక కేతువుండి ద్వితీయాధి పతిచే గాని, సప్తమాధిపతిచేగాని వీక్షింపబడిన వారి దశయందును, భుక్తియందు మారకము జేయును. రాహు కేతువులు లగ్న, ద్వితీయ, సప్తమముల లో నుండి కోణాధిపతులతో గూడియున్నను, వీక్షించబడినను ఆయుర్వృద్ధి గలుగును. ఆద్వితీయ సప్తమాధిపతులలో పాపగ్రహము మారకుడగును. ద్విస్వభావ రాశులైన మిథున, కన్యా, ధనుర్మీనములయందు రాహుకేతువులుండి కేంద్రకోణాధి పతులతో గూడినను, లేక వారలే కేంద్ర కోణాధిపతులై యున్నను, అట్టి రాహు కేతువులు తమ దశలయందు ధనము, రాజ్యము నిత్తురు. రాహు కేతువులు ద్వి స్వభావ రాశుల యందుండి 6-8-12 స్థానాధిపతులతో గూడినను, వారిచే వీక్షించ బడినను, మనుష్యుల కల్పఫల మిత్తురు. తల్లిని, మాతృవర్గమును నశింప జేతురు. రాహు కేతువులు స్థిర, చరరాశుల యందుండి కేంద్రాధిపతులతో గూడినను, వీక్షింపబడినను నెవరేని శుభక్షేత్రమందున్న మహాధైర్యము నిచ్చును. పాప క్షేత్రమందున్న గ్రహము యోగమును జరిపి సౌఖ్యము నిచ్చును. రాహుకేతువులు చర స్థిర రాశులలో నుండి పాపక్షేత్రవర్తులై శుభులతో గూడియున్న మహామారకుల గుదురు. ఇచ్చట శుభడనగా నైసర్గిక శుభుడని యర్థము. రాహుకేతువులు షష్టాష్టమ వ్యయ స్థానమందుండి యాస్థానాధిపతులతో వీక్షింపబడిన హింసింతురు. 6-8-12 స్థానాధి పతులతోను, మారక గ్రహముతో గూడియున్నయెడల మారకము జేతురు. రాహు కేతువులు 6-8-12 స్థానములందు కేంద్రకోణాధిపతులతో గూడిరేని నొకవేళ సౌఖ్యమిచ్చినను తదుపరి వ్యాధి వ్రణ దుఃఖ ఖడ్గసలిలోద్బంధనము వల్ల మరణము నిచ్చెదరు. లగ్న, చతుర్థ, పంచమ, సప్తమ, నవమ, దశమస్థానములందు

రాహు కేతువులుండి బలమైన, రాజయోగ గ్రహములతో గూడియున్న సంపద, సుఖము ధనపుత్ర, రాజ్య, వాహనము లిచ్చెదరు. రాహు కేతువులు ద్వితీయ సప్తమాధిపతుల చేత వీక్షింపబడినను, గూడియున్నను ధనక్షయము, మారకము జేయుదురు. రాహుకేతువులు యే భావమందుండి యే భావాధిపతితో గూడినను, పరస్పరము వీక్షణము గలిగినను అట్టి స్థానమందు తమతో సంబంధముగల యందరిని నతిక్రమించి తామేబలవంతులై యీ శుభాశుభఫలమంతయు తమ దశ యందు తామే యిచ్చెదరు. రాహు కేతువులు యేరాశి యందుండునో నా రాశ్యాధిపతి యొక్క బలమునే పొందుదురు.

## గురు శుక్రుల దశాభుక్తులు

గురుదశలో శుక్రభుక్తి, శుక్రదశలో గురుభుక్తి వచ్చినపుడు దశానాధునికి భుక్తి నాథుడును, భుక్తినాధునికి దశనాధుడును నొకరికొకరు శుభస్థానవర్తులై శుభగ్రహములతో సమానాధి సంబంధము గలవారైన యెడల అట్టి దశాభుక్తల యందు జాతకుడు రాజుగాని, రాజసమానుడు గాని యగును. బహుధనవంతుడు దారా పుత్రాది సుఖములు గలవాడును, యజ్ఞాదిసత్కర్మలు జేయువాడును పుత్రో త్పత్తి వివాహాది మహోత్సవము మొదలగునవి గలిగి యానందించుచుండును.

దశాభుక్తినాధులైన గురు శుక్రులు నొకరి నొకరు 6-8-12 స్థానములందును లేక ఆయా స్థానాధిపతులతో సంబంధించియున్నను, యాస్థానముల అధిపతులైనను, పాపగ్రహములతో సంబంధించియున్నను, స్థానాధిషడ్బలములు తక్కువగా యున్నను, అట్టి గురు శుక్రుల దశాభుక్తి కాలమునందు జాతకునికి కళత్ర పుత్రాది నాశనము, రాజభయము, ఉన్మాదము మొదలగు ఉద్యోగ ఫలములు సంభవించును.

## శని శుక్రుల దశాభుక్తులు

శని శుక్రులు పరస్పర దశాభుక్తినాధులైనపుడు వారిరువురు తమ తమ ఉచ్చయందుగాని, స్వక్షేత్రోత్తమాంశవర్గోత్తమాంశ యందుండి వారు సమాన బలయోగము గలిగినపుడు జాతకుడు అదివరకు రాజైయున్నను, ధనవంతుడైనను భిక్షకుడై జీవించుచూ కళాహీనుడగును. ఈ యిరువురిలో నొకరు బలవంతులై మరి యొకరు దుర్బలులైన బలవంతుడు యోగమునిచ్చును. దుర్బలుడు పాపఫలముల నిచ్చును. వారిరువురు బలహీనులై 6-8-12 స్థానములయందున్నను, యీ స్థానాధి పతులైనను, యీస్థానములకు సంబంధము గలిగియున్నను వారు శుభము, సౌఖ్యము, భోగమునిత్తురు. వారిలో నొకరు శుభస్థానాధిపతియై మరియొకరు దుష్ట స్థానాధి పతియైనను వారు యోగము నిత్తురు. మహాపాపులైన యెడల సౌఖ్యము నిత్తురు.

## రవి శనుల దశాభుక్తులు

రవి శనులు తమ తమ స్వక్షేత్ర, ఉచ్చక్షేత్ర, స్వాంశస్వోచ్చాంశల యందుండి కేంద్ర కోణముల యందుగాని, కేంద్ర కోణాధిపత్యము గాని గలిగియున్న రవిభుక్తి యందు రాజ సన్మానమును అధికలాభము నిచ్చును; శని భుక్తియందు సుఖము,

ధనలాభము, జయమునిచ్చును. వారిరువురు పాపులైన హానిచేయుదురు. ఒకరు శుభుడు, మరియొకరు పాపులైన శుభుడు మాత్రము శుభమునిచ్చును. పాపుడు పాపఫలము నిచ్చును.

### కుజ గురుల దశాభుక్తులు

కుజ గురులు దశాభుక్తినాధులైనపుడు ఆధిపత్య సంబంధాదులచేత శభులైన బలవంతులై, శుభసంబంధము గలవారైన కుజ గురులొకరిలో నొకరు భుక్తినాధులైనపుడు రాజయోగము, ఆనందము, సమస్త భోగసుఖ దీర్ఘాయుష్మంతులగు పుత్రులను, వివాహాది శుభకార్యములను యిత్తురు. ఈ లక్షణములను వ్యత్యయముగానున్న దుష్టఫలముల నిత్తురు.

### అవశిష్ట గ్రహదశాభుక్తి ఫలము

గురు బుధులు, శుక్ర బుధులు, గురు చంద్రులు, చంద్ర శుక్రులు, గురు సూర్యులు, రవి బుధులు యీ జంటలు గలవారు దశాభుక్తినాధులై ఆధిపత్యస్థితి సాహచర్యాధుల జేత శుభులై బలవంతులైన యెడల వీరలు ఒకరిలో ఒకరు దశాభుక్తినాధులై జాతకునికి సత్కర్మల యందాసక్తుడుగాను, విద్యావంతునిగాను, వ్యాపారమందు నేర్పరిగాను, దారాపుత్రాది సుఖముగల వానిగాను జేయుదురు.

### దశానాధుని ద్వాదశస్థానముల యందున్న గ్రహదశాభుక్తిఫలము

దశానాధునితో కలిసియున్న గ్రహదశాభుక్తి యందు బంధువిరోధము, పరదూషణము, అపవాదము, ఉద్యోగ భంగము, ధననాశము, భార్యపుత్ర నష్టము, వృత్తినాశము మొదలగు అనర్థకములు గలుగును.

దశానాధునకు ద్వితీయస్థానమున నుండు గ్రహదశాభుక్తి జాతకునకు సమృద్ధిగా అన్నపానాదులు, విలువైన వస్త్రములు, సుగంధ పుష్పాదులు గలుగును. పరోపకారము, స్వజన సౌఖ్యము, భార్యపుత్ర బంధువుల వల్ల మనోవిలాసము మొదలగు సత్ఫలములు కలుగును.

దశానాధునకు తృతీయ స్థానమునందున్న గ్రహదశాభుక్తి యందు రాజ మూలకముగా ధనము, సౌఖ్యమును, సుగంధపుష్పాదులను, మంచి వస్త్రాలంకారమును, మిత్రులింట, సుఖమును, భోజనాధులను గలిగి జాతకుడు సంతోషబలముతో నుండును.

దశానాధునకు చతుర్థస్థానమున నుండు శుభగ్రహ దశాభుక్తి భార్య పుత్ర ధన, గృహ సౌఖ్యము, ధర్మకార్యములు, యాత్రాదులు గావింపజేయుట, భోజన సమృద్ధి, వస్త్రాలంకారము మొదలగు సత్ఫలములు గలుగును. పాపగ్రహ దశాభుక్తి యిట్టి శుభఫలముల నీయజాలవు.

దశానాధునకు పంచమస్థానమున నుండు గ్రహదశాభుక్తి శుభగ్రహ దశాభుక్తియైన పుత్రసౌఖ్యమును యిచ్చును. పాపగ్రహభుక్తియైన పుత్రనాశ మొనర్చును.

దశానాధునకు షష్టమ స్థానముననుండు గ్రహ దశాభుక్తి పాపగ్రహ దశాభుక్తియైన దొంగల భయము, ఋణ రోగ బాధలు, కష్టములు, ఉద్యోగాది వృత్తులకు చలనము లేక భంగము గలుగును. శుభగ్రహ దశాభుక్తి అట్టి శుభ గ్రహము మూల

త్రికోణము లేక యుచ్చ స్థానమునందున్న పుత్రమిత్ర సౌఖ్యము. సుఖ సంతోషములు మొదలగు సత్ఫలములు గలుగును.

దశానాధునకు సప్తమస్థానమున నుండు పాపగ్రహ దశాభుక్తి వచ్చునపుడు భార్యాపుత్ర బంధునాశము. పాలకుల వల్ల భయము. మొదలగు దుష్ఫలములు గలుగును. అది నీచయందుగాని శత్రుక్షేత్రమునందుగాని లేకుండునట్టి శుభగ్రహ దశాభుక్తి సౌఖ్యమును. వస్త్రాలంకారము. రత్నభూషణ లాభమును మొదలగు సత్ఫలములు గలుగును.

దశానాధునకు అష్టమస్థానమున నుండు పాపగ్రహము యొక్క దశాభుక్తి దారిద్ర్యము. నీచులింట భోజనము. అగ్నిభయము. దొంగల వల్లబాధ పరిపాలకుల వల్ల కష్టములు గలుగును. అది శుభగ్రహ దశాభుక్తియైనపుడు మొదటి భాగములో సుఖమును శుభమును గలిగించి అంతిమ భాగమునందు కష్టములు గలుగజేయును.

దశానాధునకు నవమస్థానమున నుండు పాపగ్రహము యొక్క దశాభుక్తి అశుభము. వృత్తి ఉద్యోగాదుల యందు చలనము లేక భంగపాటు. కష్టములు మనస్సు స్థిమితము లేకుండుట మొదలగు దుష్ఫలములు గలుగును. అది శుభగ్రహ దశాభుక్తి యైనప్పుడు వివాహాది శుభములు. యజ్ఞయాగాది క్రతువులు. సన్మానాది గౌరవములు మొదలగు సత్ఫలములు గలుగును.

దశానాధునకు దశమస్థానమున నుండు పాపగ్రహముయొక్క దశాభుక్తి యందు కర్మలు. వృత్తులు నశించుట. అపకీర్తి. కష్టములు మొదలగు దుష్ఫలములు గలుగును. అది శుభగ్రహ దశాభుక్తి యైనప్పుడు చెరువులు త్రవ్వించుట. దేవాలయాది గోపురాదికములు నిర్మించుట. పుణ్యకర్మాదులను జేయుట. సౌఖ్యము పొందుట మొదలగు సత్ఫలములు గలుగును.

దశానాధునకు ఏకాదశస్థానమున నుండు పాపగ్రహము యొక్క దశాభుక్తి ధనము. పుత్ర మిత్రసౌఖ్యము. పదవులను. వృత్తివుద్యోగాదులను కలిగించుట. స్థిరమైన సంతోషము మొదలగుసత్ఫలములు గలుగును. అది శుభగ్రహ ధశాభుక్తి యైనపుడు భోగాధి సుఖములను. ధన భాగ్యములను భార్యపుత్రాదులను అభివృద్ధి గలిగించుట. పరిపాలకుల సంతోషానుగ్రహములను పొందుట మొదలగు సత్ఫలములు గలుగును.

దశానాధునకు వ్యయస్థానమున నుండు పాపగ్రహము యొక్క దశాభుక్తి యందు ధననాశము. పరిపాలకుల కోపతాపములకు గురియగుట. ఉద్యోగభంగము మతి చాంచల్యము మొదలగు దుష్ఫలములు గలుగును. అది శుభగ్రహ దశాభుక్తియైనపుడు వాహన ప్రాప్తి. ధనధాన్యాదిభాగ్యము. భోగైశ్వర్యములు. వస్త్రాలంకారము ఆభరణ భూషణా లంకారము మొదలగు సత్ఫలములు గలుగును.

## గ్రహముల మహాదశలు, భుక్తులు, అంతర్దశలు, సూక్ష్మదశలు ప్రాణదశల యొక్క కాలప్రమాణము

మహాదశలు -

కృత్తికా నక్షత్రము మొదలు జన్మనక్షత్రము వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 9చే భాగించిన శేషము 1-టి వచ్చిన రవి. 2- చంద్రుడు. 3- కుజుడు.

4- రాహువు, 5- గురుడు, 6-శని, 7-బుధుడు, 8-కేతువు, 0-శుక్రుడు వీరు క్రమముగా ధశాధిపతులు లేక దశనాధులగుదురు.

| జన్మతార | అణుజన్మతార | త్రిజన్మతార | మహాధశాధిపతులు | దశా సంవత్సరములు |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | రవి | 6 |
| రోహిణి | హస్త | శ్రవణ | చంద్ర | 10 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | కుజ | 7 |
| ఆరుద్ర | స్వాతి | శతభిష | రాహు | 18 |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురు | 16 |
| పుష్యము | అనూరాధ | ఉత్తరాబాద్ర | శని | 19 |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ | 17 |
| అశ్వని | మఖ | మూల | కేతు | 7 |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ | శుక్ర | 20 |
| | | | మొత్తము | 120 |

మహాదశ -

ఉదాహరణము - జాతకుని యొక్క జన్మనక్షత్రము ఉత్తర 1వ పాదము కృత్తిక మొదలు ఉత్తర వరకు లెక్కించగా 10 వచ్చినది. ఈ సంఖ్యను 9చే భాగించగా శేషము 1 వచ్చినది. కాబట్టి జాతకునికి రవి మహాదశ ప్రారంభమగును.

9) 10 (1
9
----
1 శేషము రవి మహాదశ

భుక్తులు -

దశానాధుని యొక్క కాలప్రమాణ సంవత్సరసంఖ్యను భుక్తినాధునియొక్క దశా సంవత్సర సంఖ్యచే గుణించగా వచ్చిన మొత్తములో చివర సంఖ్యను 3చే గుణించగా నది దినములుగను, చివరసంఖ్యాపోను మిగిలిన మొత్తము మాసములుగా గ్రహించవలెను.

**ఉదాహరణములు -**

రవిమహాదశలో రవి భుక్తికనుగొనవలెనన్న
రవి మహాదశ సంవత్సరములు - 6
రవి భుక్తినాధుని దశా సంవత్సరము
లతో హెచ్చించగా 6
-----

మొత్తము 36

చివర సంఖ్యను 3చే గుణించగా 3

-----

18 దినము

లగును. మొత్తము 36లో చివర సంఖ్య 6 పోగా మిగిలిన 3 సంఖ్య మాసములు కాబట్టి రవి మహాదశలో రవి భుక్తి 3 మాసముల 18 దినములు.

2 చంద్ర మహాదశలో రవిభుక్తి కనుగొనవలెనన్న

చంద్ర మహాదశ సంవత్సరములు 10

రవి భుక్తినాధుని దశా సంవత్సర

ములతో గుణించగా 6

-----

మొత్తము 60

చివర సంఖ్యను 3చే గుణించగా 3

-----

0 దినములు

మొత్తము 60 లో చివరి సంఖ్యను '0' పోగా మిగిలిన సంఖ్య 6 మాసములగును. కాబట్టి చంద్ర మహాదశలో రవిభుక్తి 6 మాసములుగా గ్రహించవలెను. ఈవిధముగా అన్ని గ్రహములయొక్క దశాభుక్తులను కనుగొనవలెను.

**అంతర్దశలు -**

గ్రహముల యొక్క భుక్తి ప్రమాణమును మాసము దినములుగా నుంచుకొని మాససంఖ్యను 4చే భాగించి యవి దినములుగను, దినసంఖ్యను 2చే భాగించి యవి ఘడియలుగను యేర్పరచుకొని, యే గ్రహము యొక్క అంతర్దశప్రమాణము కావలయునో ఆ అంతర్దశనాధుని యొక్క దశా సంవత్సర సంఖ్య చేత పైన యేర్పరచుకొన్న దినములను ఘడియలను విడిగా గుణించిన యెడల అంతర్దశా ప్రమాణము వచ్చును.

ఉదారణము - ర - చ - గు రవి మహాదశలో చంద్ర భుక్తిలో గురుని అంతర్దశ కనుగొనవలెను.

రవి మహాదశలో చంద్రభుక్తి 6 మాసములు

$6 \times 10 = 60$

3

----

0 రోజులు మిగిలిన 6 మాసములు

పైన వుదహరించిన ప్రకారము 6 మాసములను 4 చే భాగించి అవి దినములుగాను '0' దినములను 2 చే భాగించిన అవి ఘడియలుగా యేర్పరచిన యెడల 6/4 దినములు $0/2 = 0$ ఘడియలు అగును. దీనిని అంతర్దశానాధుని దశా సంవత్సరముల సంఖ్య అనగా గురు దశా సంవత్సరములు 16 చేత గుణించగా $6/4 \times 16 = 24$ దినములు $0 \times 16 = 0$ ఘడియలు వచ్చును.

అనగా రవి మహాదశలో చంద్రభుక్తిలో గురు అంతర్దశ 24 దినములు

మా. ది. ఘ.

ర.చ.గు = 0 24 0

ఈవిధముననే అన్ని గ్రహముల యొక్క అంతర్దశలు యేర్పరచు కొనవలెను.

సూక్ష్మదశలు -

```
120) 1944 (16
     1920
     -----
       24
       24
       60
     ------
120) 1440 (12
     1440
     -------
        0
```

రవి మహాదశలో రవిభుక్తిలో రవి అంతర్దశ 5 దినముల 24 ఘడియలు. వీనికి రవి సూక్ష్మదశలు ఈ క్రింది విధముగా యుండును. 5 దినములను ఘడియలుగా మార్చుటకు 60 చే హెచ్చించుము. 300 ఘడియలగును. దానికి 24 ఘడియలు కలుపుము. 300+24=324 రవిమహాదశలో రవిభుక్తిలో రవి అంతర్దశా ప్రమాణము 324 ఘడియలు. రవి సూక్ష్మదశ కావలెను. కాబట్టి పై సంఖ్యను రవి దశాకాలమైన 6చే హెచ్చింపుము. 324 × 6 = 1944. వీనిని అన్నిదశల యొక్క ప్రమాణమైన 120 చే భాగింపుము. లబ్ధము 16 శేషము 24 వచ్చినది.

దీనిని వినాడులలో గ్రహించుటకు 60చే హెచ్చించుము. మరల 120 చే భాగించుము. లబ్దము 12 శేషము 0. అనగా రవి సూక్ష్మదశ ది. 0 - 16 ఘ - 12 వినాడులు ర - ర - ర - ర = 0 - 16 - 12

ఈ విధముననే అన్ని గ్రహముల యొక్క సూక్ష్మ దశలను ఏర్పరచుకొనవలెను.

ప్రాణ దశలు

```
120) 5832 (48
     5760
     -----
       72
       60
     -------
120) 4380 (36
     4380
     -----
        0
```

రవి మహాదశలో రవిభుక్తి రవి అంతర్దశలో రవి సూక్ష్మదశ 16 ఘడియల 12 వినాడులు. వీనికి రవి ప్రాణదశలు ఈ క్రింది విధముగా యుండును. 16 ఘడియలను వినాడులుగా మార్చుటకు 60చే హెచ్చించుము. 960 వినాడులగును. దానికి 12 వినాడులు కలుపుము. 960+12= 972 ఇది రవి సూక్ష్మదశ దశ ప్రమాణము. రవి ప్రాణదశ కావలెను. ఈ పై సంఖ్యయైన 972 ను రవి దశాకాలమైన 6చే హెచ్చింపుము. 972 × 6 = 5832 వీనిని అన్ని దశల యొక్క ప్రమాణమైన 120 చే భాగింపుము.

లబ్దము 48. శేషము 72 వచ్చినది. శేషమును మరల 60 చే హెచ్చించుము. మరల 120 చే భాగించుము.

లబ్దము 36. శేషము 0 వచ్చినది. అనగా రవి ప్రాణదశ 48 వినాడుల 36 తర్పరలు.

ర - ర - ర - ర - ర = 0 - 48 - 36

ఈ విధముననే అన్ని గ్రహముల యొక్క ప్రాణదశలము ఏర్పరచుకొనవలెను.

## జాతకుని జనన కాల దశా శేషము

ఒక జాతకుడు విజయవాడలో 21- 4 - 1967 రాత్రి గ. 12 - 32 ని. లకు అనగా 22- 4 - 1967 తేదీ గం. 0 - 32 ని. లకు (A.M) జననము. జనన కాలమునకు స్ఫుట గ్రహములు ఈ క్రింది విధముగా యున్నవి.

| | రా. భా. లి | | రా. భా. లి |
|---|---|---|---|
| రవి | 00- 07 - 35 | శని | 11- 12 - 36 |
| చంద్ర | 04- 29 - 22 | రాహు | 00- 14 - 06 |
| కుజ (వ) | 05- 29 - 01 | కేతు | 06- 14 - 06 |
| బుధ | 11- 18 - 00 | లగ్నము | 09- 03 - 45 |
| గురు | 03- 02 - 33 | దశమస్థానము | 06- 14 - 05 |
| శుక్ర | 01- 15 - 18 | | |

| | | | |
|---|---|---|---|
| శబు | రరా | శు | |
| | లగ్న | | గు |
| ల | | | చ |
| | | కే | కు(వ) |

| | | | |
|---|---|---|---|
| | | శు | ర |
| లకే | అంశ | | గు |
| | | | రా |
| బుచ | | శ | కు(వ) |

### జననకాల దశాశేషము

జాతకుడు యే నక్షత్రమంద జన్మించెనో ఆ నక్షత్రము యొక్క ఋక్ష్యాద్యంతమును ముందుగా గ్రహించవలెను. ఋక్ష్యాద్యంత మనగా నక్షత్రము యొక్క మొత్తము ప్రమాణమును ఘడియ విఘడియలలో తెలుపు కాలము. ఈ ఋక్ష్యాద్యంతములో యెన్ని ఘడియలు నక్షత్రభుక్తి అయిన తరువాత జాతకుడు జన్మించినది కనుగొనవలెను.

జన్మనక్షత్ర కాలపరిమితి మొత్తమును విఘడియలుగా మార్చినది హారకమని నొక చెట నుంచి. జన్మకాలము వరకు చెల్లుపోగా మిగిలిన ఘటికాదులను ఆ నక్షత్రమునకు గల దశాసంవత్సరములచే గుణించి వెనుకటి హారకముచే భాగించిన లబ్ధము సంవత్సరములగును. మిగిలిన శేషము వల్ల మాసాధికము సాధించగా నది జనన కాలమునకు దశాశేషమగును.

జనన కాల నక్షత్రము ఉత్తర. పంచాంగమును బట్టి ఉ.ఫ. నక్షత్రము 21- 4 - 1967 రాత్రి 8-12 ని.ల నుండి 22- 4 - 1967 సాయంత్రము గం. 5-37 ని.ల వరకు

21- 4 - 1967 రాత్రి 8-12 ని.ల నుండి 22- 4 - 1967 ఉదయము గం.
8-12 ని.ల వరకు = 12 - 00 గం.

22- 4-67 ఉదయం గం. 8-12 నుండి మధ్యాహ్నము
12-0 వరకు 12 - 00
8- 12 = 3 - 48
-------
3 - 48

22- 4-67 మధ్యాహ్నము గం. 12-00 నుండి
నక్షత్ర అంత్యము గం. 5-37 ని. ల వరకు = 5 - 37
--------

ఉత్తర నక్షత్ర బుక్త్యాద్యంతము గం. 21 - 25 ని.
= ఘ. 53 - 33 వి. ఘ. లేక 3212 వి. ఘ. లు
జన్మకాలము వరకు గతించిన నక్షత్ర కాలము

జన్మకాలము 21- 4-67 రాత్రి గం. 12-32 ని.
ఉత్తర నక్షత్ర ప్రవేశము 21- 4-67 రాత్రి 8-12
---------
గతించిన నక్షత్రకాలము గం. 4-20 ని.
లేక ఘ. 10 - 50 వి. ఘ. లేక 650 వి. ఘ. లు
ఉత్తర నక్షత్ర శేషము
నక్షత్ర బుక్త్యాద్యంతము 3212 వి. ఘ. లు
నక్షత్ర భుక్తి 650 వి. ఘ. లు
---------
నక్షత్ర శేషము జనన కాలమునకు 2562 వి. ఘ. లు

ఉత్తర నక్షత్రమునకు రవి మహాదశ యగును ఈ రవి మహాదశ ప్రమాణము 6 సంవత్సరములు.

రవి మహాదశ శేషము
నక్షత్ర శేషకాలము 2562 వి. ఘ. లు
రవి మహాదశ 6
---------
హారకము 3212) 15372 (6- 9-13
12848
---------
2524
12 మాసములచే హెచ్చించుము

---------
30288
28908
---------
1380
30 దినములచే హెచ్చించుము
---------
41400
38544
---------
2856 శేషము సగము కంటె యెక్కువ
--------- యున్నందున దిన సంఖ్యలో 1 టి
కలుపుము.

సం. మా. రో

జనన కాలమునకు రవి మహాదశా శేషము 4 - 9 - 13

**2 వ పద్ధతి**

చంద్రడున్న నక్షత్ర సమాప్తి స్థానము రాశి, భాగ, లిప్తల నుండి జాతకుడు జన్మించిన కాలమున చంద్రుడున్న రాశి, భాగ, లిప్తలను తీసివేయవలెను. అట్లు తీసివేయగా మిగిలిన రాశి, భాగ, లిప్తలను మొత్తము లిప్తలుగా మార్చి, అట్లు మార్చగా వచ్చిన లిప్తలను ఆ నక్షత్ర దశానాథుని సంవస్సరములచే హెచ్చించి నక్షత్ర ప్రమాణమైన 800 లిప్తలచే భాగించిన జనన కాల దశాశేషము సంవత్సరములు, మాసములు, దినములలో గ్రహించవచ్చును.

**ఉదాహరణము**

ఒక జాతకుని జననము విజయవాడలో 21- 4 - 1967 రాత్రి గ. 12 - 32ని. లకు జనన కాలమునకు చంద్రుని యొక్క స్థానము రా.4 - 29భా 22 లిప్తలు జనన కాల దశాశేషమును కనుగొనుము?

రా. భా. లి.

జనన కాలమునకు చంద్ర స్థితి 4- 29 - 22

12 రాశులయందు 27 నక్షత్రముల యొక్క స్థానములను తెలుపు పట్టీ ఉత్తరా నక్షత్ర ప్రారంభ సమాప్తి స్థానము } 4- 26 - 40 నుండి 5-10-0 అనగా ఉత్తర ప్రమాణము 13 భాగల 20 లిప్తలు లేక 800 లిప్తలు

ఉత్తర నక్షత్రమునకు దశానాథుడు రవి - 6 సంవత్సరములు

జనన కాలమునకు ఉత్తరా నక్షత్ర శేషము - 5 - 10 - 00
- 4 - 29 - 22
-----------------
శేషము 0 - 10 - 38 లేక 638 లిప్తలు

రని దశానాథుని సంవత్సరములు 6 ను నక్షత్ర ప్రమాణమైన 800 లిప్తలచే భాగించి ఆ నక్షత్ర జనన కాల శేషము 638 లిప్తలచే హెచ్చించిన జనన కాలమునకు రవి దశాశేషము వచ్చును.

$$\frac{6}{800} \times 638 = \frac{3828}{800}$$

800)3828( 4 సంవత్సరములు
3200
----------
628
12 మాసములచే హెచ్చించుము
----------
800) 7536 ( 9 మాసములు
7200
----------
336
30 దినములచే హెచ్చించుము
----------
800) 10080 ( 12 + 1 = 13 దినములు
9600 — శేషము సగము కంటె యెక్కువ
---------- — యున్నందున దిన సంఖ్యలో 1 టి
480 = 1 — కలపడమైనది.

సం. మా. ది.
జనన కాలమునకు రవి దశాశేషము 4 - 09 - 13

3 వ పద్ధతి

రా. భా. లి.

పై ఉదహరణమును బట్టి చంద్రుని యొక్క స్థానము 4 -29 - 22 అనగా చంద్రుడు సింహరాశిలో 29 భాగల 22 లిప్తల యందున్నాడు. చంద్రుని యొక్క దీర్ఘాంశ రేఖలను బట్టి వింశోత్తరి దశాశేషమును తెలుపు పట్టిక - 6 (నాడీరహస్యాలు చూడుము.)

చంద్రుడు సింహరాశి యందున్న కాలము క్రింద — సం. మా. ది.
29 భాగల 20 లిప్తలకు ఎదురుగా రవి దశాశేషము — 4 - 9 - 18
భాగలు పెరిగిన కొలది దశాశేషము తగ్గుచున్నది.
మిగిలిన 2 లిప్తలకు తగ్గించవలసిన కాలము --
గ్రహముల యొక్క సంబంధ సామ్యము గల లిప్తల

| | |
|---|---|
| దశావిభాగములు గల పట్టిక — 7 లో రవి కాలము | 0 - 0 - 05 |
| క్రింద 2 లిప్తల కెదురుగా చూడుము. | --------------- |
| జాతకుని జనన కాలమునకు రవి దశాశేషము | 4 - 9 - 13 |
| | --------------- |

## జాతకుని యొక్క మహాదశల వివరణ పట్టిక

| | సం. మా. ది. |
|---|---|
| జాతకుని జనన కాలమునకు రవి మహాదశా శేషము | 04 - 09 - 13 |
| జాతకుని జననము | 1967 - 04 - 22 |
| | ------------------- |
| రవి మహాదశ అంత్యము | 1972 - 02 - 05 |
| చంద్రమహాదశ | 10 - 00 - 00 |
| | ------------------- |
| | 1982 - 02 - 05 |
| కుజమహాదశ | 07 - 00 - 00 |
| | ------------------- |
| | 1989 - 02 - 05 |
| రాహు మహాదశ | 18 - 00 - 00 |
| | ------------------- |
| | 2007 - 02 - 05 |
| గురు మహాదశ | 16 - 00 - 00 |
| | ------------------- |
| | 2023 - 02 - 05 |
| శని మహాదశ | 19 - 00 - 00 |
| | ------------------- |
| | 2042 - 02 - 05 |
| బుధ మహాదశ | 17 - 00 - 00 |
| | ------------------- |
| బుధ మహాదశ అంత్యము | 2059 - 02 - 05 |
| | ------------------- |

## జాతకుని యొక్క రాహు మహాదశా భుక్తులు

| | | సం. మా. ది. |
|---|---|---|
| రాహుమహాదశా ప్రారంభము | | 1989 - 02 - 05 |
| రాహు మహాదశలో రాహు భుక్తి | రా. రా. | 2 - 08 - 12 |
| | | 1991 - 10 - 17 |
| రాహు మహాదశలో గురు భుక్తి | రా. గు. | 2 - 04 - 24 |
| | | 1994 - 03 - 11 |
| రాహు మహాదశలో శని భుక్తి | రా. శ. | 2 - 10 - 06 |
| | | 1997 - 01 - 17 |
| రాహు మహాదశలో బుధ భుక్తి | రా. బు. | 2 - 06 - 18 |
| | | 1999 - 03 - 05 |
| రాహు మహాదశలో కేతు భుక్తి | రా. కే. | 1 - 00 - 18 |
| | | 2000 - 08 - 23 |
| రాహు మహాదశలో శుక్ర భుక్తి | రా. శు. | 3 - 00 - 00 |
| | | 2003 - 08 - 23 |
| రాహు మహాదశలో రవి భుక్తి | రా. ర. | 0 - 10 - 24 |
| | | 2004 - 07 - 17 |
| రాహు మహాదశలో చంద్ర భుక్తి | రా. చ. | 1 - 06 - 00 |
| | | 2006 - 01 - 17 |
| రాహు మహాదశలో కుజ భుక్తి | రా. కు. | 1 - 00 - 18 |
| రాహు మహాదశ అంత్యము | | 2007 - 02 - 05 |

పై విధమున వింశోత్తరి దశా పట్టికను బట్టి యితర గ్రహముల దశాభుక్తులను తేదీల వారీగా వివరించవచ్చును.

# కృత్తిక, ఉత్తర, ఉత్తరషాఢ - సూర్యదశ సం. 6

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | | రాహువు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| సూర్యుడు | 03 -18 | సూ | 00 - 06 | చం | 00 - 15 | కు | 00 - 07 | రా | 01 - 19 |
| చంద్రుడు | 06 -00 | చం | 00 - 09 | కు | 00 - 11 | రా | 00 - 19 | గు | 01 - 13 |
| కుజుడు | 04 -06 | కు | 00 - 06 | రా | 00 - 27 | గు | 00 - 17 | శ | 01 - 21 |
| రాహువు | 10 -24 | రా | 00 - 16 | గు | 00 - 24 | శ | 00 - 20 | బు | 01 - 16 |
| గురుడు | 09 -18 | గు | 00 - 15 | శ | 00 - 28 | బు | 00 - 18 | కే | 00 - 19 |
| శని | 11 -12 | శ | 00 - 17 | బు | 00 - 26 | కే | 00 - 07 | శు | 01 - 24 |
| బుధుడు | 10 -06 | బు | 00 - 15 | కే | 00 - 10 | శు | 00 - 21 | సూ | 00 - 16 |
| కేతువు | 04 -06 | కే | 00 - 06 | శు | 01- 00 | సూ | 00- 07 | చం | 00 - 27 |
| శుక్రుడు | 12 -00 | శు | 00 -18 | సూ | 00 - 09 | చం | 00 - 10 | కు | 00 - 19 |
| మొ.సం. | 06 -00 | | 03 -18 | | 06 - 00 | | 04 - 06 | | 10 - 24 |

| గురు | | శని | | బుధుడు | | కేతువు | | శుక్రుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| గురు | 01 - 08 | శని | 01 - 24 | బు | 01 - 13 | కేతు | 00 - 07 | శు | 02 - 00 |
| శ | 01 - 16 | బు | 01 - 18 | కే | 00 - 18 | శు | 00 - 21 | సూ | 00 - 18 |
| బు | 01 - 10 | కే | 00 - 20 | శు | 01 - 21 | సూ | 00 - 06 | చం | 01 - 00 |
| కే | 00 - 17 | శు | 01 - 27 | సూ | 00 - 15 | చం | 00 - 11 | కు | 00 - 21 |
| శు | 01 - 18 | సూ | 00 - 17 | చం | 00 - 26 | కు | 00 - 07 | రా | 01 - 24 |
| సూ | 00 - 15 | చం | 00 - 29 | కు | 00 - 18 | రా | 00 - 19 | గు | 01 - 18 |
| చం | 00 - 24 | కు | 00 - 20 | రా | 01 - 16 | గు | 00 - 17 | శ | 01 - 27 |
| కు | 00 - 17 | రా | 01- 21 | గు | 01- 11 | శ | 00 - 20 | బు | 01 - 21 |
| రా | 01 -13 | గు | 01 - 16 | శ | 01 - 18 | బు | 00 - 18 | కే | 00 - 21 |
| | 09 -18 | | 11 - 12 | | 10 - 06 | | 04 - 06 | | 12 - 00 |

# రోహిణి, హస్త, శ్రవణం - చంద్ర దశ సం. 10

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | చంద్రుడు | | కుజుడు | | రాహువు | | గురుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| చంద్రుడు | 10-00 | చం | 00-25 | కు | 00-12 | రా | 02-21 | గు | 02-04 |
| కుజుడు | 07-00 | కు | 00-17 | రా | 01-01 | గు | 02-12 | శ | 02-16 |
| రాహువు | 18-00 | రా | 01-15 | గు | 00-28 | శ | 02-26 | బు | 02-08 |
| గురుడు | 16-00 | గు | 01-10 | శ | 01-04 | బు | 02-16 | కే | 00-28 |
| శని | 19-00 | శ | 01-18 | బు | 01-00 | కే | 01-02 | శు | 02-20 |
| బుధుడు | 17-00 | బు | 01-12 | కే | 00-13 | శు | 03-00 | సూ | 00-24 |
| కేతువు | 07-00 | కే | 00-18 | శు | 01-05 | సూ | 00-27 | చం | 01-10 |
| శుక్రుడు | 20-00 | శు | 01-20 | సూ | 00-10 | చం | 01-15 | కు | 00-28 |
| సూర్యుడు | 06-00 | సూ | 00-15 | చం | 00-17 | కు | 01-01 | రా | 02-12 |
| మొ.సం. | 10-00 | | 10-00 | | 07-00 | | 18-00 | | 16-00 |

| శని | | బుధుడు | | కేతువు | | శుక్రుడు | | సూర్యుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| శ | 03-00 | బు | 02-12 | కేతు | 00-12 | శు | 03-10 | సూ | 00-09 |
| బు | 02-21 | కే | 01-00 | శు | 01-05 | సూ | 01-00 | చం | 00-15 |
| కే | 01-03 | శు | 02-25 | సూ | 00-11 | చం | 01-20 | కు | 00-11 |
| శు | 03-05 | సూ | 00-26 | చం | 00-17 | కు | 01-05 | రా | 00-27 |
| సూ | 00-28 | చం | 01-12 | కు | 00-12 | రా | 03-00 | గు | 00-24 |
| చం | 01-18 | కు | 01-00 | రా | 01-02 | గు | 02-20 | శ | 00-28 |
| కు | 01-03 | రా | 02-16 | గు | 00-28 | శ | 03-05 | బు | 00-26 |
| రా | 02-26 | గు | 02-08 | శ | 01-03 | బు | 02-25 | కే | 00-10 |
| గురు | 02-16 | శని | 02-21 | బు | 01-00 | కే | 01-05 | శు | 01-00 |
| | 19-00 | | 17-00 | | 07-00 | | 20-00 | | 06-00 |

# మృగశిర, చిత్త, ధనిష్ఠ - కుజ దశ సం. 7

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | కుజుడు | | రాహువు | | గురుడు | | శని | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| కుజుడు | 04 -27 | కు | 00 - 08 | రా | 01 - 26 | గు | 01 - 14 | శ | 02 - 03 |
| రాహువు | 12 -18 | రా | 00 - 22 | గు | 01 - 21 | శ | 01 - 24 | బు | 01- 26 |
| గురుడు | 11 -06 | గు | 00 - 20 | శ | 02 - 00 | బు | 01 - 17 | కే | 00 - 24 |
| శని | 13 -09 | శ | 00 - 23 | బు | 01 - 23 | కే | 00 - 20 | శు | 02 - 06 |
| బుధుడు | 11 -27 | బు | 00 - 21 | కే | 00 - 22 | శు | 01 - 26 | సూ | 00 - 20 |
| కేతువు | 04 -27 | కే | 00 - 09 | శు | 02 - 03 | సూ | 00 - 17 | చం | 01- 04 |
| శుక్రుడు | 14 -00 | శు | 00 - 24 | సూ | 00- 19 | చం | 00 - 28 | కు | 00 - 23 |
| సూర్యుడు | 04 -06 | సూ | 00 - 08 | చం | 01- 02 | కు | 00- 20 | రా | 02 - 00 |
| చంద్రుడు | 07-00 | చం | 00 -12 | కు | 00 - 22 | రా | 01 - 20 | గు | 01 - 23 |
| మొ.సం. | 07 -00 | | 04 - 27 | | 12 - 18 | | 11 - 06 | | 13 - 09 |

| బుధుడు | | కేతువు | | శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| బు | 01 - 20 | కే | 00 - 08 | శు | 02 - 10 | సూ | 00 - 06 | చం | 00 - 17 |
| కే | 00- 21 | శు | 00 - 25 | సూ | 00 - 21 | చం | 00 - 11 | కు | 00 - 12 |
| శు | 02 - 00 | సూ | 00 - 07 | చం | 01 - 05 | కు | 00 - 07 | రా | 01 - 02 |
| సూ | 00 - 18 | చం | 00 - 13 | కు | 00 - 25 | రా | 00 - 19 | గు | 00 - 28 |
| చం | 01 - 00 | కు | 00 - 08 | రా | 02 - 03 | గు | 00 - 17 | శ | 01 - 03 |
| కు | 00 - 21 | రా | 00 - 22 | గు | 01 - 26 | శ | 00 - 20 | బు | 01 - 00 |
| రా | 01 - 23 | గు | 00 - 20 | శ | 02 - 06 | బు | 00 - 18 | కే | 00 - 13 |
| గురు | 01 - 18 | శని | 00- 23 | బు | 01- 29 | కే | 00 - 07 | శు | 01 - 05 |
| శ | 01 -26 | బు | 00 - 21 | కేతు | 00 - 25 | శు | 00 - 21 | సూ | 00 - 10 |
| | 11 -27 | | 04 - 27 | | 14 - 00 | | 04 - 06 | | 07 - 00 |

# ఆరుద్ర, స్వాతి, శతభిషం - రాహు దశ సం. 18

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | రాహువు | | గురుడు | | శని | | బుధుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| రాహువు | 32 -12 | రా | 04 - 26 | గు | 03 - 25 | శ | 05 - 12 | బు | 04 - 10 |
| గురుడు | 28 -24 | గు | 04 - 09 | శ | 04 - 17 | బు | 04 - 26 | కే | 01- 23 |
| శని | 34 -06 | శ | 05 - 04 | బు | 04 - 02 | కే | 02 - 00 | శు | 05 - 03 |
| బుధుడు | 30 -]8 | బు | 04 - 18 | కే | 01 - 21 | శు | 05 - 21 | సూ | 01 - 16 |
| కేతువు | 12 -18 | కే | 01 - 27 | శు | 04 - 24 | సూ | 01 - 21 | చం | 02 - 17 |
| శుక్రుడు | 36 -00 | శు | 05 - 12 | సూ | 01 - 13 | చం | 02 - 25 | కు | 01- 23 |
| సూర్యుడు | 10 -24 | సూ | 01 - 19 | చం | 02- 12 | కు | 02 - 00 | రా | 04 - 18 |
| చంద్రుడు | 18 -00 | చం | 02 - 21 | కు | 01- 20 | రా | 05- 04 | గు | 04 - 02 |
| కుజుడు | 12-18 | కు | 01 -26 | రా | 04 - 10 | గు | 04 - 17 | శ | 04 - 26 |
| మొ.సం. | 18 -00 | | 32 - 12 | | 28 - 24 | | 34 - 06 | | 30 - 18 |

| కేతువు | | శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| కే | 00 - 22 | శు | 06 - 00 | సూ | 00 - 16 | చం | 01 - 15 | కు | 00 - 22 |
| శు | 02- 03 | సూ | 01 - 24 | చం | 00 - 27 | కు | 01 - 01 | రా | 01 - 27 |
| సూ | 00 - 19 | చం | 03 - 00 | కు | 00 - 19 | రా | 02 - 21 | గు | 01 - 20 |
| చం | 01 - 01 | కు | 02 - 03 | రా | 01 - 18 | గు | 02 - 12 | శ | 02 - 00 |
| కు | 00 - 22 | రా | 05 - 12 | గు | 01 - 14 | శ | 02 - 26 | బు | 01 - 24 |
| రా | 01 - 27 | గు | 04 - 24 | శ | 01 - 21 | బు | 02 - 16 | కే | 00 - 22 |
| గురు | 01 - 20 | శని | 05 - 21 | బు | 01 - 16 | కే | 01 - 02 | శు | 02 - 03 |
| శ | 02 - 00 | బు | 05- 03 | కేతు | 00- 19 | శు | 03 - 00 | సూ | 00 - 19 |
| బు | 01 -24 | కే | 02 - 03 | శు | 01 - 24 | సూ | 00 - 27 | చం | 01 - 01 |
| | 12 -18 | | 36 - 00 | | 10 - 24 | | 18 - 00 | | 12 - 18 |

# పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర – గురు దశ సం. 16

## భుక్తులు – అంతరములు

| భుక్తుల వివరము | | గురుడు | | శని | | బుధుడు | | కేతువు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| గురుడు | 25 –18 | గు | 03 – 12 | శ | 04 – 24 | బు | 03 – 25 | కే | 00 – 19 |
| శని | 30 –12 | శ | 04 – 02 | బు | 04 – 09 | కే | 01 – 18 | శు | 01– 26 |
| బుధుడు | 27 –06 | బు | 03 – 19 | కే | 01 – 24 | శు | 04 – 16 | సూ | 00 – 17 |
| కేతువు | 11 –06 | కే | 01 – 15 | శు | 05 – 02 | సూ | 01 – 11 | చం | 00 – 28 |
| శుక్రుడు | 32 –00 | శు | 04 – 08 | సూ | 01 – 16 | చం | 02 – 08 | కు | 00 – 20 |
| సూర్యుడు | 09 –18 | సూ | 01– 08 | చం | 02 – 16 | కు | 01 – 18 | రా | 01– 20 |
| చంద్రుడు | 16 –00 | చం | 02 – 04 | కు | 01– 23 | రా | 04 – 02 | గు | 01 – 15 |
| కుజుడు | 11 –06 | కు | 01 – 15 | రా | 04 – 17 | గు | 03 – 19 | శ | 01 – 23 |
| రాహువు | 28–24 | రా | 03 –25 | గు | 04 – 01 | శ | 04 – 09 | బు | 01 – 18 |
| మొ.సం. | 16 –00 | | 25 – 18 | | 30 – 12 | | 27 – 06 | | 11 – 06 |

| శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | | రాహువు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| శు | 05 – 10 | సూ | 00 – 14 | చం | 01 – 10 | కు | 00 – 20 | రా | 04 – 09 |
| సూ | 01– 18 | చం | 00 – 24 | కు | 00 – 28 | రా | 01 – 20 | గు | 03 – 25 |
| చం | 02 – 20 | శు | 00 – 17 | రా | 02 – 12 | గు | 01 – 15 | శ | 04 – 17 |
| కు | 01 – 26 | రా | 01 – 13 | గు | 02 – 04 | శ | 01 – 23 | బు | 04 – 02 |
| రా | 04 – 24 | గు | 01 – 08 | శ | 02 – 16 | బు | 01 – 18 | కే | 01 – 21 |
| గురు | 04 – 08 | శని | 01 – 16 | బు | 02 – 08 | కే | 00 – 19 | శు | 04 – 24 |
| శ | 05 – 02 | బు | 01 – 11 | కేతు | 00 – 28 | శు | 01 – 26 | సూ | 01 – 13 |
| బు | 04 – 16 | కే | 00 – 17 | శు | 02 – 20 | సూ | 00 – 17 | చం | 02 – 12 |
| కే | 01 –26 | శు | 01 – 18 | సూ | 00 – 24 | చం | 00 – 28 | కు | 01 – 21 |
| | 32 – 00 | | 09 – 18 | | 16 – 00 | | 11 – 06 | | 28 – 24 |

## పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర – శని దశ సం. 19

### భుక్తులు – అంతరములు

| భుక్తుల వివరము | | శని | | బుధుడు | | కేతువు | | శుక్రుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| శని | 36 – 03 | శ | 05 – 22 | బు | 04 – 17 | కే | 00 – 23 | శు | 06 – 10 |
| బుధుడు | 32 – 09 | బు | 05 – 03 | కే | 01 – 27 | శు | 02 – 06 | సూ | 01 – 27 |
| కేతువు | 13 – 09 | కే | 02 – 03 | శు | 05 – 12 | సూ | 00 – 20 | చం | 03 – 05 |
| శుక్రుడు | 38 – 00 | శు | 06 – 01 | సూ | 01 – 18 | చం | 01 – 04 | కు | 02 – 07 |
| సూర్యుడు | 11 – 12 | సూ | 01 – 24 | చం | 02 – 21 | కు | 00 – 23 | రా | 05 – 21 |
| చంద్రుడు | 19 – 00 | చం | 03 – 00 | కు | 01 – 27 | రా | 02 – 00 | గు | 05 – 02 |
| కుజుడు | 13 – 09 | కు | 02 – 03 | రా | 04 – 25 | గు | 01 – 23 | శ | 06 – 00 |
| రాహువు | 34 – 06 | రా | 05 – 13 | గు | 04 – 09 | శ | 02 – 03 | బు | 05 – 12 |
| గురుడు | 30 – 12 | గు | 04 – 24 | శ | 05 – 03 | బు | 01 – 27 | కే | 02 – 06 |
| మొ.సం. | 19 – 00 | | 36 – 03 | | 32 – 09 | | 13 – 09 | | 38 – 00 |

| సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | | రాహువు | | గురుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| సూ | 00 – 17 | చం | 01 – 18 | కు | 00 – 23 | రా | 05 – 04 | గు | 04 – 02 |
| చం | 00 – 29 | కు | 01 – 03 | రా | 02 – 00 | గు | 04 – 17 | శ | 04 – 24 |
| కు | 00 – 20 | రా | 02 – 26 | గు | 01 – 23 | శ | 05 – 12 | బు | 04 – 09 |
| రా | 01 – 21 | గు | 02 – 16 | శ | 02 – 03 | బు | 04 – 25 | కే | 01 – 23 |
| గురు | 01 – 16 | శని | 03 – 00 | బు | 01 – 27 | కే | 02 – 00 | శు | 05 – 02 |
| శ | 01 – 24 | బు | 02 – 21 | కేతు | 00 – 23 | శు | 05 – 21 | సూ | 01 – 16 |
| బు | 01 – 18 | కే | 01 – 03 | శు | 02 – 07 | సూ | 01 – 22 | చం | 02 – 16 |
| కే | 00 – 20 | శు | 03 – 05 | సూ | 00 – 20 | చం | 02 – 25 | కు | 01 – 23 |
| శు | 01 – 27 | సూ | 00 – 28 | చం | 01 – 03 | కు | 02 – 00 | రా | 04 – 17 |
| | 11 – 12 | | 19 – 00 | | 13 – 09 | | 34 – 06 | | 30 – 12 |

# ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి - బుధ దశ సం. 17

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | బుధుడు | | కేతువు | | శుక్రుడు | | సూర్యుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| బుధుడు | 28 –27 | బు | 04 – 03 | కే | 00 – 20 | శు | 05 – 20 | సూ | 00– 15 |
| కేతువు | 11 –27 | కే | 01 – 20 | శు | 02 – 10 | సూ | 01 – 21 | చం | 00– 26 |
| శుక్రుడు | 34 –00 | శు | 04 – 25 | సూ | 00 – 18 | చం | 02– 25 | కు | 00 – 18 |
| సూర్యుడు | 10 –06 | సూ | 01 – 13 | చం | 01 – 00 | కు | 02 – 00 | రా | 01 – 15 |
| చంద్రుడు | 17 –00 | చం | 02 – 12 | కు | 00 – 20 | రా | 05– 03 | గు | 01 – 11 |
| కుజుడు | 11 –27 | కు | 01– 21 | రా | 01 – 24 | గు | 04 – 16 | శ | 01– 18 |
| రాహువు | 30 –18 | రా | 04 – 10 | గు | 01– 18 | శ | 05 – 11 | బు | 01 – 14 |
| గురుడు | 27 –06 | గు | 03 – 26 | శ | 01 – 27 | బు | 04 – 25 | కే | 00 – 18 |
| శని | 32–09 | శ | 04 –17 | బు | 01 – 20 | కే | 01 – 29 | శు | 01 – 21 |
| మొ.సం. | 17 –00 | | 28 –27 | | 11 – 27 | | 34 – 00 | | 10 – 06 |

| చంద్రుడు | | కుజుడు | | రాహువు | | గురుడు | | శని | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| చం | 01 – 12 | కు | 00 – 21 | రా | 04 – 18 | గు | 03 – 19 | శ | 05 – 03 |
| కు | 01– 00 | రా | 01 – 23 | గు | 04 – 02 | శ | 04 – 09 | బు | 04 – 17 |
| రా | 02 – 16 | గు | 01 – 18 | శ | 04 – 25 | బు | 03 – 26 | కే | 01 – 27 |
| గురు | 02 – 08 | శని | 01 – 26 | బు | 04 – 10 | కే | 01– 17 | శు | 05 – 12 |
| శ | 02– 21 | బు | 01 – 21 | కేతు | 01 – 24 | శు | 04 – 16 | సూ | 01 – 18 |
| బు | 02 – 13 | కే | 00 – 21 | శు | 05 – 03 | సూ | 01 – 11 | చం | 02 – 20 |
| కే | 01 – 00 | శు | 01 – 29 | సూ | 01– 16 | చం | 02 – 08 | కు | 01 – 27 |
| శు | 02– 25 | సూ | 00 – 18 | చం | 02 – 17 | కు | 01 – 18 | రా | 04 – 25 |
| సూ | 00–25 | చం | 01 – 00 | కు | 01 – 23 | రా | 04 – 02 | గు | 04 – 10 |
| | 17 – 00 | | 11 – 27 | | 30 – 18 | | 27 – 06 | | 32 – 09 |

# అశ్విని, మఘ, మూల – కేతు దశ సం. 7

## భుక్తులు – అంతరములు

| భుక్తుల వివరము | | కేతువు | | శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| కేతువు | 04 –27 | కే | 00 – 08 | శు | 02 – 10 | సూ | 00 – 06 | చం | 00– 17 |
| శుక్రుడు | 14 –00 | శు | 00 – 25 | సూ | 00 – 21 | చం | 00 – 11 | కు | 00– 12 |
| సూర్యుడు | 04 –06 | సూ | 00 – 07 | చం | 01 – 05 | కు | 00– 07 | రా | 01 – 02 |
| చంద్రుడు | 07 –00 | చం | 00 – 12 | కు | 00 – 24 | రా | 00 – 19 | గు | 00 – 28 |
| కుజుడు | 04 –27 | కు | 00 – 09 | రా | 02 – 03 | గు | 00– 17 | శ | 01 – 03 |
| రాహువు | 12 –18 | రా | 00– 22 | గు | 01 – 26 | శ | 00 – 20 | బు | 01– 00 |
| గురుడు | 11 –06 | గు | 00 – 20 | శ | 02– 07 | బు | 00 – 18 | కే | 00 – 12 |
| శని | 13 –09 | శ | 00 – 23 | బు | 01 – 29 | కే | 00 – 07 | శు | 01 – 05 |
| బుధుడు | 11–27 | బు | 00 –21 | కే | 00 – 25 | శు | 00 – 21 | సూ | 00 – 11 |
| మొ.సం. | 07 –00 | | 04 –27 | | 14 – 00 | | 04 – 06 | | 07 – 00 |

| కుజుడు | | రాహువు | | గురుడు | | శని | | బుధుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| కు | 00 – 08 | రా | 01 – 26 | గు | 01 – 15 | శ | 02 – 03 | బు | 01 – 20 |
| రా | 00– 22 | గు | 01 – 21 | శ | 01 – 23 | బు | 01 – 27 | కే | 00 – 21 |
| గురు | 00 – 20 | శని | 02 – 00 | బు | 01 – 17 | కే | 00 – 23 | శు | 02 – 00 |
| శ | 00 – 23 | బు | 01 – 23 | కేతు | 00 – 20 | శు | 02– 06 | సూ | 00 – 18 |
| బు | 00 – 21 | కే | 00 – 22 | శు | 01 – 26 | సూ | 00 – 20 | చం | 00 – 29 |
| కే | 00 – 09 | శు | 02 – 03 | సూ | 00 – 17 | చం | 01 – 04 | కు | 00 – 21 |
| శు | 00 – 24 | సూ | 00 – 19 | చం | 00 – 28 | కు | 00 – 23 | రా | 01 – 24 |
| సూ | 00– 08 | చం | 01 – 02 | కు | 00 – 20 | రా | 02 – 00 | గు | 01 – 17 |
| చం | 00– 12 | కు | 00 – 22 | రా | 01 – 20 | గు | 01 – 23 | శ | 01 – 27 |
| | 04 – 27 | | 12 – 18 | | 11 – 06 | | 13 – 09 | | 11 – 27 |

# భరణి, పుబ్బ, పూర్వాషాఢ - శుక్ర దశ సం. 20

## భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | | శుక్రుడు | | సూర్యుడు | | చంద్రుడు | | కుజుడు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల.దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| శుక్రుడు | 40 – 00 | శు | 06 – 20 | సూ | 00 – 18 | చం | 01– 20 | కు | 00– 25 |
| సూర్యుడు | 12 – 00 | సూ | 02 – 00 | చం | 01 – 00 | కు | 01 – 05 | రా | 02– 03 |
| చంద్రుడు | 20 – 00 | చం | 03 – 10 | కు | 00 – 21 | రా | 03– 00 | గు | 01 – 26 |
| కుజుడు | 14 – 00 | కు | 02 – 10 | రా | 01 – 24 | గు | 02 – 20 | శ | 02 – 06 |
| రాహువు | 36 – 00 | రా | 06 – 00 | గు | 01 – 18 | శ | 03 – 05 | బు | 02 – 00 |
| గురుడు | 32 – 00 | గు | 05– 10 | శ | 01 – 27 | బు | 02 – 25 | కే | 00– 24 |
| శని | 38 – 00 | శ | 06 – 10 | బు | 01– 21 | కే | 01 – 05 | శు | 02 – 10 |
| బుధుడు | 34 – 00 | బు | 05 – 20 | కే | 00 – 21 | శు | 03 – 10 | సూ | 00 – 21 |
| కేతువు | 14 – 00 | కే | 02 –10 | శు | 02 – 00 | సూ | 01 – 00 | చం | 01 – 05 |
| మొ.సం. | 20 –00 | | 40 – 00 | | 12 – 00 | | 20 – 00 | | 14 – 00 |

| రాహువు | | గురుడు | | శని | | బుధుడు | | కేతువు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన | | నెల. దిన |
| రా | 05 – 12 | గు | 04 – 08 | శ | 06 – 00 | బు | 04 – 24 | కే | 00 – 24 |
| గురు | 04– 24 | శని | 05 – 02 | బు | 05 – 12 | కే | 02 – 00 | శు | 02 – 10 |
| శ | 05 – 21 | బు | 04 – 16 | కేతు | 02 – 06 | శు | 05 – 20 | సూ | 00 – 21 |
| బు | 05 – 03 | కే | 01 – 26 | శు | 06 – 10 | సూ | 01– 21 | చం | 01 – 05 |
| కే | 02– 03 | శు | 05 – 10 | సూ | 01 – 27 | చం | 02 – 25 | కు | 00 – 25 |
| శు | 06 – 00 | సూ | 01 – 18 | చం | 03 – 05 | కు | 02 – 00 | రా | 02 – 03 |
| సూ | 01 – 24 | చం | 02 – 20 | కు | 02 – 07 | రా | 05 – 03 | గు | 01 – 26 |
| చం | 03– 00 | కు | 01 – 26 | రా | 05 – 21 | గు | 04 – 16 | శ | 02 – 06 |
| కు | 02– 03 | రా | 04 – 24 | గు | 05 – 02 | శ | 05 – 11 | బు | 02 – 00 |
| | 36 – 00 | | 32 – 00 | | 38 – 00 | | 34 – 00 | | 14 – 00 |

## ద్వాదశ రాశ్యాది గ్రహదశా ఫలములు

### 1. మేషాది గ్రహదశా ఫలములు

మేషలగ్నమునకు కోణాధిపతులగు రవి గురులు మంచి యోగము నిత్తురు. కుజునకు అష్టమాధిపత్యము గలుగుట వలన పాపుడైనను లగ్నాధిత్యము గలుగుటచే కుజునకు శుభత్వము గలిగినదిగాని ఆకుజుడు అష్టమ స్థానము నందున్న యెడల స్వక్షేత్రము నందున్న వాడైనను యోగము నిచ్చువాడు కాడు. చతుర్థ వ్యయ మొదలగు స్థానముల యందు కుజుడుండిన యా స్థానముల యొక్క బలాబలములను బట్టి శుభాశుభ ఫలములు నిచ్చును.

3-6 స్థానముల పాపస్థానములగుటచే యీ స్థానములకు అధిపతియైన బుధుడు మిక్కిలి పాపఫలము నిచ్చును. ఈ బుధుడు యే స్థానముల యందున్నను పాప ఫలమునే యిచ్చును. పాపగ్రహములకు కేంద్రాధిపత్యము గలిగిన యెడల శుభఫలము నిచ్చును. మేషలగ్నమునకు శని రాజ్యలాభ స్థానముల కధిపతియై యుండుట వలన అందు రాజ్యస్థానము శుభస్థానమగుట వలన శని మిశ్రమ ఫలము నిచ్చును.

ద్వితీయ సప్తమ స్థానములు మారక స్థానములు. ఈ మేష లగ్నమునకు ద్వితీయ సప్తమ స్థానములకు శుక్రుడు అధిపతియగుటచే మిక్కిలి పాపఫలము నిచ్చును. పూర్ణచంద్రునకు కేంద్రాధిపత్యము గలిగిన యెడల పాపఫలము నిచ్చును. ఇచ్చట, చంద్రుని యొక్క పూర్ణతత్వమేమియు నుపయోగించదు. మేషలగ్నమున పూర్ణచంద్రుడు మారకస్థానముల యందున్నను. మారక స్థానాధిపతులతో గూడియున్నను, మొదటి మంచి యోగము నిచ్చును. పిమ్మట మారకము జేయును. ఆ చంద్రునకు క్షీణత్వము గలిగి క్షీణచంద్రుడై నైసర్గికముగా పాపుడైనను శుభఫములనే యిచ్చును.

మేషలగ్నమునకు గురుచంద్రులు, రవిచంద్రులు కలిసియున్నను వారివురు అధిక ఫలము నిచ్చుచూ రాజయోగము నిచ్చువారగును. రవి గురులు కోణాధిపతులగుట వలన వీరిరువురు కలసి యున్న స్వల్ప ఫలము నిచ్చును. రవి చంద్ర గురులు ముగ్గురును కలసియున్న పరిపూర్ణ రాజయోగము నిచ్చును.

ఒకే నక్షత్ర పాదమందు రవితో గూడిన గ్రహమునకు అస్తంగత దోషము సంభవించును. ఒకే నక్షత్ర పాదమందు గాక యేక నక్షత్రమందు రవితో గూడిన గ్రహములు శుభదాయకము లగును. యే లగ్నమునకైనను భాగ్యరాజ్యాధిపతులిరువురు యెక్కడ కలసియున్నను యోగము నిచ్చువారగును. మేషలగ్నమునకు గురుడు భాగ్యాధిపతియు, శని రాజ్యాధిపతియునై యున్నారు. వీరివురు కలసియున్న యోగభంగము గలుగును. గురు శనులు భాగ్యరాజ్యాది పతులైనను రెండవదియగు వ్యయాధిపత్యము వలన గురుడున్నూ లాభాది పత్యము వలన శనియు మేష లగ్నమునకు పాపులగు చున్నారు. గురుడు నైసర్గికము వలన శుభుడు, శని నైసర్గికము వలన పాపి. వీరిరువురు కలియుట వలన పాపఫలమై యిచ్చువారగును. మేష లగ్నమునకు గురు శనులిరువురు నెచ్చట కలసి యున్నను యోగభంగము చేయుటయే గాక సంతాన క్లేశము, ధననష్టము మొదలగునవి గలుగును.

మేషలగ్నమునకు లగ్నాధిపతియగు కుజుడును. భాగ్యాధిపతియగు గురుడును వీరిరువురు కలసియున్న కుజదశమందు విశేష ఫలమిచ్చును. గురుదశ యందు సామాన్య ఫలము నిచ్చును.

మేషలగ్నమున గురుచంద్రులు, రవిచంద్రులు రవికుజులు, లేక శనిశుక్రులుగాని యీ జంట గ్రహములు నితరులతో కలియుక ప్రత్యేకముగా నెచ్చట నున్నను ప్రబల యోగమునిత్తురు. నీచయందున్న గ్రహములు శుభఫలముల నీయరు.

1. **సూర్యుడు:-** మేషలగ్నమునకు లగ్నము నందు రవియున్న రవిదశలో జాతకునికి మంచి రాజయోగము గలిగి దైవభక్తి, పరోపకారము, దయాదాక్షిణ్యము, రాజసన్మానము, పేరుప్రతిష్టలు గలుగును. ద్వితీయ స్థానమున రవియున్న స్వల్పయోగము గలిగి ఆర్జించిన ధనమంతయు ఖర్చుబడు చుండును. తృతీయ స్థానమున రవియున్న రవిదశ సామాన్యమైన జాతకుని ధైర్యసాహసములు మెండుగా నుండును. చతుర్థ స్థానమున రవియున్న దుష్ఫలములు గలిగి మాతృసౌఖ్యము తక్కువగా యుండును. గాని రవిదశ యందు మంచి యోగము గలుగును. పంచమ స్థానమున రవియున్న పేరుప్రతిష్టలు గల పుత్రుడు యొకడే యుండును. రవిదశ యందు రాజసన్మానము గలుగును. షష్టమందున్న రవియున్న ధనవ్యయమును, సప్తమ స్థానమందున్న పుత్రశోకమును గలుగును. అష్టమ స్థానమున రవియున్న పాపఫలము గలుగును. పుత్రశోకము గలుగును. అష్టమ స్థానమున రవియున్న పాపఫలము గలుగును. ధననష్టము, శరీరపీడ, సంతాన విచారము గలుగును. నవమ స్థానము నందురవియున్న ధనప్రాప్తి, రాజసన్మానము గలుగును. దశమ స్థానమందు రవియున్న యోగము గలిగి తీర్థయాత్రలు, సౌఖ్యజీవనము, మంచిఖ్యాతి గలుగును. ఏకాదశ స్థానమందు రవియున్నను శత్రు స్థామందున్నను రవిదశ యోగించును. జాతకునకు మంచి ఉద్యోగము లభించును. ద్వాదశ స్థానమందు రవియున్న రవిదశలో పాపఫలము గలిగి సర్వధనము వ్యయమగును.

2. **చంద్రుడు:-** మేషలగ్న మందు చంద్రుడున్న చంద్రదశలో మంచి శుభఫలము నిచ్చును. భూధనలాభము గలుగును. క్షీణచంద్రుడైన శుభఫలము నిచ్చునుగాని అన్యాయార్జితము, కపటస్వభావము గలుగును. ద్వితీయ స్థానమందు చంద్రుడున్న చంద్రదశలో పూర్ణచంద్రుడైన శుభఫలము గలిగి ధనలాభము గలుగునుగాని శరీరపీడ, సంభవించును. క్షీణచంద్రుడైన స్వల్పధనలాభము గలుగును. తృతీయమందు చంద్రుడున్న ధనవ్యయము, పిత్రార్జిత నష్టము గలుగును. చతుర స్థానమందు చంద్రుడున్న భూధనలాభమును, పంచమముననున్న చంద్రదశ యందు మంచి సంతానము గలుగును. షష్టమమున చంద్రుడున్న వాని దశయందు భూమియు, ధనము వ్యయమగును. సప్తమమున పూర్ణచంద్రుడున్న కేంద్రాధిపత్య దోషము వలన శరీరపీడ, నొకప్పుడు మారకము గూడ సంభవించును. క్షీణ చంద్రుడైన మారక భయముండదు. అష్టమమందు పూర్ణచంద్రుడైనను క్షీణ చంద్రుడైనను శుభఫలముల నీయరు. పూర్ణచంద్రుని వలన ప్రాణభీతి సంభవించును. నవమ స్థానము చంద్రదశ యోగించును. జాతకునికి పేరుప్రతిష్టలు గలుగును. దశమమందు చంద్రుడున్న చంద్రదశ యందు ధనము తీర్థయాత్రలకు

వెచ్చించబడును. ఏకాదశ చంద్రుని వలన న్యాయధనార్జన గలుగును. వ్యయ స్థానమున చంద్రుడున్న బహునష్టములను, విశేష ధనవ్యయము గలుగును.

**3. కుజుడు:-** మేషలగ్నమునకు లగ్నమందు కుజుడున్న శరీర సౌఖ్యము గలుగును. ద్వితీయమందు కుజుడున్న కుజదశయందు కళత్రపీడయు, సంతాన విచారము; తృతీయమున దుష్ప్రవర్తన, అపకీర్తి, రక్తహీనము శత్రువృద్ధియు; చతుర్థ స్థానమున కుజుడున్న కుజదశయందు సామాన్య జీవితము, మతవిరుద్ధము, వివాదము, శరీరపీడ గలుగును. పంచమ స్థానమున కుజుడున్న కుజదశ యందు సంతాన విచారము, చిక్కులు, జగడము, ధననష్టము గలుగును. షష్ఠమస్థానమున కుజుడున్న ఋణము, రోగము, ధనహీనము గలుగును. సప్తమ స్థానమున కుజుడున్న కళత్రజాడ్యము, అపకీర్తి, ధననష్టము, బంధువ్యసనము మొదలగునవి వాని దశా కాలములో జరుగును. అష్టమ స్థానమున కుజుడున్న కుజ దశలో కళత్ర విచారము, ధనవ్యయము, యోగభంగము గలుగును. నవమస్థానము నందు కుజుడున్న కుజదశలో పితృసౌఖ్యము చెరచును; దశమ స్థానమున కుజుడున్న శుభ ఫలముల నిచ్చును. పేరుప్రతిష్టలు గలుగును. ఏకాదశ స్థానమున కుజుడున్న బాగుగా యోగించును. ధనసంపాదన న్యాయవిహీనమై యుండును. వ్యయ స్థానమందు కుజుడున్న కుజదశలో విశేష ధననష్టము, దరిద్రము, దుష్టత్వము, ఋణము మొదలగునవి సంభవించును.

**4. బుధుడు:-** మేషలగ్నమునకు లగ్నమందు బుధుడున్న బుధదశలో రోగ శరీరము, దైవభక్తి, మంచి స్వభావమును; ద్వితీయ మందున్న మంచివాక్కు, ధనము సంపాదించి ఖర్చుపెట్టుటయును; తృతీయస్థానము నందున్న సోదర వృద్ధియు చతుర్థ స్థానమందున్న మాతృపీడ, స్వల్పవిద్య ఋణమును; పంచమందున్న సంతాన సౌఖ్యహీనము; షష్ఠమునందున్న శత్రుబాధ, రోగము, ఋణము, వ్యవహార చిక్కులు, కష్టనష్టములును; సప్తమము నందున్న శరీరపీడ, కళత్ర రోగమును; అష్టమము నందున్న వ్యవహార చిక్కులును; నవమము నందున్న శత్రువుల వలన భాగ్య లాభమును; దశమ మందున్న యాత్రలవల్ల ధనవ్యయమును; ఏకాదశ మందున్న అన్యాయార్జనమును; ద్వాదశమందున్న మొదట కష్టమును తుదను సుఖము బుధ దశ యందు గలుగును.

**5. గురుడు:-** మేషలగ్నమందు గురుడున్న వానిదశలో దేహదారుఢ్యము, సంపూర్ణ యోగము, ప్రతిష్టయు ద్వితీయమున ధనలాభము; తృతీయమున యోగ భంగము, బంధు కలహమును, చతుర్థ స్థానమున విద్యావాహన ముద్రాధి కారమును; పంచమమును మంచియోగము, సంతానలాభము ఉద్యోగమును: షష్ఠమ మున ఋణము, శత్రువులు, కష్టనష్టములును, సప్తమమున మంచి కళత్రప్రాప్తియు; అష్టమమున మొదట యోగమను తరువాత యోగభంగమును; నవమ మందున పితృ సౌఖ్యము, విశేష భాగ్యమును; దశమమున నీచస్థానమగుటచే పిత్రార్జిత నష్టము, ఋణమును; ఏకాదశమున స్వల్పయోగము, న్యాయార్జితము, కీర్తి, అధికారము, ధన వృద్ధియు; ద్వాదశ స్థానమున గురుడున్న వానిదశలో శుభ కార్యములు, ధర్మ కార్యములు, తీర్థయాత్రలు మొదలగునవి గలుగును.

6. **శుక్రుడు:-** మేషలగ్నమున లగ్నమందు శుక్రుడున్న వానిదశలో మహా భోగము, విద్యావిషయమును; ద్వితీయమందున్న ధన జాతకుడును తృతీయ మందున్న సోదర సోదరీ వృద్ధియు, చతుర్థమందున్న వాహన ముద్రాధికారము, భూ లాభము, మాతృసౌఖ్యము, యోగఫలము, విద్యయును; పంచమమందున్న రాజ యోగము, స్త్రీ సంతతియును; షష్టమందున్న యోగభంగము, శరీరపీడ, కళత్ర నష్టము, దరిద్రమును; సప్తమమందున్న శరీరపీడ, సుందర కళత్రము, వేశ్యా సంభోగమును; అష్టమమందున్న భార్యావిరోధము; నవమమందున్న కళత్ర సంబంధ మైన భాగ్యము, అఖండ యోగమును; దశనుమందున్న యోగఫలమును, శుభ కర్మలును; ఏకాదశమందున్న స్వార్జితవిత్తము, న్యాయార్జితమును; వ్యయస్థానము నందున్న తీర్థయాత్రలు, రాజసన్మానము శుక్రదశలో గలుగును.

7. **శని:-** మేషలగ్నమునకు లగ్నస్థానమున శనిగ్రహమున్న శనిమహాదశలో లగ్నాధిపతియైన కుజుడుగాని రవిగాని చంద్రలగ్నము మొదలు కేంద్రస్థానముల యందున్న యెడల శనిదశ అఖండముగా యోగించును. అట్లులేకున్న శనిదశ యోగించదు. ధనస్థానమందు శనియున్న యెడల ధనక్షయ మగును. శని గూడ యీ స్థానమున నొకప్పుడు మారకుడగును. తృతీయమందు శనియున్న నాతని దశయందు మిశ్రమఫల మిచ్చును. కనిష్ట సోదరులుండరు. చతుర్థస్థానమున శని యున్న మాతృపీడము, విద్యావిఘ్నము, పితృక్షేత్ర నాశమును; పంచమమున సంతాన నష్టము; షష్టమమున శత్రునాశమును, సప్తమమున శుభఫలము, కళత్ర విచారమును; అష్టమమున ధననష్టము, శరీరపీడ, చిక్కులును; నవమందు పితృ పీడ, ధనలాభమును; దశమమందున్న ధనలాభము; ఏకాదశమందు ధన సంపాదనయు; ద్వాదశమందున్న విశేష ధనవ్యయమును, శని కుజునితో గలసి యున్న అంగవిహీనము గలుగును.

8. **రాహువు:-** మేషలగ్నమునకు లగ్నమందు రాహువున్న వానిదశలో శరీర పీడ, దుష్టవర్తన, చింత, శత్రువృద్ధియును; ద్వితీయమున బుధ సంబంధముగాని శని సంబంధము గాని యున్న మారకమును; తృతీయమున మొదట శుభ ఫలములను, బుదాంతర్దశలో యోగభంగము గలిగి అపకీర్తి, ఋణము, శత్రు వృద్ధియు; చతుర్థస్థానమున దుష్ఫలము, మారకము, మాతృచింతయు; పంచమమున సంతాన విచారము, చిక్కులు, ధననష్టమును; షష్టమమున శుభయోగము, జ్ఞాతుల ధన లాభమును; సప్తమమున శరీరపీడ, కళత్ర శరీరపీడ, ధననష్టమును; అష్టమమున బహు కష్టములు; నవమస్థానమున పితృవిచారము; దశమమున గంగా స్నానము; ఏకాదశ మందున్న అన్యాయార్జితమైన ధనమును; ద్వాదశస్థానమున రాహువున్న రాహు దశలో దుర్వ్యయము గలుగును.

9. **కేతువు:-** మేషలగ్నమునకు లగ్నమందు కేతుగ్రహమున్న కేతుదశలో దేహ దారుఢ్యము, వికట స్వభావమును, ద్వితీయమందున్న ధనక్షయమును; తృతీయ మందున్న మహాయోగమును; చతుర్థమందున్న మాతృపీడ, భూవిక్రయము, విద్యా విఘ్నమును. పంచమమునందున్న సంతాన విచారము, యోగఫలమును, షష్టమము నందున్న యోగఫలము, శత్రుభయము, రోగము, ఋణమును; సప్తమ

మందున్న శరీరపీడ, కళత్ర వియోగమును, అష్టమము నందున్న శరీరపీడ, కష్ట నష్టములును; నవమమందున్న పిత్రార్జిత వ్యయము, పితృసౌఖ్యహీనమును; దశమ మందున్న తీర్థయాత్రులును; ఏకాదశ మందున్న యోగఫలము, అన్యార్జన; ద్వాదశ మందున్న పుణ్యకార్యముల వలన ధనవ్యయమును కేతుదశ యందు గలుగును.

### 2. వృషభాది గ్రహదశా ఫలములు

వృషభ లగ్నమునకు శనియొక్కడే రాజయోగ కారకుడు శని రవితో కలిసి కేంద్రకోణముల యందున్న రవిదశ గూడ ప్రబలముగా యోగించును. శనిరవితోగాని బుధునితోగాని కలసిన అఖండయోగము గలుగును. తృతీయాధిపతియైన చంద్రుడు శనితో కలసిన చంద్రదశ బాగుగా యోగించును. శని శుక్రులు కలసిన శనిదశలో కొంతవరకు యోగించి తరువాత యోగభంగము గలుగును. శుక్రదశ కొద్దిగా యోగించును. శని కుజులు కలసిన కుజదశబాగుగా యోగించును. శనిదశ కొద్దిగా యోగించి పిమ్మట జాతకునకు శరీరపీడ గలిగించును. శనిదశలో మారకము తప్పక జరుగును. శని గురులు కలసిన యోగభంగము గలుగును. గురుదశ పూర్తిగా యోగించును. వృషభలగ్నము నందు శని రవులు, శనిబుధులు, శని కుజులు, రవి బుధులును యీ జంట గ్రహములలో నేవి కలసియున్నను రాజయోగము గలుగును.

గురు బుధులు కలసి కేంద్రకోణముల యందుగాని ధనస్థానమందుగాని యున్న విశేష ధనలాభము గలుగును. రవిగురులు గలసియున్న గురుదశ యోగించును. రవిదశ యోగించదు. రవిశుక్రులు కలసియున్న శుక్రదశ యోగించును. కుజ బుధులు కలసిన యెడల కుజదశ యోగించును. బుధదశలో మొదట యోగించును. పిమ్మట భంగము గలుగును. బుధశుక్రులు కలసిన శుక్రదశ యోగించును. శనిశుక్రులు గలసిన శుక్రదశ యోగించును. శనిదశ యోగభంగము గలుగును. పై జంట గ్రహములు గాక మిగిలిన యే జంటగ్రహములైనను యోగించవు. శని బుధులు గాని శని కుజులు గాని గలసిన యెడల శనిదశ కొంత వరకు యోగించి పిమ్మట మారకము జేయును. ఈలగ్నమునకు చంద్రుడు తృతీయధిపతి యగుట చేతను, శుక్రుడు షష్టాధిపతి యగుటచేతను, గురుడు అష్టమ లాభాధిపతి యగుట చేతను యీ మూడు గ్రహములు పాపఫలముల నిచ్చెదరు. ఒకప్పుడు మారకము గూడజేయుదురు. ఈ మూడు గ్రహములలో నే గ్రహమైనను శనితో కలసిన యోగమునకు బదులు మారకము జరుగును. ఈ లగ్నమునకు చంద్ర, బుధ, కుజ, శుక్ర, గురులు మారక లక్షణములు గలవియై యుండుటచే యీ గ్రహములలో నేగ్రహము మారకస్థానము నందున్నను తప్పక మారకము జేయును.

**1. సూర్యుడు:-** వృషభలగ్న జాతకునకు లగ్నమందు రవియున్న మంచి రూపము గల వాడును, మోహన శరీరము గలవాడును, స్వాతిక స్వభావము గలవాడు నగును. రవి శని పూర్తిగా యోగించును. ద్వితీయ మందు రవియున్న నేత్రరోగము, ధనక్షయము, స్వల్పయోగమును; తృతీయమందున్న సోదర కీర్తియును చతుర్థమందున్న వాహన ముద్రాధికారమును, వుద్యోగమును; పంచమ మందున్న ఏక పుత్రుడును, సంపూర్ణ యోగమును; షష్టమందున్న భూవ్యయము, శత్రురోగ

ఋణములును; సప్తమమున రవియున్న సుకళత్రము, కళత్రసౌఖ్యహానియు; అష్టమ మందున్న మాతారిష్టము, శరీరపీడ, ధనవ్యయమును; నవమమందున్న జ్ఞాతులు శత్రువుల వల్ల భాగ్యలాభమును; దశమమందున్న తీర్థయాత్రలు సత్కార్యములును; ఏకాదశ మందున్న పేరుప్రతిష్ఠలు, అధిక లాభమును; ద్వాదశమందు రవియున్న రవిదశలో పుణ్యకార్యములకు ధనవ్యయము, సత్కథాకాల క్షేపము గలుగును.

**2. చంద్రుడు:-** వృషభలగ్న జాతకునకు లగ్నమందు పూర్ణచంద్రుడున్న మంచి భాగ్యవంతుడును, క్షీణచంద్రుడైన భాగ్యహీనుడును, శరీరపీడయు గలుగును, చంద్రదశలో గలుగును. ద్వితీయమున పూర్ణచంద్రుడున్న ధనలాభమును క్షీణ చంద్రుడైన ధనవ్యయ మగును. తృతీయమున పూర్ణచంద్రుడున్న సోదరీవృద్ధియు క్షీణ చంద్రుడున్న సోదరీ నష్టమును; చతుర్థమందు పూర్ణచంద్రుడున్న విద్యావాహన భూభాగ్య లాభమును, క్షీణచంద్రుడున్న భూవ్యయము, మాతృచింతయును; పంచమమందు పూర్ణచంద్రుడున్న భాగ్యవంతురాలగు నొక కుమార్తె యుండి యోగ ఫలము గలుగుటయు, క్షీణచంద్రుడున్న సంతాన సౌఖ్యహీనమును; షష్ఠమమందు పూర్ణచంద్రుడున్న స్వల్పశత్రురోగ ఋణములును, క్షీణచంద్రుడున్న హెచ్చుశత్రురోగ ఋణములును, సప్తమమందు పూర్ణచంద్రుడున్న సత్కళత్ర సౌఖ్యమును, క్షీణ చంద్రుడున్న రోగియు, కుటిల స్వభావముగల కళత్ర సుఖహీనమును అష్టమ మందు పూర్ణచంద్రుడున్న శరీరపీడయు, క్షీణచంద్రుడున్న అనేక కష్టనష్టములును; నవమమందు పూర్ణచంద్రుడున్న సంపూర్ణ భాగ్యమును, క్షీణచంద్రుడున్న తాత్కాలిక ఫలమును, దశమమందు పూర్ణచంద్రుడున్న మిక్కిలి రాజయోగమును, గంగా స్నానమును, సత్కార్యములును, క్షీణచంద్రుడున్న అనాచార ప్రవర్తనమును; ఏకా దశమందు పూర్ణచంద్రుడున్న న్యాయముగా బహుధనార్జనమును, క్షీణచంద్రుడున్న అన్యాయముగా ధనమార్జించుటయును; ద్వాదశమందు పూర్ణచంద్రుడున్న పుణ్య కార్యములకు ధనవ్యయమును; క్షీణచంద్రుడున్న దురాచార ప్రవర్తనము, దుష్కార్యములకు ధనవ్యయము వాని దశలో గలగుచుండును.

**3. కుజుడు:-** వృషభలగ్న జాతకునకు లగ్నమున కుజుడున్న వానిదశలో మశూచికాది రోగములును, సౌఖ్యహీనమును, కుటిల స్వభావమును; ద్వితీయ మందున్న ధనవ్యయము, ద్వికళత్ర యోగమును; తృతీయమందున్న కళత్ర శరీర పీడ, సోదర నష్టము, భూవ్యయమును; చతుర్థమందున్న భూవ్యయము, మాతృపీడ విద్యానాశమును; పంచమమందున్న సంతాననష్టమును; షష్టమమందున్న శత్రుభాధ, రోగపీడ, ఋణములతో భూలాభమును; సప్తమమందున్న కళత్ర నష్టము, భూలాభమును; అష్టమమున ద్వికళత్రయోగము, పిత్రార్జిత భూవ్యయము, అష్టనష్ట ములు, ధనవ్యయమును; నవమందున్న రాజయోగము, భూలాభము, పితృసౌఖ్య హీనమును; దశమందున్న వ్యవసాయ జీవనము. తీర్థయాత్రలును; ఏకాదశమ మందున్న విశేష యోగఫలమును, న్యాయార్జితమును, బహు ధనలాభమును; వ్యయ స్థానమందున్న ఋణముతో భూలాభము, ధనవ్యయము, దుర్వినియోగమును కుజదశ యందు గలుగుచుండును.

4. **బుధుడు:-** వృషభలగ్న జాతకునకు లగ్నమున బుధుడున్న వానిదశలో శరీరసౌఖ్యము, విద్యావినయముస పారమార్థిక చింతయును; ద్వితీయమందున్న విశేష ధనలాభమును, శరీరపీడ, కుజునితోగాని రాహువుతోగాని గలిసియున్న మారకమును; తృతీయమందున్న యోగభంగమును; చతుర్థమందున్న మాతృ సౌఖ్యమును; పంచమమందున్న అఖండ యోగమును, వాహన ముద్రాధికార సౌఖ్యములును; షష్ఠమమందున్న ధనవ్యయమును; సప్తమమందున్న సుకళత్రమును; అష్టమమందున్న శరీరపీడ, ధనవ్యయమును, నవమమందున్న విశేష భాగ్యము, అధిక సౌఖ్యమును; దశమమందున్న వ్యాపారలాభము, ధనార్జనమును, ఏకాదశ మందున్న న్యాయ ధనార్జనమును, తీర్థయాత్రలు, సత్కార్యముల క్రింద ధన వ్యయమును, ద్వాదశమందు బుధుడున్న వానిదశలో సత్కథా కాలక్షేపములు, పారమార్థిక చింతయు, ఋణము గలుగును.

5. **గురుడు:-** వృషభలగ్న జాతకునకు లగ్నమున గురుడున్న గురుదశ యందు శరీరధారుడ్యము, విద్య మొదలగునవియును; ద్వితీయమందున్న కుటుంబ వృద్ధి, ధనలాభమును; తృతీయమందున్న పేరు ప్రతిష్ఠలుగల సోదరుల వలన యోగమును; చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనమును; పంచమమున యోగఫలము, సంతానవృద్ధియును; షష్ఠమమందున్న శత్రురోగ ఋణములును; సప్తమమందున్న సుకళత్రమును; అష్టమమందున్న స్వల్పభాగ్యము, ఆయుర్వృద్ధియును; నవమస్థానమందున్న శరీరపీడ, ధనవ్యయము; దశమమందున్న స్వతంత్ర జీవనము, తీర్థయాత్రలును, ఏకాదశమందున్న న్యాయార్జితము, మంచి యోగమును, ద్వాదశమందున్న సర్వధన వ్యయమును గురుదశలో సంభవించును.

6 **శుక్రుడు:-** వృషభలగ్న జాతకుడై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశ యందు సంగీత సాహిత్యమును, రాజసన్మానము, ద్వితీయమందున్న స్వల్పధనము, పూర్వఖండ దశలో యోగమును, ఉత్తరఖండ దశలోశత్రు రోగ ఋణములును, తృతీయమందున్న మంచి యోగమును, అదృష్ట సోదరీవృద్ధియును, చతుర్థమందున్న ఆంధ్రగీర్వాణముల యందు ప్రవేశమును, వాహనసౌఖ్యము, భూలాభమును, పంచమమందున్న యోగభంగము, కళత్రపీడయును, షష్ఠమందున్న ఋణము వలన భూ లాభము, యోగభంగమును, సప్తమందున్న యోగఫలము, చపల చిత్తతయును, అష్టమ మందున్న శరీరపీడ, కళత్రరోగము, విశేష ధనవ్యయమును, నవమందున్న మంచి వుద్యోగము, పేరుప్రతిష్ఠలు, హెచ్చుభాగ్యమును, దశమమందున్న వ్యవసాయ ఫలము, భూధన లాభమును, ఏకాదశమందున్న శుక్రదశలో పూర్వఖండమున రాజ యోగమును, ఉత్తర ఖండమున ఋణబాధయును, వ్యయస్థానమందున్న శరీర పీడయు, శుభకార్యముల వలన ఋణమును శుక్రదశయందు గలుగును.

7. **శని:-** వృషభలగ్న జాతకుడై లగ్నమున శనియున్న శనిదశ బాగుగ యోగించును, పేరుప్రతిష్ఠలు, ధనలాభము గలుగును, ద్వితీయమందు శనియున్న యోగ ఫలమును, ధనవ్యయమును, తృతీయమందున్న రోగబాధయును, చతుర్థ మందున్న రాజయోగమును, పంచమమందున్న ఉద్యోగము, వాహన ముద్రాధి కారమును, సంతాన సౌఖ్య హీనమును, షష్ఠమందున్న జ్ఞాతుల వల్ల భాగ్యమును,

సప్తమమున శనియున్న యోగభంగము, కళత్ర విచారమును, అష్టమమందున్న బంధు మిత్రులకు భాగ్యవినియోగమును, నవమమందున్న పితృసౌఖ్యహీనము, పిత్రార్జితము వల్ల హెచ్చుభాగ్యమును, నవమమందున్న వాహనముద్రాధికారము గల వుద్యోగము, పేరుప్రతిష్టలును, ఏకాదశమందున్న అధిక ధనలాభము, సత్కార్యము లను, ద్వాదశమందున్న యోగభంగము, అవమానము, శత్రురోగ ఋణములును శని దశయందు సంభవించును.

8. రాహువు:- వృషభలగ్న జాతకునకు లగ్నమున రాహువున్న రాహుదశ యందు శరీరదారుఢ్యము, పేరుప్రతిష్టలు, మంచియోగమును, ద్వితీయమందున్న పిత్రార్జిత ధనవ్యయము, పాపగ్రహ దృష్టియున్న రాహుదశలో మారకమును, తృతీయ మందు రాహువున్న సోదరవృద్ధిక్షయమును, చతుర్థమందున్న మాతృపీడ, భూ వ్యయము, సౌఖ్యహీనమును, పంచమమందున్న పూర్ణయోగమును, సంతాన విచారమును, షష్టమందున్న శత్రురోగ ఋణములును, సప్తమమందున్న శరీరబాధ, కళత్ర పీడయును, అష్టమమందున్న శరీరపీడ, యోగభంగము, కష్టములును, నవమ మందున్న గంగాస్నానమును, ఏకాదశమందున్న విశేష దనలాభము, ఉద్యోగము, వాహన ముద్రాధికారము. ద్వాదశమందున్న దుర్జన సహవాసము, ధనక్షయము, అధిక నష్టము, శత్రువుల వలన పరాభవము రాహుదశలో జరుగును.

9. కేతువు:- వృషభలగ్న జాతకునకు లగ్నమున కేతువున్న కేతుదశలో పారమార్థిక చింతయు, బలహీనతయును, ద్వితీయందున్న సంతాన విచారము, ధనవ్యయము శరీరపీడయును, తృతీయమందున్న పూర్ణయోగము, భూధనలాభమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనమును, పంచమము నందున్న సంతాన విచారము, లాభవ్యయములును, షష్టమమందున్న యోగఫలము, మాతుల నష్టమును, సప్తమ మందున్న శరీరపీడ, కళత్రవిచారమును, అష్టమ మందున్న శత్రురోగ ఋణములును, నవమమందున్న స్వల్పయోగము, పితృ పీడయును, దశమమందున్న తీర్థయాత్రలు, సత్కార్యములును, ఏకాదశమందున్న ధన లాభము, అన్యాయార్జితమును, ద్వాదశమందున్న భక్తి, వైరాగ్యము, మోక్షము, పురాణశ్రవణము, ధనవ్యయము, వ్యవహారచిక్కులు, శరీరాయాసము కేతుదశ యందు సంభవించును.

## 3. మిథునాది గ్రహదశా ఫలములు

మిధున లగ్నమునకు పరిపూర్ణ సుయోగము శుక్రుడొక్కడే యిచ్చును. శుక్రబుధులు కలసి కేంద్రకోణముల యందున్న రెండు దశలు పరిపూర్ణముగా యోగించును. శుక్ర బుధులు 1-5-7-9 స్థానముల యందు కలసియున్న రెండు దశలలో వాహన ముద్రాధికారములు గలుగును. ఈ లగ్నమునకు గురుడు ఉభయ కేంద్రాధిపతియైనను శుభగ్రహములతో .గలసి సప్తమమందుగాక యితర కేంద్ర కోణముల యందెక్కడ యున్నను పూర్ణముగా రాజయోగము గలుగును. యీ లగ్నమునకు జంటగా యే రెండు శుభగ్రహములు గలసినను యోగించును. నాలుగు శుభగ్రహములలో పాపగ్రహములు దేనితోనైనను కలసియున్న ఆ పాప గ్రహములు యోగించును. రవి చంద్రులు కలసిన యెడల రవిదశ యోగించును. చంద్రదశ యోగించదు. కష్టములు గలుగజేయును. రవికుజులు షష్టాష్టమ వ్యయ

స్థానముల యందెక్కడ కలసియున్నను విపరీత రాజయోగము గూడ చెడిపోవును. వీరిరువురు యితర స్థానముల యందు కలసిన పూర్వమున్న యోగము గూడ చెడిపోవును. రవి బుధులు కలసి యున్న రవిదశ సంపూర్ణ యోగమును బుధదశ సామాన్య యోగము గలుగజేయును. రవిగురులు కలసిన రవిదశ యోగించును. గురుదశ యోగించదు. రవిశనులుగలసిన యోగభంగము గలుగును. చంద్ర కుజులు గలసిన చంద్రదశ కంటె కుజదశ బాగుగా యోగించును. చంద్రబుధులు కలసిన రెండుదశలు పూర్తిగా యోగించును. రవిశుక్రులు కలసిన రవిదశలో విశేష భూధనలాభము గలుగును. చంద్రగురులు కోణమందు కలసిన రెండు దశలు యోగించును. చంద్రశుక్రులు కలసిన జాతకుడు మిక్కిలి ధనవంతుడగును. చంద్రశనులు గలసిన శనిదశ పూర్తిగా యోగించును. చంద్రదశ సామాన్యముగా యుండును. కుజబుధులు, కుజగురులు, కుజశుక్రులు కలసిన కుజదశ బాగుగా యోగించును గాని బుధదశలో శత్రురోగ ఋణములు గలుగుటయు, గురుదశలో విశేష ఋణము పెరుగుటయు, శుక్రదశలో కళత్రశరీరపీడ ధనవ్యయము గలుగును. కుజ శనులు కలసిన రెండు దశలలో యోగభంగము గలుగును. బుధగురులు, బుధ శుక్రులు కలసిన రెండు దశలు సంపూర్ణముగా యోగించును. బుధశనులు, శుక్ర శనులు కలసిన శనిదశ పూర్తిగా యోగించును. బుధదశ శుక్రదశలో మధ్యమధ్య యోగభంగము గలుగును. శుక్రదశలో కళత్రవిచారము ధననష్టము గూడ గలుగును. గురు శుక్రులు గలసిన సంపూర్ణమగు భాగ్యము గలుగును. గురు శనులు కలసిన యీ రెండు గ్రహములు భాగ్యరాజ్యాధిపతులైనను శనికి అష్టమాధిపత్యము వుండుట వలన మధ్యమధ్య యోగభంగము గలుగును. గరుదశ కంటె శనిదశ బాగుగా యోగించును.

1. **సూర్యుడు:-** మిథునలగ్న జాతకునికి లగ్నమందు రవియున్న యెడల రవిదశలో శరీరపీడ, శత్రువృద్ధి, ఋణవృద్ధియును. ద్వితీయమందున్న శరీరపీడ, తృతీయ మందున్న పేరు ప్రతిష్టలు గల సోదరుడును, చతుర్థమందున్న మాతృపీడ పిత్రార్జిత భూవ్యయము, విద్యా విఘ్నమును, పంచమమందున్న సోదర నష్టము, సమాన లాభ వ్యయములను, షష్టమందున్న శత్రుభాధ, సప్తమమందున్న కళత్ర పీడయును, అష్టమముననున్న విశేష ధనవ్యయము, వ్యవహార చిక్కులును, నవమమున పితృపీడ, పితృ భాగ్యనష్టము, స్వార్జిత భాగ్యలాభము, సుయోగమును, దశమమందున్న తీర్థయాత్రలు, గౌరవ జీవనము, సుయోగమును, ఏకాదశ మందున్న సోదరుని వలన భాగ్యప్రాప్తియు, ద్వాదశమందు రవియున్న రవిదశలో శత్రుబాధ, ఋణము వ్యవహార చిక్కులు, దుర్జన సాంగత్యము, విశేష ధననష్టము గలుగును.

2. **చంద్రుడు:-** మిథునలగ్న జాతకునికి లగ్నమందు పూర్ణచంద్రుడున్న చంద్రదశలో బాగుగా యోచించును; ద్వితీయమునందున్న పూర్ణచంద్రుడైన మిక్కిలి ధనలాభమును, క్షీణచంద్రుడైన స్వల్పలాభమును; తృతీయమందు చంద్రుడున్న సోదరవృద్ధి, సామాన్య లాభవ్యయములును; చతుర్థమందున్న పూర్ణచంద్రుడైన విద్య, గృహనిర్మాణము, మాతృసౌఖ్యమును, యీ స్థానమందు బుధునితోగాని గురునితో గాని కలసియున్న ప్రసాద సౌఖ్యమును, శుక్రునితో గలసియున్న వాహన ముద్రాధి

కారక సౌఖ్యమును; పంచమమున పూర్ణచంద్రుడున్న విశేష స్త్రీ సంతానమును, ధన లాభమును షష్ఠమమున చంద్రుడున్న సంతాన విచారము, పిత్రార్జిత ధననష్టమును; సప్తమమున చంద్రుడున్న పూర్ణచంద్రుడైన యోగదశయు, శరీరపీడయును, పాప గ్రహ సంబంధమున్న మారకము జేయుటయును; అష్టమమున చంద్రుడున్న బాల్యమున బాలారిష్టమును, వానిదశ యందు యోగబలమును; నవమమందు పూర్ణ చంద్రుడున్న సంపూర్ణభాగ్యమును, విశేష ధన లాభమును; దశమందు చంద్రుడున్న సమస్త తీర్థయాత్రలు సేవించుటయును; ఏకాదశమందు పూర్ణచంద్రుడున్న ధన లాభమును; ద్వాదశమందు చంద్రుడున్న ధనలాభమును సత్కార్యములకు ధనవ్యయమును గలుగును.

3. **కుజుడు:-** మిథునలగ్న జాతకునికి లగ్నమందు కుజుడున్న కుజదశ యందు శరీరపీడ, రోగము, కపటస్వభావము, దయాహీనమును; ద్వితీయమందున్న గర్వ దరిద్రము, కళత్రనష్టమును, తృతీయమందున్న సోదర నష్టమును; చతుర్థ మందున విద్యావిఘ్నము, మాతృవిచారము, పితృభూనష్టము, వాహన సౌఖ్య హీనమును; పంచమమందున్న సంతాననష్టము, పుత్రశోకమును; షష్ఠమమందున్న ఋణము వలన భూలాభమును; సప్తమమందున్న కళత్రనష్టము, శరీరపీడయును; అష్టమ మందున్న ప్రాణభయము, వ్యవహార చిక్కులు, ధననష్టము, స్థానచలనము, కళత్రపీడ, ఋణము వలన భూలాభమును, పూర్వఖండమున యోగమును, ఉత్తర ఖండమున యోగభంగమును; నవమమందున్న పిత్రారిష్టము, పితృభాగ్య నష్టమును; దశమ మందున్న ఆచారహీనము, భూధనలాభము, ఉద్యోగ గర్వము, దయా హీనమును; ఏకాదశమంధున్న భూధనలాభము, యోగఫలమును; ద్వాదశమందున్న కుజుడు పాపగ్రహ సంబంధమున్న వాని దశయందు వ్యవహార చిక్కులు, కారా గృహప్రాప్తి, శత్రురోగ ఋణములు, కళత్రనష్టము, అవయవ లోపమును గలుగును.

4. **బుధుడు:-** మిథునలగ్న జాతకునికి లగ్నమందు బుధుడున్న బుధునిదశ యందు పాపగ్రహ సంబంధము లేనియెడల పూర్ణయోగమును పండిత సాంగత్యము, విద్యావినయము, దేహదారుఢ్యమును; ద్వితీయమందున్న మిక్కలి ధన లాభము, సభాపూజ్యత్వము; తృతీయమందున్న విశేష ధనవ్యయమును; చతుర్థ మందున్న పూర్ణయోగము, మాతృఆయుర్వృద్ధి, విద్యావృద్ధి, గురుసంబంధమున్న శాస్త్ర ప్రావీణ్యము, భూలాభమును; చంద్రునితో గాని గురునితోగాని సంబంధమున్న కీర్తి ప్రతిష్ఠలు, అశ్వాందోళికాది వాహన సౌఖ్యమును; పంచమమందున్న పూర్ణయోగము, సంతానవృద్ధియును; షష్ఠమమందన్న శత్రురోగ ఋణములును; సప్తమందున్న సుకళత్ర ప్రాప్తి, పాపగ్రహ సంబంధమున్న శరీరపీడయును; అష్టమమందున్న పిత్రా ర్జిత నష్టము, దేశసంచారము; నవమమందున్న పూర్ణభాగ్యమును, పితృభాగ్యమును, వాహన ముద్రాధికారమును; దశమందున్న తీర్థయాత్రలు, సత్కార్యముల వలన ధన క్షయమును; ఏకదశమందున్న ధనలాభమును, సోదర భాగ్యసౌఖ్యమును, ద్వాదశస్థాన మందున్న సత్కార్యములును, సత్కథాకాలక్షేపములను బుధదశ యందు గలుగును.

5. **గురుడు:-** మిథునలగ్న జాతకునకు లగ్నమునందు గురుడున్న గురుదశ యందు పూర్ణయోగమును, పేరుప్రతిష్ఠలు, దేహదారుఢ్యము, పరోప

కారమును; ద్వితీయమందున్న విశేష ధనలాభము, పాపభుక్తులయందు మారకము
ను; తృతీయ మందున్న బాల్యమందు బాలారిష్టమును; చతుర్థమందున్న మాతృ
సౌఖ్యము, విద్య, వాహనము, భూమి, బుధునితో గాని చంద్రునితోగాని కలసి
యున్న గొప్పపండితుడు ప్రాసాదసౌఖ్యము, తటాకారామ నిర్మాణములును; పంచమ
మందున్న పూర్ణయోగము, పుత్రసంతాన సౌఖ్యము, భూధనలాభమును; షష్టమ
మందున్న కళత్రపీడ, శత్రురోగ ఋణములును; సప్తమ స్థానమందున్న శరీర పీడ,
స్థూల సుకళత్రము, పాపగ్రహ సంబంధమున్న మారకమును; అష్టమమందున్న
దారా పుత్రాదిపీడ, ఉద్యోగ భంగమును; నవమమందున్న విశేష భాగ్యమును, పూర్ణ
యోగము, పిత్రాయుర్వృద్ధి, పిత్రార్జితమును; దశమమందున్న ఆచారము, యజ్ఞ
యాగాది క్రతువులు, వాహన ముద్రాధికార సౌఖ్యమును; ఏకాదశమందున్న విశేష
ధనలాభము, జ్యేష్టసోదర భాగ్యము ద్వాదశమందున్న ధనక్షయము, సద్వ్యయమును
గురుదశ యందు సంభవించును.

6. శుక్రుడు:- మిథునలగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశ యందు
పూర్ణయోగమును, బుద్ధి, యోగ్యత, కవిత్వమును; ద్వితీయమందున్న ధనలాభము,
సంగీత సాహిత్యము, మృదువాక్కును; తృతీయమందున్న స్వల్పయోగమును; చతుర్థ
మందున్న సంతాన విచారము, కళత్రపీడయును; పంచమమందున్న బహు స్త్రీ
సంతానమును; షష్టమమందున్న ఆర్జించిన ధనమంతయు వ్యయమగుట యును;
సప్తమమందున్న పూర్ణయోగమును, సుకళత్రము, కామోద్రేకము వలన చపలత్వము
ను; అష్టమము నందున్న దారాపుత్రాది సౌఖ్యహీనము, స్వల్పార్జన, విశేష ధన
వ్యయమును; నవమమందున్న పూర్ణభాగ్యము, విశేష పిత్రార్జిత స్వార్జిత ధనలాభము;
దశమమందున్న ఆయుర్భాగ్య సంతానము, రాజసన్మానము, వాహన ముద్రాధి
కారమును; ఏకాదశమందున్న విశేష ధనలాభము, పరోపకారము, పారమార్థిక
చింతయును యీ శుక్రదశ యందు గలుగును.

7. శని:- మిథునలగ్నమై లగ్నమున శనియున్న శనిదశలో శరీరపీడ,
వికృతరూపము, దుర్జన సాంగత్యము, కఠినహృదయమును; ద్వితీయమునందున్న
పిత్రార్జిత స్వార్జిత ఆస్తినష్టము, శరీరపీడ, మారక లక్షణములును తృతీయమందున్న
కొంత యోగమును, సోదరనష్టము గలుగుటయును చతుర్థమందున్న విద్యావిహీనత,
పిత్రార్జిత భూనష్టము, జీర్ణగృహము, మాతృపీడయును పంచమము నందున్న మధ్య
విశేష యోగము, పూర్ణాయుర్దాయము, పుత్రశోకము, యెదిగిన సంతాననష్టమును
షష్టమమందున్న మధ్యమధ్య యోగము చివర యోగభంగము సప్తమమునందున్న
దికళత్ర యోగము లేక ప్రథమ కళత్రము స్థూలమై వికృత రూపము పొంది
యుండటయును అష్టమమందున్న పితృభాగ్యము హరింపు పూర్ణాయుర్దాయమును
నవమమందున్న మంచియోగము, పితృపీడ, పిత్రార్జిత నష్టము దశమమందున్న
మంచి యోగము, స్వల్పాచారమును ఏకాదశమందున్న పిత్రార్జిత నష్టము, స్వల్ప
స్వార్జిత నష్టము అన్యాయ ధనార్జన ప్రయత్నభంగమును ద్వాదశమందున్న దుస్సహ

వాసము, విశేష ధనవ్యయము, కుజసంబంధమున్న కారాగృహప్రాప్తి, కఠినశిక్షయు శని దశలో సంభవించు చుండును.

8. **రాహువు:-** మిథునలగ్నమై లగ్నమున రాహుగ్రహమున్న. రాహుదశలో దీర్ఘమేహ రోగబాధ, శరీరపీడయును ద్వితీయమందున్న విశేష ధననష్టము, పాపగ్రహ సంబంధమున్న మారకమును తృతీయమందున్న పూర్ణయోగము, సోదరవృద్ధి, ధన లాభము, ఉద్యోగవృద్ధియును చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనము, మిశ్రమఫలమును పంచమమందున్న యోగము, సంతాననష్టమును, షష్టమమందున్న యోగము, నీచవృత్తి, ధనార్జనమును సప్తమమందున్న పూర్వ సువాసినీ సంగమము, పత్నిప్రీతి స్వల్పమును, శరీరపీడయును అష్టమమందున్న అపసవ్య కర్మలు, వ్యవహార చిక్కులు, ధననష్టము, శత్రుబాధ, విశేష ఋణమును, నవమమందున్న స్వల్పయోగము, బాల్యమందు బాలారిష్టము లేక పితారిష్టమును దశమమందున్న గొప్ప తీర్థయాత్రలు, మధ్యమధ్య యోగమును ఏకాదశమందున్న పూర్ణయోగము, అన్యాయ ధనార్జనము ద్వాదశమందున ధనార్జననష్టము, దర్వ్యా యము దుర్జన సహవాసమును రాహుదశలో సంభవించును.

9. **కేతువు:-** మిథునలగ్నమై లగ్నమున కేతువున్న కేతుదశలో కపట స్వభావము, శరీరసౌఖ్యహీనము, బాల్యమునబాలారిష్టమును, ద్వితీయము నందున్న ధన నష్టము, శరీరపీడ, పారమార్థిక చింతయును తృతీయమందున్న పూర్ణయోగము భూలాభము, ధనలాభమును చతుర్థమందున్న మాతృసౌఖ్యహీనము, పితృభూ నష్టమును పంచమమందున్న సంతాన సుఖహీనము, సంతాననష్టము, సమానలాభ వ్యయములు షష్టమమందున్న పూర్ణయోగము, శత్రునష్టము, జ్ఞాతులవలన ధన లాభమును సప్తమమందున్న కళత్రసౌఖ్య హీనము, శరీరపీడయును, అష్టమ మందున్న వ్యవహార చిక్కులు శరీరాయాసము శత్రువృద్ధి, ధనవ్యయము, ఋణవృద్ధి యును, నవమ మందున్న పితృసౌఖ్యహీనము, స్వల్పయోగమును. దశమమందున్న మంచి పూజ్యకార్యములు, తీర్థయాత్రలును, ఏకాదశమందున్న పూర్ణయోగము, అన్యాయముగా ధనార్జనము, వ్యయస్థాన మందున్న సత్కథాకలక్షేపము, ధననష్టము మొదలగునవి కేతుదశలో సంభవించుచుండును.

## 4. కర్కాటకాది గ్రహదశా ఫలములు

కర్కాటక లగ్నమున కుజుడు గురునితోకలసి యేస్థానమందున్నను మిక్కిలి రాజయోగము గలుగును. షష్టాష్టమ వ్యయస్థానములయందుండుట కంటె కేంద్ర కోణముల యందున్న అఖండ యోగము గలుగును. చంద్రుడు వీనితో గూడి యున్న మిక్కిలి రాజయోగము గలుగును.

రవిచంద్రులు కలసి కేంద్రకోణముల యందున్న ధనజాతకమగును. రవి గురులు కలసియున్న విశేష ధనజాతకమగును. రవి కుజులు కలసిన రెండుదశలు పూర్తిగా యోగించును. రవి బుధులు గలసిన బుధదశ యోగించును, రవి దశ యోగించదు. శని శుక్రులు కలసి యున్న శుక్రదశ యోగించును. రవి దశ స్వల్పముగ యోగించును. రవి శనులు కలసిన రెండు దశలలో మధ్య మధ్య యోగ భంగము గలుగును. శనిలో పాపగ్రహ భుక్తులయందు మారకముగూడ గలుగును.

చంద్ర కుజాలు కలసిన భూలాభము, ధనలాభమును, చంద్ర బుధులు కలసిన చంద్రదశలో విశేష ధనలాభము, బుధదశలో స్వల్ప ధనమును, చంద్ర గురులు కలసియున్న రెండు దశలు సంపూర్ణ యోగమును, చంద్ర శుక్రులు కలసి యున్న శుక్రదశ పూర్ణయోగము చంద్రదశ స్వల్పయోగము, చంద్ర శనులు కలసి యున్న శనిదశ పూర్ణయోగము, చంద్రదశ యందు శరీరపీడ, దననష్టము గలుగును.

కుజ బుధులు కలసిన యెడల బుధదశ యోగమును, కుజదశలో యోగభంగమును, కుజ గురులు కలసిన రెండుదశలు పూర్ణయోగమును, కుజ గురులు కలసిన రెండు దశలును యే స్థానమైనను రాజయోగము గలుగును. కుజ శుక్రులు కలసిన శుక్రదశ యోగించును. గాని కళత్రమునకు మధ్య మధ్య శరీరపీడగలుగును. కుజదశలో యోగము తగ్గు హెచ్చులుగా యుండును. కుజ శనులు కలసినశని దశ యోగించును. కుజదశలో సంతాన విచారము, భూవ్యయము మొదలగు నష్టములు గలుగును. బుధ గురులు కలసిన బుధ దశ మోగించును, గురుదశలో ధనార్జన ధన నష్టము గలుగు చుండును. బుధ శుక్రులు కలసిన బుధదశ యందుస్వల్ప యోగము, శుక్ర దశ యోగించదు. శుక్రదశలో ధనవ్యయము, బంధునష్టము, వ్యవహార చిక్కులు గలుగును. బుధ శనులు కలసిన రెండు దశలయందు యోగభంగము గలుగును. బుధ శనులు అష్టమమందుగాని వ్యయమందుగాని కలసిన వాని దశలో విపరీత రాజయోగము గలుగును. ఇతర స్థానములయందు కలసిన కష్టనష్టములు, వ్యవహార చిక్కులు గలుగును.

గురు శుక్రులు కలసిన శుక్రదశ యోగించును. గురుదశలో యోగము హెచ్చుతగ్గులుగా యుండును. గురు శనులు కలసిన శనిదశ బాగుగా యోగించును. గురుదశలో పూర్వమున్న యోగము గూడ చెడిపోవును. శుక్ర శనులు కలసిన రెండు దశలుగూడ యోగించవు. అష్టకష్టములకు గురియై దరిద్ర మనుభవించును. ఈ జాతకలగ్నమునకు కుజ గురులు పూర్ణయోగకారకులును, రవి చంద్రులు సామాన్య యోగ కారకులును అగుదురు. ఈ లగ్నమునకు బుధుడును, శనియు, మిక్కిలి పాపులగు చున్నారు. ఈ లగ్నమునకు యీ గ్రహదశలు యోగింపవు. వీనిలో యే గ్రహమైనను మారకస్థానమందున్న వాని దశలో మారకము గలుగును. గురుడు షష్టాధిపతి యైనను రెండవ యాధిపత్యము వలన భాగ్యాధిపతియై శుభఫలమును, పాప గ్రహములతో కలసియున్న పాపఫలమును, నొకప్పుడు మారకమును గూడ జేయ గలుగుదురు.

1. **సూర్యుడు:-** కర్కాటకలగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో యోగము, శరీరపీడయును., ద్వితీయమందున్న ధన లాభము, ధనవ్యయమును., తృతీయమందున్న ఒక సోదరుడును, స్వల్పయోగమును., చతుర్థమందున్న సంతాన విచారము, దనవ్యయము, పిత్రారిష్టము, పితృ బాగ్య నష్టమును, పంచమము నందున్న పూర్ణయోగము, సంతాన విచారమును, షష్టమమునందున్న ఋణములు ను., సప్తమమునందున్న యోగము, స్వల్ప శరీరపీడ., అష్టమమందున్న పిత్రార్జిత స్వార్జితనష్టము., నవమమందున్న పూర్ణయోగము, పితృసౌఖ్యహీనమును., దశమ మందున్న విశేషధనలాభము, ఉద్యోగము, ముద్రాధికారమును., ఏకాదశ మందున్న పూర్ణయోగము, స్త్రీ సంబంధమైన ధనలాభమును., ద్వాదశమందున్న పితృ ధన నష్టము,

పాపగ్రహ సంబంధమున్న దురభ్యాసము వలన ధననష్టము. రవిదశ బాల్యమందున్న బాలారిష్టము సంభవించును.

**2. చంద్రుడు:-** కర్కాటకము లగ్నమై లగ్నమున చంద్రుడున్న చంద్రదశయందు పూర్ణచంద్రుడైన పూర్ణయోగమును. శరీరపీడయు. ద్వితీయమందున్న ధనలాభమును. పూర్ణచంద్రుడైన ఒకప్పుడు మాకరమును. తృతీయమందున్న యే చంద్రుడైనను యోగించక పోవుటయును. చతుర్థస్థానమున పూర్ణచంద్రుడైన మాతృసౌఖ్యము. విద్య. వాహనము. ప్రాసాద భూసౌఖ్యములును. పంచమమందున్న శత్రురోగ ఋణములును. షష్టమమందున్న చంద్రుడు పూర్ణచంద్రుడైన యోగించక పోవుటయును. సప్తమమందున్న సుకళత్రమును. అష్టమమందున్న యే చంద్రుడు యోగించక పోవుటయును. వానిదశలో బాలారిష్టము గలుగుటయును. నవమమందున్న పూర్ణచంద్రుడైన సుయోగమును. పిత్రార్జిత స్వార్జితలాభమును. దశమమందున్న పూర్ణచంద్రుడైన పూర్ణయోగమును. వ్యవసాయ ·జీవనమును. ఏకాదశమందున్న పూర్ణచంద్రుడైన విశేష ధనలాభము. పేరుప్రతిష్టలు. ఉద్యోగము. వాహనముద్రాధికార సౌఖ్యమును. ద్వాదశమందున్న పూర్ణచంద్రుడైన సత్కార్యములకు ధనవ్యయము గలుగును.

**3. కుజుడు:-** కర్కాటక లగ్నమందులగ్నమున కుజుడున్న కుజదశలో శరీరపీడ. కురూపి. దుస్సహవాసమును. ద్వితీయమందున్న సంతాన సౌఖ్యహీనము. కళత్ర పీడయును. తృతీయమందున్న సోదర నష్టమును. చతుర్థమందున్న విద్యావిఘ్నము. మాతృపీడయును. పంచమమందున్న పూర్ణయోగము. వాహన ముద్రాధికారము. విశేష భూలాభము. సంతాన నష్టమును. షష్టమ మందున్న శత్రురోగ ఋణములును. సప్తమమందున్న పూర్ణయోగము. కళత్రనష్టమును. అష్టమమందున్న ద్వికళత్ర యోగమును. నవమమందున్న పితృపీడయును. దశమమందున్న పూర్ణయోగమును. విశేష భూలాభమును. ఏకాదశమందున్న భూలాభము. ధనలాభము. అన్యాయార్జనమును. ద్వాదశమందున్న కష్టయోగమును. దుర్వ్యయమును. కుజుడు శనితో కలసియున్న కారాగృహ ప్రాప్తియు వాని దశలో గలుగును.

**4. బుధుడు:-** కర్కాటక లగ్నమునకు లగ్నమందు బుధుడున్న బుధదశలో స్వల్పయోగము. ఖ్యాతియును. ద్వితీయమందున్న ధనలాభము. ధనవ్యయమును.. తృతీయమందున్న స్వల్పయోగము. సోదరుల వల్ల భాగ్యమును.. చతుర్థ మందున్న మాతృసౌఖ్యము. విద్య. భూమి. వాహనమును.. పంచమమందున్న స్వల్పయోగము. విశేష స్త్రీ సంతానము.. షష్టమమందున్న శత్రురోగ ఋణములును.. సప్తమమందున్న సుకళత్రము. శరీరపీడ. బాల్యమందైన యీ ధశయందు మారకమును.,అష్టమమునందున్న ధనవ్యయము. శరీరపీడ. శత్రువృద్ధియును.. నవమమందున్న బుధదశలో శుభగ్రహ భుక్తులయందు యోగభంగమును.. దశమ మందున్న పూర్ణయోగము. ఆచారమును.. ఏకాదశమందున్న లోభము. న్యాయ ధనార్జనమును.. ద్వాదశమందున్న సత్కార్యములయందు దనవ్యయము బుధదశలో గలుగును.

**5. గురుడు:-** కర్కాటకము లగ్నమై లగ్నమందు గురుడున్న గురుదశలో పూర్ణ యోగమును.. ద్వితీయమందున్న పూర్ణయోగమును. ధనలాభమును.. తృతీయమందున్న సోదరవృద్ధి. సామాన్య యోగమును.. చతుర్థమందున్న విద్య.భూమి.

వాహనము., పంచమమునందున్న పుత్రవృద్ధి, భూధనమును., షష్టమమున యోగ భంగమును., సప్తమమున పితృ భాగ్యనాశమును, అష్టమమునందున్న స్వల్ప పితృ బాగ్యము, స్వార్జితమును, నవమమందున్న సంపూర్ణ భాగ్యము, పిత్రార్జిత లాభమును, దశమమందున్న రాజయోగము, ఆచారము, యజ్ఞయాగాది క్రతువులు ను., ఏకాదశమందున్న విశేష ధనలాభము, న్యాయార్జనమును, ద్వాదశమందున్న ధర్మకార్యములయందు పిత్రార్జిత వ్యయమును గురుదశలో సంభవించును.

6. శుక్రుడు:- కర్కాటకము లగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశలో విద్య, కవిత్వము, బోగమును, ద్వితీయ మందున్న సంగీత సాహిత్య ప్రవేశము, తృతీయమందున్న కష్టములు, ధననష్టమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనము, పంచమమునందున్న విశేష స్త్రీ సంతానము, భూలాభము, ధనలాభము, షష్టమమందున్న శత్రురోగ ఋణములును, సప్తమమునందున్న సు కళత్ర ప్రాప్తి, శరీరపీడ, అష్టమమందున్న పితృ భాగ్యవ్యయమును, నవమమందున్న సంపూర్ణభాగ్యము, పితృభాగ్యమును, దశమమందున్న ధనలాభము, వాహన ముద్రాధి కారమును, ఏకాదశమందున్న ధనలాభము, న్యాయార్జితమును, ద్వాదశమందున్న శుభకార్యములందు ధనవ్యయము యీశుక్రదశయందు గలుగును.

7. శని:- కర్కాటకము లగ్నమై లగ్నమందు శనియున్న శనిదశ యందు శరీరపీడ, దుష్టస్వభావమును, ద్వితీయమందున్న విశేష ధనవ్యయము, కుటుంబ సౌఖ్యహీనము, కళత్రపీడయును, తృతీయమందున్న సోదరనష్టమును, చతుర్థ మందున్న పూర్వఖండమున యోగమును ఉత్తర ఖండమున యోగభంగమును, పంచమమందున్న స్వల్పయోగము, విశేష సంతాన లాభమును., షష్టమమందున్న స్వల్పయోగము, శత్రురోగ ఋణములును సప్తమము నందున్న స్వల్పయోగము శరీరపీడయును, అష్టమమందున్న నష్టకష్టములు, శత్రురోగ ఋణములును, నవమ మందున్న పిత్రారిష్టము, పితృ భాగ్యవ్యయము, శుభ భుక్తులయందు యీదశలో యోగమును, దశమ మందున్న కళత్ర విచారము, ఏకాదశమందు పూర్ణయోగము, విశేష ధనార్జనమును, ద్వాదశమందున్న దుర్జన సహవాసము, పిత్రార్జితవ్యయము, స్వార్జిత వ్యయము శనిదశ యందు సంభవించును.

8. రాహువు :- కర్కాటకము లగ్నమై లగ్నమందు రాహువున్న రాహుదశలో దయాదాక్షిణ్యహీనము, కఠిన హృదయమును, ద్వితీయమందున్న ధన వ్యయమును, తృతీయమందున్న పూర్ణయోగము, భూలాభము, ధనలాభమును, చతుర్థమందున్న మాతృపీడ, విద్య, భూమి వాహననశింపును, పంచమమందున్న సంతాన నష్టము, షష్టమమందున్న శతృరోగ ఋణములు, సప్తమమందున్న కళత్ర విచారము, శరీర పీడయును, అష్టమమందున్న శత్రురోగ ఋణములు, కష్టనష్టము లును, నవమమందున్న పూర్ణయోగము, పితృపీడయును, దశమమందున్న భూ లాభము, ధనలాభమును, ఏకాదశమందున్న వాహన ముద్రాధికారము, ద్వాదశ మందున్న దుర్జన సహవాసము, దనవ్యయము, ఈ రాహువు శనితో గాని కుజునితో గాని కలసి యున్న వాని దశయందు కారాగృహ వాసము సంభవించును.

9. కేతువు:- కర్కాటక లగ్నమై లగ్నమందు కేతువున్న కేతుదశలో బాల్యమందైన బాలారిష్టమును, ద్వితీయమందున్న ధనవ్యయము, శరీరపీడ, తృతీయ

మందున్న పూర్ణయోగము, వితంతు సోదరియును, చతుర్థమందున్న స్వల్ప విద్య, మాతృసౌఖ్యము, పిత్రార్జిత భూనష్టము, పంచమమందున్న యోగము, స్వల్ప సంతాన సౌఖ్యమును, షష్టమమందున్న దశాయోగము, కష్టములు, తుదకుజయము, శత్రువృద్ధి, శత్రుజయమును, సప్తమమందున్న శరీరపీడ, కళత్రనష్టమును, అష్టమ మందున్న శరీరపీడ, శత్రువృద్ధి ఋణవృద్ధి, వ్యవహార చిక్కులును, నవమమందున్న స్వల్ప పితృభాగ్యము, విశేష స్వార్జితమును, దశమమందున్న అనాచార ప్రవర్తనయు, ఏకాదశమందున్న అన్యాయ ధనార్జనము, ద్వాదశమందున్న పారమార్థిక చింతయును కేతుదశ యందు సంభవించును.

## 5. సింహాది గ్రహదశా ఫలములు

సింహలగ్నమున కుజుడు ప్రత్యేకముగా యున్నను వాహన భాగ్యాధిపతి యగుట వలన వానిదశ యందు సంపూర్ణముగా యోగించును. శుక్రుడు కలసి యున్న శుక్ర కుజ దశలు రెండును యోగించును. కాని శుక్రుడు ప్రత్యేకముగా యున్న శుక్రదశ అంతగా యోగించదు. ఈ లగ్నమందు రవి గూడ కుజునివలె యోగ కారకుడగును. రవి కుజులు కలసియున్నను లేక వేరువేరుగానున్నను యీ రెండుదశలు యోగించును. కాని తక్కిన గ్రహములు స్వతంత్రముగా యోగింపవు. ఈ లగ్నమందు బుధ శుక్రులు మిక్కిలి పాపులగుటచేత ప్రత్యేకముగా నున్నప్పుడు యోగించరు. కాని ఇతర కారక గ్రహములతో కలసి యున్నపుడు యోగించును. గురుడు యీ లగ్నమందు స్వతంత్రముగా యోగించును. రవితో గాని కుజునితో గాని కలసిన సంపూర్ణముగా యోగించును. శని షష్ట సప్తమాధిపతి యగుటచేత యోగించదు. చంద్రుడు వ్యయస్థానాధిపతి యగుటచేత యోగించదు. రవిచంద్రులు కలసియున్న రవిదశ యోగించదు. చంద్రదశ స్వల్పముగా యోగించును. రవి కుజులు కలసిన రెండు దశలు పూర్ణముగా యోగించును. రవి బుధులు కలసిన యెడల రవిదశకంటె బుధదశ బాగుగా యోగించును. రవిదశ కూడ కొంతవరకు యోగించును. గాని పాపభుక్తుల యందు జాతకునకు శరీరపీడ సంభవించును. రవి గురులు కలసియున్న గురుదశ పూర్తిగా యోగించును. రవి దశ కొంతవరకు యోగించి పిమ్మట యోగభంగము గలుగును. రవి శనులు కలసియున్న శనిదశ స్వల్పముగా అప్పడప్పుడు యోగించును. రవిదశలో పూర్తిగా యోగభంగము గలుగును. చంద్ర కుజులు కలసిన చంద్రదశ పూర్తిగా యోగించును. కుజదశ కొంత యోగించి పిమ్మట యోగభంగము గలుగును.

చంద్ర బుధులు కలసిన చంద్రదశ స్వల్పముగా యోగించును. బుధదశ యోగించదు. మారకస్థానమందున్న మారకము గూడ జేయును. చంద్ర గురులు కలసి యున్న చంద్రదశ స్వల్పముగా యోగించును. గురుదశలో మధ్య మధ్య యోగ భంగము గలుగును. చంద్ర శుక్రులు కలసిన చంద్రదశ బాగుగా యోగించును. శుక్రదశ యోగించదు. కుజ బుధులు కలసిన రెండు దశలు బాగుగా యోగించును. కుజ గురులు కలసిన గురుదశ పూర్తిగా యోగించును. కుజదశ సామాన్యముగా యోగించును. కుజ శుక్రులు కలసిన శుక్రదశ పూర్ణముగా యోగించును. స్త్రీ సంబంధమైన భాగ్యము గలుగును. కుజ శనులు కలసిన శనిదశ యోగించును గాని కళత్రసౌఖ్యముండదు. బుధ గురులు కలసిన గురుదశ పూర్తిగా

యోగించును. బుధ దశలో యోగము హెచ్చు తగ్గులుగా యుండును. బుధ శుక్రులు కలసిన రెండు దశలు యోగించును. బుధ శనులు కలసిన శనిదశ కొంతవరకు యోగించును. బుధదశలో అప్పుడపుడు శరీరపీడ, దననష్టము గలుగును. గురు శుక్రులు కలసిన గురుదశ బాగుగాయోగించును. శుక్రదశలో మధ్య మధ్యను యోగ భంగము గలుగును. గురుశనులు కలసిన యేదశ యోగించదు. విశేష సంతాన నష్టమగును. శని శుక్రులు కలసిన పూర్తిగా యోగించును. శుక్రదశలో మధ్య మధ్యను యోగభంగము గలుగును. ఈ లగ్నమందు రవి, కుజ, బుధులు యోగ కారకులును, శని బుధ శుక్రులు మారకము నిచ్చు గ్రహములు అగును.

1. **సూర్యుడు:-** సింహలగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో ద్వికళత్ర యోగము గలుగును. లేని యెడల జారత్వము గలుగును. ద్వితీయమందు రవి యున్న రవిదశలో ధనవ్యయము, స్వల్ప యోగమును, తృతీయమందున్న శరీరపీడ, కపట స్వభావమును, చతుర్థమందున్న పూర్ణయోగము., భూమి, విద్య, ధన లాభము., పేరు ప్రతిష్టలును, పంచమమందున్న బాగ్యలాభము, స్వల్ప సంతానమును షష్టమమందున్న శత్రురోగ ఋణములును, సప్తమమందున్న కళత్ర పీడ, స్వల్పయోగమును, అష్టమమందున్న పిత్రార్జితస్వార్జితనష్టము, వ్యవహార చిక్కులు నవమమందున్న పూర్ణయోగము, పితృసౌఖ్యహీనము, దశమమందున్న వాహన ముద్రాధికారము, పూర్ణయోగమును, ఏకాదశమందున్న విశేషదనలాభము, పితృభాగ్యమును, ద్వాదశమందున్న బాల్యమందైన బాలారిష్టము రవిదశలో సంభవిం చును. సింహలగ్నమైన రవి కేంద్రకోణముల యందెక్కడున్నను యోగము నిచ్చును.

2. **చంద్రుడు:-** సింహలగ్నమై లగ్నమందు చంద్రుడున్న పూర్ణచంద్రుడైన యోగించును. పేరు ప్రతిష్టలు రూపలక్షణములు గలవాడగును. క్షీణచంద్రుడైన దీనికి వ్యతిరేకముగా నుండును. ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన పూర్ణ యోగమును, సోదరీభాగ్య లాభమును, తృతీయమందున్న పూర్ణచంద్రుడైన పూర్ణ యోగమును, సోదరీ భాగ్యలాభమును, చతుర్థమందున్న ద్వికళత్ర యోగమును, పంచమము నందున్న పూర్ణచంద్రుడైన సంతానసౌఖ్యము, పూర్ణయోగమును, షష్టమునందున్న శత్రురోగ ఋణములును, పూర్ణచంద్రుడైన శత్రు జయమును, క్షీణ చంద్రుడైన శత్రువుల వలన పరాభవమును, సప్తమమందున్న పూర్ణచంద్రుడైన సుకళత్రమును, క్షీణచంద్రుడై ద్వికళత్రయోగమును, అష్టమము యే చంద్రుడైనను యోగించక పోవుటయు, బాల్యమందైన బాలారిష్టమును., నవమమందున్న పూర్ణ చంద్రుడైన పూర్ణయోగమును, పితృభాగ్యలాభమును, దశమమందున్న పూర్ణ చంద్రుడైన విశేషభూలాభము, ఆచారము, ధనలాభమును, ఏకాదశ మందున్న పూర్ణ చంద్రుడైన దనలాభము, న్యాయార్జితమును, లోభత్వమును, ద్వాదశమందున్న పూర్ణ చంద్రుడైన సత్కార్యముల వలన ధనవ్యయము, క్షీణచంద్రుడైన దుస్సాంగత్యము, దుర్వ్యయము, చంద్రదశలో సంభవించును.

3. **కుజుడు:-** సింహలగ్నమై లగ్నమున కుజుడున్న కుజదశలో శరీర పీడయును, ద్వితీయమందున్న ద్వికళత్రయోగమును, తృతీయమందున్న సోదర నష్టమును, చతుర్థమందున్న పూర్ణయోగమును, మాతృపీడ, విద్యావిఘ్నము, విశేష భూలాభమును, పంచమమందున్న పూర్ణయోగము, సంతాన విచారము, షష్టమ మందున్న శత్రువులు, జ్ఞాతుల వల్ల భాగ్యలాభమును, సప్తమమందున్న ద్వికళత్ర యోగము, అష్టమమందున్న పిత్రార్జితనష్టము, కళత్ర విచారము, సంతాన విచారమును, నవమమందున్న భూలాభము, పితృపీడయును, దశమమందున్న పూర్ణ యోగము, వాహన ముద్రాధికారమును, ఏకాదశమందున్న భూధనలాభము, అన్యాయార్జితమును, ద్వాదశమందున్న మిక్కిలి దరిద్రమును సంభవించును.

4. **బుధుడు:-** సింహలగ్నమై లగ్నమున బుధుడున్న బుధదశలో ధనము, విద్య, పేరు ప్రతిష్టలును,, ద్వితీయమందున్న ధనలాభము, వాచాలత్వము, తృతీయ మందున్న స్వల్పయోగము, సోదరీసౌఖ్యమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము విద్య, భూమి, వాహన లాభమును, పంచమమందున్న పూర్ణయోగము, స్త్రీ సంతానము, షష్టమమందున్న శత్రుబాధ, ధనవ్యయము, సప్తమమందున్న శరీరపీడయును అష్టమమందున్న ఋణబాధయును, నవమ మందున్న శత్రుజయము, ధన లాభమును, దశమమందున్న ధనలాభము, ఖ్యాతియును, ఏకాదశమందున్న కార్యభంగమును, ద్వాదశమందున్న ధనవ్యయమును బుధ దశయందు సంభవించును.

5. **గురుడు:-** సింహలగ్నమై లగ్నమున గురుడున్న గురుదశలో మిశ్రమ ఫలమును, ద్వితీయమందున్న నొకప్పుడు ధనము, నొకప్పుడు ఋణము, విద్యా లాభమును, తృతీయమందున్న సోదరవృద్ధి, సామాన్య యోగమును, చతుర్థమందున్న భూ లాభము తిరిగి భూనష్టము, పాండిత్యములేని విద్యయును, పంచమమందున్న కష్టము పై పుత్రసంతానము నిలుచుటయును, షష్టమమందున్న అష్ట కష్టములును, సప్తమ మందున్న సుకళత్రము, కళత్రపీడయును, అష్టమ మందున్న మిశ్రమ ఫలము, కుటుంబ వృద్ధియును, నవమమందున్న మంచియోగము, సంపూర్ణ ఆయు ర్భాగ్యములును, దశమమందున్న మంచి సత్కార్యములు, కీర్తి ప్రతిష్టలును, ఏకాదశ మందున్న న్యాయధనార్జనమును, ద్వాదశమందున్న మంచి తీర్థ యాత్రలు, స్వల్ప ఆదాయము, హెచ్చు వ్యయమును గురుదశయందు సంభవించును.

6. **శుక్రుడు:-** సింహలగ్నమై లగ్నమున శుక్రుడున్న శుక్రదశలో వంశ మందు పేరుప్రతిష్టలు, పూర్ణయోగమును, ద్వితీయమందున్న కుటుంబ నష్టము, యోగభంగము, తృతీయమందున్న పూర్ణయోగము, సంతానలాభము, దీర్ఘాయుష్యమును, చతుర్థమందున్న విద్య, వాహనసౌఖ్యము, భూలాభము, పరస్త్రీ లోలత్వమును పంచమ మందున్న స్త్రీసంతానాభివృద్ధి, ఖ్యాతి, పూర్ణయోగమును, షష్టమమందున్న ఋణ బాధలును, సప్తమమందున్న సామాన్య యోగము, శరీరపీడయును, అష్టమ మందున్న సమస్తసౌఖ్యమును, నవమమందున్న పితృభాగ్యము సామాన్య యోగమును, దశమమందున్న మిశ్రమఫలమును, ఏకాదశమందున్న పూర్ణయోగము, విశేష ధనలాభమును, ద్వాదశమందున్న ధనలాభము సత్కార్యములకు ధన వ్యయమును శుక్రదశయందు గలుగును.

7. శని:- సింహలగ్నమై లగ్నమందు శని యున్న శనిదశలో శరీరపీడ, మందబుద్ధి, కూరూపిగా నుండుటయు, ద్వితీయమందున్న ధనహీనము, సంతాన విచారము, కళత్రపీడ, నొకప్పుడు మారకమును, తృతీయమందున్న జ్ఞాతివృద్ధి, సోదర నష్టము, సుకళత్రము, ఋణబాధయును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, స్వల్ప భూలాభమును, పంచమ మందున్న సామాన్య యోగము, విశేష సంతాన నష్టమును, షష్ఠమమందున్న పూర్ణయోగము, శత్రు ఆస్తిలాభమును, సప్తమ మందున్న స్థూలకళత్రము, మిశ్రమ ఫలమును, అష్టమమందున్న శరీరపీడ, శత్రురోగ ఋణములును, నవమమందున్న కళత్ర విచారము, దశమమందున్న పూర్ణ యోగము, అనాచారములును, ఏకాదశమందున్న భూలాభము, ధనలాభమును, ద్వాదశమందున్న అనేక కష్టనష్టములు, పాపగ్రహ సంబంధమున్న కారాగృహ ప్రాప్తియును శని దశలో సంభవించును.

8. రాహువు:- సింహలగ్నమందు రాహువున్న రాహుదశలో కుటిల స్వభావము, శరీర సౌఖ్యహీనము, పట్టుదలయును, ద్వితీయమందున్న శరీరపీడ, ధన హీనము, కష్టములును, తృతీయమందున్న పూర్ణయోగము, భూలాభము, ధనలాభము, చతుర్థమందున్న మాతృసౌఖ్యహీనము, విద్యా విఘ్నము, భూవ్యయమును, పంచమ మందున్న సంతాననష్టము, పూర్ణ యోగము, షష్ఠమమందున్న వారసత్వపు ఆస్తి లాభము, శత్రుజయము, వ్యవహార జయమును, సప్తమమందున్న కళత్రనష్టము, శరీర పీడయును, అష్టమమందున్న శత్రురోగ ఋణములును, నవమమందున్న భూ లాభము, ధనలాభము, కుటుంబ స్వల్పసౌఖ్యమును, దశమమందున్న పూర్ణయోగము, ధనలాభము ఏకాదశమందున్న ధనలాభము, అన్యాయార్జనమును, ద్వాదశ మందున్న యోగభంగము, పిత్రార్జిత నష్టమును రాహుదశలో సంభవించును.

9. కేతువు:- సింహలగ్నమై కేతువున్న కేతుదశలో బాల్యమందైన బాలా రిష్టము, ద్వితీయమందున్న శరీరపీడ, ధనవ్యయమును, తృతీయ మందున్న పూర్ణ యోగము, భూలాభమును, ధనలాభమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య స్వల్పభూమి, వాహన సౌఖ్యమును, పంచమమందున్న సంతాన సౌఖ్యహీనము, సామాన్య యోగమును, షష్ఠమమందున్న యోగ భంగము, అష్టకష్టములును, సప్తమ మందున్న శరీరపీడ, కళత్ర సౌఖ్య హీనమును, అష్టమమందున్న యోగభంగము, కష్టములును, నవమమందన్న పూర్ణయోగము, ధనలాభము, భూలాభమును, దశమ మందున్న అనాచారము, స్వల్పయోగము, ఏకాదశమందున్న పూర్ణయోగము, పేరుప్రతిష్ట లును, ద్వాదశమందున్న తీర్థయాత్రలు, సత్కార్యములునుకేతుదశలో సంభవించును.

## 6. కన్యాది గ్రహదశాఫలములు

గురు శుక్రులు కన్యాలగ్నమున యే స్థానమందు కలసినను లేక పరివర్త నముగా నున్నను ఆ రెండు దశలు పూర్ణముగా యోగించును. గురుడును యీ గ్రహములతో కలసియున్న జాతకుడు మిక్కిలి విద్యా వంతుడును, దేశప్రఖ్యాతి గలవాడు నగును. రవిచంద్రులు కలసియున్న రవిదశ యోగించును. చంద్రదశ యోగించదు. రవికుజులు కలసియున్న షష్ఠాష్టమ వ్యయస్థానముల యందు విశేష యోగమును, మిగిలిన స్థానముల యందు సామాన్యయోగము నిచ్చెదరు. రవి బుధులు కలసియున్న రవిదశ పూర్తిగా యోగించును. బుధదశ సామాన్యముగా

యోగించును. రవిగురులు కలసియున్న రవిదశ మంచియోగమును గురుదశలో ధన వ్యయము గలుగును. రవిశుక్రులు కలసిన యెడల శుక్రదశలో యోగభంగమును రవి దశలో రాజయోగమును గలుగును. రవిశనులు కలసిన రెండుదశలు యోగించును. చంద్రకుజులు కలసిన కుజదశ సామాన్య యోగమును చంద్రదశలో మిక్కిలి కష్ట నష్టములును గలుగును. చంద్రబుధులు కలసిన యెడల రెండుదశలు బాగుగా యోగించును.

కన్యాలగ్నము నందు చంద్రగురులు కలసిన ఆయుర్భాగ్యములును పూర్ణముగా నుండును. రెండుదశలు యోగించును. చంద్రశుక్రులు కలసిన చంద్ర దశలో అఖండ రాజయోగమును, శుక్రదశలో సామాన్యయోగము గలుగును. చంద్రశనులు కలసిన రెండు దశలు సామాన్యయోగము నిచ్చును. కుజబుధులు కలసిన కుజదశలో రాజయోగమును బుధదశలో యోగభంగము గలుగును. కుజ గురులు కలసిన కుజదశలో విశేషయోగమును గురుదశలో యోగభంగము గలుగును. కుజశుక్రులు కలసిన కుజదశలో విశేషభాగ్యమును శుక్రదశలో కష్టములనుభవించును. కుజ శనులు కలసిన యోగభంగము గలుగును. రెండుదశలలో అవమానము గలుగును. బుధగురులు కలసిన రెండుదశలు యోగించును. జాతకుడు రూప లక్షణములు ఆయుర్భాగ్యములు గలవాడును, పండితుడును అగును. బుధశుక్రులు కలసిన అఖండ రాజయోగము నిచ్చును. రెండుదశలు పూర్తిగా యోగించును. బుధశనులు కలసిన శనిదశలో విశేషయోగమును బుధదశలో మధ్యమధ్య యోగ భంగము గలుగును. గురుశుక్రులు కలసిన రెండుదశలు గూడబాగుగా యోగించును. శుక్రదశ కంటె గురుదశ విశేషయోగము నిచ్చును. గురుశనులు గలసిన యెడల రెండు దశలు మిశ్రమఫలము నిచ్చును. శుక్రశనులు కలిసిన శనిదశ పూర్తిగా యోగించును. శుక్రదశ మిశ్రమఫలము నిచ్చును.

**1. సూర్యుడు:-** కన్యాలగ్నమై లగ్నమున రవియున్న రవిదశలో స్వల్పముగా యోగించుటయును, ద్వితీయ మందున్న అన్యాయార్జనము, దుర్వ్యయమును, తృతీయమందున్న స్వల్పయోగమును, చతుర్థ మందున్న మాతృపీడ, పిత్రార్జిత భూ నష్టమును, పంచమ మందున్న యేక పుత్ర సంతానము, పూర్ణయోగమును, షష్ఠమ మందున్న శత్రుఆస్తి లాభము, పూర్ణయోగమును, సప్తమ మందున్న కళత్రపీడ, ధన వ్యయమును; అష్టమ మందున్న మంచి సత్కారములు, ఖ్యాతియును, నవమ మందున్న పుత్ర విచారము, లోభత్వమును, దశమమందున్న తీర్థయాత్రలు పూర్ణ యోగమును, ఏకాదశమమందున్న అన్యాయార్జితము, మంచియోగమును; ద్వాదశమం దున్న దుష్కార్యములు, ధనవ్యయమును రవిదశయందు సంభవించును.

ఈ రవి సామాన్యముగా యే స్థానమునందైనను ఒంటరిగా యున్న సామాన్యయోగము నిచ్చును. ఇంకను ఏ స్థానము నందుండునో ఆ స్థానాధిపతి యొక్క ఫలమును, యేగ్రహముతో కలసియుండునో నాగ్రహము యొక్క ఫలము నిచ్చును.

**2. చంద్రుడు:-** కన్యాలగ్నమై లగ్నమున చంద్రుడున్న చంద్రదశలో పూర్ణ చంద్రుడైన విశేష ధనార్జనము, పేరుప్రతిష్టలు, రూపలక్షణములును, క్షీణ చంద్రుడైన స్వల్ప యోగమును; ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన విశేషధనార్జనము, మంచి

వాక్కును. క్షీణచంద్రుడైన సామాన్యయోగమును; తృతీయమందున్న పూర్ణచంద్రుడైన స్వల్పయోగము. క్షీణచంద్రుడైన యోగభంగమును; చతుర్థమందున్న పూర్ణచంద్రుడైన విద్యా భూధనలాభము. క్షీణచంద్రుడైని స్వల్పధనలాభమును; పంచమమందున్న పూర్ణచంద్రుడైన విశేష స్త్రీ సంతానము. సంపూర్ణయోగము. క్షీణచంద్రుడైన సల్ప ధనార్జనమును; షష్టమమందున్న పూర్ణచంద్రుడైన ఋణబాధయు. క్షీణచంద్రుడైన ఋణము గూడ చిక్కక పోవుటయును; సప్తమమందున్న పూర్ణచంద్రుడైన మంచి తీర్థయాత్రలు. పూర్ణయోగమును. క్షీణచంద్రుడైన సల్పయోగమును; అష్టమ మందున్న పూర్ణచంద్రుడైన బాల్యమందైన బాలారిష్టము. క్షీణచంద్రుడైన శరీర పీడయును. నవమమందున్న పూర్ణచంద్రుడైన ధనలాభమును; పూర్ణ యోగమును క్షీణ చంద్రుడైన స్వల్పయోగమును; దశమమందన్న పూర్ణ చంద్రుడైన మంచి సత్కర్మలును; క్షీణచంద్రుడైన అనాచార ప్రవర్తనమును; ఏకాదశమందున్న పూర్ణ చంద్రుడైన విశేష ధనలాభమును; క్షీణచంద్రుడైన అన్యాయార్జితమును; ద్వాదశ మందున్న పూర్ణచంద్రుడైన సత్కథా కాలక్షేపములును; క్షీణచంద్రుడైన దుర్జన సహ వాసమును చంద్రదశలో సంభవించును.

3. **కుజుడు:-** కన్యాలగ్నమై లగ్నమందు కుజుడున్న కుజదశలో శరీరపీడ. కష్టనష్టములును; ద్వితీయ మందున్న ధనహీనము. కళత్ర విచారమును; తృతీయ మందున్న భూలాభము. స్వల్ప యోగమును; చతుర్థ మందున్న మాతృసౌఖ్యము. విద్య. వాహనము యివి తక్కువగా నుండుటయును; పంచమ మందున్న సంతాన విచారము. పూర్ణ ఆయుర్దాయమును; షష్టమమందున్న శతృజయము. పూర్ణ యోగమును. సప్తమ మందన్న కళత్రవిచారము. ఒకప్పుడు మారకమును. అష్టమ మందున్న అష్టకష్టములును. నవమమందున్న పితృవిచారమును. దశమమందున్న ఆచార విహీనము. నీచవృత్తి వలన జీవనమును. ఏకాదశమందున్న విశేష సోదర నష్టము. స్వల్పకుటుంబమును. ద్వాదశమందున్న అంగవిహీనము. శతృరోగ ఋణములును. పాపగ్రహములతో కలసియున్న కఠినశిక్ష. అపఖ్యాతి మొదలగులవి కుజదశలో సంభవించును. ఈ కన్యాలగ్నమునకు కుజు డెక్కడున్నను యోగింపడు.

4. **బుధుడు:-** కన్యాలగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో పూర్ణ యోగము; భూలాభము. ధనలాభము. విశేషఖ్యాతియును. ద్వితీయ మందున్న పూర్ణ యోగము; ధనము. వాచాలత్వమును; తృతీయమందున్న సోదరనష్టమును. చతుర్థ మందున్న విద్య; భూలాభము. మాతృసౌఖ్యము; గృహములును. పంచమమందున్న స్వల్ప పుత్రలాభము. ధనలాభమును. షష్టమ మందున్న వ్యవహార చిక్కులు. కష్ట నష్టములును. సప్తమ మందున్న యోగభంగము. స్వల్ప ఆయుర్భాగ్యములును. అష్టమ మందున్న యోగ హీనము. పిత్రార్జిత వ్యయమును. నవమ మందున్న విశేష భాగ్యమును. దశమ మందున్న న్యాయవృత్తివలన జీవనము. ఆచారమును. ఏకాదశ మందున్న విశేష ధనమును. ద్వాదశమందున్న ఋణవృద్ధియును బుధదశలో గలుగును.

5. **గురుడు:-** కన్యాలగ్నమై లగ్నమందు గురుడున్న గురుదశలో పూర్ణ యోగము. ఆయుర్భాగ్యములును. ద్వితీయమందున్న ఆదియందు యోగమును అంతమున మారకమును. తృతీయమందున్న యోగహీనము. బాల్యదశయందు బాలా

రిష్ట దోషమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, వాహనసౌఖ్యము, విశేష భూలాభమును, పంచమమందున్న అష్టకష్టములును, షష్టమమందున్న యోగహీనము, పిత్రార్జిత వ్యయమును, సప్తమమందున్న సుకళత్రము, కళత్రపీడయును, అష్టమ మందున్న యోగహీనము, కుటుంబ వృద్ధి, దరిద్రమును, నవమమందున్న విశేష పిత్రార్జితము, స్వార్జితము: పితృ దీర్ఘాయుష్యమును, దశమమందున్న మంచికర్మలు, పేరు ప్రతిష్టలును, ఏకాదశ మందున్న విశేషభాగ్యమును, ద్వాదశమందున్న యోగ హీనమును గురుదశలో సంభవించును.

6. **శుక్రుడు:-** కన్యాలగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశలో నీచభంగ రాజ యోగము గలిగిన యోగించుటయు, ద్వితీయ మందున్న ధనము, వాచాలత్వము, కుటుంబవృద్ధియును, తృతీయమందున్న సామాన్య యోగమును చతుర్థ మందున్న విశేష భూలాభమును, విద్యయును, పంచమ మందున్న విశేష భాగ్యము, పూర్ణయోగము, మంచి సంతానమును, షష్ట మమందున్న యోగహీనము, ఋణమును, సప్తమమందున్న భూలాభము, భాగ్యలాభమును, అష్టమమందున్న యోగహీనము, కుటుంబవృద్ధి, దారి ద్రమును, నవమమందున్న విశేష పిత్రార్జితము, స్వార్జితము, భాగ్య లాభమును; దశమ మందున్న రాజయోగము, మంచి సత్కార్య ములు విశేష ఖ్యాతియును, ఏకాదశమందున్న న్యాయార్జితమును, ద్వాదశ మందున్న యోగ హీనము, ధనవ్యయమును శుక్రదశయందు గలుగును.

7. **శని:-** కన్యాలగ్నమై లగ్నమందు శనియున్న శనిదశలో సమాన యోగము, శరీరపీడ, శత్రువృద్ధియును; ద్వితీయమందున్న పూర్ణయోగము, సంతాన విచారమును; తృతీయమందున్న విశేష భాగ్యమును; చతర్థమందున్న యోగ హీనము, సామాన్య విద్య; పిత్రార్జిత వ్యయమును, పంచమమందున్న పూర్ణయోగము, పుత్ర సంతాన హీనము, స్త్రీ సంతాన సౌఖ్యమును; షష్టమమందున్న యోగహీనము, శత్రు రోగ ఋణములును; సప్తమమందున్న కళత్ర విచారమును, అష్టమమందున్న యోగహీనము, కష్టనష్టములును; నవమమందున్న పితృసౌఖ్యహీనము, స్వార్జితము వలన భాగ్యలాభము; దశమమందున్న స్వల్పయోగము, దురాచారము, సేవకావృత్తి వలన జీవనమును; ఏకాదశమందున్న పూర్ణయోగము; విశేష భాగ్యమును; ద్వాదశ మందున్న యోగహీనము, దుష్ప్రవర్తనము దుర్వ్యయమును, శనిదశ యందు గలుగును.

8. **రాహువు:-** కన్యాలగ్నమై లగ్నమందు రాహువున్న రాహుదశలో యోగము, విశేషధనము, ద్వితీయమందున్న యోగహీనము, యెల్లప్పుడు ధన బాధయును; తృతీయమందున్న పూర్ణయోగము, అన్యాయార్జితము, నీచ వృత్తి వలన జీవనమును; చతుర్థమందున్న యోగహీనము మాతృవిచారము లేక పితృ విచారమును; పంచమ మందున్న యోగము, సంతాన నష్టమును, షష్టమ మందున్న శత్రు లేక జ్ఞాతుల ఆస్తిలాభమును; సప్తమ మందున్న యోగము, కళత్రపీడ, శరీర పీడయు, అష్టమ మందున్న గర్భదరిద్రము, అష్ట కష్టములును; నవమమందున్న పూర్ణయోగము, పితృకర్మ, దశమ మందున్న సామాన్య యోగము, తీర్థయాత్రలును, ఏకాదశ మందున్న తీర్థయాత్రలు, సామాన్య యోగమును, ద్వాదశమందున్న విశేష వ్యయము, పిత్రార్జిత స్వార్జిత ధనవ్యయమును రాహుదశలో సంభవించును.

9. కేతువు:- కన్యాలగ్నమై లగ్నమున కేతువున్న కేతుదశలో బాల్యమందైన బాలారిష్టము, యోగహీనమును, ద్వితీయమందున్న దరిద్ర బాధయును, తృతీయ మందున్న పూర్ణయోగము, విశేష భూలాభమును, చతుర్థ మందున్న మాతృపీడ, విద్యా విఘ్నము, భూవ్యయమును పంచమమందున్న పుత్రసంతాన నష్టము, స్త్రీ సంతాన సౌఖ్యమును, షష్ఠమమందున్న విశేష భూలాభము, ధనలాభమును, సప్తమ మందున్న వికట కళత్రము పీడయును, అష్టమమందున్న శత్రురోగ ఋణములును, నవమ మందున్న పితృపీడ, పూర్ణయోగమును, దశమమందున్న దేవబ్రాహ్మణ, భక్తి, సత్కార్యములును, ఏకాదశమందున్న విశేష భూలాభము, ధనలాభమును, ద్వాదశమందున్న పారమార్థిక చింత, ధనవ్యయమును కేతుదశలో సంభవించును.

## 7. తులాది గ్రహదశా ఫలములు

బుధచంద్రులు లిరువురు తులాలగ్నమునందు కలసియున్నను, నొకరి స్థానమున మరియెకరున్నను లేక నొకరి నొకరు వీక్షించుచున్నను రెండుదశలు బాగుగా యోగించును. రవిచంద్రులు కలసియున్న రవికి పూర్ణయోగమును, చంద్రునకు స్వల్పయోగము గలుగును. రవికుజులు కలసిన మిక్కిలి ధన లాభమును; రవి కుజులతో చంద్రుడు కలసియున్న పూర్ణముగా ధనము నిలువ యుండును. రవిబుధలు కలసిన రవిదశలో విశేష భాగ్యమును, బుధదశ మధ్యమధ్య సుయోగము గలుగును. రవిగురులు కలసి యున్న గురుదశయందు స్వల్పయోగము రవి దశయందు ఋణము, పిత్రార్జిత స్వార్జిత వ్యయము సంభవించును. రవి శుక్రులు కలసియున్న రెండుదశలలో యోగభంగము గలుగును. రవిశనులు గలసిన శని దశయందు సామాన్యయోగమును, రవిదశయందు పూర్ణయోగము గలుగును. చంద్రకుజులు కలసిన రెండు దశలయందు భూలాభమును, చంద్రబుధులు కలసిన వాహన ముద్రాధికార సౌఖ్యమును గలుగును. చంద్రగురులు కలసిన చంద్రదశ యందు యోగమును గురుదశయందు ఉద్యోగము, సత్కీర్తి సంపద గలుగును. చంద్ర శుక్రులు కలసిన శుక్రదశలో పూర్ణయోగమును చంద్రదశ యోగభంగము గలుగును చంద్రశనులు కలసిన రెండు దశలయందు అఖండయోగము గలుగును.

కుజబుధులు కలసిన రెండు దశలలో భాగ్యలాభమును, కుజగురులు కలసిన ఋణము వలన భూసంపాదన గలుగును. కుజశుక్రులు కలసిన శుక్రదశ యోగించును. కుజదశయందు యోగభంగము గలుగును. కుజశనులు గలసియున్న రెండుదశల యందు విశేష భూలాభము గలుగును. బుధగురులు కలసిన బుధదశలో యోగభంగము, గురుదశలో జ్ఞాతులవల్ల భూధనము లభించును బుధశుక్రులు కలసిన శుక్రదశయందు పూర్ణయోగమును, బుధదశయందు మధ్యమధ్య యోగ భంగము, గలుగును బుధశనులు గలసిన రెండుదశలలోను విశేషభాగ్యము గలుగును. గురు శుక్రులు కలసిన శత్రురోగ ఋణములు గలుగును. గురుశనులు కలసిన గురుదశ యందు సుయోగమును, శనిదశయందు యోగభంగము గలుగును. శుక్ర శనులు గలసిన శనిదశ యోగించును. శుక్రదశలో విశేష సంపాదన గలుగును. గురుశుక్రులు కలసియున్నను, విడిగానున్నను పాపఫలమునే యిచ్చెదరు. మిగిలిన చంద్ర, బుధ, కుజ, శనులు జంటగా యున్నను, విడిగా నున్నను శుభఫలమునే యిచ్చెదరు.

1. **సూర్యుడు:-** తులా లగ్నమై లగ్నమందు రవియున్న రవి దశలో నీచ భంగము. రాజయోగము లేనియెడల విశేష కష్టములును; ద్వితీయమందున్న ధన లాభము, ధనక్షయమును; తృతీయమందున్న విశేష భాగ్యమును; చతుర్థమందున్న మాతృపీడ, స్వల్పయోగమును, పంచమ మందున్న భాగ్యభోగమును;షష్ఠమమందున్న స్వల్పయోగమును; సప్తమ మందు పూర్ణయోగమును, అష్టమమందు యోగభంగము, ధనహీనమును, నవమమందు విశేష భాగ్యమును; దశమమందు మంచి తీర్థయాత్ర లును; ఏకాదశమ మందున్న పూర్ణఆయుర్భాగ్యములును; ద్వాదశ మందున్న బాల్యమైన బాలారిష్టము, పిత్రార్థిత నష్టము, శరీరపీడ సంభవించును.

2. **చంద్రుడు:-** తులా లగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్రదశలో అఖండ రాజయోగమును, పేరు ప్రతిష్టలును; ద్వితీయ మందున్న సుయోగమును; తృతీయమందున్న సామాన్య యోగము; చతుర్థ మందున్న విద్య, భూలాభము, మాతృ సౌఖ్యమును; పంచమమందున్న మంచిసంతానము, రాజయోగమును; షష్టమ మందున్న ఋణము విశేషమును; సప్తమమందున్న సుకళత్రము, కళత్రము వల్ల ధన లాభమును, అష్టమమందున్న బాలారిష్టము, అఖండ యోగమును; నవమ మందున్న మంచి తీర్థయాత్రులును; ఏకాదశమమందున్న ధనలాభము, న్యాయా ర్జనమును; ద్వాదశమందున్న యోగభంగము, సత్కార్యముల వల్ల ధనవ్యయము సంభవించును. తులాలగ్నమునకు పూర్ణచంద్రుడై కేంద్ర కోణముల యందన్న అఖండ యోగమును, క్షీణచంద్రుడైన సామాన్యయోగము గలుగును.

3. **కుజుడు:-** తులాలగ్నమై లగ్నమందు కుజుడున్న కుజదశలో యోగము, శరీరపీడ, మేహతత్వమును; ద్వితీయమందున్న ద్వికళత్రము లేక ఉత్తరాయుర్దా యమునందు నిర్ధారయోగమును తృతీయమందున్న సామాన్య యోగమును చతుర్థ మందున్న అఖండయోగము, భూధనలాభమును; పంచమ మందున్న సంతాన నష్టము, అఖండయోగమును; షష్టమమందున్న సామాన్య యోగమును; సప్తమ మందున్న కళత్ర విచారము, భూలాభము; అష్టమ మందున్న సంతాన విచారము, కళత్ర విచారమును; నవమమందున్న పితృపీడ, స్వల్పయోగమును; దశమమందున్న నీచ వృత్తి వలన జీవనము, వ్యవసాయము వలన నష్టమును ఏకాదశమందున్న పూర్ణయోగము, భూధనలాభమును; ద్వాదశమందున్న కళత్ర విచారమును కుజదశలో సంభవించును.

4. **బుధుడు:-** తులాలగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో విశేష భాగ్యమును, ద్వితీయమందున్న విశేష ధనలాభమును; తృతీయమందున్న సామాన్య యోగము, పిత్రార్జిత నష్టమును; చతుర్థమందున్న ప్రాసాద సౌఖ్యము, విశేష భాగ్యమును; పంచమమందున్న యోగ్యమైన సంతానము, అఖండయోగమును; షష్టమమందున్న యోగభంగము, శత్రువులు, పిత్రార్జిత నష్టమును; సప్తమమందున్న సుకళత్రము, కళత్ర భూలాభము, పూర్ణయోగమును; అష్టమమందున్న యోగ భంగము, పిత్రార్జిత స్వార్జిత ధననష్టము, దరిద్రమును; నవమ మందన్న విశేష భాగ్యమును; దశమమందున్న యజ్ఞయాగాధి క్రతువులు, పేరుప్రతిష్టలును, ఏకాదశ

మందున్న విశేషధనము. న్యాయార్జితమును; ద్వాదశ మందున్న యోగభంగము. సత్కార్యముల వలన ధనవ్యయము బుధదశలో సంభవించును.

**5. గురుడు:-** తులాలగ్నమై లగ్నమందు గురుడున్న గురుదశలో శరీరపీడ. శత్రువృద్ధి యును; ద్వితీయ మందున్న యోగభంగము. మధ్యమధ్య. శరీరపీడ. ఋణమును. తృతీయమందున్న సోదరసోదరీ సౌఖ్యము. పూర్వ ఖండమున యోగము. ఉత్తరఖండమున యోగభంగమును; చతుర్థమందున్న స్వల్పయోగము. శత్రువృద్ధి. తుదిజయము. స్వల్ప భూలాభము. పంచమ మందున్న సంతాననష్టము. సామాన్య యోగమును; షష్టమమందున్న శత్రురోగ ఋణములు. సప్తమమందున్న కళత్రపీడ. మధ్యమధ్య శరీర పీడయును; అష్టమమందున్న విశేష కుటుంబము. దారిద్ర్యమును; నవమమందున్న స్వల్పయోగము. శత్రువులు లేక జ్ఞాతుల వలన ఆస్తిలాభమును; దశమమందున్న డాంబిక ఆచారము. తీర్థయాత్రలు. శత్రురోగ ఋణములును; ఏకాదశ మందున్న అన్యాయ ధనార్జనము. ఋణము వలన భూ లాభమును ద్వాదశ మందున్న యోగభంగము. ధనవ్యయమును సంభవించును.

**6. శుక్రుడు:-** తులాలగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశలో స్వర్ణ యోగము. పేరుప్రతిష్టలును; ద్వితీయమందున్న ధనలాభము. ధన వ్యయమును; తృతీయమందున్న యోగభంగము. విశేష ధనవ్యయమును; చతుర్థమందున్న స్వల్ప విద్య. సామాన్య భూపతియును; పంచమమందున్న పూర్వఖండమున పూర్ణయోగము. ఉత్తర ఖండమున సామాన్య యోగమును; షష్టమున బాల్యమందు బాలారిష్టమును; సప్తమమందున్న శరీరపీడ. సామాన్య యోగమును; అష్టమమందున్న యోగభంగము; సత్కార్యముల వలన ధనవ్యయమును; నవమమందున్న మిశ్రమఫలము; దశమ మందున్న ఖ్యాతి. వ్యవసాయమువల్ల జీవనమును; ఏకాదశమందున్న విశేష ధనార్జనము. అన్యాయార్జనమును; ద్వాదశమందున్న సామాన్య యోగము. సత్కార్యముల వల్ల ధనవ్యయము శుక్రదశలో సంభవించును.

**7. శని:-** తులాలగ్నమై లగ్నమందు శనియున్న శనిదశలో మందమతియు. పేరుప్రతిష్టలును; ద్వితీయ మందున్న ధనార్జనము. ధన వ్యయమును; తృతీయ మందున్న సామాన్యయోగము. కనిష్టసోదర నష్టమును; చతుర్థమందున్న విశేష భూమియు. సంపూర్ణ ఆయుర్భాగ్యములును; పంచమమందున్న అఖండయోగము. స్త్రీ సంతానమును. షష్టమమందున్న విశేషయోగము. తీర్థయాత్రలకు ధనవ్యయమును. సప్తమమందున్న సామాన్య యోగము. సంతాన విచారము. కళత్రవిచారము; అష్టమ మందున్న యోగహీనము. పిత్రార్జిత నష్టము; నవమమందున్న సుయోగము. పితృసౌఖ్య హీనమును; దశమమందున్న పూర్ణయోగము. వాహన ముద్రాధికారమును; ఏకాదశమమందున్న అఖండయోగము. ధనలాభమును; ద్వాదశమందున్న యోగ భంగము. దుర్వినియోగము ధనవ్యయము శనిదశలో సంభవించును.

**8. రాహువు:-** తులాలగ్నమై లగ్నమందు రాహువున్న రాహుదశలో యోగభంగము. శరీరపీడయును. ద్వితీయమందున్న ధననష్టము. సంతాన విచారము. కళత్ర పీడయును; తృతీయమందున్న పూర్ణయోగము. భూధన లాభమును చతుర్థ

మందున్న యోగభంగము, విద్యావిఘ్నము, పిత్రార్జిత వ్యయమును; పంచమ మందున్న సంతాన నష్టము, సుయోగమును; షష్టమ మందున్న శత్రుజయము, భూ లాభము; సప్తమమందున్న యోగభంగము, మధ్యమధ్య కళత్రపీడ, శరీరపీడయును; అష్టమమందున్న యోగభంగము, దరిద్రము, కష్టములును; నవమమందున్న సుయోగము, పితృపీడయును; దశమమందున్న తీర్థయాత్రలు, సుయోగమును, ఏకా దశమందున్న అఖండయోగము, భూలాభమును; ద్వాదశమందున్న యోగభంగము, దుర్జన సాంగత్యము, విశేష ధనవ్యయమును రాహుదశ యందు సంభవించును.

9. కేతువు:- తులాలగ్నమై లగ్నమందు కేతుయున్న కేతుదశ యందు బాలారిష్టము, యోగభంగమును; ద్వితీయమందున్న యోగభంగము ధన హీనము, సంతాన హీనమును; తృతీయమందున్న భూధనలాభమును; చతుర్థ మందున్న మాతృ విచారము, విద్యావిఘ్నము, స్వల్పభూమియును; పంచమమందున్న స్త్రీ సంతాన నష్టము; షష్టమమందున్న పూర్ణయోగము, శత్రుఆస్తిలాభము, విశేష ధన లాభమును, సప్తమమందున్న యోగభంగము, కళత్రపీడ, శరీరపీడయును; అష్టమ మందున్న యోగభంగము, కష్టములును నవమమందున్న పితృపీడ, సుయోగమును; దశమమందున్న సామాన్య యోగము, మంచి తీర్థయాత్రలును: ఏకాదశమందున్న పూర్ణయోగము, ధనలాభమును; ద్వాదశమందున్న పారమార్థికచింత, సద్వ్యయమును కేతుదశ యందు సంభవించును. తులా లగ్నమందు కేతువు తృతీయ షష్టమ స్థానముల యందు బాగుగా యోగించును.

## 8. వృశ్చికాది గ్రహదశా ఫలములు

వృశ్చిక లగ్నములకు రవిచంద్రులిరువురు రాజయోగము నిచ్చును. ఈ రెండు గ్రహములు కేంద్రకోణముల యందెక్కడ కలసినను యోగజాతక మగును. రవి కుజులు, రవిబుధులు, రవిగురులు రవిశుక్రులు, రవిశనులు కలసినప్పుడు రెండు దశలును యోగించును. కుజదశలో విశేషభూమి, ధనమును, బుధదశలో మిక్కిలి ధనమును, శనిదశలో విశేష భూమియును లభించును. చంద్రకుజులు, చంద్రగురులు, చంద్ర శుక్రులు కలసినప్పుడు పూర్తియోగమును, చంద్ర బుధులు కలసిన చంద్రదశ సామాన్యముగాను, బుధదశ బాగుగా యోగించును. చంద్రశనులు కలసినప్పుడు శనిదశ పూర్తిగాను చంద్రదశ సామాన్యముగా యోగించును, కుజ బుధులు, కుజశుక్రులు కలసిన కళత్ర పీడయును, కుజశనులు కలసినప్పుడు శరీర రోగమును గలుగును. కుజగురులు కలసిన రెండు దశలు పూర్తిగా యోగించును.

బుధగురులు కలసిన బుధదశ విశేషముగా యోగించును. గురుదశలో యోగభంగము గలుగును. బుధశుక్రులు కలసిన బుధదశలో సామాన్యముగా యోగించును. శుక్రదశ స్వల్పముగా యోగించును. బుధశనులు కలసిన శనిదశ యోగించదు. బుధదశ స్వల్పముగా యోగించును. గురుశుక్రులు కలసిన శుక్రదశ బాగుగా యోగించును. విశేష ధనలాభము గలుగును. గురుదశ సామాన్యముగా యోగించును. గురుశనులు కలసిన శనిదశ విశేషముగా యోగించును. శుక్రదశ సామాన్యముగా యోగించును. వృశ్చిక లగ్నమునకు రవి, చంద్ర, కుజ, గురులలో యే జంటగ్రహములు కలసినను విశేష రాజయోగము నిచ్చును.

**1. సూర్యుడు:-** వృశ్చిక లగ్నమై లగ్నమందు రవియున్న రవిదశ యందు అఖండయోగము, ధనలాభమును, ద్వితీయ మందున్న ధనలాభము, ధనవ్యయము ను; తృతీయమందున్న సామాన్య యోగమును; చతుర్థమందున్న వాహన ముద్రాధి కారము; పంచమమందున్న స్వల్ప సంతానసష్టము, అఖండయోగమును; షష్టమమం దున్న అఖండయోగమును; సప్తమమందున్న సుయోగము, కళత్రము వలన ఆస్తి లాభమును, అష్టమమందున్న పిత్రార్జిత నష్టము, యోగభంగమును, నవమ మందున్న యోగభంగము, పిత్రార్జిత నష్టమును రవిదశ యందు గలుగును. కేంద్ర కోణముల యందు రవి విశేష యోగము నిచ్చును.

**2. చంద్రుడు:-** వృశ్చిక లగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్రదశలో నీచ భంగమైనచో సంపూర్ణయోగమును, ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన విశేష ధనలాభము, క్షీణచంద్రుడైన స్వల్పయోగమును; తృతీయమందున్న పూర్ణచంద్రుడైన స్వల్పముగా యోగించును, క్షీణచంద్రుడైన యోగభంగము గలుగును. చతుర్థ మందు చంద్రుడున్న చంద్రదశ యందు పూర్ణచంద్రుడైన పండితుడును విశేష భూలాభము, వాహనసౌఖ్యమును, క్షీణచంద్రుడైన స్వల్పయోగమును, పంచమ మందున్న పూర్ణచంద్రుడైన అదృష్ట సంతానము, పూర్ణయోగమును, షష్టమమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పయోగము, క్షీణచంద్రుడైన శత్రురోగ ఋణములును, సప్తమ మందున్న పూర్ణచంద్రుడైన మిక్కిలి రాజయోగము, విశేషభాగ్యమును; అష్టమ మందున్న పూర్ణచంద్రుడైన స్వల్పయోగము, క్షీణచంద్రుడైన విశేష శరీరపీడయును, నవమమందున్న పూర్ణచంద్రుడైన భాగ్యలాభము, విశేష ఖ్యాతి, క్షీణచంద్రుడైన స్వల్పయోగమును, దశమ మందున్న పూర్ణచంద్రుడైన ఆచారము, తీర్థయాత్రలు, భాగ్యలాభము, క్షీణచంద్రుడైన స్వల్పయోగమును; ఏకాదశ మందున్న పూర్ణ చంద్రుడైన భాగ్యలాభము; క్షీణచంద్రుడైన అన్యాయార్జితమును, ద్వాదశమందున్న పూర్ణ చంద్రుడైన మంచి సత్కార్యములు, విశేష ఖ్యాతియును, క్షీణ చంద్రుడైన అన్యాయముగా ధనవ్యయమును చంద్ర దశ యందు గలుగును. వృశ్చిక లగ్నమునకు పూర్ణచంద్రుడు కేంద్రకోణముల యందున్న రాజయోగము నిచ్చును.

**3. కుజుడు:-** వృశ్చికలగ్నమై లగ్నమందు కుజుడున్న కుజదశ యందు ద్వికళత్ర యోగము లేక పరస్త్రీ సౌఖ్యమును, ద్వితీయమందున్న ధన వ్యయము; మధ్యమధ్య శరీరపీడయును, తృతీయమందున్న స్వల్పయోగము, సోదరి యొక్క ఆస్తి లాభమును; చతుర్థమందున్న భూలాభము, స్వల్ప ఋణమును, పంచమ మందున్న సంతానసష్టము, పూర్ణయోగమును; షష్టమ మందున్న శత్రురోగ ఋణములును, సప్తమమందున్న జారత్వము స్వల్పయోగమును; అష్టమమందున్న కళత్రపీడయు, సంతాన విచారమును, నవమమందున్న స్వల్పయోగమును, దశమ మందున్న వ్యవసాయము వల్ల గౌరవ జీవనము, భూలాభమును; ఏకాదశ మందున్న అన్యాయార్జనము, ధన లాభమును; ద్వాదశమందున్న పిత్రార్జిత వ్యయమును కుజ దశయందు గలుగును.

4. **బుధుడు:-** వృశ్చికలగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో శరీరాయాసము. ద్వితీయమందున్న విశేష శరీరపీడ. ఋణబాధ. కష్టములును, తృతీయ మందున్న స్వల్పయోగము. శతృ ఆస్తిలాభమును. చతుర్థమందున్న భూ లాభము. భూనష్టమును. పంచమమందున సంతాన సౌఖ్యహీనము. స్వల్ప పుత్రికా సంతాన లాభమును; షష్టమమందున్న సుయోగము. భూధనలాభము. పరఆస్తి లాభమును; సప్తమమందున్న కళత్ర పీడయును; అష్టమమందున్న పూర్వఖండమున సుయోగము. ఉత్తర ఖండమున యోగభంగమును; నవమమందున్న స్వల్పధన లాభమును; దశమ మందున్న ఆచారమును; ఏకాదశ మందున్న ధనార్జనమును; ద్వాదశ మందున్న యోగభంగము. ధనవ్యయమును బుధదశలో సంభవించును.

5. **గురుడు:-** వృశ్చిక లగ్నమై లగ్నమందు గురుడున్న గురుదశలో పూర్ణ యోగమును. ధనలాభము. విద్య దేశ ప్రఖ్యాతియును; ద్వితీయమందున్న ధన లాభము. సభాపూజ్యుడుగను; తృతీయమందున్న యోగభంగము. దరిద్రమును; చతుర్థ మందున్న విద్య. భూలాభము. మాతృసౌఖ్యమును; పంచమ మందున్న కుటుంబ వృద్ధి. ధనలాభము. పూర్ణయోగమును; షష్టమమందున్న యోగహీనము. హెచ్చు సంతానము. ఋణమును; సప్తమమందున్న సుకళత్రము. కళత్ర సంబంధమున ఆస్తి లాభము; అష్టమ మందున్న యోగ హీనము. ధనహీనమును; నవమమందున్న విశేష భాగ్యమును; దశమ మందున్న సదాచార ప్రవర్తన. విశేష ఖ్యాతియును; ఏకాదశ మందున్న ధన లాభము. శతృ ఆస్తిలాభమును; ద్వాదశమందున్న మంచి సత్కార్యములు. ఋణబాధ గురుదశ యందు సంభవించును.

6. **శుక్రుడు:-** వృశ్చిక లగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశ యందు జారత్వమును; ద్వితీయమందున్న శరీరపీడ. కుటంబవృద్ధియును; తృతీయమందున్న భాగ్యసోదరీణులును; చతుర్థమందున్న శాస్త్రపాండిత్యము. రాజపూజ్యమును. పంచమ మందున్న పూర్ణయోగము. కళత్రము వల్ల భాగ్య లాభమును; షష్టమమందున్న కళత్రపీడ. యోగహీనమును; సప్తమ మందున్న సుకళత్రమును. అష్టమమందున్న ధనవ్యయమును. నవమ మందున్న విశేష భాగ్యమును; దశమమందున్న ఆచారము. పేరుప్రతిష్టలును; ఏకాదశమందున్న యోగభంగము. ధనవ్యయము. కళత్ర విచారమును; ద్వాదశ మందున్న పూర్ణయోగము. మంచి సత్కార్యములు. విశేషఖ్యాతి శుక్రదశ యందు గలుగును.

7. **శని:-** వృశ్చిక లగ్నమై లగ్నమందు శనియున్న శనిదశయందు కష్ట జీవనమును; ద్వితీయమందున్న సంతాన విచారము. ధనవ్యయము. నేత్ర హానియును తృతీయమందన్న ధనలాభము. ధనవ్యయమును; చతుర్థమందున్న మాతృసౌఖ్యము. విద్య. భూమియును; పంచమ మందున్న పూర్ణయోగము. ధన లాభము. సంతాన విచారమును. షష్టమందున్న యోగ హీనము. బహుకష్టములును; సప్తమమందున్న ద్వికళత్రమును అష్టమ మందున్న యోగహీనము. పిత్రార్జిత స్వార్జిత నష్టమును; నవమ మందున్న స్వల్పాచారమును. ఏకాదశ మందున్న పూర్ణ

యోగము, ఖ్యాతి, పూర్ణ ఆయుర్దాయమును, ద్వాదశమందున్న ధనవ్యయమును శని దశయందు గలుగును.

**8. రాహువు :-** వృశ్చిక లగ్నమై లగ్నమందు రాహువున్న రాహుదశలో యోగహీనము, నామరూప విహీనమును, ద్వితీయమందున్న ధనార్జనమును, తృతీయ మందున్న విశేష భాగ్యమును, చతుర్థమందున్న మాతృపీడ, విద్యావిఘ్నము ఋణమును, పంచమమందున్న స్వల్పయోగము, సంతాన నష్టమును, షష్టమ మందున్న జ్ఞాతుల ఆస్తి లాభమును సప్తమమందున్న విశేష ధనము, కళత్ర విచారమును, అష్టమమందున్న బహుకష్టములు, యోగ హీనమును, నవమమందున్న భూ లాభమును, దశమమందున్న ధనార్జనము, ధనలాభమును; ఏకాదశమందున్న విశేష భాగ్యము, బహు ఖ్యాతియును; ద్వాదశమందున్న దుర్జన సహవాసమును రాహు దశయందు సంభవించును.

**9. కేతువు :-** వృశ్చిక లగ్నమై లగ్నమందు కేతువున్న కేతుదశలో యోగ భంగము, కష్టములును, ద్వితీయమందున్న ధనవ్యయము, శరీరపీడ, యోగ హీనమును, తృతీయమందున్న ధనవ్యయము, శరీరపీడ, యోగహీనమును, తృతీయ మందున్న విశేషభూమి, ధనలాభమును, చతుర్థమందున్న పిత్రార్జిత నష్టమును; పంచమమందున్న స్వల్పయోగము, సంతాన సౌఖ్యమును; షష్టమ మందున్న విశేష భాగ్యమును, సప్తమ మందున్న కళత్ర విచారము, కళత్ర సుఖహీనమును, అష్టమ మందున్న యోగభంగము, శత్రురోగ ఋణములును, నవమ మందున్న పితృసౌఖ్య హీనము, స్వల్పయోగమును, దశమ మందున్న మిశ్రమ ఫలమును, ఏకాదశ మందున్న విశేష ధనార్జనము, పూర్ణయోగమును, ద్వాదశమందున్న యోగహీనము, పారమార్థికచింత, విశేష ధనవ్యయమును కేతుదశలో సంభవించును.

## 9. ధనురాది గ్రహదశా ఫలములు

గురుకుజ రవిబుధులు ధనుర్లగ్నమునకు యోగకారకులు, వీరిలో రవిబుధులు మిక్కిలి యోగకారకులు, రవి బుధులు భాగ్యరాజ్యాధి పతులగుటచే కేంద్రకోణముల యందు కలసియున్న ముద్రాధికారము గలుగును, షష్టాష్టమ వ్యయము లందున్న ఆయుర్భాగ్యములు మాత్ర ముండును. వీరు తులయందుగాని మీనమందుగాని యున్న మొదట రాజయోగము పిమ్మట యోగభంగము గలుగును. లగ్నాధిపతియగు గురుడు పాపగ్రహ సంబంధముగాని వీక్షణముగాని లేక యుండి కేంద్రకోణముల యందున్న సంపూర్ణ ఆయుర్భాగ్యములు గలుగును. రవిచంద్రులు కలసియున్న చంద్రదశ కొంతవరకు యోగించును. రవిదశలో శత్రురోగ ఋణములు గలుగును. రవికుజులు కలసియున్న రెండుదశలు యోగించును. రవిగురులు కలసి యున్న రాజయోగము గలుగును. రవి శుక్రులు కలసిన శుక్రదశ యోగించును. రవి దశలో పిత్రారిష్టము గలుగును. చంద్రకుజులు కలసిన చంద్రదశ యోగించును. మాతారిష్టము గలుగును. కుజదశ యోగించదు. చంద్రబుధులు కలసిన చంద్రదశ యోగించును. బుధదశ చిక్కులు గలిగించును. చంద్రగురులు కలసియున్న చంద్ర దశ యోగించును. గురుదశలో కష్టములు రోగము గలుగును. చంద్ర శుక్రులు కలసిన రాజయోగము గలుగును. వీరు వృషభ, కర్కాటకము నందు కలసిన

విపరీత రాజయోగము గలుగును. మిగిలిన స్థానములందు కలసిన మధ్యమధ్య యోగ భంగములు గలుగును. చంద్రశనులు కలసిన రెండుదశలు యోగ భంగములు గలిగి కష్టములు మారకములు గలుగును.

కుజశనులు కలసిన రెండుదశలు యోగించును. విశేష భూలాభము, స్వల్ప ఆచారము, కళత్రరోగము గలుగును. కుజగురులు కలసిన రెండుదశలు యోగించును. విశేష సంతానము భూమి గలుగును. కుజశుక్రులు కలసిన భూ లాభము, ఋణములు గలుగును. లగ్నమున కుజశుక్రులు గలసియున్న కళత్ర రోగము, స్త్రీసంతానము హెచ్చుగానుండును, శుక్రదశ స్వల్పయోగమును; కుజదశ యోగభంగము గలుగును. కుజశనులు కలసిన సంతాన విచారము, సామాన్య యోగము గలుగును. వీరు వ్యయస్థానమందు కలసిన కారాగృహ ప్రాప్తి గలుగును. బుధగురులు కలసిన పండితుడును ప్రఖ్యాతి గలవాడగును. రెండుదశలు యోగించును. బుధశుక్రులు కలసిన శుక్రదశ కొంతవరకు యోగమును, బుధదశలో వ్యవహార చక్కులు గలుగును. బుధశనులు కలసిన బుధదశలో కళత్ర విచారము, ఉద్యోగ భంగము గలుగును. శనిదశ యోగించును. ధనవృద్ధి గలుగును. గురుశుక్రలు కలసిన సామాన్య యోగము, శుక్రదశ స్వల్పయోగము, గురు శనులు కలసిన ధన లాభము శరీరరోగము గలుగును. గురుదశ కంటె శనిదశ స్వల్పముగా యోగించును. శుక్రశనులు కలసిన రెండుదశలు మిక్కిలి పాపులగుచున్నారు. వీని దశాభుక్తులలో మారకము జరుగును.

1. **సూర్యుడు:-** ధనుస్సు లగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో మిక్కలి రాజయోగము, పేరుప్రతిష్టలును ద్వితీయమందున్న స్వల్పయోగము, ధననష్టము, తృతీయమందున్న పితృ అల్పాయువును, చతుర్థమందున్న పూర్ణ ఆయు ర్భాగ్యములును పంచమమందున్న వాహన ముద్రాధికారమును, షష్టమ మందున్న వ్యవహార చిక్కులు శత్రురోగ ఋణవృద్ధియును, సప్తమమందున్న సుకళత్రము, యోగము, అష్టమ మందున్న పిత్రార్జిత నష్టమును, నవమమందున్న; సంపూర్ణ ఆయుర్భాగ్యములును, దశమమందున్న రాజ యోగము, ప్రతిష్టయును ఏకాదశ మందున్న వ్యవహార చిక్కులు యోగ భంగమును, ద్వాదశ మందున్న యోగ భంగము, మంచిధర్మ కార్యములును రవిదశలో సంభవించును.

2. **చంద్రుడు:-** ధనుస్సు లగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్ర దశలో శరీరరోగము, సుఖహీనమును; ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన గొప్పధన లాభమును, క్షీణచంద్రుడైన దరిద్రుడును, తృతీయమందున్న పూర్ణ చంద్రుడైన సోదరీ వృద్ధి, క్షీణచంద్రుడైన సోదరీనష్టమును; చతుర్థమందున్న పూర్ణచంద్రుడైన మాతృ సౌఖ్యము, విద్య, భూమి, వాహనము, క్షీణచంద్రుడైన యివి స్వల్పమును; పంచమమందున్న పూర్ణచంద్రుడైన ప్రఖ్యాతిగల సంతానము, క్షీణచంద్రుడైన సంతాన నష్టమును, షష్టమమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పశత్రు రోగములు, క్షీణ చంద్రుడైన పూర్ణ శత్రురోగ బాధలును; సప్తమమందున్న పూర్ణచంద్రుడైనను సుకళత్రము క్షీణ చంద్రుడైన కళత్ర నష్టమును అష్టమమందున్న పూర్ణచంద్రుడైన

ఆయుర్వృద్ధి క్షీణ చంద్రుడైన నాస్తికత్వము, దురభ్యాసము, నవమమందున్న పూర్ణ చంద్రుడైన దేవ బ్రాహ్మణ భక్తి, పితృసౌఖ్యము, భాగ్యలాభమును, క్షీణ చంద్రుడైన వీనికి వ్యతిరేక ఫలములును; దశమమందున్న పూర్ణచంద్రుడైన తీర్థయాత్రలు, శిష్టాచారము, పేరు ప్రతిష్ఠలును, క్షీణచంద్రుడైన నీచజీవనము, ఆచార విహీనమును; ఏకాదశ మందున్న పూర్ణచంద్రుడైన విశేష ధనార్జనము, న్యాయార్జనమును, క్షీణ చంద్రుడైన అన్యాయ ధనార్జనమును; ద్వాదశ మందున్న పూర్ణచంద్రుడైన మోక్షాపేక్ష, శుభ వ్యయమును, క్షీణచంద్రుడైన దుర్జన సహవాసము, దుష్కార్యములు, అల్పాయుర్దాయమును చంద్రదశలో సంభవించును.

3. **కుజుడు:-** ధనుస్సు లగ్నమై లగ్నమందు కుజుడున్న కుజదశలో శరీరపీడ, కోపము, వికృతరూపము, భూలాభము, మశూచికాది భయమును, ద్వితీయమందున్న ధనవృద్ధి, సంతానవృద్ధి, విశేష స్త్రీసంతానము, కోప స్వభావము, సౌఖ్యహీనమును, తృతీయమందున్న లోభము, మాయ, సోదర ద్రవ్యమపహరించుటయును; చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, వాహనము, విశేష సంతాన వృద్ధియును; పంచమమందున్న సుయోగము, సంతాననష్టమును, షష్టమ మందున్న శత్రురోగ ఋణములు, పుత్ర విరోధమును; సప్తమమందున్న కళత్ర సౌఖ్య హీనము, పౌరుషమును; అష్టమ మందున్న సంతానవిచారము, సౌఖ్యహీనము, విద్యా విహీనము, వ్యవహార చిక్కులును; నవమమందున్న సుయోగము, పితృసౌఖ్య హీనమును; దశమ మందున్న గ్రంథరచన, విశేషఖ్యాతి, కీర్తికాముడైన పుత్రుడును; ఏకాదశ మందున్న విశేష సంతానము, పాండిత్యము ఖ్యాతియును; ద్వాదశమందున్న సంతాన సౌఖ్యహీనము, లోభమును కుజదశయందు గలుగును.

4. **బుధుడు:-** ధనుర్లగ్నమై లగ్నమున బుధుడున్న బుధదశలో విద్య వినయము, ఖ్యాతి, దేహధారుఢ్యము, సుయోగమును; ద్వితీయ మందున్న ధనము, యోగము, వాచాలత్వమును; తృతీయమందున్న స్వల్ప ఉద్యోగము, సామాన్య యోగమును; చతుర్థమందున్న యోగభంగము, కళత్ర విచారమును, పంచమ మందున్న విశేష స్త్రీ సంతానము, ఖ్యాతి, అఖండయోగమును, షష్టమ మందున్న సామాన్య యోగము, అధికారము లేని ఉద్యోగము, కళత్రపీడయును, సప్తమ మందున్న సుకళత్రము, విశేష యోగమును, అష్టమమందున్న దరిద్రము, అసౌఖ్యము, కష్ట జీవనము, యోగ భంగమును, నవమమందున్న సుయోగము, రాజాశ్రయము, తీర్థ యాత్రల యందాసక్తి, పరస్త్రీ లోలత్వమును, దశమమందున్న సుకళత్రము, రాజ యోగమును, ఏకాదశమందున్న యుక్తిచే ధనార్జనము, సౌఖ్యము, సంతాన వృద్ధి యును, ద్వాదశమందున్న దరిద్రము, లోభము, శత్రుబాధ, కళత్ర సౌఖ్యహీనము, యోగ భంగము బుధదశలో సంభవించును.

5. **గురుడు:-** ధనుర్లగ్నమై లగ్నమున గురుడున్న గురుదశలో అఖండ యోగము, జారత్వము లేక ద్వికళత్రమును, ద్వితీయమందున్న సంతాన విచారము, సుఖహీనము, తీర్థయాత్రా పరత్వము, విదేశ వాసమును, తృతీయ మందున్న సోదరీ వృద్ధియును, సామాన్య భాగ్యమును, చతుర్థ మందున్న పితృ, మాతృసౌఖ్యము, పాండిత్యము; భూలాభమును, పంచమ మందున్న మేధావియును, నీశ్వరోపాసన,

విశేష సంతానము, రాజపూజ్యత, పాండిత్యమును, అఖండయోగమును, షష్ఠమ మందున్న శత్రురోగ ఋణములును, యోగభంగమును, సప్తమమందున్న స్థూల శరీరము గల సుకళత్రము, సుయోగమును, అష్టమమందున్న అల్పాయుర్దాయము, కష్టజీవనము, యోగభంగమును, నవమమందున్న భాగ్యము, పితృసౌఖ్యము, అఖండ యోగము, సత్యవాక్కును, దశమందున్న ఖ్యాతి, శిష్టాచారము, మంచి వృత్తివలన జీవనము, సుయోగమును, ఏకాదశమందున్న న్యాయ ధనార్జనము, రాజోద్యోగము, పిత్రార్జిత ధనము, ధర్మము, సుయోగమును, ద్వాదశమందున్న యోగభంగము, ధన వ్యయము, వ్యవహార చిక్కులును గురుదశలో సంభవించును. గురుడు యీలగ్న మందు లగ్నవాహనాధిపతియు, ఉభయకేంద్రాధిపతి యగుటచే కేంద్రాధిపత్య దోషమున్నను లగ్నాధిపతి యగుటచేత యోగవిషయమందు కేంద్రకోణముల యందెక్కడ యున్నను యోగించును.

6. శుక్రుడు:- ధనుర్లగ్నమై లగ్నమున శుక్రుడున్న శుక్రదశలో పాండిత్యము, కవిత్వము, శరీరపీడయును, ద్వితీయమందున్న స్వల్పయోగము, స్త్రీ సంతానము, స్వల్పధనము, సంగీత సాహిత్య ప్రదేశమును, తృతీయమందున్న స్వల్ప యోగము, సోదరివృద్ధి, కష్టజీవనమును, చతుర్థమందున్న విద్యావినయ సంపన్నత, మాతృసౌఖ్యము, భూలాభము, పంచమమందున్న సుయోగము, విశేష సంతానము, జారత్వమును, షష్టమ మందున్న శత్రువుల వలన లేక జ్ఞాతుల వలన భాగ్యము, శత్రురోగ ఋణములును, సప్తమమందున్న విశేష కామము, ప్రతిష్ఠ, విద్యావినయ సంపన్నత, రూపవతియగు కళత్రమును, అష్టమమందున్న కుటుంబ వృద్ధి దరిద్ర్యమును, నవమమందున్న పితృసౌఖ్యము, భాగ్యము, స్వల్పయోగమును, దశమమందున్న విశేష కష్టములు, కళత్రవిచారము, శత్రురోగ ఋణములును, ఏకాదశమందున్న విశేష యోగము, న్యాయార్జితము, శత్రువుల వల్ల ధనార్జనమును ద్వాదశమందున్న యోగభంగము, శుభవ్యయము, కళత్ర సౌఖ్యహీనమును శుక్రదశ యందు గలుగును.

7. శని:- ధనుర్లగ్నమై లగ్నమున శనియున్న శనిదశలోస్వల్ప యోగము, శరీర సుఖహీనమును, ద్వితీయమందున్న కష్టధనలాభము, శరీపీడ, ద్వికళత్రమును, తృతీయ మందున్న ధైర్యస్థైర్యములు, పరాక్రమము, సుయోగమును, చతుర్థ మందున్న మాతృ సౌఖ్యము, భూమి, వాహనము, స్వల్ప యోగమును పంచమ మందున్న సుయోగము, స్వల్పసంతానము, అధికారముగల యుద్యోగమును, షష్టమ మందున్న ఆయుర్దాయము, ఖ్యాతి, ధన విహీనమును, సప్తమ మందున్న కళత్ర సౌఖ్యహీనము, శరీరపీడ, స్వల్ప యోగమును, అష్టమ మందున్న ధనహీనము, ధన తాపత్రయము, స్వల్ప యోగమును, నవమమందున్న పితృసౌఖ్య హీనము, సంతాన సౌఖ్యహీనము, స్వల్పయోగమును, దశమమందున్న గొప్ప యుద్యోగము లేక వ్యవసాయము వల్ల జీవనము, ఆచారము, బహుయోగమును, ఏకాదశ మందున్న విశేష ధనలాభము అన్యాయార్జితము, అఖండయోగమును, ద్వాదశ మందున్న శత్రు రోగ ఋణములు, వ్యవహార చిక్కులు, కష్టములు, యోగహీనమును శనిదశ యందు సంభవించును.

**8. రాహువు:-** ధనుర్లగ్నమై లగ్నమందు రాహువున్న రాహుదశ యందు శరీరపీడ, చంచల స్వభావము; లగ్నాధిపతియగు గురుడు బలవంతుడైయున్న లగ్నము నందున్న రాహువు యోగించును. గురుడు షష్టాష్టమ వ్యయములందు దుర్బలుడుగా యున్న రాహువు యోగించక కష్టములు గలిగించును. రాహువు ద్వితీయమందున్న ధనహీనము, యోగభంగము, శరీరపీడయును; తృతీయ మందున్న సుయోగము, సంపూర్ణ ఆయుర్భాగ్యములు, విశేష ధైర్యమును; చతుర్థ మందున్న యోగ భంగము, విద్య, భూమి, మాతృసౌఖ్యము యివి తక్కువగా నుండుట యును; పంచమ మందున్న సుయోగము, సంతాననష్టమును; షష్ఠమందున్న ప్రబల యోగము విశేష ఖ్యాతి, స్వల్ప శత్రువృద్ధి, శత్రువులకు అపజయమును; సప్తమ మందున్న సు యోగము, కళత్రనష్టము లేక జారత్వదోషమును, అష్టమమందున్న యోగభంగము విశేష కష్టములు, శరీరపీడయును, నవమమందున్న అఖండ యోగము, పిత్రార్జిత మును; దశమ మందున్న సుయోగము, స్వల్ప తీర్థ యాత్రలును, ఏకాదశ మందున్న సుయోగము, అన్యాయార్జనము, ద్వాదశ మందున్న యోగహీనము, విశేష కష్టములు, దుర్వ్యయమును రాహుదశ యందు గలుగును.

**9. కేతువు:-** ధనుర్లగ్నమై లగ్నమందు కేతువున్న కేతుదశలో పారమార్థిక చింత, కోపము, పట్టుదలయును ద్వితీయమందున్న ధనహీనము, శరీరపీడ, యోగ భంగమును, తృతీయమందున్న సుయోగము, సంపూర్ణ ఆయుర్భాగ్యములు, చతుర్థ మందున్న యోగహీనము, మాతృసౌఖ్యహీనము విద్యావిఘ్నము, స్వల్పభూమి యును పంచమ మందున్న సుయోగము, సంతాన సౌఖ్యహీనమును, షష్టమ మందున్న స్వల్ప యోగము, మాతృబంధు నష్టమును, సప్తమమందున్న యోగ భంగము, శరీర పీడ, కళత్రపీడయును, అష్టమ మందున్న యోగహీనము, శరీరపీడ, ధన వ్యయము, కష్టములును నవమ మందున్న సుయోగము, పూర్ణఆయుర్భాగ్యము లును, దశమ మందున్న సుయోగము, స్వల్పఆచారమును, ఏకాదశమందున్న విశేష ధనార్జనము, అన్యాయార్జనము, సుయోగమును, ద్వాదశమందున్న విశేషవ్యయము, పారమార్థిక చింతయును కేతుదశలో సంభవించును.

## 10. మకరాది గ్రహదశా ఫలములు

మకర లగ్నమందు రవిచంద్రులు కలసిన రవిదశ స్వల్పముగా యోగించును. చంద్రదశ యోగించదు. రవికుజులు కలసిన మధ్యమధ్య యోగించి పిమ్మట యోగభంగము గలుగును. రవిబుధులు కలసిన రవిదశ యోగించును. బుధదశ యోగించదు. రవిగురులు కలసిన రెండుదశలలో వ్యవహార చిక్కులు శరీపీడ గలుగును. రవిశుక్రులు కలసిన కళత్రసౌఖ్య ముండదు. రవిశనులు కలసిన రవిదశ యోగించును. శనిదశ యోగించదు. శరీరపీడ, ధనవ్యయము, నొకప్పుడు మారకము గూడ జరుగును.

చంద్రకుజులు కలసిన కళత్రవియోగము సంభవించును. కళత్రమునకు విషూచికాది బాధలు గలుగును. పూర్ణచంద్రుడైన విశేష భూలాభము గలుగును.

చంద్ర బుధులు కలసిన విశేషభాగ్యము గలుగును. రెండు దశలు యోగించును. కళత్రము వల్ల ఆస్తిగలుగును. చంద్రగురులు కలసిన కళత్రము స్థూలముగా నుండును. రెండుదశలు సామాన్యముగా యోగించును. చంద్రశుక్రులు కేంద్ర కోణముల యందు కలసిన వాహన ముద్రాధికారము గాని రాజసన్మానము గాని గలుగును. రెండుదశలు బాగుగా యోగించును. చంద్రశనులు కలసిన పూర్ణ చంద్రుడైన విశేష ధనజాతక మగును. శనిదశలో స్వల్పముగా శరీరపీడ సంభవించును. కుజ బుధులు కలసిన రెండు దశలు యోగించును. విశేష భాగ్య వంతుడగును. కుజ గురులు కలసిన పిత్రార్జిత నష్టమును. గురుదశ యోగమును. కుజదశ యోగ భంగము గలుగును. కుజశుక్రులు కలసిన సంతాన విచారము. కళత్ర విచారము గలుగును. కుజదశ శుక్రదశ రెండు యోగించును. కుజదశలో విశేష భూ సంపాదన గలుగును కుజశనులు గలసిన మశూచికాది బాధగలుగును. శనిదశ కంటె కుజదశ విశేషముగా యోగించును. బుధగురులు కలసిన బుధదశ యోగించదు. గురుదశ యోగించును. పిత్రార్జిత భూవ్యయము గలుగును. బుధ శుక్రులు రాజయోగ కారకులగుదురు. బుధశుక్రులు కేంద్రకోణములందెక్కడ కలసినను మిక్కిలి ఆయుర్భాగ్యములు, పేరుప్రతిష్టలు గలుగును. షష్టాష్టమ వ్యయము లందు కలసిన వాహన ముద్రాధి కారములుండవు. వీరు కన్యా మీన రాశుల యందు కలసిన బుధదశలో గాని శుక్ర దశలోగాని మధ్యమధ్య యోగ భంగము గలుగును. బుధశనులు కలసిన శనిదశ కంటె బుధదశ విశేషముగా యోగించును. శనిదశలో శరీరపీడ ధనవ్యయము గలుగును.

గురు శుక్రులు కలసిన విశేష సంతానము, దారిద్ర్యము గలుగును. గురు దశ యోగించునుగాని శుక్రదశ యోగించదు. గురుశనులు కలసిన స్థూలశరీరము వాతతత్వము గలుగును. గురుదశ యోగించును. శుక్రశనులు కలసిన పేరుప్రతిష్టలు, ఆయుర్భాగ్యములు, పాండిత్యము గలుగును. శుక్రదశలో శనిభుక్తియందుగాని శని దశలో శుక్రభుక్తి యందుగాని కళత్ర విచారము గలుగును. మధ్యమధ్య సంతాన నష్టము గూడ గలుగును. శుక్రదశయు గూడ పూర్తిగా యోగించును. మకర లగ్నమున రవిగురులును పూర్ణచంద్రుడును, మారకస్థానకుల యందున్న యెడల మారకము నిచ్చువారగుదురు.

1. **సూర్యుడు:-** మకర లగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో శరీరపీడ, ధనవ్యయము, యోగహీనము, ద్వితీయమందున్న ధనవ్యయము, యోగ భంగమును; తృతీయ మందున్న సంపూర్ణ ఆయుర్భాగ్యములు, స్వల్ప యోగమును; చతుర్థమందున్న మాతృసౌఖ్యహీనము, పూర్ణ ఆయుర్భాగ్యము, పిత్రార్జిత భూ నష్టమును; పంచమమందున్న పూర్ణ ఆయుర్దాయము, సంతాన సౌఖ్యహీనమును; షష్టమమందున్న శత్రువృద్ధి పిమ్మట శత్రుజయము, శరీరపీడయును, సప్తమమందున పతిభక్తి గల కళత్రము, కళత్రపీడయును, అష్టమమందున్న పూర్ణఆయుర్భాగ్యమును యోగభంగమును, నవమ మందున్న సుయోగము, పితృసౌఖ్యమును, దశమ మందున్న యోగహీనము, అల్పాయుర్భాగ్యములును; ఏకాదశ మందున్న పూర్ణ

ఆయుర్భాగ్యములు, సుయోగమును, ద్వాదశమందున్న యోగ భంగము బాలారిష్టము, దుర్వ్యయమును రవిదశ యందు సంభవించును.

2. **చంద్రుడు:-** మకరలగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్రదశలో పూర్ణచంద్రుడైన రూపము, స్వభావము, శరీరదారుఢ్యము స్వల్పముగా నుండుట యును, స్థూలశరీరమును, క్షీణచంద్రుడైన కృశించిన శరీరము కష్టములు, యోగ హీనమును; ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన ధనలాభము, విద్య, సుయోగము, నొకప్పుడు మారకమును, క్షీణచంద్రుడైన ధనహీనమును; తృతీయ మందున్న పూర్ణ చంద్రుడైన సోదరివృద్ధి, పిరికితనము, స్వల్పయోగము; క్షీణచంద్రుడైన సుయోగము, ధైర్యస్థైర్యములును, చతుర్థమందున్న పూర్ణచంద్రుడైన విద్య, భూమి, వాహనము, మాతృ సౌఖ్యమును; క్షీణచంద్రుడైన పై ఫలములు స్వల్పమును; పంచమమందున్న పూర్ణచంద్రుడైన కీర్తిగల యేకపుత్రుడు, సుయోగమును క్షీణచంద్రుడైన సంతాన నష్టము, స్వల్పయోగమును, షష్ఠమమందున్న పూర్ణచంద్రుడైన శత్రురోగ ఋణ హీనమును, క్షీణచంద్రుడైన స్వల్ప శత్రు రోగ ఋణములును; సప్తమమందున్న పూర్ణచంద్రుడైన సుందర కళత్రము, శరీర పీడయును; క్షీణచంద్రుడైన కళత్ర సౌఖ్య హీనము, యోగభంగమును; అష్టమమందున్న పూర్ణచంద్రుడైన మధ్య మాయుర్దా యమును; క్షీణచంద్రుడైన అల్పాయుర్దాయము, యోగభంగమును; నవమ మందున్న పూర్ణచంద్రుడైన సంపూర్ణ ఆయు ర్భాగ్యము, పితృ పేరుప్రతిష్ఠలును, క్షీణచంద్రుడైన పితృసౌఖ్య హీనమును, సుయోగమును, దశమమందున్న పూర్ణచంద్రుడైన శిష్టా చారము, స్వతంత్ర వృత్తివల్ల జీవనము, తీర్థయాత్రలు, సుయోగమును, క్షీణ చంద్రుడైన ఆచార విహీనము, నీచ వృత్తి, డాంబికము; ఏకాదశమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పయోగము, కళత్ర సౌఖ్యహీనము; క్షీణచంద్రుడైన కళత్ర విచారము, ధన వ్యయమును; ద్వాదశమందున్న పూర్ణచంద్రుడైన ధర్మ కార్యములు, కళత్ర రోగము; క్షీణచంద్రుడైన కళత్రనష్టము, దుర్వ్యయము, యోగభంగము చంద్రదశ యందు సంభవించును.

3. **కుజుడు:-** మకర లగ్నమై లగ్నమున కుజుడున్న కుజదశలో మిశ్రమ ఫలము, పేరుప్రతిష్ఠలు, కోపము, శరీరసౌఖ్యహీనము, సుయోగమును, ద్వితీయ మందున్న ధనవ్యయము, సంతానవిచారమును; తృతీయమందున్న ధైర్యము, యోగ హీనము, సోదరనష్టమును; చతుర్థమందున్న సుయోగము, విశేష భూలాభమును; పంచమమందున్న సుయోగము సంతాన విచారము, గర్భస్రావమును, షష్ఠమమందున్న, యోగభంగము, స్వల్పభూనష్టము, వ్యవహార చిక్కులును; సప్తమమందున్న కళత్ర దుర్బలము, యోగభంగము, భూవ్యయమును; అష్టమమందున్న కళత్ర విచారము, ధనవ్యయము యోగ భంగము; నవమమందున్న స్వల్పయోగము, పితృసౌఖ్య హీనమును; దశమమందున్న పూర్ణయోగము, పేరుప్రతిష్ఠలును, ఏకాదశ మందున్న

సుయోగము, అన్యాయార్జితము, భూలాభమును; ద్వాదశ మందున్న యోగ హీనము, కళత్రపీడ, ధనవ్యయమును, కుజదశయందు గలుగును.

4. **బుధుడు:-** మకర లగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో విద్యావినయ సంపన్నము, వేదశాస్త్రములు, పూర్ణయోగమును; ద్వితీయమందున్న ధన లాభమును, శరీరపీడయును; తృతీయమందున్న యోగ హీనము, కష్టములు, స్వల్ప యోగ పితృసౌఖ్యమును, చతుర్ధ మందున్న సుయోగము, విద్య, భూమి, వాహనము, మాతృసౌఖ్యమును; పంచమ మందున్న పూర్ణయోగము, భాగ్యవృద్ధి, స్త్రీ సంతానమును షష్టమమందున్న యోగహీనము, శతృవ్యవహారమువల్ల పిత్రార్జితనష్టమును; సప్తమ మందున్న విశేష శరీరపీడ, భాగ్యాభివృద్ధియును, అష్టమమందున్న విశేష దరిద్రముమ; నవమమందున్న విశేషభాగ్యము, అఖండయోగమును, దశమమందున్న వైద్యము లేక వర్తకమువల్ల విశేష ధనార్జనము, విశేషఖ్యాతి; అఖండ యోగమును; ఏకాదశ మందున్న సుయోగము, యుక్తితో, ధనార్జనమును; ద్వాదశమందున్న విశేష వ్యవహార చిక్కులు, దాతృత్వమును బుధదశలో గలుగును.

5. **గురుడు:-** మకర లగ్నమై లగ్నమున గురుడున్న గురుదశలో పేరు ప్రతిష్టలు; యోగ్యత, సామాన్య దేహదారుఢ్యమును; ద్వితీయమందున్న కుటుంబ వృద్ధి, ధనవృద్ధి, స్వల్పయోగమును; తృతీయమందున్న సోదరవృద్ధి; సోదరులవల్ల అభివృద్ధియు, స్వల్పయోగమును; చతుర్ధమందున్న స్వల్ప, విద్య, భూమి, మాతృ సౌఖ్యము, గృహము, వాహనమును, స్వల్పయోగమును; పంచమమందున్న విశేష సంతానము, స్వల్పసంతాననష్టము, సుయోగమును; షష్టమమందున్న యోగహీనము, విశేష శతృ రోగ ఋణములును; సప్తమ మందున్న స్థూలకళత్రము, సుయోగము, ధన వ్యయమును; అష్టమ మందున్న యోగహీనము, దరిద్రము, కుటుంబ వృద్ధియును; నవమ మందున్న స్వల్పయోగము, పితృసౌఖ్యమును; దశమమందున్న విశేష పేరుప్రతిష్టలు, స్వతంత్రజీవనము, స్వల్పయోగమును; ఏకాదశమందున్న సుయోగము, విశేష ధనార్జనము, న్యాయమైన వృత్తివల్ల జీవనమును, ద్వాదశ మందున్న ధనవ్యయము, న్యాయమైన వ్యయము, సుయోగమును గురుదశ యందు గలుగును.

6. **శుక్రుడు:-** మకర లగ్నమై లగ్నమున శుక్రుడున్న శుక్రదశలో పిత్రార్జితము, దుష్కార్యములు, అన్యాయార్జనమును; ద్వితీయమందున్న నీచ వృత్తి, ధన లాభము, దుర్మార్గమును; తృతీయమందున్న పేరుప్రతిష్టలు, సోదరీసంపన్నము, స్త్రీలవల్ల ధనాభివృద్ధియును; చతుర్ధమందున్న భూలాభము, గృహనిర్మాణము, వాహన ప్రాప్తియును; పంచమమందున్న సౌఖ్యము, ధనలాభము, జారత్వమువల్ల ధనవ్యయము, విశేష పుత్రులును; షష్టమమందున్న హృద్రోగము, జలగండము, శరీర పీడయును; సప్తమ మందున్న సుకళత్రము, న్యాయశాస్త్రము వల్ల జీవనము; అష్టమ మందున్న కళత్ర సౌఖ్యహీనము, వాహనహాని, కళత్రపీడయును; నవమమందున్న పిత్రార్జిత నష్టము, దుర్మార్గము, భక్తిహీనమును; దశమమందున్న విశేషఖ్యాతి,

గౌరవము. భూలాభము. సత్కార్యములు. ధనలాభము. కళత్రము వల్ల ధన లాభమును. ఏకాదశమందున్న పేరుప్రతిష్టలు. వంశవృద్ధి. వాహన లాభము. కళత్ర సౌఖ్యమును. ద్వాదశ మందున్న ఇహలోక సౌఖ్యము. ధనలాభము. ఉపకారము. దాతృత్వము. వ్యాపారమువల్ల ధననష్టమును శుక్రదశయందు సంభవించును.

7. **శని :-** మకర లగ్నమై లగ్నమున శనియున్న శనిదశలో సౌఖ్యహీనము. సుయోగమును. ద్వితీయమందున్న ధనవ్యయము. శరీరపీడ. కుటుంబ చిక్కులును; తృతీయ మందున్న పూర్ణ ఆయుర్భాగ్యములు. పారమార్థిక చింతయును; చతుర్ధ మందున్న యోగహీనము. శరీరపీడ. ధన వ్యయమును; పంచమమందున్న సుయోగము. సంతాన సౌఖ్యహీనము; షష్టమమందున్న శత్రురోగ ఋణములు. యోగ భంగమును; సప్తమ మందున్న సుయోగము. కళత్రసౌఖ్య హీనమును; అష్టమమందున్న యోగ భంగము. విశేషకష్టములును; నవమమందున్న సుయోగము. పితృసౌఖ్య హీనమును; దశమ మందున్న పేరుప్రతిష్టలు. వాహన ముద్రాధికారము. సంపూర్ణ ఆయుర్భాగ్య ములు. అఖండ యోగమును. ఏకాదశమందున్న సుయోగము. విశేష భూలాభమును. ద్వాదశమందున్న పిత్రార్జిత స్వార్జిత నష్టము. డాంబిక ధనవ్యయము యోగహీనమును శని దశయందు సంభవించును.

8. **రాహువు:-** మకర లగ్నమై లగ్నమున రాహువున్న రాహుదశ యందు యోగహీనము. శరీరపీడ. ధనవ్యయము. దుష్టస్వభావమును; ద్వితీయ మందున్న యోగహీనము. ధనవ్యయమును తృతీయమందున్న పూర్ణ ఆయుర్దాయము. విశేష భాగ్యము. అఖండ యోగమును; చతుర్ధమందున్న యోగహీనము. విద్యావిఘ్నము. భూ వ్యయము. మాతృపీడయును; పంచమ మందున్న సుయోగము. సంతాన విచారమును. షష్టమ మందున్న పూర్ణ ఆయుర్భాగ్యములు. మధ్యమధ్య శత్రురోగ ఋణములును. సప్తమ మందున్న యోగహీనము. కళత్రనష్టము. శరీరపీడయును. అష్టమమందున్న సుయోగము. విశేషకష్టములు. ధనవ్యయమును. నవమమందున్న సుయోగము. పిత్రా రిష్టమును. దశమ మందున్న స్వల్పయోగము. చంచలత్వము. విదేశ సంచారము; తీర్థయాత్రలును. ఏకాదశ మందున్న సుయోగము. నీచవృత్తివల్ల ధనార్జనమును. ద్వాదశమందున్న యోగభంగము. దుర్జన సాంగత్యము. దుర్వ్యయమును రాహుదశ యందు సంభవించును.

9. **కేతువు:-** మకర లగ్నమై లగ్నమున కేతువున్న కేతుదశ యందు శరీర పీడయును. ద్వితీయమందున్న ధనవ్యయము. పారమార్థిక చింతయును. తృతీయ మందున్న సుయోగము. పూర్ణ ఆయుర్భాగ్యములును. చతుర్ధ మందున్న యోగ హీనము. స్వల్పవిద్య. భూమి. మాతృసౌఖ్యమును. పంచమ మందున్న సంతాన సౌఖ్యహీనము. స్వల్ప యోగమును. షష్టమమందున్న శత్రురోగ ఋణములును. సప్తమమందున్న యోగహీనము. శరీరపీడ. కళత్ర నష్టమును అష్టమమందున్న యోగహీనము. శరీరపీడ. ధనవ్యయము. శత్రువృద్ధియును. నవమమందున్న సుయోగము. పూర్ణ ఆయుర్భాగ్యములు. పితృసౌఖ్య హీనమును. దశమమందున్న

స్వల్ప ఆచారము, పారమార్థికచింత, సుయోగమును, ఏకాదశమందున్న సుయోగము, పూర్ణ ఆయుర్భాగ్యములును, ద్వాదశమందున్న ధనవ్యయము, పారమార్థిక చింతయును కేతుదశయందు సంభవించును.

## 11. కుంభాది గ్రహదశా ఫలములు

కుంభ లగ్నమునకు రవిచంద్రులు కలసి యున్న కళత్రపీడ సంభవించును. చంద్రదశ యోగించును గాని రవిదశ యోగించదు. రవికుజులు కలసిన రెండుదశలు యోగించును. కళత్రరోగము, కళత్ర భాగ్యము కొంత గలుగును. రవి బుధులు కలసిన బుధదశ పూర్ణ యోగమును రవిదశ మధ్యమధ్య యోగించును. రవిగురులు రెండు దశలు యోగించును. విశేష ధనజాతకమగును రవి దశ కంటె గురుదశ పూర్తిగా యోగించును. రవిశుక్రులు కలసిన రెండు దశలు పూర్తిగా యోగించును. కళత్ర భూమి కొంత కలుగును. రవిశనులు కలసిన రవిదశ యోగించదు. శనిదశ మధ్యమధ్య యోగభంగము కలుగును. కళత్రసౌఖ్య హీనమగును.

చంద్రకుజులు, చంద్రబుధులు, చంద్రగురులు, చంద్రశుక్రులు కలసినప్పుడు చంద్రదశ యోగించును గాని కుజ బుధ గురు శుక్రదశలు యోగించవు. చంద్ర దశలో భూలాభము, ధనవృద్ధి, విశేష భాగ్యము గలుగును. కాని కుజదశలో ఋణవృద్ధి, గురుదశలో ఋణవృద్ధి, శుక్రదశలో భాగ్యక్షీణము గలుగును. చంద్ర శనులు కలసిన రెండు దశలు యోగించవు. వాతరోగము, శత్రురోగ ఋణములు గలుగును.

కుజబుధులు కలసిన కుజదశ యోగించదు. బుధదశ కొంత వరకు యోగించి విశేష భూమి సంపాదించ గలుగును. కుజగురులు కలసిన రెండు దశలు పూర్తిగా యోగించును. విశేష ధనజాతక మగును. కుజశుక్రులు కలసిన రాజయోగ కారకులగుదురు. కుజశుక్రలు కేంద్రకోణముల యందున్న విశేష భూలాభము లేక వాహన ముద్రాధికారము గల గొప్పయుద్యోగము గలుగును. షష్టాష్టమ వ్యయము లందు కలసిన మధ్యమధ్య యోగభంగము, కళత్ర విచారము సంభవించును. కుజ శనులు కలసిన కుజదశ మధ్యమధ్య యోగభంగము గలుగును. శరీరసౌఖ్య ముండదు. శనిదశ పూర్తిగా యోగించును.

బుధగురులు కలసిన బుధదశలో విశేష ధనార్జన గలుగును. గురు దశ కంటె బుధదశ బాగుగా యోగించును. బుధ శుక్రులు కలసిన బుధదశ విశేషముగా యోగించును. శుక్రదశ మధ్యమధ్య యోగభంగము గలుగును. బుధశనులు కలసిన రెండు దశలు యోగించవు. శరీరపీడ, ధనవ్యయము, సంతాన సౌఖ్యహీనము గలుగును.

గురుశుక్రులు కలసిన రెండు దశలు పూర్తిగా యోగించును, విశేష ధనవృద్ధి, సంతానవృద్ధియు గలుగును. గురుశనులు కలసిన శనిదశ యోగించును. గురుదశ యోగించదు. జాతకుడు పేరుప్రతిష్టలు గల యోగ్యుడగును.

శుక్రశనులు కలసిన శుక్రదశ కంటె శనిదశ విశేషముగా యోగించును. విద్యావంతుడు, ధనవంతుడు, విశేష భూజాతకుడగును.

1. **సూర్యుడు:-** కుంభ లగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో స్వల్ప యోగము, శరీరపీడయును; ద్వితీయమందున్న ధనవ్యయము, శరీరపీడ, స్వల్ప యోగమును; తృతీయమందున్న పూర్ణయోగము, సుకళత్రము, కళత్ర భాగ్యమును; చతుర్ధమందున్న కళత్రభాగ్యమును; పంచమమందున్న సుయోగము, పుత్ర సంతానమును; షష్టమమందున్న కళత్రపీడ, యోగ భంగమును; సప్తమమందున్న సుకళత్రము, సుయోగమును; అష్టమమందున్న కళత్రపీడ, యోగహీనమును; నవమ మందున్న కళత్ర నష్టము, ధన వ్యయమును; దశమమందున్న పూర్ణయోగమును; ఏకాదశమందున్న పూర్ణయోగము, ధనలాభము, భూలాభమును; ద్వాదశమందున్న యోగ భంగము, కళత్రపీడ, ధనవ్యయము రవిదశయందు సంభవించును.

2. **చంద్రుడు:-** కుంభలగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్ర దశలో పూర్ణ చంద్రుడైన యోగహీనము, వాతరోగమును; క్షీణచంద్రుడైన దుష్ట స్వభావము, విశేష కష్టములును; ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన స్వల్ప ధనము; క్షీణ చంద్రుడైన ధనహీనము, శరీరపీడ, యోగభంగమును; తృతీయమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పయోగము, సోదరీవృద్ధి, క్షీణచంద్రుడైన సుయోగము, సోదర నష్టమును; చతుర్ధ మందున్న పూర్ణచంద్రుడైన ఋణము, భూలాభము, పేరు ప్రతిష్టలు, ధనహీనమును, క్షీణచంద్రుడైన స్వల్ప మాతృ సౌఖ్యము, విద్య, భూమి, యోగ హీనమును, పంచమమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పసంతాన నష్టము, స్వల్ప యోగమును, క్షీణచంద్రుడైన సంతాన సౌఖ్య హీనము, యోగహీనమును, షష్టమమందున్న పూర్ణచంద్రుడైన స్వల్ప యోగమును, క్షీణచంద్రుడైన యోగ హీనమును, శత్రురోగ ఋణములును, సప్తమమందున్న పూర్ణ చంద్రుడైన సుయోగము, సుకళత్రమును, క్షీణచంద్రుడైన కళత్ర పీడ, యోగభంగమును, అష్టమందున్న పూర్ణచంద్రుడైన మధ్యాయుర్దాయము, శరీర సౌఖ్యహీనము, క్షీణ చంద్రుడైన అల్పాయుర్దాయమును, నవమమందున్న పూర్ణ చంద్రుడైన సుయోగమును, క్షీణచంద్రుడైన పితృసౌఖ్య హీనము, యోగ భంగమును, దశమమందున్న పూర్ణచంద్రుడైన స్వల్పయోగము, క్షీణ చంద్రుడైన పూర్ణయోగమును, ఏకాదశ మందున్న పూర్ణచంద్రుడైన ధన లాభము, క్షీణచంద్రుడైన సుయోగము, అన్యాయా ర్జనమును, ద్వాదశ మందున్న పూర్ణచంద్రుడైన శుభకార్యముల వల్ల ధన వ్యయము, తీర్థయాత్రలు, క్షీణచంద్రుడైన దుర్జన సాంగత్యము, దుర్వ్యయము, యోగ భంగమును చంద్ర దశ యందు సంభవించును.

కుంభలగ్నమున చంద్రుడు కేంద్రకోణముల యందున్న ధన వ్యయమున్నను ధనసంపాదన గలుగును.

3. **కుజుడు:-** కుంభలగ్నమై లగ్నమున కుజుడున్న కుజదశలో సుయోగము, కోపస్వభావము, శరీర సౌఖ్యహీనమును, ద్వితీయమందున్న కళత్ర లేక సంతాన విచారము, ధనార్జనము, ధనవ్యయమును, తృతీయమందున్న సుయోగము, భూ లాభము, సోదర భాగ్యలాభమును, చతుర్ధ మందున్న సుయోగము, విద్యా

విఘ్నమును; పంచమమందున్న సుయోగము. సంతాన సౌఖ్యహీనము; షష్టమ మందున్న యోగహీనము. శత్రువులు. రోగములును; సప్తమమందున్న సుయోగము. కళత్రపీడయును; అష్టమ మందున్న యోగభంగము. అష్టకష్టములు. విశేష వ్యవహార చిక్కులును; నవమమందున్న విశేష యోగము. రాజసన్మానమును. దశమమందున్న అఖండ యోగము. గొప్ప యుద్యోగమును; ఏకాదశ మందున్న విశేష ధనలాభము. సుయోగమును; ద్వాదశమందున్న మధ్యమధ్య యోగభంగము. ధనవ్యయము. యోగ హీనమును కుజదశ యందు సంభవించును.

4. **బుధుడు:-** కుంభలగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో సుయోగమును; ద్వితీయమందున్న యోగభంగము. ధనహీనము. సంతాన విచారమును; తృతీయమందున్న మిశ్రమ ఫలము. పిరికితనమును; చతుర్థమందున్న సుయోగము విద్యావృద్ధి. భూలాభము. మాతృసౌఖ్యమును; పంచమమందున్న సుయోగము స్త్రీ సంతానమును; షష్టమ మందున్న యోగభంగము. సంతాన నష్టమును; సప్తమ మందున్న సుకళత్రము. స్వల్ప యోగమును; అష్టమమందున్న విశేష స్త్రీ సంతానము. తాపత్రయము. యోగాంగమును. నవమమందున్న సుయోగము. భాగ్య వృద్ధి. విశేష స్త్రీ సంతానమును. దశమమందున్న వైద్యము లేక వాణిజ్యము వల్ల జీవనము. ఏకాదశమందున్న సుయోగము. న్యాయార్జనమును. ద్వాదశమందున్న యోగహీనము. శత్రురోగ ఋణములును బుధదశ యందు గలుగును.

5. **గురుడు:-** కుంభ లగ్నమై లగ్నమున గురుడున్న గురుదశలో సుయోగము. స్థూలశరీరము. యోగ్యతయును. ద్వితీయ మందున్న సుయోగము. ధన లాభమును. తృతీయమందున్న స్వల్పయోగము. సోదర వృద్ధియును. చతుర్థ మందున్న విద్య. భూమి. సుయోగము. మాతృ దీర్ఘా యుష్యమును. పంచమ మందున్న సుయోగము. విశేష సంతానవృద్ధియును. షష్టమమందున్న యోగ భంగము. ధనవ్యయమును. సప్తమ మందున్న సుకళత్రము. పూర్ణయోగమును. అష్టమ మందున్న ధనవ్యయము. యోగ భంగమును. నవమమందున్న భాగ్య లాభము. విశేష పిత్రార్జిత స్వార్జితమును. దశమమందున్న స్వతంత్ర విద్యవలన జీవితము. విశేషఖ్యాతి. అఖండ యోగమును. ఏకాదశమందున్న విశేషధనము. న్యాయార్జితము. మిశ్రమ ఫలమును. ద్వాదశమందున్న యోగభంగము. సంతాన విచారము. ధన వ్యయము. కష్టములును గురుదశయందు సంభవించును.

6. **శుక్రుడు:-** కుంభలగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశలో అఖండ యోగము. విద్యావినయ సంపన్నము. యోగ్యత భాగ్యలాభమును. ద్వితీయమందున్న విశేష ధనలాభము. వాక్చాతుర్యము. సుయోగమును. తృతీయమందున్న యోగ హీనము. సోదరీల సహాయమువల్ల జీవనము. చతుర్థ మందున్న విశేష భూలాభము. వాహన ముద్రాధికారము. గొప్పయుద్యోగము. సుయోగమును. పంచమమందున్న విశేష స్త్రీ సంతానము. స్వతంత్ర విద్య వలన జీవనము. షష్టమమందున్న యోగ భంగము. విశేష శత్రురోగ ఋణములును. సప్తమమందున్న సుకళత్రము. కళత్రము

వల్ల భాగ్య లాభము, సుయోగమును, అష్టమమందున్న కళత్రవిచారము, సంతాన విచారము, మధ్యమధ్య యోగభంగమును, నవమమందున్న విశేషభాగ్యము, అఖండ యోగము, దశమమందున్న సుయోగము, రాజసన్మానము, విద్యవలన స్వతంత్ర జీవనమును, ఏకాదశమందున్న సుయోగము, న్యాయధనార్జనమును, ద్వాదశమందున్న ధర్మకార్యములు, దాతృత్వము, స్వల్పయోగమును శుక్రదశ యందు గలుగును.

కుంభలగ్నమునకు శుక్రుడు వాహన భాగ్యాదిపతి యగుటచే కేంద్ర కోణముల యందున్న అఖండయోగము నిచ్చును. తృతీయ షష్టాష్టమములందున్న మధ్యమధ్య యోగభంగము గలుగును.

7. **శని:-** కుంభలగ్నమై లగ్నమున శనియున్న శనిదశలో స్వల్ప యోగము, శరీరపీడయును, ద్వితీయమందున్న ధనవ్యయము, యోగహీనము, మారకమును, తృతీయమందున్న దుష్టస్వభావము, శరీరపీడయును, చతుర్థ మందున్న మంచి యోగము, విద్య, భూలాభమును, పంచమమందున్న సుయోగము సంతాన సౌఖ్య హీనము; షష్టమమందున్న యోగహీనము, శత్రురోగ ఋణమును; సప్తమమందున్న శరీరపీడ, కళత్ర పీడయును; అష్టమమందున్న అష్టకష్టములు, శత్రురోగ ఋణము లను; నవమమందున్న సుయోగము, విశేష పేరు ప్రతిష్టలును; దశమమందున్న విశేష ఖ్యాతి, యోగహీనమును ఏకాదశమందున్న సు యోగము, అన్యాయార్జనము; ద్వాదశమందున్న యోగహీనము, ధనవ్యయమును శనిదశ యందు సంభవించును.

8. **రాహువు:-** కుంభలగ్నమై లగ్నమున రాహువున్న రాహుదశ యందు శరీరపీడ, ధనవ్యయము, శత్రువృద్ధి, యోగహీనమును; ద్వితీయమందున్న యోగహీనము, ధనవ్యయము, మధ్యమధ్య శరీర పీడయును; తృతీయమందున్న సుయోగము, పూర్ణఆయుర్భాగ్యములును, చతుర్థ మందున్న సుయోగము, పేరు ప్రతిష్టలును; పంచమమందున్న సుయోగము సంతానసౌఖ్య హీనమును; షష్టమ మందున్న యోగహీనము, శత్రురోగ ఋణములును, సప్తమమందున్న యోగ హీనము, కళత్రపీడ, శరీరపీడయును, అష్టమ మందున్న యోగహీనము, శరీరపీడ, ధనవ్యయమును; నవమమందున్న స్వల్పయోగము, పితృసౌఖ్యహీనము, దశమ మందున్న స్వల్పయోగము, నీచవృత్తి వల్ల జీవనమును, ఏకాదశమందున్న సుయోగము, అన్యాయార్జనమును, ద్వాదశమందున్న యోగహీనము, దుర్జనసాంగత్యము, దుర్వ్య యమును రాహుదశ యందు సంభవించును.

9. **కేతువు:-** కుంభ లగ్నమై లగ్నమందు కేతువున్న కేతుదశలో యోగ హీనము, శరీరపీడ, ధనవ్యయము, పారమార్థిక చింతయును, ద్వితీయ మందున్న యోగహీనము, ధనవ్యయము, శరీరపీడయును, తృతీయమందున్న సుయోగము, పూర్ణా యుర్భాగ్యములును, చతుర్థమందున్న యోగహీనము, విద్యావిఘ్నము, మాతృ విచారము, భూవ్యయమును, పంచమమందున్న సంతాన సౌఖ్యహీనము, స్వల్ప స్త్రీ సంతానము, షష్టమమందున్న స్వల్పయోగము, శత్రువుల వల్ల ధనార్జనమును, సప్తమమందున్న యోగహీనము, కళత్ర పీడయును, అష్టమమందున్న శత్రురోగ

ఋణములు, దరిద్రమును, నవమమందున్న సుయోగము. విశేష పేరు ప్రతిష్టలు, విద్యావినయ సంపన్నమును, ఏకాదశమందున్న సుయోగము, దనార్జనమును, ద్వాదశమందున్న పారమార్థికచింత, యోగహీనము, విశేష ధనవ్యయమును, కేతుదశ యందు సంభవించును.

## 12. మీనాది గ్రహదశా ఫలములు

మీనలగ్నమున రవిదశ యోగించునుగాని చంద్రదశ యోగించదు. రవి కుజులు, రవిబుధులు, రవిగురులు కలసిన రవిదశ యోగించును. కుజ, బుధ, గురుదశలు యోగించవు. కుజదశ యందు ఋణము, భూవ్యయమును బుధదశ యందు శత్రురోగ ఋణములును, గురుదశ యందు ఉద్యోగ భంగము, శరీరపీడ, ధన వ్యయము గలుగును. రవిశుక్రులు కలసిన రెండుదశలు యోగించవు. శత్రురోగ ఋణములు, కష్టములు సంభవించును. రవిశనులు కలసిన విశేష దరిద్రుడగును. ధనవ్యయము, వ్యవహార చిక్కులు గలుగును.

చంద్రకుజులు, చంద్ర బుధులు, చంద్రగురులు కలసిన అఖండముగా యోగించును. చంద్రకుజుల యందు చంద్రదశలో సంతాన నష్టమును, చంద్ర బుధుల యందు స్త్రీసంతాన లాభమును, చంద్రగురుల యందు అదృష్ట సంతానము వల్ల సౌఖ్యమును గలుగును. చంద్రశుక్రులు కలసిన శుక్రదశ యోగించును. చంద్రదశ యోగించదు. చంద్రదశలో వ్యవహార చిక్కులు, సంతాన విచారము గలుగును. చంద్రశనులు కలసిన శనిదశ కొంతవరకు యోగించును. చంద్రదశ యోగించదు. సంతాన నష్టము గలుగును.

కుజబుధులు కలసిన రెండు దశలు యోగించును. స్త్రీవల్ల భూలాభము, కళత్ర రోగము లేక మశూచిక బాధగలుగును. కుజగురులు కలసిన రెండుదశలు అఖండముగా యోగించును. కుజశుక్రులు కలసిన శుక్రదశ యోగించును. కుజదశ యోగించదు. వ్యవహార చిక్కులు గలుగును. కుజశనులు కలసిన శనిదశ స్వల్పము గా యోగించును. కుజదశ యోగించదు. సంతాన విచారము గలుగును.

బుధగురులు కలసిన రెండు దశలు యోగించును. పంచమ నవమ కోణముల యందు కలసిన అఖండయోగము గలుగును. బుధశుక్రులు కలసిన శుక్రదశ స్వల్పముగా యోగించును. బుధదశ యోగించదు. బుధశనులు కలసిన శనిదశ స్వల్పముగా యోగించును. బుధదశలో శరీరపీడ, కళత్ర విచారము గలుగును. రెండుదశలు మారక లక్షణములు గలిగి యుండును.

గురుశుక్రులు కలసిన శుక్రదశ యోగించును. గురుదశ యోగించదు. గురు దశలో వ్యవహార చిక్కులు, శరీరపీడ, ధనవ్యయము గలుగును. గురుశనులు గలసిన శనిదశ యోగించును. గురుదశ యోగించదు. గురుదశలో శరీరపీడ, ధనవ్యయము, శత్రువృద్ధి గలుగును.

శుక్రశనులు కలసిన రెండు దశలు యోగించవు. కళత్ర విచారము ధనవ్యయము, వ్యవహార చిక్కులు గలుగును.

మీనలగ్నమునకు కుజగురులు రాజయోగ కారకులు. గురుడు యుభయ కేంద్రాధిపతియైనను లగ్నాధిపతియు దశమ కేంద్రదాధిపతి యగుటచే విశేషముగా యోగించును. గురు కుజాలు గలసి కేంద్ర కోణము లందున్న గొప్పజాతక మగును. లేక వాహన ముద్రాధికారము గల గొప్ప ఉద్యోగము చేయును. చంద్రుడు పంచమ కోణాధిపతి యగుటచేత అఖండ యోగము నిచ్చును. ఈ లగ్నమున కుజగురు చంద్రులలో నెవరు కలసి యున్నను విశేష రాజయోగము గలుగును. బుధుడు యుభయ కేంద్రాధిపతి యగుట వలన లగ్నము గాక తక్కిన కేంద్రకోణముల యందు యోగించును. రవి శుక్రశనులు యే స్థానమందున్నను యోగించరు.

1. **సూర్యుడు:-** మీన లగ్నమై లగ్నమందు రవియున్న రవిదశలో శరీర పీడ, ధనవ్యయము, యోగహీనము, ఖ్యాతియును; ద్వితీయమందున్న ధననష్టము, శరీర పీడయును తృతీయమందున్న యోగభంగమును; చతుర్థ మందున్న స్వల్ప విద్య, భూమి, వాహనము, స్వల్ప యోగమును; పంచమమందున్న సంతాన సౌఖ్య హీనము, సుయోగమును, షష్టమమందున్న యోగహీనము, సంపూర్ణ ఆయుర్భాగ్య ములును, అష్టమ మందున్న యోగభంగము, విశేష కష్టములును; నవమమందున్న సుయోగమును, పూర్ణ ఆయుర్భాగ్యములును; దశమ మందున్న సుయోగము, స్వల్పధనము, విశేషఖ్యాతియును, ఏకాదశమందున్న స్వల్పయోగము, శత్రుబాధ, జయమును, ద్వాదశమందున్న యోగహీనము, శత్రురోగ ఋణములును రవిదశ యందు సంభవించును.

2. **చంద్రుడు:-** మీనలగ్నమై లగ్నమందు చంద్రుడున్న చంద్రదశలో అఖండ యోగము, పేరుప్రతిష్టలును, క్షీణచంద్రుడైన స్వల్పయోగము, సంతాన విచారమును, ద్వితీయమందున్న పూర్ణచంద్రుడైన విశేషధనము, ఖ్యాతియును క్షీణ చంద్రుడైన స్వల్పధనము, సుయోగమును, తృతీయ మందున్న పూర్ణచంద్రుడైన ప్రఖ్యాతి గల సంతానము, సుయోగమును, విశేష భాగ్యమును, క్షీణచంద్రుడైన స్వల్ప యోగమును, చతుర్థమందున్న పూర్ణ చంద్రుడైన విద్యాభివృద్ధి, భూలాభము, వాహనసౌఖ్యము, మాతృ సౌఖ్యము, పూర్ణయోగమును, క్షీణచంద్రుడైన స్వల్ప యోగము, విద్యాభివృద్ధియును, పంచమమందున్న పూర్ణచంద్రుడైన సుయోగము, మంచి సంతానమును, క్షీణచంద్రుడైన సంతాననష్టము, స్వల్పయోగమును. షష్టమ మందున్న పూర్ణ చంద్రుడైన స్వల్పయోగమును, క్షీణచంద్రుడైన యోగహీనము, శత్రురోగ ఋణములును, సప్తమమందున్న పూర్ణచంద్రుడైన సుయోగము, సుకళత్ర ము, క్షీణచంద్రుడైన స్వల్ప యోగమును, అష్టమమందున్న పూర్ణ చంద్రుడైన స్వల్ప యోగము, క్షీణచంద్రుడైన యోగహీనమును, నవమ మందున్న పూర్ణ చంద్రుడైన యోగ హీనము, సంతాన విచారము, క్షీణ చంద్రుడున్న యోగభంగమును, దశమ మందున్న పుర్ణచంద్రుడైన విశేష ఆచారము, తీర్దయాత్రులు, అఖండయోగము, క్షీణ చంద్రుడైన స్వల్ప ఆచారము, స్వల్ప యోగమును; ఏకాదశ మందున్న పూర్ణ చంద్రుడైన విశేష ధనార్ధనము, తీర్థయాత్రలును; క్షీణచంద్రుడైన స్వల్పయోగము, అన్యాయ ధనార్జనమును సంభవించును. ద్వాదశమందున్న పూర్ణచంద్రుడైన

శుభకార్యముల వల్ల ధనవ్యయము, క్షీణచంద్రుడైన దుర్జన సాంగత్యము, దుర్వ్యయము సంభవించును.

3. **కుజుడు:-** మీనలగ్నమై లగ్నమున కుజుడున్న కుజదశలో సు యోగము, స్వల్ప శరీరసౌఖ్యమును; ద్వితీయమందున్న కుజదశలో సుయోగము, స్వల్ప శరీర సౌఖ్యమును ద్వితీయమందున్న సుయోగము, స్వల్ప కుటుంబ సౌఖ్యమును, తృతీయమందున్న యోగహీనము, అధికారములేని స్వల్ప వుద్యోగమును; చతుర్థమందున్న సుయోగము, శత్రులేక జ్ఞాతుల వల్ల భూలాభము, స్వల్పవిద్య భూమి, వాహనము, మాతృసౌఖ్యమును; పంచమ మందున్న అఖండయోగము, సంతాననష్టమును, షష్టమ మందున్న వ్యవహార చిక్కులు, యోగ భంగమును, సప్తమ మందున్న సుయోగము, కళత్ర పీడయును, అష్టమమందున్న పితృభాగ్య నాశము, కళత్రసౌఖ్య హీనమును; నవమమందున్న గొప్ప ఉద్యోగము లేక విశేష భూ లాభము, అఖండ యోగము, దశమమందున్న సుయోగమును, విశేష భూ లాభమును, ద్వాదశ మందున్న యోగహీనము, కళత్రవిచారము, ధనవ్యయమును కుజదశ యందు సంభవించును.

4. **బుధుడు:-** మీనలగ్నమై లగ్నమందు బుధుడున్న బుధదశలో యోగ హీనము, కళత్ర సౌఖ్యహీనము, సామాన్య విద్యయును, ద్వితీయ మందున్న యితర గ్రహములు లేకున్న మారకమును, తృతీయమందున్న యోగహీనము, పిరికి స్వ భావమును, చతుర్థమందున్న మాతృసౌఖ్యము, విద్య, భూమి, సుయోగమును, పంచమమందున్న సుయోగము, స్త్రీ వుపాసనమును, షష్టమమందున్న కళత్రపీడ, యోగ హీనమును, సప్తమమందున్న సుకళత్రము, ఉత్తర ఖండమందు మారకము సంభవించును అష్టమమందున్న యోగహీనము, కళత్రసౌఖ్యహీనము, సామాన్య యోగమును, నవమ మందున్న సుయోగము, విశేష భూలాభమును, దశమమందున్న సుయోగము, స్వతంత్ర వృత్తివల్ల జీవనమును, ఏకాదశ మందున్న పూర్ణయోగము, వాణిజ్యము వల్ల ధనలాభమును ద్వాదశమందున్న యోగభంగము, జ్ఞాతులతో విరోధము, వ్యవహార చిక్కులు, ధనవ్యయము, కళత్ర సౌఖ్యహీనము బుధదశలో సంభవించును.

5. **గురుడు:-** మీన లగ్నమై లగ్నమున గురుడున్న గురుదశలో ఖ్యాతి దేహదారుఢ్యము విద్యావినయ సంపన్నత, విశేషయోగమును; ద్వితీయమందున్న శరీరపీడ, ధనలాభమును; తృతీయమందున్న యోగహీనము, శత్రురోగ ఋణములు, సోదర వృద్ధియును; చతుర్థమందున్న పాండిత్యము, మాతృదీర్ఘా యుర్దాయము, భూ లాభము, సుయోగమును, పంచమమందున్న అఖండయోగము, పాండిత్యము, విశేష ఖ్యాతియును; షష్టమమందున్న యోగహీనము, శత్రురోగ ఋణములును; సప్తమ మందున్న సుకళత్రము, స్వల్పయోగము, శరీరపీడయును; అష్టమమందున్న దరిద్రము, విశేష కష్టములును; నవమమందున్న విశేషభాగ్యము విశేష భూలాభము, పిత్రార్జిత స్వార్జిత లాభము, అఖండయోగమును; దశమమందున్న శిష్టాచారము, గౌరవ వృత్తి

వల్ల జీవనము, రాజసన్మానము, విశేష యోగమును; ఏకాదశ మందున్న యోగ హీనము, సుఖహీనమును; ద్వాదశమందున్న తీర్థయాత్రలు, ధర్మకార్య ములకు ధన వ్యయమును గురుదశ యందు సంభవించును.

6. **శుక్రుడు:-** మీనలగ్నమై లగ్నమందు శుక్రుడున్న శుక్రదశలో సు యోగము, పేరుప్రతిష్టలును, విద్యావినయ సంపదయును; ద్వితీయమందున్న ధన వ్యయము, కుటుంబవృద్ధి, ధనార్జనమును, తృతీయ మందున్న స్వల్పయోగము, సోదరీ భాగ్యము, చతుర్థమందున్న మాతృ సౌఖ్యము, విద్య, భూమి, వాహనము, సుయోగమును; పంచమమందున్న సంతాన నష్టము, స్వల్పముగా మధ్యమధ్య యోగమును; షష్టమమందున్న యోగహీనము, సోదర సోదరీలతో వైరము, సప్తమ మందున్న సోదరనష్టము, శరీరపీడ, యోగ హీనమును అష్టమమందున్న విశేష ఆయుర్వృద్ధి, సుయోగమును, నవమ మందున్న సుయోగము, కళత్ర దుష్టస్వభావ మును, దశమమందున్న డాంబిక ఆచారము, రాజసన్మానము, ఏకాదశమందున్న సుయోగము, విశేష ధనలాభమును, ద్వాదశమందున్న తీర్థయాత్రులు, ధర్మ కార్యము లును శుక్రదశలో సంభవించును.

7. **శని:-** మీనము లగ్నమై లగ్నమున శనియున్న శనిదశలో స్వల్ప యోగము, సౌఖ్యహీనము, లోభత్వమును, ద్వితీయమందున్న సుయోగము, విశేష ధనార్జనము, విశేష ధనవ్యయమును, తృతీయమందున్న సంపూర్ణ ఆయుర్భాగ్య ములు, అఖండయోగమును, చతుర్థమందున్న సుయోగము, మాతృసౌఖ్యహీనము, స్వల్ప విద్య, భూమి, వాహనమును; పంచమమందున్న స్వల్పయోగము, సంతాన విచారమును, షష్టమమందున్న యోగహీనము, శత్రు రోగఋణములును, సప్తమ మందున్న కళత్రమునకు లేక జాతకునకు మారకమును, అష్టమమందున్న సు యోగము, సమాన లాభవ్యయములును, నవమమందున్న పితృసౌఖ్యహీనము, స్వల్ప యోగమును, దశమ మందున్న లోభత్వము, విశేష ధనార్జనము, యోగహీనమును; ఏకాదశ మందున్న లోభత్వము, విశేష యోగమును; ద్వాదశ మందున్న తీర్థ యాత్రలు, దుర్వ్యయము, యోగహీనమును శనిదశ యందు సంభవించును.

8. **రాహువు:-** మీనము లగ్నమై లగ్నమున రాహువున్న రాహుదశలో శత్రురోగ ఋణములు, యోగహీనమును; ద్వితీయమందున్న శరీరపీడ, విశేష ధనార్జనము, ధనవ్యయము; సుయోగమును; తృతీయమందున్న సంపూర్ణ ఆయుర్భా గ్యములు, అఖండయోగమును, చతుర్థమందున్న సుయోగము, మాతృసౌఖ్యహీనమును, స్వల్పవిద్య, భూమి, వాహనమును; పంచమ మందున్న స్వల్పయోగము, సంతాన సౌఖ్య హీనమును; షష్టస్థానమందున్న సంపూర్ణ ఆయుర్భాగ్యములు, సుయోగమును, సప్తమమందున్న స్వల్ప యోగము, కళత్రవిచారము, శరీరపీడయును, అష్టమ మందున్న యోగహీనము, శత్రురోగ ఋణములును, నవమమందున్న యోగ హీనము, కుటుంబ వ్యవహార చిక్కులును, దశమమందున్న సుయోగము, స్వల్పతీర్థ యాత్రలును; ఏకాదశమందున్న స్వల్పయోగము, అన్యాయ ధనార్జనమును ద్వాదశ

మందున్న యోగహీనము, దుర్జన సహవాసము, దుర్వ్యయము, వ్యవహార చిక్కులు, అమానుషమును రాహుదశ యందు సంభవించును.

**9. కేతువు:-** మీన లగ్నమై లగ్నమందు కేతువున్న కేతుదశలో పారమార్థిక చింత, పట్టుదల, స్వల్పయోగమును, ద్వితీయ మందున్న యోగహీనము, శరీరపీడ, ధన వ్యయమును, తృతీయమందున్న స్వల్ప యోగము, వితంతు సోదరి వల్ల భాగ్య వృద్ధియును; చతుర్థమందున్న యోగహీనము; విద్యావిఘ్నము మాతృవిచారము, ధన వ్యయమును, పంచమ మందున్న సుయోగము; సంతానవిచారమును, షష్టమ మందున్న సుయోగము, విశేష శత్రురోగఋణములును, సప్తమమందున్న శరీరపీడ, కళత్ర విచారము, యోగహీనమును; అష్టమమందున్న యోగహీనము, దరిద్రము, విశేష కష్టములును; నవమమందున్న సుయోగము, సంపూర్ణ ఆయుర్భాగ్యములును; దశమ మందున్న స్వల్పయోగము, పారమార్థిక చింతయును, ఏకాదశమందున్న అన్యాయ ధనార్జనము; ద్వాదశమందున్న తీర్థయాత్రలు, విశేష ధనవ్యయము, పారమార్థిక చింతయును కేతుదశ యందు సంభవించును.

## దశానాధునకు భక్తినాధుడు వివిధ స్థానముల యందున్నప్పుడు జాతకునికి సంభవించు సాధారణ ఫలములు

దశానాధుడున్న స్థానము నుండి 1-2-3 స్థానముల యందు భుక్తి నాధుడైన పాపగ్రహమున్న వీని భుక్తికాలమునందు జాతకునికి దుఃఖము, దౌర్భాగ్యము సంభవించును. భుక్తినాధుడు శుభుడైన శుభఫలములు గల్గును. దశా నాధునితో కలసియున్న పాపగ్రహ భుక్తికాలమునందు జాతకునికి భార్యాబిడ్డల నాశము, సంపద భూముల నష్టము, సేవకుల నాశము, బంధు కలహము, అపఖ్యాతి, ఆకస్మిక అపవాదులు సంభవించును. దశానాధునకు ద్వితీయ మందున్న శుభ గ్రహభుక్తి యందు జాతకునికి మంచి ఆహార పానీయ సౌఖ్యము, నూతన వస్త్రాలంకార ఆభరణ సౌఖ్యము, వుదార స్వభావము, భార్యాబిడ్డల బంధు సౌఖ్యము సంభవించును. దశానాధునకు తృతీయస్థానము నందున్న శుభ గ్రహము యొక్క భుక్తియందు జాతకునికి ప్రభుత్వము ద్వారా ధనార్జన, సుగంధ వస్త్రాభరణ సౌఖ్యము, మంచి ఆరోగ్యము, మిత్రుల వలన సంతోషము గలుగును.

దశానాధునకు నాల్గవస్థానమందున్న శుభగ్రహ భుక్తియందు జాతకునికి భార్యాబిడ్డల సౌఖ్యము, గృహము, సంపద, వాహనసౌఖ్యము, మంచి భోజనపానీయ సౌఖ్యము, నూతనవస్త్ర ఆభరణలాభము, న్యాయబుద్ధి గల్గియుండును. దశానాధునకు నాల్గవ స్థానమున పాపగ్రహమున్న వీని భుక్తి కాలమున జాతకునికి పాపఫలములు సంభవించును. దశానాధునకు పంచమస్థానమునందున్న గ్రహభుక్తియందు జాతకునికి శిశుజననము గల్గును. పంచమ స్థానమునందున్న గ్రహము శుభుడైయున్న జన్మించిన శిశువు ఆరోగ్యము, సౌఖ్యము గలిగియుండును. అదేపాప గ్రహమైయున్న శిశువు మరణమును పొందును.

భుక్తినాధుడు పాపియైననూ స్వస్థానమునందుగాని లేక ఉచ్చస్థానము నందుగాని యున్నయెడల జాతకునికి ఆభుక్తికాలములో శుభఫలములు ప్రాప్తించును.

భుక్తినాధుడు శుభుడైనను తన స్వస్థానము నందుగాని లేక వుచ్చస్థానము నందుగాని లేకుండి దుర్బలుడైయున్న తన భుక్తికాలమున జాతకునికి కష్టములు సంభవించును.

దశానాధునకు షష్టస్థానము నందున్న పాపగ్రహ భుక్తియందు జాతకుడు అనారోగ్యవంతుడై చోరఋణ బాధలను పొందును. అదే శుభ గ్రహ భుక్తియైన జాతకుడు ఆరోగ్యవంతుడై స్నేహితులు బిడ్డలు గలవాడుగా యుండును. ఇటువంటి శుభఫలములు భుక్తినాధుడు స్వస్థానము లేక యుచ్చస్థానము నందున్న సంక్రమించును. దశానాధునికి సప్తమస్థానమున పాపగ్రహమున్న వీని భుక్తికాలమున జాతకునికి భార్యాబిడ్డల నాశము, బంధు నష్టము, ధననాశము, రాజాగ్రహము సంభవించును. దశానాధునికి సప్తమస్థానము నందున్న శుభగ్రహము నీచశత్రు క్షేత్రములను పొందకుండి భుక్తిజెందుచున్న అట్టి కాలమునందు జాతకునికి సౌఖ్యము, రత్నాభరణ వస్త్రలాభము గలుగును. దశానాధునకు అష్టమస్థానమున పాప గ్రహమున్న వీని భుక్తికాలమునందు జాతకునికి జ్వరము, చోరాగ్ని, భయము, రాజా గ్రహము, అనారోగ్య భోజనము, చివరకు మరణము సంభవించును. అదే శుభ గ్రహమై యున్న జాతకునికి ఈ గ్రహభుక్తి కాలమునందు ప్రారంభమున సంతోష సౌఖ్యమును తుదియందు కష్టనష్టములు సంభవించును. దశానాధునకు నవమ స్థానమునందున్న పాపగ్రహ భుక్తికాలము నందు ప్రధమదశలో జాతకునికి ప్రతిష్ట భంగము, మనోవ్యధ, పాపకార్యములు చేయుట మొదలగునవి సంభవించును. దశానాధునకు దశమస్థానమున పాపగ్రహ పానీయ సౌఖ్యము, నూతనవస్త్ర ఆభరణ లాభము, న్యాయబుద్ధి గల్గియుండును. దశానాధునకు నాల్గవస్థానమున పాపగ్రహ మున్న వీని భుక్తికాలమున జాతకునికి పాపఫలములు సంభవించును. దశనాధునకు పంచమస్థానము నందున్న గ్రహభుక్తియందు జాతకునికి శిశుజననము గల్గును. పంచమస్థానము నందున్న గ్రహము శుభుడైయున్న శిశువు ఆరోగ్యము, సౌఖ్యము గలిగియుండును. అదేపాపగ్రహమైయున్న శిశువు మరణమును పొందును.

భుక్తినాధుడు పాపియైననూ తన స్వస్థానము నందుగాని లేక ఉచ్చ స్థానము నందుగాని యున్న జాతకునికి ఆభుక్తికాలములో శభఫలములు ప్రాప్తించును. భుక్తినాధుడు శుభుడై తనస్వస్థానము నందుగాని లేక వుచ్చస్థానము నందుగాని లేకుండి దుర్బలుడై యున్న తన భుక్తికాలమున జాతకునికి కష్టములు సంభవించును.

దశానాధునికి షష్టస్థానము నందున్న పాపగ్రహ భుక్తి యందు జాతకుడు అనారోగ్యవంతుడై చోరఋణ బాధలను పొందును. అదే శుభ గ్రహ భుక్తియైన జాతకుడు ఆరోగ్యవంతుడై స్నేహితుల బిడ్డలు గలవాడుగా యుండును. ఇటువంటి శుభఫలములు భుక్తినాధుడు స్వస్థానము లేక యుచ్చస్థానము నందున్న సంక్రమించును. దశానాధునికి సప్తమస్థానమున పాపగ్రహమున్న వీని భుక్తికాలమున జాతకునికి భార్యాబిడ్డల నాశము, బంధునాశము, రాజాగ్రహము సంభవించును. దశానాధునికి సప్తమస్థానము నందున్న శుభగ్రహము నీచశత్రు క్షేత్రములను పొంద

కుండి భుక్తి జెందుచున్న అట్టి కాలమునందు జాతకునికి సౌఖ్యము, రత్నాభరణ వస్త్రలాభము గలుగును. దశానాధునకు అష్టమస్థానమున పాపగ్రహమున్న వీని భుక్తి కాలము నందు జాతకునికి జ్వరము, చోరాగ్ని, భయము, రాజాగ్రహము, అనారోగ్య భోజనము, చివరకు మరణము సంభవించును. అదేశుభ గ్రహమై యున్న జాతకునికి ఈ గ్రహ భుక్తికాలము నందు ప్రారంభమున సంతోష సౌఖ్యమును తుదియందు కష్టనష్టములు సంభవించును. దశానాధునకు నవమ స్థానమునందున్న పాపగ్రహభుక్తియందు ప్రధమదశలో జాతకునికి ప్రతిష్టభంగము, మనోవ్యధ, పాపకార్యములుచేయుట మొదలగునవి సంభ వించును. దశానాధునకు నవమ స్థానమునందున్న శుభగ్రహ భుక్తియందు జాతకునికి వివాహవేడుకలు, యజ్ఞములు, ధర్మకార్యములు మొదలగునవి సంభవించును. దశానాధునకు దశమ స్థానమున పాపగ్రహమున్న వానిభుక్తి కాలమునందు జాతకుడు నష్టము, అపఖ్యాతి, అపాయములు అనుభవించును. దశానాధునకు దశమస్థానమున శుభగ్రహమున్న వాని భుక్తి కాలమున జాతకునికి సౌఖ్యము, బావులు త్రవ్వించుట, దేవాలయ నిర్మాణములు మొదలగు శుభకార్యములు చేయచుండును. దశానాధునకు ఏకాదశ స్థానమున పాపగ్రహమున్న వీని భుక్తికాలమునందు జాతకునికి సంపద, మిత్ర లాభము, బిడ్డలు, శ్రేయస్సు, తీరని ప్రతిష్ట మొదలగునవి గలుగును. దశానాధునకు ఏకాదశ స్థానమున శుభగ్రహమున్న వీనిభుక్తి కాలమునందు జాతకునికి సంపదవృద్ధి, రాజ గౌరవము, భార్యాబిడ్డల సౌఖ్యము గలుగును. దశానాధునకు ద్వాదశస్థానమున పాపగ్రహమున్న వీని భుక్తికాలమునందు జాతకునికి ధననష్టము, అధికారభంగము, మతిమరుపు, రాజాగ్రహము సంభవించును. దశానాధునకు ద్వాదశ స్థానమున పాప గ్రహమున్న వీని భుక్తికాలమునందు జాతకునికి ధననష్టము, అధికార భంగము, మతిమరుపు, రాజాగ్రహము సంభవించును. దశానాధునకు ద్వాదశస్థానమున శుభ గ్రహమున్న వీని భుక్తికాలమున జాతకునికి వస్త్రాభరణ లాభము, మంచి సౌఖ్యము మొదలగు సుఫలములు గలుగును.

మహాదశలో 6-8-12 స్థానాధిపతులయొక్క దశలు కష్టఫలముల నిచ్చును. మారక గ్రహము యొక్క దశాకాలమునందు 6-8-12 స్థానాధిపతులు భుక్తినాధులైన వాని భుక్తికాలము నందు గూడ జాతకునికి కష్టఫలములు సంభవించును. లగ్నాధిపతి మారక స్థానాధిపతితో గాని లేక షష్టాధిపతితో గాని కలసియున్న లగ్నాధిపతి భుక్తి కాలమునందు జాతకుడు జ్వరముతో బాధపడును. అష్టమ స్థానమున శని రాహుకేతువులున్న వీని భుక్తికాలము నందు జాతకునికి మనోవ్యధ, ఆయాసము, ఉబ్బసము, కలరా మొదలగు వ్యాధులు సంభవించును. మారక గ్రహముతో కలసిన యితరగ్రహముల భుక్తి కాలములయందు గూడ పై దుష్ఫలము లే సంభవించును. ద్వితీయ, తృతీయ, లాబాధిపతుల దశలు లేక భుక్తులు మధ్య మముగా యుండును. షష్ట, అష్టమ, ద్వాదశాధిపతుల యొక్క దశలు జాతకునికి కష్టములు దౌర్భాగ్యము గలుగును.

శుభదృష్టిగల గ్రహము తన భుక్తికాలము నందు జాతకునికి సంపద, గౌరవము, పట్టుదల, సంపూర్ణము, సౌందర్యము గలుగజేయును. షష్ఠ అష్టమాధిపతులు పరస్పర దశాభుక్తినాధులైన వాని భుక్తికాలముల యందు జాతకునికి రాజాగ్రహము, భార్యాబిడ్డల నష్టము, స్త్రీలు సేవకుల విరోధము, మనోవ్యధ, చోరాగ్ని భయము, బంధువులవలన కష్టములు సంభవించును. దశానాధునకు ద్వాదశమందున్న గ్రహభుక్తి యందు జాతకునికి ప్రతిష్టభంగము, కుటుంబములో కలతలు, పరదేశ నివాసము, నేత్రరోగము, హృద్రోగము, కాళ్ళయందు బాధలు సంభవించును.

దశానాదుడు పాపియై భుక్తినాధుడు గూడ పాపియైయున్న వీని భుక్తి కాలమునందు జాతకునికి ధననష్టము, భార్యాబిడ్డలు, బంధునాశము, రాజభయము, అధికార నష్టము సంభవించును. దశానాధడు శుభుడై భుక్తినాధుడు గూడ శుభుడైన, వీని భుక్తికాలమున జాతకునికి అధికార లాభము, ఆభరణసౌఖ్యము మొదలగు సుఫలములు గలుగును. దశానాధుడు పాపియై భుక్తినాధుడు శుభుడైయున్న వీనిభుక్తి కాలమునందు జాతకునికి ప్రథమ దశయందు సంతోషసౌఖ్యములును తుదిదశ యందు దుఃఖము సంభవించును. దశానాధుడు శుభుడై భక్తినాధుడు పాపియై యున్న వీని భుక్తికాలము నందు జాతకునికి ప్రథమదశయందు బాధ, దుఃఖమును, తుదిదశ యందు సంతోష సౌఖ్యములు గలుగును. శీర్షోదయ రాశుల యందున్న గ్రహభుక్తి ఫలములు భుక్తిప్రథమ భాగమునను, వృష్టోదయ రాశుల యందున్న గ్రహభుక్తి ఫలములు భుక్తితుది భాగమున సంభ వించును.

జాతకుని యొక్క ఫలములు నిర్ధారించుటకు పూర్వము పై అంశములు మనస్సు నందుంచుకొని గ్రహములయొక్క బలాబలములు గ్రహించి వానికి తగినట్లు శుభపాపఫల నిరూపణ చేయవలయును.

# గ్రహ సంహిత
(జన్మజాతకము)

# సర్వజనుల భవిష్యత్ గ్రంథము

# HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్ధము

## ప్రథమ స్కంధము

### 1. రవి మహాదశ ఫలము

రవిమహాదశ పురోగమనములో రవిపరమోచ్ఛ స్థానమునందున్న జాతకుడు సౌఖ్యములు పొందువాడును. భులాభము. భార్య. బిడ్డలు. ప్రతిష్ట. గౌరవము రాజ వరప్రసాదములు. ప్రయాణము. నూతన స్నేహితులు గల వాడగును. రవి మేషరాశిలో వుచ్ఛయందున్న జాతకునికి సంపద. పశుగణము పెంపొందుట. ధాన్య సంపద వృద్ధిజెందుట. విదేశ సంచారము. కోప స్వభావము గలవాడగుటచే బంధు వర్గముతో శత్రుత్వము. పనికిమాలిన స్త్రీలతో సంబంధమొంది అపకీర్తి పాలగట. అల్లరి సంక్షోభములో పడి శత్రువుల బాధ పొందువాడగును.

రవిమహాదశలో రవినీచస్థానము నుండి వుచ్ఛస్థానమునకు పురోగ మించు చున్న జాతకుడు ఆధిక్యము అనుభవించు వాడును. యెక్కువ సౌఖ్యము గల వాడును. బహుమతులు వుదారముగా యిచ్చు వాడును. భూములు. భార్య బిడ్డలు. గోవులు; అశ్వములు గజములు గలవాడగును. రవిమహాదశలో రవి వుచ్ఛస్థానము నుండి నీచస్థానమునకు పురోగమించుచున్న జాతకుడు ధన నష్టము. గృహనష్టము. వ్యవసాయ భూముల వలన నష్టము. చోరభయము. అగ్నిప్రమాదము. పోరాటము వలన సంకటనలు. శత్రుత్వము. ప్రభుకోపము. ప్రవాసము మొదలగునవి సంభవించును.

రవిమహాదశలో రవినీచ క్షేత్రమునందున్న జాతకునికి ఆస్తినాశము. రాజానుగ్రహము లేనందున గౌరవభంగము. భార్యబిడ్డలు స్నేహితులు. బంధువుల నష్టము. తండ్రి. పెద్దలు అప్రతిష్టపాలగుట మొదలగునవి సంభవించును. రవి పరమ నీచస్థానమునందున్న జాతకునికి భార్యబిడ్డలు. పశువులు. భూములు మొదగలువాని నాశము. గురు. మరణము. ప్రవాసము మొదలగునవి సంభవించును.

రవిమహాదశలో రవిమూలత్రికోణమునందున్న జాతకునికి ధనము. గృహము. భార్యాబిడ్డలు. బంధువుల వలన సౌఖ్యము. ప్రభుత్వసహాయము వలన గోవులు. వాహనములు. స్నేహితులు. రాజలాభము మొదలగునవి గల్గును. రవి స్వస్థానము నందున్న జాతకునికి ప్రతిష్ట. సంపద. తెలివి వలన ప్రఖ్యాతి. బంధు సౌఖ్యము. స్నేహితులు. ప్రభుభక్తి గలవాడుగా యుండును.

రవిమహాదశలో రవి ఆది శత్రుక్షేత్రములో పురోగమనము నొందు చున్న జాతకునికి భార్య, బిడ్డలు, సంపద నాశము, తండ్రికి అనారోగ్యము, స్నేహితులు, గోవులకు అసౌఖ్యము, చుట్టు ప్రక్కలనున్న జనముతో శత్రుత్వము గలుగును. రవి శత్రు క్షేత్రమునందున్న జాతకునికి దుఃఖము, భార్యబిడ్డలు, సంపదకు దూరమగుట, రాజభయము వలన బాధ, అగ్ని, చోరుల వలన భయము, తల్లిదండ్రులతో శత్రుత్వము గలవాడగును.

రవిమహాదశలో రవి మిత్రస్థానము నందున్న జాతకుడు ప్రభువు, తండ్రి, బిడ్డలు, సేవకులచే గౌరవించబడువాడును, స్వతంత్ర గృహములో నివశించు వాడును, వాహనములు గలవాడును, ఆభరణములు, వస్త్రములు, రాగిపాత్రలు పొందువాడును, బంధుగణముతో సౌఖ్యముగా నివశించు వాడగును. రవిమహాదశలో రవి అధిమిత్ర క్షేత్రము నందున్న జాతకుడు భార్య బిడ్డలు, సంపదవలన అధిక సౌఖ్యము పొందువాడగును. చెరువులు, వాహనములు, వస్త్రములు, ఆభరణములు గలవాడగును. రవి సమక్షేత్రమునందున్న జాతకునికి వ్యవసాయభూములు, ధాన్యము, పశువులు, అశ్వములు, వాహనములు, వస్త్రములు, ఆరోగ్యముగా యున్నప్పటికి భార్యబిడ్డల వలన సంకటనలు, పోట్లాటల వలన బాధలు గలవాడుగా యుండును.

రవిమహాదశలో రవి బలహీన గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి హీనజాతి వానితో కలసియుండుట వలన చెడ్డ అలవాట్లకు అలవడి యుండును. గోళ్ళవ్యాధి గలవాడగును. భార్య, పుత్రుడు, ధాన్యము, వాహనములు, సంపద, పశువుల వలన మనోబాధ గలవాడుగా యుండును. రవిమహాదశలో రవి వృచ్ఛయందున్న గ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు తన సొంత శ్రమతో జ్ఞానవృద్ధి యాత్రలకు పోవుచు మత సంబంధమైన బోధనలతో తీరికలేని వాడై యుండుట, పురాణములు, శాస్త్రములు చదువుట, దేవాలయములు, సత్రములు నిర్మించుట, బావులు త్రవ్వించు వాడుగా నుండును.

రవిమహాదశలో రవిపాప గ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు మనోవాంఛలకు లోనైన కార్యములు చేయుటవలన తీవ్రవేదన పొందువాడగును. ఇదియే గాక చిరిగిన వస్త్రములు ధరించుట, చెడుపదార్థ ములు భుజించుట, బల హీనమైన ఆరోగ్యము, శ్రమకు తగిన ధనము పొంద లేనివాడగును. రవిమహాదశలో రవి శుభగ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు వ్యవసాయ భూములు, సంపద, వస్త్రములు వలన సౌఖ్యముగా నుండువాడును, ఆటలు, వేడుకలు, వివాహములు, ఉల్లాసముల యందు చిత్తము వచ్చినట్లు చేయును.

రవిమహాదశలో రవిని పాపగ్రహము వీక్షించుచున్న జాతకునికి దౌర్భగ్యము చేకూరుట, తల్లిదండ్రుల మరణము వలన భయము, భార్యా బిడ్డల వలన బాధ, చోరులు, అగ్ని, ప్రభువువలన భయము పొందు వాడగును. రవిమహాదశలో రవిని శుభగ్రహము వీక్షించుచున్న జాతకునికి ప్రతిష్ఠ, తెలివి, భార్య, పుత్రుడు, వాగ్ధాటి, ప్రకాశము, గౌరవము, లైంగిక సౌఖ్యము, తల్లిదండ్రుల సౌఖ్యము, రాజానుగ్రహము గల్గును. రవిమహాదశలో రవికేంద్రము నందున్న ప్రభువుచే శిక్షించబడుట వలన బాధ, హొదాకు నష్టము, బంధునాశము, భూములు, ధనాదాయ విధ్వంసము

గల్గును. రవి కోణమునందున్న జాతకుడు మనోభ్రాంతి. రాజాగ్రహము. అనారోగ్యము. తండ్రి మరణము. దేహదౌర్బల్యము గలుగును.

రవిమహాదశలో రవినవాంశలో వుచ్చయందున్న జాతకుడు నూతన కార్యమును సాహసించి మొదలు పెట్టుటయేగాక తన సొంత సామర్ధ్యము వలన కార్య సిద్ధి పొందును. జాతకుడు స్త్రీలోలుడై యింద్రియ సుఖముల నానందించెడి వాడగును. మంచి వస్త్రములు గలవాడును. పితృసంబంధమైన బాంధవ్యము చెరుచు కొనును. రవిమహాదశలో రవినవాంశలో నీచయందున్న జాతకుడు భార్యబిడ్డలు భూములు మొదలగు వానికి దూరమగుట. బంధువులచే అసహ్యించు కొనబడుట. మనోవ్యాధి. జ్వరము. మధుమేహ రోగముచే బాధపడు చుండును. దశ ప్రారంభములో జాతకునికి ముఖము. రోగముతోయున్న తండ్రి మరణించుట. మనో బాధ గల్గియుండును. దశా మధ్యకాలమునందు ధన. పశునాశము గల్గును. దశాంత్య కాలమునందు జాతకుడు తన పండిత జ్ఞానమునకు గౌరవించబడును.

రవిమహాదశలో రవి షష్టస్థానము నందున్న జాతకునికి ధననాశము. మనోవ్యధ. ప్లీహమునందు లోపము. మూత్రవ్యాధితో బాధగల్గును. రవి మహా దశలో రవి అష్టమ స్థానమునందున్న జాతకునికి దేహము నందు అసౌఖ్యము. బాధ. మన్య జ్వరము. నేత్రరోగము. క్షయ మొదలగు బాధలు. హోదాకు నష్టము గల్గును. రవి మహాదశలో రవి ద్వాదశ స్థానమునందున్న జాతకుడు ధన. సంపదల నాశము వలన బాధనొందుట. మాటిమాటికి బదిలీలు. ప్రభువు లేక విషభయము. కాళ్ళ యందు రోగము. దేహబాధ. సభలయందు తత్వశాస్త్రము బోధించుట. లోకాభి రామాయణము. పోట్లాటలు. పశువులు. అశ్వములకు రోగము గల్గును.

రవిమహాదశలో రవి ద్వితీయ స్థానమునందున్న జాతకుని భార్యకు రక్త స్రావము వలన అపాయము. మనోవ్యధ. బంధునాశము వలన దౌర్భాగ్యము. పోరాటము. అపనింద. పట్టరాని కోపము. భార్యనాశము. సంపద. భూమి. పుత్రుడు. వాహనము. వస్త్రములకు నష్టము. రాజాగ్రహము మొదలగునవి సంభవించును. రవి ద్వితీయ స్థానమున యున్నప్పటికి శుభ గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి పై సంకటనలు గల్గునని గ్రహించవలెను.

రవిమహాదశలో రవి తృతీయ స్థానమునందున్న జాతకుడు ఘనకార్యములు చేయుట. అధిక సౌఖ్యము. ప్రభుత్వ గుర్తింపు. ధనలాభము. సోదరుల వలన శత్రుత్వము. అపాయము గల్గును. రవిమహాదశలో రవి నాల్గవ స్థానమునందున్న జాతకనికి అసౌఖ్యము. భూమి. ధనము. సేవకులు. భార్య. స్థిరాస్థి మొదలగువాని నష్టము. పదవిలో సేవజేయుట. చోరీ. విషభయము. అగ్ని. ఆయుధము వలన దౌర్భాగ్యము. వాహనము నుండి పడుట మొదలగునవి సంభవించును రవి మహా దశలో రవిసప్తమ స్థాన మందున్న జాతకుడు చెడుపదార్థములు తినుట. రోగము. లేక భార్య మరణము గల్గుట వలన బాధ మొదలగునవి సంభవించును.

రవిమహాదశలో రవి దశమ స్థానమందున్న జాతకుడు హోదా పొందుట వలన ఆనందము. సంపద లాభము. సాహసకార్యము. కృషి సుఖానుభవము. వ్యాజ్యములో జయము. ప్రతిష్ఠ. రాజగౌరవము పొందు వాడగును. రవిమహాదశలో రవి లాభస్థానము నందున్న జాతకుడు ధన లాభము పొందువాడును. అనేక

మంచి కార్యముల యంద చిక్కుకొని యుండువాడును. కృషిసుఖానుభవము. భార్య. పుత్రుడు. ఆభరణములు. వస్త్రములు. వాహనములు మొదలగు వాని వలన మూర్తి వంతమైన సౌకర్యములు గలవాడగును.

రవిమహాదశలో రవికి స్థానబలమున్న జాతకునికి వ్యవసాయదారుల ద్వారా సంపద చేగూరుట. భూములు. గోవులు. వాహనములు. ఆభరణములు. ప్రభుత్వ పారితోషికములు. తేజస్సు. సుఖమైన నిద్ర. యితరులకు సేవ. ప్రతిష్ఠ. కోరిన బంధువులు. పవిత్ర నదులయందు స్నానము మొదలగునవి గల్గును. రవి మహాదశలో రవికి స్థానబలము లేకున్న జాతకునికి శరీర బలహీనత. ధన నష్టము. ఉద్యోగ భంగము. బంధువుల వలన బాధ. ద్వేషము. విదేశయాత్ర. దౌర్భాగ్యము మొదలగునవి సంభవించును.

రవిమహాదశలో రవి దిగ్బలము పొందియున్న జాతకుడు అనేక ప్రదేశముల నుండి ధనము ఆర్జించుట. యితర ప్రాంతముల యందు గూడ ప్రతిష్ఠ సంపాదించు వాడగును. రవివాని దశాకాలములో దిగ్బలము పొందకున్న జాతకుడు పై ఫలమును పొందజాలడు. రవిదశా కాలములో రవి కాల బలము పొందియున్న జాతకునికి వ్యవసాయ భూములు. ధనము. వుద్యోగము ఖాయమగుట. రాజ గౌరవము. సంభవించును. రవికి కాలబలము లేనపుడు జాతకునికి పై ఫలములు నశించును. రవిమహా దశతో రవికి నైసర్గిక బలమున్న జాతకునికి వాహనములు. ధనము. ఆభరణములు. వస్త్రములు. ఆరోగ్యము గల్గును. రవికి నైసర్గిక బలము లేకున్న జాతకునికి. జ్వరము. చోరుల వలన ప్రమాదము. అగ్నిభీతి. ప్రభుత్వము వలన ప్రమాదము సంభవించును. రవి మహాదశలో రవి చేష్టాబలము గలిగియున్న జాతకుడు తన స్వకృషిచే సంపదను ఆర్జించుట. అతిసౌఖ్యము. రాజ పారితోషికములు. భార్యబిడ్డల వల్ల సౌఖ్యము. భూస్థితి వాహనములు. వస్త్రములు గల్గును. రవికి చేష్టాబలము లేనియెడల జాతకుడు పై ఫలములు పొందజాలడు. రవి మహాదశలో రవిదృష్టి బలము గలవాడైయున్న జాతకునికి అనుకోనటువంటి లాభములు సంభవించును. రవికి ఈ దృష్టి బలము లేనట్లయిన జాతకుడు సర్వము పోగొట్టుకొనును.

రవిమహాదశ యందు ఆరవ నవాంశయందు పాపగ్రహమున్న జాతకునికి వుద్యోగ భంగము. చోరభయము. ప్రభుత్వభయము. కోపము. తలనొప్పి. తల్లి దండ్రులను గోల్పోవుట. లేక తానే మరణము జెందును. రవి మహాదశయందు ఆరవ నవాంశ 'మృత్యంశ' యైన జాతకుడు మంచి భోజనము. పానీయము. వస్త్రములు. ఆభరణములు. పట్టాలు పొందుట. రాజ గౌరవము. వేదశాస్త్రములు. అగమ శాస్త్రములు పారాయణము మొదలగు లక్షణములు గలిగి యుండును. రవిమహాదశా కాలములో రవి పారవతాంశ యందున్న జాతకుడు అధిక ప్రతిష్ఠ. గొప్పవాని వల్లను. రాజులవల్లను. బంధువుల వలన గొప్పకీర్తి సంపాదించును. బిడ్డలు. స్నేహితులతో సౌఖ్యముగా యుండును.

రవి ఉచ్చస్థానము నందున్నను. రవిదశా కాలమునందు నవాంశలో నీచ యందున్న జాతకుడు బార్యను గోల్పోవుట ధననాశము. బంధువులతో శత్రుత్వము. తల్లిదండ్రులకు ద్వేషము గలుగును. అట్లాగాక రవి నీచస్థానము నందుండి

రాహువు ద్వితీయ లేక సప్తమ స్థానమునందుండి ఆ స్థానాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి అపమృత్యువు వలన సర్పముల వలన అపాయము సంభవించును.

**5. రవిమహాదశలో గురు భుక్తి ఫలము :-**

రవిమహాదశలో గురు భుక్తియందు గురుడు లగ్నము, కేంద్రము, వుచ్ఛయందుగాని లేక మిత్రవర్గు నందుగాని యున్న జాతకునికి లాభదాయకమును, శుభదాయకమునైన కార్యములు సంభవించును. వివాహములు, ప్రభు దర్శనము, ధనధాన్యవృద్ధి, పుత్రజననము, మంచి సౌఖ్యము, అనుకున్న కార్యములు చక్కగా నెరవేరుట, ప్రభుత్వసహాయము, బ్రాహ్మణులకు పారితోషికములు, వస్త్రలాభము మొదలగునవి గల్గును. గురునితో సంబంధ మొందియున్న గ్రహముల యొక్క స్వభావమును బట్టి జాతకునికి రాజ్య లాభము, హోదా పెంపొందుట, అధిక సౌఖ్యము, వేడుకలు యధావిధిగా జరుపుట సంభవించును.

దశానాధుడైన రవియున్న స్థానమునుండి నవమస్థానమున గురుడున్న జాతకునికి సంపద అభివృద్ధి, సౌఖ్యము పెంపొందుట, ధర్మ కార్యములు జరుపుట, దేవులు, గురువులకు మొక్కుట, కోర్కె నెరవేరుట, శుభ కర్మలు జరుపుటకు అనేక అవకాశములు గల్గియుండును. దశానాధుడున్న స్థానము నుండి 6-8-12 స్థానముల యందు గురుడున్నను, లేక గురుడు నీచ యందున్నను లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకుని భార్యా బిడ్డలు అస్వస్థత, శరీరము, కృషించుట, ప్రభువు భయము, సంపద, ప్రేమించ బడిన వస్తువుల యొక్క నష్టము, విదేశములకు పోవుటకు సొంతభూములను వదలుకొనుట, మనోవేదన గల్గును.

**6. రవిమహాదశలో శని భుక్తి ఫలము :-**

రవిమహాదశలో శని భుక్తియందు శని, లగ్నము, కేంద్రము, త్రికోణము నందున్న జాతకుడు శత్రువులను జయించుట, ఆనంద సౌఖ్యములు, ధన ధాన్యముల వలన లాభము, వేడుకలు, వివాహములు చేయు వాడగును. శని వచ్ఛ యందున్నను లేక స్వక్షేత్రము నందున్నను, లేక మిత్ర గ్రహముతో సంబంధమొంది యున్న జాతకుడు పై ఫలములను పొందుటయేగాక ప్రతిష్ట, రాజపారితోషికములు, వస్త్రములు సంపద మొదలగునవి పొందగలడు. దశానాధుడైన రవియున్న స్థానము నుండి 6-8-12 స్థానముల యందు శనియున్నను, లేక శని పాపగ్రహములతో సంబంధ మొందియున్న జాతకునికి కీళ్ళనొప్పులు, కీళ్ళవాపు, జ్వరము మొదలగునవి సంభవించును. ఇవియేగాక జాతకుడు బంధించబడుట, లేక బానిసగా నుండుట, ధననాశము, కార్యభంగము, బంధువులతో హఠాత్తుగా కలహములు, భయమువలన దీనదశలో నుండుట సంభవించును. శని భుక్తి యందు ప్రారంభదశలో మిత్ర నాశము, మధ్యమధ్య దశలో కొద్ది సౌఖ్యము, అంతిమదశలో మరల బాధగల్గును. శని బలహీనుడైయున్న జాతకునికి మరల బాధలు తనభుక్తి కాలము పొడవున సంభవించును. ఇవియేగాక తల్లి దండ్రుల మరణము, యెల్లప్పుడు సంచారము చేయుచుండును. శని ద్వితీయ సప్తమాధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు వలన అపాయము సంభవించును.

7. రవిమహాదశలో బుధ భుక్తి ఫలము :-

రవిమహాదశలో బుధ భుక్తియందు బుధుడు వుచ్చయందున్నను. స్వ క్షేత్రము నందున్నను. కేంద్ర లేక కోణము నందున్నను లాభస్థానము నందున్నను. షడ్వర్గునందు బలవంతుడై యున్నను. జాతకుడు ప్రభువుగాని లేక నాయకుడుగాని అధికారము చెలాయించు వాడుగా యుండును. ఉత్సాహముతో సంతోషముగా యుండు వాడును. భార్యాబిడ్డలతో సౌఖ్యముగా యుండువాడును. ప్రభుత్వ సహాయముతో వాహనములు. ఆభరణములు. వస్త్రములు పొందువాడును. పవిత్ర జలము. గోవులు. ధనము. గలవాడుగా యుండును. భాగ్యాధిపతి లేక లాభాధి పతితో బుధుడు సంబంధ మొంది యున్న లాభము అధికముగా యుండును. బుధుడు లగ్నమునకు 9-5-10 స్థానముల యందున్న జాతకుడు పారితోషికములను పొందు వాడగును. ఇవి యేగాక జాతకుడు ధర్మకార్యములు చేయువాడును. దేవుళ్ళను. గురువులను మొక్కువాడును. ధనధాన్యములు గలవాడును. వివాహములు జేయువాడును. పుత్రజననము గలవాడగును. దశానాధుడైన రవియున్న స్థానము నుండి శుభ స్థానమున బుధుడున్న బుధభుక్తి కాలములో జాతకుడు సంతోషము గల వారై వివాహములు. యజ్ఞములు. ధర్మకార్యములు. బుధజపములు చేయుచూ ఇంద్రుని వలె సుఖమనుభవించు వాడగును. మంచి భోజనము. వస్త్రములు. ఆభరణములు గలవాడగును.

దశానాధుడున్న స్థానమునుండి శత్రుక్షేత్రమున బుధుడున్నను లేక జాతకుని జననకాలమున రవియున్న స్థానమునుండి సంచారములో బుధుడు 6-8-12 స్థానముల యందున్నను లేక బుధుడు నీచస్థాన మందున్న జాతకుడు శరీర సౌఖ్యము లేనివాడుగను. మనోవ్యాధి. భార్యబిడ్డలు. అనారోగ్యము గలవాడుగా యుండును. బుధ భుక్తి మొదటి భాగమున జాతకునికి దుఃఖము. మధ్యకాలమున సంతోషము. తుది భాగమున రాజ భయము. ప్రయాణ అలసట గల్గును. బుధుడు ద్వితీయ. సప్తమాధిపతియై యున్న జాతకుడు శరీరఅసౌఖ్యము. జ్వరమును పొందు వాడగును. సింహ రాశి లగ్నమై. బుధుడు ద్వితీయ. లాభస్థానాదిపతియై యున్న జాతకుడు వ్యాజ్యములు. తగవులలో చిక్కుపడి ధనమును గోల్పోవును.

8. రవిమహాదశలో కేతు భుక్తి ఫలము :-

రవిమహాదశలో కేతు భుక్తియందు కేతువులగ్నాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి కేతుభుక్తి ప్రధమభాగములో సౌఖ్యము. సంతోషము. మంచి రాబడి యుండును. కేతుభుక్తి ద్వితీయభాగము జాతకునికి శరీర అస్వస్థత. మనోరోగము. ధననాశము. రాజాగ్రహము. బంధువుల వలన బాధ. మరణ సంబంధమైన చెడువార్తలు వినుచుండును. దశానాదుడైన రవియున్న స్థానమునుండి 6-8-12 స్థానముల యందు కేతువుండినను. లేక కేతువు పాపగ్రహములతో సంబంధమొందియున్న జాతకుడు దంతరోగము. గడ్డము వాపు లేక మధుమేహ రోగము. హోదాభంగము. ధన నాశము. తండ్రి లేక స్నేహితుని మరణము. విదేశ యానము. శత్రువుల వలన బాధ భయము సంభవించును.

కేతువు లగ్నము నుండి 2-4-5-7-8-12 స్థానముల యందున్నను లేక కేతువు యోగకారక గ్రహముతో సంబంధమొందియున్నను. లేక శుభ నవాంశ శుభ షడ్వర్గునందున్న జాతకుని భార్యబిడ్డలు సౌఖ్యముగా నుండుట. కోరిన కార్యములు. ఉత్సాహము పెంపొందును. కేతువు ద్వితీయ. సప్తమ స్థానములయందున్న జాతకునికి అపమృత్యువు వలన అపాయము సంభవించును.

**9. రవిమహాదశలో శుక్ర భుక్తి ఫలము :-**

రవిమహాదశలో శుక్ర భుక్తియందు లగ్నము లేక చంద్రలగ్నము నుండి కేంద్రము నందుగాని కోణము నందుగాని వుచ్ఛయందుగాని లేక మిత్రక్షేత్రము నందుగాని లేక షడ్వర్గునందుగాని యున్న జాతకుడు తన యిష్టమైన స్త్రీతో లైంగిక సంబంధమైన బాంధవ్యము గలిగియుండుట. సంపద. గ్రామములలో ప్రయాణము జేయుట. బ్రాహ్మణులలో పెద్దవారితో కలయుట. రాజ్యలాభము. వేడుకలు. గౌరవము పొందుట. తన స్వగృహములో వివాహములు. మంచి భోజన పదార్థములతో సంతోషము పొందుట. ముత్యములు. రత్నములు. మొదలగునవి గల్గి యుండుట. వస్త్ర ములు. పశువులు. ధనధాన్యములు. సంపద ప్రతిష్ట. ప్రఖ్యాతి పెంపొందుట. వాహనములు మొదలగునవి గల్గియుండును.

లగ్నస్థానము నుండి 6-8-12 స్థానముల యందున్నను లేక గురుని సంచారములో దశానాధుడున్న స్థానమునుండి 6-8-12 స్థానముల యందు న్నను. జాతకుడు. భార్యబిడ్డలను పోగొట్టుకొనుట. సంపద. వాహనములు. ధనము నష్ట పోవుట మొదలగునవి సంభవించును. ప్రభువుల వలన కోపము గల్గును. భుక్తి ప్రథమ భాగములో జాతకునికి వాహనములు. సంక్రమించుట. మధ్యమ భాగములో లాభకార్యములు జరుగుట. చివర భాగములో గౌరవము. హోదా చెడిపోవుట. బంధువులలో శతృత్వము. కులము. కుటుంబములో హీనముగా చూచుచుండుట సంభవించును. శుక్రుడు సప్తమ స్థానాధిపతియై యున్న జాతకుడు శరీర బలహీనత. మనోదుఃఖము గల వాడును. లగ్నము నుండి అష్టమ. ద్వాదశ స్థానముల యందు శుక్రుడున్న జాతకునికి అప మృత్యువు గలిగి ప్రాణభయము సంభవించును.

## 2. చంద్ర మహాదశ ఫలము

చంద్రమహాదశలో చంద్రుడు పరమోచ్ఛ స్థానమునందున్న జాతకుడు మంచి మనస్సు గలవాడును. వివాహ ఆనందము అనుభవించు వాడును. సంపద. వస్త్రములు. పుష్పముల లాభము పొందువాడును. మనో సౌఖ్యము. శాంతిని పొంది యుండును. చంద్రమహాదశలో చంద్రుడు ఉచ్ఛ స్థానమునందున్న జాతకుడు భార్య. పుత్రుడు. సంపద. మంచి ఆహారము. పానీయము. వస్త్రములు. ఆభరణములు. పొందు వాడగును. ఇతర దేశములకు వెళ్ళి తనబంధువులతో అపార్థములు కలుగ జేసుకొనును. చంద్ర దశా కాలములో చంద్రుడు నీచక్షేత్రము నుండి ఉచ్ఛ స్థానమునకు పోవుచున్న జాతకునికి భార్య. బిడ్డలు. సంపద. ప్రతిష్ట. వస్త్రముల సౌఖ్యమును పొందుట. ఉద్యోగములో ఉన్నతస్థితికి పోవుట. మంచి ఆహారము. దైవభక్తి. బ్రాహ్మణులకు విందుచేయుట మొదలగునవి సంభవించును. చంద్ర మహా దశలో చంద్రుడు వుచ్ఛస్థానమునుండి నీచక్షేత్రమునకు పోవుచున్న జాతకునికి భార్య. పుత్రుడు. స్నేహితులతో బాంధవ్యము తగ్గిపోవుట. అసౌఖ్యము. మనో వ్యధ.

తనసొంత బంధువులతో అపార్థములు, అగ్నిభయము, జలగండము, రాజ, చోర భయము మొదలగునవి సంభవించును.

చంద్రదశలో చంద్రుడు నీచ నవాంశయందున్న జాతకుని సంపద అనేక విధములుగా నష్టమగును. జాతకునికి చెడుభోజనము, క్రూరమైన సేవకుడు, మనో బాధ నిద్రమత్తు మొదలగునవి సంభవించును. చంద్ర మహా దశలో చంద్రుడు మూల త్రికోణము నందున్న జాతకునికి భూములు, రాజానుగ్రహము వలన సంపద చేకూరుట, భార్యబిడ్డలతో సౌఖ్యము, తల్లి ఆస్తి, ఆరోగ్యము, వస్త్రములు, ఆభరణములు గలవాడగును. కామసుఖము, గౌరవము పొందువాడుగా నుండును.

చంద్ర మహాదశలో చంద్రుడు స్వక్షేత్రము నందున్న జాతకుడు ప్రభుత్వము వలన సంపద పొంది శుభముగా యుండును. కాని జాతకుడు క్రూర స్వభావము గల వ్యభిచారిణితో సంబంధ మొందియుండును. జాతకుని యొక్క సౌఖ్యము, భార్యాబిడ్డలు, బంధువుల క్షేమమువలనను, ప్రభుత్వ పారితోషికముల వలన గలుగుచున్నది. చంద్ర మహాదశలో చంద్రుడు అధి శత్రుక్షేత్రము నందున్న జాతకుడు పోరాటము, ఘర్షణ, ఆస్తినష్టము, పనికి మాలిన దుస్తులు ధరించుట, చెడు భోజనము భుజించుట, భార్య, బిడ్డలు, సంపద కొరకు విచారము గలిగి యుండును. చంద్ర మహాదశలో చంద్రుడు శత్రుక్షేత్రము నందున్న జాతకుడు వాహనములు, ఆభరణములు, వస్త్రములను గోల్పోవుట, విదేశములకుపోయి వంట వానిగా నౌకరిచేయుచు, లోభిగా యుండును. చంద్రమహాదశలో చంద్రుడు మిత్ర క్షేత్రము నందున్న జాతకుడు సంపదవృద్ధి, హోదాలోవృద్ధి, ఆభరణములు, ముత్యములు, పగడములు, వాగ్ధాటి గలవాడగును.

చంద్రమహాదశలో చంద్రుడు అధిమిత్ర స్థానమునందున్న జాతకుడు గొప్ప సౌఖ్యము, తనతెలివితేటలను మంచి గౌరవము పొందుట, భార్యాబిడ్డల యందు వుదార స్వభావము, సంపద గలవాడును, యాత్రలకు పోవువాడుగా యుండును. చంద్రమహాదశలో చంద్రుడు సమక్షేత్రమందున్నపుడు జాతకుడు బంగారము, భూములు గలవాడును; కొద్దిసౌఖ్యము, బంధువుల అనారోగ్యము, విదేశ యానము గలవాడుగా యుండును.

చంద్రమహాదశలో చంద్రుడు నీచస్థానమునందున్న జాతకునికి అపాయము, హాని, బాధ, ఆస్థివలన దౌర్భాగ్యము, అరణ్య ప్రవాసము, కొంత కాలము కారాగారవాసము, కాళ్ళకుసంకెళ్ళు, విసుగు, వుపవాసము, అగ్ని, చోర, రాజ భయము, భార్యాబిడ్డల వలన దుఃఖము కలవాడగును. చంద్ర మహాదశలో చంద్రుడు క్షీణించియున్న జాతకుడు స్నేహితులు, భార్యా పుత్రుడు, భూములు, యితర సంబంధమైన ఆస్తిని గోల్పోవుట, వున్మాదము, తన బంధువులతో ఘర్షణ, చెడు అలవాట్ల వలన ఋణములు గలవాడగును. చంద్రమహాదశలో చంద్రుడు పూర్ణ చంద్రుడైన యున్న జాతకునికి ప్రతిపనియందు సంతృప్తి, తన తెలివితేటలకు రాజగౌరవము, సేవకులు, ఆస్తి, బిడ్డలు, భార్యవలన సౌఖ్యము యింటి యందు శుభ కార్యములు మనశ్శాంతి గల్గును.

చంద్ర మహాదశలో చంద్రుడు, వుచ్ఛయందున్న గ్రహముతో సంబంధ మొంది యున్న జాతకుడు భార్య, బిడ్డలు, సేవకులతో సౌఖ్యము, మంచి జ్ఞానము

గల్గుట, కామసుఖము గలవాడుగా యుండును. అయితే చంద్రుడు పాపగ్రహ సంబంధము గల్గియున్న తనదశాకాలములో జాతకునికి అగ్ని, అపాయములు, చోరత్వము, రాజాగ్రహము వలన బాధలు గల్గుట, భార్యాబిడ్డలు, స్నేహితులు, బంధువుల నాశము, పాపకర్మ వలన పర దేశమునకు పోవుట సంభవించును. చంద్ర మహాదశలో చంద్రుడు శుభ గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి మంచి కార్యములు చేయుటకు అవకాశములు, పశువులు, భూములు, బంగారము, వస్త్రములు, ఆభరణములు సంక్రమించుట, సోదరసౌఖ్యము, పుణ్యక్షేత్రములకు యాత్ర మొదలగునవి గల్గును.

చంద్రమహాదశలో చంద్రుడు పాపగ్రహముచే వీక్షించబడుచున్న జాతకుడు మంచి కార్యములు చేయుచుండును. కాని చెడ్డపదార్థ భోజనము వలన అసౌఖ్యము గొప్ప కోపము తల్లి లేక అమ్మమ్మ మరణము సంభవించును. చంద్ర మహాదశలో చంద్రుడు శుభగ్రహముచే వీక్షించ బడుచున్న జాతకుడు ఔదార్యము, వేదాంతము, ప్రతిష్ట, తనకు నచ్చిన స్నేహితులు, బంధువులతో ఆనందము, రాజగౌరవము, మనశ్శాంతి మొదలగునవి గల్గును. చంద్రుడు మూలత్రికోణము నందున్న వాని దశాకాలములో జాతకునికి యెక్కువ సంపద, బిడ్డలు గలుగును. వినయ విధేయతలు గలవాడై తన వంశము లేక గుంపునకు నాయకుడుగా యుండును. అయితే తన బంధువులతో శత్రుత్వము గలవాడగును. చంద్రమహాదశలో చంద్రుడు లగ్నమునకు నాల్గవ స్థానమునందున్న జాతకుడు బిరుదులను పొందుట, ప్రతిష్ట, వాహనములు, గృహము, వ్యవసాయమువల్ల లాభము, తల్లినాశము మొదలగునవి గల్గును. చంద్ర మహాదశలో చంద్రుడు సప్తమ స్థానమునందున్న కళత్రలాభము, బిడ్డలద్వారా సౌఖ్యము, ఆసనము, వస్త్రములు, మూత్రసంబంధమైన వ్యాధులు, మనోవ్యసనము, మొదలగునవి గల్గును చంద్రమహాదశలో చంద్రుడు దశమ స్థానమునందున్న జాతకునికి ప్రితష్ట, మంచి జ్ఞానము, యాగములు, యజ్ఞములు చేయుట, భూస్థితి వల్ల సౌఖ్యము, బిడ్డలు, వాహనములు, వస్త్రములు, పెద్దల యందు భక్తి గల వాడుగా యుండును.

చంద్రమహాదశలో చంద్రుడు నీచ అంశయందున్న జాతకుడు అనేక వ్యాధులచే బాధపడుట, నేత్రములు, కాళ్ళకు రోగము, యుద్ధములో శత్రువులతో పరాజయము, ఉద్రేకము నశించుట మొదలగునవి సంభవించును. చంద్రమహాదశలో చంద్రుడు ఉచ్చాంశయందున్న జాతకునికి గొప్పసౌఖ్యము, అనేక విధముల సంపద, ప్రభుత్వ పారితోషికములు, ప్రతిష్ట, లాభములు గల్గును. వీని మధ్యకాలములో భార్యా బిడ్డలను గోల్పోవుట, అంత్యదశలో జాతకునికి గృహలాభము, సంపద, వస్త్రములు, సౌఖ్యము గల్గును. చంద్రదశలో చంద్రుడు షష్టస్థానము నందున్న జాతకునికి దౌర్భాగ్యము, వివాదము, శత్రుత్వము, అగ్ని జలభయము, రాజ భయము, ధననాశము, మూత్రరోగము, మొదలగునవి సంభవించును. చంద్రమహా దశలో చంద్రుడు అష్టమ స్థానము నందున్న జాతకునికి అలసట, అశ్రద్ధ, జలభయము, లోభత్వము, తన సొంతగ్రామము విడనాడుట, అందరితో స్నేహ భంగము, చెడుభోజనము, తల్లికి సంబంధించిన బంధువులను విడనాడుట మొదలగునవి సంభవించును. చంద్రమహాదశలో చంద్రుడు ద్వాదశస్థానము నందున్న

జాతకునికి అనేక అపాయములు సంభవించును. రాజానుగ్రహము వలన ధన నాశము. దురదృష్టము. ఉద్యోగభంగము. అనేక పరీక్షలకు లోనగుట. ఆహారాది శూన్యత గలుగును.

చంద్రమహాదశలో చంద్రుడు ద్వితీయస్థానము నందున్న జాతకునికి వృద్ధి. ధన లాభము. పుత్రులు. భార్య. కామసుఖము. మంచి ఆహార పానీయములు. ఇంద్రియ వాంఛ. పవిత్రస్నానము గల్గును. చంద్రమహాదశలో చంద్రుడు తృతీయ స్థానమునందున్న జాతకునికి అనేక సౌకర్యములు. అనేక విధములైన ఆదాయము. మనస్సులో తీర్మానములు. సోదర సౌఖ్యము. భూలాభము. అనేక విధములైన ఆదాయము. భోజనము. పానీయము. వస్త్రములు. ఆభరణములు మొదలగునవి గల్గును. చంద్ర మహాదశలో చంద్రుడు ఏకాదశ స్థానము నందున్న జాతకునకి సౌఖ్యము. అన్ని విధములైన ఆస్తులు. మంచి భోజన పదార్థములు. పానీయములు. సంతోషకరమైన ఆటలు. భార్యాబిడ్డల సౌఖ్యము. మనశ్శాంతి గలవాడగును. చంద్ర మహాదశలో చంద్రుడు. రవితో సంబంధమొంది యున్న జాతకునికి దౌర్భాగ్యము. కళత్రనాశము. బంధు కలహము. రాజభయము. చోరఅగ్నిభయము. తల్లి. భూములు. ధాన్య నాశము సంభవించును.

చంద్రమహాదశలో చంద్రుడు స్థానబలము గల్గియున్న జాతకునికి సంపద. సౌఖ్యము. ప్రతిష్ఠ. విద్య. రాజలాంఛనలు. భూములు. ఆస్తి. దేవ బ్రాహ్మణ భక్తి. లాభములు. కళత్రము. రత్నములు. వస్త్రములు. ఆభరణములు. వ్యవసాయ పనిముట్లు. బలమైన ఆహారము. పాలుగల పదార్థములు. యెల్లప్పుడు సౌఖ్యము గల వాడగును. చంద్రమహాదశలో చంద్రునికి స్థానబలము లేకున్న జాతకునికి ఉద్యోగభంగము. హోదాకు హాని. సంపద నష్టము. ధననాశము. వ్యవసాయ భూముల నాశము. బంధునాశము మొదలగునవి సంభవించును.

చంద్రమహాదశలో చంద్రుడు దిగ్బలము గలిగియున్న జాతకునికి అనుకోన టువంటి ప్రదేశముల నుండి ఆస్తి సంక్రమించుట. జ్ఞానము పొందుట. రాజస్నేహము. బంధువుల నుండి అగౌరవము. భూములు. అశ్వములు. గజముల వృద్ధి గలుగును. చంద్ర మహాదశలో చంద్రుడు కాల బలము గల్గియున్న జాతకునికి భూలాభము. పశువులు. వ్యవసాయభూములు. గుఱ్ఱపుస్వారి. పులిగోళ్ళు. వెంట్రుకలు. చర్మము. మంచివస్త్రము. యేనుగు దంతములతో అలంకరింపబడిన వాహనము శ్లాఘించబడిన విద్యగల వాడగును.

చంద్రమహాదశలో చంద్రుడు నైసర్గిక బలము గల్గియున్న జాతకునికి సామాన్యముగా సౌఖ్యము. ప్రయత్నము లేకనే వాహనలాభము. విదేశపాలకుల వల్ల గౌరవము పొందువాడగును. చంద్ర మహాదశలో చంద్రుడు దిగ్బలము గల్గియున్న రాజానుగ్రహము వలన జాతకునికి అనేక విధములైన అదృష్ట సంఘటనలు జరుగు చుండుట. సౌఖ్యము. వుదారము. మనశ్శాంతి గలవాడుగా నుండును. చంద్రమహా దశలో చంద్రుడు క్రూర షడ్వర్గు నందున్న జాతకునికి అతి దుఃఖము. భార్యాబిడ్డల నాశము. రాజా గ్రహము. భాషాభేద సంబంధమైన చర్చలు. ప్రజలలో సంకటనలు గల్గు చుండును. చంద్రమహాదశలో చంద్రుడు శుభషడ్వర్గు నందున్న జాతకునికి అనేకమంది బిడ్డలు. సేవకులు. ఆస్తి. జయము. సౌఖ్యము. ప్రతిష్ఠ. విద్య

గలుగును. చంద్రమహా దశలో చంద్రుడు క్రూరద్రేక్కాణము నందున్న జాతకుడు రోగముతో బాధపడుట, గోవులు, బ్రాహ్మణులతో సంకటనలు, క్రూరకార్యములు చేయుట సంభవించును.

చంద్రమహాదశలో పైన తెలుపబడిన శుభ పాపఫలములు వరుసగా దశా కాలములో మొదట భావఫలములు దిగ్బలఫలములు, తరువాత అంశ ఫలములు, చివరలో గ్రహముల యొక్క ఫలములు సంభవించును.

**1. చంద్ర మహాదశలో చంద్ర భుక్తి ఫలము :-**

చంద్ర మహాదశలో చంద్ర భుక్తియందు చంద్రుడు ఉచ్ఛ యందున్నను లేక స్వస్థానము నందున్నను, లేక త్రికోణము నందున్నను, లేక యేకాదశ స్థానము నందున్నను, లేక శుభకారకాధిపతులతో సంబంధ మొంది యున్న జాతకునికి యేనుగులు, అశ్వములు, మంచి వస్త్రములు, దేవ గురు భక్తి, గొప్ప యోధులైన నల, యధిష్టర హరిశ్చంద్ర మొదలగు వారియొక్క చరిత్రలు తర్కించుట, వృద్ధి, సౌఖ్యము, ప్రభువు లేక ప్రభుత్వమునకు సేవజేయుట వలన వృద్ధి గలిగి యుండును. చంద్రమహాదశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు, పూర్ణచంద్రుడై యున్న జాతకుడు పరమానందము పొందు వాడగును. జాతకుడు యుద్ధ పటాలమునకు నాయకుడై సంతోషమును అనుభవించును. అయితే చంద్రుడు పాప గ్రహములతో సంబంధ మొంది యున్నను లేక నీచక్షేత్రము నందున్నను, లేక అష్టమ, ద్వాదశ స్థానము లందున్నను జాతకుడు చంద్రభుక్తి కాలములో ఆస్తి నష్ట పోవుట, లేక వుద్యోగభంగము, శరీర బలహీనత, మనోవ్యాధి, ప్రభువు లేక మంత్రి వైరము, తల్లి నాశము, బానిసత్వము లేక సంకెళ్ళు వేయబడుట, బంధునాశము గల్గును. చంద్ర మహాదశలో చంద్ర భుక్తియందు చంద్రుడు ద్వితీయ లేక సప్తమాధి పతియై యున్నను, లేక చంద్రుడు షష్ట, అష్టమ స్థానముల యందున్నను, జాతకునికి శరీర బలహీనత, సోమరితనము, అగౌరవము, పొందుట, మృత్యు భయము సంభవించును.

**2. చంద్ర మహాదశలో కుజ భుక్తి ఫలము :-**

చంద్ర మహాదశలో కుజ భుక్తియందు కుజుడు 4-7-10-5-9 స్థానముల యందున్నను జాతకుడు అన్నివిధములైన సౌఖ్యములను అనుభవించును. రాజ పారితోషికములు, వస్త్రములు, ఆభరణములు పొందును. ఎటు వంటి పరిజ్ఞానము లోనైననూ అనుమానమునకు తావు లేనివాడై జయమును గాంచును. తగాదా యందున్న దావాలో జయమును గాంచును. తన గృహమును పెంచి పెద్దది చేయును. కుజుడు వుచ్ఛయందున్నను లేక తన స్వక్షేత్రము నందున్న జాతకుడు తన పనుల యందు జయమును పొందుచు సౌఖ్యమును అనుభవించువాడుగా నుండును.

చంద్రమహాదశలో కుజభుక్తియందు కుజుడు లగ్నస్థానము నుండి 6-8-12 స్థానముల యందెందైనా యున్నను లేక కుజుడు పాపగ్రహముతో సంబంధ మొంది యున్నను, లేక దశానాధుడున్న స్థానమునకు 6-8-12 స్థానముల యందెందైనా యున్నను లేక కుజుడు పాపగ్రహముతో సంబంధ మొందియున్నను, లేక దశానాధు డున్న స్థానమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక కుజుని పాపగ్రహములు వీక్షించుచున్న జాతకుడు శరీర రోగముచే బాధనొందు వాడును, స్వగృహనాశము,

తగాదాలు, వ్యాజ్యములు, సేవకులతో సంకటనలు, ప్రభువుతో శత్రుత్వము, దగ్గర స్నేహితుని మరణము, యెల్లప్పుడు క్రూరమైన తిట్లతో గొనుగుడు గలవాడగును. చంద్ర మహాదశలో కుజభుక్తి యంద కుజుడు ద్వితీయ సప్త, అష్టమ, స్థానములకు అధిపతియై యున్నను లేక కుజుడు అష్టమ స్థానము నందున్నను, జాతకుడు పై చెడు ఫలములనే పొందును. యెటువంటి పరిజ్ఞానమున కైననూ అడ్డంకులు, మనో బాధ సంభవించును.

**3. చంద్ర మహాదశలో రాహు భుక్తి ఫలము :-**

చంద్ర మహాదశలో రాహు భుక్తియందు, భుక్తినాధుడైన రాహువు లగ్నము నుండి గాని లేక దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండిగాని కేంద్రము లేక త్రికోణము నందున్న జాతకునికి ప్రారంభదశలో కొద్దిలాభము గలును. కానిమిగిలిన దశాకాలమంతయు శత్రువుల బాధవలన దౌర్భాగ్యము, అగ్ని, సర్పములు, రాజా గ్రహము వలన అధికభయము సంభవించును. జంతుబాధ, బంధువులకు అపదలు, స్నేహితుల మరణము, అపకీర్తి, మనోవ్యాధి, విషపురుగుల బాధ, భార్యతో విరోధము, సంపద నాశము, ఆకస్మిక సంఘర్షణలు, వ్యాపార లావాదేవీలలో ఘర్షణలు, తల్లిదంద్రుల మరణము గూడా సంభవించును.

భుక్తినాధుడైన రాహువు శుభగ్రహముతో సంబంధమొందియున్నను, లేక శుభ గ్రహముచే వీక్షించబడినను, లేక యోగకారక గ్రహముచే సంబంధమొంది నను లేక లగ్నస్థానమునుండి 3-6-10-5 స్థానముల యందున్నను, లేక శుభగ్రహము తో బాంధవ్యము పొందియున్నను, జాతకుడు తలపెట్టిన కార్య మెల్ల జయమును పొందుట, పశ్చిమము లేక వాయుదిశగా పయనించుట వలన వ్యాపారములో లాభము పొందుట, స్నేహితులను కలుసుకొనుట, వాహనములు వస్త్రముల వలన లాభము, వుద్యోగము నందు వృద్ధి, యొక వుద్యోగి సహాయము వలన గొప్ప కార్యము సాధించగలుట సంభవించును.

చంద్రమహాదశలో రాహుభుక్తియందు, భుక్తినాధుడైన రాహువు లగ్నము నుండిగాని లేక దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండి గాని 6-8-12 స్థానములయందున్న జాతకునికి హోదాయందు హాని లేక వుద్యోగ భంగము, మనోవ్యధ, పుత్రనాశము, అధికభయము, వృశ్చికము, సర్పము, అగ్ని వలన బాధ, చోరరాజ భయము ధననాశము, ప్రభుత్వపనులు పెంపొందుట, ఋణబాధలు గలును. దశానాధుడైన చంద్రుడున్న స్థానమునకు రాహువు 4-7-10-5-9-3-11 స్థానముల యందున్నజాతకునికి యాత్రాసుఖము గల్గి పవిత్రమైన విగ్రహములు, దేవాలయములు వీక్షించు భాగ్యము గలుగును. ధర్మకార్యమును, దేవతలకు అర్చనలు చేయుచు మత సంబంధమైన పనులలో నిమగ్నుడై యుండును. అయితే రాహువు ద్వితీయ లేక సప్తమ స్థానమునందున్న జాతకునికి శరీరరోగము సంభవించును.

**4. చంద్ర మహాదశలో గురు భుక్తి ఫలము :-**

చంద్రమహాదశలో గురుభుక్తియందు భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు కేంద్ర, కోణముల యందుగాని, స్వక్షేత్రమునందుగాని, లేక వుచ్ఛస్థానము నందుగాని లేక ఏకాదశ స్థానమునందుగాని యున్న జాతకునికి వృత్తిలోగాని లేక హోదాలోగాని

కొంతవృద్ధి, గొప్పసౌఖ్యము, ఆభరణములు, వస్త్రములు, రాజానుగ్రహము, యెక్కువ ఆదాయము, దేవుని అనుగ్రహము వలన పుత్రజననము, గృహము నందు వేడుకలు, లక్ష్మీదేవి అనుగ్రహము వలన సంపద పెంపు, భూములు గజములు, అశక్వములు గల్గియుండుట, అను కున్న కార్యములు వెంటనే సఫలమగుచుండును. అయితే గురుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముచే సంబంధమొంది యున్న జాతకుడు పనికిమాలిన పనులకులోనై యుండుట, పుత్రమరణము, గురు నాశము, వుద్యోగ భంగము, మనోబాధ, అనుకోనటువంటి తావునుండి పోరాటము, గృహము, స్థలము, వాహనములు వస్త్రములు వుద్వాసన సంభవించును.

భుక్తినాధుడైన గురుడు, దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండి కేంద్రకోణ, తృతీయ లేక యేకాదశస్థానము నందున్న జాతకుడు మంచి ఆహారము, వస్త్రములు, గోవులతో సంతోషమొందియుండుట, వేడుకలు చేయుట, సోదర సౌఖ్యము, సంపద, ధైర్య సాహసములు గల్గియుండుట, ఆనందము వివాహములు, యజ్ఞ యాగాదులు జరుపుట, రాజగౌరవము, వృద్ధి, పొందువాడగును. దశానాధునికి 6-8-12 స్థానముల యందు గురుడున్నను, లేక గురుడు నీచస్థానము నందున్న జాతకునికి చెడు పదార్ధ భోజనము, స్వగ్రామము విడిచిపోవుట సంభవించును. గురుభుక్తిలో ప్రారంభ దశయందు కొంత సౌఖ్యమున్నను, తరువాత దౌర్భాగ్యము, దుఃఖము సంభవించును. గురుడు ద్వితీయ, సప్తమాధిపతియైయున్న తన భుక్తి కాలము నందు ప్రాణాపాయము సంభవించును. గురుభుక్తిలో కొన్ని మంచి కార్యములు అనగా బావులు త్రవ్వించుట, చెట్లునాటుట, దేవాలయ నిర్మాణములు, పెద్దలు, బ్రాహ్మణుల వలన సౌఖ్యము గలుగవచ్చునని కొందరి మతము.

5. చంద్ర మహాదశలో శని భుక్తి ఫలము :-

చంద్ర మహాదశలో శని భుక్తియందు శని లగ్నమునకు కేంద్ర లేక త్రికోణము నందున్నను, లేక స్వక్షేత్రము నందున్నను లేక బలము గల్గి స్వనవాంశ యందున్నను జాతకుడు ప్రేమపాత్రుడైన పుత్రుని వలన ఆనందము, స్నేహితులు, సంపద, గురువుతో, సంబంధము, వ్యవసాయ ఆదాయములో పెంపుదల, వివాహ వేడుకలు, రాజాను గ్రహము వలన, ప్రఖ్యాతి, యొక ఉద్యోగిద్వారా పశ్చిమ, నైరుతి దిశల నుండి ఆదాయము, గొప్ప ఆలోచనాపరమైన పథకమును జయప్రదముగా నిర్వహించుట సంభవించును. భుక్తినాధుడైన శని 6-8-12 స్థానముల యందున్నను లేక నీచ క్షేత్రమునందున్నను, లేక శత్రుక్షేత్రము నందున్నను, శని భుక్తి ప్రారంభ దశలో జాతకునికి పుణ్యక్షేత్రములలో పవిత్ర స్నానములు, దేవాలయముల దర్శనము సంభవించును. అయితే తరువాత భుక్తిదశ యందు రాజకీయ సంబంధ మైన ప్రజల యొక్క భయము, ఆయుధముల బాధ, బంధువులతో విభేదములు, శరీర అసౌఖ్యము సోదరనాశము, ధన వ్యర్థము ఋణముల వలన బాధ, స్వగ్రామము తప్పని సరిగా విడిచిపెట్టి పోవుట, అవమానము, రాజభయము, అగ్ని, గాయములు చోరుల వలన భయము గల్గును.

చంద్ర మహాదశలో శని భుక్తి యందు శని దశానాధుడైన చంద్రుడున్న స్థానమునకు కేంద్రము గాని లేక కోణమునగాని లేక యేకాదశ స్థానమునందున్న జాతకుడు కొంతకాలము ప్రత్యేక ఆదాయముతో సౌఖ్యముగా యుండును. తరువాత

కాలమంతయూ భార్యాబిడ్డలతో శత్రుత్వము గల్గియుండును. శని ద్వితీయ, సప్తమ లేక అష్టమస్థానమునందున్న శరీరమునకు అనారోగ్యము సంభవించును.

6. చంద్ర మహాదశలో బుధ భుక్తి ఫలము :-

చంద్రమహాదశలో బుధ భుక్తియందు లగ్నమునుండి కేంద్రము లేక కోణము నందున్నను, లేక స్వక్షేత్రము నందున్నను, లేక వుచ్చస్థానము నందున్నను, లేక తన స్వనవాంశ యందున్నను లేక శుభక్షేత్రము నందున్నను లేక శుభగ్రహముతో సంబంధమొందియున్న జాతకుని బుధ భుక్తి కాలములో వివాహ సంబంధమైన వేడుకలు, బంధువుల వలన పారితోషికములు, కోరిన వస్త్ర సముదాయము, అశ్వము మొదలగునవి గల్గును. విద్యా నైపుణ్యము గలవారితో స్నేహము, జ్ఞానాభివృద్ధి, అతి సౌఖ్యము, శిశు జననము, ప్రతిష్ట పెరుగుట, వ్యాపారము నందు లాభము రత్నములు, ముత్యములు, కెంపుల లావాదేవీలు, శత్రునాశము చేపట్టిన కార్యములు జయప్రదముగా నిర్వహించుట, మత సంబంధమైన వుపన్యాసములు వినుట, రాజులచే ప్రేమించబడుట, ఆధ్యాత్మిక సంబంధమైన వ్యవస్థలతో కలసి యుండుట, గాయకుల పాటకచేరీలకు హాజరగుట, దేవాలయ వేడుకలు, ప్రయాణము, స్నేహితుల పారితోషకములు, గొప్పభవనము నందు నివాసము, దొరకని వస్తువులు, పవిత్రమైన సామానులను సంపాదించుట, తల్లి తరపు నుండి గౌరవము పెరుగుట మొదలగునవి సంభవించును. బుధుడు, ద్వితీయ, సప్తమ స్థానములకు అధిపతియై యున్న జాతకుడు యెక్కువుగా జ్వరముచే బాధపడు చుండును.

భుక్తినాధుడైన బుధుడు షష్ట, అష్టమ, ద్వాదశ స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రము నందున్న, జాతకుడు శరీర రోగములు, కారాగార వాసము, భార్య బిడ్డలకు రోగము, బంధువులతో అపార్థములు, అనేక దిశల నుండి బాధలు, భయము సంభవించును.

7. చంద్ర మహాదశలో కేతు భుక్తిఫలము

చంద్ర మహాదశలో కేతు భుక్తి యందు కేతువు 3-6-11 స్థానముల యందున్నను, లేక శుభ గ్రహముతో సంబంధ మొంది యున్నను, లేక శుభ గ్రహములచే వీక్షంప బడినను, జాతకునికి వ్యవసాయ సంబంధమైన ఆదాయము పెరుగుట, స్వశక్తిచే ధనలాభము, వితంతువుతో సంబంధము, చోరుల ద్వారా ధనాదాయము, ధర్మ కార్యములు, ప్రభువుచే ప్రేమించ బడుట, మనస్సులో సౌఖ్యము గలవాడగును.

భుక్తినాధుడైన కేతువు లగ్నమునకు కేంద్ర, త్రికోణముల యందున్న జాతకునికి ప్రధమ భాగములో కలతలు, వైరములు గలుగుట, మధ్య కాలములో శత్రుభయము, అంత్య దశలో సౌఖ్యము గలుగును. దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండి కేతువు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచ క్షేత్రము నందున్న జాతకునికి పనిలో అడ్డంకులు, భూతభయము, ఋణ బాధలు, మితిలేని ఖర్చులు, వితంతువుతో వివాదము, తలలో బాధ, గోవులు, గేదెల నష్టము, రాజాగ్రహము, మనోవ్యసనము, పరగృహ నివాసము, ప్రయాణము, దిన చర్య నాశము, అకాల భోజనము, విషజీవులభయము, తండ్రి మరణము, కీళ్ళవాతరోగ

బాధ మొదలగునవి సంభవించును. భుక్తినాధుడైన కేతువు ద్వితీయ, సప్తమ స్థానముల యందున్న జాతకునికి అనేక విధములైన బాధలు, భయము గల్గును.

**8. చంద్ర మహా దశలో శుక్ర భుక్తి ఫలము -**

చంద్ర మహాదశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు కేంద్రము లేక కోణము నందున్నను, లేక ఏకాదశ స్థానమునందున్నను, లేక శుభగ్రహముతో సంబంధ మొందియున్నను, జాతకుడు తన మిత్రుడైన ప్రభువు ద్వారా వాహనములు, వస్త్రములు పొందుట, భూములు పశువులు సంపాదించుట, ప్రతిష్ట పెంపొందుట, నూతన గృహ నిర్మాణము, వివాహాది వేడుకలు జరుపుట, బంధు కలయిక, మంచి శయనసౌఖ్యము, పుష్పములు, సుగంధ ద్రవ్యములు, లైంగిక సౌఖ్యము, వుద్యోగము, హోదాయందు వృద్ధి, ప్రభువుతో ఆకస్మిక సంభాషణ, సంగీత జ్ఞానములో సంతోషము, అధిక ధనలాభము, దగ్గర స్నేహితుల ద్వారా సంతోషము గల్గును.

దశానాధుడైన చంద్రనితో శుక్రడు సంబంధమొంది యున్న జాతకుడు పరిపూర్ణ మనస్సు గల్గి ఆరోగ్య వంతుడుగా యుండును. యెక్కువ ఆదాయము, ప్రభువు వలన ప్రతిష్ట, గౌరవము పొందును. హోదా పెరుగుట, స్త్రీల ద్వారా సంపద పెరుగుట, తన గృహము పండుగ సంబంధమైనదిగా కనుపించును.

భుక్తి నాధుడైన శుక్రుడు 6-8-12 స్థానముల యందు గాని లేక నీచక్షేత్రము నందుగాని, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు ప్రభువు, మంత్రితో వైరము గలవాడును, పశునాశము, భార్యకు అనారోగ్యము, అసౌఖ్యము, బంధు మరణము, రాబడి తగ్గుట, దౌర్భాగ్యము, మనోబాధ, స్త్రీలతో వైరము, తల్లి లేక తండ్రి మరణము, హోదా లేక వుద్యోగ భంగము, పనికి అడ్డంకులు, ఋణముల బాధ గల్గును.

భుక్తి నాధుడైన శుక్రుడు భాగ్య లేక యేకాదశ స్థానాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి అదృష్టము వృద్ధిజెందును. దేవులను, బ్రాహ్మణులను పూజించుట, రత్నాభరణ లాభము పొందగల్గును. దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండి 4-7-10-11-5-9 స్థానముల యందు శుక్రుడున్నను, లేక శుక్రుడు తన స్వనవాంశ యందున్నను, లేక వుచ్చస్థానము నందున్నను, జాతకుడు నూతన గృహ నిర్మాణము జేయగల్గుట, జ్ఞానాభివృద్ధి, పుత్ర జననము, వ్యాపారము పెంపొందుట, హోదా అభివృద్ధి, శత్రునాశము, యెక్కువ సంతోషము, పరస్త్రీ సౌఖ్యము, బంధువుల వివాహము జరుపుట మొదలగునవి సంభవించును.

దశానాధుడైన చంద్రుడున్న స్థానము నుండి 6-8-12 స్థానముల యందు శుక్రుడున్నను, లేక పాపగ్రహముతో సంబంధ యొంది యున్న జాతకుడు తన సొంత గ్రామమును విడిచి యితర ప్రదేశములో నివసించుట దుఃఖములో మునిగి బాధల యందుండుట, ప్రభువు వలన బాధలు, అగ్ని, చోరభయము, అధికార భంగము, స్నేహితులతో అభిప్రాయ భేదములు, మనోబాధ సంభవించును. శుక్రుడు ద్వితీయ లేక సప్తమాధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

9. చంద్ర మహాదశలో రవి భుక్తి ఫలము -

చంద్ర మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి వుచ్చ యందున్నను లేక స్వక్షేత్రము నందున్నను లేక లగ్నస్థానము నుండి కేంద్రమున గాని, లేక కోణమున గాని లేక తృతీయ స్థానమున గాని బలము గల్గి యున్న జాతకుని వృత్తియందు అభివృద్ధి సంపద పెంపొందుట. తన గృహము నందు వివాహ వేడుకలు, ప్రభుత్వ సహాయము వలన తన సొంత గ్రామములో భూ లాభము, పుత్ర జననము, గొప్ప సౌఖ్యము, తన అధికారము ద్వారా యెక్కువ ధనాదాయము, వుద్యోగము మరియు వ్యాపార సంబంధమైన లావాదేవీలు పొందుట, బంధు సౌఖ్యము, మత సంబంధమైన వుపన్యాసములకు హాజరగుట, గురువుల దర్శనము, దేవాలయ ప్రవేశము చేయుచుండును.

భుక్తినాధుడైన రవి 6-8-12 స్థానములందున్నను, లేక నీచస్థానము నందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకుని పనులకు ఆటంకములు సంభవించు చుండును. శత్రు భయము, జ్ఞానము లోపించుట, ప్రత్యేక బాధ యింకొక గ్రామమునకు వెళ్ళుట, అతిఖర్చులు, ఋణముల బాధ, శరీరమునకు బడలిక, మనోవ్యాధి, యింకొక గ్రామనివాసము, యేపని తలపెట్టినను భంగ మగుట, గొప్ప భయము గల్గి యుండును. రవి, ద్వితీయ లేక సప్తమ స్థానాధిపతి యైయున్న జాతకునికి యెక్కువ అలసట, యెక్కువుగా ఖర్చుచేయుట సంభవించును.

## 3. కుజ మహాదశ ఫలములు

జాతకుని జననకాల మందు కుజుడు పరమోచ్చ• స్థానము నందున్న తన దశా కాలము నందు జాతకునికి ధనలాభము, యుద్ధములో జయము, అధిక గౌరవము, ప్రభు గౌరవము, భార్య, బిడ్డలు, సోదరులు సౌఖ్యము, ధారాళమైన వాక్కు గల్గి యుండును. కుజ మహాదశలో కుజుడు వుచ్చ స్థానము నందున్న జాతకుడు ప్రభువు ద్వారా రాజ్యము లేక సంపద పొంద గలడు, గ్రామము లేక పట్టణము మధ్య భాగము నందు భూమిని సంపాదించ గల్గును. భార్య, బిడ్డలు, బందువులు సౌఖ్యముగా నుండెదరు. జాతకునికి యితర దేశములు పటిష్ట మైన వాహనములో పోవుటకు అవకాశము గల్గును. కుజుడు వుచ్చయందున్న గ్రహముతో సంబంధమొంది యున్న తన దశాకాలములో జాతకుడు తన స్వశక్తితో ఆహార పానీయములు, వస్త్రములు సంపాదించు కొనును. ప్రభువును గౌరవించును. భార్యా బిడ్డలకు కష్టములు సంభవించ వచ్చును.

కుజ మహాదశ కాలము నందు కుజుడు నీచ స్థానమునందున్న జాతకుడు తన జనులను పాపపు పనుల ద్వారా జీవనోపాధి కల్పించు కొనుటకును నష్ట పడుట, చోరులు, అగ్ని, ప్రభువువలన బంధువులు నాశన మగుట సంభవించును. కుజుడు నీచ స్థానము నందున్న గ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి కుజ దశాకాలము నందు శరీర సంబంధమైన భయము, యితరులకు బానిసత్వము, యితరుల యిండ్లలో భోజనము, అగ్ని, రాజాగ్రహము వలన భార్యబిడ్డల నాశము సంభవించును.

కుజుడు అధిమిత్ర స్థానము నందున్న కుజదశా కాలము జాతకునికి లాభ దాయకముగా యుండును. జాతకుడు ప్రభుత్వ భూములు, సంపాదించుట, సంపద, వస్త్రములు, వివాహములు, యజ్ఞములు చేయించుట, విదేశముల నుండి సంపాదించిన వానితో సంతోషపడుట సంభవించును. కుజుడు మిత్ర క్షేత్రము నందున్న వాని దశాకాలము నందు జాతకుడు శత్రువుల విడిదిలో స్నేహముగా యుండుట, చోరుల వలన అపాయము, అజీర్ణ వ్యాధి, నేత్ర రోగముతో బాధ, వ్యవసాయముతో నష్టము, స్థాన చలనము, దుఃఖములో మునిగి యుండుట, కోపము, పోట్లాటలు సంభవించును. కుజుడు సమక్షేత్రమునందున్న కుజ దశా కాలములో జాతకుడు తన అంతస్తుకు మించిన నూతన గృహ నిర్మాణము జేయును. భార్య, బిడ్డలు, సోదరులు, సేవకులతో శత్రుత్వము గలవాడై యుండును. అగ్ని వలన భయము ప్రభువుతో హింసించ బడును. కుజుడు శత్రు స్థానము నందున్న తన దశాకాలము నందు జాతకునికి యుద్ధముల వలన భయము, విచారము, అగ్ని, విషము, రాజభీతి వలన భయము, మూలవ్యాధి నేత్ర రోగము మొదలగునవి సంభవించును. కుజుడు అధి శత్రు స్థానము నందున్న జాతకునికి తగవులు, కలహములు, దుఃఖము, తన స్వజనులతో శత్రుత్వము, సంపద నాశము, భూనష్టము, భార్య, పుత్రుడు, స్నేహితునికి రోగము సంభవించును.

కుజుడు నీచస్థానము నుండి ఉచ్ఛ క్షేత్రమునకు పోవుచున్న వాని దశాకాలము నందు జాతకుడు యొక గుంపునకు నాయకుడుగా యుండుట, సాహసములు, గొప్ప గుండె గలవాడును, గొప్ప అదృష్టము, గోవులు, యేనుగులు, అశ్వములు గల వాడును, నరేంద్రుని మొక్కువాడును అగును. కుజుడు వుచ్ఛ క్షేత్రము నుండి నీచ స్థానమునకు పోవుచున్న జాతకునికి వుద్యోగ భంగము, ధన నష్టము, స్వజనులతో శత్రుత్వము, కోపము, దుఃఖము, పోరాటము, తనసొంత భూమి నుండి ప్రవాసము, అగ్ని, రాజ, చోరభయము సంభవించును.

కుజ మహాదశలో దశానాధుడైన కుజుడు మూల త్రికోణము నందున్న జాతకునికి సుఖభోజనము, మంచి పానీయము, వస్త్ర భూషణ ప్రాప్తి, పురాణ శ్రవణము, సోదర సౌఖ్యము, వ్యవసాయవృద్ధి గలుగును, ప్రేమ, యెక్కువ సంపద, ధారాపుత్ర సౌఖ్యము, జ్ఞానాభివృద్ధి, సాంగత్య సౌఖ్యము, చేపట్టిన పనియందు మూర్ఖపు పట్టుదల గలవాడుగా నుండును. దశానాధుడైన కుజుడు స్వక్షేత్రము నందున్న జాతకునికి భూలాభము, వుద్యోగాభివృద్ధి, బిరుదులు, వాహన సౌఖ్యము, మంచి ఆరోగ్యము, సోదర సౌఖ్యము గలుగును.

సూర్యనకు ముందున్న ఆరుస్థానములు అధోముఖమనియు, సూర్యనకు వెనుకనున్న ఆరుస్థానములు ఊర్ధ్వముఖమని గ్రహించవలెను. ఊర్ధ్వముఖము నందున్న గ్రహములు యెల్లప్పుడు శుభఫలముల నొసంగును. వక్రించిన గ్రహము అవరోహియనియు, మరల అది వెనుకకు మొట్టమొదటి స్థానమునకు కదలునపుడు ఆరోహియందురు. వుచ్ఛయందున్న గ్రహము వక్రించియున్న అధికశుభఫలములు చెప్పరాదు. గ్రహదశాకాలము మధ్యమందున్నపుడు గ్రహము వక్రించియున్నదా లేక మామూలు చలనమునందున్నదాయని గ్రహించవలెను.

కుజ దశాకాలమునందు కుజుడు మేషరాశియందున్న జాతకుడు గొప్ప ప్రతిష్ట గలవాడైన సుఖసంతోషము గల్గియుండును. కాని జాతకుడు పైత్యము వలన వచ్చు నొప్పులచే బాధ నొందుట, చోరాగ్నిభయము, యెక్కువ అలసట పొందువాడగును. కుజ దశాకాలమునందు కుజుడు వృషభ రాశియందున్న జాతకుడు నీచస్త్రీనాశము వలన దుఃఖితుడగును. తన సొంత వాగ్దానములకు పశ్చాత్తాపపడును, ఇతరులసంపద కొరకు అత్యాశగల వాడగును. గురు దైవభక్తి లేని వాడును, కొద్ది సంతానము గలవాడగును. కుజ మహాదశలో కుజుడు మిధున రాశి యందున్న జాతకుడు విదేశ గమనము, వ్యాకరణ సూత్రములు బాగుగా తెలిసిన వాడగును. సుజనులతో అపార్ధములు, అధిక ఖర్చులు, అగ్ని, వనములు, జలము తన స్వాధీనము నందుడుటచే సౌఖ్యమును పొందును. మంచి స్వభావము, అయితే యితరులు అనిష్టముగా యుండెదరు. భార్యాబిడ్డల వలన లాభము గల్గును. కుజ మహాదశ యందు కుజుడు కర్కాటకములో నీచ స్థానమున తప్పియున్న జాతకుడు తన మంచి స్వభావమువలన యెక్కువ ప్రతిష్ట గల వాడగును. బలము, పశుగణము వలన సౌఖ్యము, ముఖ్యమైన వారితో విరోధము, సుఖరోగ బాధలు గల వాడగును. కుజమహాదశయందు కుజుడు సింహరాశియందున్న జాతకుడు గ్రామము లేక పట్టణమునకు ప్రధాననాయకుడుగా యుండును. పని యందు వుద్రేకము, క్రోధము గలవాడును, సంతాన హీనుడును, అగ్నిప్రమాదములు, ఆయుధ భయము గల వాడగును. కుజమహాదశయందు కుజుడు కన్యరాశి యందున్న జాతకుడు వుద్యోగలాభము, అధికారము పొందగల్గుట, సౌఖ్యము, దేవాలయములు, యజ్ఞయాగాది క్రతువులయందు పాల్గొనుట, భార్యబిడ్డలతో సౌఖ్యముగా నుండుట, భూ లాభము మొదలగునవి సంభవించును.

కుజ మహాదశ యందు కుజుడు తులారాశియందున్న జాతకుడు రుచిలేని భోజనము, స్త్రీలవలస, ధననాశనము, సేవకులతో వైరము, వాహనములు లేని వాడును, అంగవైకల్యము గలవాడగును. కుజమహా దశలో కుజుడు వృశ్చికరాశి యందున్న జాతకుడు అందరిచే గౌరవము పొందువాడును, వ్యవసాయమువల్ల లాభము, స్వతంత్రముగా జీవంచుటకు అయిష్టత గలవాడుగా నుండును. అగ్ని భయము, శునకము, మార్జాలము, యెలుక, కోతి, వృశ్చికకాటు భయము గల వాడగును. కుజమహాదశలో కుజుడు దనుస్సురాశియందున్న జాతకుడు బ్రహ్మణ రాజాను గ్రహము వలన సంపద వృద్ధిపొందుట, చేతిపనులు చేపట్టి విజయము సాధించుట, వివాదములను తొలగించి అందరితో స్నేహముగా నుండుట, గౌరవము, ప్రతిష్ట గలవాడుగా నుండును. కుజమహాదశలో కుజుడు మకరరాశిలో ఉచ్ఛయందున్న జాతకుడు అధికారములో సౌఖ్యము, వాహనములు, తప్పని సరియై ముఖ్యమైన స్నేహితులను తగవులలో ప్రేరేపించువాడగును.కుజమహాదశలో కుజుడు మకరరాశిలో పరమోచ్ఛ స్థానమును వదలియున్న జాతకుడు తన స్వకృషిని ధనమును సంపాదించుట, అడవి యేనుగు, సర్పము, జంతువు, ఆయుధముల భయము గల వాడగును, కుజమహాదశలో కుజుడు కుంభరాశి యందున్న జాతకుడు అన్నహీనత, గర్వము, పేదరికము, చెడు అలవాట్లు, జ్ఞానాశము గల్గును. కుజ మహాదశలో కుజుడు మీనరాశి యందున్న జాతకునికి రోగము,

ఋణము, అధికవ్యయము, మడిమలో గాయములు, పరిజ్ఞానము వీడుట, విదేశ నివాసము సంభవించును.

మీనము లేక యితర రాశులయందు కుజుడు, వర్గోత్తమాంశయందున్న జాతకుడు లోభియైనను బలవంతుడై యుద్ధభటుడుగా యుండును. వివిధ రాశులయందు కుజుడు వర్గోత్తమాంశ యందున్న వాని ఫలములు రెట్టింపుగా యుండును. కుజుడు అంశలో నీచయందున్న కుజమహాదశలో జాతకుడు దేశదిమ్మరి యగుట , దుఃఖము, తొందరలో వచ్చినలాభము నష్టమగుట, తనకంటె తక్కువ వానివద్ద సేవజేయుట గలుగును. కుజమహా దశలో కుజుడు నీచస్థానము నందున్న జాతకునికి నష్టము లేక పని తగ్గింపు, ధననాశము, అధిక యింద్రియ వాంఛ, క్రమమైన, మంచి అలవాట్ల యందు అశ్రద్ధ గలుగును. కుజ మహాదశా కాలము నందు కుజుడు ఉచ్చాంశయందున్న జాతకునికి అనుకున్న పనులు నెరవేరుట, జయము, సౌఖ్యము, నీచస్త్రీ సాంగత్యము, ప్రభుత్వములో నమ్మకమైన అధికారము, సుగంధ ద్రవ్యములు, పాటలు, సంగీతసౌఖ్యము గలవాడగును. కుజమహాదశలో కుజుడు కేంద్ర స్థానమున వృద్ధియందున్న జాతకునికి చోర, విష, కలతల భయము, గృహ కలతలు, విదేశ ప్రవాసము గలుగును.

కుజ మహాదశయందు కుజుడు ద్వితీయస్థానమునందున్న జాతకుడు తన బంధువర్గములోనెల్ల ధనవంతుడై యుండును. కాని ప్రభుత్వము తనసంపద నంతనూ కొల్లగొట్టవచ్చును. నేత్రరోగము, ముఖరోగము సంభవించవచ్చును. కుజ మహాదశ యందు కుజుడు తృతీయ స్థానమునందున్న జాతకుడు సౌఖ్యము పొందు వాడును, శత్రుజయము, భార్య, సోదరులతో సౌఖ్యము, ప్రభువు ద్వారా సంపద, గౌరవము, పొందగల వాడగును. తృతీయస్థానము రవి యొక్క స్వక్షేత్రమైయున్న జాతకునికి పుత్ర మరణము, తరువాత నిరుత్సాహము, బద్ధకము యేర్పడును. తృతీయ స్థానము శత్రుక్షేత్రమై యున్న జాతకునికి సోదరుని వలన గాని లేక భూమి వలన గాని దుఃఖము, అధిక భాధగలుగును. కుజ మహాదశలో కుజుడు నాల్గవ స్థానమునందున్న జాతకునికి వుద్యోగభంగము, బంధువులతో విరోధము, అగ్ని చోర ప్రమాదము, రాజభయము, అవకాశమున్న ప్రదేశములకు పోవుట సంభవించును. కుజ మహాదశలో కుజుడు పంచమ స్థానమునందున్న జాతకునికి పేరు ప్రతిష్ట భంగము, నేత్ర రోగము, ధననాశము, వివాదములు సంభవించును. కుజ మహాదశలో కుజుడు పాపియై షష్టస్థానమునందున్న జాతకునికి శతృభయము, మతిపీడ, భార్యా పుత్రవిచారము, ధననాశము, జ్వరభయము, పిత్తదోషము, సోదర మిత్రవిరోధము, అగ్నిభీతి, రక్తదోషము, క్షేత్రనష్టము, వ్రణము, నేత్రబాధ, రాజపీడ, ఆయుధభీతి మొదలగునవి సంభవించును.

కుజమహాదశలో కుజుడు సప్తమస్థానమునందున్న జాతకునికి భార్య మరణము, మూలవ్యాధి, మూత్రరోగము మొదలగునవి సంభవించును. కుజ మహా దశలో కుజుడు అష్టమ స్థానమునందున్న జాతకునికి దుఃఖము, భయము, వ్రణములు, యిష్టములేని భోజనము, స్వంత గ్రామములో వంశ పారంపర్యముగా వచ్చుకుటుంబ కలహము ప్రవాసమునకు పోవలెనను వాంఛ గలిగియుండును. కుజ మహాదశలో కుజుడు నవమస్థానమునందున్న జాతకునికి వుద్యోగనాశము, తపస్సునకు

అడ్డంకులు, గురువునకు కష్టములు, భయము మొదలగునవి సంభవించును. కుజ మహాదశలో కుజుడు దశమ స్థానమునందున్న జాతకునికి పనిలో క్షీణదశ, దుఃఖము, వుద్యోగభంగము, ధారాపుత్ర ధననాశము, అపకీర్తి, విద్య, అగౌరవము సంభవించును. కుజమహాదశలో కుజుడు యేకాదశస్థానమునందున్న జాతకునికి యుద్ధమందు జయము, రాజ్యాభివృద్ధి, సంపద, రాజబహుమతులు, ప్రతిష్ట, మనస్సు, స్వాధీనము, పాండిత్యము గల వాగ్ధాటి పరమానందము గల్గును. కుజమహాదశలో కుజుడు ద్వాదశస్థానము నందున్న జాతకునికి ధననష్టము, రాజభయము వుద్యోగ భంగము, దారాపుత్రనాశము, సోదర ప్రవాసము మొదలగునవి సంభవించును.

కుజ మహాదశలో కుజుడు పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు పాప కార్యములు చేయు వాడును, దేవ, బ్రాహ్మణ, గోగణ, సోదర, వేదాంత శాస్త్రములను అవహేళన చేయువాడుగానుండును. కుజమహాదశలో కుజుడు పాపగ్రహముచే వీక్షించబడుచున్న జాతకుడు సాధారణ జనులకు ద్వేషము గల వాడగుటచే బాధ జెందు చుండును. భార్య, స్నేహితునియెడబాటు, రాజాగ్రహముచే దేశము నుండు వెడల గొట్టబడువాడగును. కుజ మహాదశయందు కుజుడు శుభ గ్రహముచే సంబంధమొందియున్న జాతకుడు కొంతకాలము సౌఖ్యముగా నుండుట, తరువాత అలసట, శరీర అవయవములో యొక శాఖయందు రోగము, ప్రభువుతో తగవులు, యుద్ధములో జయము, విద్యాసంబంధమైన సభలు, విదేశ నివాసము గల వాడగును. కుజదశాకాలములో కుజుడు శుభగ్రహముచే వీక్షించ బడుచున్న జాతకునికి భూనష్టము, ధననాశము సంభవించును. కుజమహాదశయందు కుజుడు పాపపు ద్రేక్కాణము నందున్న జాతకునికి మతిచాంచల్యము, బానిసత్వము, సంకెళ్ళు వేయబడి త్రాళ్ళచే కట్టబడుట, విషభయముగల్గును. కుజుని మహాదశ ప్రారంభములో సాధారణముగా జాతకునికి అనేక విధముల ప్రతిష్ట, ధనము తగ్గు ముఖము పట్టుట, దశామధ్యకాలములో రాజ, అగ్ని, చోరభయము సంభవించుట, తుది దశలో సోదర ధననాశము, భార్య, పుత్రునివలన బాధలు, అగ్నిభయము, ప్లీహ రోగము, మూత్రరోగము సంభవించును. కుజుడు గోచారమునందున్న పై పాప ఫలములు జరుగవు. కుజమహాదశలో కుజుడు గోచారమునందున్న జాతకుడు ఆశీస్సులు, మంచిసౌఖ్యము పొందగలడు.

కుజ మహాదశలో కుజుడు వుచ్చక్షేత్రమునందుండి, నవాంశయందు నీచ క్షేత్రమునందున్న జాతకునికి సోదర మరణము, ప్రభువుయొక్క భయము, అగ్ని భయము, విషభయము గల్గును. అట్లుగాక కుజుడులగ్న చక్రమునందు నీచక్షేత్రము నందుండి, నవాంశ చక్రములో వుచ్చ క్షేత్రమునందున్న జాతకునికి ధనలాభము, భూలాభము, దారాపుత్ర, మిత్ర సౌఖ్యము గలవాడగును. కుజ మహాదశలో కుజుడు వక్రించియున్న జాతకునికి చోర, అగ్ని, సర్పభయము సంభవించును. వుద్యోగములో తక్కువస్థాయికి దిగుట, కొంతకాలము వనవాసము సంభవించును. కుజ మహాదశలో కుజుడు రవితో సంబంధమొందియున్న జాతకునికి భయము, గొప్ప విచారము, భార్యతో శత్రుత్వము, శత్రువుల వలన రాజ్యనష్టము, దేశము నుండి ప్రవాసము గలుగును.

కుజమహాదశలో కుజుడు స్థానబలము గల్గియున్న జాతకునికి హోదా పెరుగుట వలన సౌఖ్యము, ధనము, భార్యా, ప్రతిష్ఠ, గొప్పతనము, ఆరు మాసములలో వుద్యోగ స్థిరత్వము గలుగును. కుజ మహాదశలో కుజునికి స్థాన బలము లేని యెడల జాతకునికి వుద్యోగభంగము, పెట్టుబడులపై వచ్చు వడ్డీల వలన జీవనము గడుపుచుండును. కుజ మహాదశలో కుజుడు దిగ్బలము గల్గి యున్న జాతకుడు ప్రభుత్వముచే యివ్వబడిన ధనముతో సౌఖ్యము, యుద్ధములో ప్రఖ్యాతిపొందుట, గోవులు, భూములు, వస్త్రములు, వాహనములు, గలవాడును, దేశమంతట పేరుప్రతిష్టలుగల వాడగుట సంభవించును. కుజ మహాదశలో కుజుడు కాల బలము గల్గియున్న జాతకుడు గొప్ప సౌఖ్యము, అనుకున్న ప్రతి కార్యము నందు లాభము, పట్టువస్త్రములు, ఆభరణములు, నగిషీ చేయబడిన దుస్తులు, వ్యవసాయ పనిముట్లు, పశువులు, ఏనుగులు, రాజానుగ్రహము వలన అన్ని విధముల అదృష్టము, శరీరదారుఢ్యము, భార్య, బిడ్డలు, స్నేహితులతో సౌఖ్య జీవనము, గలవాడగును. కుజ మహాదశలో కుజుడు పాపషడ్వర్గునందున్న జాతకునికి గొప్పభాధలు, కారాగారవాసము, అన్ని విధముల నాశము సంభవించును. కుజ మహాదశలో కుజుడు శుభషడ్వర్గునందున్న జాతకుడు మంచిపనులు, వివాహములు, యజ్ఞములు, ధర్మకార్యములు చేయుచుండును. కుజ మహాదశలో కుజుడు అంశలో వుచ్ఛక్షేత్రమునందున్న జాతకుడుభూములు, ధనము, భార్య, వాహనము, మంచి భోజనము వలన సౌఖ్యము గలవాడగును. కుజ మహాదశలో కుజుడు నైసర్గిక బలము గల్గి యున్న జాతకునికి అన్ని విధముల అదృష్టము, రాజానుగ్రహము, పుత్రులు, బంధువులు, స్నేహితులవలన సౌఖ్యము, భూములు, పశువులు, వస్త్రములు, ఆభరణములు మొదలగునవి సంభవించును.

**1. కుజ మహాదశలో కుజ భుక్తిఫలము**

కుజ మహాదశలో కుజ భుక్తియందు కుజుడు లగ్నమునకు కేంద్రమున గాని లేక కోణమునగాని 11-2-3 స్థానములు బలము గల్గి అందుకుజుడున్నను, లేక లగ్నాధిపతితో కుజుడు సంబంధమొందియున్నను, జాతకుడు పోయిన రాజ్యము సంపాదించుట,రాజానుగ్రహము వలనను, లక్ష్మీ కటాక్షము వలన పోయిన ధనము సంపాదించు కొనగలుగును. కుజ మహాదశలో కుజభుక్తియందు కుజుడువుచ్ఛ క్షేత్రమునందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక స్వనవాంశయందుండి బలము గలవాడై యున్న జాతకునికి గృహమునందు సంతాన వేడుకలు జరుగుచూ సౌక్యము నిచ్చును. కావలసినంత ధనము, గోవులు, క్షీరములు యుండును. గృహాభివృద్ధి, గోలాభము, గేదెలు, రాజానుగ్రహము వలన అనుకున్న పనులు సక్రమముగా నెరవేరును.

కుజమహాదశలో కుజభుక్తియందు కుజుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో వీక్షించబడుచున్నను, లేక వానిచే సంబంధమొందియున్న జాతకునికి మూత్రరోగము, కుష్టురోగము, గాయములు, చోర, సర్ప, రాజభయము, ధనధాన్య పశునాశము సంభవించును. కుజుడు ద్వితీయాధిపతిగాని, లేక సప్తమాధిపతియైయున్న జాతకునికి సోమరితనము, మనోవ్యధ గలుగుచుండును.

2 కుజమహాదశలో రాహు భుక్తి ఫలము

కుజమహాదశలో రాహు భుక్తియందు రాహువు వృషభరాశియందు వుచ్ఛస్తుడై యున్నను, లేక మూల త్రికోణమైన కర్కాటకమునందున్నను, లేక శుభగ్రహముచే వీక్షించబడినను లేక శుభునితో సంబంధ మొందియున్నను, లేక యేకాదశ స్థానమునందున్నను, లేక త్రికోణమునందున్నను జాతకునికి ప్రభుత్వ కానుకలు, గృహ, భూలాభము, భార్యా బిడ్డల సౌఖ్యము, స్వకృషివలన సంపదవృద్ధి, గంగాస్నానము, పరదేశ ప్రయాణము గల్గును, కుజ మహాదశలో రాహు భుక్తి యందు రాహువు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముచే సంబంధ మొందినను, లేక పాపగ్రహముచే వీక్షించబడినను, జాతకునికి చోర, సర్ప, గాయము వలన భయము, పశునాశము, త్రిప్పురోగము, ప్లీహరోగము, కారాగార వాసము సంభవించును. కుజ మహాదశలో రాహువు ద్వితీయ స్థానము నందున్న జాతకునికి భయము ధననాశము గల్గును. కుజ మహాదశలో దశానాధుడైన కుజుడు ద్వితీయ లేక సప్తమ స్థానమునందున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

3 కుజమహాదశలో గురు భుక్తి ఫలము

కుజ మహాదశలో గురుభక్తియందు, భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు కేంద్రమునందుగాని లేక కోణమునందుగాని లేక యేకాదశ స్థానమునందుగాని లేక ద్వితీయ స్థానమునందుగాని లేక స్వనవాంశయందుగాని లేక వుచ్ఛాంశయందుగాని యున్న జాతకునికి మంచి ప్రతిష్ఠ, రాజ పారితోషికములు, ధనధాన్య లాభము, గృహము నందు వివాహవేడుకలు, భార్యా బిడ్డలతో సౌఖ్యము పొందగల్గును. దశానాధుడైన కుజునకు, భుక్తినాభుడైన గురుడు కేంద్ర లేక కోణము లేక ఏకాదశ స్థానమునందున్నను, లేక గురుడు లగ్నాధిపతితోగాని లేక 4-9-10 స్థానాధిపతులలో నెవరితోనైనా గాని సంబంధమొందియున్నను, లేక గురుడు శుభనవాంశ లేక శుభ షడ్వర్గు నందున్న జాతకుడు తన గృహమును వృద్ధ లేక శుభషడ్వర్గునందున్న జాతకుడు తన గృహమును వృద్ధి లేక పెంపుదలచేయుట, గృహమునందు వివాహములు జేయుట, శరీరారోగ్యము, ప్రతిష్ఠయందు వృద్ధి, గోసంపద వృద్ధి చేయుట, ప్రభుత్వ సంబంధమైన పని ప్రత్యేకముగా చేపట్టుట, పెద్దవారితో సభలు, ఆహ్వానములు, మిత్ర సహాయముతో కార్యము నెరవేర్చుకొనుట, మనశ్శాంతి, దేవాలయము లేక గృహ నిర్మాణము, పశ్చిమదిశ నున్న బంధువులతో కలయక, శిశు జననము, రామాయణము, మహాభారతమువంటి పురాణశ్రవణము, పశువుల వల్ల లాభము, అనుకున్న దానికంటె యెక్కువ విజయము గలుగును.

కుజ మహాదశలో గురుభుక్తియందు గురుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచస్థానమునందున్నను, లేక పాపక్రాంతము చెంది యున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్నను, లేక పాపగ్రహముచే వీక్షించ బడుచున్నను, లేక బలహీనుడై యున్న జాతకునికి చోర అగ్ని రాజ భయము సంభవించుట, పైత్యముతో బాధపడెడు రోగము గల వాడగుట, ఆకస్మాత్తుగా సేవకులతో కలతలు, ప్రభుత్వ న్యాయస్థానముతో విరోధము, భార్య లేక పుత్రుని మరణము లేక చేపట్టిన కార్యమునకు విఘ్నము లేక నష్టము, తండ్రికి

అపాయము. మనోవ్యాధి. యితరుల యింటియందు నివాసము. పాపకార్యము నెరవేరుట. అంత్యక్రియలు నడుపుట. సేవక సోదర నాశము సంభవించును.

కుజ మహాదశలో గురుభుక్తియందు. భుక్తినాథుడైన గురుడు ద్వితీయ లేక సప్తమ స్థానమునకు అధిపతియైయున్నను. లేక మారకగ్రహముతో సంబంధమొంది యున్న. జాతకుడు యింకొకనికి బానిసగా యుండుట. సోదర మరణము. శరీర బలహీనత. మనోవ్యాధి. అధిక ధనవ్యయము. అపమృత్యువు సంభవించును.

**4. కుజ మహాదశలో శని భుక్తిఫలము**

కుజ మహాదశలో శని భుక్తియందు. భుక్తినాథుడైన శని స్వక్షేత్రము నందున్నను. వుచ్చస్థానమునందున్నను. కేంద్ర లేక త్రికోణమునందున్నను. తృతీయ లేక ఏకాదశ స్థానమునందున్నను. లేక లగ్నాధిపతి లేక నవమాధిపతి లేక దశమాధి పతితో సంబంధమొందియున్నను. లేక మిత్రవర్గునందున్నను. లేక శుభగ్రహముతో సంబంధమొందియున్నను. లేక శుభగ్రహముచే వీక్షించబడుచున్నను. లేక శుభాంశ యందున్న జాతకునికి ప్రభుత్వము వలన సౌఖ్యము. పరమానందము. భార్యబిడ్డలు. మనుమ సంతానము. ధాన్యవృద్ధి. గోవులతో తన స్వగ్రామమునందు సుఖ సౌఖ్యములతో యుండుట. పుత్రుని వివాహము జరుపుట. గృహమునందు లక్ష్మి కటాక్షము గలిగియుండుట. వ్యాపారమునందు లాభము. ప్రతిష్ట. ప్రభువులు. గొప్ప వారి పారితోషికములు. ఆరోగ్యము. శత్రునాశము. ఈశాన్య దిశకు పయనించుట వలన యెక్కువ ఆదాయము. రాజానుగ్రహము వలన స్థిరమైన లాభములు. ప్రభుత్వ పారితోషికములు శనివారములయందు సంక్రమించుట. కన్యమాసమునందు పుత్ర జననము గలుగను.

కుజమహాదశలో శనిభుక్తియందు. భుక్తినాథుడైన శని నీచక్షేత్రము నందున్నను లేక శత్రుక్షేత్రమునందున్నను. లేక 6-8-12 స్థానముల యందున్న జాతకునికి విదేశ ప్రభువుల వలన భయము. ధనధాన్యనాశము. సంకెళ్ళతో బానిసత్వము. రోగము. గృహనష్టము సంభవించును. కుజమహాదశలో శని భుక్తి యందు శని ద్వితీయ లేక సప్తమస్థానమునకు అధిపతియైయున్నను. లేక పాప గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి అమితభయము. ధననష్టము. విదేశీ యాత్ర. రాజాగ్రహము. మనోవ్యధ. చోర. అగ్ని. రాజభయము. సోదరమరణము. బంధుద్వేషము. ప్రాణనష్టము ప్రభుత్వ శిక్ష ఆకస్మిక కారాగార భయము గల్గును. దశానాథుడైన కుజుడున్న స్థానము నుండి శని 4-7-10-11 లేక 5-9 స్థానముల యందున్న జాతకుడు స్వదేశమును వదలి పరదేశమునకు. పోవువాడగుట. అపఖ్యాతిపాలగుట. పాపకార్యములకు కట్టుబడి అనేక జీవులను హింసించుట. యున్న ఆస్తిని అమ్ముకొనుట. స్థలనష్టము. ఉద్యోగభంగము. మనోవ్యధ. యుద్ధమునందు అపజయము. మూత్రసంబంధమైన రోగములవలన అధిక భయము సంభవించును.

కుజ మహాదశలో శనిభుక్తియందు దశానాథుడైన కుజునికి 6-8-12 స్థానముల యందున్నను లేక శని పాపగ్రహముచే సంబంధమొందియున్న. జాతకునికి రాజచోర అగ్నిభయము సంభవించుట. ప్రాణభయము. క్షయ. గాయములు మొదలగు రోగములు. మాతాపిత మరణము. ఋణబాధ. కీళ్ళనొప్పులు. తండ్రి

తరవు శత్రువుల వలన భయము సంభవించును. కుజమహాధశలో శని భుక్తియందు శని ద్వితీయ లేక సప్తమ స్థానమునకు అధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

5 కుజ మహాదశలో బుధభుక్తి ఫలము

కుజమహాదశలో బుధభుక్తియందు, భుక్తినాధుడైన బుధుడు 4-7-10-5-9 స్థానముల యందున్న జాతకుడు ధర్మకార్యమును అనగా నీటి చలివేంద్రముల నిర్మాణము దాన ధర్మములు చేయుట, మతసంబంధమైన ప్రసంగములు వినుట, బ్రాహ్మణులకు భోజన సదుపాయములు కల్పించుట, వాహనములు, పశువులు, రాజానుగ్రహము వలన సౌఖ్యము, వ్యవసాయసంబంధమైన కార్యములు నిర్వహించుట, వస్త్రలాభము, ఆభరణములు, యేనుగులు మొదలగునవి గల్గి యుండును. కుజ మహాదశలో బుధ భుక్తియందు బుధుడు నీచస్థానమున పొంది యున్నను లేక పాపక్రాంతము చెందియున్నను లేక 6-8-12 స్థానముల యందున్న జాతకునికి మనో వ్యాధి, దౌర్భాగ్యము, సంకెళ్ళతో కారాగారవాసము, బంధునాశము, భార్యబిడ్డలు, పశువులు, ధననాశము మొదలగు సంకటనలు సంభవించును.

కుజ మహాదశ బుధభుక్తిలో, బుధుడు దశానాధుడైన కుజునితో సంబంధ మొందియున్న జాతకునికి శత్రువృద్ధి, మహాభయము, స్వగ్రామము విడుచుట, అనేక రోగములు, వ్యాజ్యములో అపజయము, మంచి భోజనమునకు కొట్లాట మొదలగునవి సంభవించును. దశానాధుడైన కుజునికి 4-7-10-5-9 స్థానముల యందు బుధుడున్నను లేక బుధుడు ఉచ్ఛక్షేత్రమునందున్న జాతకునికి న్యాయమైన లాభమును, అనేక విధముల ధనలాభము, ప్రభుత్వ పారితోషికములు, అధికారమునకు అవకాశములు, ధనము, వస్త్రములు, ఆభరణములు గలిగియుండుట, సంగీతమువలన ఆనందము, యొక యుద్ధపటాలమునకు నాయకుడుగాయుండుట, జీర్ణగృహమును పునరుద్ధ రించుట, బంధువులు, స్నేహితులతో మిత్రభావముగా యుండుట, జీర్ణగృహమును పునరుద్ధరించుట, బంధువులు. స్నేహితులతో మిత్రభావముగా యుండుట, బిడ్డల యొక్క జన్మదినోత్సవములు జరుపుకొనుట, వాహనములు, రత్నములు, ఆభరణములు గల్గియుండుట, తల్లితరపు బంధుసౌఖ్యమును విచారించుట, సంతోషము, మత సంబంధమైన ప్రసంగములు వినుట, బ్రాహ్మణ పెద్దలతో సంబంధము గల్గి యుండుట, భార్యాబిడ్డలతో సౌఖ్యముగా నుండుట, తన గృహము లక్ష్మీకటాక్షము పొందియుండును.

కుజ మహాదశలో బుధ భుక్తియందు బుధుడు దశానాధుడైన కుజునికి 6-8-12 స్థానములయందున్నను లేక బుధుడు పాపగ్రహసంబంధము పొందియున్న జాతకునికి దౌర్భాగ్యము, అగ్నిచోర రాజభయము, అకస్మికముగా కష్టములు, దారిదోపడి దొంగలభయము, క్రూరస్వభావము, క్రూరమైన మాటలు పల్కు చుండును. కుజ మహాదశ బుధ భుక్తియందు బుధుడు ద్వితీయ, సప్తమ స్థానములకు అధిపతియైయున్న జాతకునికి భయంకరమైన అపాయకరమైన వ్యాధి సంభవించును.

**6 కుజ మహాదశలో కేతుభుక్తి ఫలము**

కుజ మహాదశలో కేతు భుక్తియందు కేతువు లగ్న స్థానమునుండి 3-4-5-7-9-10-11 స్థానముల యందున్నను, లేక శుభగ్రహముచేత వీక్షించబడు చున్నను, లేక వానిచే సంబంధమొందియున్న జాతకునికి రాజానుగ్రహమువలన మనశ్శాంతి, గొప్ప సౌఖ్యము, ధనవృద్ధి, భూములు, బిడ్డలవలన లాభముగల్గును. ప్రారంభదశలో కేతుభుక్తియందు లాభము తక్కువగా కనిపించును. ప్రభు దర్శనము వలన జాతకుడు తన కోర్కెలను నెరవేర్చుకొనుట సంభవించును. కేతువు బలవంతుడై యోగకారక గ్రహములతో సంబంధమొందియున్న జాతకునికి శిశు జననము, ప్రతిష్ట, సౌఖ్యవృద్ధి, లక్ష్మీకటాక్షము వలన సేవకులద్వారా ఆదాయము పెంపొందుట, పటాలమునకు నాయకుడగుట, గొప్పసౌఖ్యము, ప్రపంచాధినేతతో స్నేహము, వాహనములు వస్త్రములు, ఆభరణములు, గలవాడుగానుండును.

కుజ మహాదశలో కేతు భుక్తియందు కేతువు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్నను, జాతకునికి బాధలు, దంత రోగము, పులులు, చోరులభయము, జ్వరము, కుష్టురోగము, భార్యాబిడ్డలకు బాధ మొదలగునవి సంభవించును. భుక్తినాధుడైన కేతువు ద్వితీయ లేక సప్తమ స్థానమునందున్న శరీరరోగము, పారితోషికములు, ప్రజల ఆందోళనలవలన విచారము, ధనధాన్యము క్షీణించుట మొదలగునవి సంభవించును.

**7. కుజ మహాదశలో శుక్ర,భుక్తి ఫలము**

కుజ మహాదశలో శుక్రభుక్తియందు, భుక్తినాధుడైన శుక్రుడులగ్నమునకు 4-5-7-9-10-11 స్థానముల యందున్నను, లేక వుచ్చ యందున్నను లేక స్వక్షేత్రము నందున్నను, లేక శుభస్థానాధిపతితో కలసియున్న జాతకునికి రాజ్యప్రాప్తి గొప్పసౌఖ్యము, యేనుగులు, అశ్వములు, నగిషీచేయబడిన వస్త్రములు గలవాడగును. శుక్రునికి లగ్నాధిపతితో సంబంధము గల్గియున్న జాతకునికి భార్యాబిడ్డల అభివృద్ధి, దీర్ఘాయువు, ధనవృద్ధి, అదృష్టము, తరువాత సౌఖ్యము గల్గును. దశానాధుడైన కుజునకు, భుక్తి నాధుడైన శుక్రుడు 2-4-6-7-9-10-11 స్థానములయందున్న జాతకుడు వ్యవసాయ అభివృద్ధియున్న యింకొక గ్రామమునకు వెళ్ళుట, యెక్కువ వ్యాపారము మరియు వృత్తి, అధికారము జయప్రదముగా నిర్వహించుట, ధన లాభము, పుత్రలాభము, గొప్పసౌఖ్యము, తన అధికారిద్వారా అభివృద్ధిచెందుట, తెల్లని వస్త్రలాభము, ప్రభువులవలన భూములు, గ్రామము సంపాదించుట, భుక్తిదశ తుదియందు తన కోర్కెలు సఫలమగుట. నాట్యసంగీతసౌఖ్యము, పుణ్యక్షేత్రముల యందు పవిత్ర స్నానములుగల్గును. శుక్రుడు కర్మాధిపతితో సంబంధమొందియున్న జాతకుడు ధర్మకార్యములు చేయుట, వుదారము, చెరువులు త్రవ్వించుట, జనసమూహము చేరు బహిరంగ వనములు, పుత్రజననము గల్గును.

భుక్తినాధుడైన శుక్రుడు 6-8-12 స్థానముల యందున్నను, పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి అతి దుఃఖము, శరీరబాధ, ఆదాయము తగ్గుట, చోరులు, రాజులవలన భయము, గృహమునందు నంకటనలు, భార్యాబిడ్డలకు రోగము, గోవులు, గేదెల నాశము గల్గును. భుక్తినాధుడైన శుక్రుడు ద్వితీయ సప్తమ స్థానములకు అధిపతియైయున్న జాతకునికి శరీరరోగము సంభవించును.

8 కుజ మహాదశలో రవి భుక్తిఫలము

కుజమహాదశలో రవిభుక్తియందు రవి వుచ్చస్థానమునను లేక స్వ క్షేత్రమునను, కేంద్రము లేక కోణమునను లేక యేకాదశ స్థానమునందునను లేక నవమ లేక దశమ స్థానాధిపతితో సంబంధమొందియున్న జాతకుడు ప్రతిష్ట, పరమానందము గల్గి సౌఖ్యముగా యుండును. వాహనసౌఖ్యము, సంపద, బిడ్డలు, ధాన్యాభివృద్ధి, స్వగృహములో వివాహవేడుకలు, మంచి ఆరోగ్యము, బలము, రాజ గౌరవము, వ్యవసాయాభివృద్ధి, గొప్ప సౌఖ్యము, విదేశ రాజులను దర్శించుట మొదలగు శుభఫలములు గల్గును.

కుజ మహాదశలో రవి భుక్తియందు రవి, దశానాధుడైన కుజునికి 6-8-12 స్థానములయందున్నను లేక పాపగ్రహముచే సంబంధమొందియున్న జాతకుడు శరీరబాధ, అనారోగ్యము, మనోవ్యధ కార్యవిఘ్నము, అమితభయము, జ్వరము, తలనొప్పి బాధలు గల్గును. భుక్తినాధుడైన రవి, ద్వితీయ లేక సప్తమస్థానాధి పతియైయున్న జాతకునికి సర్ప, జ్వర, బిడ్డల అనారోగ్యమువలన భయము గల్గును.

9 కుజ మహాదశలో చంద్రభుక్తిఫలము

కుజమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు ఉచ్చయందుగాని లేక స్వస్థానమునందుగాని, లేక కేంద్రమునందుగాని లేక 9-4-10-1 వ స్థానమునందుగాని యున్న జాతకుడు గొప్పరాజ్యము సంపాదించు కొనువాడును, చెరువులు, దేవాలయములు నిర్మించుటయును, పవిత్రమైన కార్యములు చేయువాడును, పుష్ప దండలు, వస్త్రములు, సుగంధద్రవ్యములు గలవాడును, వివాహవేడుకలు జరుపుకొను వాడును, భార్య, బిడ్డలు, తల్లిదండ్రులతో సౌఖ్యముగా నుండు వాడును అగును. లక్ష్మీ కటాక్షము వలన తమ కోర్కెల నన్నిటిని రాజానుగ్రహముచే సఫలము జేసు కొనగల్గును.

కుజమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు పూర్ణుడైయున్న జాతకునికి అధిక సౌఖ్యము గలుగును. క్షీణచంద్రుడై యున్న ఆశీర్వచనములు గూడ తగ్గు ముఖములో యుండును. చంద్రుడు నీచస్థానము నందున్నను లేక చంద్రుడు 6-8-12 స్థానముల యందున్నను లేక దశానాధుడైన కుజుని వద్దనుండి చంద్రుడు షష్ట, అష్టమ స్థానముల యందున్నను జాతకునికి కష్టములు, రాజుల వల్ల నాశము పశువులు, ధాన్యము నష్టమగుట, మరణము, చోరభయము, యెల్లప్పుడు కష్టములు సంభవించు చుండును. చంద్రుడు ద్వితీయస్థానమునందుగాని లేక సప్తమస్థానము

నందుగాని యున్న జాతకునికి అపమృత్యువు, శరీరబాధ, మనోరోగము మొదలగునవి సంభవించును.

## 4. రాహు మహాదశ ఫలము

రాహువునకు వుచ్ఛస్థానము వృషభ రాశియును, నీచస్థానము వృశ్చిక రాశియై యున్నది. రాహు మహాదశలో రాహువు వుచ్ఛస్థానమైన వృషభరాశి యందున్న జాతకునికి సుఖసౌఖ్యము, రాజ్యము, స్నేహితులు, ధనధాన్యవృద్ధి గలుగును. రాహువు వుచ్ఛరాశి యందున్న గ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి రాజ్య లాభము; భార్యాబిడ్డలు, సంపద, వస్త్రములు, ఆభరణములు, సుగంధ వస్తులాభము గల్గును. రాహుమహాదశలో రాహువు నీచ క్షేత్రమునందున్నను జాతకునికి శిరచ్ఛేదము గాని లేక ఆత్మహత్య గాని సంభవించ వచ్చును. అగ్ని, చోర, విష, రాజ భయము సంభవించును. రాహువు, నీచక్షేత్రమందున్న గ్రహము తో సంబంధ మొంది యున్న జాతకుడు జీవనోపాధి కొరకు తుచ్ఛమైన పనులు చేయుట, చెడుపదార్థ భోజనము, దుష్ట కళత్రము, క్రూర పుత్రుడు గలవాడగును.

రాహుదశలో రాహువు లగ్నమునందున్న జాతకునికి విష, అగ్ని, ఆయుధ, భయము వలన మనో చాంచల్యము, బంధునాశము, దుఃఖబాధ, అపజయము సంభవించును. రాహు మహాదశలో రాహువు ద్వితీయ స్థానమునందున్న జాతకునికి రాజ్య లేక ఉద్యోగ నష్టము, చెడు పదార్థ భోజనము, ప్రభుత్వ సేవలో పనికిమాలిన పని, మనోవ్యధ, అబద్ధము, యెక్కువ కోపము సంభవించును, రాహుమహాదశలో రాహువు తృతీయ స్థానమునందున్న జాతకునికి కళత్ర, సంతాన, బంధు, సంపద సౌఖ్యము, వ్యవసాయ భూములపై అధికారము, విదేశ ప్రయాణము, రాజభక్తి గల వాడగును. రాహు మహాదశలో రాహువు చతుర్థస్థానమునందున్న జాతకుని తల్లిగాని లేక అమ్మ అమ్మగాని మరణించుట, భూములు, సంపదనాశము, రాజాగ్రహము, భార్యతో అపార్థములు, అతి దుఃఖము గలుగును. జాతకుడు చోర, అగ్ని బంధువుల వలన బాధలు పొందుట, మనోవ్యధ, బార్యాబిడ్డల అనారోగ్యము, భార్యా, బిడ్డలు, కుటుంబమును పోగొట్టుకొనుట గూడ సంభవించ వచ్చును. రాహు మహాదశలో రాహువు పంచమ స్థానము నందున్న జాతకునికి, మనోబాధ, అకాల భోజనము, విద్యా విషయకమైన తర్కము, బాధలు, దుఃఖము, రాజాగ్రహము, పుత్ర నాశము సంభవించును. రాహుమహాదశలో రాహువు షష్ట స్థానమునందున్న జాతకునికి చోర, అగ్ని, రాజ భయము, దగ్గర స్నేహితుల మరణము, మూత్ర రోగము వంటి రోగములచే బాధ, ప్లీహరోగము, క్షయ, పైత్య చర్మ రోగములచే బాధ, చివరకు మరణము సంభవించును.

రాహు మహాదశలో రాహువు సప్తమ స్థానమునందున్న జాతకునికి ఆకస్మికముగా కళత్ర మరణము, దేశము వదలిపోవుట, వ్యవసాయ దిగుబడిలో తగ్గుముఖము, సర్పభయము, సంపద, సేవకులు, పుత్రనాశము గల్గును. రాహు మహాదశలో రాహువు అష్టమస్థానమునందున్న జాతకునికి పుత్రనాశము, ధన నాశము, చోర, అగ్ని, రాజ భయము, పశువులు, బంధువుల భయము, వన సంచారము

సంభవించును. రాహు మహాదశలో రాహువు నవమస్థానము నందున్న జాతకునికి తండ్రి మరణము వలన బాధ. తల్లి. గురువు. బంధువులు. సంపద మొదలగువానికి నాశము. దేశ పరిత్యాగము. సముద్ర స్థానము మొదలగునవి సంభవించును.

రాహుమహాదశలో రాహువు దశమ స్థానమునందున్న జాతకుడు మత సంబంధమైన పురాణ ధర్మ శాస్త్రములు చదువుట యందాసక్తి, గంగాస్నానము జేసి శరీరము పవిత్ర పరచుకొనుట మొదలగునవి గల్గును. ఈ శుభఫలము లన్నియు, రాహువు శుభక్షేత్రము నందున్నపుడే జరుగును. పాపక్షేత్రమైయున్న పై ఫలములకు వ్యతిరేకముగా యుండును. రాహువున్న స్థానాధిపతి పాపియై, దశా నాధుడైన రాహువు పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు యితరులచే దూషించ బడువాడును, అగ్ని. భార్య. కుమారునిచే బాధ గలిగించ బడు వాడుగా నుండును. రాహు మహాదశలో రాహువు ఏకాదశ స్థానమునందున్న జాతకుడు పెద్దవారి వలన గౌరవమును. మర్యాద పొందువాడును. ధనమును కూడబెట్టుట. కళత్ర లాభము. సొంత గృహము గలవాడగును. రాహు మహాదశలో రాహువు ద్వాదశ స్థానము నందున్న జాతకునికి ద్వీపాంతరవాసము. మనోవ్యాకులత. భార్యాబిడ్డల నుండి వేరై యుండుట. వ్యవసాయము. పశువులు. ధనధాన్య నాశము గల్గును.

రాహు మహాదశలో రాహువును పాపగ్రహము వీక్షించుచున్న జాతకుడు చేపట్టిన కార్యమెల్ల నాశమును పొందుట. వుద్యోగ భంగము. శరీరమునకు అనారోగ్యము. చోర. అగ్ని. రాజభయము గల్గును. రాహు మహాదశలో రాహువును శుభగ్రహము వీక్షించుచున్న జాతకునకు చేపట్టిన కార్యమెల్ల జయమునుపొందుట. రాజగౌరవము. ధనవృద్ధి. బంధునాశము గల్గును . రాహుమహాదశలో రాహువు పాప క్షేత్రమునందున్న జాతకునికి శరీర బాధ. కులభ్రష్టత్వము. రాజ భయము. లోగడ మోసపుచ్చిన శత్రువుల వలన భయము. మూత్రరోగము. క్షయ సంబంధమైన వ్యాధిచే బాధపడుచుండును.

రాహువు యొక్క వుచ్చక్షేత్రము వృషభమును. కేతువు యొక్క వుచ్చ క్షేత్రము వృశ్చికము అగుచున్నవి. రాహువు యొక్క మూలత్రికోణము కుంభమును. మిత్రక్షేత్రము మేషరాశియై యున్నవి. రాహువు 6-8-12 స్థానములయందున్న రాహుదశా కాలమునందు జాతకునికి కష్టములు ప్రాప్తించును రాహు మహాదశలో జాతకునికి రాహువు 6-8-12 స్థానముల యందున్నపుడు అగ్ని. చోర,రాజ భయము. పరదేశగమునము. దుఃఖము. అడవిలో గ్రహభయము సంభవించును. రాహుదశా ప్రారంభములో దౌర్భాగ్యము. మధ్యకాలములో ప్రతిష్ట. సౌఖ్యము. తుదియందు వుద్యోగ భంగము. తల్లి. తండ్రి. గురువు. పుత్రుని యొక్క నాశము సంభవించును. రాహు మహాదశయందు రాహువు మేషము. వృషభము లేక కర్కాటకము నందున్న జాతకునికి ధనవృద్ధి. విద్యాభివృద్ధి. రాజ పారితోషకములు. భార్యాబిడ్డలు. సేవకులతో సౌఖ్యము గల్గును. రాహుమహాదశలో రాహువు కన్య ధనుస్సు లేక మీనమునందున్న పుత్ర. కళత్ర లాభము. రాజ్యాధికారము. వాహన ప్రాప్తి మొదలగునవి గల్గును. కాని రాహువు దశాంతరమునందు యీ శుభములన్నియు నశించును.

రాహు మహాదశలో రాహువు మేషరాశియందున్న జాతకునికి ధనము, సౌఖ్యము, స్త్రీ, కొద్ది జ్ఞానము, సంపద, మోసముగలవాడై యుండును. రాహు మహాదశలో రాహువు వృషభరాశి యందున్న జాతకునికి పాండిత్యము నందు వివాదము, క్రూరమైన వాక్కు, ధనధాన్య సంపద, పరులకు నిజాయితీ గలవాడుగా యుండును. రాహు మహాదశలో రాహువు మిధునరాశి యందున్న జాతకునికి స్త్రీ స్నేహము వలన లాభము పొందుట, మరణము ప్రాప్తించుట గల్గును. రాహు మహాదశలో రాహువు కర్కాటక రాశియందున్న జాతకుడు ప్రారంభదశలో స్వల్పముగా అదృష్టవంతుడగును. తరువాత దశలో గొప్పవాడును, కొన్ని గ్రామములు గలవాడును, దేశనాయకుడును అగును. రాహు మహాదశలో రాహువు సింహరాశియందున్న జాతకునికి సౌఖ్యము, ధనధాన్య సమృద్ధి, బానిసత్వము, మనోవ్యధ, పుత్ర మరణము సంభవించును. రాహు మహాదశలో రాహువు కన్యారాశి యందున్న జాతకునికి విచారము, మిత్రుని మరణము, భయము, రోగము, శత్రు బాధ, ధననష్టము గల్గును, ప్రధమదశలో జాతకుడు దౌర్భాగ్యము అనుభవించును. మధ్యదశయందు మధ్యముగను, అంత్యదశయందు సౌఖ్యము, సంపదగలవాడగును.

రాహు మహాదశలో రాహువు తులారాశియందున్న జాతకునికి మూత్ర రోగము వలన బాధ, మనోవ్యధ, కొద్దకొద్ది వ్యవధిలో వచ్చుసంపద, ధాన్యము, భార్య అనారోగ్యము సంభవించును. రాహు మహాదశలో రాహువు వృశ్చికరాశి యందున్న జాతకునికి ప్రవాసము, మనోవ్యాధి, తండ్రిమరణము, తన మరణము సంభవించును. రాహుమహాదశలో రాహువు ధనుస్సు రాశియందున్న జాతకునికి తండ్రికి అపాయము లేక మరణము, సోదరులకు సంకటనలు, కొద్ది ఆదాయము మాత్రమే యుండును. రాహు మహాదశలో రాహువు మకరరాశియందున్న జాతకునికి తను చేసిన పనులకు గుర్తింపు, పవిత్రమైన ప్రదేశములకు యాత్ర, సౌఖ్యము గల్గును. రాహు మహాదశలో రాహువు కుంభ రాశియందున్న జాతకునికి ధనధాన్య లాభము గల్గును. రాహువు శుక్రునితో సంబంధమొందియున్నను లేక వానితో వీక్షించబడుచున్న జాతకునికి యెక్కువ ధనధాన్య లాభము గల్గును. రాహు మహాదశలో రాహువు మీనరాశి యందున్న జాతకునికి అన్నివిధముల సంపద చేకూరును. అయితే రాహువు దశాంతరములో జాతకుని ఆస్తి అంతయు నశించి దౌర్భాగ్యవంతుని జేయును.

**1. రాహు మహాదశలో రాహు భుక్తిఫలము**

రాహువు మహాదశలో రాహు భుక్తియందు రాహువు కర్కాటకము, వృశ్చికము, కన్య లేక ధనుస్సు రాశియందున్న జాతకుడు రాజ పారితోషికములు, వస్త్రా భరణములు, వాహనములతో సౌఖ్యము పొందును. తన స్వశక్తిచే యెక్కువ పశువులు, గుఱ్ఱములు మొదలగు వానిని సంపాదించును. పశ్చిమ నైరుతి దిశలయందు పయనించి తన కార్యములను నెరవేర్చుకొనును. ఉపచయరాశులైన 3-6-10-11 యందెందైనా రాహువున్ననూ, లేక రాహువు శుభగ్రహములతో సంబంధ మొందిగాని లేక వానిచే వీక్షించబడియున్నను, లేక మిత్రగ్రహములతో సంబంధ మొందిగాని లేక వానిచే వీక్షించబడియున్నను, లేక మిత్రగ్రహ నవాంశ యందున్నను, లేక తన స్వవుచ్చ నవాంశయందున్నను లేక స్వరాశ్యాధిపతియైన

యేకాదశాధిపతి నవాంశయందున్నను. లేక రాహువు యోగకారక గ్రహములతో సంబంధమొంది యున్న జాతకునికి రాజ్యలాభము. అధిక సంతోషము. ప్రభువులచే ప్రేమించబడుట. వివాహవేడుకలు. అధికార వృద్ధి. మిత్ర ప్రేమ. రాజ పారి తోషికములు. వ్యాపార లాభము. అన్ని విధముల జయము. ధైర్యము. వ్యాజ్యములలో జయము. వెఱ్ఱి సాహసము గలవాడుగా యుండును.

రాహు మహాదశలో రాహు భుక్తియందు రాహువు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముచే వీక్షించబడుచున్నను. లేక వానిచే సంబంధ మొంది యున్నను. లేక నీచ నవాంశయందున్నను. లేక నీచ క్షేత్రమునందున్నను. లేక పాపగ్రహక్షేత్రము నందున్న జాతకునికి ఋణ బాధ. చోరభయము. వుద్యోగ భంగము. స్థానచ్యుతి. మనోవ్యధ. ప్రభుత్వముతో శత్రుత్వము. బానిసత్వము. అపకీర్తి. భార్యతో కలహము లేక కళత్ర మరణము. బంధుద్వేషము. స్నేహితులతో శత్రుత్వము. పైత్యము. లేక జలుబుచే అనారోగ్యము. వ్యాపారములో వస్తువుల నాశము. పరదేశ గమనము. బిడ్డల అనారోగ్యము. సోదరద్వేషము. అధికవ్యయము. ఆత్మ విచారము గల్గును. రాహు మహాదశలో రాహుభుక్తియందు రాహువు ద్వితీయ లేక సప్తమ స్థానమునందున్న జాతకునికి మరణము సంభవించవచ్చును. రాహువు కేంద్రమునందుగాని లేక కోణమునందుగాని యున్న జాతకుని తల్లి. పుత్రుడు చనిపోవుటయే గాక తండ్రి తరపు బంధునాశము. భేదాభిప్రాయములు. కలతలు. కృత్రిమ వస్తు వ్యాపారము. పనిలో బద్దకము గలుగును.

**2. రాహుమహాదశలో గురు భుక్తి ఫలము -**

రాహు మహాదశలో గురు భక్తియందు భుక్తినాధుడైన గురుడు లగ్నము నకు కేంద్రము లేక కోణమునందున్నను. లేక వుచ్చయందున్నను. లేక స్వక్షేత్రము నందున్నను. లేక తన వుచ్చనవాంశ లేక తన స్వనవాంశ యందున్న జాతకునికి నూతన అధికారము. ఆత్మ విశ్వాసము. శత్రునాశము. వాహనములు. సంపద యొక్క అంతఃప్రవాహము. పుత్ర జననము. గృహమునందు వివాహ వేడుకలు. వృద్ధి చంద్రుని వలె సౌఖ్యవృద్ధి. గోవులు సంపదవృద్ధి. పశ్చిమ నైరుతి దిశలకు ప్రయాణము. రాజ లేక బంధు సమాగమము. చేపట్టిన కార్యము నెరవేరుట. పుణ్య క్షేత్రముల యందు నివాసము. భార్యాబిడ్డల సౌఖ్యము. బ్రాహ్మణులకు వసతులు కల్పించి వారికి భోజన సదుపాయములు చేయుట. గ్రామములు. వాహన లాభము. బ్రాహ్మణ పెద్దలకు. దేవుళ్ళను పూజించుట మొదలగునవి గలుగును.

రాహు మహాదశలో గురు భుక్తియందు గురుడు నీచ క్షేత్రమునందున్నను లేక పాపక్రాంతము చెందియున్నను లేక లగ్నము నుండి 6-8-12 స్థానముల యందున్న ను. లేక పాపక్షేత్రమునందున్నను. లేక పాపగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి సంపద నష్టము. పనులయందు అడ్డంకులు. అవమానము. స్త్రీ జాతకము నందు ఈ సంకటన సంభవించిన స్త్రీ తన భర్తను గోల్పోవును. భార్య బిడ్డల బాధలు. గుండె లేక మెదడునందు రోగము. రాజ కార్యములు నెరవేర్చుట. పెద్ద సోదరునితో యెడబాటు లేక మరణము. తల్లి దండ్రులకు బాధ సంభవించును.

బలవంతుడైన రాహుమహాదశలో గురుభక్తియందు. దశానాధుడైన రాహువునకు గురుడు కేంద్రము లేక కోణమునందున్నను. లేక ఏకాదశ లేక ద్వితీయ లేక

తృతీయ స్థానమునందున్న జాతకునికి గృహాభివృద్ధి, గోవస్త్ర లాభము, సుఖమైన భోజనము, ధర్మకార్యములు, జపపూజాదులు సంభవించును. గురుభుక్తి అంత్య దశలో జాతకునికి శరీరబాధ, రాజాగ్రహము వలన రెండు నెలల కారాగారము, పెద్దసోదరుని మరణము, తల్లిదండ్రులకు అనారోగ్యము, బాధ సంభవించును. దశానాధుడైన రాహువునకు గురుడు 6-8-12 స్థానముల యందున్నను లేక పాప గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి శరీర బాధ, ధననష్టము గలుగును. ద్వితీయ లేక సప్తమ స్థానమునకు గురుడు అధిపతియై యున్న జాతకునికి అవమృత్యువు సంభవించును.

**3. రాహు మహాదశలో శని భుక్తి ఫలము**

రాహు మహాదశలో శని భుక్తియందు, భుక్తినాధుడైన శని లగ్నమునకు కేంద్రమునందున్నను, లేక కోణమునందున్నను, లేక తన వుచ్చక్షేత్రమైన తులారాశి యందున్నను, లేక తన మూలత్రికోణమైన కుంభరాశియందున్నను, లేక తృతీయ లేక యేకాదశ స్థానమునందైనను, లేక శుభనవాంశ లేక శుభవర్గునందైనను లేక దశానాధుడైన రాహువునకు కేంద్రమందున్న జాతకునికి వాహనములు, లేక సేవజేయుట వలన రాజగౌరవము, సౌఖ్యము, వివాహవేడుకలు, వ్యాపారవృద్ధి వలన లాభము, వుద్యోగము కొరకు ప్రయత్నము, చెరువులు, త్రవ్వించుట, గౌరవనీయుడైన తక్కువ జాతి వాని వలన కోరిన లాభము పొందుట, యొక పెద్ద మనుష్యుని వలన ధననష్టము, శరీరమునకు అలసట, దానివలన లాభము, గృహమునకు తిరిగి వచ్చుట సంభవించును.

రాహు మహాదశలో శని భుక్తియందు శని నీచ క్షేత్రమునందున్నను, లేక శత్రుక్షేత్రమునందున్నను, లేక అష్టమ లేక ద్వాదశ స్థానములయందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి రాజభయము, భార్య, బిడ్డల అనారోగ్యము, మిత్రునితో అపార్థములు, తండ్రి తరపు బంధువులతో కలతలు, యొకరు చనిపోయిన సమాచారము వినుట, ధాన్యనాశము, అగౌరవము, తల్లి దండ్రుల మరణము, అధికవ్యయము, రాజాగ్రహము, వుద్యోగభంగము, అగ్నిలో నడుచుట, వాతము జలుబు వలన అనారోగ్యము, ఆకస్మిక తగవులు సంభవించును.

దశానాధుడైన రాహువునకు భుక్తినాధుడైన శని 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి వుద్యోగము, అవమానము, వివాహవేడుకయందు శత్రువునివలన బాధ, విదేశనివాసము, ప్లీహ రోగము, చెడుపదార్థభోజనము, కులభేదము వలన భయము, శని ద్వితీయ, సప్తమ స్థానాధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**4. రాహుమహాదశలో బుధ భుక్తి ఫలము -**

రాహు మహాదశలో భుక్తినాధుడైన బుధుడు లగ్నమునకు కేంద్రములేక కోణము నందున్నను, లేక వుచ్చయందున్నను లేక స్వక్షేత్రమునందున్నను, లేక లగ్నాధి పతియైన శుభునితో కలసియున్నను లేక శుభనవాంశయందున్నను లేక శుభ షడ్వర్గునందున్న జాతకుడు రాజయోగ సంబంధమైన ఫలములను పొందుచూ వివాహ వేడుకలు జరుపుట, వ్యాపారములో ధనార్జన, జ్ఞానము, వాహన సౌఖ్యము

పశువులు, పండుగ వేడుకలయందు ఆశక్తి, బుధవారములయందుగొప్ప సౌఖ్యము
పశువులు, పండుగ వేడుకలయందు ఆశక్తి, బుధవారములయందు గొప్ప సౌఖ్యము
ప్రభు సన్మానము, సుగంధ సౌఖ్యము, కామసుఖము, శోభ, సంపద, రాజానుగ్రహము వలన ప్రతిష్ఠ సంభవించును దశానాధుడైన రాహువునకు బుధుడు కేంద్రము నందున్నను, లేక యేకాదశ, లేక తృతీయ లేక నవమ, లేక దశమస్థానము నందున్న జాతకునకు మంచి ఆరోగ్యము, మనోవికాసము, సంతోషము, కోరిన వస్తువులు సంపాదించుట, పవిత్రమైన మనస్సు, మతసంబంధమైన ప్రసంగములు వినుట, వివాహములు వేడుకలు జరుపుట, మతము, ధర్మము, భక్తి, వుదారము, ఆకర్షణీయమైన నూతన గృహనిర్మాణము, బంధువులకు సహాయము చేయువాడుగా యుండును.

రాహు మహాదశలో బుధ భుక్తియందు, బుధుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచ క్షేత్రమునందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్నను, లేక పాపగ్రహముచే వీక్షించబడుచున్నను, లేక పాపనవాంశయందున్న జాతకునికి వుద్యోగభంగము, అధికారనష్టము, అపార్థములు, శరీరబాధ, గొప్ప ద్వేషము, గృహనాశము, బంధువిరోధము, భార్యాబిడ్డల అసౌఖ్యము, వుబ్బసరోగము లేక ప్లీహరోగము, దేవతలను, బ్రాహ్మణులను దూషించుట, అదృష్టము, సౌఖ్యహీనము, అబద్ధములు, క్రూరమైన తెలివితేటలు, అగ్ని వలన నష్టము, చోర, రాజ భయము, ఆకస్మిక బాధలు, గురువు, పుత్రునియొక్క మరణము, అధిక వ్యయము, రాజాగ్రహము గల్గును, బుధ భుక్తియందు బుధుడు ద్వితీయ, సప్తమాధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**5. రాహుమహాదశలో కేతు భుక్తి ఫలము -**

రాహు మహాదశలో కేతు భక్తియందు భుక్తినాధుడైనకేతువు కేంద్రమునందు గాని లేక కోణమునందుగాని లేక భావాధిపతితో సంబంధమొందియున్న జాతకునికి బంధుసన్మానము, వాహనసౌఖ్యము, భూలాభము, సుగంధ పరిమళ ద్రవ్యప్రాప్తి, పశువృద్ధి, వ్యవసాయము, భూములవల్ల ధనలాభము, విద్యావృద్ధి, బంధుస్నేహము గృహమునందు వివాహవేడుకలు, వ్యాపారలాభము, యొక స్నేహితునివలన అభివృద్ధి, సౌఖ్యము పొందగలుగును.

రాహు మహాదశలో కేతు భుక్తియందు కేతువు అష్టమాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి మనోవ్యధ, శరీర బద్ధకము, పనులయందు అడ్డంకులు, కారాగార భయము, విషజీవులబాధ, మొదలగునవి గల్గును. భుక్తి కాలమునందు కేతువు ద్వితీయ, లేక సప్తమస్థానమునందున్న జాతకునికి శరీరబాధ సంభవించును. రాహు మహాదశలో కేతువు భుక్తియందు కేతువు వ్యయాధి పాప క్షేత్రముల యందున్నను, పాపభావము యొక్క అధిపతితో సంబంధమొందినను, లేక వ్యయ స్థానము నందుండి పాపగ్రహములతో కలసియున్నను లేక వానిచే వీక్షించ బడినను జాతకునికి సంతాన విచారము, మిత్రనష్టము, కళత్రపీడ, గొప్ప ఆపత్తు, రాజులవల్ల చోరులవల్ల ధననాశము, బంధనష్టము, వ్యాధి, శిరోరోగము, నేత్రరోగము, మూల వ్యాధి, వుద్యోగ భంగము, స్థానచలనము, ఆకస్మిక విరోధము, తలవంపులు, జంతు నాశము, చోర, అగ్ని, శస్త్ర బాధ మొదలగునవి సంభవించును.

రాహు మహాదశలో కేతుభుక్తియందు కేతువు లగ్నాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి సౌఖ్యముగా యుండవలెనని కోరిక సఫలమై ధనాభివృద్ధి సంభవించును.

**6. రాహుమహాదశలో శుక్ర భుక్తి ఫలము -**

రాహు మహాదశలో శుక్ర భుక్తియందు. భుక్తినాధుడైన శుక్రుడు లగ్నమునకు కేంద్రమునగాని లేక కోణమునగాని లేక యేకాదశ స్థానమునందుగాని బలవంతుడై యున్న జాతకునికి బ్రాహ్మణుని ద్వారా ధనలాభము, గోవులు, గేదెలు ప్రాప్తించుట, పుత్రుని జనన వేడుకలు జరుపుట, గృహమందు వివాహ వేడుకలు, రాజ పారితోషికములు, రాజ్యలాభము, అతిసౌఖ్యము గలుగును. భుక్తినాధుడైన శుక్రుడు వుచ్ఛ యందున్నను, లేక స్వక్షేత్రము నందున్నను, లేక వుచ్ఛ నవాంశ యందున్నను, లేక స్వనవాంశ యందున్నను లేక శుభగ్రహముచే సంబంధ మొందియున్నను లేక వానిచే వీక్షించబడుచున్న జాతకునికి వాహన సౌఖ్యము, రాజ పారితోషికములు, రాజ్యలాభము, సంపద, నూతన గృహ నిర్మాణము, గృహము నందు నిత్యము విందులు, సుఖసంతోషములు, భార్యాబిడ్డల సౌఖ్యము, ధర్మ కార్యములు, మిత్రులతో సహభోజనము, రాజానుగ్రహము వలన వస్త్రములు, వాహనములు, ఆభరణమును గలిగియుండుట, స్వశక్తి వలన వ్యవసాయాభివృద్ధి, వివాహములు, వుపనయనములు, యితర స్త్రీలతో సహవాసము, దేవతలకు సంబంధించిన ప్రసంగములు వినుట మొదలగునవి గలుగును.

రాహు మహాదశలో శుక్రభుక్తియందు, శుక్రుడు, షష్ట, అష్టమ, ద్వాదశ స్థానముల యందెందైననూ లేక నీచస్థానమునందైననూ, లేక శత్రుస్థానమునందైనను, లేక శని లేక కుజుడు లేక రాహువుతో సంబంధ మొందియున్న జాతకుడు భయంకరమైన వ్యాధిచే బాధపడుట, ఆకస్మిక సంకటనలు, తల్లిదండ్రుల యొక్క యెడబాటు లేక మరణము, బంధునాశము, సామాన్య జనులయొక్క ఆటంకములు, తండ్రి తరపు బంధువర్గము యొక్క పోరాటము, తాను తనయొక్క యజమాని మరణము సంభవించును. భార్యాబిడ్డలకు రోగము, ఋణ బాధ, వాతనొప్పులు, అనేక విధములైన ఖర్చులు, సంకెళ్ళతో కారాగారవాసము, వుద్యోగ భంగము, పరదేశ నివాసము, మనోవ్యధ మొదలగు దుష్ఫలములు సంభవించును.

దశానాధుడైన రాహువునకు కేంద్రమునగాని లేక కోణమునగాని లేక ద్వితీయ స్థానమునందుగాని లేక యేకాదశస్థానమునందుగాని శుక్రుడున్న జాతకునికి గృహలాభము, గొప్ప సౌఖ్యము, సుగంధ పరిమళ ద్రవ్యప్రాప్తి, సంగీతసాహిత్య కళా వైభవము, గొప్ప వుద్యోగము, మిత్రలాభము, ధనధాన్యాభివృద్ధి, వాహన సౌఖ్యము గలుగును. దశానాధుడైన రాహువునకు శుక్రుడు 6-8-12 స్థానములయందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి అగ్ని, రాజ, చోర, విషభయము, మూత్రరోగము, గాయముల బాధ, ఆయుధ భయము, మనోవ్యధ, అతివ్యయము, అపరిశుద్ధ భోజనము, శిరో బాద, కారాగారవాసము, ప్రభుత్వ శిక్షవలన సంపద నష్టము మొదలగు దుష్ఫలములు గల్గును. భుక్తినాధుడైన శుక్రుడు ద్వితీయ లేక సప్తమ స్థానాధిపతియైన జాతకునికి శరీర బాధ, భార్యాబిడ్డల అనారోగ్యము, భయము అపమృత్యువు సంభవించును.

**5. రాహుమహాదశలో రవి భుక్తి ఫలము -**

రాహు మహాదశలో రవి భుక్తియందు, భుక్తినాధుడైనరవి వుచ్ఛక్షేత్రము నందున్నను లేక స్వక్షేత్రము నందున్నను, లేక కేంద్రము లేక కోణమునందున్నను, లేక యేకాదశస్థానమునందున్నను, లేక వుచ్చాంశయందున్నను లేక స్వనవాంశ యందు న్నను, లేక శుభగ్రహముతో సంబంధమొందియున్నను లేక శుభ నవాంశ లేక శుభ షడ్వర్గునందున్నను లేక శుభగ్రహములచే వీక్షించబడుచున్న జాతకునికి రాజ గౌరవము, ధనధాన్యాభివృద్ధి, కొద్ది లాభము, చిన్న గ్రామమునకు నాయకుడుగా యుండును.

రాహు మహాదశలో రవి భుక్తియందు రవి నవమ స్థానాధిపతితోడను లేక లగ్నస్థానమునకు సంబంధమొందియున్నను, లేక దశమాధిపతి రవిని వీక్షించుచున్న జాతకుడు రాజానుగ్రహము గలవాడగుట, ప్రతిష్ట గలవాడును, విదేశయానము, వ్యాపారాభివృద్ధి, వుద్యోగ సంబంధమైన పనిలో అభివృద్ధి, వివాహ వేడుకలు, పుత్ర జననము, అడవుల వ్యాపారములో ధనలాభము, శత్రునాశము, అధికార ప్రయోగము, ఏనుగులు, అశ్వములు, వస్త్రములు, ఆభరణములు గలవాడుగా యుండును. దశానాధుడైన రాహువునకు రవి 6-8-12 స్థానములయందున్నను. లేక రవి నీచ స్థానమునందున్నను, లేక పాపగ్రహముచే వీక్షించ బడుచున్నను, లేక వానిచే సంబంధమొందియున్న జాతకునికి వైరములు, సంకటనలు, రోగములు, రాజ భయము, బంధునాశము, ప్రయాణమునందు శత్రుభయము, అగ్ని ప్రమాదమువలన అధికనష్టము, చోరభయము, ప్రవాసము, మనోవ్యధ, ఏ కార్యమునకైనను అడ్డంకులు, ప్రభుత్వ ఆగ్రహము సంభవించును.

రాహు మహాదశలో రవిభుక్తియందు రవి, దశానాధుడైన రాహువునకు 3-4-5-7-9-10-11 స్థానముల యందెందైనా యున్న జాతకునికి పరదేశరాజుల పారి తోషికములు, వివాహవేడుకలు, సౌఖ్యము గల్గును, కాని రవి ద్వితీయ లేక సప్తమ స్థానాధిపతియైన జాతకునికి గొప్ప రోగము సంభవించును.

**8. రాహుమహాదశలో చంద్ర భుక్తి ఫలము -**

రాహు మహాదశలో చంద్రభుక్తి యందు భుక్తినాధుడైన చంద్రుడు తన స్వస్థానమునందున్నను, లేక వుచ్చస్థానమునందున్నను లేక 1-4-7-10-5-9-11 స్థానముల యందెందైనా యున్నను, లేక మిత్రస్థానము నందున్నను, లేక శుభ గ్రహము లేక గురునిచే సంబంధ మొందియున్నను లేక గురునిచే వీక్షించబడు చున్నను, లేక శుభాంశ యందుగాని లేక శుభషడ్వర్గునందు గాని లేక పూర్ణ చంద్రుడై యున్న జాతకుడు రాజు అగును. రాజ గౌరవము గలవాడును, ఆరోగ్యము గలవాడును, యెక్కువ సంఖ్యలో ఆభరణములు, స్నేహితులు, అశ్వములు, గృహములు గలవాడై భార్యా బిడ్డలతో సుఖముగా యుండును.

దశానాధుడైన రాహువునకు చంద్రుడు 4-9-7-10-11 స్థానములయందున్న లక్ష్మీకటాక్షము వలన జాతకుని గృహము వేడుకలతో నిండియున్నట్లు కనిపించును.

ప్రయత్నించిన కార్యము సఫలమగుట, ధనధాన్య లాభము, సౌఖ్యము, ప్రతిష్ట, రాజ పారితోషికములు, దేవతలను పూజించుట, వ్యాపార ఉద్యోగ జయము, రత్నములు, ఆభరణముల లాభము, వ్యవసాయాభివృద్ధి, పశువృద్ధి, ప్రభుత్వసహాయముచే పనులు జయప్రదముగా నిర్వహించుట, మనస్సు తృప్తి గలుగును.

భుక్తినాధుడైన చంద్రుడు 6-8-12 స్థానములయందున్నను, లేక పాపక్షేత్రము నందున్నను, లేక నీచ క్షేత్రమునందున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్నను, దశానాధుడైన రాహువునకు 6-12 స్థానములయందు చంద్రుడున్నను, లేక ద్వితీయ, నవమాధిపతులతో చంద్రుడు కలసియున్న జాతకుడు ప్రయత్నించిన పనులన్నియు విఫలమగుట, వ్యాఘ్రము మరియు భూతముల బాధ, గృహనాశము, దారిదొంగలభయము, శరీరగాయములు, ఆకస్మిక కలతలు, అవమానము, గొప్పభయము, అధికారనష్టము, లేక వుద్యోగ భంగము, మనో వ్యధ, బంధునాశము, ప్రయాణమునందు కార్యభంగము గల్గును. భుక్తినాధుడైన చంద్రుడు ద్వితీయ లేక సప్తమాధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**9. రాహుమహాదశలో కుజ భుక్తి ఫలము -**

రాహు మహాదశలో కుజభుక్తియందు కుజుడు లగ్నస్థానమునుండి కేంద్రము లేక త్రికోణమునందున్నను, లేక యేకాదశ స్థానమునందున్నను లేక శుభ గ్రహములో సంబంధమొందియున్నను, లేక వుచ్చస్థానమున గాని లేక స్వక్షేత్రము నందుగాని యున్న జాతకునికి పోయిన రాజ్యము లేక వుద్యోగము సంక్రమించుట, ధనవృద్ధి, గృహాభివృద్ధి, దైవానుగ్రహము వలన పుత్ర జననము, భోజన సౌఖ్యము, వస్త్రములు, ఆభరణములు, ఐశ్వర్యములు, మొదలగునవి గల్గియుండును.

దశానాధుడైన రాహువునకు, భుక్తినాధుడైన కుజుడు కేంద్రము, త్రికోణము, తృతీయ లేక యేకాదశ స్థానమునందున్న జాతకునికి యెర్రని వస్త్రలాభము ప్రయాణము నందు రాజ దర్శనము, భూలాభము, శత్రునాశము, యుద్ధసేనలకు నాయకత్వము, సోదరులనుండి అధిక ధనలాభము, గృహనిర్మాణము, శిశుజననము, అధిక సంతోషము, అన్ని విధముల ఆదాయము, బిడ్డల వివాహము, బావుల నిర్మాణము, దైవభక్తి, యొక ముఖ్యుని వలన అన్ని సదుపాయములు, సౌఖ్యము గల్గును.

దనానాధుడైన రాహువునకు 6-12 స్థానములయందు కుజుడున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి కారాగారవాసము, గాయము, అగ్ని లేక జ్వర బాధ, భార్యాబిడ్డల నాశము, సోదరులకు రోగము, వుద్యోగభంగము ప్రభుత్వము వలన ధననాశము, అగ్ని, చోర, శస్త్రభయము, బంధువిరోధము, సోదరకుటుంబ నష్టము,యెత్తు ప్రదేశము లేక బండిపైనుండి పడుట సంభవించును. ప్రధమ దశయందు బాధ, మధ్య తుదిదశలయందు సౌఖ్యము గల్గును. కుజుడు ద్వితీయ లేక సప్తమాధిపతియైన జాతకునికి శరీర బలహీనత, గొప్పభయము సంభవించును.

## 5. గురు మహాదశఫలములు

గురు మహాదశయందు గురుడు పరమోచ్చ స్థానమునందున్న జాతకునికి రాజ్య లాభము, గొప్ప సౌఖ్యము, ప్రతిష్ట, మంచి మనస్సు, అశ్వములు యేనుగుల గుంపులును, పట్టాభిషేకము, తన సంఘము, జాతికిఅధిపతిగా యుండును. గురు మహాదశలో గురుడు తన వుచ్చక్షేత్రమైన కర్కాటకము నందున్న జాతకునికి అదృష్టమునందు వృద్ధి, రాజగౌరవము, విదేశయానము, గొప్పవుద్యోగము, అయితే దౌర్బల్యము గలవాడై దుఃఖితుడగును. గురుమహాదశలో గురుడు వుచ్చక్షేత్రము నందున్న గ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు సౌఖ్యమును పొందుచూ దేవాలయములు నిర్మించి ప్రభువు వలె ప్రేమించబడును.

గురుమహాదశలో గురుడు జాతకుని జనన కాలమున అతి తక్కువలో యున్న నీచ స్థానమునందున్న గ్రహముతో కలసియున్న జాతకునికి గృహనాశము, బిడ్డల నాశము పరస్పర విరోధము, వ్యవసాయభూములనాశము, యితరులకు బానిసత్వము జేయును. గురు మహాదశలో గురుడు నీచగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి మనోవ్యథ, ఇతరులకు బానిసత్వము చేయుట వలన అపవాదము, బిడ్డలతో విరోధము సంభవించును. గురు మహాదశలో గురుడు అధిమిత్ర స్థానమునందున్న జాతకునికి రాజగౌరవము, మేళతాళములు, వాహనములు పొందుట, అన్ని దిశలనుండి అదృష్టము పొర్లివచ్చును. గురు మహాదశలో గురుడు మిత్రక్షేత్రమునందున్న జాతకునికి ప్రభువుతో స్నేహము, గౌరవము, ఘనత, విద్యా విషయక ప్రసంగములయందు జయము, సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, మంచి భోజనము వలన సుఖజీవనము, యితరులయందు ప్రేమ గలవాడుగా యుండును. గురు మహాదశలో గురుడు సమక్షేత్రము (ఉ. శనిక్షేత్రము) నందున్న జాతకునికి ప్రభుత్వము వలన సంపాదించబడిన వ్యవసాయభూములు, వాని వలన వచ్చిన ఆదాయము వలన జాతకుని అదృష్టము పెంపొందును. మంచి స్వభావము, విశాల హృదయముగలవాడును, మిత్రలాభము, శస్త్రములు, ఆభరణములు గలవాడుగా నుండును. గురు మహాదశలో గురుడు శత్రుక్షేత్రము (బుధుడు లేక శుక్రుడు) నందున్న జాతకునికి సామాన్య జనులనుండి ఆదాయము, సోఫా, వస్త్రములు, రాజ పారితోషికములు గలవాడగును. సేవకుల తోడను, భార్యాబిడ్డలు, సోదరులతో వైరము గలవాడగును. గురు మహాదశలో గురుడు అధి శత్రుక్షేత్రమునందున్న జాతకునికి దుఃఖము, వ్యాకులత, విషము, భూములు, ఆస్తి కళత్ర నష్టము, రాజ చోర అగ్ని భయము సంభవించును.

గురు మహాదశలో గురుడు నీచక్షేత్రమునకు పోవుచున్నపుడు జాతకునికి పేదరికము, భూ, ధనలాభము, భార్యాబిడ్డలు, సంగీతసాహిత్య సౌఖ్యము, రాజపూజ్యత, తన సాహసమును బట్టి ప్రతిష్ట, గౌరవము గలుగును. గురుని ఉచ్చమునందు జాతకుడు దేశపరిపాలకుడగుట, జ్ఞానము, విద్య, ధర్మశాస్త్రములు, బ్రాహ్మణుల ద్వారా సంపాదించిన సంపద, భూములు గలవాడుగా యుండును. గురుమహాదశలో గురుడు వుచ్చ స్థానమునుండి నీచ స్థానమునకు అవరోహణలో యున్నపుడు జాతకునికి యొకసారి సౌఖ్యము, యొకసారి విపత్తు, మరి యొకసారి శోభ, రాజ్యము సంక్రమించును.

గురు మహాదశలో గురుడు తన మూల త్రికోణ రాశియైన ధనుస్సు నందున్న జాతకునికి తన రాజ్యము లేక వుద్యోగమునందు ప్రత్యేక సౌఖ్యము. సంపద. భూములు. కుమారులు. భార్య. వాహనములు. యజ్ఞములు జరుపుట. తనను ప్రజలు పూజించుట మొదలగునవి గల్గును. గురు మహాదశలో గురుడు తన స్వస్థానములైన ధనుస్సు మీనరాశుల యందున్న జాతకుడు ప్రభుత్వము ద్వారా ధనధాన్య వస్త్రసంపద లాభమును పొందుట. భోజన సౌఖ్యము. అశ్వములు. పశు సంపత్తి గలవాడును. మంచి హృదయము. పద్యములు వ్రాయువాడును. వేదములు. ఆగమశాస్త్రములు తెలిసినవాడుగా నుండును. గురు మహాదశలో గురుడు 1-4-7-10 స్థానములలో నెందైనా యున్న జాతకునికి వుద్యోగ సౌఖ్యము. భూములు. కళత్రము. రాజ పారితోషికములు. తన కులమునకు నాయకుడుగా యుండును. గురు మహాదశలో గురుడు 5-9 స్థానములయందున్న జాతకునికి భార్యాబిడ్డల సుఖము. ధన. ధాన్య సౌఖ్యము. ప్రత్యేకత గల సుఖమైన జీవితము. భోజన సౌఖ్యము. పానీయ సౌఖ్యము. పట్టు వస్త్రములు. వాహన ప్రాప్తి సంభవించును.

గురు మహాదశలో గురుడు లగ్నస్థానమునందున్న జాతకునికి సౌఖ్యము. మంచి వస్త్రములు. ఆభరణములు. వాహనములు. పండుగలకు కావలసిన ఆడంబర సామానులు. వీణ. సన్నాయి. మద్దెల మొదలగునవియేగాక అశ్వములు. ఏనుగులు మొదలగు వాహనములు గల్గియుండును. గురు మహాదశలో గురుడు ద్వితీయ స్థానమునందున్న జాతకునికి ధనవృద్ధి. రాజ గౌరవము.విద్యా ప్రసంగములలో సంబంధమొందియుండుట. మంచి కనికర స్వభావము. జయము. సౌఖ్యము. తన యోగ్యతను ప్రభువు గుర్తించుట. సోదరుని ద్వారా భూములు. సంపాదించబడుట. స్త్రీ ద్వారా పశువులు. ధనము చేకూర్చుకొనుట. భోజన సౌఖ్యము. మంచి పానీయము. వస్త్రములు ఆభరణములు. దుస్తులు. సుగంధములు మొదలగునవి గలిగియుండుట. మంచి తెలివిగల్గి యితరులచే గౌరవించబడువాడుగా యుండును.

గురుమహాదశలో గురుడు తృతీయ స్థానమునందున్న జాతకునికి సోదరులు ప్రభువుద్వారా సౌఖ్యము. సంపద. పారితోషికములు సంక్రమించును. గురు మహాదశలో గురుడు నాల్గవ స్థానమునందున్న జాతకుడు వాహనములు కొనుట. అధికారులతో స్నేహభావముగా యుండుట. రాజ యోగమైన జాతకుడు ప్రభువు గాని లేక ప్రభువుతో సమానుడుగానైనా యుండును. గురు మహాదశలో గురుడు పంచమ స్థానమునందున్న జాతకుడు మంత్ర ప్రభావముచే సౌఖ్యమును పొందుట. రాజ గౌరవము పొందుట. బిడ్డలు. వేదాంతమునందు నిపుణుడగుట సంభవించును. గురు మహాదశలో గురుడు షష్ట స్థానమునందున్న జాతకుని దశ మొదటి భాగమున ఆరోగ్యము. భార్యాబిడ్డలు. సౌఖ్యము గలవాడుగా యుండును. ద్వితీయ భాగమున జాతకునికి శరీర బలహీనత. భార్య సంపదయందు భయము. చోరభీతి గలిగియుండును.

గురు మహాదశలో గురుడు సప్తమస్థానమునందున్న జాతకునికి భార్యా బిడ్డల సౌఖ్యము, సంపద, విదేశయానము, యుద్ధములో జయము, మతసంబంధమైన దేవాలయ నిర్మాణములు జేయుచు సౌఖ్యముగా యుండును. అష్టమ స్థానమున గురు మహాదశలో గురుడున్న జాతకునికి అసౌఖ్య, అనారోగ్యము, కుటుంబనాశము, బంధు నాశము, ఉద్యోగ భంగము, ప్రవాసముగలుగును, దశానాధుని అంత్యదశలో జాతకుని భార్యతో గూడ సౌఖ్యము, రాజలక్షణములు గల పుత్రజననము సంభవించును. గురు మహాదశలో గురుడు నవమస్థానమునందున్న జాతకునికి ధన ధాన్యాభివృద్ధి, రాజపారితోషికములు మొదలగువనిగల్గును. అందురాజయోగమున్న జాతకునికి రాజ్యప్రాప్తి, ధనసంపద, మర్యాదలో రాజ సమానుడుగ యుండును. గురు మహాధశలో గురుడు దశమస్థానమునందున్న జాతకునికి రాజయోగమున్న రాజగును. అట్లుగాకున్న ధనాభివృద్ధి, గల్గి రాజసమానుడై భార్యాబిడ్డలతో సౌఖ్యముగా యుండును.

గురు మహాదశలో గురుడు యేకాదశ స్థానమునందున్న జాతకుడు రాజ సమానుడగుటయే గాక ధనవృద్ధిగల్గి సౌఖ్యముగాయుండును. అయితే ప్రభువుకు విరోధియై, బంధువులయందు అసూయ, శత్రుత్వము, గల్గియుండును. గురుమహా ధశలో గురుడు ద్వాదశ స్థానమునందున్న జాతకునికి వాహనసంపత్తిగల్గును. అయితే జాతకుడు స్వదేశమును వదలి పరదేశమునకు పోయి అనేక బాధలు అనుభవించును.

గురు మహాదశలో దశానాధుడైన గురుడు పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు పాపిష్టిపనులు చేయవలెనని మనస్సులో వుద్దేశ్య ముండును. గాని బయటకు మాత్రము మతసంబంధమైన మంచిపనులు చేయును. భూలాభము, భార్యబిడ్డల సౌఖ్యముగలవాడుగా యుండును. గురుమహాదశలోగురుని పాపగ్రహము వీక్షించుచున్న జాతకునికి కొద్ది సౌఖ్యము, కొంత ధైర్యము, ప్రతిష్ట, కొన్ని సమయములలో స్నేహితులద్వారా సౌఖ్యము, కొన్ని స్థలములలో కొంత ఆదాయము గల్గును. కాని గురు దశాంత్యమునందు జాతకునికి నాశము సంభవించును. గురు మహాదశలో గురుడు శుభగ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు ప్రభువుతో గూడ వాని వాహనము నందు ప్రయాణముజేయును. సున్నితమైన వస్త్రములు ధరించుట, రాజగౌరవముచే పారితోషికములద్వారా సంపదవృద్ధియగును. మత సంబంధమైన యజ్ఞక్రతువులు జేయువాడుగా యుండును. గురుమహాదశలో గురుడు శుభగ్రహముచే వీక్షించబడుచున్న జాతకుడు విదేశ శక్తిమంతులనుండి పారితోషికములు పొంది సౌఖ్యమును పొందు వాడును, గురువులను పూజించుట, యాత్రలు, మతసంబంధమైన కార్యములు చేయు వాడగును. గురుమహాదశలో గురుడు వుచ్చాంశయందున్న జాతకుడు ప్రభువుతో సమానమైన అదృష్టము పొంద గల్గును. మణులు, మాణిక్యరత్నములతో నిండి యుండును. జాతకుడు అందరితో స్నేహ భావముగా యుండి సౌఖ్యమును పొందుచుండును. గురుమహా దశయందు గురుడు నీచాంశ యందున్న జాతకునికి ప్రభువుల వలన భయము, కడుపులోబాధ, మడిమెల యందు గడ్డలు, వుద్యోగభంగము, బంధువులతో శత్రుత్వము, కులస్థులు, రాజ, అగ్ని, చోరభయము సంభవించును. కాళ్ళుచేతుల సంకెళ్ళతో కారాగార వాసము సంభవించును.

గురు మహాదశలో గురుడు పాపసర్పయోగము అనగా కర్కాటకము యొక్క రెండు, మూడు ద్రేక్కాణముల యందున్న జాతకుడు కొంతకాలము బానిసత్వము నందుండి తరువాత మంచి భోజనము, పట్టువస్త్రములు, బంగారు ఆభరణములు గల్గియుండును. జాతకునికి చేతులు, కాళ్ళకు సంకెళ్ళు వేయబడి భార్యతో తగవులు పెట్టుకొను చుండును. గురుమహాదశ ప్రధమ భాగములో రాజ పూజ్యత, గొప్ప సౌఖ్యమును, మధ్యకాలమునందు భార్యాబిడ్డల లాభమును, తుది భాగము నందు కొన్ని కష్టములు సంభవించును. గురుమహాదశలో గురుడు లగ్న చక్రములో వుచ్ఛక్షేత్రమునందుండి, అంశచక్రములో నీచక్షేత్రమునందున్న జాతకునికి మంచి అదృష్టము ప్రాప్తించి అది వెంటనే సమసిపోవును. అటులనే గురు మహాదశ యందు గురుడు లగ్నక్షేత్రమున నీచయందుండి అంశకుండలిలో వుచ్చ యందున్న అనగా కర్కాటకరాశి యందున్న జాతకునికి ప్రధమ దశలో స్వల్ప మాత్రము అదృష్టము ప్రాప్తించి తరువాత గొప్ప అదృష్టవంతుడై సౌఖ్యమును పొందును. గురుమహా దశలో గురుడు వక్రించియున్న జాతకునికి గొప్ప సంపద చేకూరుట, భార్యాబిడ్డలతో సౌఖ్యము, యుద్ధమునందు జయము, రాజస్నేహము, మంచివాక్కు, పట్టువస్త్రములు, సుగంధ ద్రవ్యములు మొదలగు వానిచే సౌఖ్యము పొందును. గురుమహాదశతో గురుడురవితొ చేరియుండి అస్తంగత దోషము సంభవించిన జాతకునికి వాని దశాకాలము నందు జ్వరము బలహీనత, రోగము వలన ముఖ కాంతి హీనమగుట, హీన స్వభావము వలన భార్య దూరమగుట సంభవించును.

గురు మహాదశయందు గురుడు మేషరాశియందున్న జాతకుడు వ్యవస్థకు అధికారిగా యుండుట, గొప్పజ్ఞానముగలవాడును, ప్రభువులవలన సంపదను పొందు వాడును భార్యాబిడ్డలతో సౌఖ్యముగా నుండు వాడును, యెట్టి రోగము లేని వాడై ఆరోగ్య వంతుడుగా యుండును. గురు మహాదశలో గురుడు వృషభరాశియందున్న జాతకునికి దుఃఖము, రోగము, ప్రవాసము, ధనాదాయము కల్పనతో కలలు కను చుండును. గురు మహాదశలో గురుడు మిధునరాశియందున్న జాతకుడు ధనము గల వాడును, ఋషి సమానుడును, ప్లీహవ్యాధి యింకా యితర బాధలుగలవాడును, తల్లికి సహాయము చేయలేనివాడును, అంగవైకల్యము గలవాడగును. గురు మహాదశలో గురుడు కర్కాటకములో వుచ్చయందున్న జాతకుడు కుల వృత్తి పనులను చేయు వాడును, తనవృత్తి ప్రభువుచే ఆనందిచబడుట, మంచి ప్రతిష్ట, జ్ఞానము గలవాడుగ యుండును. గురుడు కర్కాటకములో పరమోచ్చస్థితిని దాటు చున్నపుడు జాతకుడు దేశ దిమ్మరిగను, దుష్ట భార్య, తల్లిదండ్రులవలన విచారము, సంపాదించిన సొమ్మంతయు ఖర్చగుట సంభవించును. గురుమహాదశలో గురుడు సింహరాశి యందున్న జాతకుడు దేవాలయ పోషకుడుగను; రాజపారితోషికములు, తన మంచి తనము నిలబెట్టు కొనవలెనను ఆసక్తి, మంచి కళత్రము, పశువులు, సంపద గల్గి యుండును. గురుమహాదశలో గురుడు కన్యరాశియందున్న జాతకుడు మహారాణి సహాయము వలన ధనవంతుడగుట, నీచజాతి వారిని పురిగొల్పి తండ్రిపై దాడి జరిపి తండ్రికి కుమారినికి దగ్గర బంధువులకు బాధ గల్గించును.

గురు మహాదశలో గురుడు తులారాశి యందున్న జాతకునికి పరస్త్రీల యందు మమకారము గల్గి భార్యను వేదించుచూ బాధగల్గించుట, భూములయందు

పంట పాడు చేయుట. దేశ దిమ్మరియై సంచారము చేయుచుండును. గురుమహా దశలో గురుడు వృశ్చికరాశి యందున్న జాతకుడు సంతోషము, ఆసక్తి, కష్టమైన పనులు చేయుటయందు కుతూహలము, సంచారమునందు యిష్టము, ఋణములు, మనస్సులో అనేక ఆలోచనలు, ఆచారము, పూజలు చేయుటయందు ఆసక్తిగల వాడుగా యుండును. గురుమహాదశలో గురుడు వృశ్చిక రాశియందున్న జాతకుడు సంతోషము ఆసక్తి, కష్టమైన పనులు చేయుటయందు కుతూహలము, సంచారము నందు యిష్టము, ఋణములు, మనస్సులో అనేక ఆలోచనలు, పూజలు చేయుట యందు ఆసక్తి గలవాడుగా యుండును. గురుమహాదశలో గురుడు ధనుస్సురాశి యందున్న జాతకుడు పైత్య ప్రకోపము గల వాడును, మంచి జ్ఞానము, కథలు చెప్పుచూ ధనము ఆర్జించు వాడును, స్త్రీలకు వినయ విధేయతలు చూపు వాడుగా యుండును. గురువు నవాంశలో ధనస్సునందున్న జాతకుడు పూజించుటకు తగిన వాడును, అన్ని రకములైన సంపదలు గలవాడును, భార్యాబిడ్డలతో సౌఖ్యముగా నుండును, ధనుస్సురాశిలో గురు మహాదశయందు గురుడు సూర్యునిచే అస్తంగతుడై యున్న జాతకునికి సుఖదుఃఖములు సమానముగా యుండును. గురు మహాదశలో గురుడు మకరరాశియందున్న అనగా నీచక్షేత్రమునందున్నను లేక శత్రుక్షేత్రము నందున్నను జాతకుడు క్షయవ్యాధిచే బాధపడుట, భార్యాపుత్రుల మనోవ్యధ, అసౌఖ్యము మొదలగునవి సంభవించును. గురుమహాదశలో గురుడు అస్తంగత దోషము నుండి విముక్తి చెందినపుడు జాతకుడు ధనముగలవాడగుట, మునివలె పవిత్రత గల్గియుండుట, అనేక సమాజములకు అధిపతిగా యుండును గాని తన బంధువుల వలన బాధనొందు చుండును. గురుమహాదశలో గురుడు కుంభరాశి యందు వృద్ధి చెందుచుండగా జాతకునికి ప్రభువు వలన సంపద చేకూరి సౌఖ్యమును పొందు చుండుట, దేవతలు, బ్రాహ్మణులు, గురువును పూజించునుగాని స్త్రీల పిచ్చి గలవాడై సంతోశమును పొందుచుండును. గురుమహాదశలో గురుడు మీనరాశి యందున్న జాతకుడు దేశదిమ్మరియై తిరుగుచుండును కాని తరువాత ధనవంతు డగుట, భార్యయందును, బ్రాహ్మణులయందును భక్తిగల్గి యుండును. అయితే జాతకుడు గోవులకు హాని గలిగించుచుండును.

జన్మకాలమున లగ్నచక్రములో గురుడున్న స్థానమునే లగ్నముగా గ్రహించి వానికున్న మహాదశా కాలమైన 16 సంవత్సములను 12 రాశులకు విభజించిన యొకొక్క రాశికి 16 నెలల కాలము వచ్చును. లగ్నచక్రములో దశానాధుడైన గురుడు కర్కాటకము నందున్న మహాదశ ప్రారంభకాలము నుండి16 మాసములకు సింహరాశి ఫలములను, యీ విధమున వరుసగా ఆయాకాలములకు అన్ని రాశిఫలములను 16 సంవత్సములకు చెప్పవలెను.

సామాన్యముగా గురు మహాదశయందు జాతకునికి అన్ని హంగులతో యొక చక్కని గృహము యుండుట, పాలకులతో గౌరవించబడుట, స్నేహితులు, బ్రాహ్మణులచే గౌరవమును పొందుట, ఉద్యోగప్రాప్తి, భార్య, రత్నములు, వాహనములు గల్గి యుండును. భార్యతో సఖ్యత, సత్యవంతునిగా జేయుట, ప్రభుత్వ బిరుదులు పొందు వాడుగా యుండును. సంపద, అన్ని విషయములు అర్థము చేసుకొను జ్ఞానము కలిగియుండుట, గురువులు, సాధువులతో సంబంధమొంది యుండుట,

బిడ్డలు జననము గల్గును. గురు మహాదశ వృద్ధియందుండగా జాతకునికి పద్య రచన యందు ఆసక్తి ముఖ్యమైన వారిని ప్రేమించుట, ఆధ్యాత్మిక సంబంధమైన విషయములు తెలిసియుండుట, వేదములు వల్లించుట, దేవుళ్ళను పూజించుట, యజ్ఞములు మొదలగు క్రతువులు చేయువాడగును. ఈ గురు మహాదశలో జాతకుడు యెక్కువ ధనము, ప్రభువుల వల్ల లాభము, అశ్వములు, వాహనములు, భూములు, వస్త్రములు, భార్యా బిడ్డలను పొందగల్గును. జాతకుడు ఈ గురు మహా దశలో మంచి స్వభావము, జ్ఞానము గలవారితో సంబంధము పొందుట, మత సంబంధమైన పనులలో సంబంధము గల్గియుండుట, కులమునకు గాని లేక యొక సంఘమునకు గాని నాయకుడుగా యుండును. తన సూక్ష్మ బుద్ధివలన యెటువంటి కఠిన సమస్యలనైన పరిష్కరించుట సంభవించును గాని గురు ప్రారంభదశయందు జాతకునికి కడుపునందు బాధలు యింకా యితర రోగములు గల్గియుండును.

గురు మహాదశలో గురుడు జననకాలమున రవితో సంబంధమొందియున్న జాతకుడు గొప్పవారితో కలసియుండుట, పుత్రజననము, సంపదవృద్ధి, జ్ఞానవృద్ధి వ్యాజ్యములో జయమును పొందును. గురునకు రవి వీక్షణ గల్గియున్న జాతకుని తండ్రికి రోగము సంభవించి మరణముగూడ ప్రాప్తించవచ్చును. గురుని చంద్రుడు వీక్షించుచున్న జాతకుడు రాజైనను లేక రాజాధిరాజైనా కావచ్చును. ఇందు రాజ యోగము లేని యెడల జాతకునికి ఉద్యోగమునందు అభివృద్ధి గలుగును. ఇందు గృహ నాశము, సంపద, ధాన్యనాశము సంభవించును. గురుడు చంద్రునకు త్రికోణము నందున్న జాతకునికి ధనము, వాహనప్రాప్తి గలుగును. గురుని, కుజుడు వీక్షించు చున్నను లేక వానితో సంబంధ మొందియున్న జాతకునికి శరీరముపై గాయములు, కొద్ది ధనలాభము, తన తండ్రి ప్రాణమునకు అపాయము సంభవించును. కాని గురుదశ అంత్య కాలమున అన్ని లాభములు నశించును. గురుని, నాల్గు లేక అష్టమ స్థానము నుండి కుజుడు వీక్షించుచున్న జాతకునికి ధన ధాన్య నాశము తప్పదు. గురుని శుక్రుడు వీక్షించుచున్న జాతకుడు పరస్త్రీని పొందుట, ధనధాన్య లాభము గలుగును. బుధుడు గురుని వీక్షించుచున్నను లేక వానితో సంబంధమొంది యున్నను, జాతకునికి ధనధాన్య సంపద నాశనమగును, తండ్రికి అనారోగ్యము శత్రువుల వలన భయము, రోగము సంభవించును. గురుని వీక్షించుచున్న జాతకుడు గ్రామమునకు నాయకుడగును. గురునికి రాహుకేతువులు సంబంధమొంది యున్న జాతకుని తండ్రి మరణించుట, ధననాశము గలుగును.

గురు మహాదశలో గురుడు స్థానబలము గల్గియున్న జాతకుడు స్థలము, సంపద, కళత్రము, పుత్రుడు, యేనుగులు, అశ్వములు, వస్త్రములు, బంగారము, ఆభరణములు పొందగలుగును. గురుడు దిగ్బలముగల్గియున్న జాతకుడు ప్రపంచ ప్రఖ్యాతి గలవాడగును. గురుడు కాలబలము గల్గియున్న జాతకుడు రాణీలయొక్క పారితోషికములను పొందగలుగును. గురుడు తన దశాకాలమునందు దిగ్బలము గలిగియున్న జాతకునికి ప్రభువుల కటాక్షమువలన, అదృష్టము గల్గి విదేశముల యందు సంచరించుచుండును. గురుడు తన దశాకాలమునకు పాపాంశయందున్న జాతకుడు అనేక కష్టములపాలై రాజాగ్రహమునకు అపకీర్తికి తలవంపులు పొందుచుండును.

గురు మహాదశలో గురుడు శుభషడ్వర్గునందున్న జాతకునికి అతి సౌఖ్యము, బంధువుల వద్దనుండి పారితోషికములు, వాహనములు, వివాహములు, యజ్ఞములు చేయుట సంభవించును. గురుడు పారవతాంశ అనగా ఉచ్చాంశ యందున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, రుచి గల భోజనము, పట్టు వస్త్రములు, ఆభరణములు ధరించుట సంభవించును.

**1. గురు మహాదశలో గురు భుక్తి ఫలము -**

గురు మహాదశలో గురుభుక్తియందు గురుడు లగ్నస్థానమునకు కేంద్ర లేక కోణము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను లేక ఉచ్చక్షేత్రమునందున్నను, లేక శుభగ్రహముతో సంబంధమొంది యున్న జాతకుడు రాజాధిరాజు అగుటయే గాక గొప్ప ధనవంతుడు జ్ఞానవంతుడై బ్రాహ్మణ పెద్దలను కలుసుకొనుట, రాజులచే పూజించబడుట, గేదెలు మొదలగు పశువులు, వాహనములు, ఆభరణములు, మంచి వస్త్రములు, నూతన గృహములు, సమాజభవనముల నిర్మాణము, వ్యాపారవృద్ధి, వివాహ వేడుకలు, పుత్ర జననము, గొప్ప సంపద లాభము, అదృష్టము వృద్ధి పొందుటకు నిర్వహణ కార్యక్రమములు, భూలాభము, ధాన్య లాభము, మత సంబంధమైన ప్రసంగములు వినుట, బ్రాహ్మణ పెద్దలనుండి పారి తోషికములు, తనతో సమానుడైన రాజకార్య దురంధరుని కలయుట, వ్యాజ్యములో తల్లికి సంబంధించిన ఆస్తిసంక్రమించుట, బలము కొరకు యితర ముఖ్యులు వీనిపై ఆధారపడి యుండుట, భార్యాబిడ్డల సౌఖ్యము పెంపొందుట, పశ్చిమ దిశకు ప్రయాణము, బంధువులను కలుసుకొనుట, దేవాలయ వేడుకలు వీక్షించుట, గౌరవము, ప్రతిష్ట పెంపొందును.

గురు మహాదశలో గురుభుక్తియందు గురుడు నీచక్షేత్రమునందున్నను, లేక నీచాంశ యందున్నను, లేక 6-8-12 స్థానములలో యెందైనాయున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి తండ్రితరపు బంధువుల వలన బాధ, బంధునాశము, ఆకస్మిక సంగటనలు చెలరేగుట, మనోవ్యధ, హీనులతో సంబంధ మొందుట, అధిక దుఃఖము తండ్రి తరపువారికి దుఃఖము బాధ, ప్రతి కార్యమునకు అడ్డంకులు, ధనవ్యయము, పుత్రమరణము, ఉద్యోగ భంగము, పైత్య రోగము, వాతరోగము, పరగ్రామ నివాసము, పరదేశ ప్రయాణము, రాజభయము, మరణము, ధనధాన్య నాశము, తన యజమానికి అపమృత్యువు సంభవించును. గురు మహాదశలో గురు భుక్తియందు గురుడు సప్తమస్థానాధిపతియైన జాతకునికి శరీరబాధ సంభవించును.

**2. గురు మహాదశలో శని భుక్తి ఫలము -**

గురు మహాదశలో శని భుక్తియందు, భుక్తినాధుడైన శని ఉచ్చక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక మిత్రక్షేత్రము నందున్నను, లేక లగ్నస్థానము నుండి 4-5-7-9-10-11 స్థానములయందుండి బలవంతుడై యున్న జాతకునికి రాజ్యలాభము, గొప్ప సౌఖ్యము, అంతః ప్రవాహము వలె ధాన్యము, ధనము, వస్త్రములు, ఆభరణములు సంక్రమించుట, భార్యతో సుఖమైన జీవనము, గృహము, పశువులు, వ్యాపారములో కొద్ది లాభము, అధికార పనులలో జయము తప్పక పుత్రజననము, వాహన ప్రాప్తి, శత్రునాశము తక్కువ జాతి స్త్రీతో

పరిహాసము, గృహమునందు వివాహ వేడుకలు, బంధుమిత్ర సౌఖ్యము, పల్లకియందు ప్రయాణము, నీలివర్ణ వస్త్రములు, నీలివర్ణ అశ్వలాభము, పశ్చిమదిశకు ప్రయాణము, ప్రభు దర్శనము, రాజగౌరవము, అనేక సాహసములు ప్రాప్తించును.

గురు మహాదశలో శని భుక్తియందు, భుక్తినాధుడైన శని లగ్నమునుండి 6-8-12 స్థానముల యందెందైనా యున్నను, లేక పాపక్రాంతము చెందియున్నను లేక శత్రుక్షేత్రము నందున్న జాతకునికి ధనధాన్యనాశము, జ్వరబాధ, మనోవ్యధ, భార్యాబిడ్డల అనారోగ్యము, గాయములు, ఉష్ణమువలనబాధ, గృహమునందు అసౌఖ్య పరిణామములు, సేవకులవలన సంకటనలు, గోవులు, గేదెల నాశము, బంధువుల వలన అపార్థములు, తలవంపులు, మనోవ్యధ, పరదేశ నివాసము, కార్య భంగము, ఋణముల వలన బాధ, భిన్నాభిప్రాయములు గల్గును.

గురు మహాదశలో శని భుక్తియందు భుక్తినాధుడైన శని, దశానాధుడైన గురునకు కేంద్రము నందుగాని లేక కోణము నందుగాని యున్న యెడలను, లేక ద్వితీయ లేక యేకాదశ స్థానమునందున్న జాతకునికి భూలాభము, ధనలాభము, పుత్రజననము, గోవులు, గోదెలను కొనుట, సేవకుని ద్వారా సంపదవృద్ధిపొందును. దశానాధుడైన గురునకు, భుక్తి నాధుడైన శని 6-8-12 స్థానములయందైనాయున్నను లేక పాప గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి ధనధాన్యనాశము, బంధమిత్రులతో అపార్థములు, ఉద్యోగభంగము, శరీరబాధలు, బంధుభయము గలుగును. భుక్తినాధుడైన శని ద్వితీయ లేక సప్తమాధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**3. గురుమహాదశలో బుధ భుక్తిఫలము -**

గురు మహాదశలో బుధ భుక్తియందు, భుక్తినాధుడైన బుధడు లగ్నమునకు కేంద్ర, త్రికోణ లేక ఏకాదశ స్థానమునందున్న, లేక ఉచ్ఛక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను లేక దశానాధుడైనగురునితో సంబంధ మొందియున్న జాతకునికి ధనవృద్ధి, శరీరారోగ్యము, అధికారవృద్ధి, రాజానుగ్రహము వలన తలంచిన కార్యములు సఫలమగుట, గోవులు, వాహనములు, వస్త్రముల సౌఖ్యము, వివాహవేడుకలు, గృహసౌఖ్యము, శ్రేయస్సు పెంపొందుట, యిద్దరు తల్లులు గల్గియుండుట, రాజపారితోషికములు ఏనుగులు, అశ్వములను పొందియుండును. భుక్తి నాధుడైన బుధుని కుజుడు వీక్షించుచున్న జాతకునికి శత్రువృద్ధి సౌఖ్యము క్షీణించుట, పనుల యందు అశ్రద్ధ, రోగములతో బాధపడుచుండును.

భుక్తినాధుడైన బుధుడు, దశానాధుడైన గురునకు శని 6-8-12 స్థానములయందుగాని లేక పాప గ్రహముతో సంబంధమొంది, శుభగ్రహముచే వీక్షించ బడకున్న జాతకునికి అనేక విధముల ధనధాన్యములు తగ్గుముఖముపట్టుట, దేశము వదలిపోవుట దారిదోపిడి చోరులవలన భయము, అగ్నిప్రమాదమువలన భయము, గాయము, నేత్రబాధ, పరదేశమునుండి పారిపోయి వచ్చిన వానిని స్వదేశపు ప్రభుత్వమునకు పట్టి యిచ్చుట, తల్లి అనారోగ్యము, మనస్సు చాంచల్యము, వాతము, జలుబు రోగముల వలన బాధగలుగును. భుక్తినాధుడైన బుధుడు శనికి 6-8-12 స్థానములయందున్నను లేక పాప గ్రహముతో సంబంధమొంది

యున్న జాతకునికి ఆకస్మిక పోరాటములు, గృహములో తృణీకరించుమాటలు, పశునాశము, సంకటనలు, అపమృత్యుభయము శత్రుకలహము, సంకెళ్ళతో నిర్బంధము, కార్యభంగము, అతివ్యయము, భార్యబిడ్డల బాధ, బంధువిరోధము, ప్రాణభయము సంభవించును.

భుక్తినాధుడైన బుధునిచే శుభగ్రహము వీక్షించబడినను లేక వానితో సంబంధమొందినను జాతకునికి కళత్రసౌఖ్యము, ధనవృద్ధి గల్గును. భుక్తియొక్క ప్రధమ భాగమునందు జాతకునికి శ్రేయస్సు, శరీర ఆరోగ్యము, వస్త్రవాహనలాభము గలుగును. బుధభుక్తి యొక్క తుదిభాగమున జాతకునికి సంపదనాశము, శరీరబాధ, మనోవ్యధ సంభవించును. భుక్తినాధుడైన బుధుడు ద్వితీయ, సప్తమాధిపతియైన జాతకునికి అపమృత్యువు సంభవించును.

**4. గురు మహాదశలో కేతు భుక్తిఫలము -**

గురు మహాదశలో కేతు భుక్తియందు భుక్తినాధుడైన కేతువు కేంద్రస్థానము నందున్నను లేక శుభగ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు యితరుల ఖర్చుతో సౌఖ్యముగాయుండుట, సంపద కూర్చుకొనుట, శ్రాద్ధములందు యితరుల యిండ్లలో దూషింపబడినవాడై భోజనము చేయుట, దుష్టకార్యముల ద్వారా ఆదాయము, అరుదైన వస్తువులు, సొగసైన ఆభరణములను గడించువాడగును.

గురు మహాదశలో కేతు భుక్తియందు భుక్తినాధుడైన కేతువు 3-6-10-11 స్థానముల యందెందైనాయున్న జాతకునికి అధికారము వ్యాప్తిజెందుట, రాజగౌరవము వృద్ధిజెందుట, శత్రునాశము, అధికధనము, మతసంబంధమైన ప్రసంగములువినుట, అనుకున్న కార్యములు నెరవేరుట మొదలగునవిసంభవించును. దశానాధుడైన కేతువు 4-5-9-10 స్థానముల యందెందున్నను జాతకునికి పల్లకీల యందు ప్రయాణము జేయు అదృష్టము గల్గుట, యేనుగులు, అశ్వములు, వస్త్రములు, అనుకున్న ఫలముకంటె యెక్కువ లభించుట, ధనము, గోవులు, గేదెలను గడించుట, యిదియేగాక తనతండ్రి మహమ్మదీయ పెద్ద నుండి పారితోషికములు, మంచి వస్త్రములు సంపాదించి పెట్టును.

గురు మహాదశలో కేతుభుక్తియందు కేతువు దశానాధుడైన గురువునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి రాజాగ్రహము, దానివలన ధననష్టము, కారాగారవాసము, బలహీనత, రోగబాధ, తండ్రి విరోధము, సోదరుని వైరము, మనోవ్యధ, యొక వితంతువుతో వివాదము, తండ్రి ఆకస్మికమరణము, ఉద్యోగభంగము, సోదరుని మరణము, తలలో రోగము, నేత్రబాధ, విషకీటకముల భయముసంభవించును. గురు మహాదశలో కేతుభుక్తి యందు, కేతువు ద్వితీయ లేక సప్తమాధిపతియైన శరీరమునకు రోగము సంభవించును.

**5. గురు మహాదశలో శుక్ర భుక్తిఫలము -**

గురు మహాదశలో శుక్ర భుక్తియందు, భుక్తినాధుడైన శుక్రడు కేంద్రము నందుగాని లేక కోణమునందు గాని లేక నవమాధిపతితో గాని లేక దశమాధిపతితో గాని సంబంధమొంది యున్నను, లేక తన స్వస్థానమునందున్నను, లేక శుభగ్రహముతో

సంబంధమొంది యున్నను, జాతకునికి రాజ పారితోషికములు, వస్త్రములు, వాహనములు సంక్రమించును. గురుమహాదశలో శుక్రభుక్తియందు భుక్తినాథుడైన శుక్రుడు నాల్గవ స్థానాధి పతితో సంబంధమొంది ఉచ్చక్షేత్రమునందున్నను లేక మూలత్రికోణము నందున్న జాతకునికి రత్నములు, ఆభరణములు సంక్రమించుట వ్యభిచారిణులతో సంబంధ మొందుట, సంగీతమునందు ఆసక్తి, పరుపుల సౌకర్యము, ఉత్తరదశగా ప్రయాణము, మిత్ర సమాగమము, తూర్పుదిశ ప్రయాణము నందు ధన లాభము, వివాహవేడుకలు, గొప్పసంతోషము, తల్లిదండ్రుల అరోగ్యము, దేవులను, గురువులను పూజించుట, బీదలకు అన్నదానము, బావులు త్రవ్వించుట, అడవులు పెంచుట, స్త్రీలవలన ధనార్జన, అధికారము విస్తరించుట, జ్ఞానులను కలుసు కొనుట, సుందరమైన గృహ నిర్మాణము, మరియు వనము, క్షీరాన్న భోజనము మొదలగు సత్ఫలములు గల్గును.

గురుమహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు దశానాధుడైన గురునికి గాని లేక లగ్నమునకు గాని 6-8-12 స్థానములయందున్నను, లేక నీచక్షేత్రము నందున్న, జాతకునికి భార్యతరపు బంధువులచే దుర్మార్గము సృష్టించుట, స్త్రీల వలన సంకటనలు, సోదరునితో తగవులు, పరదేశ ప్రయాణము, పశునాశము, రాజభయము, మనోవ్యధ, అమిత వ్యయము సంభవించును. భుక్తినాథుడైన శుక్రుడు శని, కుజ లేక రాహువుతో సంబంధమొంది యున్న జాతకునికి సంకటనలు, రాజాగ్రహము, స్త్రీలవలన విరోధము, మామగారి ద్వారా విరోధము, సోదరులతో వైరము, ధనధాన్య నష్టము గలుగును.

గురుమహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు, దశానాధుడైన గురువునకు 4-7-10-2-9 స్థానముల యందెందైనాయున్న జాతకునికి ధనధాన్యవృద్ధి, క్రొత్త స్త్రీని చేపట్టుట, రాజదర్శనము, పుత్రజననము, వాహనలాభము, పశువృద్ధి, గొప్ప సౌఖ్యము, సంగీత సమ్మేళనములు, జ్ఞానులతో సంబంధము, మంచి ఆహారము, తన బంధువులను పోషించుట మొదలగునవి సంభవించును. గురు మహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు ద్వితీయాధిపతి గాని, లేక సప్తమాధిపతిగానియైయున్నను, లేక ద్వితీయ, సప్తమాధిపతితో సంబంధమొంది యున్నను, లేక వానితో వీక్షించబడిననూ, జాతకునికి వస్తుమారకములో దుర్మార్గపు లావాదేవీలు, ఋణబాధ, స్త్రీ ద్వారా ప్రాణభయము, రాజదండన వలన ధననాశము సంభవించును.

**6. గురుమహాదశలో రవి భుక్తిఫలము -**

గురు మహాదశలో రవి భుక్తియందు, భుక్తినాథుడైన రవి ఉచ్చయం దున్నను లేక స్వక్షేత్రమునందున్నను లేక దశానాధుడైన గురునకు గాని లేక లగ్నమునకు గాని కేంద్రము లేక కోణము లేక 5-10-11 స్థానములలో నెందైనాయుండి బలవంతుడైయున్న జాతకునికి ధనవృద్ధి, రాజపారితోషికములు, వివాహ, లేక విద్యావేడుకలు, భూములు, గ్రామములను పొందుట, యుద్ధములో జయము, మిత్ర ప్రభువు ద్వారా సౌఖ్యము, గ్రామము లేక వనవాసము, వేదాంత సంబంధమైన ప్రసంగములు, వ్యాపారమునందు అదిక లాభము సంక్రమించును.

భుక్తినాధుడైన రవి లగ్నమునకు 6-8-12 స్థానముల యందెందైనా యున్నను లేక నీచ క్షేత్రము నందున్నను. లేక శనితో సంబంధమొందియున్న జాతకునికి తలనొప్పి. జ్వరము. ఉద్యోగభంగము. బంధువులతో శత్రుత్వము. ఆకస్మిక సంకటనలు. భార్యాబిడ్డల బాధలు. బాకీదారుల వలన వ్యాకులము. అధికవ్యయము. తండ్రితరపు బందువుల మరణము. మనోవ్యధ సంభవించును. భుక్తినాధుడైన రవి ద్వితీయాధిపతిగాని లేక సప్తమాధిపతిగానియైయున్న జాతకునికి శరీరబాధ సంభవించును.

### 7. గురుమహాదశలో చంద్ర భుక్తిఫలము -

గురు మహాదశలో చంద్రభుక్తియందు. భుక్తినాధుడైన చంద్రుడు లగ్నమునకు కేంద్రమునగాని లేక కోణమునగాని లేక యేకాదశ స్థానమునగాని లేక ఉచ్చయందు గాని లేక స్వక్షేత్రమునగాని పూర్ణచంద్రుడై బలముగల్గియున్నను లేక గురునితో వీక్షించబడిగాని లేక వానితో సంబంధమొందిగాని యున్నను లేక దశానాధుడైన గురునికి శుభస్థానమున చంద్రుడున్న జాతకునికి ప్రభువు వద్దనుండి పారితోషికములు వచ్చుట. భార్యాబిడ్డల సౌఖ్యము పెంపొందుట. మంచి కార్యములు చేయుట. ప్రతిష్ట. క్షీరాన్న భోజనము. రాజకటాక్షము వలన అన్ని విధముల వృద్ధిపొందుట. ధన. వస్త్ర. వాహనవృద్ధి. యింటియందు గోవులు. సంపద గలవాడై వర్ధిల్లు చుండును.

భుక్తినాధుడైన చంద్రుడు లగ్నమునకు 6-8-12 స్థానములయందున్నను. లేక నీచక్షేత్రమునందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొందియున్నను జాతకునికి శత్రు. చోర. అగ్ని. రాజభయము సంభవించును. భుక్తినాధుడైన చంద్రుడు దశానాధుడైన గురునకు 6-8-12 స్థానములయందుండి బలహీనుడైన జాతకుని తల్లి. మేనమామ. మరియు తల్లితరపు బంధువులు మరణించుట. గౌరవ సంపదలు నశించుట. పరదేశము నుండి విడుదలగుట. రాజ చోరభయము. తల్లి బంధువుల నుండి కలతలు సంభవించును. భుక్తినాధుడైన చంద్రుడు ద్వితీయాధిపతి గాని లేక షష్టాధిపతిగానియైన జాతకుని శరీర ఆరోగ్యమునకు అపాయము సంభవించును.

### 8. గురుమహాదశలో కుజ భుక్తిఫలము -

గురు మహాదశలో కుజ భుక్తియందు. భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు కేంద్రమున గాని కోణమునగాని యున్నను. లేక ఉచ్చక్షేత్రమున గాని లేక స్వక్షేత్రమున గాని లేక ఉచ్చాంశయందుగాని లేక స్వనవాంశయందుగాని యున్న జాతకుడు వివాహ. విద్యావేడుకలు జరుపుట. గ్రామములు. భూములు సంపాదించుట. కోరిన పనులు కొనసాగుట సంభవించును. దశానాధుడైన గురునకు కేంద్రము లేక కోణము లేక ద్వితీయ లేక యేకాదశస్థానమున భుక్తినాధుడైన కుజుడున్నను లేక శుభగ్రహముచే కుజుడు వీక్షించ బడుచున్నను. లేక వానితో సంబంధ మొందియున్న జాతకునికి ధనధాన్య వృద్ధియును. రాజగౌరవము. అన్నదానము. దాంపత్య సౌఖ్యము. పుత్రజననము. పవిత్ర క్షేత్రములకు యాత్ర సంభవించును. భుక్తినాధుడైన కుజుడు శుభనవాంశ లేక శుభ షడ్వర్గునందున్న జాతకునికి యుద్ధమునందు జయము. అన్నికార్యములు తృప్తికరముగా ముగియుట.

వస్త్ర వాహనవృద్ధి, జననవేడుకలు, రాజదీవెనలు, బంధువుల వివాహ వేడుకలకు హాజరగుట అధికార విస్తరణ, ప్రయాణము, మిత్ర సమాగమము సంభవించును. లగ్నమునకు 6-8-12 స్థానములయందు భుక్తినాధుడైన కుజుడున్నను, లేక కుజుడు నీచస్థానము నందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి అనేక రోగముల యొక్క భయము, దుఃఖము, ఉద్యోగభంగము, అతివ్యయము, రాజద్వేషము బంధునాశము, యెత్తు ప్రదేశము నుండి పడుట, గాయము, అగ్ని, జ్వరబాధ, ఋణబాధ, మనోవ్యధ గల్గును. భుక్తికాలము మొదటి భాగమున క్లేశమును తరువాత సౌఖ్యము గల్గును.

భుక్తినాధుడైన కుజుడు ద్వితీయ స్థానాధిపతిగాని లేక సప్తమాధిపతి గానియైయున్న జాతకునికి శరీరబద్ధకము, మనస్సునందు అసౌఖ్యము సంభవించును.

**9. గురుమహాదశలో రాహు భుక్తి ఫలము -**

గురు మహాదశలో రాహుభుక్తియందు, భుక్తినాధుడైన రాహువు ఉచ్చయం దున్నను, లగ్నమునకు కేంద్రమునందున్నను లేక మూలత్రికోణమునందున్నను లేక నవమ స్థానమునందున్నను, లేక కేంద్రాధిపతితో సంబంధమొందియున్నను లేక శుభనవాంశయందున్నను, లేక శుభ షడ్వర్గునందున్నను, లేక ఉచ్చాంశయందున్నను, లేక ఏకాదశ స్థానమందున్న జాతకునికి భుక్తికాలము మొదటి దశయందే అధిక ధనధాన్య స్వలాభము, గొప్ప దుర్గములకు నాయకుడుగా యుండుట, మహమ్మదీయ ప్రభుదర్శనము, స్వగృహమునందు వివాహవేడుక, సేనా నాయకుడుగా ఉద్యోగ వృద్ధి దూరదేశ ప్రయాణము, పవిత్ర పురుషులను కలుసుకొనుట, రామేశ్వరములో పవిత్ర స్నానము, అనుకున్న పనులు సఫలమగుట, పాలకగృహములో ఆనందము, రత్నములు, ఆభరణములు పొందుట, పశ్చిమ, దక్షిణదిశలకు ప్రయాణము, బంధు సమాగమము గల్గును.

గురుమహాదశలో రాహుభుక్తియందు, రాహువు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచస్థానమునందున్నను లేక దశానాధుడైన గురువునకు రాహువు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్నను జాతకునికి మంచి పనులన్నియు యింతటితో ముగించబడుట, సర్పభయము, గాయము, చోరభయము, ప్రభువు యొక్క అపకారము, గృహమునందు మనో వ్యాకులము, కళత్రమరణము, రక్తహీనము, మనోవ్యధ, బంధునాశము, సోదరునితో వైరము, తండ్రితరపు బంధువుల సంకటనలు, గృహమునందు విచారకరమైన కార్యములు, చెడ్డకలల భయము, ఆకస్మిక భయము, ఉపద్రవము, మంత్రవిద్య వలన రోగము గల్గును. గురుమహాదశలో రాహుభుక్తియందు రాహువు ద్వితీయ, లేక సప్తమ స్థానమునందున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

## 6. శని మహాదశ ఫలములు

శని మహాదశలో శని పరమోచ్చక్షేత్రమైన తులారాశిలో 20 భాగల యందున్నపుడు జాతకునికిగ్రామాధికారిగా యుండు శక్తిగల్గును. లేదా యొక గుంపునకు గాని లేక యొక సభకుగాని ఆధిపత్యము పొందియుండును. జాతకుడు

ఆనందముగా యుండును గాని బంధునాశము, తండ్రి మరణము సంభవించును. శని మహాదశలో శని ఉచ్చయందున్న జాతకునికి ప్రవాసము, మనోబాధ మరియు నాశము, వ్యాపారము మరియు వ్యవసాయ ఆదాయములో తగ్గుదల, రాజాగ్రహము గలుగును. అప్పుడప్పుడు సౌఖ్యము, కొద్దిఅధికారము, వ్యవసాయములో స్వల్ప లాభము, సేవకుల వలన ధననాశము సంభవించును.

శని మహాదశలో శని నీచయందున్న జాతకునికి కళత్ర, పుత్ర, బంధు మరణము, కష్టముగా వ్యవసాయము జేయుట, నీచ జాతివారితో సంబంధమొంది తిండికి సరిపోను సంపాదించుకొనుట సంభవించును. శని అదిమిత్ర క్షేత్రము నందున్న జాతకునికి సౌఖ్యము, రాజ గౌరవము, కళత్రలాభము, శిశు, ధన లాభము, గోవులు, గేదెలు, భూ లాభము, వ్యాపారాభివృద్ధి గల్గును. చేతిపనుల యందు నిపుణత్వము, జ్ఞానము, బలము, ప్రతిష్ఠ, నాయకత్వము, దుఃఖము మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని సమక్షేత్రమునందున్న జాతకునికి భార్యాబిడ్డలపై వివేకముగలవాడై యుండుట, బంధువిరోధము, సేవకుల ప్రమాదము, క్షయరోగము, వాత పైత్యరోగము వలన బాధ గలుగును.

శని మహాదశలో శని శత్రుక్షేత్రమునందున్న జాతకునికి వైశ్యుని ద్వారా సంపద, వ్యవసాయభూముల నాశమువలన బాధ, ఉద్యోగ భంగము, శత్రుత్వము తెచ్చుకొనుట, అలసట, బంధు విరోధము, రాజభయము, చోరభయము, పనులకు అడ్డంకులు, ఆధారము కొరకు వివాహము జేసుకొనుట, పుత్ర విరోధము మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని నీచస్థానమునుండి ఉచ్చ స్థానమునకు పోవునపుడు జాతకునికి ప్రభువుల ద్వారా అదృష్టము, వ్యాపారము నందు లాభము, వ్యవసాయ ఆదాయము పెంపొందుట, కళత్ర సౌఖ్యము, పుత్ర, సంపద సౌఖ్యము రాజాగ్రహము వలన అదృష్టము క్షీణించుట, యితరులకు బానిసత్వము, మూల వ్యాధి, నేత్రరోగము సంభవించును.

శని మహాదశలో శని తన మూల త్రికోణమైన మకరరాశియందున్న జాతకునికి పారితోషికములు, విదేశవాసుల సమాగమము, కులమునకు ఆధిపత్యము, భార్య, పుత్ర, బంధువులతో విరోధము సంభవించును. శని మహాదశలో శని స్వక్షేత్రము నందున్న జాతకునికి బలము, పురుష లక్షణము, ప్రఖ్యాతి, రాజానుగ్రహము, సువర్ణ ఆభరణములు, భూలాభము, ధైర్యము, సౌఖ్యము, కొంతమందితో విరోధము సంభవించును. శని మహాదశలో శని 1-4-7-10 స్థానములయందున్న జాతకునికి పోట్లటలు, కలతల వలన అలసట, ధనము, పుత్రులు, స్నేహితులు గల్గి యుండుట, మరణము మొదలగునవి సంభవించును.

శని మహాదశలో శని లగ్నమునందున్న జాతకునికి ఉద్యోగభంగము, శరీర అలసట, ప్రయాణములు, రాజభయము, తలనొప్పులు మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని లగ్నమునకు ద్వితీయ స్థానమునందున్న జాతకునికి ధన నాశము, నేత్రరోగము, భయము, రాజాగ్రహము, అపార్థములు, ఆకలి లోపము, మనోవ్యధ మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని తృతీయస్థానము నందున్న జాతకునికి భూలాభము, ధన, పశు లాభము, సౌఖ్యము సంతోషము, సోదరుడు తల్లి లేక తల్లి తరపు బంధువుల యొక్క మరణము సంభవించును.

శని మహాదశలో శని లగ్నమునకు చతుర్ధ స్థానమునందున్న జాతకునికి గృహమునందు అగ్నిప్రమాదము. ఉద్యోగములో హోదా తగ్గింపు. చోర. రాజ. భయము గలుగును. శని మహాదశలో శని పంచమ స్థానమునందున్న జాతకునికి తెలివి క్షీణించుట. మనస్సు ఆవేదన. రాజాగ్రహము. సేవకుల వలన బాధ. భార్యా లేక బంధువునకు మనోరోగము సంభవించును. శని మహాదశయందు శని లగ్నమునకు షష్ట స్థానమునందున్న జాతకునికి శత్రువుల బాధ. చోర. రోగ. విష బాధ. గృహము లేక వ్యవసాయ భూముల నాశము గలుగును.

శని మహాదశలో శని లగ్నమునకు సప్తమ స్థానమునందున్న జాతకునికి శత్రు బాధ. మూత్రరోగము. కళత్ర విరోధము లేక కళత్రనాశము సంభవించును. శని మహాదశలో శని అష్టమ స్థానమునందున్న జాతకునికి పుత్రనాశము. సంపద. భార్య. సేవకులు. గోవులు. గేదెలు. భూముల నాశము. వుంపుడుకత్తె మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని నవమ స్థానమునందున్న జాతకుని తల్లి దండ్రులు. గురువు యొక్క మరణము. పరదేశ ప్రవాసము గలుగును. నవమ స్థానము శని స్వక్షేత్రమై యున్న పైన చెప్పబడిన ఫలములు వ్యతిరేకముగా యుండును. శని మహాదశలో శనిలగ్నమునకు దశమస్థానమునందున్న జాతకునికి వృత్తినాశనము. పరదేశ గమనము. ఉద్యోగభంగము. బందించబడుట. ప్రభుత్వము వలన బాధ సంభవించును. శని మహాదశలో శని లగ్నమునకు ఏకాదశ స్థానము నందున్న జాతకునికి అనేక మార్గముల ద్వారా ఆదాయము. సౌఖ్యము. పారి తోషికములు. సేవకుల శ్రేయస్సు. పుత్రులు. కళత్రము. మనస్సులో ఆనందము. భూముల నుండి అధిక ఆదాయము గల్గును. శని మహాదశలో శని లగ్నమునకు ద్వాదశ స్థానమునందున్న జాతకునికి చోర. అగ్ని. రాజ భయము. యొక ప్రజా గుంపును బెదరించుట. అనేక అపాయములు. దుఃఖము బంధునాశము. పరదేశ గమనము మొదలగునవి సంభవించును.

శని మహాదశలో శని పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకుడు రహస్యముగా దుర్మార్గపు పనులు చేయువాడును. నీచ స్త్రీలతో సంబంధమొంది యుండుట. చోరులు. నీచులతో పోట్లాడుట. బాతాఖానీ కబుర్లతో కాలము గడుపుట కళత్రనాశము మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని దశాకాలము నందు పాపగ్రహముచే వీక్షించబడుచున్న జాతకునికి సంపద. భార్య. పుత్రుడు. సేవకులు. సోదరుల నాశము సంభవించును. జాతకునికి వృధా దూషణలు. చెడు పదార్థ భోజనము. దుర్గంధము. కంపు గల ప్రదేశములో నివసించుట సంభవించును.

శని మహాదశలో శని దశాకాలమునందు శని శుభగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి జ్ఞానము. ఔదార్యము. ప్రభువు వలన అదృష్టము. నల్ల ధాన్యము. యినుము సంక్రమించును. శని శుభగ్రహముచే వీక్షించబడుచున్న జాతకునికి మొదటి దశాకాలమునందు కళత్ర. పుత్ర. సేవకులు. సంపదలాభము గల్గును. కాని శని మహాదశ తుది భాగమునందు జాతకునికి కష్టములు. వ్యాపార నష్టము. భూమి. పశువులు. వ్యవసాయము పంట నాశము మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని ఉచ్చాంశయందున్న జాతకునికి వివిధమైన

రీతులలో సౌఖ్యము సంతోషము, వసతి, విదేశయానము, సమావేశములకు, సమూహములకు నాయకత్వము పొందువాడుగా యుండును.

శని మహాదశలో శని నీచాంశయందున్న జాతకుడు తక్కువ సేవకావృత్తి యందుండి జీవించుచూ దుఃఖములో మునిగి భార్య పుత్రునితో విరోధియై ధనము లేనివాడై యుండును. శని మహాదశలో శని పాప ద్రేక్కాణమునందున్న జాతకునికి గొప్ప భయము, ఆత్మ అత్యాయత్నము, రాజ, చోర, అగ్ని, విషభయము గల వాడగును. ప్రథమదశయందు మాతృ మరణము, అధిక దుఃఖము, మధ్యమ దశయందు విదేశయానము, తుది దశయందు యింకొకయింటిలోనివసించి తిని కాలము గడపవలసి యుండును. శని మహాదశలో శని నీచక్షేత్రము నందును, మరియు ఉచ్చాంశ యందున్న జాతకుడు ప్రథమ దశయందు దుఃఖితుడైనను, తుది దశాకాలము నందు సౌఖ్యజీవనము చేయును. శని మహాదశలో శని ఉచ్చక్షేత్రము నందునను, మరియు నీచాంశయందున్న జాతకుడు ప్రథమదశయందు సౌఖ్యమును, పొంది తుది దశాకాలమునందు బాధల నొందుచుండును. . జననకాలమున శని వక్రించి యున్న వాని దశాకాలమునందు జాతకుడు దుఃఖము గలవాడై దుర్మార్గపు పనులు చేయుట, వృత్తినాశము, సోదరమరణము సంభవించును. శని మహాదశ యందు శని, రవి వలన అస్తంగతుడైయున్న జాతకుడు తన స్వంత మనుషులతో విరోధము, పరస్త్రీపై అధికారము, సేవకులు, పుత్రునియందు యిష్టము లేని వాడుగా యుండుట, విరోధము వలన అవమానము, పనియందు గొప్పకష్టము చేయువాడుగా యుండును.

సామాన్యముగా శని యొక్క శుభ దశాకాలమునందు జాతకుడు ప్రపంచ ప్రఖ్యాతి గలవాడును, జ్ఞానము, అన్ని శాస్త్రములు తెలిసిన వాడును, ఆధ్యాత్మిక సంబంధమైన ప్రసంగములను ప్రేమించు వాడును, పట్టణమునకు అధికారియు, తండ్రిని మించినవాడును, న్యాయచట్టము యెరిగినవాడుగా యుండును. ఏనుగులు, అశ్వములు, వాహనములు గలవాడగును. తన జ్ఞానము వలన గొప్పవాడును, బ్రాహ్మణులు, దైవభక్తి గలవారిచే పూజించబడు వాడును, జీర్ణ గృహమునందు నివసించు వాడును, చిన్న విషయములకు తృప్తిపడువాడుగా యుండును. శని యొక్క పాప దశాకాలమునందు జాతకుడు నిద్రమత్తు గలవాడును, సంపద, తన స్వజనులచే అయిష్టత పొందువాడును, ముసలి స్త్రీయందు ప్రేమగలవాడును, మత సంబంధమైన పనులు చేయువాడును, విధేయత, దైవకార్యములయందు ఆసక్తి గలవాడును, వాతరోగము, శ్లేష్మరోగము గలవాడును, అంగవైకల్యము గలవాడును, బలహీనుడై యుండును.

శని మహాదశలో శని జాతకుని జనన కాలమునందు మేషరాశి యందున్న జాతకుడు పరప్రదేశములకు పోవువాడును, గజ్జి, వాతరోగము, బంధునష్టము, ఎత్తుప్రదేశము నుండి పడుట, ధాన్యపు భూముల నాశము, యివన్నియు ప్రథమ దశలో సంభవించును. తరువాత సగభాగమున జాతకునికి సౌఖ్యము, అనేక లాభములు, గ్రామాధికారము, నల్ల ధాన్యపు పంట వృద్ధి. సంపద మొదలగునవి గల్గియుండును. శని మహాదశలో శని వృషభరాశియందున్న జాతకునికి ధనలాభము, ధాన్య లాభము, ప్రభుత్వ ఉద్యోగము, ఆధ్యాత్మిక స్వభావము గలవాడగును. శని

మహా దశలో శని మిధునరాశియందున్న జాతకునికి వ్యవసాయమునందు లాభము, ధనలాభము, సోదర, పుత్ర మరణము, తనకు అపాయము సంభవించును. శని మహాదశలో శని కర్కాటకరాశియందున్న జాతకునికి తల్లి తరపునుండి అపాయము, గ్రామాధికారము, కీళ్ళవాతరోగము, బంధనము మొదలగునవి సంభవించును. శని మహాదశయందు శని సింహరాశియందున్న జాతకునికి కళత్ర, సోదర మరణము, అపాయము, బంధనము గ్రామాధికారము గల్గును. శని మహాదశలో శని కన్యరాశి యందున్న జాతకునికి వ్యవసాయ భూముల నాశము, సంపదనష్టము, శత్రుబాధ, సోదరుని తరపున గాయము, మరణము సంభవించును. శని మహాదశలో శనిజనన కాలమునందు తులారాశియందున్న జాతకునికి యొక గుంపుపై అధికారము, సంపద నాశము., కీళ్ళవాత నొప్పులు, తల్లిదండ్రుల మరణము సంభవించును. శని మహాదశలో శని వృశ్చికరాశియందున్న జాతకునికి ఋణములు, పేదరికము, ప్రవాసము పుత్ర మరణము, సంపదనాశము, నేత్రరోగము మొదలగునవి సంభవించును. శని మహాదశలో శని ధనుస్సురాశియందున్న జాతకునికిగొప్పసంపద, గాయములబాధ, తండ్రి, సోదరనాశము, ప్రథమ భాగములో బంధనము సంభవించును. శని మహాదశలో శని మకరరాశియందున్న జాతకునికి ధనలాభము, పట్టణము లేక గ్రామాధికారము, తుదియందు దౌర్భాగ్యము సంభవించును. శని మహాదశలో శని కుంభరాశి యందున్న జాతకుని పుత్రునకు గాయముల వలన అపాయము, సంపద వృద్ధి, గోవులు, గేదెలు, అశ్వములు, గలిగియుండును. శని మహాదశలో శని మీనరాశి యందున్న జాతకునికి దురదృష్టము., ప్రవాసము, తండ్రికి దుఃఖము, ధన, నాశము, వ్యవసాయ భూముల నష్టము వలన పేదరికము, నేత్రరోగము సంభవించును.

సామాన్యముగా శని దశాకాలమునందు జాతకుని దురదృష్టము వలన ప్రతి పనియును క్షీణదశయందుండుట, బంధు విరోధము, అయితే చేపట్టిన కార్యము జయమును పొందుట, కళత్ర, పుత్రనాశము, అపనిందలు, ప్రచారము కొరకు బంధువును చంపుట మొదలగునవి సంభవించును. శని మహాదశా కాలము 19 సంవత్సరములలో, జాతకునికి కీళ్ళవాత రోగము., బంధనము, బంధునాశము, భార్య విరోధముతో పరదేశ గమనము, ఉద్యోగభంగము, మంత్రములయందు ఆసక్తి గల్గియుండును.

శని మహాదశలో శని జనన కాలమున రవితో సంబంధమొందియున్న జాతకునికి ధనవృద్ధి, గల్గునుగాని పుత్రనాశము సంభవించును. కానిరవియున్న స్థానము నుండి 7 - 11 - 4 స్థానమున శనియున్న జాతకునికి పుత్రమరణము సంభవించును. శనిని రవి వీక్షించుచున్న జాతకునికి ధనవృద్ధి గల్గును. శనిని చంద్రుడు -వీక్షించుచున్నను, లేక వానితో సంబంధమొందియున్న జాతకునికి గృహ లాభము, వాహన లాభము గల్గును. శని చంద్రునకు 7 - 11 - 4 స్థానముల యందున్న జాతకుని తల్లి మరణము చెందును. శని బలము గల్గియున్న జాతకునికి భూలాభము, వాహన లాభము గల్గును. శని, కుజునితో సంబంధమొంది యున్నను లేక వానిచే వీక్షించబడుచున్న భూముల వలన కొద్ది లాభము గల్గును

గాని జాతకునికి పేదరికము, గాయములచే బాధ కీళ్ళనొప్పులు గల్గి యుండును. శని మహాదశలో శని బుధునితో సంబంధమొందియున్న జాతకునికి సోదరనాశము, బంధువులకు అపాయము సంభవించును. ఇదియే గాక గాయములు తప్పక జనించుట, శత్రుభయము, పేదరికము సంభవించును. శని మహాదశయందు శని గురునితో సంబంధమొందియున్న జాతకునికి మొదటి దశాభగములో గోవులు, ధాన్య నాశము గలుగును. తరువాత భాగము నందు ధనలాభము, సౌఖ్యము సంభవించును. అదే ఫలము శని, గురువుకు 5 లేక 9 స్థానమునందున్నపుడు జరుగును. శని మహాదశలో శని 7 - 11 - 4 స్థానమునందున్న జాతకుని తండ్రి మరణము పొందవచ్చును. దానితో గూడ శని దశ యందు పుత్రునికి అపాయము సంభవించును., తరువాత జాతకునికి సౌఖ్యము గల్గును. శని మహాదశలో శని శుక్రునితో సంబంధ మొందియున్నను లేక వానివీక్షణము గల్గియున్న జాతకుడు గొప్ప ధనవంతుడగును. గ్రామమునకు పెద్దయై అనేక మంది స్త్రీలను వివాహము చేసుకొనును. శని, శుక్రునకు 4 - 7 - 11 స్థానముల యందున్న జాతకుని భార్య మరణించును.

శని మహాదశయందు శని రాహువు లేక కేతువుతో సంబంధమొందియున్న జాతకునికి చోరులవలన ధనము నశించును. ఇదియే గాక జాతకుడు కామెర్లరోగము మశూచి, కీళ్ళవాతరోగము మొదలగు వానిచే బాధపడుచుండును. శని మహాదశలో శని స్థానబలము గల్గియున్న జాతకునికి సంపదవలన ప్రతిష్ఠ, భార్య, పుత్రుడు, రాజ, చోర, అగ్ని, శత్రుభయము, బంధునాశము, మూలవ్యాధి లేక నేత్రరోగముచే బాధపడుచుండును. శనిమహాదశలో శని పాపషడ్వర్గునందున్న జాతకునికి యెక్కువ భయము, రాజాగ్రహము, ఉద్యోగభంగము, కారాగారవాసము సంభవించును. శని మహాదశలో శని శుభ షడ్వర్గునందున్న జాతకునికి సంతోషము, భార్యాబిడ్డలతో సౌఖ్యము, బంధునాశము సంభవించును. శనిమహాదశలోశని శుభనవాంశయందున్న జాతకునికి సామాన్య సౌఖ్యము, ప్రభువు ప్రత్యేక పారితోషికములు, మంచి ఆభరణములు, వస్త్రములు సంక్రమించును. శని మహా దశలో శని దిగ్బలముగల్గి.. యున్న జాతకునికి అనుకోనటువంటి ప్రదేశములనుండి సౌఖ్యము, సంపద, ప్రతిష్టగల్గును. కాని భూపాతకముచేసిన సొత్తు నష్టమగుట, సోదర, పుత్ర, సేవకుని వదలుకొనుట, బంధువిరోధముగల్గును, శని మహాదశలో శని కాలబలము గల్గియున్న జాతకునికి రాజ, చోర, విష, భార్య, పుత్రభయము, భూమి, వ్యవసాయమువలన లాభము వాహనప్రాప్తి సంభవించును.

**1. శని మహాదశలో శని భుక్తిఫలము**

శని మహాదశలో శని భుక్తియందు శని తన మూలత్రికోణమైన మకరరాశి యందున్నను లేక తన స్వక్షేత్రమైన కుంభరాశియందున్నను లేక తన ఉచ్చక్షేత్రమైన తులారాశి యందున్నను లేక లగ్నమునుండి 4-5-7-9-10-11 స్థానములయందెందు న్నను లేక రాజయోగము నిచ్చు గ్రహముతో సంబంధమొందియున్నను లేక స్వనవాంశ యందున్నను, లేక శుభగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి

ప్రభుత్వ ఉద్యోగము. గొప్పసౌఖ్యము. ప్రభువు అనుగ్రహమువలన సంపాదించిన పని పూర్తిచెయుట. రత్నాభరణ లాభము. తన గృహమునందు వివాహ వేడుకలు. గోవులు. వస్త్రములు. వాహన లాభము. శత్రుజయము. బంధుమిత్రుల ద్వారా లాభము. అధికారము పెంపొందుట. పశ్చిమదిశగా ప్రయాణము. మిత్రులతో సమాగమము. కొద్ది వ్యాపారము. ధైర్యము. బంధుగృహమునందు ఆనందము. బాకీల ద్వారా ధనలాభము. మతసంబంధమైన ప్రసంగములు వినుట. గ్రామములో భూములు. పశువుల లాభము మొదలగునవి సంభవించును.

శని మహాదశలో శని భుక్తియందు శనిలగ్నమునకు 6 - 8 - 12 స్థానముల యందున్నను. నీచరాశియందున్నను. పాపగ్రహముతో సంబంధమొందియున్నను. జాతకునికి ఆయుధ బాధ. విష లేక అగ్ని భయము. రాజదండనవలన ధననష్టము. రక్తము స్రవించుట. ప్లీహరోగము. రక్తగ్రహణి. ఋణముల బాధ. శత్రుభయము. ఉద్యోగ భంగము. మనోవ్యాధి. భార్యాపుత్రుని మరణము. భూములు. యవసాయ నాశము గల్గును. శనిదశామధ్య కాలమునందు చోర భయము. పరదేశ గమనము. మనోవ్యథ సంభవించును. శని మహాదశ తుదియందు జాతకునికిసౌఖ్యము. భూ లాభము గల్గును. శని మహాదశలో శని బుక్తియందు శని ద్వితీయాధిపతిగాని లేక సప్తమాధిపతిగానియైన జాతకునికి అపమృత్యువు సంభవించును.

## 2. శని మహాదశలో బుధ భుక్తిఫలము

శని మహాదశలో బుధ భుక్తియందు బుధుడు లగ్నమునకు త్రికోణము నందుగాని. లేక యేకాదశస్థానమునందుగాని లేక కేంద్రమునందుగాని లేక ద్వితీయ స్థానము నందుగాని లేక స్వక్షేత్రమునందుగాని లేక ఉచ్ఛక్షేత్రమునందుగాని లేక ప్రత్యేక రాశ్యాధిపతితో సంబంధమొందిగాని లేక శుభగ్రహముచే వీక్షించబడి గాని యున్న జాతకునికి జ్ఞానము. సంతోషము. పారితోషికములు. ధనము. స్వస్థలములో సౌఖ్యము వాహనలాభము. యజ్ఞములు. జరుపుట. సౌఖ్యము. రాజభోగము. మంచి శరీర ఆరోగ్యము. అధిక ఆనందము. మనస్సు పట్టుదల. స్వగృహమునందు వివాహ వేడుకలు. రామెశ్వరములో పవిత్రస్నానము. పుణ్యక్షేత్రములకు యాత్రలు. వ్యాపారము నందు లాభము. మతసంబంధమైన ప్రసంగములు వినుట. అన్నదానము మంచి అహారభక్షణ గలవాడుగా నుండును.

శని మహాదశలో బుధ భుక్తియందు. భుక్తినాధుడైన బుధుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను. నీచ క్షేత్రమునందున్నను పాపక్రాంతము చెంది యున్నను. లేక బుధుడు. కుజుడు. రాహువు. లేక రవితో సంబంధమొందియున్నను లేక దశానాధుడైన శనికి. బుధుడు 6 - 8 - 12 స్థానముల యందున్న జాతకునికి రాజ. చోర. అగ్ని బాధ. భార్యాబిడ్డలకు రోగము. సంకెళ్లు. కారాగారము. సంపద నాశము. మనోవ్యథ. భూములు. గ్రామము. గృహనాశము. తిరుగుబాటునకు సరియైన కారణము గల్గియుండుట సంభవించును. భుక్తినాధుడైన బుధుడు ద్వితీయాధి పతిగాని లేక సప్తమాధిపతిగాని యైయున్న జాతకునికి శరీరరోగము సంభవించును.

### 3. శని మహాదశలో కేతు భుక్తి ఫలము

శని మహాదశలో కేతుభుక్తియందు., భుక్తినాధుడైన కేతువు శుభగ్రహముతో సంబంధమొందియున్నను లెక వానిచే వీక్షించబడుచున్నను లేక శుభాంశ యందున్నను లేక శుభషడ్వర్గనందున్నను లేక యోగకారకగ్రహముతో సంబంధ మొందియున్నను లేక లగ్నమునకు కేంద్రమునగాని లేక 3 - 6 - 10 - 11 స్థానముల యందున్నను లేక యీస్థానాధిపతులతో సంబంధమొందియున్న జాతకునికి వివాహ వేడుకలు, భూలాభము, శత్రునాశము, తలపెట్టిన కార్యములు సఫలమగుట, మిత్రుని ద్వారా ఆదాయము, ఆధికారవృద్ధి, రత్నములు, ఆభరణముల లాభము గల్గును.

శని మహాదశలో కేతు భుక్తియందు, భుక్తినాధుడైన కేతువు, దశానాధుడైన శనికి కేంద్రము లేక కోణమునందున్నను లేక లగ్నమునకు 6 - 8 - 12 స్థానముల యందున్నను, జాతకుడు అన్ని విషయములలో అతిశయించియుండును. మంచి స్వభావము, మతసంబంధమైన కార్యములలో శ్రద్ధ గలిగి యుండుట, సౌఖ్యము, ప్రభువుతో మిత్రత్వము, పేదరికము, బంధనము, భయము, ఉద్యోగ భంగము, భార్యాబిడ్డల నాశము సంభవించును.

శని మహాదశలో కేతు భుక్తియందు కేతువు లగ్నాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి సౌఖ్యము, దనలాభము, గంగానదిలో పవిత్ర స్నానము, పవిత్ర దేవాలయముల దర్శనము మొదలగునవి గల్గును. అయితే కేతువు లగ్నము నుండిగాని లేక దశానాధుడైన శని వద్ద నుండిగాని 6-8-12 స్థానముల యందున్న జాతకునికి అపమృత్యువు, చెడుపదార్థభోజనము, చలిజ్వరము, రక్తగ్రహణి, గాయములు, చోరబాధ, భార్యాబిడ్డలనాశము, వితంతువుతో కర్షణ, శత్రువుల బాధ వలన దనవ్యయము సంభవించును. ద్వితీయ లేక సప్తమ స్థానమున కేతువున్న జాతకునికి శరీరమునకు రోగము సంభవించును.

### 4. శని మహాదశలో శుక్ర భుక్తి ఫలము

శని మహాదశలో శుక్రభుక్తియందు., భుక్తినాధుడైన శుక్రుడు ఉచ్ఛ క్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక కేంద్రమున గాని లేక త్రికోణమున గాని యేకాదశ స్థానమునగాని లేక శుభగ్రహముతో సంబంధమొందియున్న జాతకుని కి కళత్రలాభము, పుత్రలాభము, ధనలాభము, మంచి ఆరోగ్యము, గృహమున వివాహ వేడుకలు, ప్రభుత్వ ఉద్యోగము, రాజానుగ్రహము వలన కోరిన వస్తులాభము, పెద్దలు, సాధువులు, జ్ఞానులచే గౌరవించబడుట విదేశ వస్త్రలాభము, శ్వేత అశ్వము, గేదె, గురు గోచారమును బట్టి అదృష్టము, అధిక దనలాభము గల్గును. జాతకుని రాజయోగము శని గోచారమును బట్టి జరుగుచుండును.

శని మహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు 6-8-12 స్థానముల యందున్నను, నీచక్షేత్రము నందున్నను, పాపక్రాంతము చెందియున్నను, శత్రు క్షేత్రము నందున్నను, జాతకుని కళత్రము నశించుట, మనోవ్యధ, ఉద్యోగ భంగము, భార్యతరపు బంధునాశము జనవిరోధము, సంభవించును.

భుక్తినాధుడైన శుక్రుడు, దశానాధుడైన శనికి కేంద్రమునగాని లేక ద్వితీయ స్థానమున గాని లేక యేకాదశ స్థానమున గానియున్న జాతకునికి రాజానుగ్రహము

గల్గి జాతకుడు కోరిన వస్తువులనెల్ల పొందువాడగును. దర్మము, భుక్తి, దయ, పవిత్ర పుణ్యక్షేత్రములు పురావస్తు శాసనములపై వ్యాఖ్యానము వ్రాయుట, పద్య కావ్యములు వ్రాయుట, వేద ప్రసంగములు వినుట, భార్యాబిడ్డల సౌఖ్యము, వాహన లాభము, భూలాభము, గ్రామ, గృహలాభము, వ్యాపారమువలన ధనలాభము, బావులు త్రవ్వుట, వనములు నాటుట, కామసౌఖ్యము, గొప్ప ఆనంద సంగీతము నందు ఆసక్తి, పుత్రజననము, యితర గ్రామములకు ప్రయాణము, బంధు, మిత్ర గౌరవము పొందువాడుగా నుండును.

శని మహాదశలో శుక్రభుక్తియందు, భుక్తినాధుడైన శుక్రుడు శత్రుక్షేత్రము నందున్నను, లేక నీచక్షేత్రమునందున్నను, లేక పాపక్రాంతము చెందియున్నను, లేక 6 - 8 - 12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్నను, జాతకునికి కళత్రనాశము, ధనవ్యయము, ఉద్యోగభంగము, నిరుద్యోగము, పనులలో సంకటనలు, నేత్రరోగము, జ్వరము, మతసంబంధమైన నిబంధనలు విడనాడుట, దంత, దవడనొప్పి, మనోవ్యధ, కీళ్ళవాతము, యెత్తు ప్రదేశమునుండి పడుట, రాజ భయము, నీటిభయము, ప్రభుత్వముతో విరోధము, సోదరులతో సంకటనలు, బంధు మిత్రనాశము మొదలగునవి సంభవించును. భుక్తినాధుడైన శుక్రుడు ద్వితీయ స్థానమునకు గాని లేక సప్తమ స్థానమునకు గాని అది పతియైయున్న జాతకునికి ఋణ బాధ, ఆస్తినష్టము, మనోవ్యధ, అపమృత్యువు మొదలగు దుష్ఫలములు సంభవించును.

## 5 . శని మహాదశలో రవి భుక్తిఫలము

శని మహాదశలో రవి భుక్తియందు., భుక్తినాధుడైన రవి ఉచ్చక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక భాగ్యాధిపతితో కలసి కేంద్రము నందుగాని లేక లాభస్థానమునందుగాని లేక త్రికోణమునందుగాని యున్నను లేక శుభనవాంశ యందున్నను, లేక శుభగ్రహముచే వీక్షించబడుచున్నను లేక శుభ క్షేత్రమునందున్న జాతకునికి వివాహ వేడుకలు, ఆభరణములు, వస్త్రములు, అధికారము నందు జయము, దుష్టశత్రునాశము, గోవులు, ఏనుగులు, అశ్వములు వ్యాపారము వల్ల ధనవృద్ధి, పుత్ర జననము, సుఖజీవనము, పెద్దవారితో మంచి పరిచయము, అడవులు, గ్రామములలో ప్రయాణము, కలప వ్యాపారము, బంధువులలో వివాహ వేడుకలు, దేవాలయ వేడుకలు, బాకీలయందు లాభము, మత సంబంధమైన ప్రసంగములు వినుచుండును.

శని మహాదశలో భుక్తినాధుడైన రవి లగ్నమునుండి గాని లేక దశా నాధుడైన శనియున్న స్థానమునుండి గాని 6 - 8 - 12 స్థానములయందున్నను లేక నీచ క్షేత్రము నందున్నను లేక పాపగ్రహముతో వీక్షించబడుచున్నను, లేక పాప గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి మనోరోగము, అగౌరవము. ఉద్యోగ భంగము, దగ్గర బంధుమరణము, వృత్తినాశము, తండ్రి తరపు మరణము, అధిక ఋణము వలన భయము, జ్వరము, గ్రహణి., ఆత్మ విచారము, బంధనము, రాజా గ్రహము, వ్యాపారమునందు చిక్కులు, మనస్సు కలవరము, పనికిమాలిన భయము మొదలగునవి సంభవించును. రవి ద్వితీయ, లేక సప్తమ స్థానమునకు అధిపతియై యున్న జాతకునికి శరీరమందు రోగము సంభవించును.

## 6. శని మహాదశలో చంద్ర భుక్తిఫలము

శని మహాదశలో చంద్ర భుక్తియందు., చంద్రుడు గురునిచే వీక్షించబడు చున్నను, లేక ఉచ్ఛక్షేత్రమునందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక కేంద్రము లేక కోణము నందున్నను, లేక లాభస్థానమునందుగాని లేక పూర్ణచంద్రుడుగా గాని లేక శుభ గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి రాజానుగ్రహమువలన పారితోషికములు, స్వంత గ్రామమునకు ప్రయాణము, వివాహవేడుకలు, బంధు సమాగమము, మైమరచిన ఆనందము, అపమృత్యువు నుండి కోలుకొనుట, మాతాపిత సౌఖ్యము, భూలాభము, వ్యవసాయ లాభము, భార్య గర్భిణిగా యుండుట, అన్ని విధముల సంతోషము, రత్న, ఆభరణ, వాహన లాభము గలుగును.

చంద్రభుక్తియందు చంద్రుడు క్షీణదశయందుండి పాపగ్రహముతో సంబంధ మొందిగాని లేక పాపగ్రహముచే వీక్షించబడిగాని యున్నను లేక నీచ క్షేత్రము నందున్నను, లేక పాపాంశయందున్నను లేక పాపక్షేత్రము నందున్నను జాతకునికి అనేక కష్టములు సంభవించుట, రాజాగ్రహము, ధననాశము, తల్లి, తండ్రి, భార్య మరణము, అతి వ్యయము, అకాల భోజనము, మందులు సేవించుట మొదలగునవి సంభవించును. చంద్ర భుక్తి ప్రారంభదశలో జాతకునికి ఆదాయము సౌఖ్యము గల్గి యుండును.

దశానాధుడైన శనికి భుక్తినాధుడైన చంద్రుడు కేంద్రమునగాని లేక కోణమున గాని లేక లాభస్థానమునందుగాని యున్న యెడల జాతకునికి గోవులు, వస్త్రములు, ధనవృద్ధి, మంచిమిత్రుని ద్వారా కోరిన కార్యము నెరవేరుట, సంతోషము, తృప్తి గల్గును. దశానాధుడైన శనికి చంద్రుడు 6 - 8 - 12 స్థానముల యందున్నను, లేక నీచస్థానము నందున్న జాతకునికి దీర్ఘరోగము, సోమరితనము, మంచి వృత్తి నాశము, శత్రువృద్ధి, విరోధము, బంధు విరోధము, తీరనిఋణములు, బంధనము, రాజభయము సంభవించును. భుక్తినాధుడైన చంద్రుడు ద్వితీయాధిపతిగాని లేక సప్తమాధిపతి గాని లేక అష్టమాధిపతిగాని యైయున్న జాతకునికి అపమృత్యువు, రోగ బాధ మొదలగునవి సంభవించును.

## 7. శని మహాదశలో కుజ భుక్తిఫలము

శని మహాదశలో కుజభుక్తియందు., భుక్తినాధుడైన కుజుడు ఉచ్ఛక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రమునందున్నను, లేక తన మూలత్రికోణమైన మేషరాశి యందున్నను, లేక తృతీయ లేక లాభస్థానమునందున్నను లేక కేంద్రమున గాని కోణమునగాని లేక మిత్రక్షేత్రమునగానియున్న జాతకునికి రాజ పారితోషికముల శోభ, ప్రభుత్వ ఉద్యోగమునందు ప్రవేశము, శత్రునాశము, వ్యాపారము వలన ధనవృద్ధి, సంపద, గోవులు, అశ్వముల లాభము, సోదర వివాహవేడుకలు, యుద్ధ పటాలమునకు నాయకత్వము, రాజ వైభవము, భూములు, వ్యవసాయ పొలములు గోవులు, ధాన్యము మొదలగువాని వృద్ధి, నూతన విద్యాకేంద్ర స్థాపితము, సోదర కుటుంబ సౌఖ్యము, బావుల నిర్మాణము, తోటలు, వనములను వేయుట, భూ లాభము పుత్రజననము, నూతన ఉద్యోగమునందు ప్రవేశము, వైద్య విద్యపై ప్రసంగములు చేయుట మొదలగునవి సంభవించును.

శని మహాదశలో కుజ భుక్తియందు, భుక్తినాధుడైన కుజుడు నీచక్షేత్రము నందున్నను, లేక పాపక్రాంతము జెందియున్నను, లేక 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్నను, లేక పాపగ్రహ వీక్షణము గల్గియున్న జాతకునికి ధాన్యనష్టము, గడ్డలు, గాయములు, ఆయుధములు, సర్పము చోరులవల్ల భయము, అనారోగ్యము, కష్టము ఫలించకపోవుట, అపార్ధములు, రాజాగ్రహము, సోదరుని తరపు నుండి సంకటనలు, తండ్రి తరపు బంధువులతో విరోధము, జ్వరము, గ్రహణి, ఋణబాధలు, పశునాశము, చెడుపదార్ధ భోజనము, ప్రవాసము, అనేక విధముల ధనవ్యయము, అవమానము మొదలగునవి సంభవించును. భుక్తినాధుడైన కుజుడు ద్వితీయ లేక సప్తమ లేక అష్టమ స్థానాధి పతియైన జాతకునికి అపమృత్యువు, అనేక కష్టములు, అవమానము గలుగును.

## 8. శని మహాదశలో రాహు భుక్తిఫలము

శని మహాదశలో రాహు భుక్తియందు జాతకునికి సంకటనలు, పోట్లాటల వలన మనోవ్యధ, శరీర బాధ, అపార్ధములు, పుత్రునితో విరోధము, ప్రవాసము, మనస్సునకు బాధ, భూములు, గృహనాశము, రాజచోర ఆయుధ భయము, తల్లి మరణము, శత్రుభయము, దక్షిణ ఆగ్నేయ దిశలయందు ప్రయాణము చేయునపుడు కార్యభంగము, యంత్రము, సర్పము, అగ్నివలన మరణము, పశునాశము సంభవించును.

శని మహాదశలో రాహుభుక్తియందు, భుక్తినాధుడైన రాహువు పాప గ్రహములతో సంబంధమొందియున్న జాతకునికి ప్రభుత్వ శిక్షవలన ధననాశము గల్గును. రాహుభుక్తియందు రాహువు పంచమాధిపతితో సంబంధమొందియున్న జాతకునికి మనోరోగము, తన పుత్రునితో విరోధము సంభవించును. రాహుభుక్తి యందు రాహువు గురునితో సంబంధమొందియున్నను లేక వానితో వీక్షించ బడుచున్న జాతకునికి యాత్రాసుఖము గల్గును.

శని మహాదశలో రాహుభుక్తియందు, బుక్తినాధుడైన రాహువు లగ్నాది పతితో గాని లేక యోగ కారకునితో గాని సంబంధమొందియున్నను, లేక తన ఉచ్ఛక్షేత్రమైన వృషభరాశియందున్నను, తన స్వస్థానమైన కన్యరాశి యందున్నను లేక వాని దశానాధుడైన శనియున్న స్థానమునుండి కేంద్రమునగాని లేక యేకాదశ స్థానమున గాని యున్న జాతకుని రాహుభుక్తి ప్రధమ భాగమున సౌఖ్యము, ధనవృద్ధి, గృహవృద్ధి, భూలాభము, దేవతలు, బ్రాహ్మణులను పూజించుట, పవిత్రమైన పుణ్యక్షేత్రములకు యాత్ర, పశువృద్ధి, యింటియందు వివాహవేడుకలు సంభవించును. రాహుభుక్తి మధ్యకాలములో జాతకునికి రాజభయము, స్నేహితులు పుత్రునితో సంకటనలు గల్గును.

శని మహాదశలో రాహుభుక్తియందు, రాహువు మేషము, వృషభము, కర్కాటకము, సింహము, కన్య, ధనుస్సు, మీనరాశులయందున్న జాతకుడు మితిలేని సంపద గలవాడగును. రాజ పారితోషికములు, వస్త్రములు, ఆభరణములు, వాహన లాభము, ప్రయత్నించిన పనుల యందు జయము, వ్యాపారమువల్ల ధనవృద్ధి, గృహమున వివాహవేడుకలు, శ్రేష్ఠమైన అలంకారములు, ప్రభువు సహాయముతో అనుకున్న దుశ్కృత్యము సఫలము చేయువాడగును. రాహుభుక్తి

యందు రాహుగ్రహము ద్వితీయ లేక సప్తమ స్థానమునందున్న జాతకునికి శరీర బలహీనత సంభవించును.

**9. శని మహాదశలో గురు భుక్తి ఫలము -**

శని మహాదశలో గురుభుక్తియందు. భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు కేంద్రమునందు గాని లేక త్రికోణము నందు గాని లేక లాభస్థానము నందుగాని లేక లగ్నాధిపతితో సంబంధమొంది గాని లేక స్వక్షేత్రము నందు గాని ఉచ్చక్షేత్రము నందుగాని యున్న జాతకునికి అనుకున్న కార్యములన్నియు సఫలములై సౌఖ్యము సంతోషము గలుగ జేయును. ఒక మిత్రుని ద్వారా సంపద గల్గుట. వాహనములు. ఆభరణములు. పెద్దలు. సాధువుల నుండి పారితోషికములు. రాజ బహు మానములు. జ్ఞానులతో సహవాసము. దేవ. గురుభక్తి. నూతన వస్త్రలాభము. భార్యా బిడ్డల సౌఖ్యము. వివాహ వేడుకలు సంభవించును.

శని మహాదశలో గురు భుక్తి యందు. భుక్తినాధుడైన గురుడు జాతకుని జనన కాలమున దశానాధుడైన శనికి కేంద్రము నందుగాని లేక కోణము నందుగాని లేక లాభస్థానము నందుగాని యున్న జాతకునికి వివాహ వేడుకలు. ఉద్యోగ లాభము. వ్యవసాయ భూముల పంటయందు లాభము. వేదపాఠశాల నిర్మాణము. యజ్ఞము. గురు దైవములపై భక్తి. సంపదవృద్ధి. వేద ప్రసంగములు వినుట. వేడుకలు. కామసుఖము. రాజగౌరవము. భోజన సౌఖ్యము. మత సంబంధమైన కార్యములు. ధనవృద్ధి. పశ్చిమదిశ నుండి భార్య. బంధువులు గల్గుదురు.

శని మహాదశలో గురు భుక్తి యందు. భుక్తినాధుడైన గురుడు 6-8-12 స్థానముల యందున్నను. లేక నీచస్థానము నందున్నను. లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి రక్తసంబంధమైన దగ్గర బంధువు మరణించుట. ధన ధాన్యనాశము. ప్రభుత్వ అధికారుల కోపము. ప్రతి పని యందు అడ్డంకులు. అపజయము. ప్రవాసము. కుష్ఠురోగము సంభవించును.

శని మహాదశలో గురు భుక్తి యందు. భుక్తినాధుడైన గురుడు దశానాధుడైన శనికి 6-8-12 స్థానముల యందున్న జాతకునికి బంధువిరోధము. మనోవ్యథ. బ్రాహ్మణుల వలన ఉద్యోగ మార్పు. చెడుపదార్థ భోజనము. కార్య భంగము. ప్రభుత్వ శిక్ష వలన సంపదనాశము. కారాగార వాసము. భార్యాపుత్రుని వలన దుఃఖము. ప్రవాసము. ప్లీహరోగబాధ సంభవించును. శని మహాదశలో గురు భుక్తి యందు గురుడు ద్వితీయాధిపతి గాని లేక సప్తమాధిపతిగానియై యున్న జాతకునికి శరీర అస్వస్థత. మనోవ్యధ. ఋణబాధ. కార్యభంగము. మరణము సంభవించును.

## 7. బుధ మహాదశ ఫలములు

బుధ మహాదశలో బుధుడు జాతకుని జననకాలము నందు కన్యారాశిలో తన పరమోచ్చ స్థానమైన 15 భాగల యందున్న జాతకుడు తన దశాకాలములో రాజకార్య ధురంధరత్వమునకు. జ్ఞానమునకు గౌరవింపబడు వాడుగా నుండుట. సౌఖ్యము. ప్రజాతంత్ర రాజ్యమునకు నాయకుడుగను. భార్యాబిడ్డలు. భూములు. సంపద గలవాడుగా నుండును. బుధమహాదశలో బుధుడు ఉచ్చ స్థానము నందున్న

జాతకునికి ఆధిక్యము, సంపద, శరీర ఆరోగ్యము, ధాన్యము, బిడ్డలు, గోవులు, అశ్వములు, యేనుగులు, సంగీత సామానులు, సామాన్య సౌఖ్యము గలిగి యండును. బుధ మహాదశలో బుధుడు యింకొక ఉచ్చ యందున్న గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి మంచి అదృష్టము, జ్ఞానము, వ్యాపారము, గోవులు, భూములు, మంచి సౌఖ్యము గలుగ జేయును.

బుధ మహాదశలో బుధుడు నీచక్షేత్రము నందున్న జాతకునికి కొద్ది జ్ఞానము, బంధు మరణము, ఉద్యోగ భంగము, బంధువులతో విరోధము, ప్రవాసము, బాధ మొదలగునవి సంభవించును. బుధ మహాదశలో బుధుడు నీచ గ్రహములతో సంబంధ మొందియున్న జాతకునికి దురదృష్టము, గొప్ప విపత్తులు, ఉద్యోగ భంగము, కార్యనాశము, బంధునాశము, మనోవ్యధ గల్గును. బుధ మహాదశలో బుధుడు అధిమిత్ర క్షేత్రము నందున్న జాతకుడు ఆధిక్యత గలవాడై రాజ స్నేహమును పొంది ధనము, భార్య, బిడ్డలతో సౌఖ్యమును పొందును. బంధు వర్గము నుండి బహుమతులు పొందగల్గును. బుధ మహాదశలో బుధుడు మిత్ర క్షేత్రము నందున్న జాతకునికి ధనవృద్ధి, సౌఖ్యము, బిరుదులను పొంద గల్గును. బుధ మహాదశలో బుధుడు సమక్షేత్రము నందున్న జాతకుడు సంపద, ధాన్యము, బిడ్డలు, ప్రభుత్వ ఉపవేతనము వలన సౌఖ్యము పొందు వాడగును. కాని జ్ఞానము క్షీణించుట, కార్యభంగము శరీరముపై గాయముల బాధ సంభవించును.

బుధ మహాదశలో బుధుడు శత్రు క్షేత్రము నందున్న జాతకునికి రాజా గ్రహము, జ్ఞానము క్షీణించుట, పరీక్షతప్పుట, కులమునకు తగనిపని, చెడుపదార్ధ భోజనము, ధననాశము, భార్యాబిడ్డల నాశము సంభవించును. బుధ మహాదశలో బుధుడు అధిక శత్రు క్షేత్రము నందున్న జాతకునికి అపాయము; మహావిపత్తు, దుఃఖము, ఉద్యోగ భంగము, బంధువిరోధము పితృతర్పణలకు అడ్డంకులు, మంచి కార్యనాశనము సంభవించును. బుధ మహాదశలో బుధుడు జాతకుని జననకాలము నందు నీచక్షేత్రము నుండి ఉచ్చక్షేత్రమునకు ఆరోహణ యందున్న జాతకుడు గొప్పగా యజ్ఞములు చేయుట, గోవులు, యెద్దులు, అశ్వములు, వాహనములు, ఆభరణములు, వస్త్రములు గలిగి యుండుట, మంచి పదార్ధ భోజనము, ధాన్యము, ధనము, వ్యాపారము వల్ల సంపద, కనికర స్వభావము గలవాడుగ నుండును. బుధ మహాదశలో బుధుడు ఉచ్చక్షేత్రము నుండి నీచక్షేత్రమునకు పోవుచూ అవరోహణ యందున్న జాతకునికి అనేక కష్టములు, దుఃఖము, జ్ఞానము క్షీణించుట, పరస్త్రీల సహవాసము, రాజ, చోర, అగ్ని, బాధలు సంభవించును.

బుధ మహాదశలో బుధుడు జాతకుని జననకాలము నందు మూల త్రికోణము నందున్న జాతకునికి రాజ్యలాభము లేక గొప్ప హోదాగల ఉద్యోగము, అతిసౌఖ్యము, పవిత్రమైన గ్రంథములు చదువుట వలన సంతోషము, యెక్కువ జ్ఞానము, అనుభవము, నీతిదాయకమైన మనో పవిత్రత గలిగిన వాడుగా నుండును. బుధమహాదశలో బుధుడు జాతకుని జనన కాలమున స్వక్షేత్రము నందున్న జాతకునికి ధనధాన్యాభి వృద్ధి, మంచి వ్యాపారము, గోవులు, భూములు, పుత్రులు, కళత్రము, సంపద, మంచి ఆహారము, పానీయము, నూతన వస్త్రములు, ఆభరణములు గల్గును. బధ మహాదశలో బుధుడు లగ్నమునకు కేంద్రము నందున్న

జాతకునికి రాజ గౌరవము, స్నేహము, ధనము, కళత్రము, బిడ్డలు, సంతోషము, మంచి ఆహారము, పానీయము, పరుపులు, వస్త్రములు, ఆభరణములు, మత సంబం ధమైన వేడుకలు గల్గును.

బుధమహాదశలో బుధుడు జాతకుని జననకాలము నందు లగ్నము నందున్న జాతకునికి రాజగౌరవము, జయము, వ్యవసాయపు పంట అభివృద్ధి, వేడుకలు, పవిత్ర యాత్రలు, ప్రపంచకీర్తి గల్గును. బుధ మహాదశలో బుధుడు ద్వితీయ స్థానమునందున్న జాతకునికి జ్ఞానాభివృద్ధి, మంచి ప్రతిష్ట, అదృష్టము, న్యాయ స్థానమున ప్రభువుతో సమానమైన గొప్ప అధికారము గల్గియుండును. బుధ మహాదశలో బుధుడు తృతీయ స్థానము నందున్న జాతకుడు బుద్ధి హీనుడును, పెద్దగా పాడువాడును, అజీర్ణము కడునొప్పి గలవాడై రాజగౌరవము పొందును. బుధ మహాదశలో బుధుడు నాల్గవ స్థానము నందున్న జాతకునికి గృహనాశము, ధాన్య నాశము, శరీరపీడ, మరణము, ఉద్యోగ భంగము, వృత్తినాశము సంభవించును. బుధమహాదశలో బుధుడు పంచమ స్థానము నందున్న జాతకుడు కోపస్వభావము గలవాడును, అనేక కష్టములు పొందువాడును, కొద్ది వృత్తితో జీవనము గడుపుకొను వాడును, ప్రభుత్వ సేవకుడు ధనమును వృద్ధి జేసుకొను వాడగును. బుధమహాదశలో బుధుడు జాతకుని జనన కాలమున 6-8-12 స్థానముల యందెందైయనా యున్న జాతకునికి చర్మరోగములు, మడిమెలలో గడ్డలు, పైత్యరోగము, రక్తహీనత, అలసట, రాజ, చోర, అగ్ని వలన మరణము చెందును.

బుధ మహాదశలో బుధుడు భాగ్య స్థానము నందున్న జాతకునికి అదృష్టము వృద్ధిజెందుట, కళత్ర లాభము, పుత్రధనలాభము, పవిత్ర యాత్రా స్థలములు, యజ్ఞములు, మత సంబంధమైన వేడుకలు గల్గి యుండును. బుధ మహాదశలో బుధుడు రాజ్య స్థానము నందున్న జాతకుడు ప్రభువులలో ఉన్నతమైన వాడుగా, యెక్కడకు వెళ్ళిన స్వాగతములు పొందువాడును, దేవతలను, బ్రాహ్మణులను పూజించువాడును, సౌఖ్యము, రాజ్యలాభము, ప్రజాతంత్ర రాజ్యము ప్రకటించువాడును, కాలానుకూలముగా నడుచు కొనువాడును. యజ్ఞ క్రతువులు చేయువాడుగా యుండును. బుధ మహాదశలో బుధుడు లాభస్థానము నందున్న జాతకునికి అనేక విధముల ధనలాభము, వ్యాపారము వలన గాని లేక భూములలో పంట వలన గాని, లేక ప్రభువు వలన పారితోషికములు, బహుమతుల వలన గాని ధనలాభము పొందగల్గును. బుధ మహాదశలో బుధుడు ద్వాదశ స్థానము నందున్న జాతకుడు అంగవైకల్యము గలవాడును, రాజాగ్రహము, భార్యాబిడ్డలు, బంధువులతో విరోధము సర్వత్ర పొరపాట్లు, ఆకస్మిక మరణము సంభవించును.

బుధ మహాదశలో బుధుడు జాతకుని జనన కాలము నందు పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకుడు పాపపు పనులు చేయువాడును, సంపద, భార్యా, బిడ్డలు, వ్యవసాయ భూములు, పశువులను పోగొట్టుకొను వాడగును. బుధుడు పాపగ్రహముచే వీక్షించబడుచున్న జాతకునికి వ్యవసాయ పంట క్షీణించుట, బంధువుల మరణము, ప్రవాసము, వృత్తి నాశము, సేవకులకు సహాయపడుట వలన కలతలు, కష్టములు సంభవించును.

బుధ మహాదశలో బుధుడు శుభ గ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి అతిసౌఖ్యము, రాజ్యలాభము, సంతోషము, భార్యాబిడ్డల సౌఖ్యము సంభవించును. బుధుడు శుభగ్రహముతో వీక్షించబడుచున్న జాతకునికి సంతోషము, రాజగౌరవము, జ్ఞానవృద్ధి, శోభ, ప్రఖ్యాతి సంభవించును. బుధ మహాదశలో బుధుడు ఉచ్చాంశ యందున్న జాతకునికి ఆభరణములు, పుత్రులు, గొప్ప మనోబుద్ధి, దివ్యమైన పరమానందము, తీవ్రత, సంతోషము, ధైర్యము, అభిషేకము పొందువాడుగా యుండును.

బుధ మహాదశలో బుధుడు నీచాంశ యందున్న జాతకుడు నీచపు పనులతో జీవనము గడుపుకొను చుండుట, బానిసత్వము, నలుగురితో నవ్వబడుట మొదలగు దుష్ఫలములు గలుగు. బుధ మహాదశలో బుధుడు పాపద్రేక్కాణము నందున్న జాతకునికి రాజ, చోర, అగ్ని వలన భయము, ఉద్యోగ భంగము, అమిత భయము సంభవించును. బుధ మహాదశలో బుధుడు ఉచ్చస్థానము నందుండి నీచలో నవాంశ యందున్న జాతకునికి రాజభ్రష్టత్వము లేక ఉద్యోగ భంగము, అప్రతిష్ట, అసౌఖ్యము గలుగును. బుధుడు నీచస్థానము నందుండి ఉచ్చలో నవాంశ యందున్న జాతకుడు ప్రథమ దశలో అసౌఖ్యము, తరువాత దశలో సౌఖ్యము పొందు వాడుగును.

బుధ మహాదశలో బుధుడు వక్రించి యున్న జాతకునికి అదృష్టము, భార్యపుత్రుడు, ధనము, సముద్ర స్నానము, మతసంబంధమైన పుస్తకములు పంచిపెట్టు చుండును. బుధ మహాదశలో బుధుడు, రవిచే కాంతి హీనము లేక అస్తంగతుడై యున్న జాతకునికి అనేక విధములైన అపాయములు, మనోవ్యధ, రాజాగ్రహము, భయము, అవమానము, నేత్ర కర్ణబాధలు మొదలగునవి సంభవించును. సామాన్యముగా బుధ మహాదశ ప్రారంభము నందు జాతకుడు, ధనము, ధాన్యము మొదలగునవి సంపాదించుట, మధ్యకాలములో రాజ పారితోషికములను పొందుట, తుది దశ యందు బంధు విరోధము సంభవించును.

బుధ మహాదశ యందు జాతకుని జననకాలమున బుధుడు మేషరాశి యందున్న జాతకునికి శత్రుభయము, అపాయము, గాయములు, రోగములు, పేదరికము మొదలగునవి సంభవించును. బుధ మహాదశలో బుధుడు వృషభరాశి యందున్న జాతకునికి కొద్దిధనము, దానికి తగినట్లు కొద్ది వ్యయము, జ్ఞానము సంపాదించుకొనుట, ఋణములు, ధర్మ కార్యములు, నేత్రరోగము సంభవించును. బుధ మహాదశలో బుధుడు మిధునరాశి యందున్న సోదర సౌఖ్యము, వ్యవసాయము వలన కొద్ది ధనధాన్య లాభము, కొద్ది సౌఖ్యము, అపాయము, శత్రుభయము సంభవించును. బుధ మహాదశలో బుధుడు కర్కాటరాశి యందున్న జాతకునికి బంధువులతో శాశ్వితమైన కలతలు, తల్లి మరణము, రోగములు, విద్య విషయమైన తర్కములు, వాహన ప్రాప్తి సంభవించును. బుధ మహాదశలో బుధుడు సింహ రాశి యందున్న జాతకునికి రాజ్యలాభము, అదృష్టము, సౌఖ్యము, కాని గాయములచే బాధ, భార్యా విరోధము సంభవించును. బుధ మహాదశలో బుధుడు కన్యరాశి యందున్న జాతకునికి రాజభయము, అశ్వము, భార్య మరణము, ఆకస్మిక ప్రమాదము, గాయములు రోగబాధ సంభవించును.

బుధ మహాదశలో బుధుడు తుల రాశి యందున్న జాతకునికి పుత్ర మరణము లేక ప్రమాదము, వ్యవసాయ పంట క్షీణించుట, ధననాశము శత్రు భయము, సమావేశములలో జయము గల్గును. బుధ మహాదశలో బుధుడు వృశ్చిక రాశి యందున్న జాతకునికి సోదర మరణము, ప్రమాదము, గాయములు, రాజ న్యాయస్థానము వల్ల భయము, కొద్ది సౌఖ్యము గల్గును. బుధ మహాదశలో బుధుడు ధనుస్సు రాశి యందున్న జాతకునికి ధనధాన్య లాభము, సౌఖ్యము, శత్రుభయము, ఋణపడుట, గొప్ప కష్టము, తండ్రి మరణము సంభవించును. బుధ మహాదశలో బుధుడు మకరరాశి యందున్న జాతకునికి సోదరసౌఖ్యము, కార్యభంగము, నీలాపనిందలు, పేదరికము, గాయములు గలుగును. బుధమహాదశలో బుధుడు కుంభరాశీ యందున్న జాతకునికి శత్రుభయము, ఆస్తినాశము, నేత్ర రోగము, దశా మధ్యకాలము నందు ధన ధాన్యాభివృద్ధి కలుగవచ్చును. బుధ మహాదశలో బుధుడు మీనరాశి యందున్న జాతకునికి అప్రతిష్ఠ, ధననాశము, పాప భూయిష్టమైన ప్రదేశము నందు నివాసము, అంగవైకల్యము సంభవించును.

బుధ మహాదశలో బుధుడు, రవితో సంబంధమొందియున్నను లేక బుధుని వీక్షించుచున్న జాతకునికి తల్లికి మరణము లేక ప్రమాదము సంభవించును. బుధ మహాదశలో బుధుడు, కుజునితో సంబంధమొంది గాని, లేక వానిచే వీక్షించబడి గాని యున్న జాతకుడు వాతరోగియై యుండును. బుధమహా దశలో బుధుడు, గురునితో వీక్షించబడు చున్నను లేక వానితో సంబంధమొంది యున్న జాతకునికి ప్రారంభ దశలో అన్ని విధముల లాభము చేకూరును. కానితుది దశ యందు అన్ని విధముల నష్టము గల్గును. ఇదియేగాక తన శత్రువుతో భూమికి సంబంధించిన తగవు యొకటుండును. పుత్ర జననము గూడ సంభవించును. బుధ మహాదశలో శుక్రునిచే వీక్షించబడుచున్నను లేక వానితో సంబంధమొంది యున్న జాతకుని భార్య అనారోగ్య వంతురాలుగా యుండును. బుధ మహాదశలో బుధుడు, చంద్రునితో సంబంధమొంది యున్న జాతకునికి కొద్ది లాభము, కొద్ది సౌఖ్యము గల్గును. బుధ మహాదశలో బుధుడు, రాహువుతోగాని, కేతువుతోగాని, వీక్షించబడు చున్నను లేక వానితో సంబంధమొంది యున్న జాతకునికి యింటిలో దొంగతనము, అపోహలు శత్రుభయము, ప్రమాదములు, పాండు రోగము సంభవించును. సాధారణముగా బుధుడు తన దశాకాలము నందు జాతకునికి పట్టాభిషేకము వలన సౌఖ్యము, భార్యాబిడ్డల ప్రేమానురాగములు, తలచిన పని సఫలమగుట, జ్ఞానవృద్ధి, ఆభరణములు, ధనము, భాగ్యము గల్గును.

బుధ మహాదశలో బుధుడు స్థాన బలము గల్గి యున్న జాతకునికి ప్రతిష్ఠ, రాజ్యము లేక ఉద్యోగము, గొప్ప సంతోషము, యజ్ఞవేడుకలు, సౌఖ్యము, ఆత్మ, విశ్వాసము గలిగి యుండును. బుధ మహాదశలో బుధునికి స్థానబలము లేనియెడల జాతకునికి భార్యాపుత్ర ఉద్యోగ భయము, ప్రావాసము వలన బాధ, పాపపు పనులకు తలవంపులు, అవమానము సంభవించును. బుధ మహాదశలో బుధుడు దిగ్బలము గల్గియున్న జాతకుడు యింకొక ప్రదేశము నుండి సంపాదించిన లాభము వలన ధనవంతుడగుట, జ్ఞానము, శత్రుత్వము గలవారితో యున్న ప్రభువుతో స్నేహము, లాభములు, సువాసనలు ద్రవ్యములు, దండలు, మొదలగు

తృతీయ స్థానమునందున్న జాతకునికి గృహాభివృద్ధి, గోవస్త్ర లాభము, సుఖమైన భోజనము, ధర్మకార్యములు, జపపూజాదులు సంభవించును. గురుభుక్తి అంత్య దశలో జాతకునికి శరీరబాధ, రాజాగ్రహము వలన రెండు నెలల కారాగారము, పెద్దసోదరుని మరణము, తల్లిదండ్రులకు అనారోగ్యము, బాధ సంభవించును. దశానాథుడైన రాహువునకు గురుడు 6-8-12 స్థానముల యందున్నను లేక పాప గ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి శరీర బాధ, ధననష్టము గలుగును. ద్వితీయ లేక సప్తమ స్థానమునకు గురుడు అధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**3. రాహు మహాదశలో శని భుక్తి ఫలము**

రాహు మహాదశలో శని భుక్తియందు, భుక్తినాథుడైన శని లగ్నమునకు కేంద్రమునందున్నను, లేక కోణమునందున్నను, లేక తన వుచ్చక్షేత్రమైన తులారాశి యందున్నను, లేక తన మూలత్రికోణమైన కుంభరాశియందున్నను, లేక తృతీయ లేక యేకాదశ స్థానమునందైనను, లేక శుభనవాంశ లేక శుభవర్గునందైనను లేక దశానాథుడైన రాహువునకు కేంద్రమందున్న జాతకునికి వాహనములు, లేక సేవజేయుట వలన రాజగౌరవము, సౌఖ్యము, వివాహవేడుకలు, వ్యాపారవృద్ధి వలన లాభము, వుద్యోగము కొరకు ప్రయత్నము, చెరువులు, త్రవ్వించుట, గౌరవనీయుడైన తక్కువ జాతి వాని వలన కోరిన లాభము పొందుట, యొక పెద్ద మనుష్యుని వలన ధననష్టము, శరీరమునకు అలసట, దానివలన లాభము, గృహమునకు తిరిగి వచ్చుట సంభవించును.

రాహు మహాదశలో శని భుక్తియందు శని నీచ క్షేత్రమునందున్నను, లేక శత్రుక్షేత్రమునందున్నను, లేక అష్టమ లేక ద్వాదశ స్థానములయందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి రాజభయము, భార్య, బిడ్డల అనారోగ్యము, మిత్రునితో అపార్థములు, తండ్రి తరపు బంధువులతో కలతలు, యొకరు చనిపోయిన సమాచారము వినుట, ధాన్యనాశము, అగౌరవము, తల్లి దండ్రుల మరణము, అధికవ్యయము, రాజాగ్రహము, వుద్యోగభంగము, అగ్నిలో నడుచుట, వాతము జలుబు వలన అనారోగ్యము, ఆకస్మిక తగవులు సంభవించును.

దశానాథుడైన రాహువునకు భుక్తినాథుడైన శని 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొందియున్న జాతకునికి వుద్యోగము, అవమానము, వివాహవేడుకయందు శత్రువునివలన బాధ, విదేశనివాసము, ప్లీహ రోగము, చెడుపదార్థభోజనము, కులభేదము వలన భయము, శని ద్వితీయ, సప్తమ స్థానాధిపతియైయున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**4. రాహుమహాదశలో బుధ భుక్తి ఫలము -**

రాహు మహాదశలో భుక్తినాథుడైన బుధుడు లగ్నమునకు కేంద్రములేక కోణము నందున్నను, లేక వుచ్చయందున్నను లేక స్వక్షేత్రమునందున్నను, లేక లగ్నాధి పతియైన శుభునితో కలసియున్నను లేక శుభనవాంశయందున్నను లేక శుభ షడ్వర్గునందున్న జాతకుడు రాజయోగ సంబంధమైన ఫలములను పొందుచూ వివాహ వేడుకలు జరుపుట, వ్యాపారములో ధనార్జన, జ్ఞానము, వాహన సౌఖ్యము

పశువులు, పండుగ వేడుకలయందు ఆశక్తి, బుధవారములయందుగొప్ప సౌఖ్యము
పశువులు, పండుగ వేడుకలయందు ఆశక్తి, బుధవారములయందు గొప్ప సౌఖ్యము
ప్రభు సన్మానము, సుగంధ సౌఖ్యము, కామసుఖము, శోభ, సంపద, రాజాను గ్రహము వలన ప్రతిష్ట సంభవించును దశానాధుడైన రాహువునకు బుధుడు కేంద్రము నందున్నను, లేక యేకాదశ, లేక తృతీయ లేక నవమ, లేక దశమస్థానము నందున్న జాతకునకు మంచి ఆరోగ్యము, మనోవికాసము, సంతోషము, కోరిన వస్తువులు సంపాదించుట, పవిత్రమైన మనస్సు, మతసంబంధమైన ప్రసంగములు వినుట, వివాహములు వేడుకలు జరుపుట, మతము, ధర్మము, భక్తి, వుదారము, ఆకర్షణీయమైన నూతన గృహనిర్మాణము, బంధువులకు సహాయము చేయువాడుగా యుండును.

రాహు మహాదశలో బుధ భుక్తియందు, బుధుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచ క్షేత్రమునందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్నను, లేక పాపగ్రహముచే వీక్షించబడుచున్నను, లేక పాపనవాంశయందున్న జాతకునికి వుద్యోగభంగము, అధికారనష్టము, అపార్థములు, శరీరబాధ, గొప్ప ద్వేషము, గృహనాశము, బంధువిరోధము, భార్యాబిడ్డల అసౌఖ్యము, వుబ్బసరోగము లేక ప్లీహరోగము, దేవతలను, బ్రాహ్మణులను దూషించుట, అదృష్టము, సౌఖ్య హీనము, అబద్ధములు, క్రూరమైన తెలివితేటలు, అగ్ని వలన నష్టము, చోర, రాజ భయము, ఆకస్మిక బాధలు, గురువు, పుత్రునియొక్క మరణము, అధిక వ్యయము, రాజాగ్రహము గల్గును, బుధ భుక్తియందు బుధుడు ద్వితీయ, సప్తమాధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**5. రాహుమహాదశలో కేతు భుక్తి ఫలము -**

రాహు మహాదశలో కేతు భక్తియందు భుక్తినాధుడైనకేతువు కేంద్రమునందు గాని లేక కోణమునందుగాని లేక భావాధిపతితో సంబంధమొందియున్న జాతకునికి బంధుసన్మానము, వాహనసౌఖ్యము, భూలాభము, సుగంధ పరిమళ ద్రవ్యప్రాప్తి, పశువృద్ధి, వ్యవసాయము, భూములవల్ల ధనలాభము, విద్యావృద్ధి, బంధుస్నేహము గృహమునందు వివాహవేడుకలు, వ్యాపారలాభము, యొక స్నేహితునివలన అభివృద్ధి, సౌఖ్యము పొందగలుగును.

రాహు మహాదశలో కేతు భుక్తియందు కేతువు అష్టమాధిపతితో సంబంధ మొందియున్న జాతకునికి మనోవ్యధ, శరీర బద్దకము, పనులయందు అడ్డంకులు, కారాగార భయము, విషజీవులబాధ, మొదలగునవి గల్గును. భుక్తి కాలమునందు కేతువు ద్వితీయ, లేక సప్తమస్థానమునందున్న జాతకునికి శరీరబాధ సంభవించును. రాహు మహాదశలో కేతువు భుక్తియందు కేతువు వ్యయాధి పాప క్షేత్రముల యందున్నను, పాపభావము యొక్క అధిపతితో సంబంధమొందినను, లేక వ్యయ స్థానము నందుండి పాపగ్రహములతో కలసియున్నను లేక వానిచే వీక్షించ బడినను జాతకునికి సంతాన విచారము, మిత్రనష్టము, కళత్రపీడ, గొప్ప ఆపత్తు, రాజులవల్ల చోరులవల్ల ధననాశము, బంధనష్టము, వ్యాధి, శిరోరోగము, నేత్రరోగము, మూల వ్యాధి, వుద్యోగ భంగము, స్థానచలనము, ఆకస్మిక విరోధము, తలవంపులు, జంతు నాశము, చోర, అగ్ని, శస్త్ర బాధ మొదలగునవి సంభవించును.

వానితో సౌఖ్యము గల్గి యుండును. బుధమహాదశలో బుధుడు కాలబలము గల్గియున్న జాతకుడు శరీర ఆరోగ్యము గలవాడును, వివాదములు లేనివాడును, భార్య, పుత్రుడు, ప్రభువుచే గౌరవింపబడువాడును. పవిత్రమైన గంగాస్నానము జేసి మోక్షమును పొందువాడుగును. బుధమహాదశలో బుధుడు దృగ్బలము గల్గియున్న జాతకునికి జీవరాశుల యందు ప్రేమ, ప్రభువు వలన అదృష్టవంతుడగును. యింద్రియ వాంఛ, సౌఖ్యము గలవాడగును. బుధమహాదశలో బుధుడు పాపషడ్వర్గు నందుండి శుభగ్రహముచే వీక్షించబడక యున్న జాతకునికి చోర, అగ్ని భయము సంభవించును. బుధ మహాదశలో బుధుడు బలహీనమైన అంశ యందున్న జాతకునికి రాజ్యలాభము లేక ఉద్యోగము, గొప్ప సౌఖ్యము, జీవరాశుల యందు ప్రేమ, వ్యవసాయాభివృద్ధి, సంపద, బిడ్డలు గల్గియుండును. బుధమహాదశలో బుధుడు ఉచ్చాంశ యందున్న జాతకునికి గొప్ప రాజగౌరవము సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, దండల వలన సౌఖ్యము, జ్ఞానులతో స్నేహము, శిల్పము, సంస్కృతి గల్గి యుండును.

**1. బుధ మహాదశలో బుధ భుక్తి ఫలము -**

బుధ మహాదశలో బుధ భుక్తి యందు భుక్తినాధుడైన బుధుడు లగ్నమునకు కేంద్రము నందున్నను లేక కోణము నందున్నను లేక ఉచ్ఛక్షేత్రము నందున్నను లేక స్వక్షేత్రము నందున్నను లేక మిత్రక్షేత్రము నందున్నను, లేక శుభస్థానము నందున్నను లేక శుభనవాంశ యందున్నను లేక శుభగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి శరీర ఆరోగ్యము, బిడ్డలు, వ్యాపారము వల్ల ధనలాభము, జ్ఞానము, మంచి ఆదరణ, సంతోషము, సంగీతము, మతసంబంధమైన ప్రసంగములు వినుట, రత్నములు, ముత్యములు గలిగి యుండుట, వివాహ వేడుకలు, బంధువులు, పారితోషికములు, ఆరోగ్యవంతులైన తల్లిదండ్రులు, వ్యాపారము ద్వారా ఉద్యోగ లాభము, మతసంబంధమైన కార్యములు చేయుచూ సంతోషము గలిగి యుండుట, ప్రధాన కార్యముల ద్వారా ధనలాభము, విద్యావేడుకలు, గౌరవము, ఆదరణ గొప్ప ప్రభు దర్శనము గల్గును.

బుధ మహాదశలో బుధుడు నీచ క్షేత్రము నందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్నను లేక 6-8-12 స్థానముల యందున్నను, లేక మారక గ్రహముచే వీక్షించబడినను లేక మారక గ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి ధనధాన్య గోవుల క్షీణత్వము, మంచి మిత్రుని విరోధము, వాతరోగము, ప్రభుత్వ పెద్దలతో విరోధము, కారాగార వాసము, ప్రభుత్వ కార్యముల చిక్కునందుండుట వలన మనస్సు చికాకు గల్గును. బుధమహా దశలో బుధుడు ద్వితీయ, సప్తమాధిపతి యైన జాతకుని భార్యకు అనారోగ్యము, దగ్గర బంధు మరణము, కార్యభంగము సంభవించును.

**2. బుధ మహాదశలో కేతు భుక్తి ఫలము -**

బుధ మహాదశలో కేతు భుక్తి యందు, భుక్తినాధుడైన కేతువు లగ్నమునకు కేంద్రమున గాని లేక కోణమున గాని యున్నను లేక శుభగ్రహములచే వీక్షించబడినను, లేక వానితో సంబంధమొందినను లేక లగ్నాధిపతితో

సంబంధమొందినను, లేక యోగకారకునితో సంబంధ మొంది యున్నను, లేక దశానాధుడైన బుధునకు యేకాదశ స్థానము నందుగాని లేక కేంద్రము నందుగాని యున్నను, లేక లగ్నస్థానమునకు 3-6-10-11 స్థానముల యందున్నను, లేక శుభషడ్వర్గునందున్నను, లేక శుభాంశ యందున్న జాతకునికి మంచి ఆరోగ్యము, కొద్ది సంపద, బంధు స్నేహము, బంధువుల సహాయము, పశువులు, వ్యాపారము నందు లాభము, ఉద్యోగ ప్రాప్తి, విద్యావిషయ ప్రసంగములు, తన హోదాకు తగిన గొప్ప అధికారితో సమాగమము, మంచి ఆహార సౌఖ్యము, సాధారణ సౌఖ్యము, వివాహ వేడుకలు, రత్నములు ఆభరణముల లాభము గలుగును.

బుధ మహాదశలో కేతు భుక్తియందు, భుక్తినాధుడైన కేతువు దశానాధుడైన బుధునకు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకుడు వాహనము నుండి పడుట, పుత్రమరణము వలన మనోవ్యధ, రాజ అగ్ని చోరభయము, పాపకార్యములు చేయుటయందు ఆసక్తి, యొక వితంతువు వలన కలతలు, వృశ్చికము మొదలగా గల విషకీటకాదుల వలన బాధ, భయము, భార్యాపుత్రుని వలన బాధ, ఋణబాధ మొదలగు దుష్ఫలములు గల్గును. బుధ మహాదశలో కేతు భుక్తి యందు కేతువు లగ్నమునకు ద్వితీయ, లేక సప్తమ స్థానము నందున్న జాతకునికి శరీర అస్వస్థత, సంపద క్షీణించుట మొదలగు దుష్ఫలములు గలుగును.

**3. బుధ మహాదశలో శుక్ర భుక్తి ఫలము -**

బుధ మహాదశలో శుక్ర భుక్తి యందు, భుక్తినాధుడైన శుక్రుడు లగ్నమునకు 1-4-7-10-11-5-9 స్థానముల యందున్నను లేక ఉచ్ఛక్షేత్రము నందున్నను లేక సుక్షేత్రము నందున్నను, లేక స్వనవాంశ యందున్నను లేక ఉచ్చాంశ యందున్న జాతకుడు మంచి పవిత్రమైన కార్యములు చేయువాడుగా యుండును. మత సంబంధమైన ప్రసంగములు వినుట, ధర్మకార్యములు నిర్వర్తించుట, గొప్ప వారి స్నేహము వలన కోరిన వస్తువుల లాభము పొందుట, భూలాభము, ధాన్యలాభము పొందు వాడుగా యుండును. భుక్తినాధుడైన శుక్రుడు ధర్మస్థానాధిపతియును లేక కర్మస్థానాధిపతితో సంబంధమొంది యున్న జాతకుడు మహారాజుతో స్నేహ భావముగా యుండుట, చెరువులు, బావులు త్రవ్వించుట, గృహముల నిర్మాణము, వ్యాపారమునందు లాభము, ఉద్యోగములో అభివృద్ధి, హోదాపెరుగుట, వ్యవసాయాభి వృద్ధి, రత్నములు, ఆభరణములు గల్గి యుండుట, వాహనములు, వస్త్రములు గోవులు, వివాహవేడుకలు మొదలగు సుఫలములు గల్గును. దశనాధుడైన బుధునికి భుక్తినాధుడైన శుక్రుడు కేంద్ర లేక కోణ లేక యేకాదశ స్థానము నందున్న జాతకునికి ప్రభువుతో సమానమైన సంపద, ఐశ్వర్యము గలుగును.

బుధ మహాదశలో శుక్ర భుక్తి యందు, భుక్తినాధుడైన శుక్రుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రము నందున్నను లేక పాపస్థానము నందున్నను లేక దశానాధుడైన బుధునికి 6-8-12 స్థానముల యందున్న జాతకునికి మనోవ్యధ అవమానము, జ్వరము, గ్రహణి, దగ్గర స్నేహితుని మరణము, లేక తల్లి మరణము, ఉద్యోగ భంగము, కళత్ర మరణము,

దుఃఖము, రాజభయము, తీరని ఋణములు, వాహననాశము, శరీర రోగము, నీలాపనిందలు అధిక ధనవ్యయము గలుగును. భుక్తినాధుడైన శుక్రుడు ద్వితీయ స్థానమునకు అధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

4. బుధ మహాదశలో రవి భుక్తి ఫలము -

బుధ మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి ఉచ్ఛక్షేత్రము నందున్నను లేక స్వస్థానము నందున్నను, లేక కేంద్రము నందున్నను, లేక కోణము నందున్నను లేక ఏకాదశ స్థానము నందున్నను, లేక ఉచ్ఛాంశ యందున్నను లేక స్వనాంశ యందున్న జాతకునికి సంపద అభివృద్ధి, ప్రభువు వలన సహాయము, గొప్పమిత్రుని వలన సౌఖ్యము గలుగును. భుక్తి నాధుడైన రవి లగ్నాధిపతితో సంబంధ మొంది యున్న జాతకునికి భూలాభము, యొక గ్రామముపై అధికారము మరియు దానిపై పెత్తనము సంక్రమించును. భుక్తి నాధుడైన రవిని కుజుడు వీక్షించుచున్న జాతకునికి భుక్తి ప్రారంభ దశలో భూ లాభము గలుగును. భుక్తినాధుడైన రవిని లగ్నాధిపతి వీక్షించుచున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, ధనవృద్ధి, తండ్రి సౌఖ్యము, మంచి భోజనము వస్త్రలాభము సంభవించును.

బుధ మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి లగ్నమునకు 6-8-12 స్థానముల యందుండి, శని లేక కుజుడు లేక రాహువుతో సంబంధమొంది యున్నను లేక రవి బలహీనుడై దశానాధుడైన బుధునకు 6-8-12 స్థానముల యందున్న జాతకునికి చోర; అగ్ని, ఆయుధ భయము, పైత్య రోగమును, మనోవ్యధ శిరోరోగము, తాపత్రియము, బంధు మరణము, రాజభయము, శత్రుబాధ, ప్రవాసము సంభవించును. భుక్తినాధుడైన రవి ద్వితీయ లేక సప్తమ స్థానమునకు అధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

5. బుధ మహాదశలో చంద్ర భుక్తి ఫలము -

బుధ మహాదశలో చంద్ర భుక్తి యందు, భుక్తినాధుడైన చంద్రుడు లగ్నమునకు కేంద్రము లేక త్రికోణము నందున్నను, లేక ఉచ్ఛక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రము నందున్నను, లేక గురునిచే వీక్షించబడి యోగ స్థానమునకు ఆధిపతియై యున్న జాతకునికి రాజయోగ ఫలములు సంక్రమించును. కళత్ర లాభము, పుత్రలాభము, వాహన సౌఖ్యము, నూతన గృహలాభము, వస్త్రములు, ఆభరణములు, భోజన సౌఖ్యము, సంగీత జ్ఞానము, ఆయుధముతో అభ్యాసము, దక్షిణదేశ యాత్ర, మిత్ర సమాగమము, విదేశ వస్తువుల ద్వారా లాభము, రత్నములు, ముత్యములు, పగడములు గడించుట, తెల్లనీ వస్త్రలాభము గల్గును.

బుధ మహాదశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు, దశానాధుడైన బుధునకు కేంద్ర త్రికోణము నందున్నను, లేక తృతీయ లేక యేకాదశ స్థానము నందున్న జాతకునికి చంద్ర భుక్తి ప్రారంభ దశ యందు పవిత్రమైన పుణ్య క్షేత్రములను దర్శించుట, ఆత్మవిశ్వాసము, శ్రద్ధ, సంతోషము, విదేశముల నుండి ధనలాభము గల్గుచుండును.

దశానాధుడైన బుధునకు, చంద్రుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి ఉద్యోగ భంగము, బంధు

ద్వేషము, భార్యాబిడ్డల నాశము, భూనాశము, గృహము, ధాన్యనాశము, రాజా గ్రహము, ధనవ్యయము, చోరరాజ అగ్ని వలన భయము, లైంగిక సుఖము, క్రూర కార్యములు చేయుట, ధననష్టము, వ్యవసాయ భూములు, గోవులు, అశ్వముల వలన నష్టము సంభవించును.

భుక్తినాధుడైన చంద్రుడు నీచక్షేత్రము నందున్నను లేక శత్రుక్షేత్రము నందున్న జాతకునికి శరీర బాధ, వాతపైత్య రోగము, ఋణబాధ గల్గును. చంద్రుడు ద్వితీయ లేక సప్తమ స్థానాధిపతియై యున్న జాతకునికి శరీరబలహీనత, మనోవ్యధ, అగ్ని, రాజ, చోరభయము, చెడ్డ స్త్రీలతో సాంగత్యము మొదలగునవి సంభవించును.

**6. బుధ మహాదశలో కుజ భుక్తి ఫలము -**

బుధ మహాదశలో కుజ భుక్తి యందు, భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు కేంద్రమున గాని లేక త్రికోణమందు గాని యున్నను లేక ఉచ్చ క్షేత్రము నందున్నను లేక స్వక్షేత్రము నందున్నను, లేక లగ్నాదిపతితో సంబంధ మొంది యున్నను లేక శుభనవాంశ యందున్నను, లేక శుభగ్రహముతో సంబంధ మొంది యున్నను లేక శుభషడ్వర్గు నందున్న జాతకునికి శాంతి, ప్రభువు సహాయమునకు కృతజ్ఞతలు, గృహము నందు వివాహ వేడుకలు, లక్ష్మీకటాక్ష సూచనలు, పోయిన వృత్తి లేక రాజ్యము మరల పశపరచుకొనుట, ధనవృద్ధి, జన్మదిన వేడుకలు, కావలసినంత సంపద, గోవులు, భూములు, యేనుగులు, అశ్వములు, వాహనములు, బంధువుల ఆశ్చర్యము, సంసార సంబంధమైన సంతోషము, గొప్ప శోభ, అధికారవృద్ధి, రత్నాభరణ లాభము మొదలగునవి గల్గును.

బుధ మహాదశలో కుజ భుక్తి యందు, భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రము నందున్నను, పాపగ్రహ వీక్షణము గల్గియున్నను లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి శరీర బాధ, మనోవ్యధ, ఉద్యోగ భంగము, తన స్వంత గ్రామములో భూముల నాశము, ధాన్యము, పంట నాశము ఆయుధము వలన గాయములు, జ్వరము, అధికభయము సంభవించును. దశానాధుడైన బుధునకు 4-7-10-5-9-11 స్థానముల యందు భుక్తినాధుడైన కుజుడున్నను లేక కుజుడు శుభగ్రహముచే సంబంధమొంది యున్న జాతకునికి శరీర ఆరోగ్యము, ధనలాభము, పుత్రలాభము, సంతోషము, సోదరులు మరియు కుటుంబము యొక్క ప్రేమ, అభిమానము గల్గును.

బుధ మహాదశలో కుజ భుక్తి యందు, దశానాధుడైన బుధునకు కుజుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో కుజుడు సంబంధమొంది యున్న జాతకునికి భుక్తి ప్రారంభ దశ యందు గొప్పబాధ, తండ్రి తరపు వారి వలన గొప్పభయము, రాజ, చోర, అగ్నిభయము, పుత్రులు, బంధువుల విరోధము, ఉద్యోగ భంగము గొప్పధైర్యము; భుక్తి మధ్యకాలము నందు సౌఖ్యము, అధిక ధనము, ప్రయత్నించిన పనికి అడ్డంకులు, ఆకస్మిక సంకటనలు, ఉద్రోగము, అవమానము, అగౌరవము, తండ్రి మరణము, మనోవ్యధ, కారాగార వాసము, శత్రుభయము; తుది

దశ యందు ఉద్యోగభంగము, రాజ భయము సంభవించును. భుక్తి నాధుడైన కుజుడు ద్వితీయ లేక సప్తమాధిపతియైన జాతకునికి అపమృత్యువు సంభవించును.

**7. బుధ మహాదశలో రాహు భుక్తి ఫలము -**

బుధ మహాదశలో రాహు భుక్తి యందు, భుక్తినాధుడైన రాహువు కేంద్రము నందుగాని, లేక త్రికోణము నందుగాని లేక ఏకాదశ స్థానము నందుగాని లేక కర్కాటక, సింహ, కన్య లేక వృషభరాశుల యందు గాని లేక శుభనవాంశ యందుగాని లేక శుభస్థానము నందుగాని లేక శుభగ్రహముతో సంబంధమొంది గాని యున్న జాతకునికి ప్రభువు సహాయము వలన శాంతి, వివాహ వేడుకలు, శిశు జననము వలన సౌఖ్యము, రాజగౌరవము, మంచి ఉద్యోగము, బంధువుల పారితోషికములు, వ్యాపారము వలన ధనవృద్ధి, పుణ్యక్షేత్రములకు యాత్ర, గురువులు పెద్దల యొక్క సమాగమము, ప్రయాణము, మిత్రలాభము, తలచిన కార్యము సఫలమగుట సంభవించును. భుక్తి ప్రారంభదశ యందు జాతకునికి శరీర బాధ, చివర దశ యందు సౌఖ్యము గల్గును.

బుధ మహాదశలో రాహు భుక్తి యందు, రాహువు 6-8-12 స్థానముల యందున్న జాతకునికి ధననాశము సంభవించును. భుక్తి ప్రారంభదశ యందు జాతకునికి జ్వరము వలన శరీర భాధ, అజీర్ణము, వాతరోగము సంభవించును. రాహువు 3-6-10-11 స్థానముల యందున్నను లేక శుభగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి ప్రభువుతో సమాగమము, సౌఖ్యము, నూతనముగా ఘనమైన వారితో కలియుట సంభవించును.

దశానాధుడైన బుధునికి రాహువు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకుడు ప్రభుత్వ పనియందు తప్పు చేసినటు నేరము మోపబడుట, ఉద్యోగ భంగము, గొప్ప భయము, కారాగార వాసము, శరీరబాధ, మనోవ్యధ, అవమానము, తలవంపు, ధననష్టము సంభవించును. ఇవియేగాక జ్వరము, గడ్డల వలన బాధ, రాజాగ్రహము, బంధునష్టము, అగౌరవము, కళత్ర మరణము, ఋణ బాధ, తల్లి నాశము, బంధు విరోధము, అధికార నష్టము మొదలగు దుష్ఫలములు గలుగును. రాహువు ద్వితీయ, సప్తమ స్థానముల యందున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**8. బుధ మహాదశలో గురు భుక్తి ఫలము -**

బుధ మహాదశలో గురు భుక్తి యందు, భుక్తినాధుడైన గురుడు లగ్న స్థానమునకు కేంద్రము లేక త్రికోణము నందును లేక ఉచ్చస్థానము నందును లేక స్వక్షేత్రము నందును లేక మిత్రక్షేత్రము నందును లేక స్వనవాంశ యందును లేక భాగ్యస్థానము నందున్న జాతకునికి మంచి ఆరోగ్యము, ధనలాభము, రాజగౌరవము వివాహ వేడుకలు, మంచి ఆహారము, గోవులు, కోడెల సంపద, మతసంబంధమైన ప్రసంగములు వినుట, యజ్ఞక్రతువులు ఆచరించుట, దేవతలను పూజించుట, ప్రభువు సహాయము వలన సౌఖ్యము, బంధుమిత్ర సమాగమము, దక్షిణ నైరుతి దిశల యందు ప్రయాణము, పరోపకారమైన పనులను నెరవేర్చుట, బాకీలు రాబట్టుకొనుట మొదలగు సుఫలములు సంభవించును.

బుధ మహాదశలో గురు భుక్తి యందు, గురుడు నీచస్థానము నందున్నను, లేక రవి వలన అస్తంగతుడైనను, లేక 6-8-12 స్థానముల యందున్నను, శని లేక కుజ లేక రాహువుతో సంబంధ మొంది యున్న జాతకునికి అనేక బాధలు, రాజాగ్రహము, దొంగల వలన శరీర బాధ, తల్లిదండ్రుల మరణము, మనోరోగము, రాజ దండన, ధననాశము, భార్యా బంధువుల మోసము, కారాగార వాసము, విష, సర్ప, అగ్ని, జ్వర భయము, గోవులు, భూములు, గృహ విక్రయము సంభవించును.

బుధ మహాదశలో గురు భుక్తి యందు, గురుడు దశానాధుడైన బుధునకు ఏకాదశ స్థానము నందుగాని లేక కేంద్రము నందుగాని లేక త్రికోణము నందుగాని యుండి బలవంతుడై యున్న జాతకునికి పుత్రలాభము బంధులాభము, సంతోషము మనశ్శాంతి, సౌఖ్యము, శోభ, పశువృద్ధి, గొప్ప గౌరవము, అన్నదానము మొదలగునవి గల్గి యుండును. దశానాధుడైన బుధునకు, గురుడు 6-8-12 స్థానముల యందుండి, బలహీనుడై యున్న జాతకునికి శరీర అలసట, అంగవైకల్యము, శరీర బాధలు, భార్యా బంధువుల మోసము, రాజాగ్రహము, మూత్రవ్యాధి, ద్రవ్య నష్టము, ఆకస్మిక సంకటనలు, ప్రభువు వలన బాధ సంభవించును. లగ్నము నుండి ద్వితీయ, లేక సప్తమ స్థానములకు గురుడు అధిపతియై యున్న జాతకునికి శరీర రోగము సంభవించును.

### 9. బుధ మహాదశలో శని భుక్తి ఫలము -

బుధ మహదశలో శని భుక్తి యందు, భుక్తినాధుడైన శని స్వస్థానము నందున్నను లేక ఉచ్చస్థానము నందున్నను, లేక కేంద్రమున గాని లేక త్రికోణమున గాని లేక ఏకాదశ స్థానము నందుగాని లేక శుభగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకుడు రామేశ్వరము నందు సేతుబంధనలో పవిత్ర స్నానము చేయువాడగును; శిశుజననము, ప్రభుత్వోద్యోగము సంపాదించుకొనుట, గొప్ప సంతోషము, స్వగృహము నందు వివాహవేడుకలు, వ్యాపారము వలన ధనలాభము, అక్రమమైన వ్యాపారమును సక్రమముగా పూర్తి చేయుట, సేవకుల ద్వారా కార్యము నెరవేర్చుట, బంధుమిత్రులతో సమాగమము, పరోపకార కార్యము నందు జయము, బలము, ధైర్యము, గోసంపద, ప్రయాణములలో బంధువుల వలన పారితోషికములు, ప్రభుత్వముతో మంచి బాంధవ్యము గలిగి యుండును.

బుధ మహదశలో శని భుక్తి యందు, భుక్తినాధుడైన శని లగ్నమునకు గాని లేక దశానాధుడైన బుధునకు గాని 6-8-12 స్థానముల యందున్న జాతకునికి అమిత దుఃఖము, భార్యాబిడ్డల కష్టములు, మనస్సులో కలవరము, ఉద్యోగ భంగము, ప్రవాసము, శరీర అస్వస్థత, ఋణ బాధలు, ధనవ్యయము, కారాగార వాసము, బంధు నాశము సంభవించును. శని లగ్నమునకు ద్వితీయ, సప్తమాధిపతియైన జాతకునికి అపమృత్యువు సంభవించును.

## 8. కేతు మహాదశ ఫలము

కేతు మహాదశలో జనన కాలమున లగ్నమునకు కేంద్రస్థానము నందున్న జాతకునికి ప్రయత్నములు విఫలమగుట, కార్యభంగము, రాజ్యనష్టము లేక ఉద్యోగ భంగము, భార్య, బిడ్డలు, సంపదకు ప్రమాదము సంభవించును. కేతు మహాదశలో కేతువు లగ్నము నందున్న జాతకునికి యొక్కువ భయము, జ్వరము, గ్రహణి,

మూత్రరోగము, అధికార భంగము లేక ఉద్యోగ నాశము, కలరా మొదలగునవి సంభవించును. కేతు మహాదశలో కేతువు ద్వితీయ స్థానము నందున్న జాతకునికి ధననష్టము, అవమానము, క్రూరమైన ప్రసంగములు, మనోవ్యధ, చెడు ఆహారము గల్గును. కేతుమహాదశలో కేతువు తృతీయ స్థానమునందున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, సోదరులతో శత్రుత్వము, మనస్సులో చికాకు మొదలగునవి సంభవించును. కేతు మహాదశలో కేతువు చతుర్థస్థానము నందున్న జాతకునికి సౌఖ్యహీనము, భార్య, బిడ్డల నష్టము, కాని ధాన్యవృద్ధి వలన గృహమందు సంతోషము గలగును. కేతు మహాదశలో కేతువు పంచమస్థానము నందున్న జాతకునికి పుత్రనాశము, మనోవ్యధ, రాజాగ్రహము, ద్రవ్యనష్టము మొదలగునవి సంభవించును. కేతు మహాదశలో కేతువు షష్టస్థానము నందున్న జాతకునికి అగ్ని, విష, చోర భయము, అనేక కష్టములు సంభవించును.

కేతు మహాదశలో కేతువు సప్తమ స్థానము నందున్న జాతకునికి భయమే గాక భార్య, పుత్రనాశము, మనోరోగము, మూత్రవ్యాధి సంభవించును. కేతు మహాదశలో కేతువు అష్టమ స్థానము నందున్న వృద్ధి యందు జాతకునికి భయము, తండ్రి మరణము, ఉబ్బసవు వ్యాధి, అతిసారము, క్షయ సంభవించును. కేతు మహాదశలో కేతువు నవమ స్థానము నందున్న జాతకునికి తండ్రి లేక గురువు మరణము, దుఃఖము, ఏపనికైనను అడ్డంకులు సంభవించును. కేతు మహాదశలో కేతువు దశమ స్థానము నందున్న జాతకునికి అవమానము, మనస్సులో అసౌఖ్యము, బద్దకము సంభవించును. కేతుమహాదశలో కేతువు ఏకాదశస్థానము నందున్న జాతకునికి తనకేగాక తన సోదరులకు గూడ అధిక సౌఖ్యము, సంతోషము గలుగును. యజ్ఞక్రతువులు మొదలగునవి జేయుచుండును. కేతు మహాదశలో కేతువు ద్వాదశ స్థానము నందున్న జాతకునికి అనేక కష్టములు, ఉద్యోగ భంగము, అధికార నష్టము ప్రయాణములు, రాజాగ్రహము, నేత్ర రోగము మొదలగునవి సంభవించును.

కేతు మహాదశలో సామాన్యముగా జరుగు దురదృష్ట కార్యములు భార్యా పుత్ర మరణము, రాజాగ్రహము, అనేక కష్టములు, అజ్ఞానము, సంపద, బంధుమిత్ర నష్టము, అగ్ని, రోగముల వలన భయము, వాహనము నుండి పడుట, దేశసంచారము, తగవుల యందు ఆసక్తి, అపార్థములు సంభవించును. కేతు దశ మొదటి భాగములో దుఃఖము, మధ్య యందు భయము తుది యందు రాజాగ్రహము, శరీర అసౌఖ్యము మొదలగునవి సంభవించును.

కేతు మహాదశలో కేతువు శుభగ్రహముచే వీక్షించబడుచున్న జాతకునికి సౌఖ్యము, ప్రభుత్వోద్యోగము వలన ధనవృద్ధి, గృహనిర్మాణము, మనోసౌఖ్యము, భక్తితో ప్రభువును పూజించుట మొదలగునవి సంభవించును.

కేతు మహాదశలో కేతువు పాపగ్రహముచే వీక్షించబడుచున్న జాతకునికి దుఃఖము, జ్వరము, గ్రహణి, మూత్రరోగము, గజ్జి, ప్రభువు ద్వారా కష్టములు దౌర్భాగ్యము, కలవరము, ధననాశము వలన కష్టములు, రోగము, కష్టములు అధిక మగుట, బంధువులతో తగవులు, ప్రజలు, గ్రహములు, సృష్టించిన సంకటనలు గలుగు చుండును.

**1. కేతు మహాదశలో కేతు భుక్తి ఫలము -**

కేతు మహాదశలో కేతు భుక్తి యందు, భుక్తినాధుడైన కేతువు లగ్నమునకు కేంద్రమున గాని, లేక త్రికోణమున గాని ఏకాదశ స్థానము నందుగాని లేక లగ్నాధిపతితో సంబంధ మొందిగాని లేక శుభషడ్వర్గు నందు గాని శుభనవాంశ యందుగాని లేక నవమాధిపతితోగాని లేక దశమాధిపతితోగాని సంబంధమొంది యున్నను, లేక నాల్గవ స్థానాధిపతితో సంబంధ మొంది యున్నను జాతకునికి భార్యాబిడ్డల సౌఖ్యము, జ్ఞానాభివృద్ధి, గ్రామము, భూములు, ధాన్యలాభమును, వ్యాపారము వలన ధనలాభమును, లావాదేవీలలో జయమును, అకాల భోజనము, మనోనిబ్బరము నూతన వస్త్రాలంకారము, సంతోషము సంభవించును.

కేతు మహాదశలో కేతు భుక్తి యందు, భుక్తినాధుడైన కేతువు లగ్నమునకు 6-8-12 స్థానములయందున్నను, లేక నీచస్థానము నందున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి నీచులు, శత్రుత్వముతో సంకటనలు, కార్య భంగము, రాజాగ్రహము, మనోవ్యధ, రత్నములు, ఆభరణముల విక్రయము, భార్యబిడ్డల బాధ, అవమానము, అగౌరవము, ఉద్యోగ భంగము, మంత్ర తంత్రములు, సర్పములు, విషము, మందుల వలన అపాయము గల్గును. భుక్తి నాధుడైన కేతువు ద్వితీయాధిపతి లేక సప్తమాధిపతితో సంబంధ మొంది యున్నను, కేతువు ద్వితీయ లేక సప్తమ స్థానము నందున్న జాతకునికి ఆరోగ్య భంగము, కష్టములు, దగ్గర మిత్రుని మరణము సంభవించును.

**2. కేతు మహాదశలో శుక్ర భుక్తి ఫలము -**

కేతు మహాదశలో శుక్ర భుక్తి యందు, భుక్తినాధుడైన శుక్రుడు లగ్నమునకు కేంద్రము నందు గాని, లేక యేకాదశ స్థానము నందుగాని లేక త్రికోణము నందుగాని లేక ఉచ్చక్షేత్రమునందు గాని లేక స్వక్షేత్రము నందుగాని లేక యోగకారకునితో సంబంధమొంది గాని లేక నవమ లేక దశమాధిపతితో సంబంధ మొంది గాని యున్న జాతకునికి ధనలాభము, గోలాభము, పోయిన రాజ్యము లేక ఉద్యోగము మరల సంపాదించుకొనుట, మనోసౌఖ్యము, దేవతలను పూజించుట, గ్రామములో భూలాభము మహారాజ దయకు కృతజ్ఞతలు మొదలగునవి సంభవించును.

మహాదశానాధుడైన కేతువునకు భుక్తినాధుడైన శుక్రుడు తృతీయ లేక యేకాదశ కేంద్ర లేక కోణ స్థానముల యందున్న జాతకునికి శరీర ఆరోగ్యము, సౌఖ్యము, స్వగృహములో వివాహ వేడుకలు, భోజన సౌఖ్యము, నూతన వస్త్రలాభము, ఆభరణాలంకారము, వాహన లాభము, అశ్వములు, పానుపులు, దాంపత్య సౌఖ్యము, పుత్ర జననము, నాట్యగత్తెతో సంబంధము, రాజపారితోషికము అనేక నూతన వస్తువులు, వ్యాపారము నందు గొప్ప ధనలాభము, మిత్రులు, బంధువులతో గొప్ప గ్రామము నందు నివాసము, మత సంబంధమైన ప్రసంగములు వినుట సంభవించును.

కేతు మహాదశలో శుక్రభుక్తి యందు, భుక్తినాధుడైన శుక్రుడు, దశానాధుడైన కేతువునకు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో

సంబంధ మొందియున్న జాతకునికి ఆకస్మిక కలతలు, పశువులు, ధాన్యనాశము సంభవించును. భుక్తినాధుడైన శుక్రుడు , లగ్నములకు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రము నందున్న జాతకునికి తన సొంత బంధువుల వలన దుర్మార్గము సృష్టించబడుట, నేత్ర, శిరోరోగము, వృత్తి నాశము, మనోవ్యధ, రాజభయము, ఋణబాధలు, భార్యాబిడ్డల కష్టములు, ప్రభుత్వ మండలములో అపార్ధములు, అవమానము సంభవించును. భుక్తినాధుడైన శుక్రుడు లగ్నమునకు ద్వితీయ లేక సప్తమ స్థానము నందున్న జాతకునికి శరీర అసౌఖ్యము, ధనవ్యయము, గొప్ప ఉద్యోగ భంగము, అపమృత్యువు సంభవించును.

**3. కేతు మహాదశలో రవి భుక్తి ఫలము -**

కేతు మహాదశలో రవి భుక్తి యందు భుక్తినాధుడైన రవి ఉచ్ఛక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రము నందున్నను లేక మిత్ర క్షేత్రము నందున్నను లేక లగ్నస్థానము నుండి కేంద్రమునందు గాని లేక కోణమునందు గాని లేక యేకాదశ స్థానము నందుగాని లేక రవిని శుభగ్రహము వీక్షించుచున్న జాతకునికి ధన ధాన్య వృద్ధియును, రాజపారితోషికముల వలన సంతోషము, అనేక మంచి కార్యములును అనుకున్న కార్యములు సఫలమగుట, వివాహ వేడుకలు, పుత్రజననము, చేపట్టిన పని యందు ధనలాభము, గ్రామీణ దర్శనములు, మతసంబంధమైన ప్రసంగములు వినుట మొదలగు సత్ఫలములు గలుగును.

కేతు మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి తల్లిదండ్రుల మరణము, రాజభయము, ప్రభుత్వ శిక్ష, పరదేశ ప్రయాణము, సర్ప, విష, చోరభయము, మనస్సులో ఆవేదన, ఉష్ణము, జ్వరబాధ గలుగును.

కేతు మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి దశానాధుడైన కేతువునకు కేంద్రమునగాని లేక కోణమునగాని లేక యేకాదశ స్థానమున గాని లేక కేతువునకు ద్వితీయ స్థానము నందున్న జాతకునికి మంచి శరీర ఆరోగ్యము పుత్రలాభము, ధనలాభము, సొంత తీర్మానము, నమ్మకము, ప్రయాణము నందు అనుకున్న కార్యము సఫలమగుట సంభవించును. చిన్న గ్రామమునకు నాయకుడుగా యుండును.

కేతు మహాదశలో రవి భుక్తి యందు, భుక్తినాధుడైన రవి, దశానాధుడైన కేతువునకు 6-8-12 స్థానముల యందున్న జాతకుడు భిక్షకుడగుట, గో, ధన, ధాన్యనాశము, అధిక భయము గల్గును. ప్రధమ, ద్వితీయ దశల యందు అనేక కష్టములును, తుది దశ యందు సౌఖ్యము గల్గును. భుక్తినాధుడైన రవి, ద్వితీయ, సప్తమ స్థానములకు అధిపతియైన జాతకునికి అపమృత్యువు సంభవించును.

**4. కేతు మహాదశలో చంద్ర భుక్తి ఫలము -**

కేతు మహాదశలో చంద్ర భుక్తి యందు, భుక్తినాధుడైన చంద్రుడు లగ్నమునకు కేంద్ర, త్రికోణ, లేక ద్వితీయ లేక లాభస్థానముల యందున్నను లేక చంద్రుడు ఉచ్ఛక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రముందున్నను, లేక గురునితో

సంబంధ మొందిగాని లేక వానిచే వీక్షించబడిగాని లేక శుభనవాంశ యందున్న జాతకునికి వివాహము, ఆభరణములు, వస్త్రలాభము, వాహనప్రాప్తి, రాజాను గ్రహము, గౌరవ మర్యాదల అభివృద్ధి, ధనలాభము, సౌఖ్యము, చెరువులు, దేవాలయముల నిర్మాణము, మత సంబంధమైన కార్యములు నిర్వహించుట, వ్యాపారము వలన ధనలాభము, తలపెట్టిన కార్యము సఫలమగుట, కళత్ర సుఖము, వితంతువుతో సంబంధము, ఫలసాయాభివృద్ధి, భూములు, గోవులు, అశ్వముల లాభము, మంచి భోజనము సంభవించును.

కేతు మహాదశలో చంద్ర భుక్తి యందు, భుక్తినాధుడైన చంద్రుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక పాపగ్రహములతో సంబంధ మొంది యున్నను, లేక చంద్రుడు క్షీణించి యున్నను జాతకునికి శరీరమునకు అస్వస్థత, జ్ఞానహీనము, సంకటనలు, అపార్థములు, అధిక భయము, తల్లిదండ్రుల మరణము, శరీర బలహీనత, మనోవ్యధ, వ్యవసాయము నందు నష్టము, పశువులు, గోవుల నాశము సంభవించును.

కేతుమహాదశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు బలవంతుడై దశానాధు డైన కేతువునకు కేంద్ర, త్రికోణ లేక లాభస్థానముల యందున్న జాతకునికి భూ లాభము, గోలాభము, దగ్గర బంధువుల సమాగమము, కొంత ఆలస్యమైనను చేపట్టిన పని సంపూర్ణమగుట, గృహములో కావలసినన్ని క్షీరములు, వ్యవసాయమునకు సంబంధించిన పని పూర్తియగుట, మంచి శరీరారోగ్యము, భుక్తి మధ్య కాలములో ప్రభువుతో మంచి సంబంధము, కాని తుది యందు విరోధము, పరదేశ ప్రవాసము, భార్యతరపు వారి నుండి గౌరవము గలుగును.

కేతు మహాదశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు బలహీనుడై దశనాధుడైన, కేతువునకు 6-8-12 స్థానముల యందున్న జాతకునికి ధననాశము, ధాన్యనాశము, మనోవ్యధ, బంధు మరణము, సోదరులకు దుఃఖము సంభవించును. చంద్ర భుక్తి కాలములో చంద్రుడు ద్వితీయ, సప్తమ, అష్టమాధిపతులలో నెవరితోనైన సంబంధమొంది యున్న జాతకునికి ఋణబాధలు, దాని వలన కారాగార వాసము, అనుమానము, ఋణ విముక్తి కొరకు వాహనములు మొదలగు వాని విక్రయము, ప్రభుత్వోద్యోగులతో శత్రుత్వము, బానిసత్వము, శత్రువుల వలన బాధలు, అపమృత్యువు సంభవించును.

**5. కేతు మహాదశలో కుజ భుక్తి ఫలము -**

కేతు మహాదశలో కుజ భుక్తి యందు, భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు కేంద్రమున గాని లేక త్రికోణమున గాని లేక తన ఉచ్చక్షేత్రమున గాని లేక తన స్వస్థానమున గాని లేక మిత్ర క్షేత్రమున గాని లేక శుభనవాంశ యందు గాని లేక శుభషడ్వర్గు నందు గాని యున్న జాతకునికి ప్రథమమున సుఫలములు అనగా వ్యవసాయ ఫలసాయములో లాభము, పశులాభము, గృహము, తోట, పొలములు, రాజపారితోషికముల వలన సంతోషము గలుగును. భుక్తినాధుడైన కుజుడు భాగ్యాధిపతితో గాని రాజ్యాధిపతితో గాని సంబంధ మొంది యున్న జాతకునికి సోదరుని తరపు నుండి ధనలాభము గలుగును.

భుక్తినాధుడైన కుజుడు, దశానాధుడైన కేతువునకు కేంద్రము నందు గాని లేక కోణము నందు గాని లేక తృతీయ స్థానము నందు గాని లేక యేకాదశ స్థానము నందు గాని యున్న జాతకునికి రాజానుగ్రహము, మర్యాద, గౌరవము, పుత్రమిత్రులతో సంతోషము, రత్నములు, ఆభరణ లాభము, అధికారాభివృద్ధి, పుత్ర జననము, యెక్కువ సంతోషము, వివాహము, బంధు సమాగమము మొదలగునవి సంభవించును.

దశానాధుడైన కేతువునకు, కుజుడు 6-8-12 స్థానముల యందుగాని లేక కేతువునకు ద్వితీయ స్థానమున కుజుడున్న మరణము గాని లేక పరదేశ ప్రవాసము భయము, దిగులు సంభవించును. కుజుడు పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి చోర, రాజ, అగ్ని భయము సంభవించును. ఋణముల బాధ, మూత్రవ్యాధి వలన కష్టములు సంభవించును. బంధువులతో విరోధము, సోదరులకు ధననాశము, ఉద్యోగ భంగములు, మనోవ్యధ, ప్రయత్నించిన కార్యనాశము సంభవించును. భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు ద్వితీయ లేక సప్తమ స్థానము నందున్నను లేక మారక గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి గాయముల వలన జ్వరము, భార్యమరణము సంభవించును.

**6. కేతు మహాదశలో రాహు భుక్తి ఫలము -**

కేతు మహాదశలో రాహు భుక్తి యందు భుక్తినాధుడైన రాహువు ఉచ్చస్థానము నందున్నను, లేక మిత్ర క్షేత్రము నందున్నను లేక తన స్వక్షేత్రమైన కన్యయందున్నను లేక లగ్నమునకు కేంద్రము నందుగాని లేక త్రికోణము నందు గాని లేక ద్వితీయ స్థానమున గాని లేక తృతీయ స్థానమున గాని లేక లాభస్థానము నందున్నను లేక శుభగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి మహమ్మదీయ, ఆంగ్లో యిండియన్ లేక క్రైస్తవ తుచ్ఛ బుద్ధి గల పెద్దల ద్వారా సౌఖ్యమును పొందుట, ధనలాభము, నీచజాతి స్త్రీలతో సంబంధము, మంచి వస్తు లాభము, గ్రామము, భూములు సంపాదించుట, స్వగృహము నందు వివాహ వేడుకలు, రత్నములు, ఆభరణములు కొనుట, ప్రభుత్వ సహాయము వలన కార్య సిద్ధి, వ్యాపారము నందు ధనలాభము, ప్రయాణము నందు మిత్రులు, దేవాలయ వేడుకల యందు పాల్గొనుట మొదలగునవి సంభవించును. దశాభుక్తి ప్రధమమున కష్టములు, మధ్యమున కష్ట సౌఖ్యములు తుది యందు సౌఖ్యము గల్గును.

కేతు మహాదశలో రాహు భుక్తి యందు భుక్తినాధుడైన రాహువు లగ్నమునకు అష్టమ, లేక ద్వాదశ స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి మన్య జ్వరము, ప్రభుత్వ శిక్షవలన ధననాశము, భార్యా పుత్రమరణము, ఉద్యోగ భంగము, మనోవ్యధ, ఆకస్మిక సంకటనలు, కీళ్ళవాతము, మూత్రరోగము సంభవించును. రాహు భుక్తి యందు రాహువును పాపగ్రహము వీక్షించుచున్న జాతకుడు రోగముతో బాధపడు చుండును. రాహువు లగ్నమునకు ద్వితీయ స్థానమున గాని లేక సప్తమ స్థానమున గాని యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**7. కేతు మహాదశలో గురు భుక్తి ఫలము -**

కేతు మహాదశలో గురు భుక్తి యందు, భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు కేంద్రమున గాని లేక త్రికోణమున గాని లేక యేకాదశ స్థానమునగాని లేక ఉచ్చక్షేత్రమున గాని లేక తన స్వస్థానమున గాని లేక లగ్నాధిపతితో గాని లేక భాగ్యాధిపతితో గాని లేక రాజ్యాధిపతితోగాని సంబంధ మొందియున్న జాతకునికి ధనధాన్య వృద్ధియును, రాజానురాగము, గొప్ప సౌఖ్యము, సంతోషము, పల్లకీ, గుఱ్ఱములు, యాత్రాసుఖమును, ధర్మము, ఔదార్యము, వివాహ వేడుకలు, పుత్ర జననము, వేడుకలున్నట్లు గృహాకారము, దేవుని దయ వలన జయము, ప్రభువుకు నచ్చినట్లు కార్యములు చేపట్టుట, గొప్ప ప్రభుదర్శనము మొదలగునవి సంభవించును.

దశానాధుడైన కేతువునకు భుక్తినాధుడైన గురుడు 6-8-12 స్థానముల యందున్నను, లేక గురుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను లేక గురుడు నీచ క్షేత్రము నందున్న జాతకునికి చోర, అగ్ని, విషభయము, ధన ధాన్యనాశము, భార్యాపుత్ర మరణము, గాయములు, గొప్ప ఆపత్తు సంభవించును. గురుభుక్తి ప్రధమ దశ యందు జాతకునికి సౌఖ్యమును, భుక్తి అంత్యము నందు దుఃఖము సంభవించును.

దశానాధుడైన కేతువునకు భుక్తినాధుడైన గురుడు కేంద్రము నందును, లేక త్రికోణము నందును లేక తృతీయ స్థానము నందును లేక యేకాదశ స్థానము నందున్నను లేక గురుడు శుభగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి రాజాను గ్రహము, దూరపు ప్రయాణములు, అపురూపమైన వస్త్రములు, ఆభరణ లాభము, తన బంధు పోషణ, వస్త్రలాభము, పశువులు మఱియు భోజన సౌఖ్యము గలుగును. గురుభుక్తి ప్రధమ దశ యందు జాతకునికి శరీర బాధయును, తుదిదశ యందు ఉద్యోగ చలనము, ఆకస్మిక సంకటనలు సంభవించును.

భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు ద్వితీయ స్థానము నందుగాని లేక సప్తమ స్థానమునందు గాని లేక మారక గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి ఉద్యోగ భంగము, రాజభయము, వ్యాపార నష్టము, అవమానము, అగౌరవము, మనోవ్యాకులత, కారాగార వాసము, తండ్రి మరణము, కార్యభంగము, అశ్వము, ఆభరణముల విక్రయము, వాతరోగము, జలుబు, పుత్రమరణము, ప్లీహ రోగము, అపమృత్యువు సంభవించును.

**8. కేతు మహాదశలో శని భుక్తి ఫలము -**

కేతు మహాదశలో శని భుక్తి యందు, భుక్తినాధుడైన శని లగ్నమునకు కేంద్ర స్థానము నందు గాని లేక త్రికోణ స్థానము నందు గాని లేక యేకాదశ స్థానము నందు గాని లేక శుభనవాంశ యందు గాని లేక శని శుభగ్రహముతో సంబంధ మొంది యున్నను, లేక ఉచ్చక్షేత్రము నందున్నను లేక స్వక్షేత్రము నందున్న జాతకునికి వస్త్రాభరణములు, అన్ని కార్యములు జయప్రదముగా నిర్వహించుట, వివాహము, బంధవుల యొక్క పారితోషికములు, వ్యాపారము వలన ధనలాభము, అధికారము పొడిగింపు, ప్రేమపాత్రులైన పెద్దల సహాయము వలన

సౌఖ్యము, పవిత్రమైన పుణ్యక్షేత్రములను దర్శించుట, పుత్రజననము తప్పక సంభవించును. శనిగ్రహమును శుభుడు వీక్షించుచున్న జాతకునికి తలంచిన పనులన్నియు సఫలమగును. తన అధికారికి సౌఖ్యమును తెచ్చిపెట్టుట, సుందరమైన గృహ లాభము, సంతోషము, గ్రామము నందు సౌఖ్యము శనివారమున రాజసమాగమము సంభవించును.

భుక్తినాథుడైన శని లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను లేక నీచస్థానము నందున్నను లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి ఉద్యోగ భంగము, బంధు మరణము, ప్రభువు వలన ధననష్టము, తల్లిదండ్రుల మరణ భయము, మనోవ్యాధి, పుత్రమరణము, యితరుల గృహములో నివాసము, చోర, అగ్ని, రాజభయము, బానిసత్వము, వృత్తి నాశము, అవమానము, మనోవ్యధ, నీచస్త్రీలతో సహవాసము, నీచకార్యములతో సంబంధము గల్గును. భుక్తినాథుడైన శని ద్వితీయ లేక సప్తమ స్థానమునకు అధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

**9. కేతు మహాదశలో బుధ భుక్తి ఫలము -**

కేతు మహాదశలో బుధ భుక్తి యందు, భుక్తినాథుడైన బుధుడు లగ్నమునకు కేంద్రము నందున్నను లేక త్రికోణము నందున్నను లేక యేకాదశ స్థానము నందున్నను లేక తన ఉచ్చక్షేత్రము నందున్నను లేక తన స్వక్షేత్రము నందున్నను, లేక మిత్రక్షేత్రము నందున్న జాతకునికి రాజ్యలాభము, గొప్ప సౌఖ్యము మతసంబంధమైన ప్రసంగములు వినుట, ధర్మకార్యములు, వివాహము, ధర్మమునకు కట్టుబడి యుండుట, భూలాభము, పుత్రజననము, మంచి సంఘములతో సంబంధము, కష్టము లేకనే గడ్డుకార్యములను జయప్రదముగా నిర్వహించుట, గృహము నందు శుభ సంబంధమైన వేడుకలు సంభవించును.

భుక్తినాథుడైన బుధుడు భాగ్యస్థానాధిపతితో గాని లేక రాజ్యస్థానాధిపతితో గాని సంబంధ మొంది యున్న జాతకునికి అదృష్టవృద్ధి, మతసంబంధమైన సభలలో ప్రసంగములు, ప్రయత్నము లేకనే ధనలాభము, ఆభరణములు, సౌఖ్యము, పవిత్రమైన గ్రంథపరిశోధన చేయువాడుగా నుండును.

భుక్తినాథుడైన బుధుడు శని, కుజ లేక రాహువుతో సంబంధ మొందిగాని లేక వానితో వీక్షించబడిగాని యుండి 6-8-12 స్థానముల యందెందైనా యున్న యెడల జాతకునికి ప్రభుత్వ సంబంధమైన లావాదేవీలలో శత్రుత్వము, యితరుల యింటిలో నివాసము, వాహనములు, వస్త్రములు, గోవులు, ధనము, ధాన్యనాశము సంభవించును. బుధ భుక్తి ప్రథమ దశలో సౌఖ్యము, మధ్యలో సంతృప్తి అధిక ధనము, తుది దశ యందు బాధ, నాశము, భార్యాబిడ్డల అసౌఖ్యము సంభవించును. దశానాథుడైన కేతవునకు బుధుడు కేంద్రమున గాని లేక త్రికోణము నందుగాని యేకాదశ స్థానము నందుగాని యున్న జాతకునికి మంచి ఆరోగ్యము, ధాన్యవృద్ధి, పుత్రవివాహము, మంచి భోజనము, వస్త్రములు గోవులు గల్గియుండును. గొప్ప ప్రయత్నములో యెక్కువ లాభము పొంద గలుగును.

దశానాథుడైన కేతువునకు, భుక్తినాథుడైన బుధుడు 6-8-12 స్థానము నందుండి బలహీనుడై యున్న జాతకునికి రాజభయము, భుక్తి మధ్యకాలము

నందు పవిత్ర యాత్ర, ప్రధమ దశ యందు గొప్ప బాధ, భార్యాబిడ్డల బాధ గల్గును. భుక్తినాధుడైన బుధుడు లగ్నము నుండి ద్వితీయ స్థానమునకు గాని లేక సప్తమ స్థానమునకు గాని అధిపతియై యున్న జాతకునికి అపమృత్యువు సంభవించును.

### 9. శుక్ర మహాదశ ఫలములు

శుక్రమహాదశలో శుక్రుడు పరమోచ్ఛ స్థానము నందున్న జాతకుడు ఉత్సాహ పూరితమైన, శక్తివంతమైన వారితో కలియుటకు ఆసక్తి గలవాడుగా యుండును. తన కోరిక ప్రకారము సౌఖ్యమును పొందుచూ భార్య, పుత్రుడు, సంపద, వస్త్రములు, మంచి భోజనము, పూలహారములు, శయ్యాసన సౌఖ్యము పొందు వాడుగా యుండును.

శుక్ర మహాదశలో శుక్రుడు ఉచ్ఛ స్థానము నందున్న జాతకుడు స్త్రీల స్నేహముతో ధనము గోల్పోవును. సత్య ప్రవర్తన విడనాడుట, తల్లిదండ్రుల యెడబాటు దుఃఖము, తలనొప్పి, అయితే రాజ పారితోషికములు పొందు చుండును. శుక్ర మహాదశలో శుక్రుడు ఉచ్ఛ యందున్న యింకొక గ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి రాజ్యము లేక ఉద్యోగము సంక్రమించును. గొప్ప గౌరవము, సువర్ణము రత్నములు, ఆభరణములు, వాహనములు, వస్త్రములు గలవాడై మేళతాళములతో ఊరేగించబడు వాడుగా యుండును.

శుక్ర మహాదశలో శుక్రుడు పరమ నీచ స్థానము నందున్న జాతకుడు రోగముల భయముతో బాధనొందును. పనికి మాలిన పనులను చేపట్టుట, ధనమును పోగొట్టకొని భార్యా పుత్రునితో హింసించ బడును. శుక్రుడు నీచయందున్న గ్రహముతో సంబంధ మొందియున్న జాతకుడు యెక్కువ భయము, నిందల వలన అవమానము, చెడు పనుల వలన బాధ నొందుచుండును.

శుక్ర మహాదశలో శుక్రుడు అధిమిత్ర స్థానము నందున్న జాతకుడు ధనము, గోవులు, అశ్వములు, ఏనుగులు, మేళతాళములు, రాజ పారితోషికములతో సౌఖ్యము పొందు చుండును. శుక్ర మహాదశలో శుక్రుడు మిత్ర స్థానము నందున్న జాతకుడు వేదాంతిగను, జ్ఞానిగను, శాస్త్ర పండితుడును, ధనము గలవాడును, పోకచెట్ల వ్యవసాయము, అన్నిరకముల జనులతో స్నేహముగా యుండును. శుక్ర మహాదశలో శుక్రుడు సమక్షేత్రము నందున్న జాతకునికి మూలవ్యాధి, ప్లీహరోగము, నేత్ర రోగము, రాజ, అగ్ని, చోరభయము గలుగును. దశామధ్య కాలములో జాతకుడు సౌఖ్యము అనుభవించుటయే గాక బిరుదులు పొందు వాడగుచున్నాడు. శుక్రుడు తన దశాకాలములో శత్రుస్థానము నందున్న జాతకునికి కళత్ర నష్టము, బిడ్డనాశము, రాజాగ్రహము, బలిష్టమైన చెడు మనోలక్షణము గలవాడగుటచే పాపపు పనులు చేయుచుండును. శుక్ర మహాదశలో శుక్రుడు అధి శత్రుక్షేత్రము నందున్న జాతకునికి పుత్ర, కళత్ర మరణము, ధననాశము, మూలవ్యాధి, కలరా మొదలగు వ్యాధులు సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు ఉచ్ఛ స్థానమునకు అరోహణము నందున్న జాతకునికి ధాన్యలాభము, వస్త్రలాభము ముఖము నందు కళ, కొందరిచే గౌరవించ

బడుట, ధనవృద్ధి, బంధు విరోధము, తల్లి నాశము, పర స్త్రీలతో సాంగత్యము సంభవించును. శుక్ర మహాదశలో శుక్రుడు నీచ స్థానమునకు పోవుచున్న జాతకుడు యొక క్రూరమైన వ్యభిచారిణితో సహవాసము, ధనలాభము, పుత్ర, కళత్ర బంధువులతో విరోధము, మనస్థాపము, హృద్రోగము, సుఖవ్యాధులు సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు తన మూలత్రికోణ స్థానమైన తులారాశి యందున్న జాతకుడు వస్తురూపమున యిచ్చిపుచ్చుకొను వ్యాపారములో ప్రవీణుడై యుండును. చట్టపరమైన నిబంధనలు తెలిసిన వాడై గొప్ప ప్రతిష్టను పొందును. శుక్ర మహాదశలో శుక్రుడు తన స్వక్షేత్రము నందున్న జాతకునికి పుత్ర, కళత్ర, బంధువులతో సౌఖ్యము, సుఖము, సంతోషము, వేదాంతము, గొప్పతనము, యితరుల వలన అసూయ గలవాడగును. శుక్ర మహాదశలో శుక్రుడు కేంద్రస్థానము నందున్న జాతకునికి శరీర ప్రకాశము, ప్రభుత్వ ఉద్యోగము, సంపద, భూములు, వాహనములు, వస్త్రములు ఆయుధములు, పర్వతారోహణము, వనవాసము సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు లగ్నస్థానమునందున్న జాతకునికి రాజ గౌరవము, సంపద, భూములు, రత్నములు, పశువులు, గొప్ప సంతోషము, ప్రేమ గలిగి యుండును. శుక్ర మహాదశలో శుక్రుడు లగ్నమునకు ద్వితీయ స్థానము నందున్న జాతకునికి ఆదాయ వ్యయములు, సమానముగా యుండుట, మంచి భోజనము, మృదువైన పలుకులు, కనికరము, రాజగౌరవము పొందు వాడగును. శుక్ర మహాదశలో శుక్రుడు తృతీయ స్థానము నందు వృద్ధిలో యున్న జాతకునికి ధైర్యము, సంతోషము, శక్తి, సామర్ధ్యము, సుందరమైన వాహన లాభము, అదృష్టము, జ్ఞానవంతులైన సోదరులు గలుగుదురు. శుక్ర మహాదశలో శుక్రుడు నాల్గవ స్థానము నందున్న జాతకునికి ప్రభుత్వోద్యోగ లాభము, గొప్ప సౌఖ్యము, వాహన సౌఖ్యము, వ్యవసాయ ఫలవృద్ధి, పశువృద్ధి, ప్రతిష్ట, గౌరవము గలవాడగును. శుక్ర మహాదశలో శుక్రుడు పంచమ స్థానము నందున్న జాతకునికి పుత్ర జననము, రాజగౌరవము, ప్రజల సహాయము ప్రతిష్ట గలవాడగును. శుక్ర మహాదశలో శుక్రుడు షష్ట స్థానము నందున్న జాతకునికి ధనధాన్య నాశము, బిడ్డలు సోదర మరణము, పనుల యందు అడ్డంకులు, అనారోగ్యము, శత్రుభయము, రాజ, అగ్ని, చోరభయము సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు సప్తమ స్థానము నందు వృద్ధి యందున్న జాతకునికి భార్యా మరణము, పరదేశ ప్రవాసము, మూత్రరోగము, ప్లీహరోగము, బంధవులు, రాజ్యము, సంపద నాశము సంభవించును. శుక్ర మహాదశలో శుక్రుడు అష్టమ స్థానము నందున్న జాతకునికి కొద్ది సౌఖ్యము, అమిత సంపద, ప్రభువుచే పేరు పొందుట, అయితే అనేక సంకటనలు అనగా ఆయుధ, అగ్ని, చోరభయము మొదలగునవి సంభవించును. శుక్ర మహాదశలో శుక్రుడు నవమ స్థానము నందున్న జాతకునికి జ్ఞానవృద్ధి, ధనవృద్ధి, గొప్ప భక్తి, రత్నములు, ముత్యములు, ఆసనము, గోవులు భూములు, వాహనములు, వస్త్రములు, గవ్వలు మొదలగునవి గల్గి

యుండును. శుక్రమహాదశలో శుక్రుడు దశమ స్థానము నందున్న జాతకునికి జ్ఞానవృద్ధి, ధనవృద్ధి, గొప్ప భక్తి, గొప్ప అదృష్టము, శరీర ఆరోగ్యము, సంతోషము, అన్ని దిశల నుండి గౌరవ మర్యాదలు పొందు వాడగును. శుక్ర మహాదశలో శుక్రుడు యేకాదశ స్థానము నందున్న జాతకునికి పుత్రుల సౌఖ్యము, రాజభక్తి, పారితోషికములు మరియు బిరుదులు, సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, హారములతో జీవిత సుఖము గల్గును. శుక్ర మహాదశలో శుక్రుడు ద్వాదశ స్థానము నందున్న జాతకునికి ధనధాన్య లాభము, ప్రభువు నుండి పారితోషికములు, మనోవ్యధ, ఉద్యోగ భంగము, తల్లి మరణము, ప్రవాసము మొదలగునవి సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు పాపగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి ఉద్యోగ భంగము, బంధు విరోధము, అపవిత్రము, పోరాటము నందు ఆసక్తి, ధననాశము, భూనాశము, వ్యవసాయ పంట నష్టము, భార్యా పుత్ర నాశము సంభవించును. శుక్రదశా కాలము నందు శుక్రుని పాపగ్రహము వీక్షించుచున్న జాతకునికి అవమానము, ధననాశము, ఉద్యోగ భంగము, దుఃఖము, భార్యా విరోధము ప్రవాసము, కార్యభంగము సంభవించును.

శుక్ర మహాదశలో శుక్రుడు శుభగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, పుత్రలాభము, ధాన్య లాభము, మిత్రలాభము, రాజపూజ్యత, ఏనుగులు, అశ్వములు, పగడములు, రత్నములు, ముత్యములు, వాహనములు మొదలగు వాని లాభము సంభవించును. శుక్ర మహాదశ యందు శుక్రుని శుభగ్రహము వీక్షించుచున్న జాతకునికి గొప్ప భక్తి, ప్రజాతంత్ర రాజ్యము, శరీరశోభ, భార్యాపుత్ర మిత్ర సౌఖ్యము, సంపద, వస్త్రములు మొదలగునవి గల్గును. శుక్ర మహాదశలో శుక్రుడు, పాపద్రేక్కాణములో వృద్ధి యందున్న జాతకునికి గొప్ప భయము, అనేక కష్టములు, కారాగార వాసము, అగ్ని చోరభయము సంభవించును. శుక్ర మహాదశలో శుక్రుడు ఉచ్చక్షేత్రము నందుండి నవాంశలో నీచయందున్న జాతకునికి అనేక కష్టములు, ప్రభుత్వ ఉద్యోగ భంగము, అధికార నాశము సంభవించును. అదే విధమున శుక్ర మహాదశలో శుక్రుడు నీచక్షేత్రము నందుండి నవాంశలో ఉచ్చ యందున్న జాతకునికి వ్యాపార వృద్ధి, వ్యవసాయ పంటలో లాభము, పశుధన లాభము గలుగును.

శుక్ర మహాదశలో శుక్రుడు వక్రించియున్న జాతకునికి గొప్పగౌరవము, మేళతాళములతో వేడుకలు, అధికారము, సుందర వస్త్రాభరణ లాభము గలుగును. శుక్రమహాదశలో శుక్రుడు సూర్యునిచే అస్తమించబడిన జాతకుడు జీర్ణగృహము నందు నివశించుట, భార్యా సోదర మరణము, పోట్లాటలు, సౌఖ్యమనునది యెరుగని వాడుగా నుండును. శుక్ర మహాదశలో శుక్రుడు, గురువు యొక్క క్షేత్రము నందున్న జాతకునికి భూములు, భార్యా పుత్రనాశము వలన దుఃఖము, కార్యభంగము, ప్రజావిరోధము గలుగును. అదే విధముగా శుక్రమహాదశలో శుక్రుడు సింహ రాశి యందున్న జాతకునికి దుఃఖము, అనేక విధములైన అపాయములు,

రోగములు, ఉద్యోగ బాధ, యెల్లప్పుడు పనికి మాలిన కార్మాగారముల యందు పనిజేయు చుండుట, మనోవ్యధ మొదలగునవి సంభవించును.

సాధారణముగా శుక్రమహాదశ యందు జాతకునికి సంతోషవృద్ధి, మంచి ఆరోగ్యము, సంపద, వాహనములు, వ్యవసాయ పంట అభివృద్ధి, భార్యాబిడ్డల సౌఖ్యము, అన్ని స్థానముల యందు శుక్రుడుండగా జరుగు సాదారణ ఫలములు, భార్యా బిడ్డలు, అభరణములు, వస్త్రములు మొదలగువానితో జాతకుడు సౌఖ్యము, సంతోషముతో వర్ధిల్లు చుండును. పారితోషికములు, ధనలాభము, కామశాస్త్రము నందు ప్రావీణ్యము, అనేక వృత్తులలో నిపుణత్వము, గొప్ప నాట్యము, సంగీతము యిచ్చిపుచ్చుకొను స్వభావము, ఔదార్యము, వేదాంతము, వ్యాపారములో నిపుణత్వము వివాహము, బిడ్డల సౌఖ్యము, పితృ ఆస్తి వారసత్వముతో సుఖ జీవనము, బంధువుల యందు ప్రేమ; గోవులు సంపద గల్గి యుండుట, కాని వాతశ్లేష్మ రోగములతో బాధపడు చుండును.

శుక్రమహాదశలో శుక్రుడు మేషరాశి యందున్న జాతకుడు భాగ్యవంతుడు అదృష్టవంతుడు, గ్రామ పెద్దయును, లేక దేశాధినేతయును, స్త్రీలతో స్నేహముగా యుండు వాడగును. శుక్రమహాదశలో శుక్రుడు వృషభరాశి యందున్న జాతకునికి ధనవృద్ధి యును రాజపారితోషికములు, రాజకుమారునివలె జీవితము, విద్యాప్రసంగ ములో జయమును పొందును. శుక్రమహాదశలో శుక్రుడు మిధునరాశి యందున్న జాతకునికి జ్ఞానవృద్ధి, కావలసినంత సంపద గలుగును. శుక్రమహాదశలో శుక్రుడు కర్కాటక రాశిలో వృద్ధి యందున్న జాతకునికి గృహలాభము, జయము, జ్ఞానము, తల్లి, కళత్రము యొక్క ఆరోగ్యము సౌఖ్యముగా యుండును. శుక్రమహాదశలో శుక్రుడు సింహరాశి యందున్న జాతకునికి జ్ఞానవృద్ధి, సౌఖ్యము, వివాహము, పుత్ర జననము, కొంత ధనము, ధాన్యము, గలిగి యుండును. శుక్రమహాదశలో శుక్రుడు కన్యరాశి యందున్న జాతకునికి భూనాశము, తల్లికి అపాయము లేక మరణము, కొద్ధి సౌఖ్యము సంభవించును.

శుక్రమహాదశలో శుక్రుడు తులారాశి యందున్న జాతకునికి రాజకుమారుని వలె జీవితము, అనేక మంది భార్యలు, సేవకునిద్వారా సౌఖ్యము, ధనము, ప్రతిష్ట గలవాడగును. శుక్రసహాదశలో శుక్రుడు వృశ్చిక రాశి యందున్న జాతకుడు భార్యావియోగము వలన బాధపడుచుండుట, ఉద్యోగభంగము, అధికార భంగము, ధననాశము సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు ధనుస్సు రాశియందున్న జాతకునికి కళత్ర లాభము, సౌఖ్యము, సంపద, గ్రామాధికారము, కుటుంబ సౌఖ్యము గల్గును. శుక్రమహాదశలో శుక్రుడు మకర రాశి యందున్న జాతకునికి ధనలాభము, వాహనములు, అభరణములు, సకల కార్యములు నెరవేరుట, దేశమునకు లేక గ్రామమునకు అధినేతగా యుండును. శుక్రమహాదశలో శుక్రుడు కుంభరాశి యందున్న జాతకునికి మితిలేని ధనలాభము, గ్రామమునకు గాని లేక రాజ్యమునకు గాని అధిపతియగుట సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు

మీనరాశి యందున్న జాతకునకు ధన ధాన్య వాహన లాభము, సౌఖ్యము, సంగీతము నందు ఆసక్తి గల్గి యుండును.

శుక్రమహాదశలో శుక్రుడు రవితో సంబంధ మొందియున్నను లేక రవిచే వీక్షించబడుచున్న జాతకునికి అదృష్టము సంభవించును. భార్యానాశము సంపద, అధికార నాశము, భూములు నాశము గల్గును. శుక్రమహాదశలో శుక్రుడు చంద్రునితో వీక్షించ బడుచున్న జాతకునికి సంపద, వాహనములు గల్గును. శుక్రుడు కుజునితో సంబంధ మొంది యున్నను లేక వానితో వీక్షించబడుచున్న శుక్రమహాదశ కాలము నందు జాతకునికి సంపద అంతయూ నశించును. అయితే మధ్య మధ్య కొంత ధనము వచ్చుచుండును. శుక్రుడు బలహీనుడై కుజునితో వీక్షించ బడుచున్నను లేక వానితో సంబంధ మొంది యున్న జాతకుని భార్య మరణించును. శుక్ర మహాదశ వృద్ధి యందున్నప్పుడు, శుక్రుడు బుధునితో సంబంధ మొంది యున్నను లేక వానిచే వీక్షించబడుచున్న జాతకునికి గ్రామాధికారము సంక్రమించును. కాని శత్రువులతో సంకటనలు, భార్య అనారోగ్యముతో బాధపడుచుండును.

శుక్రమహాదశలో శుక్రుడు, గురునితో సంబంధ మొందియున్నను లేక వానిచే వీక్షించబడుచున్న జాతకునికి గ్రామాధికారము సంక్రమించును. భూములు, ధనము, ధాన్యనాశము గల్గి జాతకునికి దౌర్భాగ్యము సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు శనితో సంబంధ మొంది యున్నను లేక శనిచే వీక్షించబడుచున్న జాతకునికి గ్రామాధికారము, నీచస్త్రీలతో సంబంధము, భార్యావియోగము సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు రాహువుతో గాని లేక కేతువుతో గాని సంబంధమొంది యున్న జాతకుడు యొక వితంతువుతో సంబంధ మొంది యుండును. చోరీ వలన ధననష్టము గాని లేక కళత్ర మరణము గాని సంభవించును.

శుక్రమహా దశలో శుక్రునకు స్థానబలము గల్గియున్న జాతకునికి రాజ పారితోషికములు, ఆభరణ లాభము, విద్యా ప్రసంగములలో పాల్గొనుట, బిరుదులు ప్రసాదించుట సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు దిగ్బలము గల్గి యున్న జాతకునికి గొప్ప సంతోషము, కళత్ర లాభము, పుత్రలాభము, సంపద, వస్త్రలాభము సంభవించును. శుక్రమహా దశలో శుక్రుడు కాలబలము గల్గియున్న జాతకునికి సౌఖ్యము, ధనము, బిరుదల ప్రసాదము సంభవించును. శుక్రమహాదశలో శుక్రునకు దృగ్బలము గల్గియున్న జాతకుడు యజ్ఞములు చేయుట, జ్ఞానవృద్ధి, వస్త్రలాభము, ఆసనము, పట్టాభిషేకము, పోట్లాటలు, విరోధము సంభవించును.

శుక్రమహాదశలో శుక్రుడు పాపనవాంశ యందున్న జాతునికి అపాయము, రాజ, అగ్ని, చోరభయము, పశువులు, వ్యవసాయ భూముల నాశము సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు శుభనవాంశ యందున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, బావులు, చెరువులు త్రవ్వించుట, వనములు, తోటలు పెంచుట, దేవుళ్ళను పూజించుట మొదలగునవి సంభవించును. శుక్రమహాదశలో శుక్రుడు మంచి మేలైన

నవాంశ యందున్న జాతకునికి గొప్ప సౌఖ్యము. రాజపారితోషికములు. వాహనములు. సోదరుని భార్య ధనము సంక్రమించును.

1. శుక్ర మహాదశలో శుక్ర భుక్తి ఫలము -

శుక్రమహాదశలో శుక్ర భుక్తియందు. భుక్తినాధుడైన శుక్రుడు బలవంతుడై లగ్నమునకు కేంద్రమున గాని లేక త్రికోణమున గాని లేక యేకాదశ స్థానము నందుగాని యున్న జాతకునికి మంచి యోగము ప్రాప్తించి బ్రాహ్మణుల ద్వారా సంపద గల్గును. గేదెలు. గోలాభము. పుత్రజననము వలన సౌఖ్యము. వివాహ వేడుకలు. పెద్దలు లేక సాదుల గౌరవము. రాజ పారితోషికములు గల్గును. శుక్ర మహాదశలో శుక్రభుక్తి యందు. శుక్రుడు ఉచ్చ క్షేత్రము నందున్నను లేక స్వక్షేత్రము నందున్నను. లేక ఉచ్చాంశ యందున్నను లేక స్వనవాంశ యందున్న జాతకునికి నూతన గృహనిర్మాణము. భార్య బిడ్డలతో సౌఖ్యము పొందును. బంధువర్గముతో మంచి భోజనము. అన్నదానము. ప్రేమ. అభిమానము. మతసంబంధమైన ధర్మకార్యముల యందు తరచు కలుసు కొనుచుండుట. వాహన లాభము. మహారాజు అనుగ్రహము వలన వస్త్రములు. ఆభరణములు గల్గియుండుట. హోదాను బట్టి అధికారము చలాయించుట. పశ్చిమ దిశగా ప్రయాణము. పశులాభము గల్గును. లగ్నమునకు 3-6-10-11 స్థానముల యందైందైనను శుక్రుడున్నను లేక శుక్రుని శుభగ్రహము వీక్షించుచున్న లేక శుక్రుడు మిత్రనవాంశ యందున్నను. లేక ఉచ్చాంశ యందున్నను లేక యేకాదశ నవాంశ యందున్నను లేక యోగకారక గ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి ఉద్యోగము. గొప్ప సంతోషము. రాజగౌరవము. లాభమును పొందు వుత్పత్తి. గృహమునందు వివాహ వేడుకలు. భార్యాబిడ్డల సౌఖ్యము. వ్యాపారవృద్ధి. భూధన లాభము. సంతోషము. లాభకర కార్యములు నిర్వర్తించుట. నూతన గృహనిర్మాణము. జయమును పొందు వాడగును. శుక్రుడు తన భుక్తికాలము నందు కర్మాధిపతి కారకునితో సంబంధ మొందియున్న జాతకుడు రాజసమాను డగును.

శుక్రమహాదశలో శుక్రభుక్తి యందు. శుక్రుడు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధ మొందిగాని లేక పాపగ్రహముతో వీక్షించబడిగాని యున్న జాతకునికి సర్ప. చోర. వ్రణభయము. ప్రతిచోట సామాన్య జనులతో విరోధము. ప్రభుత్వముపై ద్వేషము. దగ్గర బంధువుల మరణము భార్యా బిడ్డల దుఃఖము. కార్యభంగము. తల్లి మరణము. మనోరోగము. సంకటనలు. ధననాశము. ప్రణములు బాధ. ధనవ్యయము. భార్యకు రక్తస్రావము. బానిసత్వము. విరోధము. పని ప్రారంభముననే అడ్డంకులు. తండ్రితరపు మరణము మొదలగు దుష్ఫలములు గల్గును. శుక్రుడు ద్వితీయ సప్తమస్థానములయందున్నను లేక ఈ స్థానములయొక్క అధిపతులతో కలసియున్నను జాతకునికి శుక్రదశా కాలమునందు మరణము తప్పదు.

2. శుక్ర మహాదశలో రవి భుక్తిఫలము

శుక్రమహాదశలో రవి భుక్తియందు భుక్తినాధుడైన రవి లగ్నమునకు కేంద్రమున గాని త్రికోణమునగాని లేక శుభగ్రహముతో గాని లేక ద్వితీయాధిపతితో గాని లేక నాల్గవ స్థానాధిపతితోగాని సంబంధమొంది యున్నను లేక దశానాధుడైన శుక్రునకు కేంద్రమున గాని లేక త్రికోణమునగాని రవియున్నను. లేక రవి ఉచ్చాంశయందున్నను. లేక రవి తన స్వనవాంశ యందున్నను. జాతకునికి సోదర. పుత్రలాభము భూ. ధన. ధాన్యలాభము. శత్రునాశము. రోగనాశము. గొప్ప సంతోషము మరియు సౌఖ్యము. పవిత్ర గ్రంధపఠనము. వివాహము. బంధువర్గము నుండి గౌరవము. వస్త్రవాహన లాభము. తీర్ధయాత్ర సంభవించును. ఇవియేగాక రవి భుక్తియందు రాజ్య లేక ఉద్యోగలాభము. భార్య. ధనము. గొప్పసౌఖ్యము. అభివృద్ధి. బంధు సమాగమము. తల్లిదండ్రుల సౌఖ్యము. యెచ్చట చూచిన సిరి సంపదలతో తులతూగు చుండును.

శుక్రమహాదశలో రవి భుక్తియందు రవి లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను లేక నీచస్థానము నందున్నను. లేక పాపగ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి హానిసత్వము. ఉద్యోగభంగము. రాజబాధ. మనోవ్యధ. తల్లిదండ్రుల మరణము. ఋణబాధ. తన సొంత మనుష్యుల వలన సంకటనలు. యెల్లప్పుడు క్రూరముగా మాట్లాడుట. జ్వర. వ్రణబాధ. ప్రభుత్వముతో విరోధము. అనేక విధముల భయము. వ్యవసాయ భూములు. గృహనాశము సంభవించును. రవి. సప్తమ స్థానాధిపతియై యున్న జాతకునికి ప్రేతబాధ సంభవించును.

3. శుక్ర మహాదశలో చంద్ర భుక్తిఫలము

శుక్రమహాదశలో చంద్ర భుక్తియందు భుక్తినాధుడైన చంద్రుడు లగ్నము నకు కేంద్రమునగాని లేక త్రికోణమునగాని లేక యేకాదశ స్థానము నందుగాని లేక స్వక్షేత్రమున గాని లేక ఉచ్చక్షేత్రమునగాని లేక చంద్రుడు నవమలేక దశమాధి పతులతో సంబంధమొంది యున్నను లేక వాని స్థానముల యందున్నను. లేక పూర్ణచంద్రుడై యున్న జాతకుడు పూర్ణుడై పవిత్ర నదులలో స్నానము చేయుచూ దేవబ్రాహ్మణ దర్శనము చేయు వాడగును. రాజానుగ్రహము వలన అదృష్టము. పాటలతో ప్రసంగములు. జ్ఞాన సమాజములతో సంబంధము. గేదెలు. గోవుల లాభము. వ్యవసాయ భూములలో యెక్కువ పంట. మంచి పానీయము. ఆహారము వలన సౌఖ్యము. వస్త్రలాభము. బంధు వర్గముతో భోజనము. సంసార సంతోషము. ధన ధాన్యవృద్ధి. భూములు. ఆభరణ లాభము. నూతన గృహ నిర్మాణము. వ్యాపార మార్గముల ద్వారా అనుకున్న కార్యములు సఫలమగుట. గొప్పసౌఖ్యము సంప్రాప్తమగును.

శుక్రమహాదశలో చంద్రభుక్తి యందు. చంద్రుడు నీచస్థానము నందున్నను లేక పాపగ్రహముల మధ్యయున్నను లేక 6-8-12 స్థానముల యందున్నను జాతకునికి ధననాశము. ప్రవాసము. గొప్పభయము. శరీర అలసట. అపనిందలు. గొప్ప ఉద్యోగులతో శత్రుత్వము. విదేశ సంచారము. యాత్రాసుఖము. భార్యాబిడ్డల

దుఃఖము, బంధువర్గము నుండి విడిపోవుట, దగ్గర మిత్రునితో కలహము, బంధు మరణము, ఋణబాధ మొదలగునవి సంభవించును.

శుక్రమహా దశలో చంద్ర భుక్తియందు చంద్రుడు, దశానాధుడైన శుక్రునకు కేంద్రము నందుగాని లేక త్రికోణము నందుగాని లేక యేకాదశ స్థానము నందుగాని యున్న జాతకునికి రాజగౌరవము, గ్రామాధి పత్యము, ధైర్యము, ప్రతిష్ట, సౌఖ్యము, సంతోషము, వాహనములు, వస్త్రములు, ఆభరణములు, వనముల నిర్మాణము, చెరువులు, బావులను త్రవ్వించుట, సంపద వృద్ధి సంభవించును. చంద్రభుక్తి ఆది యందు సౌఖ్యమును, తుదియందు దుఃఖము సంభవించును.

### 4. శుక్ర మహాదశలో కుజ భుక్తిఫలము

శుక్రమహాదశలో కుజభుక్తి యందు భుక్తినాధుడైన కుజుడు లగ్నమునకు కేంద్రమునగాని లేక త్రికోణమునగాని లేక ఉచ్చస్థానము నందుగాని లేక స్వక్షేత్రము నందుగాని లేక యేకాదశ స్థానము నందుగాని యుండి బలవంతుడై యున్నను లేక లగ్నము లేక నవమాధిపతి లేక దశమాధిపతితో సంబంధ మొందియున్న జాతకుడు రాజ యోగము వలన వృద్ధియందుండును. జాతకుడు సంతోషము, శ్రేయస్సుతో జీవించు చుండును. ఆభరణములు, భూములు, వస్త్రములు, తల్లిసుఖమును పొందు వాడుగా యుండును. పుత్రజననము, గృహమునందు వివాహవేడుకలు, రత్నములు, ఆభరణములు, వ్యాపారములో అధికధన లాభము, రాజపూజ్యత, శరీరసుఖము,, ప్రకాశము, శత్రునాశము, సోదరుల తరపున దీవెనలు, వ్యవసాయమున అధికఫల సాయము, సామాన్య సౌఖ్యము సంభవించును.

శుక్రమహాదశలో కుజభుక్తియందు కుజుడు లగ్నమునకుగాని లేక దశా నాధుడైన శుక్రునకుగాని 6-8-12 స్థానముల యందున్నను లేక నీచస్థానము నందున్న జాతకునికి మన్యపు జ్వరము వలన బాధ, మాతా పితలకు అపాయము, ఉద్యోగ భంగము; మనోవ్యధ, బంధు మరణము, సంకటనలు, ప్రభువు వలన బాధ, ప్రభుత్వోద్యోగుల ద్వేషము, ధనధాన్య నాశము, భూఫల సాయము తగ్గుట, పొలముల నాశము సంభవించును. కుజుడు లగ్నమునకు, ద్వితీయ లేక సప్తమాధి పతియై యున్న జాతకునికి శరీరబాధ సంభవించును.

### 5. శుక్ర మహాదశలో రాహు భుక్తిఫలము

శుక్ర మహాదశలో రాహు భుక్తియందు, భుక్తినాధుడైన రాహువు లగ్నము నకు కేంద్రము నందుగాని, లేక త్రికోణము నందుగాని లేక ఏకాదశ స్థానము నందుగాని లేక ఉచ్చక్షేత్రమైన వృషభరాశి యందుగాని లేక శుభగ్రహముచే వీక్షించబడిగాని లేక యోగకారక గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి గొప్పసౌఖ్యము, ధన ధాన్యలాభము, బంధు సమాగమము, ప్రయాణములో కార్యనిర్వహణ, వస్త్రలాభము, మంచి ఆహారము, గోవులు, వ్యవసాయ భూములు సంక్రమించును.

శుక్రమహాదశలో రాహు భుక్తియందు రాహువు లగ్నమునకు 3-6-10-11 స్థానముల యందున్న జాతకునికి సౌఖ్యము, శత్రునాశము, గొప్పసంతోషము,

రాజగౌరవము. మంచి అభివృద్ధి గలుగును. మొదటి యైదునెలల భుక్తి కాలములో మంచి కార్యములు సంభవించును. తరువాత జాతకునికి అజీర్ణవ్యాధి. జ్వరము. కార్యభంగము. ప్రయాణములో మతిభ్రమ సంభవించును. తరువాత కొంత కాలమునకు జాతకుడు గొప్పసౌఖ్యము పొందగల్గును. నైరుతీదిశ ప్రయాణములో గొప్పవాని దర్శనము. ప్రయాణములో కార్యసఫలము. యితరుల భూమి వాపస్సు. బ్రాహ్మణులకు సహాయము. పవిత్ర పుణ్యక్షేత్ర లాభము. తలపెట్టిన పనిపూర్తి యగుట. పుత్ర జననము. వ్యాపారములో ఉద్యోగప్రాప్తి. విదేశస్త్రీతో సహవాసము. ప్రభుత్వ సహకారముతో పని పూర్తి చేయుట. పేరుప్రతిష్ట గల్గియుండుట. వివాహము. బంధువర్గము నుండి పారితోషికములు. సంసార సౌఖ్యము.అధిక ధన లాభము. రత్నములు. ఆభరణప్రాప్తి. చోరుల నుండి ధనలాభము. గో. వాహన లాభము. గొప్ప ఉద్యోగము సంపాదించుట. పాటలు. సంగీతము వినుట. గురువు. దైవ దర్శనము. పోయిన ఆస్తి సంపాదించు కొనుట. విదేశముల యందు నివాసము సంభవించును.

శుక్ర మహాదశలో రాహు భుక్తియందు. రాహువు లగ్నమునకుగాని లేక దశానాధుడైన శుక్రునకుగాని 6-8-12 స్థానమునందున్న జాతకునికి మాతాపితల మరణము. రాజాగ్రహము. బంధునాశము. వృత్తి ధననాశము. బానిసత్వము. సంకెళ్ళతో కారాగార వాసము. ప్రవాసము. శరీర బలహీనత. ప్రతిపనికి అడ్డంకులు. అపమృత్యు భయము సంభవించును.

### 6. శుక్ర మహాదశలో గురు భుక్తిఫలము

శుక్రమహాదశలో గురు భుక్తియందు భుక్తినాధుడైన గురుడు లగ్నమునకు కేంద్రము నందుగాని లేక త్రికోణము నందుగాని లేక ఉచ్చక్షేత్రము నందుగాని లేక స్వక్షేత్రము నందుగాని లేక స్వనవాంశ యందుగాని లేక శుభనవాంశ యందుగాని. లేక మిత్రక్షేత్రమునగాని లేక ఏకాదశాధిపతితోగాని లేక కర్మాధిపతితో గాని లేక దశానాధుడైన శుక్రునకు. కేంద్రమునగాని లేక త్రికోణమున గానియున్న జాతకునికి పోయిన రాజ్యము లేక ఉద్యోగము లేక ధనము సంక్రమించుట. తలంచిన కార్య లాభము. వస్త్రలాభము. గొప్ప స్నేహితుని పారితోషికములు. గొప్పసంపద. ధనధాన్య లాభము. పేరుప్రతిష్ట రాజబహుమతులు. అశ్వములు. వాహనములు. జ్ఞానులతో పరిచయము. గ్రంధపఠన. శిశుజననము వలన సౌఖ్యము. బంధుసమాగమము. మాతాపిత సౌఖ్యము. సోదరులు. పుత్రుల సౌఖ్యము. వ్యాపారము వలన అధిక ధన లాభము. పశుపోషణ. నైరుతీదశ ప్రయాణము. బంధు దర్శనము. అశ్వములతో నడుపబడు వాహన లాభము. రత్నములు. ఆభరణ లాభము సంభవించును.

శుక్రమహా దశలో గురుభక్తి యందు గురుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో సంబంధ మొంది యున్న జాతకునికి రాజ. చోర. అగ్నిభయము. శరీరబలహీనత. మనోవ్యధ. దగ్గర బంధు మరణము. సంకటనల వలన ఆత్మవిచారణ. కలతలు. ఉద్యోగ భంగము. ప్రవాసము. అనేక రకమైన వ్యాధులు సంభవించును. మారక స్థానములై ద్వితీయ. సప్తమ స్థానముల యందు గురుడున్నను లేక మారక గ్రహముతో సంబంధ మొంది యున్న

జాతకునికి శరీర బలహీనత, సోమరితనము, ప్రతిపనికి అడ్డంకులు,అపమృత్యువు సంభవించును.

**7. శుక్ర మహాదశలో శని భుక్తిఫలము**

శుక్రమహా దశలో శనిభుక్తి యందు, భుక్తినాధుడైన శని ఉచ్చస్థానము నందు గాని లేక తన ఉచ్చ స్థానమైన తులారాశిలో 20 భాగలైన తన పరమోచ్చ స్థానము నందున్నను, లేక తన స్వక్షేత్రము నందున్నను లేక కేంద్రము నందున్నను లేక త్రికోణము నందున్నను, లేక ఉచ్చాంశ యందున్నను లేక స్వనవాంశ యందున్న జాతకునికి గొప్ప సౌఖ్యము, బంధుసమాగమము, పెద్దలు, సాధువులను పూజించుట, అందరిచే ప్రేమ గౌరవము పొందువాడును, మంచి గౌరవ ప్రదమైన కన్యను వధువుగా గాని లేక తనయింటి కోడలుగా గ్రహించుట, పవిత్ర పుణ్యక్షేత్ర లాభము, ధర్మకార్యములకు, వేదాంత సంబంధమైన కార్యములకు అవకాశము గల్పించు కొనుట సంభవించును.

శుక్రమహా దశలో శనిభుక్తి యందు శని దశానాధుడైన శుక్రునికి కేంద్రము నందు గాని లేక త్రికోణము నందు గాని లేక తృతీయ స్థానము నందు గాని లేక యేకాదశ స్థానము నందు గాని యున్న జాతకుని బిడ్డలు, బిడ్డల యొక్క బిడ్డలు పరిజ్ఞానము గలవారుగ యండుట, తన నాయకుని యొక్క అభివృద్ధి, వివాహ వేడుకలు, బంధువుల పారితోషికములు, వ్యాపార లావాదేవీల యందు లాభము, మత సంబంధమైన ప్రసంగములు వినుట, పుత్రజననము, గొప్ప ధనలాభము, పడమటి దిశగా ప్రయాణము చేయునపుడు కార్యనిర్వహణ, ప్రభువు ద్వారా ధనలాభము, పర స్త్రీ స్నేహము, పనికిమాలిన కార్యమునందు లాభము, దగ్గర స్నేహితుల వలన సౌఖ్యలాభము గల్గును. దశానాధుడైన శుక్రునకు భుక్తినాధుడైన శని 6-8-12 స్థానముల యందు యందైనా యున్న జాతకుడు చండాలుని యింటి యందు నివశించుట, బానిసత్వము, ప్రభుత్వ శిక్ష, ఉద్యోగ భంగము, మనోవ్యధ, ఋణబాధ, ధనవ్యయము, వ్యయసాయము నందు తలచిన దాని కంటె తక్కువ ఫలసాయము,. వాహనములు, వస్త్రములు, ప్రణముల బాధ, అగ్ని, జ్వరము, వాహనముల భయము, వస్త్రవాహన నాశము, జ్వరము, చోరభయము, మనోవ్యధ సంభవించును. శని ద్వితీయాధి పతిగను, లేక సప్తమాధిపతిగను యున్న జాతకునికి బానిసత్వము, ప్రభుత్వ శిక్ష, ఉద్యోగ భంగము, మనస్సు నందు బాధ, ఋణబాధ, ధనవ్యయము, వ్యవసాయము నందు తలంచిన దాని కంటె తక్కువ వంట, వాహనములు, వస్త్రముల నాశము, ప్రణబాధ, అగ్ని, జ్వర, చోరభయము, మనోవ్యధ సంభవించును. భుక్తినాధుడైన శని ద్వితీయ, సప్తమాధిపతియై యున్నను లేక మారకగ్రహముతో సంబంధమొంది యున్న జాతకునికి శరీర బలహీనత, ప్రతిపని యందు అడ్డంకులు, అపమృత్యువు సంభవించును.

**8. శుక్ర మహాదశలో బుధ భుక్తి ఫలము**

శుక్రమహాదశలో బుధభుక్తి యందు, భుక్తినాధుడైన బుధుడు లగ్నమునకు కేంద్రము నందున్నను, లేక త్రికోణము నందున్నను, లేక ఏకాదశ స్థానము నందున్నను, లేక ఉచ్చక్షేత్రము నందున్నను, లేక స్వక్షేత్రము నందున్న జాతకునికి

అభివృద్ధి, సౌఖ్యము, రాజగౌరవము, పుత్రజననము, సత్యసమ్మతమైన ధనలాభము, జ్ఞాన సంబంధమైన ప్రసంగములు వినుట, ప్రేమ సంబంధమైన భావప్రకటన గలవారితో స్నేహము, బంధు వర్గముతో సమాగమము, బ్రాహ్మణ పెద్దలతో స్నేహము, తన నాయకుని అభివృద్ధి, యజ్ఞములు చేయుట, సుందర గృహము నందు నివాసము వైశ్యులు మరియు వ్యాపారము ద్వారా ధనలాభము, మంచి ఆహారము, ప్రయాణము వలన కార్యసిద్ధి, మతసంబంధమైన కార్యములో యెడతెగని ఆలోచన, క్రొత్త ఉద్యోగముతో సౌఖ్యము, రాజపారితోషికముల వలన సంతోషము, గృహములో వివాహ వేడుకలు, మనస్సులో పరమానందము, సంతోషము, పవిత్ర యాత్రల యందు యోగులతో సమాగమము సంభవించును.

శుక్రమహాదశలో బుధభుక్తి యందు, భుక్తినాధుడైన బుధుడు లగ్నమునకు 6-8-12 స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రము నందున్నను, లేక పాప గ్రహముతో సంబంధ మొందియున్నను, లేక వాని క్షేత్రము నందున్న జాతకునికి మాతాపితల మరణము, వ్యాపారములో ఆస్తి నష్టము, ఆకస్మిక పోట్లాటలు, రాజ దండన వలన ధనవ్యయము, కారాగార వాసము, భార్యాపుత్ర మరణము, మనో వ్యధ, ఋణబాధ, ప్రవాసము, బంధు విరోధము మొదలగు దుష్ఫలములు సంభవించును. భుక్తినాధుడైన బుధుడు ద్వితీయాధిపతిగాని లేక సప్తమాధిపతి గానియై యున్నను లేక మారక గ్రహముతో సంబంధ మొందియున్న జాతకునికి శరీర బలహీనత, మనోవ్యధ అపమృత్యువు సంభవించును.

**9. శుక్ర మహాదశలో కేతు భుక్తి ఫలము -**

శుక్రమహాదశలో కేతు భుక్తి యందు కేతువు తన ఉచ్చస్థానమైన వృశ్చిక రాశి యందున్నను, లేక తన స్వక్షేత్రమైన మీనము నందున్నను, లేక యోగకారక గ్రహముతో బంధుత్వము పొంది యున్నను లేక కేతువు స్థానబలము గల్గియున్నను లేక కేంద్రము నందు గాని లేక త్రికోణము నందు గాని యున్నను లేక శుభ గ్రహముతో సంబంధ మొందియున్న, జాతకునికి ఫలసాయము పెరుగుట, రత్నములు, ఆభరణ లాభము, భుక్తి ఆదియందు యెక్కువ సౌఖ్యమును, నిత్యము మంచి ఆహరము, వ్యవసాయ వ్యవహారములలో అధికారమును, గేదలు, గోవుల వృద్ధి, అరుదైన వస్తులాభము, విదేశ స్త్రీతో సాంగత్యము, మతసంబంధమైన ప్రసంగములు వినుట, వ్యాపారము వలన అధిక లాభము, యితరుల గృహము నందు నివాసము, వితంతువుతో స్నేహము, ప్రయాణము నందు పనిచేయుట, పుత్ర జనన వేడుకలు, ప్రభువును పూజించుట, సంతోష వృద్ధి, మొదలగునవి సంభవించును.

శుక్రమహా దశలో కేతు భుక్తి యందు, భుక్తినాధుడైన కేతువు లగ్నమునకు 6-8-12 స్థానముల యందుగాని లేక దశానాధుడైన శుక్రునకు కేతువు 6-8-12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముచే వీక్షించబడిగాని లేక వానితో సంబంధ మొందిగాని యున్న జాతకునికి అగ్ని, చోర, విషభయము, శిరోరోగము, అపనిందలు, బంధు విరోధము, భార్యాపుత్ర నాశము, మనోవ్యధ, రాజదండన, శరీర బలహీనత, కార్యభంగము, తండ్రి మరణము, ఆదాయము తగ్గుట, గొప్ప భయము మొదలగునవి సంభవించును.

**జాతక పారిజాతము, సారావళి, ఫలదీపిక, జాతక అలంకారము మొదలగు గ్రంథముల యందు గ్రహముల మహా దశా ఫలములు మరియు వాని భుక్తి ఫలములు ఈ క్రింది విధముగా వ్రాయబడి యున్నవి.**

## 1. రవి మహాదశ

లగ్నము మొదలు కేంద్రకోణ యుచ్ఛ స్వక్షేత్రమందు గాని శుభగ్రహ సంబంధము గాని వీక్షణము గాని గలిగి రవి బలవంతుడై యున్న ఆ రవి మహా దశలో ధనకనక సమృద్ధి, పుత్ర లాభము, బుద్ధి, జ్ఞాన, కీర్తి, పౌరుష, అధికారాతిశయము, సుఖప్రాప్తి, ఈశ్వరాను గ్రహము, ధాన్యవృద్ధి, రాజ సన్మానము, రాజకీయోద్యోగము, పితృ సౌఖ్యము, శరీరారోగ్యము, నేత్ర సౌఖ్యము, మొదలగు శుభఫలములు గలుగును.

రవిమూల త్రికోణ రాశి భాగలలో గాని, స్వక్షేత్రము నందు గాని, యుచ్ఛ స్థానములో 10వ భాగమగు పరమోచ్ఛ స్థితిలో బలవంతుడు. లగ్నాత్తు కేంద్ర త్రికోణ స్థానము లందుగాని, లాభ స్థానము నందు గాని నవమ దశమాధిపతులతో గలసి యుండి అధికమైన శుభవర్గులను పొంది యున్న అట్టి రవి మహాదశ మహా సౌఖ్యము ధనము మొదలగు శుభఫలముల నిచ్చును. ఈ స్థానముల యందుండి రవి పంచమాధిపతితో గలిసియున్న అత్యంత సన్మానములను, గౌరవములను, పుత్ర లాభము, అధిక, భోగాదులు, మొదలగు శుభఫలములు గలుగును. మరియు నారవికి ద్వితీయాధిపతితో సంబంధము గలిగి నపుడు మహాభోగములు గల్గి జాతకుడు మంచి సంపన్నుడగును. చతుర్థాధిపతితో సంబంధము గల రవిదశ మూడు రకముల వాహన లాభములను గలుగు జేయును. రవి శుభస్థానముల యందుండి బలవంతుడై యున్న వాని మహాదశలో రాజాధికారము, గొప్ప ఉద్యోగము, ఖ్యాతి, విశేష ధనార్జనము గలుగును.

రవి నీచ షష్టాష్టమ వ్యయశత్రు క్షేత్రముల యందు పాపగ్రహములతో కలసి బలహీనుడై యున్న శత్రు భయము, నేత్ర రోగము, భోజన సౌఖ్య హీనము, జ్వరము, పితృవిచారము, వ్యాపార నష్టము, ద్రవ్య నష్టము, రోగము, రాజాగ్రహము, పితృ మరణము సంభవించును. రవి విశేష దుర్బలుడై యున్న శరీర పీడ, ఉద్యోగ భ్రష్టత్వము, శత్రువృద్ధి, పిత్రార్జిత ధనవ్యయము, సంతాన విచారము, కుటుంబ చిక్కులు మొదలగునవి గలుగును.

## 1. రవి మహాదశలో గ్రహముల యొక్క భుక్తి ఫలము

దశానాధుడైన రవి లగ్నము నందుండి కుజ, శని, రాహు కేతువుల భుక్తులు సంభవించి నపుడు, జాతకునికి ఉద్యోగ భంగము, రాజ్యనాశము, సంపద నష్టము, గృహనాశము, దౌర్భాగ్యము సంభవించును.

దశానాధుడైన రవి లగ్నము నందుండి గురు, శుక్ర, చంద్ర, బుధ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి భూలాభము, ధనలాభము, సంపద వృద్ధి, భార్యాబిడ్డల సౌఖ్యము గలుగును.

వృషభము లగ్నమై, నీచ స్థానమైన మకర రాశియందు భుక్తి నాథుడై గురుడున్ననూ, లగ్నము మీనమై శుక్ర భుక్తి జరుగుచున్ననూ, కుంభము లగ్నమై చంద్ర భుక్తి జరుగుచున్ననూ, లగ్నము వృశ్చికమై బుధభుక్తి జరుగుచున్ననూ, మరియు రవిదశ జరిగిన దశలలో 3 వది గాని, 5 వదిగాని లేక 7 వది గానియై యున్న జాతకునికి దౌర్భాగ్య ఫలములు సంభవించును.

జననకాలమున దశానాథుడైన రవి ద్వితీయ స్థానము నందుండి పాపగ్రహ భుక్తులు జరుగుచున్న అట్టికాలమున జాతకునికి ధననాశము, మనోవ్యధ, భయము, క్రూరవాక్కులు, నేత్ర రోగము సంభవించును.

జననకాలమున దశాలుధుడైన రవి ద్వితీయ స్థానము నందుండి శుభగ్రహములైన గురు, శుక్ర, వృద్ధి చంద్ర, పాపలతో యుతినొందని బుధ భుక్తి కాలము నందు జాతకునికి గొప్ప సౌఖ్యము, జ్ఞాన వృద్ధి, రాజ గౌరవము, వాహన సౌఖ్యము, ఆభరణ వస్త్ర లాభము గలుగును.

దశానాధుడైన రవి తృతీయ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న జాతకునికి సౌఖ్యము, ధైర్యము, సంపద, జయము, పుత్ర జననము గలుగును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి చిక్కులు సంభవించును.

దశానాధుడైన రవి చతుర్ధ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న జాతకునికి భార్యాబిడ్డల సౌఖ్యము, సంపద వృద్ధి, వస్త్ర సుగంధ ద్రవ్యలాభము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు మాతృ నాశము, మనోవ్యధ, రాజ అగ్ని భయము సంభవించును.

దశానాధుడైన రవి పంచమ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న జాతకునికి భూలాభము, ఉద్యోగము, పుత్ర జననము, వాహన ప్రాప్తి ఆభరణ లాభము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి రాజచోరాగ్ని భయము, పుత్రుల వలన సంకటనలు సంభవించును.

దశానాధుడైన రవి షష్ఠ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగు చున్న జాతకునికి ప్రథమమున సౌఖ్యము, తరువాత అసౌఖ్యము సంభవించును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి హానికరముగా యుండును. ఋణబాధ, రాజ, అగ్ని, చోర భయము సంభవించును.

దశానాధుడైన రవి సప్తమ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగు చున్న జాతకునికి భార్య సౌఖ్యము, సంతోషము, వస్త్రవాహన ఆభరణ లాభము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు దౌర్భాగ్యము, జ్వరము, రోగము, చిక్కులు, శత్రు భయము మొదలగునవి సంభవించును.

దశానాధుడైన రవి అష్టమ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగుచున్న జాతకునికి సామాన్య సౌఖ్యము గల్గి మధ్య కాలములో కష్టములు సంభవించును. అంత్యకాలమందు సంతోషము, సౌఖ్యము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు దౌర్భాగ్యము, జ్వరము, రోగబాధ లేక మరణము, బానిసత్వము గలుగును.

దశానాధుడైన రవి నవమ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగుచున్న జాతకునికి యజ్ఞయాగాది ధర్మకార్యములు, పండుగలు, వేడుకలు

మొదలగునవి గల్గును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి దౌర్భాగ్యము మాతాపితల నాశము సంభవించును.

దశానాధుడైన రవి దశమ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగుచున్న జాతకునికి ఉద్యోగ వృద్ధి, రాజ్య లాభము, అధిక గౌరవము, మర్యాద గలుగును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి ఉద్యోగ భంగము, సంపద నాశము రాజచోర అగ్నిభయము సంభవించును.

దశానాధుడైన రవి ఏకాదశ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగుచున్న జాతకునికి అధిక సంపద, రాజసన్మానము, ప్రభువు భార్యబిడ్డల వల్ల ప్రేమ గల్గును. పాపగ్రహ భుక్తుల యందు దౌర్భాగ్యము తరువాత సౌఖ్యము సంభవించును.

దశానాధుడైన రవి ద్వాదశ స్థానము నందుండి శుభగ్రహ భక్తులు జరుగుచున్న జాతకునికి భూలాభము, పశులాభము, వస్త్రలాభము, ధాన్యలాభము, రత్నములు పగడములు, ఆభరణములు గల్గును. పాపగ్రహ భుక్తుల యందు అధిక భయము, ఉద్యోగ భంగము, స్వదేశము నుండి ప్రవాసము, రాజాను గ్రహము సంభవించును.

## రవి దశా భుక్తి ఫలములు

రవి దశాభుక్తి కాలములో భుక్తినాధుడు శుభుడై యున్న శుభఫలములును, పాపుడై యున్న పాపఫలములు యిచ్చువాడగు చున్నాడు. శుభులు, పాపులను నిర్ణయించునపుడు గ్రహముల యొక్క స్థానబలము, స్వభావము, ఉచ్ఛనీచలు, కేంద్రమూల త్రికోణ స్థానముల, ఆధిపత్యములు మఱియు వానికి నియమించిన నిబంధనలను బట్టి సాదారణముగా తెలుసుకొన వలెను. పూర్వ జన్మలో జేసిన పుణ్యాపాపములను బట్టి ఈ జన్మ యందు సుఖ దుఃఖములు గల్గు చుండును. జాతక చక్రములో గ్రహిములున్న స్థానములు వాని బలాబలములను బట్టి జాతకునికి శుభాశుభములు యేకాలము నందు జరుగునది వాని దశాభుక్తుల వలన గ్రహించ గల్గు చున్నాము.

**1. రవి దశలో రవి భుక్తి ఫలము -**

రవి దశలో రవి భుక్తి యందు రవి శుభుడై బలము గల్గియున్న జాతకునికి సంపద వృద్ధి, ధాన్య వృద్ధి, ఆరోగ్యము, ప్రభువును సంతోష పెట్టునట్టి ఉన్నత శ్రేయస్సు, రాజ గౌరవము వలన ప్రతిష్ట, పారితోషికములు మొదలగునవి గల్గును.

రవి దశలో రవి భుక్తి యందు రవి పాపియై బలహీనుడై యున్న జాతకునికి చోర, అగ్ని, అపాయము వలన భయము, శరీర అలసట, మనోరోగము, ప్రతిపనికి అడ్డంకులు, విదేశయానము, క్షయరోగము, పోరాటము, బంధు హాని, బ్రాహ్మణుల వలన చిక్కులు, కుటుంబములో రక్త స్రావము, తలనొప్పి, కుడి కాలి యందు నొప్పి, మధుమేహము, కొండలు, అడవుల యందు సంచారము, తండ్రి మరణము లేక యెడబాటు సంభవించును.

**2. రవి దశలో చంద్ర భుక్తి ఫలము -**

రవి దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి మిత్రలాభము, సంపద వృద్ధి, వాహనములు, రాజ గౌరవము, వివాహ వేడుకలు, శత్రుజయము, ధనలాభము, వ్యవసాయ లాభము, కష్టములు తొలగుట, గృహ నిర్మాణము, మిత్ర సమాగమము సంభవించును.

రవి దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి నీటిలో అపాయము, పాండు రోగము, అతి సారము కష్ట సంకటసలు, స్త్రీల వలన శత్రుత్వము, నేత్ర రోగము, గొప్ప కీడు, క్షయరోగము, నీటి కాలుష్యము వలన గలుగు రోగములు, అగ్నిభయము సంభవించును.

**3. రవి దశలో కుజ భుక్తి ఫలము -**

రవి దశలో కుజ భుక్తి యందు కుజుడు బలము గల్గియున్న జాతకునికి భూలాభము, వ్యవసాయ లాభము, గృహ నిర్మాణము, సాధారణ సౌఖ్యము గలుగును.

రవి దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి అగౌరవము, మనోవ్యధ, భూతభయము, రోగము, జ్వరము, ఆయుధ అగ్ని భయము, వ్యాజ్యములు, పైత్య రోగము, దాహ రోగము, బంధు హాని, స్వార్జిత హక్కుగల ఆస్తి నష్టము, వ్యవసాయము నందు ఆదాయము క్షీణించుట, అధికార నష్టము, శత్రు భయము, గాయములు, బంధు విరోధము, రాజ భయము, సంపద నష్టము గల్గును.

**4. రవి దశలో రాహు భుక్తి ఫలము -**

రవి దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలము గల్గియున్న జాతకునికి సామాన్య సౌఖ్యము, మంచి ఆరోగ్యము, రాజ గౌరవము, ప్రతిష్ట, సంపద వృద్ధి, వివాహ వేడుకలు, బిడ్డల వలన ఆనంద సౌఖ్యము గలుగును.

రవి దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి నూతన శత్రువులు, ధననష్టము, విషభయము, కామ సుఖము నందు మగత, తలనొప్పి, నేత్ర రోగము, ఆయుధ భయము, పుత్ర లేక సోదర లేక సోదరి ఆస్తి విభాగము లేక స్వదేశము నుండి పుత్ర ప్రవాసము, సోమరితనము కార్య భంగము, చోర అగ్ని బాధ ఎలుకల వల్ల ఆస్తి నష్టము గల్గును.

**5. రవి దశలో గురు భుక్తి ఫలము -**

రవిదశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి విశేష కీర్తి, రాజ సన్మానము, వైభవము, ధర్మ కార్యములు, పుత్ర లాభము గౌరవము, విశేష ధనలాభము, శత్రు పరాజయము, ఆనందము, దైవపూజ, గురు బ్రాహ్మణ భక్తి, ప్రజా కార్యనిర్వహణలో గౌరవము; ప్రతిష్ట మొదలగునవి సంభవించును.

రవి దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి విశేష ధననష్టము, ధర్మ కార్యముల వల్ల ధనవ్యయము, పరదేశ నివాసము, చోర భయము, అగ్నిభీతి, ప్రభువుల వల్ల అపకారము, బంధు

ార్యాబిడ్డల నాశము, అనారోగ్యము, రాజాగ్రహము, భయము, నేత్ర రోగము ఊపిరి తిత్తులకు సంబంధించిన క్షయవ్యాధి మొదలగునవి సంభవించును.

6. రవి మహాదశలో శని భుక్తి ఫలము -

రవి దశలో శని భుక్తి యందు శని శుభుడై బలము గల్గియున్న జాతకునికి రాజ సన్మానము, రాజుల వల్ల ధనలాభము, సౌఖ్యము, పుత్ర సంతానము, వేదాంత శ్రవణము, ధాన్యలాభము, వేడుకలు, శత్రు పరాజయము, శరీర సౌఖ్యము, గంధ మాల్యాంబరములు గల్గుట మొదలగునవి సంభవించును.

రవి దశలో శని భుక్తియందు శని పాపియై బలహీనుడైయున్న జాతకునికి ధననష్టము, గొప్ప దుఃఖము, ధనధాన్యాది నాశము, బంధు కలహము, శత్రు వృద్ధి, నీచుల సహవాసము, స్నేహితులతో శత్రుత్వము, అవయవములలో లోపము, పక్షవాతము, బంధు నాశము, వాహన నష్టము, జ్వరము, గాయములు, మధు మేహము, కుష్ఠము, భార్యానాశము, మనోవ్యధ, శత్రువుల వలన చిక్కులు, ఆస్తి నష్టము, శ్లేష్మ వ్యాధి, అందరితో విరోధము, అధిక వ్యయము, బిడ్డలు విడిపోవుట, సుఖవ్యాధులు, వస్తు నష్టము, భార్యా అనారోగ్యము, బొడ్డు వద్ద బాధ సంభవించును.

7. రవి దశలో బుధ భుక్తి ఫలము -

రవి దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి విశేష ధనలాభము, కీర్తి, ధైర్యము, వస్త్రాభరణములు, సంపద, శిల్ప విద్యా ప్రవీణతయు, శరీర సౌఖ్యము, అధికారము, పరిపాలన, రాజ పారితోషికములు, ఆభరణములు, వస్త్రలాభము గల్గును.

రవి దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి అన్ని విధముల పరాభవము, విదేశ వాసము వల్ల దుఃఖము, చోర అగ్ని భూపతుల వల్ల భయము, వ్యాపారము వలన ధనవ్యయము, బంధు విరోధము, శరీర బాధ, మనోవ్యధ, రక్తస్రావము, వ్యాజ్యములు, వాక్కు స్వాతంత్రియములపై ఆంక్ష, వాతపిత్త శ్లేష్మ రోగములు వలన భయము, చర్మ రోగములు, కామెర్లు, కడుపు నొప్పి, అంత్య కాలమున బాధాకరమైన సంకటనలు సంభవించును.

8. రవిదశలో కేతు భుక్తి ఫలము -

రవి దశలో కేతు భుక్తి యందు కేతువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వ్యవసాయము వల్ల ధనలాభము, గోలాభము, విద్యా సౌఖ్యము, బంధు సమాగమము, భోజనాంతర సౌఖ్యము, స్వబంధువుల వల్ల పూజత్వము, శ్రేయస్సు మొదలగునవి గలుగును.

రవి దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి స్థాన భ్రష్టత్వము, రాజభీతి, చోరభయము, శత్రుపీడ, వంచనము, వైరాగ్యము, శత్రువుల వల్ల బంధనము, మిత్ర నాశము, శత్రు భయము, ధననాశము, అధికార నష్టము, మతిమరుపు, విష బాధ, వ్యాజ్యము, పోరాటము, కర్ణబాధ, నేత్ర రోగము, గురువుకు అనారోగ్యము, కుటుంబ సభ్యులతో కలతలు, బంధువుల వలన చిక్కులు మొదలగునవి సంభవించును.

### 9. రవి దశలో శుక్ర భుక్తి ఫలము -

రవి దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి రాజ్యలాభము, ధన ప్రాప్తి, చత్ర చామరాది వైభవము, వాహనము, రాజ సన్మానము, వ్యాపారమువల్ల ధనలాభము, కామసుఖము, గృహము నందు వివాహాది వేడుకలు, అధిక ఆదాయము, సంతోషము, సౌఖ్యము గలుగును.

రవి దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి కళత్ర పీడ, మహా దుఃఖము, ధనధాన్యాది నాశము, శత్రువృద్ధి, వ్యాపారము వల్ల ధననష్టము, జ్వరము, మేహవాత నొప్పులు, స్థాన భ్రష్టత్వము, కడుపు నొప్పి, మూల వ్యాధి, గృహ నాశము, భార్యాబిడ్డలకు తీరని రోగము, శిరోరోగము, గొంతుకలో బాధ సంభవించును.

## 2. చంద్ర మహాదశ

చంద్రుడు పూర్ణుడై శుభుడుగా యుండి కేంద్ర కోణ యుచ్చ క్షేత్రముల యందున్న మంత్రముల వల్ల ఐశ్వర్యము, స్త్రీ ధనక్షేత్ర వృద్ధి, వస్త్రాలంకారము, పరిమళ ద్రవ్యముల వల్ల ధనార్జనము, రాజాను గ్రహము, శరీర సౌఖ్యము, ధనము, సంతానము, రత్నములు, సౌఖ్యము, వ్యవసాయాభి వృద్ధి, బలము దారాపుత్రాది సౌఖ్యమును గలుగును. మఱియు మాతృ సుఖము, తటాక, క్షేత్ర, అరామ గృహ, ధ్వజ, పరస్త్రీ శోభనాందోళికాది శుభకార్య సిద్ధి యగును.

చంద్రుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందున్న క్షీణచంద్రుడైనను చంద్ర మహా దశలో వ్యవసాయము వల్ల నష్టము, ధాన్యహాని, మాతృపీడ, దుఃఖము, వ్యాపారము వల్ల ధననష్టము, వాత రోగము, పరదేశ నివాసము, శత్రువృద్ధి మొదలగునవి గలుగును. మఱియు ఈ పాప చంద్రదశలో అన్నహీన, కృపనత్వ, బుద్ధిహీనత, జీగుప్స, మాతృహాని, క్రోధ, శీతజ్వరాధి దుష్ట ఫలములు నిచ్చును.

### చంద్రుడు వివిధ స్థానముల యందున్నపుడు వాని దశా భుక్తి ఫలములు

జననకాలమున దశానాధుడైన చంద్రుడు లగ్నము నందుండి శుభులైన శుక్ర గురు, చంద్ర, బుధ భుక్తులు జరుగు చున్నపుడు జాతకుడు ఆరోగ్యవంతు డగును. ప్రభువుతో ప్రేమించబడు వాడుగను, వస్త్ర, వాహన, ఆభరణములు గల వాడుగా యుండును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి దౌర్భాగ్యము, పశువులు, వ్యవసాయ భూముల నాశము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు ద్వితీయ స్థానము నందుండి పాపగ్రహ భుక్తులు జరుగు కాలము నందు జాతకుడు కొన్ని కారణాంతరముల వలన భార్యకు, బిడ్డలకు, బంధువులకు, ప్రభువుకు భయపడ వలసి యుండును. శుభగ్రహ భుక్తుల యందు జాతకుడు మంచి ఆహారము, పానీయము, వస్త్రములతో సౌఖ్యమును పొందుట, ఆశావాదియై మెలుకువ గల్గి యుండును.

దశానాధుడైన చంద్రుడు తృతీయ స్థానము నందుండి, శుభగ్రహ భుక్తులు జరుగు కాలమున జాతకునికి రాజ గౌరవము, సౌఖ్యము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు రాబడి క్షీణించుట, ధైర్యము విడనాడుట సోదర మరణము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు చతుర్థ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకుడు అన్ని విధముల అతి సౌఖ్యవంతుడై ప్రభువుచే ప్రేమించబడు వాడుగా యుండును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి దిక్కులేని జీవితము, భార్య, గృహ, ధననష్టము, రాజభీతి, చోర, అగ్ని భయము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు పంచమ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకుడు భార్య,బిడ్డలు, స్నేహితులతో సంతోషముగా యుండుట, ధనము, వస్త్రములు గలవాడుగా యుండును. పాపగ్రహ భుక్తుల యందు జాతకుడు చికాకు చెందుట, ప్రజానుకూలము లేక పోవుట, భార్యా పుత్ర, రాజ భయము గల్గి బాధ నొందు చుండును.

దశానాధుడైన చంద్రుడు షష్ట స్థానము నందుండి పాపగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి వ్యవసాయ భూముల నష్టము, ఋణబాధ, మూత్ర వ్యాధి, క్షయరోగము, పాండు రోగము సంభవించును. శుభగ్రహ భుక్తి కాలము నందు జాతకునికి అందరితో స్నేహము, రాజ, చోర, అగ్ని భయము లేకుండుట సంభవించును.

దశానాధుడైన చంద్రుడు సప్తమ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి భార్యాబిడ్డల సౌఖ్యము, వాహన లాభము, వస్త్రాభరణ లాభము గల్గును. పాపగ్రహ భుక్తుల యందు దేశము నుండి ప్రవాసము భార్యా బిడ్డలు, బంధువులు మఱియు ధననష్టము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు అష్టమ స్థానము నందుండి పాపగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు అధిక భయము, భార్యాపుత్రుల మరణము, చెడు పదార్థ భోజనము, పరాజయము సంభవించును. శుభగ్రహ భుక్తుల యందు మంచి సౌఖ్యము, ప్రతిష్ట, ధైర్యము, వాహన ప్రాప్తి, ఆభరణ లాభము గల్గును.

దశానాధుడైన చంద్రుడు నవమ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకుడు సౌఖ్యముగా నుండుట, ధర్మకార్యములు, యజ్ఞములు, వివాహ వేడుకలు జరుపుట, తనపనులు జయ ప్రదముగా నెరవేర్చు కొనుట, భార్యతో సౌఖ్యము, అభివృద్ధి చెందుట మొదలగునవి సంభవించును. పాపగ్రహ భుక్తుల యందు జాతకునికి మతి చాంచల్యము, చర్మము, క్షీణించుట, వృత్తి, ధనము, గృహనాశము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు దశమ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి తన పని యందు ప్రత్యేక ఆసక్తి, శాస్త్ర జ్ఞానము, స్వశక్తిచే కావలసినవి సంపాదించుకొనుట సంభవించును. పాపగ్రహ భుక్తుల యందు అసౌఖ్యము, వృత్తినష్టము, భయము, అప్రతిష్ట సంభవించును.

దశానాధుడైన చంద్రుడు యేకాదశ స్థానము నందుండి శుభగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి అనేక విధముల ధనలాభము, ధాన్యలాభము వస్త్రములు, వాహన ప్రాప్తి సంభవించును. పాపగ్రహ భుక్తుల యందు ధననష్టము, వ్యవసాయ భూములు, ధాన్య నష్టము, శరీర బాధ, నేత్ర రోగము, రాజ చోరభయము సంభవించును.

దశానాధుడైన చంద్రుడు ద్వాదశ స్థానము నందుండి పాపగ్రహ భుక్తులు జరుగుచున్న కాలము నందు జాతకునికి ధననాశము, దౌర్భాగ్యము, ప్రతివానితో విరోధము సంభవించును. శుభగ్రహ భుక్తుల యందు ధనార్జన వల్ల సౌఖ్యము, భార్యా బిడ్డలు, స్నేహితులతో సౌఖ్యము, ఆభరణ వస్త్రలాభము, వాహన ప్రాప్తి మొదలగునవి సంభవించును.

## చంద్ర మహాదశలో గ్రహ భుక్తి ఫలములు

### 1. చంద్ర దశలో చంద్ర భుక్తి ఫలములు -

చంద్ర దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు బలవంతుడై శుభుడై యున్న జాతకుడు మంచి ఆరోగ్యము గల్గి సంతోషముగా నుండుట, ధనాదాయము యెక్కువగా యుండుట, వాహన ప్రాప్తి, రాజ పారితోషికములు, పుత్రులు గల్గి యుండును. పుత్రిక జననము, వస్త్రలాభము, తల్లి వద్దనుండి తాను కోరినది గ్రహించుట, కామ సుఖము, తలవని తలంపుగా యొక కన్యకతో వివాహము, నాగరికత ఆధ్యాత్మిక సంబంధమైన వారితో కలిసి యుండుట, అనుకున్న పనులన్నియు సక్రమముగా నెరవేర్చుకొనుట, పుత్ర జననము సంభవించును.

చంద్రుడు బలహీనుడై పాపియై యున్న చంద్ర భుక్తి అంత్యకాలము నందు ధననాశము, ఉద్యోగ భంగము, మనోవ్యాకులత, మాతృ మరణము, అసౌఖ్యము, బంధునాశము, కారాగార వాసము, దారాపుత్రాది పీడ, శరీర పీడ, ఋణవృద్ధి వ్యాపారము వల్ల ధన నష్టము మొదలగు దుష్ఫలములు సంభవించును.

### 2. చంద్ర దశలో కుజ భుక్తి ఫలము -

చంద్ర దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి మాతృ, బంధు నాశము, రోగబాధ, యితరులకు హాని గలిగించుటలో తెలివి, ఉద్యోగ భంగము, జ్వరము, కడుపులో బాధ, దెయ్యము మొదలగు శక్తులు ఆసించుట, పైత్యము, వేడి, రక్తము చెడిపోవుట, మనస్సు, శరీర బరువు, శత్రు చోర బాధ, ధననాశము, ప్రతిష్ట భంగము, తగవులు, ఉన్మాదము, కుష్ఠరోగము మొదలగునవి సంభవించును.

చంద్ర దశలోకుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి రాజ పారితోషికములు, సౌఖ్యము, వస్త్రములు, ఆభరణములు, పొలము, పనులు, యింటి పనుల యందు విరామము లేకుండుట, చేపట్టిన పనులు నెరవేర్చుట మొదలగునవి సంభవించును.

### 3. చంద్ర దశలో రాహు భుక్తి ఫలము -

చంద్ర దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి చర్మవ్యాధులు, మధుమేహ రోగము, సుఖవ్యాధులు, శత్రువుల వలన అగౌరవము, బంధువులకు రోగము, ఉరుముల వర్షము వలన అపాయము, భోజనము, పానీయము, అజీర్ణ రోగము వలన బాధ, సువర్ణ నాశము, శత్రుభయము, రోగము, దుఃఖము, నీరు, స్త్రీల వలన పోట్లాటలు, రాజభీతి, బిడ్డలకు రోగము సంభవించును.

చంద్ర దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి కావలసినంత ధన, ధాన్య, సంపద, భూములు గల్గి యుండుట, శిశు జననము, మహమ్మదీయ ప్రధాని నుండి పారితోషికములు గల్గును. రాహువు శుభునితో సంబంధ మొంది యున్న జాతకునికి అధిక శుభఫలములు గలుగును.

**4. చంద్ర దశలో గురు భుక్తి ఫలము -**

చంద్ర దశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి శుభకార్యములు, ధర్మకార్యములు, ధనసౌఖ్యము, భార్యాబిడ్డల సౌఖ్యము, రాజ పారితోషికములు, పెద్దవారి యొక్క మర్యాద, శిశు జననము, వస్త్రాభరణ సౌఖ్యము, స్నేహితుల సమాగమము, రాజ గౌరవము, జయము, గుఱ్ఱములు, ఏనుగులు, సంపద సౌఖ్యము, రాజ స్నేహము, పుత్ర జననము ఆవులు, దూడలు మొదలగునవి గలవాడుగా యండును.

చంద్ర దశలో గురు భుక్తి యందు గురుడు బలహీనుడై పాపియైయున్న జాతకునికి ఉద్యోగ భంగము, మనోవ్యధ, పోరాటము, పుత్ర మరణము, గృహ వాహన వస్త్ర నాశము గల్గును.

**5. చంద్ర దశలో శని భుక్తి ఫలము -**

చంద్ర దశలో శని భుక్తి యందు శని పాపియై బలహీనుడై పాపియై యున్న జాతకునికి రాజాగ్రహము వలనను చోరీవలన ధననాశము, శరీర బలహీనత, భార్యా నాశము, రోగబాధ, కారాగార వాసము, అమర్యాద, తల్లి విషయములో ధన చిక్కులు, క్షయరోగము, పైత్యరోగము, అనేక విధములైన జాడ్యములు, భార్యకు అనారోగ్యము, బిడ్డలు, స్నేహితులకు అనారోగ్యము, పెద్ద ఉపద్రవము లేక మరణము సంభవించును. పశు నష్టము, మనోవ్యధ, భార్య లేక భర్త మరణము, ఆస్తి నష్టము మొదలగునవి సంభవించును.

చంద్ర దశలో శని భుక్తి యందు శని శుభుడై బలము గల్గియున్న జాతకునికి సంపద, పుత్రుడు, స్నేహితులు, భూగృహ లాభము, రాజ పారితోషికములు, వివాహ వేడుకలు, వాణీజ్యము వల్ల, ధనలాభము, దారా పుత్రుల అభివృద్ధి, రాజమూలమున ధనలాభము, ఋణనాశము గలుగును.

**6. చంద్ర దశలో బుధ భుక్తి ఫలము -**

చంద్ర దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి తీరని సౌఖ్యము, పుత్రుని ద్వారా గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు, ధనము సంపాదించుట, ప్రత్యేక సౌకర్యములు, సంపద, ఆభరణములు, పుత్ర జననము తలచిన పనులు నెరవేరుట, జ్ఞానాభివృద్ధి, అధిక లాభము సంభవించును. బుధుడు పాపియై బలహీనుడై యున్న వాని భుక్తి కాలము నందు, శరీరమునకు అనారోగ్యము, భార్యాబిడ్డల విరోధము యింకొక ప్రదేశమునకు ప్రయాణము, మనోవ్యధ, చోర, అగ్ని రాజభయము సంభవించును. కుటుంబములో కలతలు మొదలగునవి గూడా సంభవించును.

7. చంద్ర దశలో కేతు భుక్తి ఫలము -

చంద్ర దశలో కేతువు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి మాతాపితలకు, సోదరులకు దురదృష్టము, ధననాశము, బంధు నాశము, మనస్సుకు అసౌఖ్యము, నీటి అపాయము, సేవకులకు, బానిసలకు చిక్కులు, అగ్ని భయము, ఎడమ నేత్ర రోగము, శత్రుత్వము, అందరిచే ద్వేషించబడుట, శిక్ష మొదలగునవి సంభవించును.

చంద్ర దశలో కేతువు భుక్తి యందు కేతువు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి భార్యాబిడ్డల సౌఖ్యము, అధిక ఆదాయము, కోర్కెలు నెరవేర్చుట, గొప్ప అభివృద్ధి, యాత్రా ప్రదేశములందు పవిత్రమైన స్నానము, దేహారోగ్యము, బంధు మిత్ర సమాగమము, భోజనము సౌఖ్యము, అంబర భూషణాది లాభము గలుగును.

8. చంద్ర దశలో శుక్ర భుక్తి ఫలము -

చంద్ర దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి స్త్రీల ద్వారా సౌఖ్యము, భూములు, పశువులు, నావలు, నీళ్ళు, వాహనముల ద్వారా ధనము వివాహము కుదుర్చుకొనుట, వివాహ వేడుకలలో అధిక వ్యయము, యెక్కువ మంది స్నేహితులు, పుత్రులు, మనుమలు, మనుమరాంండ్రతో సుఖసౌఖ్యము, సువర్ణము, ఆభరణములు, వ్యవసాయ పరికరములు, ధాన్యము, మొదలగునవి గల్గి యుండును.

చంద్ర దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి శుక్రవారముల యందు శత్రుత్వము, శత్రువుల వలన పనులకు అడ్డంకులు, ఆస్తి నాశము, బంధు దుఃఖము, రోగము, ఆకస్మిక పోరాటము, ఉద్యోగ భంగము, అధికార నష్టము, మనోవ్యధ, వీటి వలన శరీర రోగము, గృహ నాశము, భోజన సౌఖ్యహీనము, మలిన వస్త్రములు, శుభకర్మ నాశము, ఋణవృద్ధి, శత్రువృద్ధి, నీచ స్త్రీ సంగమము, దుష్ట వార్త, బంధు ద్వేషము గలుగును.

9. చంద్ర దశలో రవి భుక్తి ఫలములు -

చంద్ర దశలో రవి భుక్తి యందు రవి పాపియై బలహీనుడై యున్న జాతకునికి స్థానచలనము, ప్రవాసము, మేహరోగము, కర్మనాశము, రాజభయము, చోరభీతి, నీచ స్త్రీల కొరకు ఆసక్తి, ఆస్తి నష్టము, బంధు విరోధము, జ్వరబాధ, నేత్ర రోగము, పైత్యరోగము, స్నేహితులు, బంధువులతో పోరాటము, లోజ్వరము, మనోచంచలనము, కారణములేని మరణము మొదలగునవి సంభవించును.

చంద్ర దశలో రవి భుక్తి యందు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి రాజ గౌరవము, అధిక బలము, రోగవిముక్తి, శత్రు క్షయము, ప్రభుత్వము ద్వారా ఆదాయము, గృహము నందు వివాహ వేడుకలు, విందుల వలన భూలాభము, ధైర్యము, ధనలాభము, పుత్రలాభము యుద్ధ జయము, మంచి ఉద్యోగము, విశేష కీర్తి గలుగును.

### 3. కుజ మహాదశ

కుజుడు శుభుడై కేంద్ర కోణ యుచ్చ లాభ స్థానముల యందున్న విశేష భూలాభము, రాజ మూలమున ధనలాభము, సోదరవృద్ధి ఆయురారోగ్యవృద్ధి, పశు

సమృద్ధి, రాజ సన్మానము, యిష్టవస్తు లాభము, జ్ఞానము, నిర్మల మనస్సు, పరాక్రమము, శత్రునాశము గలుగును.

కుజుడు పాపుడై నీచ షష్టమ వ్యయస్థానముల యందున్న శత్రుభయము, మతిపీడ, దారాపుత్ర విచారము, ధననాశనము, జ్వర భయము, పిత్త దోషము, రక్తదోషము, సోదర మిత్ర విరోధము, అగ్ని భీతి, క్షేత్ర నష్టము, వ్రణము, నేత్ర బాధ, రాజ పీడ, ఆయుధ భీతి మొదలగునవి సంభవించును.

## కుజ మహాదశలో గ్రహముల భుక్తి ఫలములు

### 1. కుజ దశలో కుజ భుక్తి ఫలము -

కుజ దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి భూలాభము, ధనలాభము, ధారాపుత్రాది సౌఖ్యము, భ్రాతృ సౌఖ్యము, మనస్సంతోషము, వ్యవసాయము, విశేష ధనలాభము, నష్టపడిన ఆస్తి సంపాదించు కొనుట, రాజ గౌరవము, జనన వేడుకలు మొదలగునవి సంభవించును.

కుజ దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి కళత్ర పీడ, బంధు విరోధము, గృహ నష్టము, ధనవ్యయము, సోదర హాని, దుర్వృత్తి, స్ఫోటక బాధ, వ్రణపీడ, స్థాన భ్రష్టత్వము, బంధనము, శత్రువృద్ధి, భూత భయము, రాజాగ్ని భయము, అధిక పైత్యము, నీచులతో విరోధము, ప్రభువు వలన ప్రమాదము, కలతలు మొదలగునవి గలుగును.

### 2. కుజ దశలో రాహు భుక్తి ఫలము -

కుజ దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలము గల్గియున్న జాతకునికి సమాన లాభ నష్టములు, సమాన మిత్ర శత్రువులు, శరీర పీడ గల్గి శీఘ్రమే నివారణము, ఉద్యోగము వలన ధన లాభము, ధనవ్యయము గలుగును.

కుజ దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి విష పీడ, శస్త్ర బాధ, విదేశ గమనము, మరణ భయము, గోమహిష్యాది నాశము, గర్భవాతము వల్ల స్త్రీ నాశనము, అజ్ఞానము వల్ల అపవాదము, జంతు భయము, శత్రు పీడ, చోర భయము, ఆకలి బాధ, భూతావేశము, మేహరోగ బాధ, విగళ బంధనము, రాజభయము, శిరస్సు, నేత్రములు, కడుపు నందు బాధ, పెద్దలు బంధువుల నాశము, ఆపదలు, మూత్ర రోగము, గడ్డలు, స్థానచలనము, నీచ రోగముల వలన హింస సంభవించును.

### 3. కుజ దశలో గురు భుక్తి ఫలములు -

కుజ దశలో గురు భుక్తి యందు గురుడు బలవంతుడై శుభుడై యున్న జాతకునికి ధనధాన్య సమృద్ధియు, దాసదాసి జనవృద్ధి, పుత్ర లాభము, అన్నదాన ఫలము, వాహన సౌఖ్యము, ఉద్యోగాభివృద్ధి, రాజ సన్మానము, కీర్తి, ధర్మ మూలకముగా ధనసంపాదన, యొక గుంపునకు నాయకత్వము, జ్ఞానము, ప్రభువుల ఉపకారము వలన సంపద వృద్ధి, దారాపుత్ర బంధువుల వలన గౌరవము, సౌఖ్య జీవనము మంచి స్వభావము, ప్రేమ, దైవ బ్రాహ్మణ భుక్తి, తీర్థ యాత్రలు, అతిథి సత్కారము, బిడ్డలు, అనేక మంది స్నేహితులు గలవాడుగా యుండును.

కుజ దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి ధనవ్యయము, దారా పుత్రాదులకు శరీర పీడ, ధర్మము వల్ల ధన వ్యయము, పరదేశ నివాసము, శరీర పీడ, ఉద్యోగము వల్ల లాభము స్వల్పమును, ఖర్చు అధికము విషభయము, రోగ బాధ, తప్పులు చేయుట, రాజ చోర అగ్ని భయము, మూత్రరోగము, కర్ణరోగము, కుటుంబ ఆస్తి నాశము, ఉత్తర దిశ యందు అనేక శత్రువులు గలుగుదురు.

**4. కుజ దశలో శని భుక్తి ఫలము -**

కుజ దశలో శని భుక్తి యందు శని శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉద్యోగము వల్ల ధనలాభము, సేవకావృత్తి వల్ల జీవనము, అన్యాయార్జితము, పుత్ర పౌత్రాభివృద్ధి, భూలాభము, వాహన సౌఖ్యము, నీచ ప్రభు సమాగమము, రాజ్యలాభము, ప్రతిష్ఠ, ధాన్య వృద్ధి, దారాపుత్ర సౌఖ్యము సంభవించును.

కుజ మహా దశలో శని భుక్తి యందు శని పాపియై బలహీనుడై యున్న జాతకునికి దుఃఖము, శస్త్ర పీడ, బంధునాశము, పశు క్షయము, విశేష రోగపీడ, దారా పుత్రాది నాశము, శత్రువృద్ధి, ప్రభువుల వల్ల బంధనము, పరదేశ నివాసము, ఉద్యోగ భ్రష్టత్వము, ధనహాని, మానహాని, బంధు మిత్రులతో విరోధము, బిడ్డలకు సంకటనలు, ఆపదలు, మనోవ్యధ, సంపద నాశము, శత్రువుల వలన చోరత్వము, అధిక భయము, వాత రోగము, లేక మరణమైననూ సంభవించును.

**5. కుజ దశలో బుధ భుక్తి ఫలములు -**

కుజ దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి లిపివిద్య, వర్తకము, శిల్ప విద్య - ఈ తంత్ర విద్యల వల్ల ధనార్జనము, విశేషఖ్యాతి, సోదరులు మిత్రుల వల్ల సహాయము, వివాద మందు పూర్ణ జయము, వ్యాపారుల వల్ల ధనలాభము, ధాన్యవృద్ధి, భార్యాబిడ్డల సౌఖ్యము, సుందరమైన స్త్రీతో సాంగత్యము, సంపద వృద్ధి, దీర్ఘరోగముల నుండి విముక్తి సంభవించును.

కుజ మహా దశలో బుధభుక్తి యందు పాపియై బలహీనుడై యున్న జాతకునికి అపవాదులు, సర్ప భయము, శత్రు భయము, చోరుల వలన చిక్కులు, ధననాశము, నీచులతో సహవాసము, రాజాగ్రహము, కూలీలతో విరోధము, అప జయము, భార్యాబిడ్డల నాశము, పైత్యరోగము, వ్యాపారము వల్ల ధననష్టము, శత్రు వృద్ధి, జ్ఞాతులవల్ల బాధ, కుటుంబ కలహము, బంధుమిత్ర విరోధము గలుగును.

**6. కుజ దశలో కేతు భుక్తి ఫలములు -**

కుజ దశలో కేతు భుక్తి యందు కేతువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉద్యోగము వల్ల, ధనలాభము, నీచుల వల్ల ధనప్రాప్తి శరీర రోగము వల్ల బాధ, శీఘ్ర నివారణము. కుటుంబ మందు విరక్తి, పురాణ శ్రవణము, భూలాభము, పుత్రజననము, ధనవృద్ధి, అధిక సౌఖ్యము, ప్రతిష్ట, ప్రభువు వద్దకు రాయబారిగా వెళ్ళి జయమును గాంచుట సంభవించును.

కుజ దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి నీచులతో విరోధము, దుష్ట వ్యాపారము, ధననష్టము, వాగ్దోషము వల్ల

పాప వృద్ధి, ధర్మము వల్ల ధనవ్యయము, ఋణము, దారాపుత్రాది పీడ, విశేష శత్రువృద్ధి, ప్రభువు వల్ల బంధనము, స్ఫోటకము, ప్రణము, మనో దుఃఖము, నేత్ర రోగము, కడుపులో రోగము, పోట్లాటలు, సంకటనలు, పిడుగు పాటు లేక విద్యుచ్ఛక్తి వలన అపాయము ఆయుధ అగ్ని వలన ఆకస్మిక అపాయము, పరదేశ నివాసము, సంపద నాశము, భార్యా నాశము లేక మృత్యు భయము, స్త్రీల ద్వారా విరోధము, శరీర రోగము, విషభయము, స్త్రీలపై నింద సంభవించును.

### 7. కుజ దశలో శుక్ర భుక్తి ఫలములు -

కుజ దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికిబంగారు ముత్యముల లాభము, బుద్ధికుశలత, స్త్రీ సంభోగము, ధనలాభము, రాజమూలమున ధనలాభము, గొప్ప ప్రభు సన్మానము, దారా పుత్రాభివృద్ధి, వస్త్రాభరణ లాభము, మాతృ మూలమున ఆదాయము, ఉద్యోగాభివృద్ధి, భార్యా బిడ్డల సౌఖ్యము దీర్ఘ కాలము నుండి ఆసించిన ఆస్తి చేజిక్కుట, పెద్దలు మఱియు సుందరమైన స్త్రీతో సమాగమము, దైవపూజ, వాహనప్రాప్తి గలుగును.

కుజ దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి గాయములు, ప్రణముల బాధ, యుద్ధము నందు అపజయము, పరదేశ నివాసము, సేవకుల నష్టము, దొంగల వలన చోరీ, యెడమ నేత్రము నందు బాధ, నరముల రోగము, స్త్రీలతో శత్రుత్వము, మోసము, ప్రతిష్ట భంగము, రోగవృద్ధి, ధారాపుత్ర విరోధము, వ్యవసాయము వల్ల ధనవ్యయము, స్థాన భ్రష్టత్వము, దుఃఖము, నీచ వృత్తి వల్ల జీవనము సంభవించును.

### 8. కుజ దశలో రవి భుక్తి ఫలములు -

కుజ దశలో రవి భుక్తి యందు రవి శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉద్యోగలాభము, వాహన సౌఖ్యము, రాజ సన్మానము వల్ల వైభవము, దారాపుత్రాధి సౌఖ్యము, బంధు మిత్ర సమాగమము, గృహ లాభము, భూలాభము, పశువృద్ధి, ధాన్యవృద్ధి, విద్య, చోరత్వము, అధిక ధనము, కుటుంబ సభ్యులు, బంధువులతో స్నేహము, కలతల యందు ఆసక్తి, గౌరవము, ప్రతిష్ట గలిగి యుండుట, రాజగౌరవము, యుద్ధము నందు జయము, వ్యాపార వృద్ధి గలుగును.

కుజ దశలో రవి భుక్తి యందు రవి పాపియై బలహీనుడై యున్న జాతకునికి విశేష శత్రువృద్ధి, మానహాని, దారాపుత్రాది పీడ, రోగ వృద్ధి, ఋణ వృద్ధి, భార్యా నాశము, రోగములు, రాజాగ్రహము, మాతాపితల ఆగ్రహము, శిరోరోగము, పోరాటము, శత్రుభయము, యొక బ్రాహ్మణుని వలన చిక్కులు, మంచి స్వభావము గల భార్యకు రోగము, అందరితో విరోధము, దుఃఖము, మనోవ్యధ, అగ్నిభయము మెడ యందు నొప్పి, కుష్టురోగము సంభవించును.

### 9. కుజ దశలో చంద్ర భుక్తి ఫలము -

కుజ దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలము గల్గి యున్న జాతకునికి వస్త్రాభరణా లంకారము, స్త్రీ సహాయము వల్ల ఉద్యోగము, జాలాగ్ని వల్ల ధనలాభము, దారాపుత్రాభి వృద్ధి, గంగా స్నాన ఫలప్రాప్తి, పురాణ శ్రవణము, గొప్ప సౌఖ్యము, సంతోషము, అనేక విధముల ఆదాయము, అనేక

మందితో యెడబాటు, జలుబు, పైత్య శరీరము, పుత్రజననము, విశ్రాంతి, వస్త్రాభరణ నవరత్న ప్రాప్తి సంభవించును.

కుజ దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి జలగండము వలన భయము, మాతృపీడ, పరదేశ నివాసము, శత్రు మూలమున ధన వ్యయము, ఋణవృద్ధి, వ్యాపారము వల్ల నష్టము, శరీర రోగము, వాతరోగము వల్ల భాధ, భార్యాబిడ్డల నాశము, మనోరోగము, రాజ భయము, పశుధాన్య క్షయము, రాజచోర అగ్ని భయము, పెద్దల వలన చిక్కులు, స్థాన చలనము సంభవించును.

## 4. రాహు మహాదశ

శుభరాహు మహాదశలో రాహువు యుచ్ఛ, కేంద్ర కోణ, శుభక్షేత్రముల యందు బలముగా యున్న రాజ్యలాభము, పుత్రలాభము, ధనధన్యాభి వృద్ధి, రాజమూలమున ధనలాభము, ప్రభావము, తీర్ధయాత్రలు, పురాణ శ్రవణము, కర్మసిద్ధి మొదలగు సుఫలములు గలుగును.

పాప రాహువు నీచ అష్టమ వ్యయము లందు దుర్భలముగా యున్న రాహుదశలో దూరదేశ ప్రయాణము, దుఃఖము, అరణ్య వాసము వలన భయము, దారాపుత్రాది పీడ, నీచవృత్తి వల్ల జీవనము, సౌఖ్యము లేని భోజనము, సుఖము లేని కళత్రము, దుష్టపుత్ర సంతానము, ఉద్యోగ భంగము, విష జ్వరము, సర్పభీతి, సర్వాంగ రోగము, దుఃఖము, విరోధము, వృక్షాత్పతనము, శత్రుపీడ, దేహ పీడ, చోర భయము అగ్నిభీతి, రాజుల వల్ల బాధ గలుగును.

రాహు దశా ప్రారంభమున దుఃఖమును, మధ్యమందు సౌఖ్యమును కీర్తియును అంత్యమందు స్థాన భ్రష్టత్వము, గురుపిత్రాది నాశనము సంభవించును.

### రాహు మహాదశలో గ్రహముల యొక్క భుక్తి ఫలములు

**1. రాహుదశలో రాహు భుక్తి ఫలము -**

రాహు దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉద్యోగము వల్ల ధనలాభము, గృహలాభము, భూలాభము, ధనవృద్ధి, పశుధాన్యాభి వృద్ధి, వ్యవసాయము వల్ల, ధనార్జనము, రాజ సన్మానము వల్ల ధనలాభము, బంధు మరణము, సంతోషము, వాహన ప్రాప్తి, వస్త్రాభరణ లాభము, శుభ కార్యములు భార్యాబిడ్డల సౌఖ్య వృద్ధి గలుగును.

రాహు దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి పితృమాతృ వినాశము, శత్రువృద్ధి, రాజుల వల్ల బంధనము, దారాపుత్రాది పీడ, శత్రువుల వల్ల ఋణము, విషము వల్ల రోగము, కాలుష్యమైన నీరు, పరస్త్రీలతో సాంగత్యము, దగ్గర బంధుపుల నాశము లేక యెడబాటు, వినరాని మాటలు, మోసగాండ్ల వల్ల చిక్కులు, అధికార నష్టము, భార్యానాశము, సంపద క్షయము, తండ్రి మరణము, ఆయుధ చోరాగ్ని విషభయము, ప్రభువుల వల్ల నాశము మనోవ్యధ, భార్యకు తీరని దుఃఖము, యొక చాడీలు చెప్పువాని వలన కలతలు సంభవించును.

**2. రాహుదశలో గురు భుక్తి ఫలము -**

రాహు దశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉత్తమ పురుష సహవాసము, స్త్రీ పుత్ర సౌఖ్యము, తీర్థ స్నాన ఫలము ఔదార్య సాహసములు, స్వర్ణరత్న భూషణ ధనలాభము, యజ్ఞ యాగములు, భార్యా సౌఖ్యవృద్ధి, శిశుజననము, వాహన ప్రాప్తి, వివాహ వేడుకలు, దేవ బ్రహ్మణపూజ, రోగవిముక్తి, సంసార సుఖము, రాజ గౌరవము, తలంచిన పనులు నెరవేరుట, బ్రాహ్మణుల వలన ఆదాయము సంభవించును.

రాహు దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి కుటుంబ కలహము, బంధుమిత్ర విరోధము, శుభకార్యముల వల్ల ధన వ్యయము, ఋణవృద్ధి, స్వల్ప దుఃఖము, స్వల్ప సౌఖ్యము, పుణ్య పాపమిశ్ర ఫలములు, మాత భార్యాబిడ్డలకు అనారోగ్యము, పెద్ద సోదరుని మృతి, ధననాశము, ప్రతి పని యందు అడ్డంకులు, దైవ ప్రసంగముల యందు నిరుత్సాహము సంభవించును.

**3. రాహు దశలో శని భుక్తి ఫలము -**

రాహు దశలో శని భుక్తి యందు శని శుభుడై బలవంతుడై యున్న జాతకునికిగొప్ప ఉద్యోగము, విశేష గౌరవము, శూద్రమూలమున ధనలాభము, అందోళి కాది వాహన సౌఖ్యము, దారాపుత్రవృద్ధి, దేహారోగ్యము, మనస్సంతోషము, యశో వృద్ధి, వ్యవసాయాభివృద్ధి, పశువృద్ధి, భూలాభము, సంతాన లాభము, భ్రాతృ మాతృ సౌఖ్యము, వివాహ వేడుకలు, రాజపారితోషికములు, ధనవృద్ధి, సంతోషము గల్గును.

రాహు దశలో శని భుక్తియందు శని పాపియై బలహీనుడై యున్న జాతకునికి దుఃఖము, మానభంగము, వృక్షాత్పతనము వలన భయము, దుస్సాం గత్యము, దుష్ట కార్యములు, పరస్త్రీ సంభోగము, భార్యా వియోగము, కుక్షి రోగము, నేత్ర రోగము, జలగండము, విషభయము, ఔమానము వృక్షము పైనుండి పతనము, మూలవ్యాధి, వాత నొప్పులు, చోరాగ్ని భయము, భార్యాబిడ్డలు సోదరులతో అపార్థములు, సేవకుల నాశము, అధికార నష్టము, దుఃఖము, జ్వరము, తీరని వ్యాజ్యములు, పోట్లాటలు వాత పైత్యరోగము సంభవించును.

**4. రాహు దశలో బుధ భుక్తి ఫలము -**

రాహు దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వివాహాది సౌఖ్యము, వాహన సౌఖ్యము, పుత్ర లాభము, ధనవృద్ధి, కుటుంబ సౌఖ్యము, వేశ్యాసంభోగము, అనాచారము, డాంబికము, వ్యాపారము వల్ల ధనలాభము, ఋణ విముక్తి, జ్ఞాతుల వల్ల ధనలాభము, దైవభక్తి, పస్తు లాభము, పెద్దవారిని ప్రతిఘటించు శక్తి గలవాడుగా యుండును.

రాహు దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి జ్ఞాతివృద్ధియు, వ్యాపారము వల్ల ధనవ్యయము, వ్యవసాయ వర్తకము వల్ల నష్టము, బంధు నాశము, పదభ్రష్టత్వము, మహాద్వేషము, బంధుద్వేషము, మనో వ్యధ, భార్యా బిడ్డల నాశము, రాజాగ్రహము, ఆకస్మిక సంకటనలు, రాజ భయము, చోరుల వలన నష్టము సంభవించును.

5. రాహు దశలో కేతు భుక్తి ఫలము -

రాహు దశలో కేతు భుక్తి యందు కేతు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి బంధు సన్మానము, వాహన సౌఖ్యము, భూలాభము, సుగంధ పరిమళ ద్రవ్య ప్రాప్తి, పశువృద్ధి, వ్యవసాయము, భూములు వల్ల ధనలాభము, విద్యాభివృద్ధి, బంధు స్నేహము, రాజ పారితోషికములు, ఆభరణ లాభము, ఆరోగ్యము గలుగును.

రాహు దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి సంతాన విచారము, మిత్ర నష్టము, కళత్రపీడ, గొప్ప ఆపత్తు, రాజుల వల్ల చోరుల వల్ల ధననాశము, బంధు నష్టము, వ్యాధి, శిరోరోగము, నేత్ర రోగము, మూలవ్యాధి, ఉద్యోగ భంగము, స్థాన చలనము, ఆకస్మిక విరోధము, జ్వరము, మిత్ర సమాగమము, ఆయుధ అగ్ని, శత్రువుల వల్ల బాధ, విష భయము సంభవించును.

6. రాహు దశలో శుక్ర భుక్తి ఫలము -

రాహు దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి భులాభము, పుత్ర సౌఖ్యము, శుభకార్యములు, పశువృద్ధి, ధనధాన్యాభి వృద్ధి, గొప్ప ఉద్యోగ పాప్తి, వాహన సౌఖ్యము, సంసార సుఖము, రత్నాభరణ లాభము, పరస్త్రీలతో సమాగమము, రాజగౌరవము సంభవించును.

రాహు దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి అనారోగ్యము, అమర్యాద, రాజ చోర అగ్ని వల్ల బాధ, ఉద్యోగ భంగము, దుఃఖము, కళత్ర పుత్ర వినాసము, విశేష శత్రు వృద్ధి, కారాగార వాసము, శిరోబాధ, బంధు విరోధము, వాత శ్లేష్మ రోగములు మొదలగునవి సంభవించును.

7. రాహు దశలో రవి భుక్తి ఫలము -

రాహుదశలో రవి భుక్తి యందు రవి శుభుడై బలవంతుడై యున్న జాతకునికి దారా పుత్రాది సౌఖ్యము, రాజుల వల్ల ధనలాభము, రాజ్యలాభము, వస్త్ర వాహనాలంకార ప్రాప్తి, ధాన్యవృద్ధి, రాజ గౌరవము గలుగును.

రాహు దశలో రవి భుక్తి యందు రవిపాపియై బలహీలుడై యున్న జాతకునికి యుష్ణ జ్వరము వలన సంతాపము, శిరోభ్రమణము, జన విరోధము, నేత్ర రోగము, మహా భయము, స్థాన భ్రష్టత్వము, పరదేశ నివాసము, గురు పిత్రాది నాశము, విశేష శత్రువృద్ధి, ధననష్టము, రాజ చోర అగ్ని భయము, విష భయము, కారాగార వాసము, బంధు నాశము, భార్యా పుత్ర నాశము, శిరోరోగము, అధిక నేత్ర బాధ, రాజా గ్రహము, అపాయము, ధారా పుత్ర సోదరుల కలతలు మరియు వీరి వలన భయము, స్థాన చలనము సంభవించును.

8. రాహు దశలో చంద్ర భుక్తి ఫలము -

రాహు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి జలయాసము వల్ల ధనలాభము, క్షేత్ర వృద్ధి, వాహన సౌఖ్యము, కళత్ర సౌఖ్యము, సంతాన వృద్ధి, రాజ్యనాశము, ధనవృద్ధి, స్వకర్మ చేయుట, శాంతము, దానధర్మములు, ప్రయత్నించిన పని నెరవేరుట మొదలగునవి గలుగును.

రాహు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడుపాపియై బలహీనుడై యున్న జాతకునికి వ్యవసాయము వల్ల నష్టము, ఋణవృద్ధి, వర్తకము వల్ల

నష్టము, దారాపుత్రులకు శరీరపీడ, భూనాశనము, పశునష్టము, ధనక్షయము, మాతృ నాశము, అలసట, బలహీనత, మధుమేహ రోగము, కామెర్ల రోగము, రక్తహీనత మరియు మరణము, పోట్లాటలు, మనోవ్యధ, భార్యా నాశము, ధనధాన్య క్షయము, పశు క్షయము, జలగండము, అధికార నష్టము, నేత్ర రోగము, కాలి యందు బాధ సంభవించును.

**9. రాహు దశలో కుజ భుక్తి ఫలము -**

రాహు దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి రాజ పూజ్యత, పుత్ర సంతాన లాభము, విద్యాభి వృద్ధి, వాహన సౌఖ్యము, అలంకార ప్రాప్తి, భోజన సౌఖ్యము, వస్త్ర లాభము, వ్యవసాయము వల్ల ధనలాభము, వివాహ వేడుకలు, రాజ పారితోషికములు, ప్రతిష్ట గలుగును.

రాహు దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి గృహ క్షేత్రనాశము, రాజచోరాగ్ని పీడ, మనో ఏకలత్వము, సోదర నష్టము, స్ఫోటక క్షయజాధ, విశేష శరీర పీడ, శత్రువృద్ధి, రాజుల వల్ల బంధనము, కారా గృహ ప్రవేశము, కళత్ర విచారము, ఆయుధ చోర అగ్ని భయము, అధికార చలనము, గొప్ప రోగము వలన మరణము, నేత్ర రోగము, ఉద్రోగము, నీచజాతి వారి వలన చిక్కులు, విషభయము మొదలగు దుష్ఫలములు సంభవించును.

## 5. గురు మహాదశ

గురుడు శుభుడై కేంద్ర కోణముల యందు బలముగా యున్న దారాపుత్రాదుల సౌఖ్యము, గ్రామాదికారము, జనపాలత్వము, అశ్వాధియాన లాభము, పుణ్య కార్యములు, సుజన సహవాసము, సాధుజన విద్యా ప్రసంగము, ధన కనక సమృద్ధి, ధాన్యవృద్ధి, పశువృద్ధి, మొదలగు సత్ఫలములు గలుగును.

గురుడు పాపుడై షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న గురుదశలో ధనవ్యయము, పశునష్టము, రాజ భయము, అతివ్యాధి, ధైర్యహాని, ధాన్యనాశము, బ్రహ్మ ద్వేషము, పితృ దుఃఖము, క్రోధము, అన్నాభావము, 'వ్యవసాయము వల్ల నష్టము, భూవ్యయము, బంధు విరోధము, భూ వివాదము, మనోదుఃఖము, రోగ భయము, విదేశ వాసము, కష్టము, సమస్త దుఃఖములు గలుగును.

### గురు మహా దశలో గ్రహముల యొక్క భుక్తి ఫలములు

**1. గురు దశలో గురు భుక్తి ఫలము -**

గురు దశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి దారా పుత్రాదుల సౌఖ్యము, గ్రామాధికారము, జనపాలత్వము, అశ్వాధి యాన లాభము, పుణ్యకార్యములు, సుజన సహవాసము, సాధుజన విద్యా ప్రసంగము, ధన కనక సమృద్ధి, ధాన్యవృద్ధి, పశువృద్ధి, రత్నాభరణములు, భార్యా బిడ్డలు స్నేహితుల ప్రేమ, రాజ సన్మానము, వాహన లాభము, మంచి అదృష్టము పవిత్రమైన ప్రజల గురువులతో సహవాసము, తన కోర్కెలు నెరవేరుట, సంతోషము, సుగుణవతి యైన స్త్రీ లాభము, కనికరమైన పనుల యందు ఆసక్తి గలుగును.

గురు దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి విశేష దుఃఖము, రాజుల వల్ల ధననాశము, ఉద్యోగ భంగము, దుఃఖము, ధనధాన్య నాశము, కుటుంబ కలహము, దారాపుత్రుల శరీర పీడ, మనోవ్యధ,

బంధువులు శత్రువుల వల్ల విరోధము, భార్యా పుత్ర మరణము, ఉద్యోగ భంగము సంభవించును.

**2. గురు దశలో శని భుక్తి ఫలము -**

గురు దశలో శని భుక్తి యందు శని శుభుడై బలము కల్గి యున్న జాతకునికి శరీరారోగ్యాభి వృద్ధి, రాజపూజ్యత, కృషివల్ల లాభము, స్థల వృద్ధి, ధాన్యవృద్ధి, బంధు దారాపుత్ర సౌఖ్యము, అలంకార ప్రాప్తి, ఉద్యోగాభివృద్ధి, ఆభరణ వస్తు లాభము, వాహన ప్రాప్తి సంభవించును.

గురు దశలో శని భుక్తి యందు శని పాపియై బలహీనుడై యున్న జాతకునికి కామక్రోధము వల్ల దుఃఖము, తాపత్రయము వల్ల భయము, బంధుమిత్ర విరోధము వ్యభిచారము వల్ల రోగము, అధర్మ ప్రవర్తన, ధన హాని, గ్రామాధిపత్యము, అబద్ధ సాక్ష్యము, కుటుంబ కలహము, గృహనాశము, మనో దుఃఖము, శత్రువృద్ధి, కారాగార ప్రవేశము, అందిరితో శత్రుత్వము, స్త్రీ దుఃఖము వలన బలహీనత, సేవకుల బాధ, అధిక వ్యయము, కార్యభంగము, మనో చపలత్వము, బ్రహ్మణుల వల్ల అధిక బాధ, వేశ్యలతో సహవాసము, మత్తు పానీయములు త్రాగుట, ప్రతిష్ట క్షయము, అనారోగ్యము, నేత్ర రోగము, బిడ్డలకు రోగము, కీళ్ళవాత నొప్పులు, ఉద్యోగ భ్రష్టత్వము, మధ్య భాగములో దౌర్భాగ్యము, అంత్యము నందు శుభము సంభవించును.

**3. గురు దశలో బుధ భుక్తి ఫలము -**

గురు దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి కుసుమ శయనము, వస్త్రాలంకారము, భూలాభము, కుటుంబ సౌఖ్యము, ఔదార్యము, శుభకార్యములు, సమస్త విద్యల యందు నేర్పరితనము, గణితము, వ్యవసాయము వల్ల ధనలాభము, వైశ్యుల ధనము వల్ల భోగము, బహుజన స్నేహము వాహనము, గౌరవము, సంపద వృద్ధి, బ్రాహ్మణుల యొక్క ప్రేమ, భార్యాబిడ్డల సౌఖ్యము, దైవభక్తి, ప్ర[illegible]ష్ఠ గలుగును.

గురు దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి ఉత్సాహ భంగము, పశు నష్టము, భూవ్యయము, సువర్ణ వస్త్ర నాశనము, స్థానభ్రష్టత్వము, ద్వేషము, విద్యావిఘ్నము; వ్యవసాయ నష్టము, వర్తకము వల్ల నష్టము, బంధు నష్టము, దుఃఖము, దాసదాసీ జననష్టము, దారాపుత్ర పీడ, పరదేశ నివాసము, సంపద నష్టము, జ్వరము, సుఖవ్యాధులు, క్రూర వాక్కులు, స్త్రీల వలన దుఃఖము, జూదము, త్రాగుడు, వాతపిత్త శ్లేష్మరోగములు సంభవించును.

**4. గురు దశలో కేతు భుక్తి ఫలము -**

గురు దశలో కేతు భుక్తి యందు కేతువు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి వ్యవసాయము, పశువృద్ధి, భూలాభము, విద్యాభివృద్ధి, బంధువులతో స్నేహము భోజన సౌఖ్యము; వస్త్ర సౌఖ్యము, బంధు గౌరవము, దారాపుత్రాదుల సౌఖ్యము, విశేష పుణ్యకర్మలు, తీర్థ యాత్రలు మొదలగులవి గల్గును.

గురు దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి పేదరికము, జ్వర బాధ, భార్యాపుత్ర మరణము, రాజ చోర అగ్ని

భయము ఆయుధము వలన గాయములు, సేవకులతో విరోధము, మనోవ్యధ, భార్యా బిడ్డలకు రోగము, గురువు స్నేహితులతో యెడబాటు, పరదేశ నివాసము, స్థాన భ్రష్టత్వము రాజుల వల్ల బాధ, నేత్ర రోగము, గురుని వల్ల ఆపత్తు, పుణ్య కర్మ విఘ్నము, ధర్మము వల్ల ధనవ్యయము, ఋణవృద్ధి గల్గును.

### 5. గురు దశలో శుక్ర భుక్తి ఫలము -

గురు దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి రాజ్యలాభము, రాజ్య సన్మానము, వస్త్ర వాహనాలంకారము సంతోషము, యశోవృద్ధి, స్త్రీ పుత్ర ధనసంపత్తు, ఉత్తర ఖండ మందు భాగ్యము, మనోధైర్యము రాజానుగ్రహము, ఉద్యోగ ప్రాప్తి, వివాహ వేడుకలు, రాజ పారితోషికములు, మాతాపిత బిడ్డల సౌఖ్యము, పశులాభము, మంచి అధికారము, భూవృద్ధి, ధనవృద్ధి, దగ్గర బందు వర్గముతో స్నేహము సంభవించును.

గురు దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి ఉద్యోగ భంగము, దుఃఖము, ధనధాన్య నాశము, స్థానభ్రష్టత్వము, కళత్ర పీడ, భూవివాదము, బంధునష్టము, పుత్రవిచారము, రోగవృద్ధి, ఋణవృద్ధి, కారాగార వాసము, సంకెళ్ళు, రోగ బాధ, భార్యామరణము, మూత్ర రోగము, బంధువుల వలన చిక్కులు సంభవించును.

### 6. గురు దశలో రవి భుక్తి ఫలములు -

గురు దశలొ రవి భుక్తి యందు రవి శుభుడై బలము కల్గి యున్న జాతకునికి ధనలాభము, రాజ సన్మానము, దారా పుత్రాదులు రాజుల వల్ల ప్రేమ, ప్రయాసము చేత శత్రుజయము, చిరకాల భోగము, ప్రతిష్ట, పారితోషికములు, ప్రజానాయకుడు, సుఖము, ధనము, బిడ్డల యందు ఆసక్తి, వాహన సౌఖ్యము, క్రూర మనస్సు, తల పెట్టిన కార్యము సఫలమగుట సంభవించును.

గురు దశలో రవి భుక్తి యందు రవి పాపియై బలహీనుడై యున్న జాతకునికి రాజ శత్రుభయము, దుఃఖము, ధన, హాని, శత్రుపీడ, పిత్త జ్వరము, శిరోరోగము అగ్ని, వాయువు వలన చిక్కులు, గృహము నందు కలతలు సంభవించును.

### 7. గురు దశలో చంద్ర భుక్తి ఫలము

గురు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి ఉత్తమ స్త్రీలతో భోగము, మంచి వస్త్రానుభవము, భోజన సౌఖ్యము వ్యాపారము వల్ల లాభము, స్త్రీ సంతాన వృద్ధి, శరీరా రోగ్యము, ధనవృద్ధి, వాహన సౌఖ్యము, అలంకార ప్రాప్తి, మాతృసౌఖ్యము, మనస్సంతోషము, దారాపుత్రాభి వృద్ధి, జ్ఞాన వృద్ధి, ప్రతిష్ట, రాజగౌరవము, ప్రేమ, సంతోషము, పోయిన ఆస్తి సంక్రమించుట, గృహము నందు శుభ కార్యములు శిశు జననము సంభవించును.

గురు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి వ్యవసాయ నష్టము, ధాన్యహాని, మాతృనష్టము, ధనవ్యయము, చర్మవ్యాధి, విషభీతి, చోరభయము, పుత్రమిత్ర నష్టము, భార్యా బంధు విరోధము,

భార్య మరణము, సంకెళ్ళ భయము, కారాగార వాసము, బంధు నష్టము, మూత్ర రోగము మన్య జ్వరము గలుగును.

### 8. గురు దశలో కుజ భుక్తి ఫలము -

గురు దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వ్యవసాయము, పశువృద్ధి, భూలాభము, దేవస్థాన, గురుస్థాన, రాజ సంస్థాన, గజ, ఛత్ర, అశ్వము, దాస దాసీజనులు మొదలగు వానివల్ల బిరుదాంకితములును ప్రభుత్వ జన సన్మానము, శౌర్యము, సాహసము, మంచి వృత్తి వల్ల ధనలాభము, సోదర సౌఖ్యము, శత్రువుల వలన సంపద, శిధిలమైన విగ్రహ ప్రతిష్ట గలుగును.

గురు దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి భ్రాతృనష్టము, గృహనష్టము, భూవ్యయము, స్ఫోటకము, ప్రణబాధ, ఉద్యోగ భంగము, దుఃఖము, వ్యవసాయము వల్ల ధనవ్యయము, దారాపుత్ర నష్టము, కారాగృహ ప్రవేశము, శిరోరోగము, మూలవ్యాధి, నేత్ర రోగము, విషభయము, అపాయము, చోర భయము, అగ్ని భయము, బంధు నష్టము సంభవించును.

### 9. గురు దశలో రాహు భుక్తి ఫలము -

గురు దశలో రాహువు భుక్తి యందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి గృహ లాభము, భూవృద్ధి, రాజసన్మానము, భార్యాపుత్రుల సౌఖ్యము, ఉద్యోగము వల్ల ధనలాభము, బంధుమిత్రులతో స్నేహవృద్ధియు, గృహము నందు వివాహ వేడుకలు, యశోవృద్ధి, స్నేహితులు, బిడ్డల సౌఖ్యము, దూర ప్రదేశములకు ప్రయాణము సంభవించును.

గురు దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి అసౌఖ్య బోజనము, జీర్ణవస్త్రము, స్థానభ్రష్టత్వము, రాజభయము, కృషి పశు భూవస్త్ర బంధు సంతాన ధననాశము, శత్రు వృద్ధి, శరీరపీడ, చెడురక్తము, పైత్యము వలన కాలిలో బాధ, సన్నిపాత జ్వరము, చోర అగ్ని భయము, పంటినొప్పి ఆయుధ భయము మొదలగునవి సంభవించును.

## 6. శని మహాదశ

శని శుభుడై యుచ్చ తృతీయ షష్ట లాభముల యందు గాని కోణముల యందు గాని యున్న యెడల శనిమహా దశలో రాజ సన్మానము, ధనలాభము, దేశాధిపత్యము, గ్రామాధిపత్యము, బంధుదారాపుత్ర శరీరారోగ్యము, అలంకారము, శత్రునష్టము,మనోత్సాహము, ధనధాన్యాభివృద్ధి, వైభవము, ప్రజ్ఞ, యజ్ఞ, క్షేత్ర, గ్రామ, పురాధిపత్యము, వ్యాపార లాభము గలుగును.

పాపశని నీచకేంద్ర వ్యయ అష్టమ ద్వితీయమందు గానియున్న శని మహాదశలో గృహనష్టము, భూవ్యయము, విషప్రయోగము, ధనహాని. దేహబాధ, రాజక్రోధము, విరుద్ద కార్యము, వాతోద్రేకము, రోగబాధ, స్థానభ్రష్టత్వము, పరదేశ నివాసము, శరీర పీడ, విశేష శత్రువృద్ధి, నీచవృత్తి వల్ల జీవనము, దారాపుత్ర శరీరపీడ, కారాగృహ ప్రవేశము మొదలగు దుష్ఫలములు గలుగును.

## శని మహాదశలో గ్రహముల యొక్క భుక్తి ఫలములు

### 1. శని దశలో శని భుక్తి ఫలము -

శని దశలో శని భుక్తి యందు శని శుభుడై బలము కల్గి యున్న జాతకునికి రాజసన్మానము, ధనలాభము, దేశాధిపత్యము, గ్రామాధిపత్యము, బంధు దారాపుత్ర శరీరారోగ్యము, అలంకారము, శత్రునష్టము, మనోత్సాహము, ధనధాన్యాభి వృద్ధి, వైభవము, ప్రజ్ఞ, యజ్ఞ, క్షేత్ర, గ్రామ, పురాధిపత్యము, వ్యాపార లాభము, రాజ్య లాభము, అధిక సంతోషము, భార్యాబిడ్డల సంతోషము, వివాహ వేడుకలు, వ్యవసాయాభివృద్ధి, సేవకులు, పశువుల వృద్ధి సంభవించును.

శని దశలో శని భుక్తి యందు శని పాపియై బలహీనుడై యున్న జాతకునికి గృహనష్టము, భూవ్యయము, విషప్రయోగము, ధనహాని, దేహబాధ, రాజ క్రోధము విరుద్ధ కార్యము, వాతోద్రేకము, రోగబాధ, స్థానభ్రష్టత్వము, పరదేశ నివాసము, శరీరపీడ, విశేష శత్రువృద్ధి, నీచవృత్తి వల్ల జీవనము, దారాపుత్ర శరీరపీడ, కారాగృహ ప్రవేశము, మూలవ్యాధి వలన రక్తస్రావము, చోరాగ్ని భయము, మనోవ్యధ, సోమరితనము, క్రూర కార్యములు, సేవకుని ద్వారా సంపద లాభము, ముసలిస్త్రీతో సాంగత్యము, బంధువులతో సంకటనలు మొదలగు దుష్ఫలములు గల్గును.

### 2. శని దశలో బుధ భుక్తి ఫలము -

శని దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి శాశ్వతమైన పుణ్యకర్మలు, పశువృద్ధి, వ్యవసాయాభివృద్ధి, భూలాభము, మనోధైర్యము, సంతోషము, విదేశ వస్తులాభము, యజ్ఞము, వివాహము, పురాణ శ్రవణము, బంధుపూజ్యత, ధనార్జనము, యశోవృద్ధి, సౌఖ్యము, స్త్రీ జనము, రాజ గౌరవము, స్నేహితులతో సమాగమము, స్థిరమైన ధనార్జన, సంపద, భర్త బంధువులు బిడ్డలతో స్త్రీల సౌఖ్య జీవనము గలుగును.

శని దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి చోరశత్రు అగ్ని వల్ల భయము, నీచ స్త్రీ గృహనివాసము, కర్మహీనము, వ్యవసాయము వల్ల నష్టము, వ్యాపారము వల్ల ధనవ్యయము, శత్రువృద్ధి, ఋణము, రోగము బంధు విరోధము, భయము, మనోచంచలత్వము, వాతపైత్య శ్లేష్మ రోగములు, పుత్ర సోదర అనారోగ్యము సంభవించును.

### 3. శని దశలో కేతు భుక్తి ఫలము -

శని దశలో కేతు భుక్తి యందు కేతువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి సౌఖ్యము, దారాపుత్రుల అభివృద్ధి, వాహనసౌఖ్యము, బంధు పూజ్యత, తీర్థయాత్రాది లాభము, పుణ్యకర్మలు, ధనధాన్య లాభము, రాజగౌరవము పవిత్ర ప్రదేశములో స్నానము, శిశుజననము సంభవించును.

శని దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై బలహీనుడై యున్న జాతకునికి వాతపిత్త అగ్ని బాధయు, దారాపుత్ర విరోధము, స్థానభ్రష్టత్వము, మనోధుఃఖము రోగవృద్ధి, కుటుంబ బంధువులతో ఆకస్మిక కలహము, కుడికాలికి కీళ్ళవాత నొప్పులు పైత్యరోగము, విషభయము, పుత్రుని చెడునడతల వలన పేదరికము, భార్య వలన చిక్కులు, వినికిరాని మాటల వలన కలతలు సంభవించును.

4. శని దశలో శుక్ర భుక్తి ఫలము -

శని దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి పశువృద్ధి, భూలాభము, ధనలాభము, పుత్రవృద్ధి, కళత్ర సౌఖ్యము, సంపత్తు, వ్యవసాయము వల్ల ధనలాభము, కళత్ర సౌఖ్యము, సంపత్తు, దూర దేశము నుండి ధనాగమము, రాజ సన్మానము, ఉద్యోగాభివృద్ధి, వివాహవేడుకలు, బంధు సమాగమము, రాజోద్యోగ లాభము, సౌఖ్యము, వాహన లాభము, సముద్ర యానము, స్నేహితులతో సౌఖ్యము సంభవించును.

శని దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి ఉద్యోగ భంగము దుఃఖము, భార్యాపుత్రుల యొక్క నాశనము, ఋణవృద్ధి, వ్యవసాయ నష్టము, చోరాగ్నిబాధ, శరీరపీడ, బంధునష్టము, గొప్ప దుఃఖము, ధన ధాన్య నాశనము, కారాగార వాసము, భార్యాపుత్రుని వల్ల చిక్కులు, ఆయుధముల వలన అపాయము సంభవించును.

5. శని దశలో రవి భుక్తి ఫలము -

శని దశలో రవి భుక్తి యందు రవి శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఆరోగ్యము, ధనలాభము, గౌరవము, పితృసౌఖ్యము, నేత్ర సౌఖ్యము, వాహన సౌఖ్యము, రాజసన్మానము, పోయిన రాజోద్యోగము మరల సంక్రమించుట, గోవులు సంపద, కళత్ర, ఆభరణ, వస్త్రలాభము గల్గును.

శని దశలో రవి భుక్తి యందు రవి పాపియై బలహీనుడై యున్న జాతకునికి రాజశత్రు భయము, మృత్యుభయము, ధనహాని, పితృపీడ, పిత్తజ్వరము, శిరో రోగము, ప్రవాసము, ఉదరరోగము, బంధుహాని, యుద్ధము, దారిద్ర్యము, మానహాని, కారాగృహ ప్రవేశము, యుద్దములో ఆయుధము వలన గాయము, భార్యాబిడ్డల అసౌఖ్యము, శత్రువుల వలన అపాయము, బంధువులకు అనారోగ్యము, నేత్ర రోగము కడుపు నందు రోగము, ధననష్టము, మూత్ర రోగము, చేతి యందు గాయము, కీళ్ళవాత నొప్పులు సంభవించును.

6. శని దశలో చంద్ర భుక్తి ఫలము -

శని దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి ఆరోగ్యము, ధనసంపత్తి, భూషణము, వాహనము, మిత్రుల అభివృద్ధి, వర్తక వ్యవసాయాభివృద్ధి, సౌఖ్యము. బిడ్డలు, మనుమలు, మనుమరాండ్లతో సంతోష సౌఖ్యము, రాజగౌరవము, ధనలాభము గల్గును.

శని దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై బలహీనుడై యున్న జాతకునికి వ్యవసాయము వల్ల నష్టము, ధాన్యహాని, మలిన వస్త్రములు, అసౌఖ్య భోజనము, మాతృ, పితృపీడ, స్వజనవిరోధము, జలుబు కామెర్ల రోగము, భార్యాబిడ్డల మరణము, శత్రువృద్ధి, నంజురోగము, స్వమరణము, స్నేహితులకు చిక్కులు, నీరు, గాలి, రోగముల వలన భయము, సంపద నాశము, ఆభరణ నాశము, చిక్కుల నుండి తప్పించుకొనుట, ప్రదేశము మార్పిడిలు సంభవించును.

**7. శని దశలో కుజ భుక్తి ఫలము -**

శని దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి భూలాభము, అధిక ఆరోగ్యము, విజయము, ధనలాభము, భ్రాతృ సౌఖ్యము, బలము, మానము, శుభకార్యము, భూలాభము, బంధుమిత్ర సమాగమము, నూతన గృహ నిర్మాణము, వాహన ప్రాప్తి, వస్త్రాభరణ సౌఖ్యము, ప్రభుత్వ సహాయము వలన భూలాభము గలుగును.

శని దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై దుర్బలుడైన జాతకునికి మేహ వాతరోగము, దుఃఖము, దేశాటనము, విశేషశ్రమ, స్వల్పధన లాభము, పుత్ర కళత్ర విచారము చోర అగ్ని ఆయుధ విషభయము, పుత్ర కళత్ర సోదర విరోధము, కారాగార వాసము, ఉద్యోగ భంగము, స్వజనవిరోధము, శత్రువృద్ధి, నరముల బలహీనత, నేత్ర రోగము, ద్వేషము, అపవాదులు, దేశ సంచారము, సువర్ణ నాశనము, కులభ్రష్టత్వము సంభవించును.

**8. శని దశలో రాహు భుక్తి ఫలము -**

శని దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి స్వల్ప సౌఖ్యము, స్వల్పధనము, స్వల్పకీర్తి, వస్తువాహన భూషణ లాభము, భూషణ క్రయవిక్రయములు, భూలాభము, భార్యాబిడ్డల సౌఖ్యము, యింటి యందు వివాహవేడుకలు సంభవించును.

శని దశలో రాహుభుక్తియందు రాహువు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి నేత్రరోగము, గృహము దగ్ధమగుట, దారాపుత్రాది భయము, స్థాన భ్రష్టత్వము, మనోదుఃఖము, అనాచారము, ప్రవాసము, భూగృహనాశనము, మాతా పిత మరణము, విషచోరభయము, మంచి మార్గము నుండి విడిపోవుట, ప్రాణ భయము, మధుమేహరోగము, సుఖవ్యాధుల వలన అపాయము, తీరని జ్వరము, చర్మరోగము, పరాయివారి శత్రుత్వము, సువర్ణనాశము, సర్పకాటు భయము సంభవించును.

**9. శని దశలో గురు భుక్తి ఫలము -**

శనిదశలో గురుభుక్తియందు గురుడు శుభుడై బలవంతుడైయున్న జాతకునికి కళత్రసౌఖ్యము, దేవబ్రాహ్మణపూజ, దారాపుత్ర సౌఖ్యము, రాజసన్మానము, జయము, వివాహవేడుకలు, రాజపారితోషికములు, పవిత్ర గంగా స్నానము, ధనధాన్యవృద్ధి, తలంపులో లేని కార్యములు సఫలమగుట, వస్త్రాభరణ ప్రాప్తి బంధుసమాగమము గలుగును.

శనిదశలో గురుభుక్తియందు గురుడు పాపియై దుర్బలుడైనజాతకునికి ధర్మక్షయము, విత్తహాని, అధికార నష్టము, అవసాక్షము, కుటుంబ కలహము, మహాదుఃఖము, భార్యాబిడ్డల మరణము, ఆయుధ, అగ్ని, విషభయము సంభవించును.

## 7. బుధ మహాదశ

బుధుడు శుభుడై కేంద్రకోణ ధనలాభశుభ స్థానములయందుగాని శుభ గ్రహముతో కలసినను వీక్షించబడినను బుధ మహాదశలో ఆరోగ్యము, భూషణ

లాభము, బంధు లాభము, జయము, మంచి వస్త్రము, వాహనము, గృహము, ధన ధాన్య లాభము, కుటుంబవృద్ధి, వర్తకమువల్ల ధనలాభము, పుత్రోత్పత్తి, వృత్తగీతాది మహోత్సవములు గలుగును.

బుధుడు పాపుడై నీచ షష్టాష్టమ వ్యయ స్థానముల యందుండి పాప గ్రహములతో కలసియున్న వాతపైత్యము, వ్యవసాయమువల్ల ధనవ్యయము, ఋణ వృద్ధి, శత్రువృద్ధి, విదేశ ప్రయాణము, మనోదుఃఖము, బంధు క్షయము, అజ్ఞానము, వ్యాపార నష్టము, కలహము, ధనక్షేత్ర నాశనము, రోగవృద్ధి, కష్టముల వల్ల ధన నాశము, చిరకాలమునకు భోగము గలుగును.

## బుధ మహాదశలో గ్రహములయొక్క భుక్తిఫలములు

### 1. బుధ దశలో బుధ భుక్తి ఫలము -

బుధ దశలో బుధ భుక్తియందు బుధుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వర్తక వ్యవసాయమువల్ల ధనలాభము, బంధు మిత్ర సమాగమము, గణిత శిల్ప విద్యయందు నేర్పరితనము, పుత్రకళత్రవృద్ధి, ఆనందము, జ్ఞానవృద్ధి, శాస్త్రములను తర్కించుట, వివాహ వేడుకలు, పుత్రసమాగమము, బ్రాహ్మణులద్వారా ధనార్జన, తీరని సౌఖ్యము, విద్యావంతులతో స్నేహము, కల్మషములేని మనస్సు, తలంచిన కార్యము సిద్ధించుట, తెలివి, అదృష్టము గలుగును.

బుధ దశలో బుధ భుక్తియందు బుధుడు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి పుత్ర కళత్ర ధనపీడ, రోగోత్పత్తి, విశేషభయము, కుటుంబకలహము, బుద్ధి నాశనము, ధనవ్యయము, రాజాగ్రహము, బంధు విరోధము, పుత్రకళత్ర నాశము, ధనధాన్యనాశము గలుగును.

### 2. బుధ దశలో కేతు భుక్తి ఫలము -

బుధ దశలో కేతు భుక్తియందు కేతువు శుభుడై బలవంతుడైయున్న జాతకునికి స్వల్ప దుఃఖము, స్వల్ప సౌఖ్యము, శత్రు మిత్ర స్నేహము, వర్తక వ్యాపారము వల్ల సామాన్య ధనలాభము, ధర్మమూలముగా ధనవ్యయము, బంధువులతో స్నేహము, పశులాభము సంభవించును.

బుధదశలో కేతు భుక్తియందు కేతువు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి పుత్రమిత్రాది మరణము, పితృనాశము, స్థానము కొరకు కలహము, బంధుమిత్ర విరోధము, వాహనమునుండి పతనము, పితృవిచారము, రాజ చోర అగ్నిభయము విషజంతు భయము, దౌర్భాగ్యము, దుఃఖము, కలతలు, క్రూరులతో సహవాసము, భూనష్టము, వాహననాశము, శరీరమునకు అనారోగ్యము, మనోవ్యధ, స్థానచలనము స్వజన విరోధము సంభవించును.

### 3. బుధ దశలో శుక్ర భుక్తి ఫలము -

బుధ దశలో శుక్ర భుక్తియందు శుక్రుడు శుభుడై బలము గల్గియున్న జాతకునికి రాజ సన్మానము, ధనలాభము, పుత్రలాభము, స్త్రీధన లాభము, వస్త్రవాహన భూషణ ప్రాప్తి, దేహారోగ్యము, సౌఖ్యము, దైవబ్రాహ్మణ భక్తి, స్నేహ లాభము వివాహ వేడుకలు, కామసుఖము, శిసుజననము, బంధు స్నేహము, జ్ఞానవృద్ధి, అనేక విధములైన ఆభరణ ప్రాప్తి, విదేశాగమము సంభవించును.

బుధ దశలో శుక్రభుక్తియందు శుక్రుడు పాపియై దుర్బలుడైయున్న జాతకునికి ఉద్యోగ భంగము, మనఃక్లేశము, బంధు జననాశము, భూవివాదము, స్థాన భ్రష్టత్వము, జ్వరము, గ్రహణి, భార్య తరపు బంధువులు, పుత్రుని వలన సంకటనలు, రాజాగ్రహము, జన విరోధము సంభవించును.

**4. బుధ దశలో రవి భుక్తి ఫలము -**

బుధదశలో రవి భుక్తియందు రవి శుభుడై బలము గల్గియున్న జాతకునికి ధనలాభము, సంతాన సౌఖ్యము, యుద్ధమందు జయము, విద్యాలాభము, రాజుల వల్ల సంతోషము, వస్త్రవాహనాలంకార ప్రాప్తి, ప్రభుత్వ పనులు చేయుట వలన అధిక ధనలాభము, వివాహ వేడుకలు, భూగ్రామ లాభము, భార్య గర్భిణిగా యుండుట, అశ్వములు, ఏనుగులు, సువర్ణము, పగడములు గలిగి యుండుట, మంచి పానీయము, భోజన గృహ సౌఖ్యము, రాజగౌరవము సంభవించును.

బుధ దశలో రవి భుక్తియందు రవి పాపియై దుర్బలుడైయున్న జాతకునికి వాక్పారుష్యము, మనోదుఃఖము, నేత్రరోగము, విశేషభయము, పితృనష్టము, శత్రు వృద్ధి, చోరపీడ, రాజ, అగ్ని, ఆయుధభయము, అడవిమృగములు భూతముల భయము, జ్వరము సంభవించును.

**5. బుధ దశలో చంద్రభుక్తి ఫలము -**

బుధ దశలో చంద్రభుక్తియందు చంద్రుడు శుభడై బలవంతుడై యున్న జాతకునికి పుత్ర కళత్ర వృద్ధి, మాతసౌఖ్యము, మనోత్సాహము, వస్త్రవాహనాలంకార ప్రాప్తి, ధర్మము, యజ్ఞము, వివాహసౌఖ్యము, రాజ్యలాభము, ధనసంపదయు, సువర్ణప్రాప్తి, జయము, సౌఖ్యము వివాహము, యశోవృద్ధి, కోరిన వానితో సంతోషము సంభవించును.

బుధ దశలో చంద్ర భుక్తియందు చంద్రుడు పాపియై దుర్బలుడైన జాతకునికి మాతృసౌఖ్య హీనము, వ్యవసాయ నష్టము, గోభూనష్టము, వ్యాపారము వల్ల ధననష్టము, గృహదారార్థ నాశనము, చోరాగ్ని వలన ప్రాణభయము, నీచస్త్రీ సాంగత్యము, అప్రతిష్ట, గేదెలు, గోవుల నాశము, తలనొప్పి నేత్రవ్యాధి, కుష్టు రోగము, నారి కురుపులు, కంఠమునందు రోగము, ప్రాణభయము సంభవించును.

**6 బుధ దశలో కుజ భుక్తిఫలము**

బుధ దశలో కుజ భుక్తియందు కుజుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి భ్రాతృసౌఖ్యము, మనోత్సాహము, విద్యావాహన భూషణసౌఖ్యము, భూ లాభము, ధనలాభము, రాజ సన్మానము, వైభవము, పుత్ర జననము, రాజ పారితోషికములు, వ్యవసాయభూములు, గృహలాభము, వివాహ వేడుకలుగలుగును.

బుధ దశలో కుజ భుక్తియందు కుజుడు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి గృహనాశము, భూనాశనము, భ్రాతృనాశనము, పూర్వ విత్తనాశము, రాజమూలమున ధనవ్యయము, పితృ తరపు బంధునాశము, శత్రు ఆయుధ చోరజ్వర భయము, నేత్రరోగము, అధిక దౌర్భాగ్యము, అధికార నష్టము, కీళ్ళవాతము, పైత్యరోగము, కామెర్ల రోగము, శిరోరోగము, విదేశీయులతో విరోధము, తీరని పోరాటము, చిక్కులు సంభవించును.

### 7. బుధ దశలో రాహు భుక్తిఫలము

బుధ దశలో రాహు భుక్తియందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఉద్యోగమువల్ల ధనలాభము, భూలాభము, గృహలాభము, వర్తక వ్యాపారమువల్ల ధనలాభము, రాజమూలకముగా ధనలాభము, ప్రతిష్ట, యుద్దములో జయము, యాత్రా సుఖము, పుత్రుని వివాహవేడుకలు సంభవించును.

బుధ దశలో రాహు భుక్తియందు రాహువు పాపియై దుర్బలుడైయున్న జాతకునికి విశేష దుఃఖము, ఋణ శత్రురోగ వృద్ధియు, కారాగృహ ప్రవేశము, ఆకస్మిక శత్రుపోరాటము, రక్తప్రసారము చెడిపోవుట, పైత్యరోగము, విషభయము, అప్రతిష్ట, అధికార పతనము, అనారోగ్యము, నీటి అపాయము, అగ్ని విష ప్రమాదము, శిరోబాధ, నేత్రరోగము, కడుపులో బాధ సంభవించును.

### 8. బుధ దశలో గురు భుక్తిఫలము

బుధ దశలో గురు భుక్తియందు, గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి విదేశ వ్యాపారమువల్ల ధనలాభము, కీర్తి, విద్య, జయము, సుఖము, దేశాధిపత్యము, మంత్రిత్వము, దారాపుత్రాది సౌఖ్యము, న్యాయముగా ధనలాభము, ఆరోగ్యము, వస్త్రలాభము, జ్ఞానవృద్ధి, రోగవిముక్తి, శత్రుజయము, రాజగౌరవము, విధినీతితో నిర్వర్తించుటలో జయము, పుత్రజననము, బంధుసమాగమము, వివాహము, గొప్ప అదృష్టము సంభవించును.

బుధ దశలో గురుభుక్తియందు గురుడు పాపియై దుర్బలుడైన జాతకునికి రాజభయము, అతివ్యాధి, ధైర్యహాని, ధాన్యనాశనము, బ్రహ్మద్వేశము, పితృ దుఃఖము, క్రోదము, అన్నాభావము, దుఃఖము, అగౌరవము, మాతృపితృమరణము, రాజ, చోర, అగ్ని, జ్వర, విషభయము, పశువులు, భూముల నష్టము సంభవించును.

### 9. బుధ దశలో శని భుక్తిఫలము

బుధ దశలో శని భుక్తియందు శని శుభుడై బలవంతుడైయున్న జాతకునికి దేవ బ్రాహ్మణభక్తి, పుత్రకళత్ర సౌఖ్యము, వస్త్రవాహన సౌఖ్యము, స్త్రీపుత్రులవల్ల ధనలాభము, రాజ్యలాభము లేక ఉద్యోగప్రాప్తి, గొప్ప సంతోషము, గోసంపద, వివాహవేడుకలు, రామేశ్వరములో పవిత్రస్నానము సంభవించును.

బుధ దశలో శని భుక్తియందు శనిపాపియై దుర్బలుడైన జాతకునికి గుల్మ రోగము, శూలవ్యాధి, పరులవలన అపవాదము, బంధుమరణము, ధననాశనము, ఉద్యోగభంగము, దుఃఖము, ధనధాన్య వినాశనము, భయంకరమైన రోగము, ధన వ్యయము, మనోవ్యధ, బంధు మరణము, భార్యబిడ్డల బాధ, వ్యాపార భంగము, శ్లేష్మ వాతరోగము, విరామములేని అసౌఖ్యము, కుడికాలియందు గాయము పరదేశ ప్రవాసము సంభవించును.

## 8. కేతు మహాదశ

కేతు మహాదశలో శుభుడైన కేతువు తృతీయ షష్టలాభస్థానములయందున్న విశేషసుఖము, భ్రాతృవర్గాది సౌఖ్యము, యజ్ఞదానాదివృద్ధి, రాజ్యలాభము, ధన లాభము, గృహలాభము, రాజ్యపూజ్యత , యశస్సు, జయము, క్రూరకార్యములవల్ల ధనప్రాప్తి, తురుశ్కరాజ సన్మానము, కవిత్వారంభము శత్రునాశనము గలుగును.

పాపకేతువు కేంద్ర కోణ అష్టమ వ్యవస్థానములయందున్న స్ఫోటకము, విషభయము, బంధుహాని, ధనవ్యయము, దౌర్జన్యము, నీచవ్యాపారమువల్ల జీవనము, అతికష్టము, ఫలశూన్యము, నిష్ప్రయోజనమైన పనులు, ఉద్యోగహాని, ఆస్తి నష్టము, జ్వరము, బ్రహ్మద్వేషము, పిశాచబాధ, మూఢత్వములో పనులు జేయుట మొదలగునవి గలుగును.

## కేతు మహాదశలో గ్రహముల యొక్క భుక్తిఫలములు

### 1. కేతు దశలో కేతు భుక్తిఫలము

కేతు దశలో కేతు భుక్తియందు కేతువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి జ్ఞానము, ఈశ్వరభక్తి, రోగ దుఃఖవిముక్తి యాత్రాసుఖము, వస్త్రాభరణ వస్తులాభము, దూరదేశ ప్రయాణము, రాజపారితోషికములు, వేడుకలు, సంతోష సౌఖ్యము గలుగును.

కేతు దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి శరీరపీడ, స్థానభ్రష్టత్వము, ధననష్టము, ఉద్యోగ భంగము, దుఃఖము, కారాగార ప్రవేశము, చర్మరోగము, గాయములు, ఉబ్బసరోగము, భార్యాబిడ్డల బాధ, యింకా యితర కష్టములు, శత్రువులతో పోరాటము, స్నేహితులతో మనస్పర్థలు, వివాదకరమైన వార్తలు వినుట, జ్వరము వలన అవయవముల యందు మంటలు, అమర్యాదగా యితరుల యిండ్ల యందు ప్రవేశము, సంపద నాశనము, భార్యాబిడ్డలు, సోదరులతో శత్రుత్వము సంభవించును.

### 2. కేతు దశలో శుక్ర భుక్తి ఫలము -

కేతు దశలో శుక్ర భుక్తియందు శుక్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి భూలాభము, ధనలాభము, పుత్రలాభము, వాహనాలంకార ప్రాప్తి, విద్యా లాభము, యశోవృద్ధి, గృహములో అళ్యాణము, శిశుజననము, గ్రామములో భూలాభము, సాధారణ సౌఖ్యము, భార్యాబిడ్డలతో సౌఖ్యము, పశువృద్ధి, తలంచిన కార్యము నెరవేరుట, భుక్తి మొదటి సగభాగములో సౌఖ్యము గలగును.

కేతు దశలో శుక్ర భుక్తియందు శుక్రుడు పాపియై దుర్బలుడైన జాతకునికి పుత్ర, కళత్ర, దేహపీడ, ధనవ్యయము, రాజకార్యముల వల్ల విరోధము, ధర్మమూలమున ధనవ్యయము, ధనధాన్య నష్టము, భార్యాబిడ్డలు గోవులకు అనారోగ్యము దుశ్శకునములు, బంధు విరోధము, పవిత్రమైన వేదపారాయణము చేయు పండితునితో విరోధము, భార్యాబంధువులతో కలతలు శత్రుపోరాటము, భుక్తి ద్వితీయ భాగములో భార్యకు రోగము తరువాత మరణము సంభవించును.

### 3. కేతు దశలో రవి భుక్తి ఫలము -

కేతు దశలో రవి భుక్తియందు రవి శుభుడై బలము కల్గి యున్న జాతకునికి వస్తువాహనా లంకారప్రాప్తి, ధనలాభము, రాజసన్మానము, దారాపుత్రాభి వృద్ధి, తలంచిన పనులు సక్రమముగా నెరవేరుట, సామాన్య సౌఖ్యము, విదేశ వ్యాపారము వల్ల ధనలాభము, విదేశము నుండి స్వదేశాగసనము సంభవించును.

కేతు దశలో రవి భుక్తి యందు రవి పాపియై దుర్బలుడై యున్న జాతకునికి అన్యాయముగా, ధనవ్యయము, జ్వరాతిసారమువల్ల బాధ, మేహ

పైత్యవ్యాధి, ఉద్యోగ భంగము, దుఃఖము, రాజబంధనము, మాతృ లేక పితృనష్టము, విష, అగ్ని, చోరభయము, కారాగార ప్రవేశము, రాజాగ్రహము, సంపద నష్టము, శిరోరోగము, గౌరవనీయుడైన తన నాయకుని మరణము, జ్వరము, బంధువులతో చెడుసాంగత్యము, వాత శ్లేష్మరోగము సంభవించును.

**4. కేతు దశలో చంద్ర భుక్తి ఫలము -**

కేతు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి దేహారోగ్యము, రాజువల్ల సంతోషము, వస్తువాహనాలంకార ప్రాప్తి, పుత్రకళత్ర సంపత్తు వ్యాపార లాభము, రాజ్యలాభము, గొప్ప సంతోషము, వివాహ వేడుకలు, మంచి సౌఖ్యము, ధారాపుత్ర సౌఖ్యము, ఆకస్మిక లాభము, ఆలస్యముగా పుత్రికా జననము సంభవించును.

కేతు దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై దుర్బలుడైన జాతకునికి మాతృసౌఖ్యహీనము, వర్తక వ్యాపారము వల్ల ధనవ్యయము, ఋణవృద్ధి, రోగవృద్ధి, శత్రువృద్ధి, శిరోరోగము, నేత్ర రోగము, బంధు కలహము, పుత్రుని యెడబాటు, స్త్రీ కలహము, బిడ్డల అనారోగ్యము సంభవించును.

**5. కేతు దశలో కుజ భుక్తి ఫలము -**

కేతు దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి భ్రాతృ సౌఖ్యము, మనస్సునకు యుత్సాహము, భూసంపాదన, భోజన సౌఖ్యము, మంచి వస్త్రవులు, వ్యవసాయ లాభము, వాహన లాభము, భూషణములు గలుగుట, గృహలాభము, రాజగౌరవము, దారాపుత్ర సౌఖ్యము, మంచి కార్యములు సంభవించును.

కేతు దశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై దుర్బలుడైన జాతకునికి దుష్టుని వల్ల ధనలాభము, సర్ప, పీడ, మృత్యుభయము, బంధన ప్రాప్తి, పరదార వల్ల ఆపత్తు, మూత్రరోగము, కలరా, విశేష కష్టములు, ధనవ్యయము, పశు నష్టము, అనేక రోగముల వల్ల బాధ, క్షయరోగము, కీళ్ళవాత రోగము, చోర ఆయుధ అగ్ని భయము, ఎత్తు ప్రదేశము నుండి పడుట, ధనధాన్య నాశము సంభవించును.

**6. కేతు దశలో రాహు భుక్తి ఫలము -**

కేతు దశలో రాహు భుక్తి యందు రాహువు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి యుత్తమ సహవాసము, పుత్ర కళత్ర సౌఖ్యము, తీర్ధయాత్రలు, సాహసము, సువర్ణ రత్నాది భూషణములు, మహమ్మదీయ, క్రైస్తవ, యాంగ్లో యిండియన్ గౌరవనీయులైన పెద్దల వలన సహాయము పొందుట వలన సౌఖ్యము, విదేశ యానము, ధనధాన్య భూలాభము సంభవించును.

కేతు దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై దుర్బలుడైన జాతకునికి ఉద్యోగ భంగము, దేహపీడ, నీచ జీవనము, శత్రువృద్ధి, కారాగృహ ప్రవేశము, భూనష్టము, బానిసత్వము, విష చోర, అగ్ని, రాజభయము, మోసగాండ్ల, భూతభయము, మూత్రరోగము, కాకి సోమాల రోగము, దుష్టుల వల్ల దూషణలు, అగౌరవము, క్రూర సంకటనలు సంభవించును.

**7. కేతు దశలో గురు భుక్తి ఫలము -**

కేతు దశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వివాహము, భూలాభము, శత్రు నాశనము, శివార్చనము, పుత్రోత్పత్తి, విశేష కీర్తి, రాజ సన్మానము, వైభవము, ధనలాభము, ధాన్యలాభము, నిక్షేపము, రాజగౌరవము, పారితోషికములు, విషభయ విముక్తి, కామ సుఖము, సాధారణ సౌఖ్యము సంభవించును.

కేతు దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై దుర్భలుడై యున్న జాతకునికి కర్మనాశనము, స్థానభ్రష్టత్వము, మాతృనాశనము, దారాపుత్రాది పీడ, అగ్ని చోర ప్రణభయము, ధనధాన్య నాశనము గలుగును.

**8. కేతు దశలో శని భుక్త ఫలము -**

కేతు దశలో శని భుక్తి యందు శని శుభుడై బలవంతుడై యున్న జాతకునికి దేవ బ్రాహ్మణ భక్తి, పుత్ర కళత్ర సౌఖ్యము, వస్త్ర వాహన సౌఖ్యము, స్త్రీ పుత్రుల వల్ల ధనలాభము, వస్త్ర ఆభరణ ప్రాప్తి, నల్లకాయ ధాన్యలాభము, సామాన్య సౌఖ్యము, దన నాయకునికి గౌరవ ప్రతిష్టలు గలుగును.

కేతు దశలో శని భుక్తి యందు శని పాపియై దుర్భలుడై యున్న జాతకునికి మూల రోగము, విషబాధ, జ్వరము, అగ్నిభయము, రాజభయము, ఆప్త బంధు మరణము ఉద్యోగ భ్రష్టత్వము, మనోదుఃఖము, గొప్ప కష్టము, స్థాన నాశనము, ధనక్షయము మాతృ పితృ కళత్ర మరణము, శత్రుభయము, భూముల సంపద నాశనము, సేవకుల వలన చిక్కులు, యితరుల వలన మోసము, శత్రువుల తో పోరాటము దాని వలన అంగ వైకల్యము, అధికార భంగము, స్థాన చలనము, గజ్జి మొదలగు చర్మ రోగములు, స్త్రీల వలన చిక్కులు, మనోవ్యధ సంభవించును.

**9. కేతు దశలో బుధ భుక్తి ఫలము -**

కేతు దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి ఆరోగ్యము, విశేష సౌఖ్యము, వర్తక వ్యాపారము, ధనలాభము పుత్రకళత్ర సౌఖ్యము, పురాణ శ్రవణము, పుత్ర జననము, భూలాభము, వేడుకలు, కార్యనిర్వహణలో పై వారి పొగడ్తలు గలుగును.

కేతు దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై దుర్భలుడై యున్న జాతకునికి విషభయము, బంధు ద్వేషము, వ్యవసాయ నష్టము, భూనాశనము, శత్రువృద్ధి, స్వకీయాచార హీనము, కలతలు, రాజుల వల్ల భయము, ధననాశము, దాన్య నాశము, గోవుల నష్టము, భార్యాబిడ్డల బాధ, రాజల వల్ల చిక్కులు, వృత్తి నష్టము, బంధువుల వల్ల కలహములు, పుత్ర మరణము, చేపట్టిన పనుల భంగపాటు సంభవించును.

## 9. శుక్ర మహాదశ

శుక్ర మహాదశలో శుక్రుడు శుభుడై యుచ్చ కేంద్ర త్రికోణముల యందుండి శుభగ్రహముతో గూడినను, వీక్షించబడినను మహాసుఖము, విశేష కీర్తి, రాజపూజ్యత, సర్వజన ఉపకారము, యజ్ఞాది క్రతువులు, పుత్ర ప్రాప్తి, పుత్రకళత్ర సౌఖ్యము,

విశేష ధనము, సౌభాగ్యము, వృద్ధి, ఐశ్వర ప్రాప్తి, ధర్మబుద్ధి, సువర్ణము, ఆరామ ప్రాప్తి అశ్వలాభము, శీతోత్సవాది సంతోష ఫలము గలుగును.

శుక్రుడు పాపుడై అష్టమ వ్యయస్థానముల యందున్న శుక్రమహాదశలో మహాకష్టము, స్థాననాశనము, ధర్మకార్య వినాశనము, దారాపుత్రాది పీడ, ఉద్యోగ భంగము, దుఃఖము, శత్రువద్ధి, ఋణవృద్ధి, చోరత్వము, నీచత్వము, ధననాశనము, గొప్ప దోషము, స్త్రీ సాంగత్య రోగము, మనోవ్యధ గలుగును.

## శుక్ర మహాదశలో గ్రహముల యొక్క భుక్తి ఫలములు

### 1. శుక్ర దశలో శుక్ర భుక్తి ఫలము -

శుక్ర దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి యేనుగు, అశ్వము, పల్లకి మొదలగు వాహన సౌఖ్యము, ఛత్రచామరము, సువర్ణ రత్నాభరణములు, నాట్య సంగీత సాహిత్యము, కవిత్వము, తాంబూలము, స్త్రీ సౌఖ్యము, మంచి ఆరోగ్యము, గృహము నందు వివాహ వేడుకలు, నూతన గృహ నిర్మాణము, పుత్ర జననము, రాజగౌరవము, కామసుఖము శరీర సౌఖ్యము, రాజాభిమానము వలన సంపద గలుగును.

శుక్ర దశలో శుక్ర భుక్తి యందు శుక్రుడు పాపియై దుర్బలుడైన జాతకునికి మహాకష్టము, స్థాన నాశనము, ధర్మకార్య వినాశనము, దారాపుత్రాదిపీడ, ఉద్యోగ భంగము, దుఃఖము, శత్రువృద్ధి, ఋణవృద్ధి, చోరత్వము, నీచత్వము, ధన నాశనము, గొప్ప దోషము, స్త్రీ సాంగత్య రోగము, మనోవ్యధ, రాజభయము, జ్వర బాధ, భార్యకు అనారోగ్యము, కార్యభంగము, దౌర్భాగ్యము సంభవించును.

### 2. శుక్ర దశలో రవి భుక్తి ఫలము -

శుక్ర దశలో రవి భుక్తి యందు రవి శుభుడై బలము కల్గి యున్న జాతకునికి పుత్ర కళత్ర సంపత్తు, వాహనము, మంచి వస్త్రములు, భూషణ లాభము, రాజమూలమున ధనలాభము, విశేష కీర్తి, మంచి కార్యములు, మంచి ఆరోగ్యము, అతి సౌఖ్యము, సమానమైన లాభనష్టములు సంభవించును.

శుక్ర దశలో రవి భుక్తి యందు రవి రవి పాపియై దుర్బలుడైన జాతకునికి స్థానభ్రష్టత్వము, ప్రవాసము, నేత్రరోగము, విశేష భయము, పితృ నాశనము, మనో దుఃఖము, రాజభయము, శత్రువృద్ధి, చోరభయము, ప్రణ భయము, అగ్ని భయము, భూగృహ నాశనము, బంధువుల మోసము, ధననాశము, చెడుపదార్థ భోజనము, కడుపు గడ్డమునకు రోగము, ప్రభుత్వ ప్రమాదము, పెద్దవారి వలన చిక్కులు, కుటుంబ సభ్యులు, బంధువుల వలన బాధ, దౌర్భాగ్యము, ధనక్షయము, దారాపుత్ర పీడ, అందరితో విరోధము, దేవుళ్ళతో శత్రుత్వము, ప్రభుత్వముతో వైరము సంభవించును.

### 3. శుక్ర దశలో చంద్ర భుక్తి ఫలము -

శుక్ర దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి స్త్రీ లాభము, భూలాభము, విద్యాలాభము, వస్త్ర వాహన వైభవము, దారా సౌఖ్యాభివృద్ధి, వ్యవసాయము, వ్యాపారము వల్ల ధనలాభము,

తలంచిన కోర్కెలు నెరవేరుట, వివాహ వేడుకలు, పుత్ర జననము, వుంపుడు కత్తె వలన ఆస్తి ప్రాప్తించును.

శుక్ర దశలో చంద్ర భుక్తి యందు చంద్రుడు పాపియై దుర్బలుడైన జాతకునికి ధర్మకార్య వినాశనము, సర్వద్రవ్య నాశనము, దేశాటనము, దుర్గతి, పౌరోహిత్యము, సేవకావృత్తి, అజ్ఞాత వాసము, నానావిధ దుఃఖములు, రాజాగ్రహము, సనస్పర్ధలు, కార్యభంగము, దారాపుత్ర మరణము, కారణములేని అధికార భంగము, శిరోరోగము, దంతరోగము, గోళ్ళ యందు రోగము, ఊపిరితిత్తులు, కడుపు, ప్లీహము నందు రోగము, భార్యతో విరోధము సంభవించును.

**4. శుక్ర దశలో కుజ భుక్తి ఫలము -**

శుక్ర దశలో కుజ భుక్తి యందు కుజుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి భూలాభము, ధనలాభము, రాజమూలకముగా ధనలాభము, సువర్ణ లాభము, వస్త్రలాభము, అశ్వలాభము, ధాన్యలాభము, భార్యా బిడ్డల సౌఖ్యవృద్ధి సంభవించును.

శుక్రదశలో కుజ భుక్తి యందు కుజుడు పాపియై దుర్బలుడైన జాతకునికి పుత్రహాని, ధనవ్యయము, విశేష శత్రువృద్ధి, పిత్రార్జిత ధనవ్యయము, స్థానభ్రష్టత్వము, ప్రవాసము, గృహ క్షేత్రాది నాశనము, సంకటనలు, భార్యా బిడ్డల మోసము, రాజ చోరాగ్ని భయము, పైత్యము, రక్తస్రావము వలన బాధ, స్త్రీల క్రోధము, కార్యభంగము కలగలపు స్వభావము, స్త్రీ వలన ధననష్టము, శత్రువులు యిద్దరి వలన పోరాటము, నేత్రరోగము, కుష్టురోగము తరువాత నివారణ సంభవించును.

**5. శుక్ర దశలో రాహు భుక్తి ఫలము -**

శుక్ర దశలో రాహువు భుక్తి యందు రాహువు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి ఉద్యోగ లాభము, సౌఖ్యము, ధనధాన్యాభివృద్ధి, విదేశ ప్రయాణము వల్ల ధనలాభము, వర్తక వ్యాపారాభివృద్ధి, శత్రునాశనము, గొప్ప సంతోషము, ప్రభువు తృప్తి కొరకు గొప్ప కార్యము, భూదన వాహన లాభము, భార్యాబిడ్డల సౌఖ్యము, నిక్షేప ప్రాప్తి, పుత్ర జననము, బంధువర్గము నుండి గౌరవ ప్రతిష్టలు సంభవించును.

శుక్ర దశలో రాహు భుక్తి యందు రాహువు పాపియై దుర్బలుడైన జాతకునికి ఉద్యోగ భంగము, దేహపీడ, మాతృ, పితృ నాశనము, పుత్ర కళత్రపీడ, ఋణవృద్ధి, శత్రువృద్ధి, ప్లీహ రోగము, కీళ్ళ వాతరోగము, విష, వ్రణ, అగ్ని చోర భయము, భార్య వలన శత్రుభయము, పుత్రుని వలన పోరాటము, విషప్రయోగము వలన మనస్సు చలించుట సంభవించును.

**6. శుక్ర దశలో గురు భుక్తి ఫలము -**

శుక్ర దశలో గురు భుక్తి యందు గురుడు శుభుడై బలవంతుడై యున్న జాతకునికి వాహన ప్రాప్తి, బంధు సన్మానము, యజ్ఞము, వివాహము, పుత్ర కళత్ర సౌఖ్యము, కుటుంబ వృద్ధి, గొప్ప ధనలాభము, వస్త్రాభరణ లాభము, మత సంబంధమైన క్రతువులు, దైవపూజ, రాజగౌరవము వలన అనేక సౌఖ్యములు, ధాన్య లాభము సంభవించును.

శుక్ర దశలో గురు భుక్తి యందు గురుడు పాపియై దుర్బలుడైన జాతకునికి వ్యవసాయ నష్టము, భూనాశనము, బంధు విరోధము, స్వకులాచార హీనము, పరదారాసక్తి, భూసంబంధమగు వ్యాపార చిక్కులు, మనోదుఃఖము, ధర్మము వల్ల ధన వ్యయము, చోర అగ్ని ప్రాణ భయము, ధనధాన్య నాశనము, మృత కళత్ర బాధ సంభవించును.

**7. శుక్ర దశలో శని భుక్తి ఫలము -**

శుక్ర దశలో శని భుక్తి యందు శని శుభుడై బలము కల్గి యున్న జాతకునికి శత్రు నాశనము, మనోత్సాహము, ధనధాన్యాభివృద్ధి, బంధు సౌఖ్యము, భార్యా పుత్ర సౌఖ్యము, అలంకార ప్రాప్తి, మిత్ర దాసదాసీ జనవృద్ధి, శుభకర్మలు, సారవంతమై భూలాభము, తీరని సౌఖ్యము, ప్రతిష్ట, జయము, పోలీసు అధికారులచే గౌరవించబడుట, ఆసన సౌఖ్యము, మంచి కళత్రప్రాప్తి, రాజగౌరవము సంభవించును.

శుక్ర దశలో శని భుక్తి యందు శని పాపియై దుర్బలుడై యున్న జాతకునికి ధననష్టము, కళత్ర పీడ, సంతాన నష్టము, బంధు నష్టము, కర్మ నాశనము, సేవకా వృత్తి, మనోదుఃఖము, గుల్మశూల వల్ల బాధ, స్థాన భ్రష్టత్వము, పరదేశ నివాసము, పాప మూలకముగా ధనవ్యయము, పశు భూనష్టము, చోర అగ్ని ప్రణభయము, క్రూర పాపపు పనులు చేయుట, శరీర బాధలు, కీళ్ళవాత నొప్పులు, అజీర్ణ వ్యాధి సంభవించును.

**8. శుక్ర దశలో బుధ భుక్తి ఫలము -**

శుక్ర దశలో బుధ భుక్తి యందు బుధుడు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి రాజపూజ్యత, కీర్తి, వ్యాపారము వల్ల ధనలాభము, విద్య వల్ల జయము, రాజానుగ్రహము, పురాణ శ్రవణము, ఆసన సౌఖ్యము, పుత్రసౌఖ్యము, ప్రతిష్ట, గౌరవము, జ్ఞానము, శత్రు జయము, ధనవృద్ధి, పాటలు సంగీతము నందు ఆసక్తి సుందర రూపము, ఉత్సాహమైన జీవితము సంభవించును.

శుక్ర దశలో బుధ భుక్తి యందు బుధుడు పాపియై బలవంతుడై యున్న జాతకునికి విశేష శత్రువృద్ధి, జ్ఞాతిమూలమున ధనవ్యయము, స్థానభ్రష్టత్వము, ద్వేషము, వ్యాపారము వల్ల ధననష్టము, సంకటనలు, స్నేహితులతో అపార్థములు, చోర అగ్ని ప్రణభయము, గ్రహణీ రోగబాధ, నేత్ర రోగము, విషభయము, వాత పైత్య రోగము వలన బాధ సంభవించును.

**9. శుక్ర దశలో కేతు భుక్తి ఫలము -**

శుక్ర దశలో కేతు భుక్తి యందు కేతువు శుభుడై బలము కల్గి యున్న జాతకునికి వాహనము, భూలాభము, బంధు పూజ్యతము, పరోపకారము, ధర్మకార్యములు, గృహము నందు వేడుకలు, భుక్తి మధ్యకాలములో ఎక్కువ ప్రయాణములు మఱియు అధిక వ్యయము సంభవించును.

శుక్ర దశలో కేతు భుక్తి యందు కేతువు పాపియై దుర్బలుడై యున్న జాతకునికి పుత్రమిత్రాది పీడ, దుస్స్వహవాసము, ఉద్యోగ భంగము, దుఃఖము, ఋణవృద్ధి, శత్రువృద్ధి, కామెర్ల రోగము, మూత్ర రోగము, దారా పుత్ర బంధు

మరణము, బానిసత్వము, అగ్నివలన అపాయము, నష్టములు, దురదృష్టము, మృగముల బాధ, భార్యకు రోగము, విషభయము సంభవించును.

*గమనిక -*

జాతకుని దశాభుక్తులకు వర్తించు ఫలములే అంతర్దశ, సూక్ష్మదశ, ప్రాణ దశలకు వర్తించును. జాతక ఫలములు నిర్ధారించునపుడు జాతకుని వృత్తి, అంతస్తు, కులము, వంశపారంపర్య అలవాట్లు, నైజము, స్వభావము, ఉద్యోగము, సంపద మొదలగు వానిని బట్టి దశాభుక్తులలో చెప్పబడిన ఫలములలో ఏ ఫలములు ఎంత వరకు వర్తించునో నిర్ణయించి జాతకునికి అన్వయించు వానిని మాత్రమే గ్రహించి ఫల నిరూపణ చేయవలయును.

దశాభుక్తుల యందు ఫలములు నిర్ణయించునపుడు గ్రహముల యొక్క స్థాన బలము, శుభాశుభములు, యితర గ్రహములతో సంబంధము, శక్తి, బలాబలములు, శత్రు మిత్రత్వము, ఉచ్ఛనీచలు మొదలగు వానిని వివారించవలెను. గ్రహములు బలహీనులైన పాపఫలములను, బలవంతులై యున్న శుభఫలముల నిచ్చు వారగుచున్నారు. ఈ అంశములే అంతర్దశలు, సూక్ష్మ ధశలు, ప్రాణ దశలకు గూడ వర్తించును.

**అంతర, సూక్ష్మ, ప్రాణదశల యొక్క సామాన్య నిబంధనలు**

ఇంతవరకు గ్రహముల యొక్క మహాదశలు, భుక్తులు, వాని వలన సంభవించు ఫలములను వివరించి యున్నాము. జ్యోతిష్కుడైన వాడు జాతకుని యొక్క భవిష్యత్తును నిర్ణయించు నపుడు లగ్న, అంశ చక్రముల యందు గల గ్రహముల బలాబలములను, శుభ పాపత్వములను, మిత్ర శత్రుత్వము, ఉచ్ఛ నీచలను, యితర గ్రహములతో వానికున్న సంబంధమును, వాని వీక్షణలను, వాని స్వక్షేత్రములను వాని ఆధిపత్యములను, వాని కోణ, త్రికోణములను, వాని షష్ట, అష్టమ, ద్వాదశములను, యింకా వానికి సంబంధించిన మూలకములను ప్రయోగించి, వాని నిజ స్వరూపమును గ్రహించి ఫల నిరూపణ జేయవలయును. మహాదశలను విభజించి భుక్తులుగను, భుక్తులను విభజించి ప్రాణ దశలను పొంద వలయును. మహాదశలు, భుక్తులకు వినియోగించిన నిబంధనలే అంతర్దశలు, సూక్ష్మ దశలు, ప్రాణదశలకు వినియోగించి ఫల నిరూపణ జేయవలయును.

లగ్నాధిపతి, షష్టాధిపతి అష్టమాధిపతి కూడియున్ననూ లేక వీరలు మారక స్థానాధిపతితో కూడినను లేక మారకాధిపతి వారిని వీక్షించు చున్నను లేక మారక స్థానాధిపతి తన భుక్తి కాలములో షష్ట స్థానాధిపతి యొక్క అంశ యందున్న జాతకునకి ఆయుధము వలన మరణము సంభవించును. ఇది అంతర్దశలు, సూక్ష్మ దశలు, ప్రాణ దశలకు గూడ వర్తించును. ఏ గ్రహము యొక్క భుక్తి జరుగుచుండునో ఆ గ్రహము లగ్నాధిపతితో గాని లేక షష్ట స్థానాధిపతితో గని కలిసి శుభుడై యున్న జాతకునికి ఆయుధ బాధ యుండదు. అదే పాప గ్రహమైన జాతకునికి మరణము సంభవించును.

**1. రవి భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు -**

రవి దశలో రవి అంతర్దశ యందు జాతకుడు బలవంతుడై యుండును గాని భయము, భార్యాబిడ్డల దుఃఖము, తలనొప్పులు, బ్రాహ్మణులతో ప్రసంగములు

సంభవించును. రవి భుక్తిలో చంద్ర అంతర్దశ యందు జాతకునికి మనశ్శాంచల్యము సంకటనలు, శరీర వ్యాకులత, వింతయైన చోరీ వలన ధనము, రత్నములు, ముత్యములు గోల్పోవుట సంభవించును. రవి భుక్తిలో కుజ అంతర్దశ యందు రాజ, ఆయుధ, అగ్ని, చోర భయము, బానిసత్వము, అనేక కష్టములు సంభవించును. రవి భుక్తిలో రాహు అంతర్దశ యందు రాజ భయము, ఆయుధ భయము, సంపద నాశము దీర్ఘరోగము సంభవించును.

రవి భుక్తిలో గురు అంతర్దశ యందు శత్రునాశము, ధనవృద్ధి, బంగారు ఆభరణ, వస్త్రలాభము, అశ్వముచే లాగబడు వాహనము ప్రాప్తించును. రవి భుక్తిలో శని అంతర్దశ యందు అన్ని విధములైన కష్టములు, ధననష్టము, పశువుల బాధ, గొప్ప శత్రుత్వము, రోగములతో బాధనొందు చుండును. రవి భుక్తిలో బుధ అంతర్దశ యందు జ్ఞాన వృద్ధి, బంధు సమాగమము, ధనలాభము, మంచి భోజనము, రాజగౌరవము సంభవించును. రవి భుక్తిలో కేతు అంతర్దశ యందు ప్రాణ భయము, గొప్ప నష్టము, రాజ భయము, శత్రువులతో సంకటనలు, పోట్లాటలు సంభవించును. రవి భుక్తిలో శుక్ర అంతర్దశ యందు కొద్దిలాభము, సౌఖ్యము సంభవించును.

**2. చంద్ర భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు**

చంద్ర భుక్తిలో చంద్ర అంతర్దశ యందు జాతకునికి భూలాభము, ధనధాన్య లాభము, రాజపూజ్యత, గొప్ప సంతోషము, సంసార సుఖము సంభవించును. చంద్ర భుక్తిలో కుజాంతర్దశ యందు జ్ఞానవృద్ధి, గొప్ప భక్తి, బంధువులతో సౌఖ్యము, అధిక ధనవృద్ధి, శత్రుభయము, సంభవించును. చంద్ర భుక్తిలో రాహువు అంతర్దశ యందు వివాహము, ప్రభువు ద్వారా ఆచారము, పాప గ్రహముల వలన ప్రాణాపాయము గల్గును.

చంద్ర భుక్తిలో గురు అంతర్దశ యందు అధికార వృద్ధి, వస్త్రములు గడించుట, గురువు యొక్క శ్రీకారము, ఉద్యోగము మొదలగునవి గల్గును. చంద్ర భుక్తిలో శని అంతర్దశ యందు జాతకుడు చలికాలము నందు వాత పైత్య రోగముతో బాధ, శరీర బాధలు, ధనధాన్యనష్టము సంభవించును. చంద్ర భుక్తిలో బుధ అంతర్దశ యందు శిశుజననము, జ్ఞానవృద్ధి, అశ్వలాభము, గొప్ప సంతోషము, తెల్లటి వస్త్రములు, మంచి భోజనము ప్రాప్తించును.

చంద్ర భుక్తిలో కేతు అంతర్దశ యందు బ్రాహ్మణులతో తగవులు, సౌఖ్యము ఆశాభంగము, అపమృత్యువు సంభవించును. చంద్ర భుక్తిలో అంతర్దశ యందు గొప్ప సౌఖ్యము, పుత్రిక జననము, ధనలాభము, మంచి భోజనము, మెచ్చుట చూచిన సంతోషము సంభవించును. చంద్ర భుక్తిలో రవి అంతర్దశ యందు మంచి ఆహారము, శత్రునాశము, సౌఖ్యము, అన్ని ప్రదేశముల యందు జయము, వస్త్ర లాభము గల్గును.

**3. కుజ భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు**

కుజ భుక్తిలో కుజ అంతర్దశ యందు శత్రు భయము, భయంకరమైన సంకటనలు, గ్రహణీ రోగము, అపమృత్యువు సంభవించును. కుజ భుక్తిలో రాహువు అంతర్దశ యందు నిర్బంధము, ధననాశము, చెడు భోజనము, పోరాటము,

శాశ్వత శత్రువు భయము, అధికారాతి శయము సంభవించును. కుజ భుక్తిలో గురు అంతర్దశ యందు జ్ఞానక్షయము, కష్టములు దుఃఖము వలన చింత, పోరాటము, నిరర్ధకమైన పధకములు సంభవించును.

కుజ భుక్తిలో శని అంతర్దశ యందు గురునాశము, శరీర బాధల వలన దుఃఖము, గొప్ప భయము, పోరాటము, అంగవైకల్యాము, ధననాశము సంభవించును. కుజ భుక్తిలో అంతర్దశ యందు బద్దకము, శిరోరోగము, గజ్జి, రాజభయము ఆయుధ భయము, అపమృత్యువు సంభవించును. కుజ భుక్తిలో బుధ అంతర్దశ యందు జ్ఞానక్షయము, ధననాశము, జ్వరము మొదలగు శరీర రోగములు, భోజన వస్త్రనాశము, మిత్రనాశము సంభవించును.

కుజ భుక్తిలో అంతర్దశ యందు చిల్లర వర్తకుల వలన వ్యాకులత, రాజ ఆయుధ విషభయము, గ్రహణీ రోగము, కలరా సంభవించును. కుజ భుక్తిలో రవి అంతర్దశ యందు భూలాభము, ధనలాభము, సౌఖ్యము, మిత్ర సమాగమము యెచ్చట జూచిన అభివృద్ధి గల్గును. కుజ భుక్తిలో చంద్ర అంతర్దశ యందు దక్షిణ దిశ నుండి తెల్లటి వస్త్రములు, ఆభరణ లాభము, అనుకున్న కార్యములు నెరవేరుట సంభవించును.

### 4. రాహు భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు

రాహు భుక్తిలో రాహు అంతర్దశ యందు జాతకునికి బంధనము, రోగములు, చేతియందు బాధ, బంధు భయము, ఆకస్మిక అపాయములు, అగ్ని నీటి భయము సంభవించును. రాహు భుక్తిలో గురు అంతర్దశ యందు యెచ్చట జూచిన లాభములు, ధనము, యేనుగులు, అశ్వములు, రాజ పారితోషికములు గల్గును. రాహు భుక్తిలో శని అంతర్దశ యందు భయంకరమైన బంధనము, గొప్ప భయము, సౌఖ్యహీనము, తీరని, కీళ్ళ వాతము సంభవించును.

రాహు భుక్తిలో బుధ అంతర్దశ యందు జాతకునికి అన్ని విధముల లాభము ప్రతి పని యందు జయము, సంసారసుఖము, విదేశ యానము సంభవించును. రాహు భుక్తిలో కేతు అంతర్దశ యందు జ్ఞాన క్షయము, అడ్డంకులు, భయము, ధననాశము యెచ్చట చూచిన విరోధము సంభవించును. రాహుభుక్తిలో శుక్ర అంతర్దశ యందు విపత్తు, రాజభయము, మాంత్రికురాండ్ల భయము, భార్యానాశము వలన బాధ, అశ్వనాశము, చెడు ఆహారము, మనోవ్యధ సంభవించును.

రాహు భుక్తిలో రవి అంతర్దశ యందు జ్వరము, ప్రతిచోట పెద్దపొరపాటు భయము, బిడ్డలు, మనుమలు మనుమరాండ్ల దుఃఖము, అపమృత్యువు సంభవించును. రాహు భుక్తిలో చంద్ర అంతర్దశ యందు అసూయ, విరోధము, అగౌరవము, అవమానము, గొప్పభయము, తండ్రి అంగ వైకల్యాము, సంభవించును. రాహు భుక్తిలో కుజ అంతర్దశ యందు మూలవ్యాధి, రక్తలోపము, ధననష్టము, గొప్ప అసూయ సంభవించును.

### 5. గురు భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు

గురు భుక్తిలోగురు అంతర్దశ యందు జాతకునికి సువర్ణ లాభము వ్యవసాయ పంటవృద్ధి, ప్రతిచోట శుభము, గృహము నందు వివాహ వేడుకలు,

శిశుజననము సంభవించును. గురుభుక్తిలో శని అంతర్దశ యందు భూలాభము, గోవులు, అశ్వములు, మంచి పానీయము, ఆహారము, ప్రతిపని జయప్రదముగా నిర్వహించుట సంభవించును. గురుభుక్తిలో బుధ అంతర్దశ యందు జ్ఞానవృద్ధి, తెలివి, రత్నములు, వస్త్రములు, మిత్రులు, ప్రతిష్ట గలవారితో సహవాసము సంభవించును.

గురు భుక్తిలో కేతు అంతర్దశ యందు చోర నీటి భయము, బంధనము, విరోధము, అపమృత్యువు సంభవించును. గురు భుక్తిలో శుక్ర అంతర్దశ యందు అన్ని విధములైన శిల్పకళల జయము, ధనము, సువర్ణము, వస్త్రములు, ఆభరణములు, సామాన్య ఆరోగ్యము, ఆనందము సంభవించును. గురుభుక్తిలో రవి అంతర్దశ యందు రాజలాభము, తల్లితండ్రులు, స్నేహితుల యందు భక్తి సంభవించును.

గురు భుక్తిలో చంద్ర అంతర్దశ యందు జాతకునికి అన్ని విధములైన దుఃఖములు శమించుట, అన్ని కార్యముల జయము, రత్నలాభము, అశ్వలాభము సంభవించును. గురుభుక్తిలో కుజ అంతర్దశ యందు ఆయుధ భయము, అజీర్ణము, మూల వ్యాధి, శత్రుబాధ, సంభవించును. గురుభుక్తిలో రాహు అంతర్దశ యందు అపవాదులు, శత్రుత్వము, సుఖవ్యాధులు, భయము, శత్రువుల వలన బాధ సంభవించును.

**6. శని భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు**

శని భుక్తిలో శని అంతర్దశ యందు జాతకునికి శరీర బాధ, పోట్లాటల వలన భయము, దుఃఖము, ప్రవాసము మొదలగునవి సంభవించును. శని భుక్తిలో బుధ అంతర్దశ యందు జాతకునికి జ్ఞానక్షయము, పోట్లాటల వలన భయము, అన్నపానీయ హీనము, ధననష్టము సంభవించును. శని భుక్తి కేతు అంతర్దశలో శరీర చర్మము యొక్క ఛాయ మారిపోవుట, గృహమందు బంధువులతో కలహము, గొప్ప ఆకలి, మనోవ్యధ, భయము, వణుకు సంభవించును.

శని భుక్తిలో శుక్ర అంతర్దశ యందు దీర్ఘ కాలముగా ఆలోచించి చేయబడిన కార్యము లాభించుట, బంధు వివాహము, అడవి సమూలములో లాభము, కార్యసఫలము సంభవించును. శని భుక్తిలో రవి అంతర్దశ యందు జాతకునికి ఆర్థిక శాఖ లేక ట్రెజరీ శాఖయందు ప్రభుత్వ ఉద్యోగము, గృహమందు సంకటనలు, జ్వరము మొదలగునవి సంభవించును. శని భుక్తిలో చంద్ర అంతర్దశ యందు గొప్ప స్వభావము, దీర్ఘ కాల పథకముపై పని ప్రారంభము, కావలసిన కార్యము చేయుటకు అసమర్థత, ధనవ్యయము, అనేక మంది స్త్రీలతో సంబంధము గల్గియుండును.

శని భుక్తిలో కుజ అంతర్దశ యందు జాతకునికి పుత్రుని కష్టములు తగ్గుట, అగ్ని శత్రు భయము, వాత పైత్యరోగము వలన బాధ సంభవించును. శని భుక్తిలో రాహు అంతర్దశ యందు జాతకునికి ధననష్టము, వస్త్ర నాశము, భయము ప్రవాసము మరణము సంభవించును. శని భుక్తిలో గురు అంతర్దశ యందు భార్య వలన సంకటన, అది పరిష్కరించుటకు అసమర్థత, దాని వలన వైరము, అసూయ సంభవించును.

## 7. బుధ భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు

బుధ భుక్తిలో అంతర్దశ యందు జ్ఞానవృద్ధి, సామర్థ్యము, ధనము, వస్త్రములు, సువర్ణము, గొప్ప సౌఖ్యము సంభవించును. బుధభుక్తిలో కేతు అంతర్దశ యందు జాతకునికి పనికిమాలిన ఆహారము వలన అజీర్ణము, కడుపులో బాధ, కామెర్ల రోగము, చెడురక్తము సంభవించును. బుధ భుక్తిలో శుక్ర అంతర్దశ యందు ఉత్తరదేశ ప్రయాణమువలో ధనలాబము, పనులు సక్రమముగా జేయుటకు ఆసక్తి, పశునాశము సంభవించును.

బుధ భుక్తిలో రవి అంతర్దశ యందు జాతకునికి బలహీనత, రోగము, మనోవ్యధ, శరీరబాధ, సోమరితనము సంభవించును. బుధ భుక్తిలో చంద్ర అంతర్దశ యందు కళత్రలాభము, యశోవృద్ధి, పుత్రిక జననము, గొప్ప సంపద, సౌఖ్యము సంభవించును. బుధ భుక్తిలో కుజ అంతర్దశ యందు, జ్ఞానము, సంపద, ధర్మకార్యములు, ఆయుధ చోర అగ్ని వలన భయము సంభవించును.

బుధ భుక్తిలో రాహు అంతర్దశ యందు జాతకునికి స్త్రీలతో విరోధము, రాజ ఆయుధ అకస్మిక భయము సంభవించును. బుధ భుక్తిలో గురు అంతర్దశ యందు జాతకునికి రాజ్యలాభము లేక ఉద్యోగ లాభము, రాజాధికారము లేక రాజ గౌరవము సంభవించును. బుధ భుక్తిలో శని అంతర్దశ యందు జాతకునికి వాత పైత్య రోగము, క్రరలతో కొట్టబడు వాడగుట, సంపద నాశము మొదలగునవి సంభవించును.

## 8. కేతు భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు

కేతు భుక్తిలో కేతు అంతర్దశ యందు జాతకునికి ఆకస్మాత్తుగా నీళ్ళ బొబ్బలు ప్రావానము, ధననాశము, అపమృత్యువు సంభవించును. కేతు భుక్తిలో శుక్ర అంతర్దశ యందు యితర దేశస్తుల భయము, ధననాశము, నేత్రరోగము, తలనొప్పి పశువుల నష్టము సంభవించును. కేతు భుక్తిలో రవి అంతర్దశ యందు స్నేహితులతో గూడ విరోధము, అపజయము, మనోవ్యధ, సంకటనలు, అపమృత్యువు సంభవించును.

కేతు భుక్తిలో చంద్ర అంతర్దశ యందు ఆకలి లేకపోవుట, శరీర బాధ, మనోవ్యధ, సంతోష భంగము, కొద్దిగా కీళ్ళవాతము సంభవించును. కేతు భుక్తిలో కుజ అంతర్దశ యందు ఆయుధములతో పోరాటము, యెత్తు ప్రదేశము నుండి పడుట, అగ్ని ప్రమాదము, నీచవానితో భయము, ఒక శత్రువు వలన అవమానము సంభవించును. కేతు భుక్తిలో రాహువు అంతర్దశ యందు స్త్రీలు మఱియు ప్రభువు వలన భయము, మాంత్రికుల వలన భయము, శత్రువుల వలన బాధ గలుగును.

కేతు భుక్తిలో గురు అంతర్దశ యందు ధననాశము, అనేక అపశకునములు, వస్త్రనాశము, మిత్ర నాశము, ప్రతిదానికి ఆవేదన సంభవించును. కేతు భుక్తిలో శని అంతర్దశ యందు గేదెలు, గోవుల మరణము, శరీర బాధ, పనికి మాలిన వస్తువుల జయము, మిత్ర నాశము సంభవించును. కేతు భుక్తిలో బుధ అంతర్దశ యందు అసౌఖ్యము, జ్ఞానక్షయము, మనోవ్యధ, గొప్ప అసూయ, కార్యభంగము సంభవించును.

## 9. శుక్ర భుక్తిలో వివిధ గ్రహముల అంతర్దశా ఫలములు

శుక్ర భుక్తిలో శుక్ర అంతర్దశ యందు జాతకునికి శ్వేత అశ్వలాభము, వస్త్రములు, రత్నములు, సువర్ణము, ముత్యములు, సుందరమైన కళత్ర లాభము గలుగును. శుక్ర భుక్తిలో రవి అంతర్దశ యందు శిరోరోగము, జ్వరము, ప్రభువు శత్రువు వలన బాధ, కొద్ది లాభము సంభవించును. శుక్ర భుక్తిలో చంద్ర అంతర్దశ యందు జాతకునికి పుత్రిక జననము, ప్రభువు వలన లాభము, ఆభరణములు, వస్త్రములు, ప్రభువు అగుటకు అవకాశము సంభవించును.

శుక్ర భుక్తిలో కుజ అంతర్దశ యందు జాతకునికి రక్త సంబంధమైన వ్యాధుల వలన బాధ, పోరాటము, అల్లరి, అధిక దుఃఖము సంభవించును. శుక్ర భుక్తిలో రాహు అంతర్దశ యందు స్త్రీ వలన పోరాటము, ప్రభువు, శత్రువు వలన బాధ, ఆకస్మిక భయము సంభవించును. శుక్ర భుక్తిలో గురు అంతర్దశ యందు అధిక ధనము, గొప్ప రాజ్యముపై అధికారము, యేనుగులు, గుఱ్ఱములు, వస్త్రములు, ముత్యములు, ఆభరణములు సంపాదించ గలుగును.

శుక్ర భుక్తిలో శని అంతర్దశ యందు జాతకునికి ఒంటెలు, గాడిదలు, గొర్రెలు లాభము పొందగల్గుట, యినుము, మంచినూనె, మినుములు; మధ్యకాలములో అస్వస్థత సంభవించును. శుక్ర భుక్తిలో బుధ అంతర్దశ యందు ప్రభువగుటకు అవకాశము, ధనలాభము, జ్ఞానము, సంపద గల్గి యుండును. శుక్ర భుక్తిలో కేతు అంతర్దశ యందు జాతకునికి అపమృత్యువు, దిక్కుమాలిన ప్రదేశమునకు పోవుట, మధ్య మధ్య కొద్ది లాభములు సంభవించును.

## 1. రవి అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మదశా ఫలములు

రవి అంతర్దశలో రవి సూక్ష్మదశ యందు జాతకుడు భూమిని వదలుట, గృహమును విడచుట, అధికారము నుండి పతనమగుట, దౌర్భాగ్యము అనుభవించుట, మరణము సంభవించును. రవి అంతర్దశలో చంద్ర సూక్ష్మదశ యందు బ్రాహ్మణుల, దేవతల భక్తి, ఆచార క్రతువులు, బంధు ప్రేమ గల్గును రవి అంతర్దశలో కుజ సూక్ష్మదశ యందు క్రూర పనుల యందు ఆసక్తి, బలవంతుడైన శత్రువుల బాధ, రక్తస్రావము మఱియు యితర రోగములు సంభవించును.

రవి అంతర్దశలో రాహువు సూక్ష్మదశ యందు అగ్ని చోరభయము, పోట్లాటలో అపజయము, మత సంబంధమైన పనులకు దూరముగా నుండుట సంభవించును. రవి అంతర్దశలో గురు సూక్ష్మదశ యందు రాజు, రాజసేవకులచే గౌరవించబడుట, రాజసమాగమము, మనస్సు శాంతి గల్గును. రవి అంతర్దశలో శని సూక్ష్మదశ యందు చోరీ, మొండితనము, బ్రాహ్మణులు, పెద్దల అభ్యంతరము, మనోవ్యధ సంభవించును.

రవి అంతర్దశలో బుధ సూక్ష్మదశ యందు ఆకస్మిక ధనలాభము, సుందర స్త్రీలతో సహవాసము, ప్రియమైన వస్త్రలాభము మొదలగునవి సంభవించును. రవి అంతర్దశలో కేతు సూక్ష్మదశ యందు ధననాశము, శరీర బరువు, సేవకులతో

సంబంధము గల్గియుండును. రవి అంతర్దశలో శుక్ర సూక్ష్మ దశ యందు భార్యా బిడ్డలు స్నేహితులతో సౌఖ్యము, అన్ని విధముల ధనలాభము గల్గును.

## 2. చంద్ర అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశాఫలములు

చంద్ర అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు భూలాభము, పారితోషికములు, ఆభరణములు, రాజ గౌరవము గలుగును. అయితే సోమరితనము, శరీర బరువు యుండును. చంద్ర అంతర్దశలో కుజ సూక్ష్మదశ యందు దుఃఖము, విరోధులతో శత్రుత్వము, కడుపులో బాధ, తండ్రి మరణము, వాతపైత్య రోగము, శ్లేష్మ రోగము వలన బాధ సంభవించును. చంద్ర అంతర్దశలో రాహు సూక్ష్మ దశ యందు బంధు, మిత్ర విరోధము, ప్రవాసము, ధననాశము, విదేశములో కారాగార వాసము సంభవించును.

చంద్ర అంతర్దశలో గురు సూక్ష్మ దశ యందు ప్రఖ్యాతి, శోభ, పుత్ర జననము, అంతట సౌఖ్యము సంభవించును. చంద్ర అంతర్దశలో శని సూక్ష్మదశ యందు ప్రభువు వలన సంకటనలు, వ్యాజ్యములో ధననాశము, చోరీ, బ్రాహ్మణుల వలన భయము గలుగును. చంద్ర అంతర్దశలో బుధ సూక్ష్మ దశ యందు సంతానము మనమ సంతానము, బిడ్డలతో సౌఖ్యము, వస్తులాభము, రాజగౌరవము, విదేశము నుండి వాహన బహుమతులు గలుగును.

చంద్ర అంతర్దశలో కేతు సూక్ష్మ దశ యందు సర్పము, జంతువుల వలన ఆస్తి నష్టము, అగ్ని, పుత్రుని వలన భయము సంభవించును. చంద్ర అంతర్దశలో శుక్ర, సూక్ష్మ దశ యందు వివాహము, ఆభరణములు, వస్త్రములు, భూలాభము, రాజ్యలాభము, లేక ఉద్యోగ లాభము, ప్రతిష్ఠ సంభవించును. చంద్ర అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు దౌర్భాగ్యము వెనుక దౌర్భాగ్యము, పశువులు, ధాన్యము, ధననాశము, శరీర బలహీనత, మనోవ్యధ సంభవించును.

## 3. కుజ అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మదశా ఫలములు

కుజ అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు జాతకునికి భూనష్టము, మనోవ్యధ, నరముల వ్యాధి, గ్రామ కలతల వలన అపార్థములు, బంధు సమాగమము సంభవించును. కుజ అంతర్దశలో రాహు సూక్ష్మ దశ యందు అంగ వైకల్యము, ప్రజల వలన భయము, భార్య తరపు బంధువులకు ఆపద, సర్పములు అగ్ని వలన అపాయము సంభవించును. కుజ అంతర్దశలో గురు సూక్ష్మ దశ యందు దైవభక్తి యందు అంటి పెట్టుకొని యుండుట, మంత్రులకు సలహాలు, ప్రజా గౌరవము, సాధారణ సౌఖ్యము గలుగును.

కుజ అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు బంధన విముక్తి, ధనధాన్య లాభము, సౌకర్యము గల వస్తువులు, సేవకుల సంపద వృద్ధి, గొప్పవానిగా యుండుట సంభవించును. కుజ అంతర్దశలో బుధ సూక్ష్మ దశ యందు అతి సౌఖ్యము, ప్రభువు కంటె సౌకర్యము గలవాడగుట, సౌఖ్యమైన వాహనము గాని జాతకునికి క్షయ, ఉబ్బసరోగము సంభవించును. కుజ అంతర్దశలో కేతువు సూక్ష్మ

దశయందు జాతకుడు దూషించుట, సోమరితనము, తన పనుల యందు ఆసక్తిలేని వాడుగా నుండును. కాని యితరుల యొక్క పనులు చక్కపెట్టు వాడుగా యుండును.

కుజ అంతర్దశలో శుక్ర సూక్ష్మ దశ యందు సంపద వృద్ధి, కోరిన స్త్రీలతో సహవాసము, మంచి ఆహారము సంభవించును. కుజ అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు రాజవిరోధము, బ్రాహ్మణుల వలన బాధ, ప్రజావాదు, కార్యస్థానము నందు తన అభిప్రాయము అట్టిపెట్టుట సంభవించును. కుజ అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు పవిత్రత, సంపద, బ్రాహ్మణుల యందు ప్రేమ, దేవుళ్ళు పెద్దవారి యందు భక్తి, శరీర రోగము సంభవించును.

### 4. రాహు అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మదశా ఫలము

రాహు అంతర్దశలో రాహు సూక్ష్మ దశ యందు జాతకుడు యితరులకు దుర్మార్గము చేయుటకు సంక్రమించుట, తన స్వలాభము కొరకు నిర్లక్షయముగా యుండుట, మోసము గల వాడుగా యుండును. రాహువు అంతర్దశలో గురుసూక్ష్మ దశ యందు దీర్ఘ రోగము, పేదరికము, పవిత్రమైన మనస్సు, మంచి స్వభావము, ధర్మ గుణము గలవాడగును. రాహువు అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు తెలివి మాలినవాడును, చెడ్డమనస్సు, క్రూరము, చోరత్వము, చెడ్డవారితో సహవాసము బానిసత్వము సంభవించును.

రాహువు అంతర్దశలో బుధ సూక్ష్మ దశ యందు జాతకునికి మృదు వచనములు, ఇంద్రియ వాంఛకు లోబడుట, తిండి పోతును, యెత్తైన శరీరము గల వాడును, చందాల కొరకు ఆశించువాడుగును. రాహువు అంతర్దశలో కేతువు సూక్ష్మ దశ యందు జాతకుడు మనోహరమైన వాడైనను అపకీర్తి, బంధనము, క్రూరము, కఠుకైన వాడుగా యుండును. రాహువు అంతర్దశలో శుక్రసూక్ష్మ దశ యందు బంధనము నుండి విడబడుట, గౌరవము, ప్రతిష్ట, సంపద, అధికారము, ధన లాభము మొదలగునవి గలుగును.

రాహువు అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు జాతకుడు కోపము లేని వాడును వాహనములు గలవాడును, సౌఖ్యము యున్నను మూలవ్యాధితో బాధపడు చుండును. రాహువు అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు అధిక సౌఖ్యము, రత్నములు, ధనము గలవాడును, మంచి జ్ఞానవంతుడును, దేవతలు, దేవుళ్ళను భక్తితో పూజించువాడుగా యుండును. రాహువు అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు చోరీపై ఆసక్తి, బంధనము లేక కారాగార వాసము వలన కోపము, అపజయము మొదలగునవి సంభవించును.

### 5. గురుని అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశా ఫలములు

గురుని అంతర్దశలో గురుని సూక్ష్మ దశ యందు జాతకునికి అన్ని విధములైన దుఃఖములు నశించుట, సంపద, శివభక్తి, మతసంబంధమైన క్రతువులు చేయుట, కప్పుగల వాహనము సంభవించును. గురుని అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు కఠిన నియమములను వదలుట, సంపద అంతయు నశించి పరదేశ

నివాసము, అందరితో శత్రుత్వము గలవాడగును. గురుని అంతర్దశలో బుధుని సూక్ష్మ దశ యందు జ్ఞానము, ప్రతిష్ట, ఉచిత వేతనము, పవిత్ర గ్రంధముల నుండి వ్యాఖ్యానము వినుట, శివపూజ చేయు వాడుగా యుండును.

గురుని అంత్యర్ద దశలో కేతు సూక్ష్మ దశ యందు మతసంబంధమైన క్రతువులు జేయుట, గురుభక్తి గల్గి యుండును. గురుని అంతర్దశలో శుక్ర సూక్ష్మ దశ యందు రోగవిముక్తి, సౌఖ్యము, సంతోషము, ధన ధాన్య లాభము, భార్యా బిడ్డల సంసారములో సంతోషము గల్గును. గురుని అంతర్ద దశలో రవి సూక్ష్మదశ యందు కీళ్ళవాతరోగము, వాత, శ్లేష్మ, పైత్య, జలుబు రోగము సంభవించును.

గురుని అంత్యర్ద దశలో చంద్ర సూక్ష్మ దశ యందు సంతోషము, పుత్ర జననము నేత్ర రోగము, కడుపులో బాధ సంభవించును. గురుని అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు స్త్రీల వలన విష ప్రయోగము లేక సుఖ వ్యాధులచే బాధ, కారాగార వాసము ప్రవాసము, మతిభ్రమ గల్గును. గురుని అంతర్దశలో రాహువు సూక్ష్మ దశ యందు జాతకునికి రోగముల వలన బాధ, చోరుల వలన దోపిడి, సర్ప, వృశ్చికముల కాటు సంభవించును.

## 6. శని అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశా ఫలములు

శని అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు జాతకునికి ధననాశము, రోగములు, శత్రుబాధ, అకాల భోజనము, వంశ నాశము, గొప్ప దుఃఖము సంభవించును. శని అంతర్దశలో బుధ సూక్ష్మదశయందు వ్యాపారము వలన ధన లాభము, జ్ఞాన వృద్ధి వలన ప్రతిష్ట, భార్య, భూములు సంక్రమించుట సంభవించును. శని అంతర్దశలో కేతు సూక్ష్మ దశ యందు మరణముతో సమానమైన దుఃఖము, భూతభయము, అవమానము, స్త్రీల వలన తలవంపులు సంభవించును.

శని అంతర్దశలో శుక్ర సూక్ష్మ దశ యందు ధన సౌఖ్యము, పుత్రుడు, ప్రతిష్ట భూములు బహుమతిగా సంపాదించుట వలన సౌఖ్యము, మత క్రతువులు పాటించుట, వివాహ వేడుకలు సంభవించును. శని అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు ప్రభుత్వ కార్యాలయములో గొప్ప ఉద్యోగము, గృహము నందు కలతలు, బాధలు, సంభవించును. శని అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు విశాలమైన మనస్సు; గొప్ప పధకము ప్రారంభించి దానిని నడుపుటకు అసమర్దత గల్గి యుండుట, ధన వ్యయము, అయితే భార్యా బిడ్డల సౌఖ్యము సంభవించును.

శని అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు అసమర్దత, శత్రుత్వము, అసూయ సోమరితనము, తృప్తి, వాతరోగము సంభవించును. శని అంతర్దశలో రాహువు సూక్ష్మదశ యందు మాతాపిత గురు మరణము, ఫలించని పనులు, మనోవ్యధ సంభవించును. శని అంతర్దశలో గురువు సూక్ష్మ దశ యందు రాజపారితోషికములు ధన ధాన్యవృద్ధి, సంతోషము సంభవించును.

### 7. బుధ అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశా ఫలములు

బుధ అంతర్దశలో బుధ సూక్ష్మ దశ యందు జాతకునికి సౌఖ్యము, రాజపారితోషికములు, ధన ధాన్యలాభము, అందరి యందు స్నేహ భవముగా యుండుట సంభవించును. బుధ అంతర్దశలో కేతు సూక్ష్మ దశ యందు జాతకుడు పుత్ర, గృహ అగ్ని వలన బాధ, చెడుదారులలో బ్రతుకు, చెడు ఆహారము, సుఖ వ్యాధులు సంభవించును. బుధ అంతర్దశలో శుక్ర సూక్ష్మదశ యందు వాహనములు, ధనము, ప్రతిష్ఠ, సుఖము సంభవించును.

బుధ అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు జాతకునికి రాజాగ్రహము, ప్రజలలో అగౌరవము, కొట్టబడుట, మనోవ్యధ, అపవాదులు సంభవించును. బుధ అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు శుభము, సౌఖ్యము, మనస్సు శాంతి, ప్రభువు వలన ధనలాభము, అందరితో స్నేహ భావము గలవాడుగా యుండును. బుధ అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు పేదరిగము, మందమతి, కోపు, అసూయ, చెడ్డ పనులు సంభవించును.

బుధ అంతర్దశలో రాహు సూక్ష్మ దశ యందు రాజ, అగ్ని, సర్పభయము, శత్రువులను కష్టములతో తలవంపులు జేయుట, భూతమును స్వాధీనములో నుంచు కొనుట సంభవించును. బుధ అంతర్దశలో గురు సూక్ష్మదశ యందు జాతకునికి మంచి గృహము పరికరము, సుఖజీవనము, రాజపారితోషికములు సంభవించును. బుధ అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు జాతకునికి వ్యాపారములో ధనలాభము, జ్ఞానము వలన ప్రతిష్ట, భార్యా సౌఖ్యము సంభవించును.

### 8. కేతు అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశా ఫలములు

కేతు అంతర్దశలో కేతు సూక్ష్మదశ యందు జాతకునికి శరీర అనారోగ్యము భార్యాబిడ్డల వలన దుఃఖము, వీదులలో తిరిగి బిక్షాటనము చేయువాడుగును. కేతు అంతర్దశలో శుక్ర సూక్ష్మదశ యందు రోగ విముక్తి, ధనలాభము, గురు బ్రాహ్మణ భక్తి, బంధు సమాగమము జరుగును. కేతు అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు యుద్ధములో అపజయము, యితర దేశము నుండి ప్రవాసము, ధననష్టము, మిత్రునకు అపాయము సంభవించును.

కేతు అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు యుద్ధము నందు జయము, గృహము నందు యెల్లప్పుడు సేవకులు, సేవకురాండ్లు యుండెదరు. కేతు అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు అశ్వస్వారి వలన భయము, రౌడీలు, చోరుల వలన బాధ, మూల వ్యాధి, శిరోరోగము సంభవించును. కేతు అంతర్ద దశలో రాహు సూక్ష్మ దశ యందు గురు, కళత్ర మరణము, దుష్ట స్త్రీతో సాంగత్యము, అవమానము, రక్తవాంతులు, పైత్య రోగము సంభవించును.

కేతు అంతర్దశలో గురు సూక్ష్మ దశ యందు శత్రుత్వము, భూములు, పశువుల నష్టము వలన బాధ, అయితే తొందరలో రాజశోభ అనుభవించును. కేతు అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు జాతకునికి లంచ గొండితనము, నీచపుత్రుని విడనాడుట, భార్యాతో పోట్లాటలు, ఆకలి బాధ సంభవించును. కేతు అంతర్దశలో

బుధ సూక్ష్మ దశ యందు సంపద, వృద్ధి, శత్రుబాధ, అన్ని విధములైన జనులతో సమాగమమమును మఱల వారిని వదలుట సంభవించును.

## 9. శుక్ర అంతర్దశలో వివిధ గ్రహముల సూక్ష్మ దశా ఫలములు

శుక్ర అంతర్దశలో శుక్ర సూక్ష్మ దశ యందు జాతకునికి గొప్ప సౌఖ్యము, శత్రవులను జయించుట, సుందరమైన గృహము, శివ దేవాలయము, బావులు, గుంటలు త్రవ్వించుట సంభవించును. శుక్ర అంతర్దశలో రవి సూక్ష్మ దశ యందు హృదయము నొప్పి, నిబ్బరము లేకుండుట, లోపలకు బయటకు వెళ్ళుచుండుట, వ్యాపారములో నొడుదుడుకులు సంభవించును. శుక్ర అంతర్దశలో చంద్ర సూక్ష్మ దశ యందు ఆరోగ్యము, ధనలాభము, ప్రయాణము వలన కార్య సఫలము, శత్రుత్వము విడనాడుటకు ఆసక్తి సంభవించును.

శుక్ర అంతర్దశలో కుజ సూక్ష్మ దశ యందు సోమరితనము, శత్రువు వలన మోసము ప్రవాసము, గొప్ప భయము, రోగము, దుఃఖము సంభవించును. శుక్ర అంతర్దశలో రాహు సూక్ష్మ దశ యందు సర్ప, అగ్ని, రాజ భయము, బంధు నాశము గురువు అనారోగ్యము, అధికార భంగము సంభవించును. శుక్ర అంతర్దశలో గురు సూక్ష్మ దశ యందు అంతట జయము, ప్రతిష్ట, అధికారము, ధనము నందు వృద్ధి, వ్యాపారము నందు ధనలాభము సంభవించును.

శుక్ర అంతర్దశలో శని సూక్ష్మ దశ యందు శత్రుబాధ, గొప్ప దుఃఖము, పశునాశము, గురు మరణము సంభవించును. శుక్ర అంతర్దశలో బుధ సూక్ష్మదశ యందు బంధు స్నేహము, వ్యాపార వృద్ధి, ధనవృద్ధి, భార్యా బిడ్డల సౌఖ్యము సంభవించును. శుక్ర అంతర్దశలో కేతు సూక్ష్మ దశ యందు అగ్ని బాధ, పెద్దవారి బాధ, నేత్రము, ముఖము, శిరస్సు నందు నొప్పి, పోయిన వస్తువును వెదుకుట, శరీర బాధ సంభవించును.

## 1. రవి సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

రవి సూక్ష్మ దశలో రవి ప్రాణ దశ యందు జాతకునికి వ్యభిచారిణి వలన విషప్రయోగము, చోరీలు జరుగుట వలన బాధ, కొన్ని సంకటనలు, జరిగిన తరువాత మరణము సంభవించును. రవి సూక్ష్మదశలో చంద్ర ప్రాణ దశ యందు సౌఖ్యము, మంచి భోజనము, రాజగౌరవము, భయము సంభవించును. రవి సూక్ష్మదశలో కుజ ప్రాణ దశ యందు భూతభయము, యొకనికి సహాయము చేయ వలెనను ప్రయత్నములో ధననాశము, గొప్ప భయము, దుఃఖము సంభవించును.

రవి సూక్ష్మ దశలో రాహువు ప్రాణ దశ యందు ఆకలి లేకపోవుట, యెద్దు కొమ్ము తగిలిన గాయము వలన బాధ, రాజ, అగ్ని, ధనబాధ సంభవించును. రవి సూక్ష్మ దశలో గురు ప్రాణతశ యందు జ్ఞానవృద్ధి, ధనము, ప్రయాణము నందు కార్య జయము, అలసట, మరణము సంభవించును. రవి సూక్ష్మ దశలో శని ప్రాణదశ యందు బంధనము, అసూయ, దుఃఖము, మరణము సంభవించును.

రవి సూక్ష్మ దశలో రవి ప్రాణ దశ యందు యితరులను తృప్తిపరచుటకు నిత్యము మంచి భోజనములో ప్రభువు వలె సౌఖ్యము నొందు చుండును. రవి సూక్ష్మ దశలో కేతు ప్రాణ దశ యందు పోట్లాటలు, ధననాశము, భార్యా మరణము, గురువు బంధువుల నాశము గల్గును. రవి సూక్ష్మదశలో శుక్ర ప్రాణ దశ యందు రాజగౌరవము ధనలాభము, మంచి ఆహారము పానీయము సంక్రమించును.

## 2. చంద్ర సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

చంద్ర సూక్ష్మ దశలో చంద్ర ప్రాణ దశ యందు జాతకుడు యోగవిద్య నభ్యసించి సమాధి స్థితి యందుండి గురువుగా యుండును. చంద్ర సూక్ష్మ దశలో కుజ ప్రాణయందు భూతదయ, ధననాశము, బంధు నాశము, రక్తస్రావ భయము, కుష్టు యింకా యితర రోగములు సంభవించును. చంద్ర సూక్ష్మదశలో రాహువు ప్రాణ దశ యందు బంధు స్నేహితుల విరోధము, ధననాశము, బంధనము సంభవించును.

చంద్ర సూక్ష్మదశలో గురు ప్రాణ దశ యందు ధనవృద్ధి, ధర్మకార్యములు, పరువు, అధికారము, దేవుళ్ళు, బ్రాహ్మణులను పూజించుట, సౌఖ్యము సంభవించును. చంద్ర సూక్ష్మ దశలో శని ప్రాణ దశ యందు గౌరవము, ప్రభువు ద్వారా ఉద్యోగము అందరితో సమానత్వము సంభవించును. చంద్ర సూక్ష్మదశలో బుధ ప్రాణదశ యందు వస్తులాభము, రాజగౌరవము, సౌఖ్యము, వాహన లాభము మొదలగునవి సంభవించును.

చంద్ర సూక్ష్మ దశలో కేతు ప్రాణ దశ యందు ఆయుధ భయము, శత్రు అగ్నిభయము, విషభయము, కడుపులో బాధ, భార్యాబిడ్డల మరణము సంభవించును. చంద్ర సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు భార్యా బిడ్డలు స్నేహితుల సౌఖ్యము, పరదేశము నుండి ధనలాభము, సాధారణ సౌఖ్యము సంభవించును. చంద్ర సూక్ష్మ దశలో రవి ప్రాణ దశ యందు అంతా మోసము, అసూయ, జంతువులపై క్రూరత్వము, యెల్లపుడు దుఃఖము, పరదేశ ప్రవాసము సంభవించును.

## 3. కుజ సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

కుజ సూక్ష్మ దశలో కుజ ప్రాణ దశ యందు బంధనము, ఆయుధముల వలన మరణము సంభవించును. సూక్ష్మదశలో రాహువు ప్రాణదశ యందు జాతకుడు భార్యాబిడ్డలను విడనాడు వాడును, బంధువులచే బాధింపబడు వాడును, విష ప్రయోగముచే మరణము జెందు వాడును, కుజ సూక్ష్మ దశలో గురు ప్రాణ దశ యందు దేవుళ్ళకు పూజ, మత క్రతువులు పాటించుట, తన సంతాపము, మనుమ సంతానముతో సౌఖ్యముగా నుండుట, గొప్ప వానిగా నుండుట సంభవించును.

కుజ సూక్ష్మ దశలో శనిప్రాణ దశ యందు ధననాశము, అధికార భంగము, అగ్నిభయము, మరణము సంభవించును. కుజ సూక్ష్మదశలో బుధ ప్రాణ దశ యందు అందమైన కళత్ర లాభము, మంచి వస్త్రములు, ఆభరణములు

గల్గును. కుజ సూక్ష్మ దశలో కేతు ప్రాణ దశ యందు యెత్తునుండి పడుట, పిడుగుపాటు, నేత్ర రోగము గొప్ప భయము, యొక వేశ్య వలన ధననాశము సంభవించును.

కుజ సూక్ష్మ దశలో శుక్ర ప్రాణ దశ యందు యెక్కువ ధన ధాన్యములను కూడబెట్టుట, పేరు ప్రతిష్టలు, సౌఖ్యము, మనోవాంఛలకు లోనగుట వలన శరీర రోగము సంభవించును. కుజ సూక్ష్మ దశలో రవి ప్రాణదశ యందు భయము, ఉన్మాదము, రాజవిరోధము, దీర్ఘ రోగము, ధననష్టము, పేదరికము సంభవించును. కుజసూక్ష్మ దశలో చంద్ర ప్రాణదశ యందు సౌఖ్యము, మంచి ఆహారము, వస్త్రములు, ఆభరణముల యందు ప్రేమ, వాతావరణము వలన బాధగల్గును.

### 4. రాహు సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

రాహువు సూక్ష్మ దశలో రాహువు ప్రాణ దశ యందు ఆకలి లేకుండుట, విష భయము రేసులు, జూదము వలన ధననాశము సంభవించును. రాహువు సూక్ష్మ దశలో గురు ప్రాణదశ యందు సరీర సంబంధమైన సౌఖ్యము, బాధలేని వాహనములు, నీచ జాతి వారితో స్నేహము, పోట్లాటల వలన భయము సంభవించును. రాహువు సూక్ష్మ దశలో శనిప్రాణ దశ యందు చోరుల వలన ధననాశము, రోగబాధ, బంధనము, బాధలు సంభవించును.

రాహువు సూక్ష్మ దశలో బుధ ప్రాణ దశ యందు మర్మ విద్య నభ్యసించుట, మంచి స్వభావము, దైవ సంబంధమైన భయము, పూజ, భక్తి, అందరితో మిన్నగా యుండును. రాహువు సూక్ష్మ దశలో కేతువు ప్రాణదశ యందు భార్యాపుత్రుని విరోధము, వెడబాటు, వలన కార్యభంగము జరుగును. రాహువు సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు సంతోషము, అనుకున్న కార్యములు సఫలమగుట, శివపూజ మొదలగునవి సంభవించును.

రాహువు సూక్ష్మ దశలో రవిప్రాణ దశ యందు మూలవ్యాధి, గ్రామకక్షలు, పశునాశము సంభవించును. రాహువు సూక్ష్మ దశలో చంద్ర ప్రాణ దశ యందు మంచి స్వభావము, జ్ఞానులు, మతము, పాపభయము, న్యాయము, సౌఖ్యము గలవాడుగా యుండును. రాహువు సూక్ష్మదశలో కుజ ప్రాణదశ యందు అగ్ని, సంపద వలన భయము, అధికార భంగము, పుట్టవ్రణము, మనోవ్యధ, బానిసత్వము సంభవించును.

### 5. గురు సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

గురు సూక్ష్మ దశలో గురు ప్రాణదశ యందు జాతకునికి దుఃఖ విముక్తి, అధిక ధనలాభము, యజ్ఞక్రతువులు శివ పూజ, సంతోషము సంభవించును. గురు సూక్ష్మ దశలో శని ప్రాణదశ యందు అనేక కష్టములు, యెండలో తిరుగుట, పరదేశములో ధననాశము, శత్రుత్వము, తన స్వస్థలములో ఆస్తి నష్టము సంభవించును. గురు సూక్ష్మ దశలో బుధ ప్రాణదశ యందు గొప్పగా చదవి

మంచి స్వభావము అనవరచు కొనుట, చదువరుల సమాజమునకు అధిపతిగా యుండుట, ధన వృద్ధి గల వాడుగ యుండును.

గురు సూక్ష్మ దశలో కేతు ప్రాణదశ యందు గొప్ప జ్ఞానము, ప్రతిష్ట, విద్యావంతుడు, శివభక్తి, మత సంబంధమైన క్రతువులు ప్రసంగములు వినుట, గురుభక్తి గలవాడుగా యుండును. గురు సూక్ష్మదశలో శుక్రప్రాణ దశ యందు రోగవిముక్తి సౌఖ్యము, ధనలాభము, ధాన్యలాభము, భార్యాబిడ్డలతో సంతోషము గల్గును. గురు సూక్ష్మదశలో రవి ప్రాణదశ యందు కీళ్ళ వాతము, వాతపిత్త, పైత్యరోగము సంభవించును.

గురు సూక్ష్మదశలో చంద్ర ప్రాణదశ యందు సంతోషము, పుత్ర జననము, కడుపు నొప్పి, నేత్రరోగము సంభవించును. గురు సూక్ష్మదశలో కుజ ప్రాణదశ యందు స్త్రీలచే విషప్రయోగము, బంధనము, అనేక అడ్డంకులు, దేశము వెడలి పోవుట, కలవరము సంభవించును. గురు సూక్ష్మదశలో రాహు ప్రాణదశ యందు రోగబాధ, దొంగల వలన చోరీ, సర్పము, వృశ్చికముచే కరవబడుట సంభవించును.

### 6. శని సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

శని సూక్ష్మదశలో శని ప్రాణదశ యందు గొప్ప జ్వరము, కుష్టువ్యాధి, వలన శరీరము పాలిపోవుట, కడుపు నొప్పి, అగ్ని జలభయముచే మరణము జెందును. శని సూక్ష్మదశలో బుధ ప్రాణదశ యందు ధనధాన్య లాభము, తనకార్య కలాపములకు ప్రజల నుండి గౌరవము, దేవుళ్ళను బ్రాహ్మణులను పూజించుట, యశోవృద్ధి గల్గును. శని సూక్ష్మదశలో కేతు ప్రాణదశ యందు మరణమునకు సమానమైన దుఃఖము, భూతభయము, అవమానము, స్త్రీలవలన దుఃఖము సంభవించును.

శని సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు ధనము వలన సౌఖ్యము, పుత్రుడు, ప్రతిష్ట, భూములు గలవారి పారితోషికములు పొందుట, మతసంబంధమైన క్రతువులు, వివాహ వేడుకలు సంభవించును. శని సూక్ష్మదశలో రవి ప్రాణదశ యందు నేత్రరోగము, శిరోరోగము, అగ్ని, సర్ప, శత్రుభయము, ధన వ్యయము, బాధ సంభవించును. శని సూక్ష్మదశలో చంద్ర ప్రాణ దశ యందు ఆరోగ్యము, పుత్ర జననము, శాంతి లాభకరమైన కార్యములు చేయుట, దేవుళ్ళను, బ్రాహ్మణులను పూజించుట సంభవించును.

శని సూక్ష్మ దశలో కుజ ప్రాణదశ యందు మూల వ్యాధి, వేట యందు, శత్రుమరణ భయము, సర్ప, అగ్ని, శత్రు భయము సంభవించును. శని సూక్ష్మ దశలో రాహువు ప్రాణదశ యందు ప్రవాసము, రాజ భయము, భ్రమ, విషము పుచ్చుకొనుట, పైత్యరోగము వలన బాధ సంభవించును. శని సూక్ష్మ దశలో గురు

ప్రాణదశ యందు సేనాధిపతి, గౌరవము అనుభవించుట, ప్రతిష్ట, రాజ గౌరవము, బంధు సమాగమము సంభవించును.

### 7. బుధ సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

బుధ సూక్ష్మ దశలో బుధ ప్రాణదశ యందు జాతకునికి ఆరోగ్యము, సౌఖ్యము మత సంబంధమైన కార్యములు, ప్రాణకోటి యందు దయగల వాడగును. బుధ సూక్ష్మ దశలో కేతు ప్రాణదశ యందు జాతకునికి దొంగలచే కొట్టబడుట, విష ప్రయోగము వలన మనోవ్యథ, హృదయమందు దుఃఖము సంభవించును. బుధ సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు న్యాయము, ప్రతిష్ట, ధనలాభము, భక్తి, మత సంబంధమైన శివపూజ, క్రతువులు, బార్యాబిడ్డల సౌఖ్యము సంభవించును.

బుధ సూక్ష్మ దశలో రవి ప్రాణదశ యందు లోపల దాహము లేక ఆవేదన, బంధువుల అనారోగ్యము, మతిభ్రమ, ఇంద్రియవాంఛ, చోరీ, పాపపు పనులు చేయుట సంభవించును. బుధ సూక్ష్మదశలో చంద్ర ప్రాణదశ యందు కళత్ర లాభము, ధనలాభము, సౌఖ్యము సంభవించును. బుధ సూక్ష్మదశలో కుజ ప్రాణదశ యందు జాతకుడు పాపిష్టి, కడునొప్పి, వంటినొప్పి, మూలవ్యాధి, నేత్ర రోగము, కళత్రమునకు అపాయము సంభవించును.

బుధ సూక్ష్మ దశలో రాహు ప్రాణదశ యందు జాతకునికి ధనలాభము, వస్త్రలాభము, ఆభరణములు, దేవుళ్ళు, బ్రాహ్మణులతో విరోధము, మరణము సంభవించును. బుధ సూక్ష్మధశలో గురు ప్రాణదశ యందు జాతకుడు గురువై యుండుట, జ్ఞానము వలన మంచి స్వభావము గలవాడగుట, వ్యవసాయవృద్ధి, ధనలాభము సంభవించును. బుధ సూక్ష్మదశలో శని ప్రాణదశ యందు దొంగల వలన మరణము, ధనహాని, వీధులలో భిక్షాటనము సంభవించును.

### 8. కేతు సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

కేతువు సూక్ష్మదశలో కేతువు ప్రాణదశ యందు జాతకునికి గుఱ్ఱము మీద నుండి పడుట వలన దెబ్బలు, కాళ్ళు విరుగుట, ప్రాణసంకటనలు సంభవించును. కేతు సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు పోట్లాటల విరమణ, అశ్వ, పశు, భూ ధన లాభము, సౌఖ్యము సంభవించును. కేతు సూక్ష్మదశలో రవి ప్రాణదశ యందు దొంగలచే కొట్టబడుట, శత్రు అగ్నిభయము, బంధనము, అధిక దౌర్భాగ్యము, ప్రాణసంకటనలు సంభవించును.

కేతువు సూక్ష్మదశలో చంద్ర ప్రాణదశ యందు జాతకునికి దేవతలు, గురువు బ్రాహ్మణ భక్తి, పవిత్ర పుణ్యక్షేత్రములు, సంపద సౌఖ్యలాభము, మెడ యందు గాయము, నేత్ర రోగము గలుగును. కేతు సూక్ష్మదశలో కుజ ప్రాణదశ యందు అధిక రోగము, వాహనము వలన ప్రమాదము, మతిభ్రమ, బంధువులతో శత్రుత్వము సంభవిచును. కేతు సూక్ష్మదశలో రాహు ప్రాణదశ యందు భార్యా

పుత్రునితో శత్రుత్వము. వారు బయటకు పంపబడుట. మూర్ఖము వలన వ్యాపార నష్టము సంభవించును.

కేతువు సూక్ష్మదశలో గురు ప్రాణదశ యందు జాతకునికి గాయములు. ఆయుధముల వలన బాధ. భార్యాపుత్రుని మరణము. మనోవ్యధ సంభవించును. కేతు సూక్ష్మదశలో శని ప్రాణదశ యందు క్రూరస్వభావము. క్రూరమైన పనుల యందు ఆసక్తి. బంధనము. దుఃఖములో మునిగి యండుట సంభవించును. కేతు సూక్ష్మదశలో బుధ ప్రాణదశ యందు పుష్పములు. ఆభరణములు. సుగంధ ద్రవ్యములు మంచి భోజనము. సౌఖ్యము. విశ్రాంతి. ధూపము సంభవించును.

## 9. శుక్ర సూక్ష్మ దశలో వివిధ గ్రహముల ప్రాణదశా ఫలములు

శుక్ర సూక్ష్మదశలో శుక్ర ప్రాణదశ యందు జాతకునికి గొప్ప జ్ఞానము. దేవతాభక్తి. శుభకార్యములు. తన సంతానము తన మనుమ సంతాన సౌఖ్యము గలవాడగును. శుక్ర సూక్ష్మదశలో రవి ప్రాణదశ యందు ప్రపంచ ప్రఖ్యాతి గల వాడును. పుత్రునికి అనారోగ్యము. అగ్ని బాధ వలన దుఃఖము సంభవించును. శుక్ర సూక్ష్మదశలో చంద్ర ప్రాణదశ యందు మత సంబంధమైన కార్యకలాపము లలో యెక్కువ కాలము వినియోగించుట. మంత్రపఠన. ధనలాభము. సౌఖ్యము సంభవించును.

శుక్ర సూక్ష్మదశలో కుజ ప్రాణదశ యందు జ్వరము. స్ఫోటకము. గడ్డలు. గజ్జి. దేవబ్రాహ్మణ భక్తి సంభవించును. శుక్ర సూక్ష్మదశలో రాహు ప్రాణదశ యందు శత్రువుల తీరని బాధ. నేత్ర రోగము. కడుపునొప్పి. పెద్దవారితో విరోధము సంభవించును. శుక్ర సూక్ష్మదశలో గురు ప్రాణదశ యందు దీర్ఘాయువు. ఆరోగ్యము. శ్రేయస్సు. ధనము. భార్యాబిడ్డలు. ఆనందము. ప్రతిష్ట. వాహనసౌఖ్యము గలుగును.

శుక్ర సూక్ష్మదశలో శని ప్రాణదశ యందు జాతకునికి రాజాగ్రహము. దౌర్భాగ్యము పెరుగుట. కొద్దివారితో శత్రుత్వము. అనేక రోగములు సంభవించును. శుక్ర సూక్ష్మదశలో బుధ ప్రాణదశ యందు సౌఖ్యము. రాజ్య పారితోషికములు. అన్ని దిశల నుండి వ్యవసాయ భూముల తీరని సంతోషము సంభవించును. శుక్ర సూక్ష్మదశలో కేతు ప్రాణదశ యందు జీవనోపాధి కష్టమగుట. ధననాశము. ధాన్య నాశము గల్గును.

# గ్రహ సంహిత
## (జన్మజాతకము)
## సర్వజనుల భవిష్యత్ గ్రంథము
## HUMAN ASTROLOGY FOR ALL
## ఉత్తరార్ధము
## ప్రథమ స్కంధము

జాతక పారుజాతము మొదలగు పూర్వగ్రంథములలో గ్రహముల మహాదశా భుక్తి ఫలములు ఈ క్రింది విధముగా వ్రాయబడి యున్నవి —

### 1. రవి మహాదశాఫల నాడీ లక్షణములు

లగ్నము మొదలు కేంద్ర, కోణ, యుచ్చ, స్వక్షేత్రమునందు గాని, శుభగ్రహ సంబంధముగాని లేక వీక్షణముగాని గలిగి రవి బలవంతుడైయున్న ఆ రవి మహాదశలో ధనకనక సమృద్ధి, పుత్రలాభము, బుద్ధి, జ్ఞాన, కీర్తి, పౌరుష, అధికారాతిశయము, సుఖ ప్రాప్తి, ఈశ్వరానుగ్రహము, ధాన్యవృద్ధి, రాజ సన్మానము, రాజకీయోద్యోగము, పితృసౌఖ్యము, శరీరారోగ్యము, నేత్ర సౌఖ్యము మొదలగు శుభఫలములు గలుగును. రవి మూల త్రికోణరాశి భాగలలోగాని, స్వక్షేత్రము నందుగాని, యుచ్చస్థానములో 10వ భాగయగు పరమోచ్చ స్థితిలోగాని బలవంతుడు. లగ్నాత్తు కేంద్ర త్రికోణ స్థానముల యందుగాని, లాభస్థానమందు గాని, నవమ దశమాధిపతులతో గలిసియుండి అధికమైన శుభవర్గులను పొంది యున్న అట్టి రవి మహాదశ మహాసౌఖ్యము, ధనము మొదలగు శుభఫలముల నిచ్చును. ఈ స్థానముల యందుండే రవి పంచమాధిపతితో గలిసియున్న అత్యంత సన్మానములను, గౌరవములను, పుత్ర లాభము, అధిక భోగాదులు మొదలగు శుభఫలములు గలుగును. మరియు నారవికి ద్వితీయాధిపతితో సంబంధము గలిగినప్పుడు మహాభోగములు గలిగి జాతకుడు మంచి సంపన్నుడగును. చతుర్థాధిపతితో సంబంధముగల రవి దశ మూడు లేక మూడురకముల వాహన లాభముగలుగును. రవి శుభస్థానములందుండి బలవంతుడై యున్న వాని మహాదశలో రాజాధికారము, గొప్ప ఉద్యోగము, ఖ్యాతి, విశేష ధనార్జనము గలుగును.

రవి నీచ షష్టాష్టమ వ్యయ శత్రు క్షేత్రముల యందు పాపగ్రహములతో కలసి బలహీనుడైయున్న శత్రుభయము, నేత్రరోగము, భోజన సౌఖ్యహీనము, జ్వరము, పితృవిచారము, వ్యాపారనష్టము, ద్రవ్యనష్టము, రోగము, రాజాగ్రహము, పితృమరణము సంభవించును. రవి విశేష దుర్బలుడైయున్న శరీరపీడ, ఉద్యోగ భ్రష్టత్వము, శత్రువృద్ధి, పిత్రార్జిత ధన వ్యయము, సంతాన విచారము, కుటుంబ చిక్కులు మొదలగునవి గలుగును.

### 1. రవి మహాదశలో రవి భుక్తి దశాఫల నాడీలక్షణములు

రవి కేంద్రకోణములయందు బలవంతుడై యున్న శరీర సౌఖ్యము, ధనలాభము, గౌరవము, పితృసౌఖ్యము, నేత్ర సౌఖ్యము, రాజసన్మానము, వాహనప్రాప్తి, ధనలాభము మొదలగునవి గలుగును.

రవి నీచ షష్టాష్టమ వ్యయస్థానములయందు బలముగా యున్న శతృభీతి, రాజభీతి,మృత్యుభయము, ధనహాని, పితృశరీరపీడ, పిత్తజ్వరబాధ, శిరోరోగము, ఉదరరోగము, విదేశవాసము, బంధుహాని, విరోధము, దరిద్రము, మానహాని మొదలగు దుష్ఫలములు గలుగును.

### 2. రవి మహాదశలో చంద్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

చంద్రుడు పూర్ణచంద్రుడై కేంద్రకోణ యుచ్చ స్థానముల యందున్న చంద్రభుక్తిలో రాజసన్మానము, వైభవము, సువస్త్రాభరణప్రాప్తి, సుఖభోజనము, మాతృ సౌఖ్యము, వాణిజ్యము వల్ల ధనలాభము, సర్వజన ప్రియము, తేజస్సు మొదలగునవి గల్గును.

చంద్రుడు క్షీణచంద్రుడై నీచ షష్టాష్టమ వ్యయ స్థానముల యందున్నను, దశనాధుడగు రవికి షష్టాష్టమముల యందున్నను చంద్రభుక్తి కాలములో మాతృ పీడ, వ్యాపారము వల్ల ధనవ్యయము, ఋణవృద్ధి, సంతాననష్టము, శరీరపీడ, విదేశ గమనము గలుగును.

### 3. రవి మహాదశలో కుజభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కుజుడు కేంద్ర త్రికోణ, యుచ్ఛ, స్వక్షేత్ర, మిత్రక్షేత్రముల యందు బలముగా యున్న భూలాభము, వ్యవసాయాభివృద్ధి, ధనలాభము, భ్రాతృసౌఖ్యము, వాహన సౌఖ్యము, మొదలగు సుఫలములు గలుగును.

కుజునకు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందుగాని, దశానాధునకు షష్టాష్టమ వ్యయస్థానములయందుగాని యున్న మానహాని, విశేషదుఖము, గ్రహబాధ, ఆయుధ, అగ్ని, మశూచిబాధ, వ్యవసాయము వల్ల ధనలాభము, భ్రాతృ దుఖము, మనోరోగము, భూనష్టము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 4. రవి మహాదశలో రాహుభుక్తి ఫలనాడీ లక్షణములు

రాహువు కేంద్ర, లాభ, త్రికోణ స్థానములయందున్న విశేష ధనలాభము, శరీర సౌఖ్యము, రాజసన్మానము, వైభవము, ఉద్యోగము వల్ల ధనలాభము, వ్యవసాయము వల్ల సౌఖ్యము గలుగును.

రాహువు షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న, రవి రాహువు లన్యోన్య షష్టాష్టమమునందున్నను పిత్రారిష్టము, కార్య హాని, సర్పభీతి, చోరులవల్ల శత్రువులవల్ల ధననష్టము, శరీరపీడయును గలుగును.

### 5. రవి మహాదశలో గురుభుక్తి దశాఫల నాడీలక్షణములు

గురుడు కేంద్రకోణ యుచ్ఛస్థానములయందున్న విశేషకీర్తి, రాజసన్మానము, వైభవము, ధర్మకార్యములు, పుత్రలాభము, గౌరవము, విశేషధనలాభము గలుగును.

గురుడు షష్టాష్టమ వ్యయస్థానములయందున్న విశేషధన నష్టము, ధర్మ కార్యముల వలన ధనవ్యయము, పరదేశ నివాసము, చోరభయము, అగ్నిభీతి, రాజువల్ల అపకారమును గలుగును.

### 6. రవి మహాదశలో శనిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శని కేంద్రకోణ యుచ్చస్థానములయందున్న పుత్రసంతానము, రాజ సన్మానము, వేదాంతశ్రవణము, రాజుల వల్ల ధనలాభము, సౌఖ్యము, గంధ మాల్యాంబరములును గలుగును.

శని షష్టాష్టమ వ్యయస్థానములయందున్న ధననష్టము, గొప్ప దుఃఖము, ధన ధాన్యాది నాశనము, బంధుకలహము, శత్రువృద్ధియును గలుగును.

### 7. రవి మహాదశలో బుధభుక్తి దశాఫల నాడీ లక్షణములు

బుధుడు కేంద్రకోణ యుచ్చ స్థానముల యందున్న విశేష ధన లాభము, కీర్తి, ధైర్యము, వస్త్రాభరణములు, సంపద, శిల్ప విద్యా ప్రవీణతయు, కీర్తి, శరీర సౌఖ్యము మొదలగునవి గలుగును.

బుధుడు షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న విదేశవాసము వల్ల దుఖము, అన్ని విధముల పరాభవము, చోర, అగ్ని భూపతులవల్ల భయము, వ్యాపారము వలన ధన వ్యయము గలుగును.

### 8. రవి మహాదశలో కేతుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతువు కేంద్ర, లాభ, త్రికోణస్థానముల యందున్న వ్యవసాయమువల్ల ధనలాభము, గోలాభము, విద్యా సౌఖ్యము, బంధు సమాగమము, భోజనాంబర సౌఖ్యము, స్వబంధువులవల్ల పూజ్యత్వమును గలుగును.

కేతువు షష్టాష్టమ వ్యయముల యందున్న స్థానభ్రష్టత్వము, రాజభీతి, చోర భయము, శత్రుపీడ, వంచనము, వైరాగ్యము, శత్రువులవల్ల బంధనము గలుగును.

### 9. రవి మహాదశలో శుక్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శుక్రుడు కేంద్రకోణయుచ్చస్థానములయందున్న రాజ్యలాభము, ధనప్రాప్తి, ఛత్ర చామరాది వైభవము, వాహనము, రాజసన్మానము, వ్యాపారమువల్ల ధన లాభమును గలుగును.

శుక్రుడు నీచ, షష్టామ వ్యయస్థానముల యందున్న కళత్రపీడ, మహాదుఃఖము, ధనధాన్యాది నాశనము, శత్రువృద్ధి, వ్యాపారము వల్ల ధననష్టమును గలుగును.

## 2. చంద్రమహాదశా ఫల నాడీ లక్షణములు

చంద్రుడు పూర్ణుడై శుభుడుగా యుండి కేంద్రకోణ యుచ్చక్షేత్రముల యందున్న మంత్రుల వల్ల ఐశ్వర్యము, స్త్రీధన క్షేత్రవృద్ధి వస్త్రాలంకారము, పరిమళ ద్రవ్యముల వల్ల ధనార్జనము, రాజానుగ్రహము, శరీరసౌఖ్యము, ధనము, సంతానము, రత్నములు, సౌఖ్యము, వ్యవసాయాభావృద్ధి, బలము, ధారాపుత్రాది

సౌఖ్యమును గలుగును. మరియు మాతృసుఖము, తటాక, క్షేత్ర, ఆరామ, గృహ, ద్వజ, పరస్త్రీ శోభ నాందోళికాది శుభకార్యసిద్ధి యగును.

చంద్రుడు నీచషష్టాష్టమ వ్యయములయందున్న క్షీణచంద్రుడైనను చంద్ర మహాదశలో వ్యవసాయమువల్ల నష్టము, ధాన్యహాని, మాతృపీడ, దుఃఖము, వ్యాపారము వల్ల ధననష్టము, వాతరోగము, పరదేశ నివాసము, శత్రువృద్ధి మొదలగునవి గలుగును. మరియు ఈ పాప చంద్రదశలో అన్నహీన, కృపసత్వ, బుద్ధి హీనత, జుగుప్స, మాతృహాని, క్రోధ, శీతజ్వరాధి దుష్టఫలముల నిచ్చును.

## 1. చంద్రమహాదశలో చంద్రభుక్తి నాడీ లక్షణములు

చంద్రుడు కేంద్రకోణ యుచ్ఛ స్థానముల యందున్న, శరీర సౌఖ్యము, ధన లాభము, వాహనాలంకార ప్రాప్తియు, మిత్రవృద్ధి, వ్యాపారములవల్ల ధనలాభము, దారా పుత్రాదిసౌఖ్యము, వ్యవసాయాభివృద్ధి మొదలగు సుఫలములు గలుగును.

చంద్రుడు నీచషష్టాష్టమ వ్యయముల యందున్న దారాపుత్రాది పీడ, శరీర పీడ, ఋణవృద్ధి, వ్యాపారమువల్ల ధననష్టముమొదలగు దుష్ఫలములు సంభవించును.

## 2. చంద్రమహాదశలో కుజభుక్తి నాడీ లక్షణములు

కుజుడు కేంద్రకోణ యుచ్ఛ స్థానములయందున్న భాతృవృద్ధి, పుత్రసౌఖ్యము, వ్యవసాయమువల్ల విశేషఫలము, రాజమూలకముగా విశేష భూలాభమును గలుగును.

కుజుడు నీచషష్టాష్టమవ్యయముల యందున్న జ్వరము, ఉన్మాదము, అతిసారము, భూతావేశము, అగ్నివల్ల బాధ, రాజశత్రువుల వల్ల ధనవ్యయము, రక్తస్రావము, జంతుబాధ, భూవ్యయము మొదలగు దుష్ఫలములు గలుగును.

## 3. చంద్రమహాదశలో రాహుభుక్తి నాడీ లక్షణములు

రాహువు కేంద్ర, లాభ, త్రికోణముల యందున్న సమాన లాభవ్యయములు, సమాన సుఖదుఃఖములు, వ్యవసాయమువల్ల సామాన్య లాభము, ఉద్యోగలాభమును తద్విఘ్నమును, మిత్రశత్రు సమాగమము గలుగును.

రాహువు షష్టాష్టమవ్యయముల యందున్న చర్మరోగము, విషబీతి, చోరభయము, మానహాని, అవస్మారము, వ్రణబాధ, దరిద్రము, మాతృనష్టము, పితృనష్టము, బంధువిరోధము, వనవాసము, ఆకలిబాధ, శత్రువృద్ధి సంభవించును.

## 4. చంద్రమహాదశలో గురుభుక్తి నాడీ లక్షణములు

గురుడు కేంద్ర, కోణ, స్వక్షేత్ర, ఉచ్ఛక్షేత్ర, లాభస్థానముల యందున్న రాజాశ్రయమువల్ల ధనలాభము, పుణ్యకర్మలయందు పరిశ్రమ, పాపక్షయము, విశేషకీర్తి, హోదాలో కొంత వృద్ధి, పుత్రుల వల్ల సౌఖ్యము, భూషణలాభము, వాహనలాభము, పుత్ర జననము, వైభవము, విశేష భాగ్యము, విజయము, దేహసౌఖ్యము మొదలగునవి గలుగును.

గురుడు నీచషష్టాష్టము వ్యయస్థానముల యందున్న ఉద్యోగ చలనము, ధర్మ కార్యముల వల్ల ధనవ్యయము, శరీరవ్యాధి, ధనధాన్యాది నాశనము సంభవించును.

### 5. చంద్రమహాదశలో శనిభుక్తి నాడీ లక్షణములు

శని కేంద్ర, లాభ, త్రికోణముల యందున్న వ్యవసాయమువల్ల ధనలాభము, వాణిజ్యమువల్ల ధనలాభము, దారాపుత్రుల అభివృద్ధి, రాజ మూలమున ధనలాభము, ఋణనాశనమును గలుగును.

శని షష్టాష్టమ వ్యయముల యందున్న స్థానభ్రష్టత్వము, ప్రవాసము, రాజులవల్ల భయము, చోరభయము, దారాపుత్రాది నాశనము, ధననాశనము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 6. చంద్రమహాదశలో బుధభుక్తి నాడీ లక్షణములు

బుధుడు కేంద్ర, లాభ, త్రికోణముల యందున్న రాజప్రీతి, వ్యవసాయాభివృద్ధి, భూలాభము, శరీరసౌఖ్యము, ఆరోగ్యము, పురాణ శ్రవణము, జ్ఞానాభివృద్ధి మొదలగు సుఫలములు గలుగును.

బుధుడు నీచషష్టాష్టమ వ్యయముల యందున్న వ్యవసాయము వల్ల వర్తకము వల్ల ధననష్టము, శత్రువుల వల్ల ధనవ్యయమును గలుగును.

### 7. చంద్రమహాదశలో కేతుభుక్తి నాడీ లక్షణములు

కేతువు కేంద్ర, లాభ, త్రికోణముల యందున్న దేహారోగ్యము, సౌఖ్యము, బంధుమిత్ర సమాగమము, భోజనసౌఖ్యము, అంబర భూషణాది లాభమును గలుగును.

కేతువు షష్టాష్టమ వ్యయముల యందున్న కళత్ర , పుత్రభంగము, వంశనాశనము, పరదేశ నివాసము, రాజులవల్ల చోరులవల్ల బాధయును గలుగును.

### 8. చంద్రమహాదశలో శుక్రభుక్తి నాడీ లక్షణములు

శుక్రుడు కేంద్ర,. లాభ, త్రికోణముల యందున్న ఉత్సాహము, యశోవృద్ధి, స్త్రీ పుత్ర, ధనసంపత్తు, ఉత్తర ఖండ మందు భాగ్యము, మనోధైర్యము గలుగును.

శుక్రుడు షష్టాష్టమ వ్యయముల యందున్న భోజనసౌఖ్యహీనము, మలిన వస్త్రములు, శుభకర్మ నాశనము, ఋణవృద్ధి, శత్రువృద్ధి, నీచస్త్రీసంగమము, దుష్ట వార్త, బంధుద్వేషము గలుగును.

### 9. చంద్రమహాదశలో రవిభుక్తి నాడీ లక్షణములు

రవి కేంద్ర, లాభ, త్రికోణముల యందున్న ధైర్యము, ధనలాభము, పుత్రలాభము, యుద్ధ జయము, మంచి ఉద్యోగము, విశేష కీర్తియును గలుగును.

రవి షష్టాష్టమ వ్యయముల యందున్న స్థానచలనము, ప్రవాసము, మేహరోగము, కర్మనాశనము, రాజభయము, చోరభీతియును గలుగును.

### 3. కుజమహాదశాఫల నాడీ లక్షణములు

కుజుడు శుభుడై కేంద్రకోణ యుచ్చ లాభ స్థానముల యందున్న విశేష భూలాభము, రాజమూలమున ధనలాభము, సోదరవృద్ధి, ఆయురారోగ్యవృద్ధి,

పశుసమృద్ధి, రాజసన్మానము, ఇష్టవస్తులాభము జ్ఞానము, నిర్మల మనస్సు, పరాక్రమము, శత్రునాశనము గలుగును.

కుజుడు పాపుడై నీచషష్టాష్టమ వ్యయస్థానముల యందున్న శత్రుభయము, మతిపీడ, దారాపుత్ర విచారము, ధననాశనము, జ్వర భయము, పిత్తదోషము, రక్తదోషము, సోదరమిత్ర విరోధము, అగ్ని భీతి, క్షేత్రనష్టము, వ్రణము, నేత్ర బాధ, రాజపీడ, ఆయుధభీతి మొదలగునవి సంభవించును.

### 1. కుజమహాదశలో కుజభుక్తి నాడీ లక్షణములు

కుజుడు యుచ్చ, లాభ, త్రికోణ, తృతీయ, షష్టస్థానములయందున్న కుజభుక్తిలో భూలాభము, ధనలాభము, దారాపుత్రాది సౌఖ్యము, భ్రాతృసౌఖ్యము, మనస్సంతోషము, వ్యవసాయము, విశేష ధనలాభము గలుగును.

కుజుడు నీచ అష్టమ వ్యయస్థానముల యందున్న కుజభుక్తిలో కళత్రపీడ, బంధువిరోధము, గృహనష్టము, ధనవ్యయము, సోదరహాని, దుర్వృత్తి, స్ఫోటక బాధ, వ్రణపీడ, స్థానభ్రష్టత్వము, బంధనము, శత్రువృద్ధియును గలుగును.

### 2. కుజమహాదశలో రాహుభుక్తి నాడీ లక్షణములు

రాహువు కేంద్ర లాభ త్రికోణముల యందు శుభగ్రహ సంబంధముగలిగి బలముగాయున్న రాహుభుక్తిలో సమాన లాభనష్టములు, సమాన మిత్ర శత్రువులు, శరీరపీడ గల్గి శీఘ్రమే నివారణము, ఉద్యోగము వలన ధనలాభము, ధనవ్యయము గలుగును.

రాహువు నీచ వ్యయస్థానముల యందుగాని, శత్రుక్షేత్రము నందుగాని, దశానాధుడైన కుజునకు షష్టాష్టమ వ్యయముల యందు గాని యున్న యెడల విషపీడ, శస్త్రబాధ, విదేశగమనము, మరణభయము, గోమహిష్యాది నాశనము, గర్భపాతము వల్ల స్త్రీ నాశనము, అజ్ఞానము వల్ల అపవాదము, జంతు భయము, శత్రుపీడ, చోరభయము, ఆకలిబాధ, భూతావేశము, మేహరోగబాధ, నిగళబంధనము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 3. కుజమహాదశలో గురుభుక్తి నాడీ లక్షణములు

గురుడు యుచ్చ కేంద్ర త్రికోణముల యందున్న యెడల ధనధాన్య వృద్ధియు, దాసదాసీ జనవృద్ధి, పుత్రలాభము, అన్నదానఫలము, వాహన సౌఖ్యము, ఉద్యోగాభివృద్ధి, రాజసన్మానము, కీర్తి ధనమూలకముగా ధనసంపాదనము గలుగును.

గురుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న దారాపుత్రాదులకు శరీరపీడ, ధర్మము వల్ల ధనవ్యయము, పరదేశనివాసము, శరీరపీడ, ఉద్యోగము వల్ల లాభము స్వల్పమును, ఖర్చు విశేషమును గులుగను.

### 4. కుజమహాదశలో శనిభుక్తి నాడీ లక్షణములు

కుజమహాదశలో శనిభుక్తిలో శనియుచ్చలాభకోణముల యందున్న ఉద్యోగము వల్ల ధనలాభము, సేవకావృత్తి వల్ల జీవనము, అన్యాయార్థితము, పుత్రాభివృద్ధి, భూలాభము, వాహనసౌఖ్యము, నీచప్రభు సమాగమము గలుగును.

శని లగ్నము మొదలు షష్టాష్టమ వ్యయస్థానముల యందుగాని, దశానాధుడైన కుజునికి షష్టాష్టమ వ్యయముల యందుగాని యున్న యెడల దుఃఖము, శస్త్రపీడ, బంధునాశనము, పశుక్షయము, విశేష రోగపీడ, దారాపుత్రాది నాశనము, శత్రువృద్ధి, ప్రభువులవల్ల బంధనము, పరదేశ నివాసము, ఉద్యోగ భ్రష్టత్వము, ధనహాని, మానహాని, బంధుమిత్రులతో విరోధము గలుగును.

### 5. కుజమహాదశలో బుధభుక్తి నాడీ లక్షణములు

కుజ మహాదశలో బుధుడు యుచ్చ కేంద్రకోణముల యందు బలవంతుడై యున్న లిపివిద్య, వర్తకము, శిల్పవిద్య ఈ స్వతంత్ర విద్యల వల్ల ధనార్జనము, విశేషఖ్యాతి, సోదరులు మిత్రులవల్ల సహాయము పొందుటయు, వివాదమందు పూర్ణజయము గలుగును.

బుధుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందుగాని, దశానాధుడైన కుజుని లగాయితు షష్టాష్టమ వ్యయముల యందుగాని, దశానాధుడైన కుజుని లగాయితు షష్టాష్టమ వ్యయముల యందున్న పైత్యరోగము, వ్యాపారము వల్ల ధననష్టము, శతవృద్ధి, జ్ఞాతులవల్ల బాధ, కుటుంబ కలహము, బంధుమిత్ర విరోధము గలుగును.

### 6. కుజమహాదశలో కేతుభుక్తి నాడీ లక్షణములు

కుజమహాదశలో కేతువు కేంద్ర లాభ త్రికోణముల యందున్న యెడల ఉద్యోగమువల్ల ధనలాభము, నీచులవల్ల ధనప్రాప్తి, శరీర రోగమువల్ల బాధ, శీఘ్ర నివారణము, కుటుంబమందు విరక్తి, పురాణశ్రవణము మొదలగునవి గలుగును.

కుజమహాదశలో కేతువు లగ్నము నుండి షష్టాష్టమ వ్యయములందుగాని, కుజుని లగాయితు షష్టాష్టమ వ్యయములందు దుర్బలముగా యున్న కేతుభుక్తిలో నీచులతో విరోధము, దుష్టవ్యాపారము, ధననష్టము, వాగ్దోషమువల్ల పాపవృద్ధి, ధర్మము వల్ల ధనవ్యయము, ఋణము, దారాపుత్రాదిపీడ, విశేష శత్రువృద్ధి, ప్రభువులవల్ల బంధనము, స్ఫోటకము, వ్రణము, మనోదుఃఖము, ధనవ్యయము గలుగును.

### 7. కుజమహాదశలో శుక్రభుక్తి నాడీ లక్షణములు

కుజ మహాదశలో శుక్రుడు యుచ్చ కేంద్రకోణముల యందున్న శుక్ర భుక్తిలో బంగారు ముత్యముల లాభము, సుయుక్తి, బుద్ధికౌశలత, స్త్రీ సంభోగము, ధనలాభము, రాజమూలమున ధనలాభణు, గొప్ప ప్రభు సన్మానము, దారా పుత్రాభివృద్ధి మొదలగు శుభఫలములు గలుగును.

శుక్రుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న పరదేశ నివాసము, రోగవృద్ధి, దారాపుత్ర విరోధము, వ్యవసాయమువల్ల ధనవ్యయము, స్థానభ్రష్టత్వము, దుఃఖము, నీచవృత్తివల్ల జీవనము గలుగును.

### 8. కుజమహాదశలో రవిభుక్తి నాడీ లక్షణములు

కుజ మహాదశలో రవి యుచ్చ కేంద్రకోణముల యందున్న రవిభుక్తి ఉద్యోగ లాభము, వాహన సౌఖ్యము, రాజసన్మానము వల్ల వైభవము, దారాపుత్రాదిసౌఖ్యము, బంధు మిత్రసమాగమము, గృహలాభము, భూలాభము, పశువృద్ధి, ధాన్యవృద్ధి గలుగును.

రవి నీచ షష్టష్టమ వ్యయస్థానముల యందున్నను. దశానాధుడైన కుజుని లగాయితు షష్టాష్టమ వ్యయ స్థానముల యందున్నను రవి భుక్తిలో విశేష శత్రువృద్ధి, మానహాని, దారాపుత్రాది పీడ, ఋణవృద్ధి, రోగవృద్ధి గలుగును.

### 9. కుజమహాదశలో చంద్రభుక్తి నాడీ లక్షణములు

చంద్రుడు పూర్ణచంద్రుడై యుచ్ఛ కేంద్రకోణముల యందు బలముగా యున్న వస్త్రాభరణాలంకారము, స్త్రీ సహాయమువల్ల ఉద్యోగము, జలాగ్నివల్ల ధనలాభము, దారాపుత్రాభివృద్ధి, గంగాస్నానఫలప్రాప్తి, పురాణశ్రవణము మొదలగు శుభఫలములు గలుగును.

చంద్రుడు లగ్నము లగాయితుగాని, కుజుని లగాయితుగాని, షష్టాష్టమ వ్యయస్థానముల యందును, నీచయందున్నను జలగండము వల్ల భయము, మాతృపీడ, పరదేశనివాసము, శత్రు మూలమునధనవ్యయము ఋణవృద్ధి, వ్యాపారమువల్ల నష్టము, శరీర రోగము, వాతరోగము వల్ల బాధ మొదలగు దుష్ఫలములు గలుగును.

### 4. రాహు మహాదశాఫల నాడీ లక్షణములు

శుభ రాహు మహాదశలో రాహువు యుచ్ఛ, కేంద్ర, కోణ, శుభ క్షేత్రముల యందు బలముగా యున్న రాజ్యలాభము, పుత్రలాభము, ధనధాన్యాభివృద్ధి, రాజమూలమున ధనలాభము, ప్రభావము, తీర్థయాత్రలు, పురాణ శ్రవణము, కర్మసిద్ధి, మొదలగు సుఫలములు గలుగును.

పాప రాహువు నీచ అష్టమ వ్యయములందు దుర్బలముగా యున్న రాహుదశలో దూరదేశ ప్రయాణము, దుఃఖము, అరణ్యవాసము వల్ల భయము, దారాపుత్రాది పీడ, నీచవృత్తి వల్ల జీవనము, సౌఖ్యము లేని భోజనము, సుఖములేని కళత్రము, దుష్టపుత్ర సంతానము, ఉద్యోగభంగము, విషజ్వరము, సర్పభీతి, సర్వాంగరోగము, దుఃఖము, విరోధము, వృక్షాత్పతనము, శత్రుపీడ, దేహపీడ, చోరభయము, అగ్నిభీతి, రాజులవల్ల బాధయు గలుగును. రాహుదశాప్రారంభమున దుఃఖమును, మధ్యమందు సౌఖ్యమును, కీర్తియును, అంత్యమందు స్థానభ్రష్టత్వము, గురుపిత్రాది నాశనము సంభవించును.

### 1. రాహుమహాదశలో రాహుభుక్తి నాడీ లక్షణములు

రాహు మహాదశలో రాహువు యుచ్ఛ, కోణ, లాభ, తృతీయ, షష్ట స్థానముల యందున్న రాహుభుక్తిలో ఉద్యోగము వల్ల ధనలాభము, గృహలాభము, భూలాభము, ధనవృద్ధి, పశు ధాన్యాభివృద్ధి, వ్యవసాయము వల్ల ధనార్జనము, రాజసన్మానము వల్ల ధనలాభము, బంధుమరణము మొదలగునవి గలుగును.

రాహువు నీచ అష్టమ వ్యయములందున్నను, పాపగ్రహములు కలిసినను, పాపగ్రహములచే వీక్షింపబడినను, రాహుభుక్తిలో పితృమాతృ వినాశనమును, శత్రువృద్ధి, రాజులవల్ల బంధనము, దారాపుత్రాది పీడయు, శత్రువులవల్ల ఋణమును గలుగును.

## 2. రాహుమహాదశలో గురుభుక్తి నాడీ లక్షణములు

గురుడు యుచ్చ, కేంద్ర, కోణ, ధన, లాభ, మిత్రస్థానముల యందుండి శుభగ్రహములతో కలిసినను, శుభగ్రహ వీక్షణము గలిగినను, ఉత్తమ పురుష సహవాసము, స్త్రీ పుత్రసౌఖ్యము, తీర్థస్నానఫలము, ఔదార్య సాహసములు, స్వర్ణరత్న భూషణ ధనలాభము గలుగును.

గురుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న గురుభుక్తిలో కుటుంబ కలహము, బంధుమిత్ర విరోధము, శుభకార్యముల వల్ల ధనవ్యయము, ఋణవృద్ధి, స్వల్ప దుఃఖము, స్వల్పసౌఖ్యము, పుణ్యాపాపమిశ్రమఫలములు గలుగును.

## 3. రాహుమహాదశలో శనిభుక్తి నాడీ లక్షణములు

శని యుచ్చ కోణ లాభతృతీయ షష్టముల యందుండి శుభగ్రహములతో కలిసినను, శుభగ్రహములు వీక్షించినను, గొప్పయుద్యోగము, విశేష గౌరవము, శూద్రమూలమున ధనలాభము, ఆందోళికాది వాహనసౌఖ్యము, దారాపుత్రవృద్ధి, దేహారోగ్యము, మనస్సంతోషము, యశోవృద్ధి, వ్యయసాయాభివృద్ధి, పశువృద్ధి, భూలాభము, సంతాన లాభము, భ్రాతృమాతృ సౌఖ్యము గలుగును.

శని నీచ కేంద్ర వ్యయాష్టముల యందు దుర్బలముగా యున్న శని భుక్తిలో దుఃఖము, మానభంగము, వృక్షాత్పతనము వలన భయము, దుస్సాంగత్యము, దుష్టకార్యములు, పరస్త్రీ సంభోగము, భార్యా వియోగము, కుక్షిరోగము, నేత్రరోగము, జలగండము సంభవించును.

## 4. రాహుమహాదశలో బుధభుక్తి నాడీ లక్షణములు

రాహువు మహాదశలో బుధుడు కేంద్రకోణ లాభముల యందున్న బుధభుక్తిలో వివాహాది సౌఖ్యము, వాహన సౌఖ్యము, పుత్రలాభము, ధనవృద్ధి, కుటుంబ సౌఖ్యము, బంధు సౌఖ్యము, వేశ్యా సంభోగము, అనాచారము, డాంబికము, వ్యాపారమువల్ల ధనలాభము, ఋణవిముక్తి, జ్ఞాతులవల్ల ధనలాభము మొదలగు మంచి ఫలములు గలుగును.

బుధుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న, జ్ఞాతి వృద్ధియు, వ్యాపారమువల్ల ధనవ్యయము, వ్యవసాయ వర్తకములవల్ల నష్టము, బంధు నాశనము పదభ్రష్టత్వము, మహాద్వేషము, బంధు ద్వేషమును గలుగును.

## 5. రాహుమహాదశలో కేతుభుక్తి నాడీ లక్షణములు

రాహువులో కేతువు కోణ, లాభ, తృతీయ షష్టస్థానముల యందున్న కేతుభుక్తిలో బంధు సన్మానము, వాహన సౌఖ్యము, భూలాభము, సుగంధపరిమళ ద్రవ్యప్రాప్తి, పశువృద్ధి, వ్యవసాయము, భూములవల్ల ధనలాభము, విద్యాభివృద్ధి, బంధుస్నేహము మొదలగునవి గలుగును.

కేతువు ధన, సప్తమ, అష్టమ వ్యయస్థానములందుండి పాప గ్రహములతో కలిసినను, వీక్షించబడినను కేతుభుక్తిలో సంతాన వాచారము, మిత్రనష్టము, కళత్ర పీడ, గొప్ప అపత్తు, రాజులవల్ల చోరులవల్ల ధననాశము, బంధునష్టము, వ్యాధి,

శిరో రోగము నేత్రరోగము, మూలవ్యాధి, ఉద్యోగ భంగము, స్థానచలనము, ఆకస్మిక విరోధము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 6. రాహుమహాదశలో శుక్రభుక్తి నాడీ లక్షణములు

రాహువులో శుక్రుడు కేంద్రకోణ లాభస్థానములయందు బలముగా యున్న భూలాభము, పుత్రసౌఖ్యము, శుభకార్యములు, పశువృద్ధి, ధనధాన్యాభివృద్ధి, గొప్ప ఉద్యోగప్రాప్తి, వాహన సౌఖ్యము గలుగును.

రాహువులో శుక్రుడు నీచయందుగాని, లగ్నము లగాయితు గాని, రాహువులగాయితుగాని షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న శుక్రభుక్తిలో అనారోగ్యము, అమర్యాద, రాజచోర అగ్నివల్ల బాధ, ఉద్యోగభంగము, దుఃఖము, కళత్ర పుత్ర విచారము, విశేష శత్రు వృద్ధి, ఋణవృద్ధి, శరీరపీడ మొదలగు దుష్ఫలములు గలుగును.

### 7. రాహుమహాదశలో రవిభుక్తి నాడీ లక్షణములు

రాహువులో రవి కేంద్రకోణ లాభస్థానములయందున్న రవిభుక్తిలో దారా పుత్రాది సౌఖ్యము, రాజులవల్ల ధనలాభము, రాజ్యలాభము, వస్త్రవాహనాలంకార ప్రాప్తి గలుగును.

రవి నీచయందుగాని, లగ్నమునుండిగాని, రాహువునుండిగాని, షష్టాష్టమ, వ్యయస్థానముల యందున్న, రవిభుక్తిలో యుష్ణజ్వరము వలన సంతాపము, శిరో భ్రమణము, భయము, జనవిరోధము, నేత్రరోగము, మహభయము, స్థాన భ్రష్టత్వము, పరదేశ నివాసము, గురుపిత్రాధినాశనము, విశేషశత్రువృద్ధి, ధననష్టము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 8. రాహుమహాదశలో చంద్రభుక్తి నాడీ లక్షణములు

రాహుమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు యుచ్చకేంద్ర త్రికోణముల యందున్న జలయానమువల్ల ధనలాభము, క్షేత్రవృద్ధి, వాహన సౌఖ్యము, కళత్ర సౌఖ్యము, సంతానవృద్ధి, రాజ్యలాభము, ధనవృద్ధి, స్వకర్మ చేయుట, శాంతము, దానధర్మములు మొదలగు శుభఫలములు గలుగును.

రాహుమహాదశలో చంద్ర భుక్తియందు చంద్రుడు నీచయందు గాని, లగ్నము నుండిగాని, రాహువు నుండిగాని, షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న వ్యవసాయము వల్ల నష్టము, ఋణవృద్ధి, వర్తకము వల్ల నష్టము, దారాపుత్రులకు శరీరపీడ, భూనాశనము, పశునష్టము గలుగును.

### 9. రాహుమహాదశలో కుజభుక్తి నాడీ లక్షణములు

రాహు మహాదశలో కుజభుక్తియందు కుజుడు యుచ్చ, లాభ, కోణ, తృతీయ షష్టస్థానముల యందుగాని, శుభగ్రహములతో కలసినను, వానిచే వీక్షింపబడినను రాజ పూజ్యత, పుత్రసంతాన లాభము, విద్యాభివృద్ధి, వాహనసౌఖ్యము, అలంకార ప్రాప్తి, భోజన సౌఖ్యము, వస్త్రలాభము, వ్యవసాయమువల్ల ధనలాభము మొదలగునవి గలుగును.

కుజుడు నీచయందుగాని, లగ్నమునుండిగాని, రాహువు నుండిగాని, షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న గృహక్షేత్ర నాశనము, రాజ చోరాగ్నిపీడ, మనో వికలత్వము, సోదరనష్టము, స్ఫోటక క్షయ బాధ, విశేష శరీర పీడ, శత్రు వృద్ధి, రాజుల వల్ల బంధనము, కారాగృహప్రవేశము, కళత్ర విచారము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 5. గురుమహాదశాఫల నాడీ లక్షణములు

గురుడు శుభుడై కేంద్రకోణములయందు బలముగాయున్న దారా పుత్రాదుల సౌఖ్యము, గ్రామాధికారము, జనపాలత్వము, అశ్వాధియాన లాభము, పుణ్య కార్యములు, సుజనసహవాసము, సాధు జనవిద్యా ప్రసంగము, ధనకనక సమృద్ధి, ధాన్య వృద్ధి, పశువృద్ధి మొదలగు సత్ఫలములు గలుగును.

గురుడు పాపుడై షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న గురుమహాదశలో ధనవ్యయము, పశునష్టము, రాజభయము, అతివ్యాధి, ధైర్యహాని, ధాన్యనాశనము, బ్రహ్మ ద్వేషము, పితృదుఃఖము, క్రోధము, అన్నాభావము, వ్యవసాయమువల్ల నష్టము, భూవ్యయము, బంధువిరోధము, భూవివాదము, మనోదుఃఖము, రోగ భయము, విదేశవాసము, కష్టము, సమస్తదుఃఖము గలుగును.

### 1. గురుమహాదశలో గురుభుక్తి దశాఫలనాడీ లక్షణములు

గురుమహాదశలో గురుభుక్తియందు గురుడుకేంద్రకోణ, యుచ్చ, ద్వితీయ లాభస్థానముల యందుండి శుభగ్రహములతో కలసినను, శుభగ్రహములచేత చూడ బడినను, రాజ్యలాభము, మనోత్సాహము, వస్త్రవాహనభూషణప్రాప్తి, విదేశయానము వల్ల ధనలాభము యశోవృద్ధి, విద్యయందు జయము, సౌఖ్యము, దారా పుత్రాదుల తో సౌఖ్యము, రాజసన్మానము గలుగును.

గురుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందు దుర్బలుడై యున్న గురు భుక్తిలో విశేష దుఃఖము, రాజులవల్ల ధననష్టము, ఉద్యోగ భంగము, దుఃఖము, ధనధాన్య నాశనము, కుటుంబ కలహము, దారాపుత్రుల శరీరపీడ గలుగును.

### 2. గురుమహాదశలో శనిభుక్తి దశాఫలనాడీ లక్షణములు

గురు మహాదశలో శని భుక్తియందు శని యుచ్చ కేంద్ర కోణ తృతీయ షష్టలాభముల యందు బలముగాయున్న యెడల శరీరారోగ్యాభివృద్ధి, రాజపూజ్యత, కృషివల్ల లాభము, స్థలవృద్ధి, ధాన్యవృద్ధి, బంధు దారాపుత్ర సౌఖ్యము, అలంకారప్రాప్తి, ఉద్యోగాభివృద్ధి, మొదలగు సత్ఫలములు గలుగును.

శని నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న కామక్రోధములవల్ల దుఃఖము, తాపత్రియమువల్ల భయము, బంధు మిత్ర విరోధము, వ్యభిచారమువల్ల రోగము, అధర్మ ప్రవర్తన, ధనహాని, గ్రామాధిపత్యము, అబద్ధసాక్ష్యము, కుటుంబకలహము, గృహనాశనము, మనోదుఃఖము, శత్రువృద్ధి, కారాగృహ ప్రవేశము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 3. గురుమహాదశలో బుధభుక్తి దశాఫలనాడీ లక్షణములు

గురు మహాదశలో బుధభుక్తియందు బుధుడు యుచ్ఛ కేంద్రకోణముల యందు బలముగాయున్న కుసుమ శయనము, వస్త్రాలంకారము, భూలాభము, కుటుంబ సౌఖ్యము, ఔదార్యము, శుభకార్యములు, సమస్త విద్యలయందు నేర్పరితనము, గణితము, వ్యవసాయమువల్ల ధనలాభము, వైశ్యుల ధనమువల్ల భోగము, బహుజన స్నేహము, వాహనము, గౌరవము గలుగును.

బుధుడు నీచయందుగాని లగ్నమునుండి లేక దశానాధుడైన గురుని స్థానమునుండి షష్టాష్టమ వ్యయస్థానములయందు దుర్బలముగా యున్న యెడల బుధభుక్తిలో ఉత్సాహభంగము, పశునష్టము, భూవ్యయము, సువర్ణ వస్త్రనాశనము, స్థానభ్రష్టత్వము, ద్వేషము, విద్యావిఘ్నము, వ్యవసాయ నష్టము, వర్తకమువల్ల నష్టము, బంధు నష్టము, దుఃఖము, దాసదాసీ జననష్టము, దారాపుత్రపీడ మొదలగు దుష్ఫలములు గలుగును.

### 4. గురుమహాదశలో కేతుభుక్తి దశాఫలనాడీ లక్షణములు

గురు మహాదశలో కేతు భుక్తియందు కేతువు తృతీయ షష్టలాభముల యందున్న యెడల కేతుభుక్తిలో వ్యవసాయము, పశువృద్ధి, భూ లాభము, విద్యాభివృద్ధి, బంధువులతో స్నేహము, భోజన సౌఖ్యము, వస్త్ర సౌఖ్యము, బంధు గౌరవము, దారాపుత్రాదుల సౌఖ్యము, విశేష పుణ్యకర్మలు గలుగును.

గురు మహాదశలో కేతువు అష్టమ వ్యయములందున్న కేతుభుక్తిలో స్థాన భ్రష్టత్వము, పరదేశనివాసము, రాజులవల్ల బాధ, నేత్రరోగము, గురునివల్ల ఆపత్తు, పుణ్యకర్మ విఘ్నము, ధర్మమువల్ల ధనవ్యయము, ఋణవృద్ధియు గలుగును.

### 5. గురుమహాదశలో శుక్రభుక్తి దశాఫలనాడీ లక్షణములు

గురుమహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు యుచ్ఛ, కేంద్ర, కోణ, ద్వితీయ, లాభముల యందుగాని, శుభగ్రహ సంబంధముగాని వీక్షణముగాని యున్న శుక్రభుక్తిలో రాజ్యలాభము, రాజసన్మానము, వస్త్రవాహనాలంకారము, సంతోషము, యశోవృద్ధి, స్త్రీ పుత్ర ధనసంపత్తు, ఉత్తర ఖండమందు భాగ్యము, మనోధైర్యము, రాజానుగ్రహము, ఉద్యోగ ప్రాప్తియు గలుగును.

శుక్రుడు నీచ షష్టాష్టమ వ్యయములయందు దుర్బలముగా యున్న శుక్రభుక్తిలో ఉద్యోగ భంగము, దుఃఖము, ధన ధాన్యనాశనము, స్థానభ్రష్టత్వము, కళత్రపీడ, భూవివాదము, బంధునష్టము, పుత్రవిచారము, రోగవృద్ధి, ఋణవృద్ధి మొదలగు దుష్ఫలములు గలుగును.

### 6. గురుమహాదశలో రవిభుక్తి దశాఫలనాడీ లక్షణములు

రవి యుచ్ఛ, కేంద్ర, కోణ, లాభ, శుభ, మిత్రస్థానములయందున్నను, శుభగ్రహములతో కలసినను లేక వీక్షింపబడినను ధనలాభము, రాజసన్మానము, దారాపుత్రాదులు రాజులవల్ల ప్రేమ, ప్రయాసముచేత శత్రుజయము, చిరకాలభోగము గలుగును.

గురుమహాదశ రవిభుక్తిలో రవి నీచ షష్టాష్టమ వ్యయములయందు దుర్బలముగా యున్న రాజశత్రు భయము, దుఃఖము, ధనహాని, శత్రుపీడ, పిత్తజ్వరము, శిరోరోగము, నేత్రరోగము గలుగును.

**7. గురుమహాదశలో చంద్రభుక్తి దశాఫలనాడీ లక్షణములు**

చంద్రుడు యుచ్ఛ కేంద్ర కోణములయందు బలముగాయున్న ఉత్తమ స్త్రీలతో భోగము, మంచి వస్త్రానుభవము, భోజనసౌఖ్యము, వ్యాపారమువల్ల లాభము, స్త్రీ సంతానవృద్ధి, శరీరారోగ్యము, ధనవృద్ధి, వాహన సౌఖ్యము, అలంకారప్రాప్తి, మాతృసౌఖ్యము, మనస్సంతోషము, దారాపుత్రాభివృద్ధి గలుగును.

చంద్రుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానములయందున్న చంద్ర భుక్తిలో వ్యవసాయ నష్టము, ధాన్యహాని, మాతృనష్టము, ధనవ్యయము, చర్మవ్యాధి, విషభీతి, చోరభయము, పుత్రమిత్ర నష్టము, భార్య బంధువిరోధము గలుగను.

**8. గురుమహాదశలో కుజభుక్తి దశాఫలనాడీ లక్షణములు**

గురుమహాదశలో కుజభుక్తియందు కుజుడు యుచ్ఛ, తృతీయ, షష్ట, లాభముల యందుగాని శుభగ్రహ సంబంధము గలిగిని వ్యవసాయము, పశువృద్ధి, భూలాభము, దేవస్థాన, గురుస్థాన, రాజసంస్థాన, గజ, ఛత్ర, అశ్వము, దాస దాసీజనులు మొదలగు వానివల్ల బిరుదాంకితములును, ప్రభుత్వ జన సన్మానము, శౌర్యము, సాహసము, మంచి వృత్తివల్ల ధనలాభము, సోదరసౌఖ్యము గలుగును.

కుజుడు నీచ అష్టమ వ్యయ కేంద్రకోణముల యందు దుర్బలముగా యున్న కుజభుక్తిలో భ్రాతృనష్టము, గృహ నష్టము, భూవ్యయము, స్ఫోటకము, వ్రణబాధ, ఉద్యోగభంగము, దుఃఖము, వ్యవసాయమువల్ల ధనవ్యయము, దారాపుత్ర నష్టము, కారాగృహ ప్రవేశము గలుగును.

**9. గురుమహాదశలో రాహుభుక్తి దశాఫలనాడీ లక్షణములు**

గురుమహాదశలో రాహుభుక్తి యందు రాహువు యుచ్ఛ తృతీయ షష్టలాభముల యందుగాని యుండి శుభ గ్రహ సంబంధముగాని వీక్షణముగాని యున్న రాహు భుక్తిలో గృహలాభము, భూవృద్ధి, రాజసన్మానము, భార్యాపుత్రుల సౌఖ్యము, ఉద్యోగము వల్ల ధనలాభము, బంధుమిత్రులతో · స్నేహవృద్ధియు గలుగును.

రాహువు కేంద్రకోణ అష్టమ వ్యయస్థానముల యందుండి పాపగ్రహములతో కలసినను వీక్షింపబడినను, అసౌఖ్యభోజనము, జీర్ణవస్త్రము, స్థానభ్రష్టత్వము, రాజభయము, కృషి పశు భూ వస్త్రబంధు సంతాన ధననాశము, శత్రువృద్ధి, శరీరపీడ గలుగును.

**6. శని మహాదశాఫల నాడీ లక్షణములు**

శని శుభుడై యుచ్ఛ తృతీయ షష్ట లాభముల యందుగాని కోణములయందుగాని యున్నయెడల శనిమహాదశలో రాజసన్మానము, ధనలాభము, దేశాధిపత్యము, గ్రామాధిపత్యము, బంధు దారాపుత్ర శరీరారోగ్యము, అలంకారము, శత్రునష్టము, మనోత్సాహము, ధన ధాన్యాభివృద్ధి, వైభవము, ప్రజ్ఞ, యజ్ఞ, క్షేత్ర, గ్రామ, పురాధిపత్యము, వ్యాపారలాభము గలుగును.

పాపశని నీచ కేంద్రవ్యయ అష్టమ ద్వితీయమందుగాని యున్న శని మహాదశలో గృహనష్టము, భూవ్యయము, విషప్రయోగము, ధనహాని, దేహబాధ, రాజక్రోధము, విరుద్ధకార్యము, వాతోద్రేకము, రోగబాధ, స్థానభ్రష్టత్వము, పరదేశనివాసము, శరీరపీడ, విశేష శత్రువృద్ధి, నీచవృత్తివల్ల జీవనము, దారాపుత్ర శరీరపీడ, కారాగృహ ప్రవేశము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 1. శనిమహాదశలో శనిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శనిమహాదశలో శనిభుక్తియందు శని యుచ్చ, షష్ఠ, తృతీయ, లాభస్థానముల యందున్న రాజసన్మానము, పరోపకారము, రాజులవల్ల భాగ్యము, నల్లధాన్యము, వ్యవసాయమువల్ల లాభము, జనాధిపత్యము, సుఖభోజనము, కళత్ర మిత్రసౌఖ్యము గలుగును.

శని నీచ అష్టమ వ్యయ కేంద్రకోణముల యందుండి పాపగ్రహములతో కలసినను, చూడబడినను, స్థానభ్రష్టత్వము, పరదేశ నివాసము, మాతృనష్టము, కళత్ర నష్టము, సంతాన విచారము, పితృమాతృ విరోధము, నీచస్త్రీ సంగమము, శరీరవ్యాధి సంభవించును.

### 2. శనిమహాదశలో బుధభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శని మహాదశలో బుధభుక్తిలో బుధుడు, యుచ్చ కేంద్రకోణ లాభమందున్నను శుభరాశియందున్నను, శుభగ్రహములతో కలిసినను వీక్షింపబడినను శాశ్వతమైన పుణ్యకర్మలు జేయుట, పశువృద్ధి, వ్యవసాయాభివృద్ధి, భూలాభము, మనోధైర్యము, సంతోషము, విదేశ వస్తులాభము, యజ్ఞము, వివాహము, పురాణ శ్రవణము, బంధుపూజ్యత, ధనార్జనము మొదలగు సుఫలములు గలుగును.

శని మహాదశలో బుధభుక్తిలో బుధుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందున్న చోర శత్రు అగ్నివల్ల భయము, నీచస్త్రీ గృహనివాసము, కర్మహీనము, వ్యవసాయము వల్ల నష్టము, వ్యాపారమువల్ల ధనవ్యయము, శత్రువృద్ధి, ఋణము, రోగము గలుగును.

### 3. శనిమహాదశలో కేతుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శని మహాదశలో కేతుభుక్తిలో కేతువు తృతీయ షష్టలాభములయందుండి శుభగ్రహములతో కలసినను లేక వీక్షింపబడినను, సౌఖ్యము, దారాపుత్రుల అభివృద్ధి, వాహనసౌఖ్యము, భూలాభము, బంధుపూజ్యత, తీర్థయాత్రాది లాభము, పుణ్యకర్మలు జేయుట మొదలగు సత్ఫలములు గలుగును.

కేతువు అష్టమ వ్యయధన కేంద్రకోణముల యందుండి పాపగ్రహములతో కలసినను, వీక్షింపబడినను, కేతుభుక్తిలో వాత పిత్త అగ్నిబాధయు, దారాపుత్ర విరోధము, స్థానభ్రష్టత్వము, మనోదుఃఖము, రోగవృద్ధి, కుటుంబ బంధువులతో ఆకస్మిక కలహము గలుగును.

### 4. శనిమహాదశలో శుక్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శనిమహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు యుచ్చ కేంద్రకోణ ధనలాభ స్థానముల యందుండి శుభగ్రహములతో కలసినను, వీక్షింపబడినను, పశువృద్ధి,

భూలాభము, ధనలాభము, పుత్రవృద్ధి, కళత్ర సౌఖ్యము, సంపత్తు, వ్యవసాయము వల్ల ధనలాభము, దూరదేశము నుండి ధనాగమము, రాజసన్మానము ఉద్యోగాభివృద్ధి గలుగును.

శుక్రుడు నీచయందుగాని, లగ్నమునుండి లేక దశానాధుడైన శని స్థానము నుండి షష్టాష్టమ వ్యయస్థానములయందు దుర్బలముగా యున్న శుక్రభుక్తిలో ఉద్యోగ భంగము, దుఃఖము, భార్యాపుత్రుల యొక్క నాశనము, ఋణవృద్ధి, వ్యవసాయ నష్టము, చోరాగ్ని బాధ, శరీరపీడ, బంధునష్టము, గొప్ప దుఃఖము, ధనధాన్య నాశనము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 5. శనిమహాదశలో రవిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

రవి తృతీయ షష్ట లాభముల యందున్న ఆరోగ్యము, ధనలాభము, గౌరవము, పితృసౌఖ్యము, నేత్రసౌఖ్యము, వాహనసౌఖ్యము, రాజసన్మానము మొదలగునవి గలుగును.

రవి కేంద్ర కోణ నీచ అష్టమ వ్యయముల యందున్నను పాపగ్రహములతో కలసియున్న రాజ శత్రుభయము, మృత్యుభయము, ధనహాని, పితృపీడ, పిత్త జ్వరము, శిరోరోగము, ప్రవాసము, ఉదరరోగము, బంధుహాని, యుద్ధము, దారిద్ర్యము, మానహాని, కారాగృహ ప్రవేశము గలుగును.

### 6. శనిమహాదశలో చంద్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

చంద్రుడు కేంద్రకోణ లాభస్థానముల యందున్న ఆరోగ్యము, ధనసంపత్తి, భూషణము, వాహనము, మిత్రుల అభివృద్ధి, వర్తక వ్యవసాయాభి వృద్ధియును గలుగును.

చంద్రుడు నీచ షష్టాష్టమ వ్యయములయందు దుర్బలముగా యున్న వ్యవసాయము వల్ల నష్టము, ధాన్యహాని, మలినవస్త్రములు, అసౌఖ్య భోజనము, మాతృపితృ పీడ, స్వజన విరోధము గలుగును.

### 7. శనిమహాదశలో కుజభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కుజుడు తృతీయ అష్టమ లాభస్థానముల యందున్న భూలాభము అధిక ఆరోగ్యము, విజయము, ధనలాభము, భ్రాతృసౌఖ్యము, బలము, మానము, శుభ కార్యము, భూలాభము, బంధుమిత్ర సమాగమము కుజభుక్తిలో కొంతవరకు గలుగును.

కుజుడు నీచ అష్టమ వ్యయకేంద్ర కోణముల యందున్న మేహవాతరోగము, దుఃఖము, దేశాటము, విశేషశ్రమ, స్వల్పధనలాభము, కళత్ర విచారము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 8. శనిమహాదశలో రాహుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

రాహువు తృతీయ షష్ట లాభముల యందున్న స్వల్పసౌఖ్యము, స్వల్ప ధనము, స్వల్పకీర్తి, వస్త్ర వాహన భూషణలాభము, భూషణక్రయ విక్రయములు గలుగును.

రాహువు నీచ కేంద్ర కోణ అష్టమ వ్యయముల యందున్న గృహము దగ్ధమగుట, నేత్రరోగము, దారాపుత్రాది భయము, స్థానభ్రష్టత్వము, మనోదుఃఖము, అనాచారము గలుగును.

### 9. శనిమహాదశలో గురుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

గురుడు యుచ్చ కేంద్ర కోణ ధనలాభమస్థానముల యందన్న కళత్ర సౌఖ్యము, దేవబ్రాహ్మణ పూజ, దారాపుత్ర సౌఖ్యము, రాజ సన్మానము, జయము మొదలగు సత్ఫలములు గలుగును.

గురుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందున్న ధర్మక్షయము, విత్తహాని, గ్రామాధి కారము, అపసాక్ష్యము, కుటుంబ కలహము, మహాదుఃఖము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 7. బుధమహాదశాఫల నాడీ లక్షణములు

బుధుడు శుభుడై కేంద్రకోణధనలాభ శుభస్థానముల యందు గాని శుభగ్రహముతో కలసినను వీక్షింపబడినను బుధమహాదశలో ఆరోగ్యము, భూషణలాభము, బంధులాభము, జయము, మంచి వస్త్రము, వాహనము, గృహము, ధనధాన్యలాభము, కుటుంబవృద్ధి, వర్తకమువల్ల ధనలాభము, పుత్రోత్పత్తి గీతాది మహోత్సవములు గలుగును.

బుధుడు పాపుడై నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందుండి పాపగ్రహములతో కలిసియున్న వాతపైత్యము, వ్యవసాయమువల్ల ధనవ్యయము, ఋణవృద్ధి, శత్రువృద్ధి, విదేశప్రయాణము, మనోదుఃఖము, బంధుక్షయము, అజ్ఞానము, వ్యాపార నష్టము, కలహము, ధనక్షేత్రనాశనము, రోగవృద్ధి, కష్టమువల్ల ధనలాభము, చిరకాలమునకు భోగము గలుగను.

### 1. బుధ మహాదశలో బుధభుక్తి దశాఫల నాడీ లక్షణములు

బుధుడు కేంద్రకోణ లాభ ధనయుచ్చ స్థానములయందును, శుభగ్రహములతో కలసినను, వీక్షింపబడినను వర్తక వ్యవసాయము వల్ల ధనలాభము, బంధుమిత్ర సమాగమము, గణిత శిల్పవిద్యయందు నేర్పరితనము, పుత్ర కళత్రవృద్ధి గలుగును.

బుధుడు షష్టాష్టమ వ్యయ నీచ,థానమున యందున్న పుత్ర కళత్ర ధనపీడ, రోగోత్పత్తి, విశేషభయము, కుటుంబ కలహము, బుద్ధినాశనము, ధనవ్యయము గలుగును.

### 2. బుధ మహాదశలో కేతుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతువు కేంద్రకోణములు యుచ్చస్థానముల యందున్న యెడల స్వల్ప దుఃఖము, స్వల్ప సౌఖ్యము, శత్రు మిత్ర స్నేహము, వర్తక వ్యాపారమువల్ల సామాన్య ధనలాభము, ధర్మమూలముగా ధనవ్యయము గలుగును.

కేతువు షష్టాష్టమ వ్యయముల యందున్న పుత్రమిత్రాది మరణము, పితృనాశము, స్థానముకొరకు కలహము, బంధు మిత్ర విరోధము గలుగును.

### 3. బుధ మహాదశలో శుక్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శుక్రుడు యుచ్చ కేంద్ర కోణముల యందున్న రాజసన్మానము, ధనలాభము, పుత్రలాభము, స్త్రీధన లాభము, వస్త్ర వాహన భూషణ ప్రాప్తి, దేహారోగ్యము, సౌఖ్యము గలుగును.

శుక్రుడు నీచషష్టాష్టమ వ్యయస్థానముల యందున్న యుద్యోగభంగము, మనఃక్లేశము, బంధుజన నాశనము, భూవివాదము, స్థానభ్రష్టత్వము గలుగును.

### 4. బుధ మహాదశలో రవిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

రవి యుచ్చ కేంద్రకోణముల యందున్న ధైర్యము, ధనలాభము, సంతాన సౌఖ్యము, యుద్ధమందు జయము, విద్యాలాభము, రాజులవల్ల సంతోషము, వస్త్ర వాహనాలంకార ప్రాప్తియు గలుగును.

రవి నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న వాక్పారుష్యము, మనోదుఃఖము, నేత్రరోగము, విశేషభయము, పితృనష్టము, శత్రువృద్ధి, చోరపీడయును గలుగును.

### 5. బుధ మహాదశలో చంద్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

చంద్రుడు కేంద్రకోణ లాభస్థానముల యందున్న పుత్ర కళత్ర వృద్ధి, మాతృసౌఖ్యము, మనోత్సాహము, వస్త్ర వాహనాలంకారప్రాప్తి, ధర్మము, యజ్ఞము, వివాహ సౌఖ్యము, రాజ్యలాభము, ధనసంపదయు గలుగును.

చంద్రుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న మాతృసౌఖ్యపీడయును, వ్యవసాయ నష్టము, గోభూనష్టము, వ్యాపారము వల్ల ధన నష్టము, గృహ దారార్థ నాశనము గలుగును.

### 6. బుధ మహాదశలో కుజభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కుజుడు లాభకేంద్రకోణముల యందున్న భ్రాతృసౌఖ్యము, మనోత్సాహము, విద్యావాహన భూషణ సౌఖ్యము, భూలాభము, ధనలాభము, రాజసన్మానము, వైభవము గలుగును.

కుజుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న గృహనాశనము, భూనాశనము, భ్రాతృనాశనము, పూర్వవిత్తనాశనము, రాజమూలమున ధనవ్యయము గలుగును.

### 7. బుధ మహాదశలో రాహుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

రాహువు తృతీయ షష్టమ లాభస్థానముల యందున్న యుద్యోగమువల్ల ధనలాభము, భూలాభము, గృహలాభము, వర్తకవ్యాపారమువల్ల ధనలాభము, రాజమూలముగా ధనలాభము గలుగును.

రాహువు నీచ కేంద్రకోణ వ్యయ అష్టమస్థానముల యందున్నను పాపగ్రహములతో కలసినను, వీక్షింపబడినను, విశేషదుఃఖము, ఋణశత్రు రోగవృద్ధియు, కారాగృహ ప్రవేశము గలుగును.

### 8. బుధ మహాదశలో గురుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

గురుడు కేంద్రకోణ లాభస్థానముల యందున్న విదేశ వ్యాపారమువల్ల ధనలాభము, కీర్తి, విద్య, జయము, సుఖము, దేశాధిపత్యము, మంత్రిత్వము, దారాపుత్రాది సౌఖ్యము, న్యాయముగా ధనలాభము గలుగును.

గురుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న పాపగ్రహసంబంధము వీక్షణము గలిగియున్నను రాజభయము, అతివ్యాధి, ధైర్యహాని, ధాన్య నాశనము, బ్రహ్మద్వేషము, పితృదుఃఖము, క్రోదము, అన్నాభావము, దుఃఖము గలుగును.

### 9. బుధ మహాదశలో శనిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శని తృతీయ షష్ట లాభమందున్న రాజ్యపూజ్యము, వ్యవసాయమువల్ల లాభము, భూషణలాభము, బంధుమిత్ర సౌఖ్యము, ధనలాభము గలుగును.

శని కేంద్ర కోణ అష్టమస్థానమునందున్నగుల్మవ్యాధి, శూలవ్యాధి, పరులవల్ల అపవాదము, బంధుమరణము, ధననాశనము, యుద్యోగ భంగము, దుఃఖము, ధన ధాన్య వినాశనము గలుగును.

### 8. కేతు మహాదశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో శుభుడైన కేతువు తృతీయ షష్ట లాభస్థానముల యందున్న విశేష సుఖము, భ్రాతృవర్గాది సౌఖ్యము, యుజ్ఞదానాధివృద్ధి, రాజ్యలాభము, ధన లాభము, గృహలాభము, రాజపూజ్యతయు, యశస్సు, జయము, క్రూరకార్యమువల్ల ధనప్రాప్తి, తురుష్కరాజ సన్మానము, కవిత్వారంభము, శత్రునాశనము గలుగును.

పాపకేతువు కేంద్ర కోణ అష్టమ వ్యయస్థానముల యందున్న స్ఫోటకము, విషభయము, బంధుహాని, ధనవ్యయము, దౌర్జన్యము, నీచవ్యాపారము వల్ల జీవనము అతికష్టము, ఫలశూన్యము, నిష్ప్రయోజనమైన పనులు, ఉద్యోగహాని, ఆస్తి నష్టము, జ్వరము, బ్రహ్మద్వేషము, పిశాచబాధ, మూఢత్వముతో పనులు జేయుట మొదలగునవి గలుగును.

### 1. కేతు మహాదశలో కేతుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతువులో కేతుభుక్తియందు కేతువు తృతీయ షష్టలాభముల యందున్న జ్ఞానము, ఈశ్వరభక్తి, రోగ దుఃఖవిముక్తియు గలుగును.

కేతువు అష్టమ వ్యయములందున్న శరీరపీడ, స్థానభ్రష్టత్వము, ధననష్టము, ఉద్యోగభంగము, దుఃఖము, కారాగార ప్రవేశము గలుగును.

### 2. కేతు మహాదశలో శుక్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో శుక్రభుక్తియందు శుక్రుడు యుచ్చ కేంద్రకోణములందు బలముగా యున్న భూలాభము, ధనలాభము, పుత్రలాభము, వాహనాలంకార ప్రాప్తి, విద్యాలాభము, యశోవృద్ధి, గృహములో కళ్యాణము మొదలగు సత్ఫలములు గలుగును.

శుక్రుడు నీచ షష్టాష్టమ వ్యయముల యందున్న పుత్ర కళత్రపీడ, దేహపీడ, ధన వ్యయము, రాజకార్యముల వల్ల విరోధము, ధర్మమూలమున ధనవ్యయము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 3. కేతు మహాదశలో రవిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో రవిభుక్తియందు రవి యుచ్ఛ తృతీయ షష్ఠ లాభముల యందున్నను శుభగ్రహములతో కలసినను వీక్షింపబడినను వస్తు వాహనాలంకార ప్రాప్తి, ధనలాభము, రాజసన్మానము, దారాపుత్రాభివృద్ధియు గలుగును.

కేతువులో రవి నీచ అష్టమ వ్యయములందున్న యెడల పాపులతో కలసినను, వీక్షింపబడినను అన్యాయముగా ధనవ్యయము, జ్వరాతిసారమువల్ల బాధ, మేహపైత్యవ్యాధి, ఉద్యోగభంగము దుఃఖము, రాజబంధనము మొదలగు దుష్ఫలితములు గలుగును.

### 4. కేతు మహాదశలో చంద్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు యుచ్ఛ కేంద్రకోణముల యందుండి శుభగ్రహములతో కలసినను, వీక్షింపబడినను, దేహారోగ్యము, రాజువల్ల సంతోషము, వస్తువహనాలంకార ప్రాప్తి, పుత్ర కళత్ర సంపత్తు, వ్యాపారలాభము గలుగును.

చంద్రుడు నీచ షష్టాష్టమ వ్యయములందున్నను, పాపగ్రహములందు కూడినను వీక్షింపబడినను, మాతృసౌఖ్య హీనము, వర్తక వ్యాపారమువల్ల ధనవ్యయము, ఋణవృద్ధి, రోగవృద్ధి, శత్రువృద్ధియు గలుగును.

### 5. కేతు మహాదశలో కుజభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో కుజభుక్తి యందు కుజుడు యుచ్ఛ తృతీయ షష్ఠ లాభశుభస్థానముల యందుండి శుభగ్రహముతో గూడినను వీక్షింపబడినను భ్రాతృ సౌఖ్యము, మనస్సునకు యుత్సాహము, భూసంపాదన, భోజనసౌఖ్యము, మంచి వస్తువులు, వ్యవసాయలాభము, వాహన లాభము, భూషణములు గలుగును.

కుజుడు నీచ కేంద్రకోణముల యందున్న దుష్టునివల్ల ధనలాభము, సర్పపీడ, మృత్యుభయము, బంధనప్రాప్తి, పరదారలవల్ల ఆపత్తు మూత్రరోగము, కలరా, విశేష కష్టములు, ధనవ్యయము గలుగును.

### 6. కేతు మహాదశలో రాహుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

రాహువు తృతీయ షష్ట లాభస్థానముల యందున్న యుత్తమసహవాసము, పుత్ర కళత్రసౌఖ్యము, తీర్థయాత్రలు, . సాహసము, సువర్ణ రత్నాధి భూషణములు గలుగును.

రాహువు అష్టమ కేంద్రకోణ వ్యయస్థానముల యందుండి పాపగ్రహములతో గూడినను వీక్షింపబడినను రాహుభుక్తియందు ఉద్యోగభంగము, దేహపీడ, నీచ జీవనము, శత్రువృద్ధి, కారాగృహ ప్రవేశము మొదలగు దుష్ఫలితములు గలుగును.

### 7. కేతు మహాదశలో గురుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో గురుభుక్తి యందు గురుడు యుచ్ఛ కోణ ద్వితీయ లాభస్థానముల యందుండి శుభగ్రహములతో గలసినను, వీక్షింపబడినను వివాహము, భూలాభము, శత్రునాశనము, శివార్చనము, పుత్రోత్పత్తి, విశేషకీర్తి, రాజసన్మానము, వైభవముగలుగును.

గురుడు షష్టాష్టమ వ్యయ నీచ స్థానముల యందున్న కర్మనాశనము, స్థానభ్రష్టత్వము, మాతృనాశనము, దారాపుత్రాది పీడగలుగును.

### 8. కేతు మహాదశలో శనిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో శని భుక్తి యందు శని తృతీయ షష్ట లాభ స్థానముల యందున్న దేహబ్రహ్మణ భక్తి, పుత్ర కళత్ర సౌఖ్యము, వస్త్రవాహన సౌఖ్యము, స్త్రీ పుత్రులవల్ల ధనలాభము గలుగును.

శని నీచ అష్టమ వ్యయ కేంద్ర కోణముల యందుగాని పాపగ్రహములతో కలసినను, వీక్షింపబడినను మూలరోగము, విషబాధ, జ్వరము, అగ్నిభయము, రాజభయము, ఆప్తబంధు మరణము, ఉద్యోగ భ్రష్టత్వము, మనోదుఃఖము, గొప్ప కష్టము, స్థాననాశనము ధనక్షయము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 9. కేతు మహాదశలో బుధభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతుమహాదశలో బుధభుక్తియందు బుధుడు యుచ్ఛ కేంద్రకోణముల యందున్న యెడల ఆరోగ్యము, విశేష సౌఖ్యము, వర్తక వ్యాపారము, ధనలాభము, పుత్రకళత్ర సౌఖ్యము, పురాణ శ్రవణము గలుగును.

బుధుడు షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న విషభయము, బంధు ద్వేషము, వ్యవసాయనష్టము, భూనాశనము, శత్రువృద్ధి, స్వకీయాచారహీనము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 9. శుక్రమహాదశాఫల నాడీ లక్షణములు

శుక్రమహాదశలో శుక్రుడు శుభుడై యుచ్ఛ కేంద్ర కోణముల యందుండి శుభగ్రహముతో గూడినను, వీక్షించబడినను మహాసుఖము, విశేషకీర్తి, రాజపూజ్యత, సర్వజన వుపకారము, యజ్ఞాది క్రతువులు, పుత్రప్రాప్తి, పుత్రకళత్ర సౌఖ్యము, విశేష ధనము, సౌభాగ్యము, వృద్ధి, ఐశ్వర్య ప్రాప్తి, ధర్మబుద్ధి, సువర్ణము, ఆరామప్రాప్తి, ఐశ్వర్య లాభము, శీతోత్సవాది సంతోషఫలము గలుగును.

శుక్రుడు పాపుడై అష్టమ వ్యయస్థానముల యందున్న శుక్రమహాదశలో మహాకష్టము, స్థాననాశనము, ధర్మకార్య వినాశనము, దారాపుత్రాది పీడ, ఉద్యోగ భంగము, దుఃఖము, శత్రువృద్ధి, ఋణవృద్ధి, చోరత్వము, నీచత్వము ధననాశనము, .గొప్ప దోషము, స్త్రీ సాంగత్య రోగము, మనోవ్యధ గలుగును.

### 1. శుక్ర మహాదశలో శుక్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శుక్రుడు యుచ్ఛ కేంద్ర కోణముల యందున్న శుక్రభుక్తిలో ఏనుగు, పల్లకి, గుఱ్ఱము మొదలగు వాహనసౌఖ్యము, ఛత్రచామరము; సువర్ణ రత్నా

భరణములు, నాట్య, సంగీత, సాహిత్యము, కవిత్వము తాంబూలము, స్త్రీ సౌఖ్యము మొదలగు సత్ఫలములు గలుగును.

శుక్రుడు నీచ షష్టాష్టమ వ్యయస్థానముల యందున్న అనారోగ్యము, అమర్యాద, పుత్రకళత్రపీడ, బంధు ద్వేషము, పితృనాశనము, బంధునాశనము, ఉద్యోగభంగము, క్లేశము, ధర్మమూలమున ధనవ్యయము గలుగును.

**2. శుక్ర మహాదశలో రవిభుక్తి దశాఫల నాడీ లక్షణములు**

రవి తృతీయ, షష్ట, లాభస్థానముల యందున్న యెడల పుత్ర, కళాత్ర, సంపత్తు, వాహనము, మంచి వస్త్రములు, భూషణలాభము, రాజమూలమున ధన లాభము, విశేషకీర్తియు మొదలగు సత్ఫలములు గలుగును.

రవి నీచ అష్టమ వ్యయస్థానముల యందున్న స్థాన భ్రష్టత్వము, ప్రవాసము, నేత్రరోగము, విశేషభయము, పితృనాశనము, మనోదుఃఖము, రాజభయము, శత్రుభయము, చోరభయము మొదలగు దుష్ఫలములు గలుగును.

**3. శుక్ర మహాదశలో చంద్రభుక్తి దశాఫల నాడీ లక్షణములు**

చంద్రుడు కేంద్రకోణములు లాభమందున్న యెడల స్త్రీలాభము, భూ లాభము, విద్యాలాభము, వస్త్రవాహనవైభవము, దారాసౌఖ్యాభివృద్ధి, వ్యవసాయము, వ్యాపారము వల్ల ధనలాభము మొదలగు సత్ఫలములు గలుగును.

చంద్రుడు నీచ షష్ట, అష్టమ, వ్యయస్థానముల యందున్న ధర్మకార్య వినాశనము, సర్వద్రవ్యనాశనము, దేశాటనము, దుర్గతి, పౌరోహిత్యము, సేవాకావృత్తి, అజ్ఞాతవాసము, నానావిధ దుఃఖములు గలుగును.

**4. శుక్ర మహాదశలో కుజభుక్తి దశాఫల నాడీ లక్షణములు**

కుజుడు తృతీయ, షష్ట, లాభస్థానముల యందున్నను, యుచ్ఛ, శుభరాశి స్థానముల యందున్నను, శుభగ్రహములతో కూడినను, వీక్షింపబడినను, స్ఫోటకము, వ్రణబాధ, శ్రీఘ్రముగానివారణ, భూలాభము, ధనలాభము, రాజమూలకముగా ధనలాభము మొదలగుసత్ఫలములు గలుగును.

కుజుడు నీచ, అష్టమ, వ్యయస్థానములయందున్న కళత్ర, పుత్రహాని, పాపమూలకముగా ధనవ్యయము, విశేష శత్రువృద్ధి, పిత్రార్జిత ధనవ్యయము, స్థాన భ్రష్టత్వము, ప్రవాసము, గృహక్షేత్రాధినాశనము గలుగును.

**5. శుక్ర మహాదశలో రాహుభుక్తి దశాఫల నాడీ లక్షణములు**

రాహువు తృతీయ, షష్ట, లాభస్థానముల యందున్న ఉద్యోగలాభము, సౌఖ్యము, ధనధాన్యాభివృద్ధి, విదేశ ప్రయాణమువల్ల ధనలాభము, వర్తక వ్యాపారాభి వృద్ధియు గలుగును.

రాహువు కేంద్ర, కోణ, అష్టమ, వ్యయస్థానముల యందుండి పాపగ్రహములతో గూడినను, వీక్షింపబడినను, ఉద్యోగభంగము, దేహపీడ, మాతృపితృ నాశనము, పుత్ర కళత్రపీడ, ఋణవృద్ధి, శత్రువృద్ధియు గలుగును.

### 6. శుక్ర మహాదశలో గురుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

గురుడు యుచ్చ కేంద్ర కోణధన లాభస్థానముల యందుండి శుభ గ్రహముతో గూడినను, వీక్షించబడినను, వాహనము, బంధుసన్మానము, యజ్ఞము, వివాహము, పుత్రకళత్ర సౌఖ్యము, కుటుంబవృద్ధియు గలుగును.

గురుడు షష్టాష్టమ నీచ వ్యయస్థానముల యందున్న వ్యవసాయనష్టము, భూనాశనము, బంధువిరోధము, స్వకులాచార హీనము, పరదారాసక్తి, భూ సంబంధమగు వ్యాపార చిక్కులు, మనోదుఃఖము, ధర్మమువల్ల ధనవ్యయము గలుగును.

### 7. శుక్ర మహాదశలో శనిభుక్తి దశాఫల నాడీ లక్షణములు

శని తృతీయ షష్ట లాభస్థానముల యందున్న శత్రునాశనము, మనోత్సాహము, ధనధాన్యాభివృద్ధి, బంధుసౌఖ్యము, భార్యాపుత్ర సౌఖ్యము, అలంకార ప్రాప్తి, మిత్ర దాసదాసీ జనవృద్ధి, శుభకర్మలు మొదలగు సత్ఫలములు గలుగును.

శని నీచ, కేంద్ర, కోణ, అష్టమ వ్యయస్థానముల యందుండి పాప గ్రహములతో కలసినను, వీక్షించబడినను, ధననష్టము, కళత్రపీడ, సంతాన నష్టము, బంధునష్టము, కర్మనాశనము, సేవకావృత్తి, మనోదుఃఖము, గుల్మశూలవల్ల బాధ, స్థానభ్రష్టత్వము, పరదేశనివాసము, పాపమూలకముగా ధనవ్యయము మొదలగు దుష్ఫలములు గలుగును.

### 8. శుక్ర మహాదశలో బుధభుక్తి దశాఫల నాడీ లక్షణములు

బుధుడు కేంద్రకోణ లాభస్థానముల యందున్న రాజపూజ్యత, కీర్తి, వ్యాపారమువల్ల ధనలాభము, విద్యవల్ల జయము, రాజానుగ్రహము, పురాణ శ్రవణము గలుగును.

బుధుడు నీచ, అష్టమ, వ్యయస్థానములయందున్న విశేష శత్రువృద్ధి, జ్ఞాతి మూలమున ధనవ్యయము, స్థానభ్రష్టత్వము, ద్వేషము, వ్యాపారమువల్ల ధననష్టము గలుగును.

### 9. శుక్ర మహాదశలో కేతుభుక్తి దశాఫల నాడీ లక్షణములు

కేతువు తృతీయ, షష్ట లాభస్థానముల యందున్న వాహనము, భూలాభము, బంధు పూజ్యత్వము, పరోపకారము, ధర్మకార్యముల మొదలగు సత్ఫలములు గలుగును.

కేతువు అష్టమ, వ్యయస్థానముల యందున్న యెడల పుత్ర మిత్రాదిపీడ, దుస్సహవాసము, ఉద్యోగభంగము, దుఃఖము, ఋణవృద్ధి, శత్రువృద్ధి మొదలగు దుష్ఫలములు గలుగును.

# గ్రహ సంహిత
(జన్మజాతకము)

## సర్వజనుల భవిష్యత్ గ్రంథము

## HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్థము

## ప్రథమస్కంధము

## నిరయన పద్ధతి

### తాజక సిద్ధాంత పద్ధతిలో చెన్నకేశవులు నీలకంఠుడు వ్రాసిన సౌర సంవత్సర నాడీ ఫలములు

వార్షిక ఫలములను నిర్దేశించునపుడు జాతకుని యొక్క జన్మచక్రము అంశ చక్రములు ముందుంచుకొని యే సంవత్సరమునకు వార్షిక ఫలములు కావలయునో ఆ సంవత్సరమునకు జన్మచక్రము, అంశ చక్రముల నలెనే వర్షారంభ రాశి, అంశ చక్రములను వేయవలయును. వర్షారంభ మనగా జాతకుడు జన్మించినపుడు సూర్యుడు యే రాశి, భాగ, లిప్త, విలిప్తల యందుండునో అదే స్థానమునకు సూర్యుడు తిరిగివచ్చు కాలమునకు వర్షారంభ మగును. సూర్యుడు అట్టి ప్రారంభ స్థానమునకు వచ్చుటకు 365 దినముల 6 గంటల 12 నిమిషముల 36 సెకండ్ల కాలము పట్టును. ఏ సంవత్సరమునకు జాతకుని యొక్క వార్షిక ఫలములు కావలయునో ఆ సంవత్సరమున సూర్యుడు జన్మ చక్రములో యున్న యధాస్థానమునకు వచ్చిన కాలమందు రాశి, అంశ చక్రములను వేసి అట్టి కాలమునందు యితర గ్రహములుండు స్థానములను నిర్ణయించి ఆ స్థానములందు రవ్యాది గ్రహములను రాశి, భాగ, లిప్త, విలిప్తలలో వ్రాసి యుంచ వలెను. జాతకుడు జన్మించి నపుడు సూర్యుడు యే ప్రదేశము నందుండునో ఈ వార్షిక చక్రమునందు గూడ అదేస్థానము నందుండునని గ్రహించ వలెను.

ఒక జాతకుని జననము గుంటూరు పట్టణములో 2-4-1934 సోమవారము రాత్రి గం.8-52 ని.లకు (P.M.I.S.T) గ్రహస్ఫుటము చేయగా జనన కాలమునకు గ్రహములు ఈ క్రింది విధముగా యున్నవి. గుంటూరు పట్టణ అక్షాంశలు =16°-18', దీర్ఘాంశలు = 80°-29', జనన కాల ప్రాంతీయ టైము = గం.20 44 ని.లు. నిరయనకాల సమయము గం.9-26ని.లు. అయనాంశలు = 22°-56' - 38".

## జనన కాలమునకు నిరయన దీర్ఘాంశరేఖలు (Longitudes)

### గ్రహ స్ఫుటము

| | రా. భా. లి. | | రా. భా. లి. |
|---|---|---|---|
| 1. రవి | 11 - 19 - 14 | 7. శని | 10- 01 - 49 |
| 2. చంద్ర | 06 - 21 - 47 | 8. రాహు | 09- 23 - 47 |
| 3. కుజ | 11 - 21 - 54 | 9. కేతు | 03- 23 - 47 |
| 4. బుధ | 10 - 21 - 28 | 10. లగ్నము | 06- 25 - 45 |
| 5. గురు (వ) | 05 - 26 - 09 | 11. దశమ స్థానము | 03- 26 - 07 |
| 6. శుక్ర | 10 - 03 - 45 | | |

జనన నక్షత్రము - విశాఖ 1 పాదము. కృష్ణపక్ష తదియ 8°-33′

జనన కాలమునకు గురుదశాశేషము. స. 13-10 నె. 10 దినములు

ఈ వివరములను బట్టి జాతకుని యొక్క జన్మలగ్న చక్రము, అంశచక్రము క్రింద వ్రాయబడియున్నవి గమనింపుడు. (వివరములకు గ్రహ సంహిత పూర్వార్ధము ప్రధమ స్కంధము చూడుము)

| | | | |
|---|---|---|---|
| రకు | | | |
| బు శు శ | జన్మలగ్న చక్రము | | కే |
| రా | | | |
| | | లచ | గు(వ) |

| | | | |
|---|---|---|---|
| | చబు | ల | |
| కే | జన్మ అంశ చక్రము | | |
| కు | | | గు(వ) రా |
| ర | శు | శ | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవి | -- | మిత్రక్షేత్రము | శుక్ర | -- | మిత్రక్షేత్రము |
| చంద్ర | -- | శత్రు క్షేత్రము | శని | -- | స్వక్షేత్రము |
| కుజ | -- | శత్రు క్షేత్రము | రాహు | -- | మిత్రక్షేత్రము |
| బుధ | -- | మిత్రక్షేత్రము | కేతు | -- | మిత్రక్షేత్రము |
| గురు (వ) | -- | మిత్రక్షేత్రము | లగ్నము | -- | తులారాశి |

వార్షిక రాశి చక్రమును వేయుటకు జన్మలగ్న చక్రమునందు సూర్యుడు యే రాశి, భాగ, లిప్త, విలిప్తల యందుండునో గ్రహించి కావలసిన సంవత్సరములో సూర్యుడు అదే స్థానమునకు వచ్చినపుడు యితర గ్రహములు యే యే స్థానముల యందున్నవో గ్రహించి ఆ గ్రహములను వార్షిక పత్రిక యందు వ్రాసుకొన వలెను.

## వార్షిక పత్రిక వేయు క్రమము

1-4-1994 తేదీకి జాతకునికి 60 సంవత్సరములు గతించుచున్నవి. 2-4-1994 తేదీనుండి 61 వ సంవత్సరము ప్రారంభమగుచున్నది. జాతకునికి 61 వ సౌరసంవత్సరము ప్రారంభమగుచున్నది. జాతకునికి 61 వ సౌరసంవత్సర ఫలములు కావలసి యున్నవి.

జాతకుడు జన్మించిన సమయమునకు రవియున్న స్థానము = 349°-14'
మహాబల ఎఫెమెరీసను బట్టి 2-4-1994 తేదీ ఉదయం

5 గం.30 ని. లకు రవియున్న స్థానము = 348 - 20

రవి స్వస్థానము వచ్చుటకు తగ్గిన లిప్తలు = 0 - 54

రవి గంటకు 2½ లిప్తల వంతున 24 గంటలకు 60 లిప్తలు లేక 1 భాగ లేక 1 డిగ్రీ ప్రయాణము చేయును. 54 లిప్తలు నడుచుటకు రవికి యెంత కాలము పట్టును ?

54 లిప్తలను 2½ లిప్తలచే భాగించిన రవి ఎన్ని గంటలలో పై స్థానము జేరునో తెలియును.

$$54 \times \frac{2}{5} = \frac{108}{5} = 21\frac{3}{5}$$ గంటలు లేక గ. 21 - 36 ని.లు.

2-4-1994 తేదీ ఉదయం 5 గం.30 ని. ల నుండి గ. 21 - 36 ని. లకు రవి యథాస్థానమైన 349°-14'లో యుండును.

2-4-1994 తేదీ ఉదయం గం. 5 - 30 ని. ల
+ 21 - 36
-----------
27 - 06

2-4-1994 తేదీ రాత్రి 12 గంటలకు - 24 - 00 తీసివేయుము
-----------

3-4-1994 ప్రారంభ రాత్రికి (A.M.) గం. 3 - 06 ని. లకు రవి స్థానము 349°-14'

మహాబల యఫేమెరీస్సును బట్టి ఉదయము గం. 5 - 30 ని. లకు
నిరయన గ్రహస్థితి

| గ్రహములు | 3-4-1994 గ్రహస్థితి (5-30 A.M.) | 2-4-1994 గ్రహస్థితి (5-30 A.M.) | 24 గం.కు గ్రహ గమనము | గ.21-36ని. గ్రహ గమనము | 3-4-1994 గ.3-6ని.కు (A.M.) గ్రహస్థితి |
|---|---|---|---|---|---|
| 1. రవి | 349-20 | 348-20 | 1-00 | 0-54 | 349-14 |
| 2. చంద్ర | 257-48 | 244-14 | 13-34 | 12-13 | 256-27 |
| 3. కుజ | 327-10 | 326-23 | 0-47 | 0-42 | 327-05 |
| 4. బుధ | 325-48 | 324-19 | 1-29 | 1-20 | 325-39 |
| 5. గురు(వ) | 199-17 | 199-23 | -0-06 | -0-05 | 199-18 |
| 6. శుక్ర | 7-48 | 6-34 | 1-14 | 1-07 | 7-41 |
| 7. శని | 313-51 | 313-45 | 0-06 | 0-05 | 313-50 |
| 8. రాహు | 212-33 | 212-36 | -0-03 | -0-03 | 212-33 |

**3-4-1994** తేదీ గ. 3-06 ని (A.M.) కు గ్రహస్ఫుటము

| | | | |
|---|---|---|---|
| 1. రవి | 11- 19 -14 | 6. శుక్ర | 0- 07 - 41 |
| 2. చంద్ర | 08 - 16 - 27 | 7. శని | 10- 13 - 50 |
| 3. కుజ | 10 - 27 - 05 | 8. రాహు | 07- 02 - 33 |
| 4. బుధ | 10 - 25 - 39 | 9. కేతు | 01- 02 - 33 |
| 5. గురు (వ) | 06 - 19 - 18 | 10. లగ్నము | 09- 25 - 08 |
| | | 11. ముంతా | 06- 25 - 45 |

వార్షిక లగ్న చక్రము

| | | | |
|---|---|---|---|
| ర | శు | కే | |
| కు బు శ | వార్షిక లగ్న చక్రము | | |
| ల | | | |
| చ | రా | గు(వ) ము | |

వార్షిక అంశ చక్రము

| | | | |
|---|---|---|---|
| గు(వ) | | బు ము | కుశు |
| శ | వార్షిక అంశ చక్రము | | రా |
| కే | | | చ ల |
| ర | | | |

ఇందు లగ్నాధిపతియైన శని, ధనాధిపతియైన శని, భాగ్యాధిపతియైన బుధుడు, లాభాధిపతియైన కుజుడు, అందరు కలసి ధన స్థానము నందుండుట గమనార్హము. ఈ వార్షికము నందు జాతకుడు అధిక ధనము గలవాడగుచున్నాడు.

## గ్రహముల మిత్రశత్రుత్వములు

తాజక సిద్ధాంత పద్ధతిలో నీలకంఠుడు గ్రహములకు తాత్కాలిక, మిత్రత్వ, శత్రుత్వములు లేవని చెప్పుచున్నాడు. నైసర్గిక మిత్ర శత్రుత్వములు కూడ లేవని, గ్రహములకు వాని పరస్పర గుణములను బట్టి మిత్ర శత్రుత్వములు యేర్పడునని చెప్పియున్నాడు. పరాశరుడు వీక్షించు గ్రహములను బట్టిన్ని, వీక్షించ బడుచున్న స్థానమును బట్టిన్ని మంచి చెడు ఫలములను నిర్ణయించి యున్నాడు. కాని తాజక పద్ధతిలో చాలా వరకు శుభాశుభములు గ్రహవీక్షణ యొక్క స్వభావము పై ఆధారపడియున్నవి. తాజక సిద్ధాంత పద్ధతిలో కేశవులు గ్రహముల యొక్క మిత్ర శత్రుత్వములు ఈ క్రింది విధముగా వ్రాసియున్నారు.

| గ్రహములు | మిత్రులు | శత్రువులు |
|---|---|---|
| 1. రవి | గురు, కుజ, చంద్ర | బుధ, శుక్ర, శని, రాహు |
| 2. చంద్ర | రవి, కుజ, గురు | బుధ, శుక్ర, శని, రాహు |
| 3. కుజ | రవి, గురు, చంద్ర | బుధ, శుక్ర, శని, రాహు |
| 4. బుధ | శుక్ర, శని, రాహు | రవి, చంద్ర, కుజ, గురు |
| 5. గురు | కుజ, రవి, చంద్ర | బుధ, శుక్ర, శని, రాహు |
| 6. శుక్ర | బుధ, శని, రాహు | రవి, చంద్ర, కుజ, గురు |
| 7. శని | రాహు, బుధ, శుక్ర | రవి, చంద్ర, కుజ, గురు |
| 8. రాహు | శుక్ర, బుధ, శని | రవి, చంద్ర, కుజ, గురు |

అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలు వార్షిక పత్రికల వివరణలు యిచ్చునపుడు గూడ గ్రహముల మిత్ర శత్రుత్వములు పరాశర పద్ధతితోనే ఆలోచించుట శ్రేయస్క రమని చెప్పుచున్నారు.

## గ్రహముల యొక్క స్వ - ఉచ్ఛ - నీచ - మిత్ర - శత్రు క్షేత్రములను తెలుపు పట్టిక

| గ్రహములు | స్వ - ఉచ్ఛ- మిత్ర క్షేత్రములు | నీచ - శత్రు క్షేత్రములు |
|---|---|---|
| 1. రవి | సి (స్వ) మే (ఉ) ధ – మీ | తు (నీ) వృష – మిథు – కర్క కన్య వృశ్చి – మ – కు |
| 2. చంద్ర | కర్క (స్వ) వృష (ఉ) మిధు – కన్య – ధ – మీ | వృశ్చి (నీ) మే – సి – తు – మ – కు |
| 3. కుజ | మే–వృశ్చి(స్వ) మ(ఉ) వృష – మిథు – కన్య – తు | కర్క (నీ) సి – ధ– కు– మీ |
| 4. బుధ | మిథు – కన్య (స్వ) (ఉ) మే వృష – కర్క– తు – వృ – ధ – మ – కు | మీ (నీ) సి |
| 5. గురు | ధ – మీ(స్వ) కర్క(ఉ) వృష – మిథు – సి – కన్య – తు – కు | మ (నీ) – మే – వృశ్చి |
| 6. శుక్ర | వృష – తు (స్వ) మీ (ఉ) –మే – మిథు – వృ – ధ – మ – కు | కన్య (నీ) కర్క – సి. |
| 7. శని | మ–కు(స్వ) తు (ఉ) వృష – మిథు – కన్య – ధ – మీ | మే (నీ) కర్క – సి – వృశ్చి |
| 8. రాహు | కు(స్వ) వృష (ఉ) మిథు–సి – కన్య – తు – ధ – మీ | వృశ్చి (నీ) మే –కర్క – మీ |
| 9. కేతు | సి (స్వ) వృశ్చి (ఉ) కు – మిథు – తు – ధ – మ – మీ | వృష (నీ) మే –కర్క – కన్య |

### గ్రహ వీక్షణములు

తాజిక సిద్ధాంతములో గ్రహములయొక్క ప్రత్యేక వీక్షణములు పేర్కొనబడియున్నవి. ఈ వీక్షణములన్నియు లగ్నస్థానము నుండి గాక యొక గ్రహమందు రాశి స్థానము నుండి మఱియొక గ్రహముందు రాశి స్థానము వరకు లెక్కచూచుకొనవలెను.

పంచమ నవమ స్థానములయందున్న గ్రహముల పరస్పర వీక్షణ అనుకూలము. మిత్రత్వము గల్గియుండును. మేషమున రవియుండి సింహమున

గురుడున్న రవికి పంచమస్థానమున గురుడును, గురునకు నవమ స్థానమున రవి యున్నట్లగుచున్నది. వీరి పంచమ, నవమ స్థానముల పరస్పర వీక్షణ ప్రత్యేక అనుకూలము, శుభత్వము గల్గి యుండును. తృతీయ, యేకాదశ స్థానముల యందున్న గ్రహములయొక్క పరస్పర వీక్షణ మిత్రత్వము నందుండుటచే వాని ఫలములు లాభదాయకముగా యుండును. చతుర్ధ, దశమ స్థానముల యందున్న గ్రహముల పరస్పర వీక్షణ శత్రుత్వమును సూచించును. ఈ యొక్క వీక్షణ భంగపాట్లు, అడ్డంకులు మొదలగునవి గలుగ జేయును. ద్వితీయ, ద్వాదశ స్థానముల యందున్న గ్రహముల యొక్క పరస్పర వీక్షణ మంచి దగుటచే సౌఖ్యము నిచ్చును. 6-7-8-1 స్థానముల యందున్న గ్రహముల వరస్పర వీక్షణ శత్రుత్వము గల్గియుండుటచే అశుభ ఫలముల నిచ్చు వారగు చున్నారు. వీనియొక్క ఫలములు యెప్పుడు హానికరముగా యుండును.

తాజక శాస్త్రరీత్యా 5-9 స్థానముల యందున్న గ్రహదృష్టి 3/4 గను, 3-11 స్థానముల యందున్న గ్రహదృష్టి 1/2 గను, 2-12 స్థానముల యందున్న గ్రహదృష్టి 1/6గను యుండును. ఈ ద్వితీయ, ద్వాదశ స్థానముల యందున్న గ్రహదృష్టి బలహీనమై యుండుటచే ఈ యొక్క వీక్షణ లెక్కయందు గ్రహించరాదు.

నీలకంఠుని దృష్టిలో గ్రహములు 5-9 లేక 3-11 స్థానములయందున్న వారి పరస్పర వీక్షణ మిత్రత్వము గలిగి నిజమును గుర్తించునవిగా యుండుననియు, 6-8 లేక 2-12 స్థానముల యందున్న గ్రహదృష్టి సమభావముగల్గి విజయము చేకూర్చుననియు, 4-10 స్థానముల యందున్న గ్రహదృష్టి శత్రుత్వము గలిగి భంగ పాట్లు , భయమును గల్గించుననియు, సప్తమ స్థానము నందున్న గ్రహదృష్టి శుభు లైన శుభఫలములను, పాపులైన పాపఫలములను గలిగించునని చెప్పబడి యున్నది.

## గ్రహముల యొక్క కాంతి బింబములు

గ్రహముల కాంతిబింబములు వివిధరీత్తుల ప్రకాశవంతముగా యుండును. రవి 15 భాగలు, చంద్రుడు 8 భాగలు, కుజుడు 12 భాగలు, బుధుడు 7 భాగలు, గురుడు 9 భాగలు, శుక్రుడు 7 భాగలు, శని 9 భాగల వరకు బింబములు గల్గి ప్రకాశించుచుండును. గ్రహములయొక్క వీక్షణ వాని బింబములు కలిసి యున్నంత వరకు పనిజేసి ఫలముల నొసగును.

ఉ॥ మేషములో సూర్యుడు 2 భాగల యందును, సింహములో గురుడు 10 భాగల యందున్నట్లు గ్రహింతము.

సూర్యుని యొక్క బింబము మేషములో $2^\circ + 15^\circ = 17$ భాగల వరకు ప్రసరించును. సింహములో అనగా రవికి పంచమస్థానములో గురుని యొక్క బింబము $10^\circ - 9^\circ = 1$ భాగ వెనుక వరకు ప్రసరించుచున్నది. ఈ రెండు గ్రహముల కు కోణదృష్టి పూర్తిగా లేని కారణముచే వీని ఫలములు మధ్యమముగా యుండును.

ఉ॥ మేషములో సూర్యుడు 2 భాగల యందును, సింహములో గురుడు 25 భాగల యందున్నట్లు గ్రహింతము.

సూర్యుని యొక్క బింబము మేషములో 2° + 15° = 17 భాగల వరకు ప్రసరించును. సింహములో అనగా రవికి కోణ స్థానము లేక పంచమ స్థానములో గురుని యొక్క బింబము 25° - 9° = 16 భాగలు వెనుక వరకు ప్రసరించు చున్నది. ఇచ్చట మేషములో సూర్యబింబము 17 భాగల వరకును, దీనికి కోణస్థానమైన సింహములో గురుని బింబము 16 భాగల వరకు ప్రసరించు చుండుటచే ఈ రెండు గ్రహములకు పూర్ణముగా కోణదృష్టి గలదని చెప్పవచ్చును. గ్రహ వీక్షణలు చర్చించునపుడు వానియొక్క బింబములను గూడ దృష్టిలో నుంచుకొన వలయును.

ఒకే రాశిస్థానములో రెండు గ్రహములు వాని బింబములు గూడ కలియని యెడములో యున్నపుడు ఆ రెండు గ్రహములు ఒకే స్థానములో కలిసి యున్నట్లు గ్రహించరాదు. అయితే నీలకంఠుని దృష్టిలో కోణస్థానములలో గ్రహముల యొక్క దృష్టి వాని బింబములలో పడకున్నను వాని ప్రభావము అంతగా కోల్పోదనియు, వాని ఫలములు మధ్యమముగా నుండునని చెప్పి యున్నాడు.

## తాజకయోగములు

తాజక సిద్ధాంతములో గ్రహములు కేంద్ర, త్రికోణ లేక యేక స్థానమున యే దృష్టి లేక వీక్షణ యందున్నను వాని బింబ ప్రసారము మాత్రము మార్పు చెందదు. గ్రహముల యొక్క బింబములు సూర్యునకు 15 భాగలు, చంద్రునకు 12 భాగలు, కుజునకు 8 భాగలు, బుధునకు 7 భాగలు, గురునకు 9 భాగలు, శుక్రునకు 7 భాగలు, శనికి 9 భాగల వరకు ప్రసారము నందుండునని లోగడ చెప్పియున్నాము. తాజక సిద్ధాంతకర్తలైన నీలకంఠుడు మొదలగువారు గ్రహకిరణ ప్రభానము, వాని వీక్షణల యొక్క స్వభావముపై ఆధారపడి ఫలములను నిర్ధేశించి యుండిరి. గ్రహముల యొక్క వీక్షణల యందుగల్గు కలయిక, యెడబాటు, వాని శీఘ్ర మంద గమనముల వలన గల్గు మార్పులను దృష్టి యందుంచుకొని వాని యోగావ యోగములను వ్రాసియుండిరి.

### 1. యిథ్యషాల యోగము

రెండు గ్రహములు కేంద్ర లేక కోణమునందుండి అధికగమనము గల్గి తక్కువ దీర్ఘాంశలు లేక, భాగలు గల్గిన గ్రహము, మందగమనము గల్గి యెక్కువ భాగలు గల్గిన గ్రహముకంటె వెనుకయున్న యిథ్యషాల యోగమగును.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | రాశిచక్రము | | ర - 2 |
| | | | |
| | ల<br>కు - 10 | | |

పై రాశిచక్రములో గ్రహములు పరస్పర పంచమ, నవమ కోణముల యందున్నవి. రవి కుజులలో శీఘ్ర గమనముగల గ్రహము రవియును, మంద గమనముగల గ్రహము కుజుడై యున్నాడు. శీఘ్రగమనము గల రవికి పంచమ కోణమున కుజుడున్నాడు. రవి కర్కాటకములో 2 భాగల యందును, కుజుడు వృశ్చికములో 10 భాగల యందున్నారు. వీరియొక్క కలయిక కోణమున 8 భాగల తేడాతో యున్నందున వీరు దీప్తంస యందున్నట్లు గ్రహించవలెను. ఇచ్చట యిథ్యషాల యోగము జరుగబోవు చున్నది.

కేంద్రముల యందుగాని, కోణముల యందుగాని శీఘ్రగమనము గల గ్రహము ముందుండి తరువాత మందగమనముగల గ్రహము ఒక భాగతేడాతో గాని లేక సమాన భాగలలో గాని యున్న పూర్ణయిథ్యషాల యోగము సంభవించును. పై రాశిచక్రమునందు రవి 2 భాగలయందుండి, కుజుడుగూడ 2 లేక 3 భాగల యందున్న పూర్ణయిథ్యషాల యోగము సంభవించినట్లు గ్రహించవలెను. దీనినే ముతషిల యోగమని గూడ యుందురు. ఈ యొక్క కలయిక శుభ ఫలముల నొసగును.

| | | | |
|---|---|---|---|
| | | | బు – 4° |
| | రాశిచక్రము | | |
| | | | |
| | | ల<br>శు – 5° | |

పై చక్రమున శీఘ్రగమనముగల బుధుడు మిథునరాశిలో 4 భాగల యందును, బుధునకు తరువాత మంద గమనము గల శుక్రుడు పంచమ స్థానము లేక కోణమున తులారిశిలో 5 భాగల యందున్నాడు. వీరిరువురు 1 భాగతేడాతో యొకరికొకరు కోణము నందుండుటచే యిచ్చట యిథ్యషాల యోగమైనది.

ఈ యిథ్యషాల యోగము మూడు రకములుగా యుండును. వర్తమాన, సంపూర్ణ, భవిష్యత్తు.

సూర్యుడు మేషరాశిలో 5° - 30′ యందును, కుజుడు అదేరాశి యందు 25° - 30′ యున్నాడను కొందము. మేషములో సూర్యుని యొక్క దీప్తంస ముందుకు ప్రసారము 5° - 30′ + 15° = 20° - 30′ వరకు యుండును. కుజుని యొక్క దీప్తంస ఆదేరాశి యందు వెనుకకు ప్రసారము 25°-30′-8° =17° - 30′ వరకు యుండును, మేషరాశి మధ్యభాగము 15° యైయున్నది. సూర్యుని యొక్క కిరణప్రసారము మేషరాశి మధ్య స్థానము అతిక్రమించి (20° - 30′ -- 15°) 5° - 30′ వరకు యున్నది. అదే రాశిలో సూర్యునకు ముందున్న కుజుని యొక్క కిరణములు మధ్య భాగము అతిక్రమించి వెనుకకు (17° - 30′ -- 15°) 2° - 30′ వరకు ప్రసారము చేయుచున్నవి. ఈ విధముగా అధిక గమనముగల సూర్యుని

యొక్క కిరణములు, మంద గమనముగల కుజునియొక్క కిరణములతో కలిసిపోయి వర్తమాన యిథ్యషాల అగుచున్నది. ఇచ్చట మంద గమనము గల కుజుని వెనుక శీఘ్ర గమనము గల సూర్యుడుండుటచే ఈ యోగ ఫలములు లాభదాయకంగా యుండును. ఇందు లగ్నము మేషరాశియై యున్న లగ్నాధిపతి కుజుడును, పంచమాధిపతి రవియు అగుచున్నారు. కావట్టి యిచ్చట లగ్న పంచమాధిపతులు యిథ్యషాల యోగము నందుండుటచే 7-5 స్థానఫలములు శుభకరముగా యుండునని భావించవలెను.

మీనరాశిలో 3° - 4′ యందు గురుడుండి కర్కాటకరాశిలో 3° - 5′ యందు చంద్రుడున్న. గ్రహములకు కోణదృష్టిగల్గి స్నేహభావముగా యుండును. రెండు గ్రహములు పరస్పర కోణదృష్టి గల్గి 1 భాగ లోపు నందుండుటచే పూర్ణ యిథ్యషాల యోగమైనది. ఇందు వీని ఫలములు శుభకరముగా యుండును.

కన్యరాశి యందు బుధుడు 22° - 5′ యందుండి, తులారాశి యందు 7°లలో శుక్రుడున్నాడను కొందము. ఇచ్చట మంద గమనము గల శుక్రుని వెనుక శీఘ్ర గమనముగల బుధుడున్నాడు. బుధుని యొక్క బింబము 22° - 5′ + 7° = 29° - 5′ వరకు ప్రసరించుచున్నది. శుక్రుని యొక్క బింబము వెనుకకు 7° - 7° = 0° వరకు కన్యరాశిలో ప్రసరించు చున్నది. ఇందు దీప్తంసయందు గ్రహములుండి వాని కిరణములు త్వరలో కలియనున్నవి. దీనిని భవిష్యత్తు యిథ్యషాల యోగ మందురు.

ఇట్లు యోగావ యోగములను విచారించి ఫలములను నిర్దేశించ వలెను. యోగకర్త లిద్దరిలో మంద గ్రహము ముందు భాగ యందును, శీఘ్ర గ్రహము వెనుక భాగమందు యుండవలెను. వారిఋవరికి 12 భాగలకు లోపుగా నంతర ముండవలెను.

కాబట్టి మంద గ్రహభాగలలో శీఘ్ర గ్రహభాగలకు తీసివేయగా శేషము (0) శూన్యముగా నుంచెనేని యా యోగ ఫలమనియు, నా అంతరము 12 భాగలుగా మండునపుడు ఫలము శూన్యమనియు జెప్పబడెను. గనుక అంతరము 12 భాగలకు రూపమైనచో నిచ్ఛాభాగల కెంతయని త్రైరాశికమ్ము వల్ల సాధించిన ఫలము రూపాదిగా సాధించ వలెను. ఆ యోగమందు ఆ యోగకర్తలంత భాగము ఫలము నిత్తురు. ఒకవేళ శీఘ్రగ్రహ భాగాధిలోనే మంద గ్రహ భాగాది పోయిన యెడల నాభాగ ఫలమును నా యోగకర్తలు నశింప జేయుదురు.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | ధనుర్లగ్నము | | |
| | | | ర – 20°<br>బు – 22° |
| ల | | | |

ఉ।। పై జాతకములో ధనుర్లగ్నము గనుక భాగ్య రాజ్యాధిపతులగు రవి బుధు లిద్దఱును భాగ్య కోణము నందుండుటచే వెనుక జెప్పబడిన శాస్త్ర ప్రకారము ఆ ధర్మకర్మాధి పతులగు రవి బుధుడు ఈ జాతకములో యోగకర్తలుగా నేర్పడిరి. కనుక నీ రవి బుధులలో బుధుడు శీఘ్ర గ్రహము. రవి మంద గ్రహము నయ్యెను. బుధుని భాగలు 22; రవి భాగలు 20 గనుక శీఘ్ర గ్రహములోనే మంద గ్రహమ పోయినది. గావున నీయోగము బాడుచేయునని చెప్పవలెను. అలాగునే ఈ జాతకునికి బుధ దశలో యోగ మేమియును జేయలేదను సంగతి దృష్టాంత మయినది. కాబట్టి మంద గ్రహమునకు ముందు శీఘ్ర గ్రహముండ వలదు. మందగ్రహమే ముందు యుండ వలయును.

## 2. హేసరాఫ యోగము

మంద గమనము గల గ్రహము కంటె శీఘ్ర గమనము గల గ్రహము భాగ అతిక్రమించి కేంద్ర కోణముల యందు గాని, లేక ఒకే రాశి యందు గాని ముందున్న హేసరాఫ యోగము సంభవించును. దీనినే మూసరిఫః యోగమని గూడ అందురు. వీని యొక్క వీక్షణ విడిపోవు చుండుటచే అశుభ ఫలములకు హేతువగును.

| | | | |
|---|---|---|---|
| గు – 9 | చ – 10 | | |
| | హేసరాఫ యోగము | | |
| | | | |
| ల | | | |

## 3. నక్త యోగము

రెండు గ్రహములకు పరస్పర వీక్షణము లేనప్పుడు ఈ రెండు గ్రహముల కంటె అధిక గమనము గల యింకొక గ్రహము ఈ రెండు గ్రహముల మధ్య నుండి యిరువైపుల వీక్షంచుచుండి శీఘ్రగమనము గల మొదటి గ్రహము యొక్క కాంతిని మంద గమనము గల గ్రహమునకు మార్పుజేసినపుడు నక్త యోగము సంభవించును.

| | | | |
|---|---|---|---|
| గు – 12° | | | |
| | నక్తయోగము | | |
| | | | బు – 10° |
| చ – 8° | | | ల |

పై లగ్న చక్రము నందు బుధగురులకు పరస్పర వీక్షణము యేమియు లేదు. వీని మధ్య అధిక గమనము గల చంద్రుడు ఒకవైపు బుధుని, మఱియొక వైపు గురుని వీక్షించు చున్నాడు. ఇటువంటి వీక్షణములలో మధ్యవర్తి యొక్క సహాయము కొన్ని పనులు సరిదిద్దుటకు అర్థించ వలసి యుండును.

### 4. యమయ యోగము

రెండు గ్రహములకు పరస్పర వీక్షణము లేనప్పుడు, ఈ రెండు గ్రహముల కంటె మంద గమనము గల యింకొక గ్రహము ఈ రెండు గ్రహముల మధ్య నుండి యిరువైపుల వీక్షించు చుండి యెక్కువ అధిక గమనము గల ముందున్న గ్రహము యొక్క కాంతిని వెనుకనున్న అధిక గమనము గల గ్రహమునకు బదిలీ చేయుచున్న యమయ యోగమగును.

| | | | |
|---|---|---|---|
| | శు – 18° | | |
| | యమయ యోగము | | గు – 12° |
| | | | |
| | | ల | చ – 10° |

పైన చూపబడిన లగ్నరాశిలో లగ్నాధిపతి యైన శుక్రునకును, దశమ స్థానాధిపతి యైన చంద్రునకును యెట్టి వీక్షణము లేదు. మంద గమనము గల గురుడు కర్కాటకము నందుండి రెండు గ్రహములైన శుక్ర, చంద్రులను వీక్షించు చున్నాడు. ఈ మధ్య స్థానము నందున్న గురుడు శీఘ్ర గమనము గల చంద్ర కాంతిని మంద గమనము గల శుక్రునకు బదిలీ చేయు చున్నాడు. ఇట్టి కలయిక వలన యమయ యోగమైనది.

### 5. కంబూల యోగము

రెండు గ్రహములు యిధ్యశాల యోగము నందున్నపుడు, మూడవ గ్రహమైన చంద్రుడు పైనున్న రెండు గ్రహములలో ఒకదానితో యిధ్యశాల యోగము పొంది యున్న అట్టి కలయిక కంబూల యోగ మగును. ఇది ఉచ్చ, మధ్యమ, నీచయని మూడు విధములుగా యుండును.

| | | | |
|---|---|---|---|
| శు – 10° | | | |
| | కంబూల యోగము | | గు – 12° |
| | | | |
| చ – 8° | | | |

పై చక్రములో శుక్ర గురులు కోణము నందుండి యిధ్యశాల యోగమును పొంది యున్నారు. చంద్రుడు శుక్రునితో యిధ్యశాల యోగమును పొంది యున్నాడు. కాబట్టి మూడు గ్రహములు యిధ్యశాల యోగము నందుండుటచే కంబూల యోగమైనది.

ఇచ్చట లగ్నాధిపతి, కారక స్థానాధిపతి, చంద్రుని యొక్క సంబంధము వలన కంబూల యోగమైనది. లగ్నాధిపతియు, కారక స్థానాధిపతియు ఉచ్చ యందుండి, చంద్రుడు గూడ ఉచ్చ యందున్నను లేక ఈ మూడు గ్రహములు వాని స్వస్థానముల యందున్న కంబూలయోగము యుత్త మోత్తమముగా యుండును.

చంద్రుడు ఉచ్చస్థానము నందుండి, మిగిలిన రెండు గ్రహములు వాని స్వనవాంశ, ద్రేక్కాణ మొదలగు వాని యందున్న కంబూల యోగము మధ్యమముగా యుండును. చంద్రుడు ఉచ్చస్థానము నందు లేని వాడై మిగిలిన రెండు గ్రహములు స్వనవాంశ, ద్రేక్కాణ మొదలగు వాని యందున్న కంబూల యోగము ఉత్తమముగా యుండును. చంద్రుడు ఉచ్చస్థానము నందుండి గాని లేక స్వక్షేత్రము నందుండి మిగిలిన రెండు గ్రహములు నీచ స్థానములందున్న కంబూల యోగము ఉత్తమాధమముగా యుండును. చంద్రుడు స్వనవాంశ, ద్వాదశాంశల యందుండి, మిగిలిన రెండు గ్రహములు స్వరాశుల యందుగాని, ఉచ్చ రాశుల యందు గాని యున్న కంబూల యోగము మధ్యమోత్తమముగా యుండును. చంద్రుడు స్వనవాంశ లేక ద్రేక్కాణము నందుండి, స్వస్థానము లేక అర్ధ యుండున్న లగ్నాధిపతితో యిధ్యశాల యోగము నందున్న కంబూల యోగము మధ్యమముగా యుండును. మూడు గ్రహములు పంచవర్గీయ బలము గూడ లేకున్న అంబూల యోగము అధమముగా యుండును. కంబూల యోగము యొక్క శుభాశుభ ఫలములు చంద్రుడు, యితర రెండు గ్రహముల యొక్క బలా బలములపై ఆధారపడి యుండును.

కంబూల యోగములు గుఱించి మహాకవి శ్రీ కాళిదాసు తన ఉత్తర కాలామృతములో ఈ క్రింది విధముగా చెప్పి యున్నాడు.

ఎవరైనా నిద్దఱురాజ యోగకారకులు పూర్వోక్త ప్రకారము సంబంధ త్రయములో నేదయిన నొక సంబంధము గలవారై యుండి పూర్వోక్త స్థాన దృష్టి గలిగి మంద గ్రహము ముందుండి శీఘ్ర గ్రహము వెనుక నుండి వారివురి యంతరము 12 భాగలకు లోపుగా నుండెనేని వారిద్దరును యోగ ఫలము నిత్తురు. వారియిద్దరి యంతరము నెంత తక్కువగా నుండిన నంత ఫలమధికమై యుండును. అట్లుండగా నా యోగ కర్తలగు గ్రహముల నిద్దరిని చంద్రుడు, స్థాన దృష్టి గలిగి వారి భాగలకు 12 భాగలకు లోపుగా నున్నవాడై జూచునేని యత్యధిక యోగము. అపుడాయోగ కారకులిద్దరును, చంద్రుడును తమ యుచ్చలందు గాని, స్వ గృహము లందు గాని యుండిన నుత్తమ యోగమనియు, నది మిత్ర గృహ మందుండిన మధ్య యోగమనియు, దక్కిన వాని యందుండిన నధమ యోగ మనియు జెప్పబడెను. దీనినే కంబూల యోగమని తాజకశాస్త్రమందు వర్ణించి యుండిరి.

ఉ॥ఈ జాతమునందు కుజ గురులు యోగ కారకులగు చున్నారు. మేషరాశిలో కుజుడు 14 భాగల యందును, గురుడు కర్కాటక రాశిలో 15 భాగల యందున్నాడు. చంద్రుడు తన స్వక్షేత్రమైన కర్కాటకరాశి యందు 12 భాగలలో యున్నాడు. ఈ యోగ కర్తలగు కుజగురు లిద్దరిలో కుజుడు శీఘ్ర గ్రహమును, గురుడు మంద గ్రహమును గనుక నిచ్చట మంద గ్రహమగు గురుడు 15 భాగల మీద నున్నాడు. శీఘ్ర కుజుడు వానికి వెనుక 14 భాగల మీద నున్నాడు. ఇద్దరి యంతరము 1 భాగ కాబట్టి 12 భాగములకు 1/12 రూపము ఫలమైన యెడల 1 భాగకెంత? అనే త్రైరాశికరీత్యా 1/12 భాగము అనగా నీ యొక్క భాగయును గూడ లేకుండ (0) = శూన్యమైనచో పూర్ణ ఫలమగును. గనుక నీభాగము తక్కువుగా యున్నది. గావున 1 - 1/12 = 11/12

| | | | |
|---|---|---|---|
| | కు – 14° | | |
| | కర్కాటక లగ్నము | | ల<br>చ – 12°<br>గు – 15° |
| | | | |
| ర<br>బు | శు | | |

భాగఫలము నిత్తురని తెలియనగును. ఇచ్చట గురుడు దశమ దృష్టి చేత కుజుని వీక్షించు చున్నాడు. కుజుడు చతుర్థ దృష్టి చేత గురుని జూచుచున్నాడు. ఇట్లు యోగకర్తల కేస్థాన దృష్టి యైన నుండవలెను. అట్లు స్థాన దృష్టి గలగి యుండి వారికి మధ్య 12 భాగలకు లోపుగా నంతర ముండవలెను. పిమ్మట వారిద్దరును వెనుకటి ప్రకారము ఉత్తమ మధ్యమ, అధమాధి కారముల ననుసరించి ఫల భేదమాలోచింప వలయును. మఱియును వారి నట్టి గుణములు గల చంద్రుడు గూడ వారితో సంబంధించెనేని అది పూర్ణ లక్షణోపేతంబగు యోగ మనబడును.

### 6. కుత్త యోగము

కేంద్ర (1-4-7-10) లేక పణపర (2-5-8-11) స్థానము నందున్న గ్రహము స్వక్షేత్రము లేక ఉచ్చ క్షేత్రము నందుండి లగ్న స్థానము నందున్న గ్రహమును వీక్షించు చున్న కుత్త యోగ మగును. ఈ యోగము నందున్న గ్రహములు జాతకుని వాంఛ నెర వేర్చును.

### 7. దురుఫ యోగము

షష్ఠ, అష్టమ లేక ద్వాదశ స్థానము నందున్న గ్రహము నీచమ పొందినను, శత్రు క్షేత్రము నందున్నను, వక్రగతిని పొంది యున్నను లేక అస్తమించి యున్నను, అట్టిగ్రహము అదే స్థితిని పొందిన యింకో గ్రహముతో

యిధ్యషాల యోగము నందున్న దురుఫ యోగమగును. అట్టి గ్రహములు బలహీనులై శుభఫలముల నిచ్చుటకు నిస్సహాయులై యుందురు.

## 8. తంబీర యోగము

శీఘ్రగమనము గల శక్తి వంతమైన గ్రహము తానున్న స్థానము లేక రాశి యందు చివరి భాగము నందుండి, తరువాత స్థానము లేక రాశి యందు మంద గమనము గల గ్రహముతో యిధ్యషాల యోగము పొందుటకు సిద్ధముగా యున్న తంబీర యోగమగును. ఈ యోగము కార్యసిద్ధికి అనుకూలమై యుండును.

## 9. ఇష్కవళ యోగము

గ్రహములన్నియు కేంద్రములు (1-4-7-10) మఱియు పణపరము (2-5-8-11) లందుండి ఆపోక్లిబములు (3-6-9-12) యందు లేకున్న యిష్కవళ యోగమగును. ఈ యోగము వలన ధనలాభము, సౌఖ్యము, మంచి అదృష్టము గల్గును.

## 10. ఇందువార యోగము

గ్రహము లన్నియు ఆపోక్లిబములు (3-6-9-12) యందున్న ఇందువార యోగమగును. ఈ యోగము వలన మనోవ్యధ, కార్య భంగము, దేహజాడ్యము మొదలగు దుష్ఫలములు గల్గును.

## 11. రడ్డ యోగము

ఇధ్యషాల యోగము నందున్న గ్రహము వక్రించి యున్నను, అస్త మించినను లేక సూర్య బింబము నందు జేరి యున్నను రడ్డ యోగమగును. ఈ యోగము వలన కష్టములతో కార్య సిద్ధి గల్గును.

గ్రహములు కేంద్రములు, అపోక్లిబము లందుండి యిధ్యషాల యోగము రడ్డ యోగముగా మారిన మొదట కార్యసిద్ధి తరువాత కార్య భంగము గలుగును.

## 12. దుప్పరికూత యోగము

స్వస్థానము నందును, ఉచ్చస్థానము నందునను లేని శీఘ్రగమనము గల గ్రహముతో స్వస్థానము, ఉచ్చ స్థానము లేక శుభ స్థానము మొదలగు వాని యందున్న మంద గమనము గల గ్రహము యిధ్యషాల యోగము పొందియున్న దుప్పరి కూత యోగము గలుగును. ఈ యోగము వలన తలంచిన కార్యము సిద్ధించుట మొదలగు సుఫలములు గలుగును.

## 13. గొరికంబూల యోగము

చంద్రుడు వేరొక గ్రహముతో కలిసి యొక స్థానము నందు యోగ కారకుడై యున్నను లేక పోయినను, యింకొక గ్రహము వచ్చి ఈ రాశి క్షేత్రమును జేరి యున్న గొరికంబూల యోగ మగును.

## 14. కళాసర యోగము

లగ్న స్థానాధిపతి, చంద్రునకును యింకొక గ్రహమునకు మధ్య నుండి ఈ రెండు గ్రహములకు పరస్పర దీప్తంస లేకున్న కళారస యోగమగును. ఈ కళాసర యోగము వలన కార్య భంగములు గల్గును.

చంద్రుడు వృశ్చికరాశిలో 2° యందును, ధనుస్సులో గురుడు 10° యందును, మకరములో శుక్రుడు 25° యందుండుటచే యేగ్రహము గూడ యింకొక గ్రహము యొక్క బింబము నందు గాని లేక దీప్తంశ యందు గాని లేదు. అట్లుండుటచే యిది కళాసర యోగమైనది.

| | | | |
|---|---|---|---|
| ల | | | |
| | కళాసర యోగము | | |
| శు – 25° | | | |
| గు – 10° | చ – 2° | | |

## 15. దుత్తోట యోగము

లగ్నాధిపతి, కార్యేసుడు బలహీనులై యుండి, వానిలో యొక గ్రహము స్వక్షేత్రము లేక యుచ్చ క్షేత్రము మొదలగు వాని యందున్న యింకొక గ్రహముతో యిధ్యషాల యోగము పొంది యున్న దుత్తోట యోగమగును.

| | | | |
|---|---|---|---|
| ల – 15° | బు – 9° | | |
| | దుత్తోట యోగము | | |
| గు – 25° | | | |
| | కు – 25° | | |

ఈ యోగము వలన యితరుల సహాయముతో కార్యసిద్ధి గల్గును.

లగ్నాధిపతియైన గురుడు మకరములో25° యందున్నాడు. వివాహ కారకుడు అనగా సప్తమ స్థానాధిపతి యైన బుధుడు మేషరాశియందు 9 భాగలలో యున్నాడు. ఈ రెండు గ్రహములు వారున్న స్థానములను బట్టి బలహీనులుగా యున్నారు. ఇందు గురుడు స్వస్థానమున శక్తివంతమై యున్న కుజునిపై వీక్షణము గల్గి యిధ్యషాలయోగమును పొందియుండుటచే దుత్తోట యోగమైనది. ఈ యోగము వలన యితరుల సహాయముతో వివాహము సంభవించునని గ్రహించ వలెను.

## 16. మానహూ యోగము

రెండు గ్రహములు యిధ్యషాల యోగము పొంది యున్నపుడు. శని కుజులు శీఘ్రగమనము గల గ్రహము యొక్క బింబము నందు జేరి వాని కళను

హరించుచుండుటచే మానహు యోగమైనది. ఈయోగము వలన కార్యభంగములు, శత్రుభయము, ధనక్షయము, ఋణము, బంధు విరోధము మొదలగు దుష్ఫలములు గలుగును.

| | | | |
|---|---|---|---|
| | | చ – 10°<br>కు – 16°<br>శ – 16° | |
| | మానహు యోగము | | శు – 15° |
| | | | |
| | | ల – 12° | |

తులాలగ్నము 12° యందున్నది. లగ్నాధిపతియైన శుక్రుడు 15° లో కర్కాటకము నందున్నాడు. దశమ స్థానాధిపతియై చంద్రుడు 10 భాగలలో వృషభరాశి యందున్నాడు. శనికుజులు 10 భాగలలో వృషభరాశి యందున్నారు. శనికుజులు 16 భాగలలో వృషభరాశి యందున్నారు. దశమాధిపతి యైన చంద్రునకు తృతీయ వీక్షణము గల్గి లగ్నాధిపతియైన శుక్రునితో యిధ్యయోగము పొంది యుండుటచే కార్యసిద్ధి కనుపించు చున్నది. కాని కుజ శనులు అధిక గమనముగల గ్రహముతో దీప్తంశను పొంది యిధ్యషాలయోగమును భందపరచి మానహుయోగము పొందు చుండుటచే కార్యసిద్ధికి బదులు కార్యభంగము గలుగుచున్నది.

## వర్షాధిపతి

వర్షేశ్వర లేక వర్షాధిపతి యొక్క బలాబలములపై ననే జాతకుని యొక్క సంవత్సర శుభాశుభములు ఆధారపడియుండును. వర్షాధిపతి యెంపికకు యైదు గ్రహములు అర్హత గలిగియున్నవి. గాన ఈ యైదు గ్రహములలో షోఢశ వర్గీయ బలపరీక్షద్వారా శక్తి వంతమైన గ్రహమును గ్రహించి వానిని వర్షేశ్వరునిగా తీసుకొనవలెను.

## వర్షేశ్వరునికి అర్హతగల యైదు గ్రహములు

1 వార్షిక లగ్నచక్రములో సూర్యుడుగాని లేక చంద్రుడుగాని యున్న రాశ్యాధిపతి.

2 జన్మ లగ్నచక్రమునందున్న లగ్నాధిపతి.

3 వర్షలగ్న చక్రమునందున్న లగ్నాధిపతి.

4 ముంతా రాశ్యాధిపతి.

5 త్రి రాశ్యాధిపతి.

వర్ష లగ్నచక్రములో సూర్యుడుగాని చంద్రుడుగాని యున్న రాశ్యాధిపతి:- ఇందు వార్షిక సంవత్సరము పగటి కాలమందు ప్రారంభమైన సూర్యుడు యున్న రాశ్యాధిపతి నిన్ని, వార్షిక సంవత్సరము రాత్రికాలమున ప్రారంభమైన చంద్రుడు యున్న రాశ్యాధిపతిని వర్షాధిపతి యెంపిక పరీక్షకు అర్హునిగా భావించ వలెను.

### ముంతా రాశ్యాధిపతి

ముంతాస్థానము రాశిచక్రములో జన్మలగ్నము నుండి సంవత్సరమునకు యొక్క రాశివంతున జరుగుచుండును. దానియొక్క స్థానము ఈ క్రింది విధముగా గ్రహించ వలెను.

జాతకుడు జన్మించిన లగ్నము యొక్క రాశి భాగల సంఖ్యకు, జన్మించిన తేదికిని వార్షిక ప్రారంభ జన్మతేదికిని మధ్య కాలము నందు గడచిన సంవత్సరములను కలుప వలెను. అట్లు కలుపగా వచ్చిన మొత్తమును 12 చే భాగించగా వచ్చిన లబ్దమును త్రోసివేసి శేషమును మాత్రమే గ్రహించును. అట్టి శేషసంఖ్య మేషమునుండి లెక్కించగా నచ్చు రాశియే ముంతాయుండు స్థానమగును. ఈ ముంతాయుండు రాజ్యాధిపతియే ముంతా యొక్క అధిపతియగును.

ఉ॥ వార్షిక లగ్నచక్రము నందు ముంతాయొక్క అధిపతిని గ్రహించుము.

ముంతా రాశ్యాధిపతి

| | |
|---|---|
| | రా. భా. లి. |
| జన్మ లగ్నము (తుల) | 06 -25 - 45 |
| వర్షారంభమునకు గడచిన సంవత్సరములు | 60 |
| | ---------------- |
| | 12) 66-25- 45(5 త్రోసివేయుము |
| | 60 |
| | ———— |
| శేషము | 06-25-45 |

ముంతా = తుల భా. 25 - 45 లిప్తలు కాబట్టి తుల యొక్క అధిపతియే ముంతాధిపతియగును. ముంతాధిపతి = శుక్రుడు

### త్రిరాశ్యాధిపతి

వార్షిక లగ్నచక్రమును బట్టి త్రిరాశ్యాధిపతిని నిర్ణయించ వలెను. వార్షిక లగ్నము పగటి కాలము నందున్న త్రిరాశి పగలు చక్రమును బట్టిని, వార్షిక లగ్నము రాత్రి కాలము నందున్న త్రిరాశి రాత్రి చక్రమును బట్టి త్రిరాశ్యాధిపతిని నిర్ణయించ వలెను.

సామాన్యముగా యున్న - బంధు విరోధము, అనారోగ్యము, స్థాన చలనము, ఉద్యోగము నందున్న అధికారుల వలన భయము గలుగును.

బలహీనమై యున్న - దూర ప్రయాణముల వలన ప్రయాసము, విదేశ నివాసము, అధికారుల వల్ల భయము, ఆకస్మిక వ్యయము, శరీర పీడ, అగౌరవము, ప్రతిష్ట భంగము, కుటుంబ కలహము మొదలగు దుష్ఫలములు గలుగును.

సూర్యుడు పాపకర్తరి యోగము పొంది యున్న అధికారుల వల్ల తీరని భయము, పిత్త జ్వరము, ఖనిజ సంపద వ్యాపారము వల్ల నష్టము, చంద్ర వీక్షణ గలిగి యున్న జాతకునికి వాయవ్య దిశగా ప్రయాణము సంభవించును. రవిపై కుజవీక్షణ గల్గియున్న శత్రు జయము గలుగును.

**2. వర్షేశ్వరుడు చంద్రుడై శక్తి వంతముగా యున్న -**

గౌరవ మర్యాదలు, కుటుంబవృద్ధి, మనశ్శాంతి, భూ, ధనలాభము, వ్యవసాయాభివృద్ధి, రత్నలాభము, అధికారాభివృద్ధి, మతగురువులు, రాజ్యాధినేతల స్నేహము.

సామాన్యముగా యున్న - భూమి మొదలగు వానివల్ల లాభము, భూనష్టము, స్నేహ విరోధము, సంతాన కలహము, ఉద్యోగము నందున్న స్థాన చలనము, అనారోగ్యము, శుభా శుభ ఫలములు.

బలహీనమై యున్న - వ్యవహార చిక్కులు, చంచల మనస్సు, స్థాన చలనము, కుటుంబ సంక్షోభము, ఉబ్బస రోగము, చోర భయము, లక్ష్యములేని ప్రయాణములు, దౌర్భాగ్య జీవితము మొదలగు దుష్ఫలములు గలుగును.

హైన సుందరుడు వ్రాసిన ప్రకారము స్త్రీ సంతాన ప్రాప్తి, ఇంద్రియ వాంఛ గల కలలు, వాయువ్య దిక్కునకు ప్రయాణము గలుగును.

చంద్రుడు రవితో గూడి యున్నను లేక వీక్షింపబడుచున్న రాజ్యాధి నేతలతో స్నేహము, జ్వరము, ప్రభుత్వముతో అనిష్టత, కుజునితో-శరీర ఉష్ణోగ్రత, కపము వల్ల జ్వరము, ప్రభుత్వముతో అనిష్టత, కుజునితో- శరీర ఉష్ణోగ్రత, కపము వల్ల జ్వరము, ఆయుధ భయము, లేక షష్టమాధిపతి కుజుడైన శస్త్ర చికిత్స. బుధునితో- వాహన ప్రాప్తి, సామాన్య సౌఖ్యము, ఫోర్డరీ లేక తప్పుడు పత్రములు లేక జాబులు వ్రాయుట (శుభ పాప వీక్షణ లను బట్టి) గురునితో-వివాహము జరుగని యెడల వివాహము, ఉద్యోగము నందు వృద్ధి, వ్యాపార వృద్ధి, గౌరవము. శుక్రునితో- వివాహము, నూతన గృహప్రాప్తి, సామాన్య అభివృద్ధి. శనితో-అశాంతి, బంధు నష్టము, ప్రభుత్వము వల్ల అసౌఖ్యము, అనవసర ధనవ్యయము, రక్త లోపము వల్ల అనారోగ్యము. రాహువుతో-శత్రుబాధ, కుటుంబ కలహములు, వింత రోగము, భయము, మలిన రక్తము. కేతువుతో-మూర్ఛ రోగము, వింత జ్వరము, విష భయము, ఆగ్నేయ దిశకు ఆకస్మిక ప్రయాణము గలుగును.

**3. వర్షేశ్వరుడు కుజుడై శక్తి వంతముగా యున్న -**

ప్రతి ప్రయత్నము నందు జయము, ప్రతిష్ట, జ్ఞాతివృద్ధి, ధనవృద్ధి, శత్రునాశనము, సైన్యము నందున్న రాజ మర్యాద, సామాన్య సౌఖ్యము.

సామాన్యముగా యున్న - అపార్థముల వల్ల బంధు విరోధము, అధికారుల వల్ల అనిష్టత, అహంకారము, నాయకత్వము, రక్త రోగము, కీడు, హోదాలో స్వల్ప వృద్ధి.

బలహీనముగా యున్న - ధననష్టము, అనేక కష్టములు, విదేశ నివాసము, జ్వర భయము, అగ్ని భయము, శత్రు చోర భయము, కీడు, అగౌరవము, నిందలు, లక్ష్యము లేని ప్రయాశము, ప్రేమ కలాపములలో అపజయము.

కుజుని గురుడు వీక్షించుచున్న పై ఫలము లన్నియు యెక్కువుగా మార్పుచెందును. కుజుడు రవితో కూడి .ఉన్నను వీక్షింప బడుచున్న ధైర్య సాహసములకు ప్రతిష్ట, ప్రభత్వము వల్ల ఆదాయము, వాజ్యము నందు జయము, తూర్పు దిశకు ప్రయాణము. చంద్రునితో- రత్న లాభము, ప్రభుత్వాధికారుల వల్ల భయము, అగ్ని భయము, పశు, ధాన్య నష్టము. బుధునితో- దుష్ఫలితములు. గురునితో- భక్తులతో స్నేహము, యాత్ర, ప్రారంభించిన పని యందు జయము, మంచి ప్రతిష్ట, స్వల్పహాని, ఈశాన్య దిశకు ప్రయాణము. శుక్రునితో- అనారోగ్యము, శత్రుబాధ. శనితో- విచారము, దుఃఖము, ధన నష్టము, అల్పులతో సహవాసము, చెడ్డ మనస్సు. రాహువుతో- భీతిని గలిగించు వార్తికము, చోర భయము, రాజ శత్రు భయము, ఉబ్బస రోగము, కీళ్ళ వ్యాధి, నైఋతి దిశకు ప్రయాణము. కేతువుతో- పిడుగు భయము, శరీర కష్టము, అశాంతి గలుగును.

4. **వర్షేశ్వరుడు బుధుడై శక్తివంతముగా యున్న** - వంచన, చాతుర్యముతో గూడిన ఐశ్వర్య లాభము, వ్యాపారము, సాంకేతిక విద్యా జ్ఞానము పొందుట, విద్యా విషయకమైన గుర్తింపు, గౌరవము, ప్రతిష్ట, చర్చల యందు జయము, విద్యావంతులు ప్రభు సంపన్నులతో స్నేహము, మంత్రిత్వము గలుగును.

సామాన్యముగా యున్న - ఆటంకము, తదుపరి జయము, పై ఫలములకు విరుద్ధము.

బలహీనుడై యున్న - భంగపాట్లు, వ్యాపార నష్టము, ధననాశము, నింధ, వ్యవహార చిక్కులు, అనేక ప్రయత్నములు, అనాచార ప్రవర్తనలు, వాగ్దాన భంగములు మొదలగునవి గలుగును.

బుధుడు రవితో కూడియున్నను లేక వీక్షింప బడుచున్న - శరీర బాధ, ఉత్తర దేశ ప్రయాణము, బిరుదు ప్రసాదము, విద్యా విషయకమైన గుర్తింపు, శుభకార్యములు, అధికారుల వల్ల గౌరవము, తలంచని లాభములు. చంద్రునితో- శుభాశుభములు, జంతు బాధ, శత్రు జయము, వాయువ్య దిక్కు ప్రయాణము నందు చిక్కులు. కుజునితో - శ్రేయోభిలాషులతో కలతలు, గేదెల వలన భయము, చర్మవ్యాధి, దీర్ఘ వ్యాధికి అవకాశము. గురునితో - అనారోగ్యము, బాధల నుండి వుపశమనము, శత్రుజయము, ప్రభుత్వము లేక విద్యా సమాజముల నుండి గౌరవమర్యాదలు, యాత్రా సౌఖ్యము, నైఋతి ప్రయాణము వలన లాభము. శుక్రునితో - విజ్ఞాన మొదలగు శాస్త్ర ప్రావీణ్యత లేక గుర్తింపు, గృహ సౌఖ్యము, నూతన స్త్రీ సమాగమము, సంగీత నాట్యకళా సమాజములతో సమాగమము,

గృహము నందు శుభకార్యములు. గౌరవ మర్యాదలు. ఆగ్నేయ దిశకు లాభదాయకమైన ప్రయాణములు. శనితో-కిరాతత్వము. నపుంసకత్వము. మూలవ్యాధి. తలవని తలంపుగా మూల స్థానముల నుండి నష్టము. వ్యభిచార స్త్రీతో పరిచయము. రాహువుతో - అన్ని వ్యవహారములలో సామాన్య జయము. క్రొత్త వ్యవహారములలో ప్రవేశము. స్వల్ప మనో వ్యాధి లేక అపస్మారము. అపవాదులు. నీచుల వల్ల లాభము. కేతువుతో-మనోవ్యధ. వేదన. భయము.

**5 వర్షేశ్వరుడు గురుడై శక్తివంతుడై యున్న** -కీర్తి. నమ్మకము. ప్రతీతి. కొత్త మార్గములలో ధనలాభము. మంచి పనులు. సహజ జ్ఞానము. శిశు జననము. కుటుంబ సౌఖ్యము. వివాదములలో జయము. గౌరవము. బిరుదు. వ్యవసాయము నందు లాభము. పుణ్య క్షేత్రములకు యాత్ర. భక్తుల దర్శనము. ప్రతిష్ట.

సామాన్యముగా యున్న - నివాస చలనము. శాస్త్ర పఠనము. విద్యాభి వృద్ధి. మిశ్రమ ఫలమును.

బలహీనముగా యున్న - కార్య భంగము. బంధు నాశము. ఐశ్వర్య హాని. స్నేహ విరోధము. శ్లేష్మ రోగము. వివాదములు.

గురుడు రవితో సంయోగము చెంది యున్నను లేక వీక్షించ బడుచున్న - యాత్ర. తూర్పు ప్రయాణము వలన లాభము. రత్న లాభము. సజ్జన సహవాసము. రాజకీయ వ్యవహారములలో పేరు ప్రతిష్టలు. జ్వర బాధ. చంద్రునితో - పడుచు స్త్రీలతో సహవాసము. సౌఖ్యాభి వృద్ధి. భోజన సౌఖ్యము. వసతి సౌఖ్యము. గౌరవము. గొప్ప బహుమతులు. వాయవ్య దిశకు స్వల్ప ప్రయాణము. కుజునితో- ధన వృద్ధి. వివాదములలో జయము. యెఱ్ఱని వస్తువుల వ్యాపారము. రోగ విముక్తి. దక్షిణ దేశ ప్రయాణము. రాష్ట్ర ప్రభుత్వముతో వివాదము. ప్రయాణము వలన హాని. బుధునితో-ధనవృద్ధి. విచారము మఱియు సంతోషము. సమాన లాభ నష్టములు. చోరీ వలన నష్టము. శుక్రునితో - ధననష్టము. శత్రువుల వలన అతిమనో వ్యధ. వెడబాటు. మనస్సుకు అశాంతి. శనితో-హిందూ యేతరులతో సంకటనలు. ఐశ్వర్య హాని. అపనింద. స్థానచలనము లేక గృహమార్పు. జూదము వలన లష్టము. త్రాగుబోతు తనము. రాహువుతో-కారాగార వాస భయము. బంధు సంకటనలు. వాతము వలన అనారోగ్యము. కేతువుతో-అపార్థములు. తీవ్రరోగము లేక మరణము. పదవి భ్రష్టత్వము. గౌరవ హాని గలుగును.

**6. వర్షేశ్వరుడు శుక్రుడై శక్తి వంతముగా యున్న -**

దాంపత్య సుఖము. గృహ సౌఖ్యము. మంచి ఆరోగ్యము. జయము. ఆటల యందు జయము. విద్యా వినోదము. ఆభరణ లాభము. శుభకార్యములు. రాష్ట్ర కంట్రాక్టుల వల్ల ధనలాభము. స్త్రీ సౌఖ్యము. నూతన జ్ఞానము సంపాదించ వలెనను వాంఛ. లైంగిక సుఖవృద్ధి.

సామాన్యముగా యున్న - స్వల్ప ఆదాయము. కష్టములు. అశాంతి మనస్సు కలతలు.

బలహీనముగా యున్న - అసౌఖ్యము. మనోవ్యాకులత. యితరులచే అపవాదులు. సామాన్య ఫిర్యాదులు. ఉద్యోగ భంగము లేక తగ్గింపు. కుటుంబ బాధ. కిరాతత్వము. నీచ జాతి స్త్రీల భయము.

శుక్రుడు రవితో కూడియున్నను లేక వీక్షించ బడుచున్న - శూల లేక కడుపు నొప్పి బాధలు. వృత్తి బాధలు. జ్వరము. నేత్ర లేక శిరో బాధలు. శరీర బలహీనత. అధికారుల వల్ల భయము. అధిక ధన వ్యయము. చంద్రునితో- పశువులకు రోగము. దంతబాధ. కామెర్లు. తలత్రిప్పు. కామ సౌఖ్యము. కీళ్ళ వ్యాధి. కుజునితో-స్థిర ఆస్థి సంపాదన. కామవాంఛ. మూల వ్యాధి భయము. సోదర లేక సోదరీ వివాహము. వాహన ప్రాప్తి. బుధునితో-సొంత భావములు తెలుపుటకు అవకాశము. రచయితగా ప్రతిష్ట. హోదా యందు వృద్ధి. ప్రతిభ యొక్క గుర్తింపు. శిశు జననము. ఉత్తర దేశ యాత్ర. గురునితో-వార్థిక పొడవున సుఖము. మంచి కార్యములు. సజ్జన సాంగత్యము. యాత్రా సుఖము. మంచి ఆదాయము. గౌరవ మర్యాదలు. తలంచిన కార్యము సిద్ధించుట. శనితో-వృత్తి ఔన్నత్యము. వ్యాపార లాభము. నూతన ఆస్తి సంక్రమించుట. వివాదముల యందు జయము. కీళ్ళరోగము. విష జ్వరప్రమాదము లేక నీటి గండము. నీచజాతి స్త్రీ సాంగత్యము. రాహువుతో-శిరస్సు లేక దంత రోగము. రక్త హీనత. అనారోగ్యము. సర్పభయము. ఆగ్నేయ దిశ ప్రయాణముల వలన అపాయము. హీనుల సహవాసము వల్ల లేని పోని ధననష్టము. కేతువుతో-కలతలు లేక బంధువులతో వివాదములు. సంతాన అసౌఖ్యము. అపనిందలు. వివాదములు. మూర్ఛ. సర్పకాటు. భయము. మనోవ్యాకులత. గడ్డుదినములు గడుపు వార్థికము.

**7. వర్షేశ్వరుడు శనియై శక్తివంతుడై యున్న -**

భూలాభము. గృహలాభము. విదేశ ద్రవ్య లాభము. దుష్టులతో పరిచయము. అన్యాయార్జన. యితరుల సహాయము కొరకు వీక్షించుట. అపాయములు. భూతరోగములు. హోదాయందు వృద్ధి గలుగును.

సామాన్యముగా యున్న -అసౌఖ్య జీవనము. తక్కువ స్థాయికి దిగుట లేక ఉద్యోగ భంగము. నీచులతో స్నేహము గలుగును.

బలహీనుడై యున్న - కుటుంబ వస్తువులు. అగౌరవము. బీదరికము. రోగములు. విచారము. దుఃఖము. ధనక్షయము. శత్రుభయము. కుటుంబములో అనారోగ్యము. కారాగార వాస భయము. సామాన్య వ్యాకులము గలుగును.

శని సూర్యునితో కూడి యున్నను లేక వీక్షించ బడుచున్న - సంతానము వల్ల దుఃఖము. స్నేహితులతో శత్రుత్వము. ప్రయాణములో అనారోగ్యము. శిరోబాధ. ప్రభుత్వ చర్య రెచ్చగొట్టుట. ద్రవ్య నష్టము. తీరని మనోవ్యధ. చంద్రునితో - పుత్రికకు రోగ ప్రమాదము లేక మరణము. ఇన్ని విధములైన కష్టములు. ధననాశము. సమీప బంధు నష్టము. శ్లేష్మపూరతమైన రోగములు. వాయవ్య యాత్రలో కష్టములు. కుజునితో-చోరాగ్ని భయము. ప్రదేశము లేక హోదామార్పు. బంధువిరోధము. దక్షిణ దేశ యాత్రలో కష్టములు. మలిన రక్తము. ధనవ్యయము.

బుధునితో- అదృష్టము, సౌఖ్యము, ఆర్థిక లాభము, పుత్ర జననము, మంత్రులతో స్నేహము, ఉత్తర దేశ ప్రయాణము వల్ల లాభము. గురునితో- ఆర్థిక లాభము, సౌఖ్యము, యాత్రలు, గొప్ప అధికారము, కుటుంబ సౌఖ్యము, భూములు, సువర్ణ లాభము. శుక్రునితో- కుటుంబ సౌఖ్యము, గౌరవ మర్యాదలు, సంతాన సౌఖ్యము, గుర్తింపు, శ్లేష్మ వ్యాధులు. రాహువుతో - విష జ్వరములు, గవదల వ్యాధి, విదేశీయుల వల్ల కష్టములు, కాళ్ళవాపు, శ్లేష్మ వ్యాధి, నీటి గండము, సర్పకాటు, మనో వ్యాధి, ఆగ్నేయ దిశ ప్రయాణము వలన నష్టము. కేతువుతో - కీళ్ళ వ్యాధి, సమీప బంధు విరోధము, నైఋతి యాత్ర వలన ప్రయాసము, పాపకార్యములు, పాపపు పనులు, దుష్టులతో స్నేహము, అసౌఖ్యము, మనోవ్యధ.

వర్షేశ్వరునితో శుభ గ్రహము యిథ్యశాల యోగము పొందిన వర్షేశ్వరునికి శుభగ్రహము తనశక్తిని మంచి కొరకు బదిలీ చేయును. వర్షేశ్వరునితో పాపగ్రహము కూడియున్న వర్షేశ్వరుని బలము క్షీణించును.

## ముంతా యొక్క ఫలములు

ముంతా యేర్పడు విధానము యిదివరలో చెప్పబడి యున్నది. వార్షిక చక్రములో ముంతా స్థానాధిపతి శుభగ్రహ వీక్షణము గలిగి యున్న జాతకుని యొక్క వార్షిక ఫలములు సామాన్యముగా మంచివై యుండును. ముంతా స్థానాధిపతికి పాపగ్రహ సంయోగముగాని వీక్షణముగాని గలిగి యున్న జాతకుడు అనారోగ్యముచే బాధ పడు చుండును.

వార్షిక లగ్నము యొక్క స్థానాధిపతి వార్షిక చక్రములో చతుర్థ, సప్తమ, ద్వాదశ, షష్ట లేక అష్టమ స్థానముల యందున్న అశుభ ఫలముల నిచ్చును. నవమ, దశమ లేక ఏకాదశ స్థానముల యందున్న జాతకునికి బాధ్యతను గాని లేక బాధ్యత గల హోదాను గాని ప్రసాదించును. వార్షిక లగ్నాధిపతి లగ్న, ద్వితీయ, తృతీయ లేక పంచమ స్థానముల యందున్న జాతకుడు నూతన ఉద్యోగమును గాని లేక నూతన వృత్తిని గాని పొంద గలడు.

ముంతా లగ్నరాశి యందున్న - శత్రునాశము, గౌరవము, సంతానము, వాహన ప్రాప్తి, ఐశ్వర్యము, ప్రభువుల వలన గౌరవము, చైతన్యము, నూతన మార్గముల వలన ధనలాభము, ఉద్యోగ ఔన్నత్యము. ద్వితీయ స్థానమున ముంతా యున్న - గౌరవము, ఘనత, మంచి శక్తి, ఆదాయము నందు వృద్ధి, మంచి భోజనము, సామాన్య సౌఖ్యము. తృతీయ స్థానమున ముంతాయున్న - శత్రు జయము, గౌరవము, మంచి ఆదాయము, సోదర సౌఖ్యము, బంధు సౌఖ్యము, దేవాలయ దర్శనము, మంచి ఆరోగ్యము, గొప్పవారి సహాయము. చతుర్థ స్థానమున ముంతా యున్న - అనారోగ్యము, శత్రువులు, బంధు కలహము, మనోవ్యధ, అ మర్యాధ, సౌఖ్యహాని. పంచమ స్థానమున ముంతాయున్న - జ్ఞానము, శాస్త్ర పఠనము, సంతాన వృద్ధి లేక సంతాన సౌఖ్యము, విశ్రాంతి, యాత్ర లేక వినోద క్రీడా స్థలములు దర్శించుట, గౌరవము, ప్రభుత్వ సహాయము. షష్ట స్థానమున ముంతా యున్న - శరీర బాధ, బలహీనత, పశ్చాత్తాపము, ఋణము, అనారోగ్యము, శత్రువృద్ధి, కలహములు, అపార్థములు, చోర భయము, అధికారులతో

వివాదము, మితికి మించిన ఖర్చు, రోగము. సప్తమ స్థానమున ముంతా యున్న - భార్య దుఃఖము, కలహములు, ఆశాభంగము భంగ పాట్లు, సోమరితనము, ధననష్టము, శరీర కష్టము, మనోవ్యధ. అష్టమ స్థానమున ముంతాయున్న - చోర శత్రు భయము, పనికి మాలిన పనుల యందు ధనవ్యయము, రోగ ప్రమాదము, దూరదేశ ప్రయాణము. నవమ స్థానమున ముంతా యున్న - అధికారుల నుండి మన్ననలు, స్వహక్కు, ఐశ్వర్య లాభము, కళత్ర సంతాన సౌఖ్యము, గౌరవము, భాగ్యాభివృద్ధి. దశమ స్థానమున ముంతా యున్న - ప్రభుత్వ సహాయము, జయము, కోర్కెల సఫలము, భక్తి, గౌరవ మర్యాదలు, అభివృద్ధి, మంచి కార్యములు మొదలగు సుఫలములు గలుగును. ఏకాదశ స్థానమున ముంతా యున్న -శరీర సౌఖ్యము, గౌరవము మర్యాద, రాజకీయమైన జయము, నూతన స్నేహములు, వాంఛా ఫలములు. ద్వాదశ స్థానమున ముంతా యున్న -మితి లేని ఖర్చులు, నీచులతో స్నేహము, ఆశాభంగము, ఉద్రేకము, అనారోగ్యము, సజ్జనులతో విరోధము.

ముంతాపై గల గ్రహవీక్షణములు మొదలగు వాని స్వభావమును బట్టి పై ఫలములు మార్పు చెందు చుండును.

ముంతా యే భావమునైతే జేరి యుండునో ఆభావము పాపగ్రహ సంయోగము చెంది యున్నను, పాపగ్రహ వీక్షణము గల్గి యున్నను ఆ భావము చెడు ఫలముల నిచ్చును. ఏభావమైతే శుభ గ్రహ సంయోగము, శుభగ్రహ వీక్షణము గలిగి ముంతా అందుండి ఆ రాశ్యాధిపతి యిధ్యషాల యోగమును పొంది యున్న ఆ భావము వీర్యవంతుడై బలము గలిగి యుండును.

ముంతా యున్న రాశ్యాధిపతి అష్టమ స్థానాధిపతితో కూడియుండి లేక వీక్షించబడుచుండి, అష్టమాధి పతి గూడ పాపగ్రహ సంయోగము, వీక్షణ గలిగి యున్న మరణము సంభవించును. ఈ మరణము జాతకునికి తన జన్మ రాశి చక్రము నందు మారక దశ జరుగుచున్న సంభవించును. లేని యెడల జాతకుడు అతికష్టమైన దినములు గడపవలసి యుండును.

ముంతా స్థానాధిపతి జాతకుని యొక్క జన్మ చక్రములో యే స్థానమునైతే ఆక్రమించి యుండునో అదే స్థావమును వార్షిక చక్రము నందు గూడ జేరి యుండి పాపగ్రహ సంయోగము గాని పాపగ్రహ వీక్షణము గాని పొందకున్న జాతకుడు వార్షిక ప్రారంభము నందును, అంత్యమందును సుఫలములు పొంద గలడు.

ముంతా మఱియు గ్రహములు - ముంతా స్థానము నందు యితర గ్రహములు యున్నపుడును, యితర గ్రహములచే ముంతా స్థానము వీక్షించ బడుచున్నపుడు నీలకంతుడు ఫలములు ఈ క్రింది విధముగా యుండునని చెప్పి యున్నాడు. గ్రహముల యొక్కకూడిక అనగా ముంతా యేస్థానము నందుండునో ఆ స్థానమున యితర గ్రహములుండుట లేక ఆ స్థానమును యితర గ్రహములు వీక్షించు చుండుట యని గ్రహించవలెను.

రవి ముంతా స్థానము నందున్నను లేక ఆస్థానము రవిచే వీక్షించ బడుచున్న - రాజకీయ జయము, గొప్ప ఉద్యోగములతో స్నేహము, వృత్తి యందు ఔన్నత్యము. చంద్రుడు- జాతకునికి కీర్తి, మతాధిపతులను కలియుట, మంచి

ఆరోగ్యము, సంతోషము, సౌఖ్యము. చంద్రుడు పాపక్రాంతుడై యున్న గొప్ప దుఃఖము. కుజుడు లేక శని - ఉష్ణ పైత్యరోగముతో బాధ, ఆయుధభీతి, శస్త్రచికిత్స, రక్తపోటు మొదలగునవి. బుధుడు, శుక్రుడు - వివాహము లేక స్త్రీ సాంగత్యము, పేరు ప్రతిష్ట, ఆచార వ్యవహారములు, వీరలే బలహీనులై యున్న కష్టములు, శ్రమ గలుగును. గురుడు - శిశు జననము, లేక సంతాన సౌఖ్యము గృహసౌఖ్యము, రాజకీయమైన జయము, వస్తులాభము. శని - కీళ్ల వాతము, అపకీర్తి, అధిక వ్యయము, బొబ్బలు. గురు వీక్షణ గలిగి యున్న కీడు చేయు ప్రాబల్యము చాల వరకు తగ్గును.

రాహువు న్యూనాంశ గలవాడై విలోమ గమనము నొందుటచే రాశి యొక్క చివర భాగము నుండి రాహువున్న స్థానము వరకు ముఖ మగును. రాహువున్న రాశి యొక్క మొదటి భాగము నుండి తానున్న ప్రదేశము వరకు వెనుక భాగముగా యుండును. రాహువు మేషములో 20 భాగల యందున్నాడనుకోందము. ఇంకొక గ్రహము 20 మరియు 30 భాగల మధ్యలో యున్నపుడు ఈ గ్రహము రాహువునకు ముఖభాగమున యున్నట్లును, ఈ గ్రహమే మేషములో 20 భాగల లోపు నందున్నపుడు ఈ గ్రహము రాహువునకు వెనుక భాగమున యున్నట్లగును.

రాహువునకు ముఖభాగమున ముంతాయున్న ఆదాయమునకు అవకాశము, ప్రతిష్ట, ధర్మము. గురుడు లేక శుక్రునితో కూడి యున్న జాతకుడు మంచి ఔన్నత్య పదవిని పొందుటయే గాక వానికి రత్న లాభము గలుగును. ముంతా స్థానము రాహువునకు వెనుక భాగము నందున్న శత్రుభయము, కష్టములు గలుగును. లగ్నము నందు రాహువున్న సంపాదించిన ధనము నష్టమగుట, ఆర్థిక బాధలు గలుగును.

వార్షిక లగ్న స్థానము నుండి ముంతా స్థానాధిపతి చతుర్థ, షష్ట, అష్టమ, ద్వాదశ స్థానముల యందున్నను లేక వక్రించి యున్నను లేక అస్తమించి యున్న జాతకుడు సంవత్సర కాలములో అనారోగ్యము, అధిక వ్యయము, ధననష్టము పొంద గలడు.

## ద్వాదశ భావ ఫలములు

తాజక సిద్ధాంతరీత్యా నీలకంఠుడు చెప్పిన భావ ఫలములకును పరాశరుడు చెప్పిన భావ ఫలములకు తారతమ్యము యెక్కువుగా కనిపించుట లేదు. ఏయే భావములు శుక్ర, బుధ, గురులచేతను ఆ భావాధిపతి చేతను చూడబడినవియును, కూడబడినవియును యై యుండి యితర గ్రహముల యొక్క దృగ్యోగాది సంబంధములు లేక యున్న అటువంటి భావములు సర్వోత్తములైన ఫలములను గలుగ జేయునని పరాచర, తాజక సిద్ధాంత గ్రంధము లందు చెప్పబడి యున్నవి. తను భావము మొదలుగా గల భావముల యందు శుభగ్రహములున్నను, వాని భావాధిపతుల చేత వీక్షించ బడినను, కలిసి యున్నను ఆభావములు శుభ ఫలములను గలుగ జేయును. మరియు నా భావముల యందు పాపగ్రహముల యొక్క దృగ్యోగాది సంబంధములు లేకున్న సమృద్ధిగ శుభ ఫలముల నిచ్చును. నీచ స్థానము నందున్న గ్రహమును శత్రుస్థానము నందున్న

గ్రహమును భావమును నశింపజేయును. ఏ భావాధిపతి 6-8-12 స్థానముల యందుండునో ఆ భావము నశించును. ఏ భావము నందు దుస్థానాధిపతి యుండునో ఆ భావము గూడ నశించును.

## 1. లగ్న భావము

తనువు, దేహచ్ఛాయ, వెంట్రుకలు, స్వరూపము, ఆకృతి, గుణము, ఆయువు, ఆత్మ, సౌఖ్యము, కలలు, ఆరోగ్యము, కులము, చర్మము, వయస్సు మొదలగునవి లగ్న స్థానమును బట్టి విచారింప వలయును.

వార్షిక లగ్నచక్రములో లగ్నాధిపతి బలవంతుడై యున్న జాతకుడు మంచి ఆరోగ్యము, సౌఖ్యము గలిగి వృద్ధి జెందు వాడుగ నుండును. సూర్యుడు బలము లేని వాడై వార్షిక లగ్న చక్రములో లగ్నాధిపతియై వర్షేశ్వరునకు జన్మ లగ్న చక్రములో లగ్నాధిపతి యైనను లేక ముంతా స్థానాధిపతియై యున్న జాతకునికి ప్రభలమైన అనారోగ్యము, నేత్ర వ్యాధులు, చర్మ వ్యాధులు గల్గుట, తల్లి దండ్రులతో కలతలు మొదలగునవి గలుగును. అట్టి వాడే చంద్రుడైన జాతకునికి దీర్ఘ నేత్రరోగము, వృత్తి యందు ఆశాభంగము, ఆర్థిక వత్తిడి, వ్యాజ్యము నందు అపజయము, సంసార కలతలు, అపార్థములు మొదలగునవి గలుగును.

వార్షిక చక్రము నందు లగ్నాధిపతి, జన్మచక్రము నందు లగ్నాధిపతి లేక వర్షేశ్వరుడు లేక ముంతా స్థానాధిపతి కుజుడైన -మనోవ్యధ, బుధుడైన - మనశ్శాంతి లేకుండుట మఱియు దుఃఖము, గురుడైన - మత ద్వేషము, నిరాశ, శుక్రుడైన - మనోదుఃఖము, స్త్రీలతో కలహము, శనియైన - ఉద్యోగములో సంకటనలు, అనారోగ్యము, సేవకుల వల్ల బాధలు.

నలుగురు స్థానాధిపతులు - జన్మ చక్రములో లగ్నాధిపతి, వార్షిక చక్రములో లగ్నాధిపతి, ముంతా స్థానాధిపతి, వర్షేశ్వరుడు బలవంతులై 6-8-12 స్థానములు చేరకున్న జాతకుడు సంవత్సర కాలము నందంతను అన్ని విషయముల యందు జయమును పొంది సౌఖ్యము, ధనలాభము, ఐశ్వర్యము మొదలగునవి గలుగు వాడుగ నుండును.

పై నలుగురు స్థానాధిపతులలో యెక్కువ మంది బలహీనులై దుస్థానముల యందున్న జాతకుడు సంవత్సర మంతయును కష్టముల ననుభవించ వలసి యుండును. లగ్నాధిపతి ద్వితీయ, నవమ, దశమ స్థానాధిపతులతో యిథ్యశాలయోగము పొంది యున్న జాతకునికి ధన నాశము గలుగును. లగ్నాధిపతి దరిద్రాధిపతితో చేరియున్న జాతకుడు దరిద్ర మనుభవించు వాడగును.

## లగ్నము నందున్న గ్రహముల ఫలము

లగ్నము నందు సూర్యుడున్న వాతపిత్త రోగము, కళత్ర రోగము, శిరోరోగము లేక నేత్ర రోగము. చంద్రుడున్న - ప్రజాకలహము, కారణము లేని మనో వ్యాధి, జ్వరము. కుజుడున్న - కురుపులు, కీళ్ళవ్యాధి, శత్రు కలహము, శిరోనేత్ర రోగము, కీళ్ళ నొప్పులు, వాంతి, ప్రభుత్వముతో కలహము, అగ్ని భయము లేక బరువైన లోహము పైబడుట వలన గాయము. బుధుడున్న - సామాన్య సౌఖ్యము, శత్రు జయము, నూతన వ్యాపారము, క్రొత్త స్నేహితులు,

ఆర్థిక స్తోమత. గురుడున్న - సౌఖ్యాభి వృద్ధి. మంత్రి లేక ప్రభుత్వ పదవి. వ్యాపార వృద్ధి. గౌరవము. శత్రువులకు అపజయము. సర్వము మేలుకొరకేనను దృష్టి. శుక్రుడున్న - ఐశ్వర్యము. గౌరవ మర్యాద వృద్ధి. శత్రునాశము. పెద్దల వలన గౌరవము. శనియున్న - స్వక్షేత్రము లేక ఉచ్చ క్షేత్రమైన శిశు జననము. అపార్థములు. పేరు ప్రతిష్టలు చెరుచుటకు శత్రువుల ప్రయత్నము. జాడ్యము. అన్ని విధముల దుఃఖము. రాహువున్న - ఇతరుల ఉంపుడు కత్తెతో సంబంధము. ఉంపుడు కత్తె లేక కన్యతో స్నేహము. శత్రువుల వలన భయము. ప్రభుత్వముచే బెదరింపు తాకీదు. పందెముల యందు గౌరవము. నేత్ర వ్యాధి. కేతువున్న - అపజయములు. దీర్ఘ వ్యాధులలో నూతన సంకటనలు. అసౌఖ్యము. నీచుల స్నేహము. యోగ్యత లేని వారితో కలహము.

## 2. ద్వితీయ భావము

ఐశ్వర్యము. వాక్కు. శ్రేయస్సు. ఆశ్రితులు. నాలుక. నేత్రములు. గోళ్ళు. సౌఖ్యము. రత్నములు. మనస్సు. స్థిరత్వము. సత్యము. స్వభావము. కపటము.

జన్మచక్రములో గురుడు ద్వితీయాధిపతియై వార్షిక చక్రములో ద్వితీయ స్థానమును జేరియున్నను లేక లగ్నాధిపతితో యిధ్యషాల యోగమును పొంది యున్న జాతకుని యొక్క ఆర్థిక వ్యవహారములు సంవత్సర మంతలో సక్రమముగా పరిష్కరించబడును. గురుడు పాపగ్రహములతో ఈ సర్వ్ఃయోగము నందున్న పై ఫలములు విరుద్ధముగా యుండును. జన్మచక్రము నందు గురుడు ద్వితీయ స్థానమును వీక్షించుచుండి. బలవంతుడై వర్షేశ్వరుడైన జాతకుడు శ్రమించకనే ధనమార్జించు వాడగును. జన్మ చక్రమున గురుడు యే భావము నందుండునో వార్షిక చక్రమున అదే భావము నందుండి లగ్నాధిపతితో యిధ్యషాల యోగము పొంది యున్న ఆ భావము వార్షికము నందంతటిలో వృద్ధి చెంది సుఫలముల నిచ్చును. జన్మచక్రములో గురుడు వీక్షించు భావము యొక్క అధిపతి వర్షేశ్వరుడై యున్న ఆ భావము వృద్ధి చెంది సుఫలముల నిచ్చును. ద్వితీయ స్థానము నందు గురుడుండి శుభులచే వీక్షించబడుచున్న జాతకుని యొక్క హోదాలో వృద్ధి కనిపించును. ముంతారాశిని గురుడు వీక్షించుచున్న అదే వృద్ధి కనుపించును. శుక్రుడు లగ్నాధిపతియై ద్వితీయాధి పతితో హేసరాఫ యోగము పొంది యున్న జాతకునికి మామూలు ఆదాయము క్షీణించుటయే గాక ధననాశము గల్గును. బుధుడు బలవంతుడై ద్వితీయ స్థానము నందున్న జాతకుడు వ్రాత. ప్రచురణ మొదలగు వాని వలన లాభము పొందును. బుధుడు. శుక్రుడు. గురుడు ద్వితీయ స్థానము పొంది యున్న జాతకుడు గొప్ప పదవి. మంచి ఆదాయము. ఆకస్మిక హోదాలో వృద్ధి పొంద గలడు.

ద్వితీయాధిపతి శుభులచే స్నేహ వీక్షణ గలిగి యున్న జాతకునికి ఆర్థిక సంబంధమైన బాధలేమియు యుండక శ్రమలేకనే ఆదాయము నందు అభివృద్ధి గలుగును. అదే పాప వీక్షణము గలిగి యున్న ధనలాభము కొంత కష్టము మీద

గలుగును. లగ్నాదిపతియు, ద్వితీయాధిపతీయును పరస్పర శుభ వీక్షణము గలిగి యిధ్యషాల యోగము పొందిన ధనాదాయము శ్రమ, కష్టములేకనే సంక్రమించును. హేసరాఫ యోగమైన ధననాశము, అధిక వ్యయము, ప్రభుత్వముచే జరిమానా విధించబడునను భయము మొదలగునవి గలుగును.

జన్మచక్రములో లగ్నమందు సూర్యుడుండి వర్షఫల చక్రములో ద్వితీయ స్థానము నందున్న సంవత్సర మొత్తములో ఆర్థిక పరిస్థితి జాతకునికి నిలకడగా యుండును. ద్వితీయ స్థానమున శనియున్న సంవత్సరములో కొంత లాభము గల్గును. గాని హెచ్చు ధనము తలవని తలంపు పనులలో హెచ్చించ వలసి యుండును. జన్మ చక్రములో గురుడు ద్వితీయాధిపతియై వర్ష ఫలచక్రములో యే భావము నందుండునో లేక యే భావమును వీక్షించుచుండునో ఆ భావకారకత్వము వలన ధనము లభించును. ఆ భావము లగ్నమైన తన స్వకృషి వల్లను, ద్వితీయమైన తన కుటుంబము ద్వారా యున్న, తృతీయమైన తన సొంత సాహసము లేక అన్నదమ్ముల వల్లను, చతుర్థమైన భూములు, తల్లి, గృహముల వల్లను, షష్ఠమైన వివాదములలో జయము, రావలసిన బాకీల వల్లను, సప్తమ మైన భార్య లేక భాగస్తుల వల్లను, అష్టమ మైన పిత్రార్జితము, మరణ శాసనము మొదలగు వాని వల్లను, నవమస్థానమైన మత సంబంధమైన ఉపన్యాసములు, గురువులు మొదలగు వానివల్లను, దశమ స్థానమైన ప్రభుత్వము వృత్తి వలనను, ఏకాదశమైన రాజతంత్రము, పన్నుల వాపసు వల్లను, ద్వాదశ మైన దేవ స్థానములు, అన్యాయార్జితము వలన ధనము లభించును.

ద్వితీయ స్థానాధిపతి అష్టమాధిపతితో కలిసి యున్న జాతకునికి ధనవ్యయ మగును. ద్వితీయాధిపతి పాపగ్రహ సంయోగము చెంది యున్న దృష్టిమాంద్యము గలుగును. ద్వితీయాధిపతి సూర్యుడై యుండి కుజుడు లేక శుక్రునితో మూసరిఫఃయోగము పొంది యున్న దృష్టిమాంద్యము బలవత్తర మగును. రవి, చంద్రుడు, గురుడు ద్వితీయ స్థానము నందు యోగ్యత కలిగి యున్న జాతకుడు మంచి భాషా ప్రవీణుడును, మంచి వాక్కు గలవాడును, భాషా విమర్శ, శాస్త్ర జ్ఞానము గలవాడుగా యుండును. ద్వితీయాధిపతితో యిధ్యషాల యోగము పొందిన గ్రహము యొక్క కారకత్వము ద్వారా ధనాదాయము పొంద గలుగును.

ద్వితీయ స్థానమునందున్న గ్రహము జాతకుని యొక్క వాక్కు, స్వభావమును తెలుపును. పాపగ్రహమైన నీచము, కఠిన మైనట్టి వాక్కులును, బుధుడైన హాస్యము, చమత్కారమైన వాక్కులును, శుక్రుడైన అనాగరికము, కామ సంబంధమైన మాటలును, గురుడైన ఆకర్షణ గల సంభాషణలు, తర్కము, వేదాంతము మొదలైన వాక్కులు గలుగును.

## 3. తృతీయ భావము

సోదరులు, సేవకులు, బలము, ధైర్యము, పరాక్రమము, కర్ణములు, జానువులు, కంఠము, పాదములు, పోకడ, బంధువులు.

తృతీయ స్థానాధిపతి వర్షానాధిపతియై అస్తమించి యున్నను లేక బలహీనుడైన గురుడు తృతీయ స్థానము నందున్నను జాతకుడు సోదరులతో అపవాదులను పొందు వాడగును. అదే ఫలములు తృతీయాధిపతియును,

వర్షేశ్వరుడు హేసరాఫ యోగము నందున్న గలుగును. గురుడు తృతీయాధిపతితో యిధ్యషాల యోగము నందున్నను లేక గురుడు తృతీయ స్థానము నందున్నను జాతకుని సోదరులు సౌఖ్యమును పొందగలరు. తృతీయాధిపతి తృతీయ స్థానము నందుండి వర్షేశ్వరునికి అర్హత గల అభ్యర్థులలో యొకరై యుండి లగ్నాధిపతితో యిధ్యషాల యోగము పొంది యున్న సోదరులు స్నేహ స్వభావము గలిగి యుండెదరు. తృతీయాధిపతి పాపగ్రహముతో హేసరాఫ యోగము పొంది యున్న సోదరులతో కలహములు సంభవించును. తృతీయ స్థానము కుజునకు చెంది యుండి, ఆ స్థానము నందు శని యున్న యొక సోదరుడు ప్రమాద స్థితిలో జబ్బుగా యుండును. తృతీయ స్థానము బుధునిదై యందు కుజుడున్న యొక సోదరుడు యెక్కువ జబ్బు స్థితి యందుండును. తృతీయ స్థానము కుజునిదై ఆ స్థానము నందు కుజుడుండి శుభవీక్షణ గల్గియున్న సోదరులు అన్యోన్య స్నేహము గలిగి సౌఖ్యము పొందెదరు.

జన్మచక్రము నందు లగ్నాధిపతి బలవంతుడైన బుధుడై యున్నను లేక అట్టి బుధుడు వార్షిక చక్రము నందు తృతీయ స్థానము నందున్నను, జాతకుని యొక్క బంధువులు సుఖ సౌఖ్యములను పొంది జాతకునికి సోదరుడు జన్మించును తృతీయ స్థానమున పాపగ్రహములుండి తృతీయాధిపతి వలన వీక్షింపబడకున్న ఒక సోదరుడు రోగముచే బాధపడును. తృతీయాధిపతి లగ్నాధిపతితో కలిసి సప్తమ స్థానము నందున్న జాతకుని సోదర సోదరీమణుల యొక్క వివాహము జరుగును. తృతీయాధిపతి కుజుడు, చంద్రునితో కూడి యున్న జాతకునికి మనశ్శాంతి లేకుండును. బలహీనుడైన కుజుడు తృతీయాధిపతి యైన రక్త సంబంధ మైన రోగములు, తరుచు అపాయములు గలుగును.

తృతీయ స్థానమున రవి యున్న సంవత్సర మధ్యములో సోదరులకు కష్టములు, రాజతంత్రము వలన ఆదాయము, శత్రు జయము, మంచి ఆరోగ్యము. చంద్రుడున్న - సోదరులకు మేలు, రహస్య ప్రీతి, మంచి ఆదాయము, ప్రతిష్టలో వృద్ధి. కుజుడున్న - బంధువులకు చిక్కులు, వాహన లాభము, శత్రునాశము, ధనలాభము, స్నేహితులకు జయము, రాజ్యాధి నేతలతో స్నేహము. బుధుడున్న - వ్యసనములు తగ్గుట, ఐశ్వర్యము, సౌఖ్యము. గురుడున్న - గౌరవ వ్యాప్తి, అధికారుల వలన యోగ్యత గుర్తింపు, ఐశ్వర్య వృద్ధి. శుక్రుడున్న - సోదర సోదరీమణుల సౌఖ్యము, మంచి ఆరోగ్యము, అదాయము, ప్రజలకు సహాయము. శనియున్న - శత్రునాశము, ఆర్థిక లాభములు, భూలాభము, దగ్గర వారితో విరోధము. రాహువున్న - పశులాభము, వాహన లాభము, అధికారులతో స్నేహము, సోదరులతో తగవులు. కేతువున్న ధైర్యముతో శత్రు పోరాటము, ఐశ్వర్యము, సుఖజీవనము, ధర్మ కార్యములకు విరాళములు, సంవత్సర మంతయు సామాన్య సౌఖ్యము.

## 4. చతుర్థ భావము

విద్యాధికారము, స్థిరాస్తి, సౌఖ్యము, ప్రతిష్ట, సుగంధ ద్రవ్యములు, స్వేదము, తైల స్నానము, ఉదకము, పానీయములు, రొమ్ము, తల్లి, స్థానచలనము, ప్రయాణము, కులము, వస్త్రములు, దాయాదులు, లోబాధలు, అబద్దము,

ఔదార్యము, మేడ, మఠములు, బావులు, చెరువులు, గుంటలు, వనములు మొదలగు వానిని చతుర్థ స్థానమును బట్టి విచారించ వలయును.

సూర్యుడు గాని, చంద్రుడు గాని చతుర్థ స్థానమున పాపగ్రహ సంయోగము పాపగ్రకహ వీక్షణము గలిగి యున్న తండ్రి లేక తల్లి అనారోగ్య వంతులై మనశ్శాంతి లేక యుందురు. శని సూర్యునితో కలిసి చతుర్థ స్థానము నందున్న తండ్రి యొక్క గౌరవ మర్యాదలు నశించును. జన్మరాశి చక్రములో చంద్రునియొక్క స్థానమును శని ఆక్రమించియున్న తల్లితో కలతలు సంభవించును. చతుర్థ స్థానాధిపతి చతుర్థస్థానము నంధున్న తల్లి తండ్రులు సౌఖ్యముగా యుందురు. చతుర్థస్థానాధిపతి బలవంతుడై లగ్నాధిపతితో యిధ్యషాల యోగమును పొందియున్న తల్లిదండ్రులు సౌఖ్యముగా యుందురు. శని కుజులున్న స్థానము జన్మరాశి చక్రములో నాల్గవరాశియై యున్నను లేక వర్గరాశి చక్రములో నాల్గవ రాశ్యాధిపతి యున్న స్థానమునందున్నను తల్లిదండ్రులకు దుఃఖము సంభవించును. రవి యెక్కువుగా శని వర్గులయందున్న తండ్రి ధూషణల పాలగును. అష్టమాధిపతి రవితో జేరియున్న తండ్రికి ప్రమాద జబ్బు పరిస్థితి యేర్పడును. తృతీయ స్థానమున కుజుడు, చతుర్థ స్థానమున శని, అష్టమ స్థానమున అష్టమాధిపతితో చంద్రుడు కలిసి యున్న మరణము లేక ప్రమాదమైన రోగములు సంభవించును.

నాల్గవ స్థానమున రవి యున్న - పశువులకు రోగములు, దిగుబడి లేని వ్యవసాయము, పంట నష్టము, అధికారుల వల్ల కష్టములు, తల్లికి కడుపు నొప్పి, ఱొమ్ము జబ్బులు, చంద్రుడున్న - ప్రభుత్వ తగవులలో జయము, వ్యవసాయము వల్ల లాభము, సౌఖ్యము, కొనుగోలు, అమ్మకము వల్ల ధనలాభము, శత్రనాశము, వాహన సౌఖ్యము, కుజుడున్న - ఏదోయొక గృహములో అగ్ని ప్రమాదము, దుఃఖము, పశువులకు రోగము, వ్యవసాయ నష్టము, వ్యాపారములో ఆధిక్యత. బుధుడున్న - సామాన్య సౌఖ్యము, నూతన పరిచయములు, వారివల్ల లాభములు, నూతన పశువులు, భూములు సంపాదన, క్రొత్త వాహన సౌఖ్యము. గురుడున్న - ఒక వాహనమును విక్రయించి యింకొక వాహనమును లాభసాటిగా కొనుగోలు జేయుట, అన్ని విధముల సౌఖ్యము, అధికారములో యున్నవారి ద్వారా లాభము, ప్రారంభించిన నూతన పనులలో జయము. శుక్రుడున్న - యించుమించుగా గురుని ఫలములనే యిచ్చును. శాసన సభనలలో ప్రవేశము, ధనిక వర్గమునకు సంబంధించిన జీవితము. శనియున్న - వృత్తి, నౌకరీలో కష్టములు, భయము, నేత్ర, గర్భముల యందు జాడ్యము, బంధువుల వల్ల దుఃఖము, ప్రతిష్ట భంగము, పశునాశనము, అగ్ని ప్రమాదము, పైరు నష్టము. రాహువున్న - వాహన విధ్వంసము లేక నష్టము, అధికారుల వల్ల కష్టములు, దగ్గు లేక ఉబ్బస బాధ, కీళ్ళ నొప్పులు, లాభము లేని విదేశీ యాత్ర. కేతువున్న - తల్లికి రోగము, గర్వమునకు అవకాశము, సత్యము, మంచి ధనాదాయము.

## 5. పంచమ భావము

సంతానము, ఆలోచన, బుద్ధి, సామర్థ్యము, మేల్కొల్పు, జ్ఞాపకము రహస్యము, దీక్ష, ఘనత, సభ్యత, విద్య, విచక్షణ, తృప్తి, ఆదరణ ఉచిత వేతనము,

సంతోషము, సాహసము మొదలగు వానిని పంచమ స్థానమును బట్టి విచారింప వలయును.

వర్షేశ్వరుడు గురుడు, రవి, కుజుడు, బుధుడు, లేక శుక్రుడై యుండి పంచమ స్థానము నందున్న జాతకుని పిల్లలు సౌఖ్యముగా యుందురు. పై గ్రహములు పాపగ్రహ సంయోగము గాని లేక పాపగ్రహ వీక్షణముగాని పొంది యున్న జాతకుని యొక్క సంతానము దౌర్భాగ్య స్థితి యందుండును. పంచమ స్థానము వర్షేశ్వరునితో ఆక్రమించి యున్న జాతకుని సంతానము సౌఖ్యముగా యుండును. జన్మ చక్రములో పంచమ స్థానము, వార్షిక చక్రములో లగ్న స్థానమైన పిల్లలు వార్షిక మంతయు సుఖముగా యుందురు. జన్మ చక్రములో యున్న పంచమ స్థానము వార్షిక చక్రములో బుధుడు లేక శుక్రుడు యున్న రాశి స్థానమై యున్న శిశు జననము గలుగ వచ్చునని గ్రహించ వలెను. లగ్నాధిపతి, పంచమాధిపతి పంచమ స్థానము నందున్న సంవత్సరములోపుననే శిశుజననము గలుగును. వక్రించిన కుజుడు పై గ్రహసంయోగమును పాపదృష్టిచే వీక్షించు చున్నను, సంయోగము చెందియున్నను జన్మించిన శిశువు మరణము చెందును. జన్మచక్రములో పంచమాధిపతి శుక్రుడై వార్షిక చక్రములో పంచమ స్థానము నందుండి లగ్నాధిపతితో యిర్థ్యషాల యోగము పొందియున్న శిశుజననము గల్గును. జన్మ చక్రములో శని యున్న రాశి స్థానము వార్షిక చక్రములో పంచమ స్థానమై పాపగ్రహ దృష్టి, పాపగ్రహ వీక్షణము గల్గియున్న సంతానము దౌర్భాగ్య స్థితిలో యుండును.

పంచమ స్థానము నందు రవియున్న - జనప్రీతిని కోల్పోయిన వాడును, తగవులలో కష్టములు, తారతమ్యము కోల్పోవుట, పిల్లల కొరకు బాధ, రోగము, ధనమాంద్యము మొదలగునవి గ్రహదశలో గల్గును. చంద్రుడున్న - బుద్ధి బలముచే జయము, స్నేహితుల సహాయము, చంద్రుని యొక్క శుభ పాప స్థితిని బట్టి శిశు జననము లేక శిశునాశము., కుజుడున్న - అనారోగ్యము, సంతాన అసౌఖ్యము, వివాదములలో శత్రునాశము, లేనిపోని కలతలు, వైషమ్యములు, తారతమ్యము కోల్పోవుట. బుధుడున్న - సంతానము, ఐశ్వర్యము, ప్రతిపనిలో జయము, రాజభక్తి గల నౌకర్లు, పెద్దల సాంగత్యము. గురుడున్న - సంతానమునకు వృద్ధి, తన ప్రతిభ చూపుటకు సమయము, శత్రు పరాజయము వలన సుఖము, రత్నలాభము. శుక్రుడున్న - ధైర్యము, దుఃఖము, మనోవ్యధ, శత్రువులకు బాధ, సంవత్సర మధ్య కాలములో ఆకస్మిక అసౌఖ్యము, ఆర్థికస్తోమత. శనియున్న - శిశుమరణము లేక తీవ్ర జబ్బు, ప్రమాదము, అన్ని విధములైన చిక్కులు, మనోవ్యధ, అసౌఖ్యము, ప్రభుత్వ చర్య వలన భయము. రాహువున్న - తారతమ్యము కోల్పోవుట, శత్రుబాధ, అజీర్ణము వల్ల అనారోగ్యము, అన్ని విషయములలో బాధలు. కేతువున్న - శిశుమరణము, ప్రభుత్వ బాధ, అప్రతిష్ట, అవిశ్వాసము, శత్రువుల వలన పనికి మాలిన ఆరోపణలు.

## 6. షష్ఠ భావము

ఋణములు, రోగములు, శత్రువులు, పశువులు, భయము, మనోవ్యధ, బాధలు, భయము, జీవితము కొరకు పోరాటము, కీర్తి నాశనమగునను భయము, ఆటంకములు, గాయము, ద్వేషము, మేనమామ, సోమరితనము మొదలగునవి షష్ఠ స్థానమును బట్టి విచారించ వలయును.

వర్గేశ్వరుడు వక్రించి యున్న లేక పాప గ్రహ సంయోగము గాని లేక వీక్షణము గాని చెంది యున్న శనియై, అట్టి శని షష్ట స్థానము నందున్న జాతకుడు ఉద్రోగము, ప్లీహరోగము, నేత్రరోగము, విషజ్వరము మొదలగు వానిచే బాధనొందును. గురుడు శనివలెనే అదే స్థానము నందుండి చంద్రునితో కహళ యోగము పొందకున్న జాతకుడు కీళ్ళరోగము మొదలగు వాత సంబంధమైన రోగములతో బాధపడును. పాపగ్రహ వీక్షణము లేక సంయోగము గల కుజుడు వర్గేశ్వరుడై షష్ట స్థానము నందున్న రక్త సంబంధమైన రోగము, కామెర్లచే బాధపడును. ఇతర గ్రహములు షష్ట స్థానము నందు పై విధముగనే యున్న వాని కారకత్వ స్వభావమును బట్టి జాతకునికి ఆయా రోగములచే బాధను గలిగించును. జన్మలగ్న చక్రములో శనియున్న స్థానము వర్షఫల చక్రములో లగ్న స్థానమై కుజుడు షష్ట స్థానము నందుండి రవితో హేసరాఫ యోగము పొంద బోవుచున్న మరణము సంప్రాప్త మగును. పై పరిస్థితులలో కుజుడు రక్త సంబంధమైన వ్యాధులు, కాలిన గాయములను గలిగించును. శుభ వీక్షణములు గల్గి యున్న కొంత రోగవృధ్ధుతి తగ్గును. లగ్న షష్టమాధి పతులకును లేక వర్గేశ్వరుడు షష్టమాధిపతికిని యిథ్యశాల యోగము సంభవించిన ఆయా గ్రహములకు సంబంధించిన త్రిదోష రోగములు గలుగును. జన్మ లగ్న చక్రములో శుక్రుని యొక్క రాశి షష్ట స్థానమై సూర్యుడు షష్ట స్థానము నందు జేరి, పాపగ్రహములతో కలిసి యున్న జాతకుడు కామ సంబంధమైన రోగములతో బాధపడు చుండును. పాపగరుడు షష్ట స్థానము నందుండి, కుజుడు లగ్న స్థానము నందున్న జాతకుడు మూర్ఛ రోగమును పొందును. చంద్రుడు గురునితో కలిసినను, చంద్రుడు కుజుడు లగ్నము నందున్నను జాతకునికి ఏదో యొక అవయవచ్ఛేదనము గావించ బడును. షష్ట స్థానము నందున్న గ్రహము చంద్రునితో యిథ్యశాల యోగము పొంది యున్న రోగము యొక్క తీవ్రత కొంత వరకు నీరసించును. షష్ట స్థానము నందున్న గ్రహము, కేతువుతో కలిసి యున్న సూర్యునితో యిథ్యశాల యోగము పొందియున్న సంవత్సర మంతయు జాతకుడు రోగముతో బాధ పడవలసి యుండును. జన్మ రాశి చక్రములో లగ్నాధిపతి యును, ముంతాయును పాప గ్రహ సంయోగము, పాపగ్రహ వీక్షణము గలిగి యున్న జాతకుడు అన్ని విధములైన బాధలను పొందును. జన్మలగ్న రాశి చక్రములో కుజుడు షష్టస్థానము నందున్న జాతకుడు ప్రమాదమైన రోగముతో బాధపడును. అదే కుజుడు యింకొక పాపగ్రహముతో యిథ్యశాల యోగము పొందిన రోగము ప్రాణాంతకమై యుండును.

షష్ట స్థానము నందు రవియున్న - శత్రుభంగము, తల్లి, తల్లి తరపున దాయాదులు, సామాన్య సుఖము, ప్రభుత్వ కాంట్రాక్టుల వల్ల లాభము, తగవులలో జయము, కొనుగోలు అమ్మకములలో లాభము. చంద్రుడున్న - శత్రువులతో

చిక్కులు, తగవులు, నేత్ర రోగము, ధననాసము, మనోవ్యధ, భార్యకు అనారోగ్యము. కుజుడున్న - శత్రు భంగము, తనజట్టుకు జయము, స్నేహితుల వలన లాభము, కుటుంబ సౌఖ్యము. బుధుడున్న - స్త్రీల బాధ, శత్రువులలో వైరము, అధిక వ్యయము, శ్లేష్మరోగము, సంవత్సరములో అన్ని విధముల కష్టములు. గురుడున్న - భార్యకు బహిష్టు దోషము, శత్రువులకు కష్టములు, రక్త విరోచనములు, నేత్ర రోగము, కష్టమైన సంవత్సరము. శుక్రుడున్న - యితరులతో తలంచని తగవులు, శత్రువుల పీడింపు, భరించరాని తలనొప్పి, మనోవ్యధ, జీర్ణవ్యాధులు. శనియున్న - భూమి కొనుగోలు, మంచి రాబడి, పెద్దవారి వల్ల గౌరవము, ధాన్యసమృద్ధి, కీర్తివ్యాప్తి. రాహువున్న - శత్రువులకు సంకటనలు, పెద్దవారితో స్నేహము, పశువృద్ధి, సువర్ణ లాభము, సౌఖ్యము. కేతువున్న -విద్యాకేంద్ర ప్రారంభము, గృహసౌఖ్యము, ప్రజాగౌరవము, కులప్రతిష్ట, అన్ని విషయములలో జయము.

## 7. సప్తమ భావము

వివాహము, భర్త లేక భార్య, వ్యాపారము, కామము, సంభోగము, నష్టము, గృహసంబంధమైన శ్రావ్యత, దాంపత్య సౌఖ్యము, వ్యభిచారము, సహభోగి, స్త్రీలతో కలహము, ప్రయాణభంగము, విలాసము, మర్మస్థానము, మూత్రరోగము మొదలగు వానిని సప్తమ స్థానమునుబట్టి విచారించవలయును.

బలవంతుడైన శుక్రుడు వర్గేశ్వరుడై సప్తమ స్థానమునందున్న జాతకునికి కళత్రసౌఖ్యము, బంధువులలో స్త్రీలసౌఖ్యము గలుగును. పంచాధికారులలో శుక్రుడు యొకరై కుజునితో కలసియున్నను లేక వీక్షింపబడుచున్న వివాహము కాకున్న వివాహము జరుగును. వైకూటమిలో శుక్రుని బుధుడు వీక్షించుచున్న జాతకుడు యింకొక స్త్రీతో ప్రత్యేక సంబంధము గలిగియుండును. శని వీక్షించుచున్న స్త్రీయొక్క వయస్సు యెక్కువగా యుండును. గురుడు వీక్షించుచున్న జాతకుడు యితర స్త్రీతో సంబంధపడి సంతానము గూడ బడయగలడు. జన్మచక్రములో లగ్నాధిపతి వార్షిక చక్రమునందు లగ్నమును చేరియున్నను లేక సప్తమస్థానము నందున్న సంవత్సరము నందంతయు భార్య బంధువులు సౌఖ్యముగా యుండుటయు, వివాహము కాని యెడల వివాహము జరుగుటయు సంభవించును. జన్మచక్రములో శుక్రుడుయున్న రాశిస్థానము వార్షిక చక్రములో సప్తమస్థానమై శుక్రుడు వర్గేశ్వరుడై యున్న వివాహము జరుగును. లగ్నాధిపతియును, సప్తమాధిపతియును యిధ్యశాల యోగము నందున్న వివాహము జరుగును. సప్తమాధిపతి పాపగ్రహ సంయోగము, పాపగ్రహ వీక్షణము గలిగి అస్తమించి యున్న జాతకుని యొక్క ఆరోగ్యము ప్రమాద స్థితిలో యుండును. జన్మచక్రములో శుక్రుడు యున్న స్థానమునందు క్షీణ చంద్రుడున్న జాతకుడు కామసుఖము పొందలేని వాడగును. సప్తమ స్థానముతో కుజుడును, శుక్రుడును సంబంధపడియున్న జాతకుడు కామ సుఖము పొందగలడు. జన్మచక్రములో సప్తమాధిపతి వార్షిక చక్రములో శుక్రునితో కలసియున్న జాతకుడు యితరుల భార్యలతో సంబంధపడి యుండు వాడగును. ముంతా రవి కుజులతో కలిసి సప్తమ స్థానము నందున్న భార్య, పిల్లలు రోగగ్రస్తులై జాతకునికి శోకమును చేకూర్చగలరు. జన్మ చక్రము నందు సప్తమ స్థానము శుక్రుని యొక్క స్వరాశియై

సప్తమస్థానము నందుండి లగ్నాధిపతితో యిధ్యషాల యోగము పొందియున్న జాతకునికి వివాహము గానియెడల వివాహము జరుగుటయు లేక పర స్త్రీతో సంబంధము గలుగుటయు సంభవించును. కుజుడు వర్గేశ్వరుడై శుక్రునితో వీక్షించ బడుచున్నను లేక శుక్రుడు వర్గేశ్వరుడై కుజునిచే వీక్షించ బడుచున్న పైఫలములనే పొందు వాడగును. జన్మ చక్రములో సప్తమాధిపతి ముంతా అధిపతి గాని లేక వర్గేశ్వరుడు గాని యైనట్లయిన జాతకుడు భార్య లేక సహచరురాలు వల్ల సుఖము, సౌఖ్యము పొంద గలడు. ముంతా వృశ్చిక రాశియందుగాని లేక మకర రాశి యందు గాని యుండి చంద్రునిచే వీక్షించ బడుచున్న జాతకుడు విదేశములకు పోవువాడగును. ముంతా పాప గ్రహ సంయోగము గాని, పాపగ్రహ వీక్షణము గలిగి యున్న విదేశ యాత్ర జాతుకునికి శాపనార్థముగా యుండును.

సప్తమ స్థానమునందు రవియున్న - రవి మహాదశలో జాతకుడు, జాతకుని భార్యకు అనారోగ్యము, ప్రయాణము నందు సంకటనలు, తగవులు, కాళ్ళు లేక చేతులలో బాధలు. చంద్రుడున్న - జ్వరము, కీళ్ళ నొప్పులు, భార్యకు అనారోగ్యము, ఆర్థిక స్తోమత, వడుదుడుకులు లేని వ్యాపారము. కుజుడున్న - ప్రయాణము నందు సంకటనలు, సుఖరోగములు, శత్రు భయము, ప్రజా సభ్యులతో కలహములు, ధననాశము. బుధుడున్న - స్త్రీ సాంగత్యముతో సంతోషము, ఐశ్వర్య వృద్ధి, భూలాభము, భారము వహించిన పనులలో జయము, పశు వృద్ధి మొదలగునవి బుధ మహాదశలో ప్రత్యేకముగా జరుగును. గురుడున్న - భార్య వలన సౌఖ్యము, జయము, ధైర్యము, శత్రునాశము. శుక్రుడున్న - వాహన ప్రాప్తి, ఐశ్వర్యవృద్ధి, మంచి ఆదాయము, అధికార మన్ననలు, కుటుంబ సౌఖ్యము, స్వేచ్ఛాజీవితము, శత్రు పరాజయము, కట్టడము లేక గృహ ప్రాప్తి. శనియున్న - భార్యకు అనారోగ్యము, ప్రయాణము నందు సంకటనలు, పశునష్టము, ప్రభుత్వ బెదిరింపు చర్య, ఆకస్మిక దుఃఖము, నిరాధారమైన సాకులు, కడుపులో బాధలు. రాహువున్న - పనికి మాలిన ఫిర్యాదులు, మూలవ్యాధులు, విష భయము లేక పాము కాటు భయము, కష్టపు దినములు. కేతువున్న - నీచస్త్రీతో స్నేహము, ఐశ్వర్య హాని, శత్రు నాశము.

## 8. అష్టమ భావము

ఆయుర్దాయము, మృత్యువు, మృత్యు కారణము, యుద్ధము, పోయిన సొత్తు, పిత్రార్జితము, బంధువులు, పరాభవము, సుఖరోగములు, అపాయములు, పాపము, దౌర్జన్యము మొదలగు వానిని అష్టమ స్థానమును బట్టి విచారింప వలయును.

లగ్నాధిపతిగాని, ముంతా గాని లేక వర్గేశ్వరుడు గాని అష్టమ స్థానాదిపతియై యున్నను లేక అష్టమ స్థానాధిపతితో యిధ్యషాల యోగము పొందిన జన్మచక్ర ప్రకారము జాతకునికి జరుగుచున్న మహాదశలో మారకము సూచించు చున్న రాబోవు సంవత్సర మంతయు జాతకునికి ప్రాణాపాయముగా యుండును. అష్టమస్థానమున కుజుడున్న ప్రభువుల వల్ల భయము లేక ఆయు ధముల వలన ప్రమాధము గలుగును. అదే అష్టమ స్థానమునందున్న కుజుడు దశమాధిపతితో యిధ్యషాల యోగము పొందిన జాతకుడు రక్త సంబంధమైన రోగములతో

బాధపడుటయును. చతుష్పాద జంతువులతో ప్రమాద పరిస్థితి యేర్పడుటయు జరుగును. వర్షేశ్వరుడు అష్టమ స్థానము నందున్న అనాగిరకమైన ప్రజలతో కలతలు సంభవించును. అష్టమస్థానము నందున్న పాప బుధుడు కుజునితో యిధ్యషాల యోగము పొంది యున్న మరణము లేక ప్రమాదమైన రోగము సంవించును. ఆ విధమైన పాప బుధుడు కుజుని యొక్క అడ్డను జేరి యున్న ఆర్థిక బాధలు సంభవించును. జన్మ చక్రములో అష్యమ స్థానము నందున్న గురుడు వర్షేశ్వరుని యెంపికకు అర్హులుగా నిలచిన సభ్యులలో యొకడు గాకున్న ఆకస్మిక సంకటనలు చెలరేగును. జన్మచక్రములో లగ్నాధిపతి దగ్ధమై వార్షిక చక్రములో అష్టమ స్థానము నందున్న జాతకుడు తీవ్రరోగము, మనోవ్యధతో బాధపడు చుండును. కుజుడు అష్టమ స్థానమైన మేషము, సింహము, ధనస్సు, లేక వృషభ మైయున్న పోలీసు అధికారులతో బాధ కలుగును. పాపగ్రహ సంయోగము, పాప గ్రహ వీక్షణము గల అష్టమాధిపతి లేక అష్టమ స్థానము నందున్న లగ్నాధిపతి జాతకునికి మారక దశ జరుగుచున్న మరణము సంప్రాప్త మగును. లగ్నాధిపతి లేక ముంతాధిపతి పాప గ్రహ వీక్షణము గల్గి యున్న మరణము సంభవించును. అష్టమ స్థానము నందు రవి కుజునితో గాని లేక శనితో గాని కూడియున్న వాహనము నందు ప్రయాణము జేయునపుడు ప్రమాదము సంభవించును. వర్షేశ్వరుడు లేక చంద్రుడు కుజునితో కూడి అష్టమ స్థానము నందున్న మరణము సంభవించ వచ్చును. అష్టమ స్థానాధిపతి షష్ట స్థానము నందున్నను లేక అష్టమ స్థానము నందున్నను, ద్వాదశ స్థానము నందున్నను జాతకునికి మృత్యువు సంభవించును. జన్మ చక్రమందు పాపగ్రహ వీక్షణము సంయోగము పొందిన లగ్నాధిపతి అష్టమ స్థానము నందున్నను, లేక శనిగ్రహము సుంతాతో సంయోగము చెంది యున్న జాతకునికి మృత్యువు సంభవించ వచ్చును. పై సంయోగము నందు కుజుడు గూడ కలిసి యున్న జాతకుడు ఆత్మహత్యచే మరణము పొందును. అష్టమ స్థానము నందు శని యుండి పాపగ్రహములతో యిధ్యషాల యోగము పొంది యున్న ప్రమాదకరమైన రోగము మరణము సంభవించును. శని గ్రహము యొక్క యిధ్యషాల యోగము శుభ గ్రహములతో యున్న మృత్యువు సంభవించదు. జన్మ చక్రము నందు అష్టమాధిపతి శనియై వార్షిక చక్రము నందు లగ్నాధిపతితో యిధ్యషాల యోగము పొంది యున్న జాతకునికి మృత్యువు సంభవించవచ్చును. జన్మ చక్రము నందును, వార్షిక చక్రము నందును, లగ్నాధిపతులు అష్టమ స్థానమునందున్న పై విధమైన ఫలములనే పొందును. గ్రహ యుద్ధములో పాపగ్రహముచే ఓడింపబడిన గురుడు లగ్నము నందుండగా నాల్గవ స్థానమున పాపగ్రహము, అష్టమ స్థానమున రాహువున్న యెడల జాతకునికి విదేశములో మృత్యువు సంభవించవచ్చును. చతుర్థ స్థానాధి పతి అష్టమ స్థానము నందును, అష్టమ స్థానాధిపతి చతుర్థ స్థానము నందున్న జలగండము మొదలగునవి ప్రాప్తించును. లగ్నాధిపతి అష్టమ స్థానము నందుండగా అష్టమాధిపతి షష్ట స్థానమును వీక్షించుచున్న మూల వ్యాధి, సుఖరోగములచే జాతకునికి మృత్యువు సంభవించును.

అష్టమ స్థానము నందు సూర్యుడున్న - బంధులవల్ల కష్టములు, సౌఖ్య హీనము, రోగము, దుఃఖము, భార్యరోగము, గడ్డలచే పిల్లల బాధ. చంద్రుడున్న

మనస్సు, చాంచల్యము, జ్వరము, తలంపు నందు లేని తావుల నుండి సంకటనలు, నేత్రబాధలు, జలగండము, ధననష్టము. కుజుడున్న - గడ్డలు లేక రాచ కురుపులు, శస్త్రచికిత్స, భయము, ఆకస్మిక ఖర్చులు, అపాయము, కీడు. బుధుడున్న - దగ్గు, శ్లేష్మ వ్యాధులు వైరస్ జ్వరము, కండ్ల మంట. బుధ దశలో - గుల్మముల వల్ల అపాయము. గురుడున్న - వాంతి, వికారము, జ్వర బాధలు, కర్ణ రోగములు, మనోవ్యధ, నీచపనులు. శుక్రుడున్న - ప్రాణాపాయము, అపవాదులు, ఆకస్మిక సంకటనల వల్ల భయము, శత్రువుల వల్ల నూతన బాధలు. శనియున్న - ధననష్టము, రోగ ప్రమాదము, లేని పోని కలతలు, యింటి యందు చోరి. రాహు వున్న - మరణములు, విరోచనములు లేక విషజ్వరము వంటి చెడు సంకటనలు. కేతువున్న - పవిత్రమైన పనులు, మంచి మనస్సు, ఔదార్యము, దైవభక్తి మొదలగునవి గలుగును.

## 9. నవమ భావము

మతము, ప్రయాణములు, ధర్మము, భక్తి, తండ్రి, తెలివి, .నీతులు, పరిశుభ్ర మైన మనస్సు, గురువు, క్రమపద్ధతిలో యున్న జీవితము, శుభకార్యములు మొదలగునవి నవమ స్థానమును బట్టి విచారించ వలయును.

వర్షేశ్వరుడైన శుభకుజుడు నవమ స్థానము నందున్న జాతకునికి లాభదాయకమైన ప్రయాణములు, ఉద్యమములు, గలవాడగును. వర్షేశ్వరుడైన రవి అష్టమ స్థానము నందుండి కంబూల యోగము పొంది యున్న ప్రయాణములు లాభదాయకముగా యుండును. వర్షేశ్వరుని యెంపికలో రవి సభ్యత్వమును పొంది వర్షేశ్వరునికి అర్హుడుగాకున్న జాతకుడు యితరుల ప్రేరేపణతో యొక ప్రతినిధిగా విదేశములకు పోవును. వర్షేశ్వరుడైన శుక్రుడు అష్టమ స్థానమును చేరియున్న జాతకునికి లాభకరమైన మంచి ప్రయాణము లభించును. శుక్రుడు వక్రించి యున్నను లేక అస్తమించి యున్న ప్రయాణము యొక్క ఉద్దేశ్యము నెరవేరదు. అదే పద్ధతిలో బుధుడు నివసించి యున్న, దూరమందున్న యాత్రా ప్రదేశములకు ప్రయాణములు సంక్రమించును. శుభుడైన గురుడు వర్షేశ్వరుడై నవమ స్థానము నందున్న మంచి యాత్రా ప్రదేశములకు ప్రయాణములు చేయవలసి యుండును. పైన చెప్పబడిన అన్ని సంకటనలలో లగ్నాధిపతి నవమాధిపతితో యిధ్యషాల యోగమును పొంది యున్న జాతకుడు అప్రయత్నముగా ప్రయాణములు చేయ వలసి యుండును. లేక అచ్చట పెద్దకలత సంభవించును. జన్మ చక్రము నందు శని యొక్క రాశి నవమ స్థానామై అందు గురుడు గాని లేక చంద్రుడు గాని యున్న జాతకునికి దూర ప్రయాణము సంభవించును. వర్షేశ్వరుని యెన్నికలో సభ్యుడుగా లేనట్టి శని నవమ స్థానము నందున్న ప్రయాణము వలన యెటువంటి ఫలితము యుండదు. అదేవిధముగా వర్షేశ్వరుని యెన్నిక యందు సభ్యుడుగా లేనట్టి గురువు నవమ స్థానము నందున్న జాతకునికి సంస్కృతి లేక రాజతంత్ర సంబంధమైన గొప్ప పని యందు పెద్ద ప్రయాణము సంభవించును. ముంతా

సప్తమ స్థానము నందుండి, బలమైన చంద్రుడు నవమ స్థానము నందున్న విదేశ ప్రయాణము సంభవించును.

పాపగ్రహములు నవమ స్థానము నందుండి, నవమ స్థానాధిపతి షష్ఠ, అష్టమ, ద్వాదశ స్థానము నందున్న తండ్రి యొక్క ఆశలన్నియు నిరాశా జనక మగును. శనికి కేంద్రమున జలరాశి యందు నవమాధిపతి అష్టమాధిపతితో చేరియున్న తండ్రికి జలగండము సంప్రాప్త మగును. వృశ్చిక రాశి యందు నవమ స్థానాధిపతి యుండి చంద్రుడున్న స్థానము నుండి నవమ స్థానమున రాహువున్న తండ్రికి సర్పగండము సంభవించును. నవమాధిపతి చతుర్థ లేక సప్తమాధిపతితో కలిసియున్నను లేక శుభవీక్షణము గలిగి యున్న విద్య లేక వృత్తి కొరకు విదేశములకు పేసరాఫ యోగము పొందు గ్రహదశా కాలములో పోవలసి యుండును.

నవమ స్థానము నందు రవి యున్న - సోదర సోదరీమణులచే కలతలు, దుఃఖము, సక్రమమైన పనులు, గౌరవము, ప్రభుత్వము వల్ల తన స్వదేశములో సహాయము. చంద్రుడున్న - అదృష్ట అస్తమయము, ధన లాభము, ధర్మకార్యములు, భూలాభము, సంతాన సౌఖ్యము. కుజుడున్న - ధనలాభము, అదృష్టము అస్తమించు సమయము, గౌరవము, కీర్తి వృద్ధి గుర్తింపు. బుధుడున్న - పుత్ర జననము, మంచి ఆదాయము, శుభ కార్యములు, రాజ్యాధిపతులతో స్నేహము, శత్రునాశము. గురుడున్న - మతాభిమానము, ధర్మకార్యములు, మంచి ఆదాయము, యాత్ర, సత్యసమ్మత మైన పనులు. శుక్రుడున్న - పెద్దవారితో స్నేహము, చేపట్టిన పనుల యందు జయము, వాహన ప్రాప్తి, భూలాభము. శనియున్న - మంచి కాలము అస్తమయము, ధనలాభము, శత్రునాశము, కీర్తి, గౌరవము, సోదరులకు కష్టములు. రాహువున్న - మత సంబంధమైన సూత్రములు పాటించుటకు యిష్టము లేక పోవుట, అధికారము వల్ల ద్వేషము, ధనలాభము, బంధువులకు, పశువులకు రోగము. కేతువున్న - గౌరవము, మర్యాద గల పెద్దవారితో పరిచయము, మత సంబంధమైన కార్యములకు హాజరగుట, పెద్ద వారితో కలిసి నిధులను కల్పించుట మొదలగునవి గలుగును.

## 10. దశమ భావము

వృత్తి సంబంధమైన హోదాలో హెచ్చింపులు, తగ్గింపులు, జీవితములో సాధారణ జయము, కీర్తి, వ్యవసాయము, అధికారము, పస్తువుల ధరలు, ఆవేశము, అప్రతిష్ట, పాలనాధికారము, నిధి, గుర్తింపు, పారితోషికము, తొడలు, స్వారి, విద్యా విషయకమైన ఉత్పత్తి, ఆత్మనిగ్రహము, కటాక్షము మొదలగునవి దశమ స్థానమును బట్టి విచారించ వలయును.

శక్తివంతమైన వర్గేశ్వరుడు లగ్న స్థానము నందున్నను లేక దశమ స్థానము నందున్న రాజ్యాంగనేత యగుటకు అవకాశము గలుగుచున్నది. ధనవృద్ధి, కీర్తి గలుగును. రవి వర్గేశ్వరుడై దశమ స్థానము నందున్న పెద్దరాజ్యాంగ నేతలతో స్నేహము గలుగును. రవి ముంతా లేక ముంతాధిపతితో కలిసి దశమ స్థానమునందున్న రాజతంత్రములో జయమును గాంచును. రవినీచ స్థానమును

పొందినను లేక పాపగ్రహ సంయోగము లేక పాపగ్రహ వీక్షణము గల్గియున్న జాతకుడు రాజతంత్ర కారణముల వలన ఈడ్వబడి దండింపబడు వాడగును. సింహ రాశి దశమ స్థానమై అందు రవియున్న పెద్ద రాజ్యాధిలేతల స్నేహ భావము వలన క్రొత్త అధికారము పొందగలడు. లగ్నాధిపతి, వర్గేశ్వరుడు, దశమాధిపతి యిద్ధ్యషాల యోగము నందున్న జాతకుడు మంత్రి పదవి పొంద గలడు. జన్మ చక్రము నందు శని యుండు రాశిని మఱియు దశమ స్థానమును వార్షిక చక్రములో కుజుడు ఆక్రమించి ముంతాను వీక్షించుచున్న అట్టి జాతకుడు ధనమోసము లేక చోరి లేక వ్యభిచార నేరములకు జరిమానా లేక కారాగార వాసముచే శిక్షించబడు వాడగును. దశమ స్థానమున వర్గేశ్వరుడుండి, అట్టి స్థానము వాని ఉచ్ఛ లేక స్వరాశి గానియై యున్న జాతకునికి వృత్తి యందు వృద్ధి, జయము తప్పక గలుగును. రవి పాపగ్రహ సంయోగము చెంది శత్రు వర్గముల యందున్న అధికారుల వల్ల ద్వేషము గలుగును. జన్మ చక్రము నందు రవి యున్న స్థానము లగ్న స్థానము గాని లేక దశమ స్థానము గానియై యందు ముంతా యున్న జాతకుడు భూములు, ఆస్తి సంపాదించువాడగును. రవి సింహ రాశి యందుండి అది దశమ స్థానమై యున్న జాతకుడు రాజసంబంధమైన రక్షణ, కీర్తి సంపాదించును. వర్గేశ్వరుడు చంద్రుడై దశమాధిపతితో చేరియుండి కుజవర్గుల యందు యెక్కువుగా యున్న జాతకుడు యున్న ప్రదేశము నుండి మార్పు సంభవించును. దశమ స్థానాధిపతి కుజుడై సప్తమ స్థానము నందుండి ముంతాను వీక్షించుచున్న జాతకునికి రాజ సంబంధమైన ద్వేషము సంభవించును. శని వర్గేశ్వరుడై దశమ స్థానము నందు తృతీయాధిపతితో కలిసి యున్న జాతకునికి పశు యోగము వలన పశు సంపద లాభదాయకముగా యుండును. అష్టమ స్థానాధిపతి పాపియై దశమ స్థానము నందు చంద్రునితో కలిసి యుండి, దశమ స్థానాధిపతి తృతీయాధిపతి స్థానము నందున్న జాతకుడు తన నౌకర్లకు కష్టములు గలుగ జేయును.

పలు విధములైన గ్రహములు వాని కారకత్వమును బట్టి సూచించు సముదాయము వలన గలుగు ఆదాయము ఆ సంవత్సరము యొక్క గ్రహ ప్రత్యేకతను బట్టి జరుగును. రవి గ్రహమైన - పితృ సంబంధమైన ఆస్తును, వైద్య వృత్తి. చంద్రుడైన - మాతృ సంబంధమైన ఆదాయము, రత్నములు, స్త్రీలు, వ్యవ సాయము. కుజుడైన - జ్ఞాతుల సంపద. బుధుడైన - స్నేహితుల యొక్క సంపద, పత్రికా రచన, పబ్లికేషన్లు, ఉపన్యాసములు, స్పెక్యూలేషన్ వ్యాపారము. గురుడైన - సోదరుని సంపాదన, వ్యాపారము, యంత్రముల పని. శుక్రుడైన - స్త్రీలు లేక భార్య సంపద, నాట్యకళ, సంగీతము, అలంకారము. శనియైన - నౌకర్ల యొక్క ఆస్తులు, మిల్లులు, ఫ్యాక్టరీలు మొదలగు వ్యాపారము. రాహువైన - అన్యాయా ర్జితము. కేతువైన - మోసము, చోరత్వము వలన ఆదాయము, వృత్తి సంబంధమైన ఫలములు నిర్దేశించునపుడు జాతకుని యొక్క జన్మచక్రమును చక్కగా పరీక్షించి వాని యొక్క పరిస్థితులను గమనించి ఫలములను చెప్ప వలయును.

దశమ స్థానమున సూర్యుడున్న - విపరీతమైన ఐశ్వర్యము, భూలాభము లేక రాజ్యలాభము, కీర్తి. చంద్రుడున్న - ధనలాభము, శత్రునాశము, వ్యాపారాభివృద్ధి, సౌఖ్యము, గౌరవము నందు వృద్ధి, అన్ని విధముల జయము. కుజుడున్న - నూతన నిర్ణయము, యంత్రముల ద్వారా రాబడి, మంచి ఆదాయము, భూలాభము, హోదా వృద్ధి. బుధుడున్న -వాహన లాభము, సంతానమునకు మంచి ఆదాయము, నౌకరికి జయము. గురుడున్న - పవిత్రమైన లోహమున కొనుగోలు, ప్రభువులు లేక అధికారుల వల్ల మన్ననలు, భూమి కొనుగోను, శత్రు పరాజయము. శుక్రుడున్న - ఉన్నతమైన జయము, గొప్ప హోదా, ధన లాభము, వాహనము, తోట కొనుగోలు. శనియున్న - భూనష్టము, పైరు నష్టము, దగ్గర బంధువులకు అనారోగ్యము, కమిషన్ వ్యాపారములో లాభము. రాహువున్న - వ్యాపారము పెంపు జేయుట, కీర్తి వృద్ధి, శుభ కార్యములు, ధనలాభము, సంతోషకరమైన ప్రయాణములు. కేతువున్న - మత్స్య వ్యాపారము, మామూలు కీర్తి, అశాంతి గలుగును.

## 11. ఏకాదశ భావము

పస్తు సంగ్రహము, అన్ని విధములైన లాభములు, స్నేహితులు, పుత్రికలు, ధరలు, ఆదాయము, బంధువులు, వ్యాపార సంబంధమైన హెచ్చు తగ్గులు, కోర్కెలు, అపవాదులు, కూడబెట్టిన ధనము, పెద్ద సోదరుడు, వంశపారంపర్య హక్కు మొదలగు వానిని ఏకాదశ స్థానమును బట్టి విచారించ వలయును.

వర్షేశ్వరుడు బుధుడై ఏకాదశ స్థానము నందు శుభత్వము గలిగి యున్న జాతకుడు తన వ్యాపారము నందు మంచి లాభము పొంద గలడు. ముంతా గూడ బుధునితో కలిసి యున్న జాతకుడు రచయిత మఱియు వుపన్యాసకుడుగా యెక్కువ ఆర్జించును. పై సంయోగములో బుధుడు పాపియై పాపగ్రహ వీక్షణము గాని, సంయోగము గాని చెంది యున్న సుఫలములు పొంద జాలడు. వర్షేశ్వరుడు గురుడై పాపగ్రహ వీక్షణము గాని, సంయోగము గాని చెంది ఏకాదశ స్థానము నందున్న జాతకునికి నష్టములు, అసౌఖ్యము, ప్రభుత్వము వలన అపార్థములు గలుగును. గురుడు శుభుడై యున్న జాతకుడు రచయిత, వుపన్యాసకుడై సంపాదించును. లగ్నాధిపతి, ఏకాదశాధిపతి యిత్థశాల యోగము నందున్న తన బంధువర్గములో కెల్ల మిన్నయై సంవత్సర కాలమంతయు ఆర్థిక స్తోమత గలిగి యుండును. ఆ రెండు గ్రహములు బలహీనమై పాపగ్రహ సంయోగము, పాపగ్రహ వీక్షణము గలిగి యున్న పై సుఫలములు గలుగవు. ఏకాదశ స్థానమునకు కారక గ్రహమైన బుధుడు ముంతాతో కలిసి లగ్న స్థానము నందుండి శుభులలో కలిసి యున్న జాతకునికి వాహన లాభము, బాధ్యత గల పదవి, అకస్మాత్తుగా ఐశ్వర్యము సంభవించును. ఏకాదశాధిపతి శుక్రుడై ద్వితీయ స్థానము నందు చంద్రునితో చేరియున్న స్త్రీల ద్వారా ఐశ్వర్యమునకు అందుబాటు గలుగును. సప్తమాధిపతి నీచను పొంది, ఏకాదశాధిపతి పంచమ స్థానములో నీచను పొంది, పంచమాధిపతి ఏకాదశ స్థానములో నీచను పొంది యున్న జాతకుడు నీచ వృత్తిచే అనగా వ్యభిచార గృహములు, రాత్రి క్లబ్బులు, అప్రతిష్ట గృహము వల్ల ధన మార్జించును.

ఏకాదశ స్థానమున రవియున్న - ప్రభుత్వ ఉత్పత్తి సధానముల నుండి లాభములు, మంచి ఆదాయము, గౌరవము, సుఖమైన జీవితము, శత్రుపరాభవము, బిడ్డల అనారోగ్యము. చంద్రుడున్న - శత్రునాశము, వ్యాపారము వల్ల అధిక ధనము, పెద్దవారితో స్నేహము, గౌరవము నందు అభివృద్ధి, విదేశముల నుండి బిడ్డలరాక, సాధారణ తృప్తి. కుజుడున్న - మంచి అధికారము, ఆర్థిక లాభము, తనజట్టుకు జయము, రత్న లాభము, పిల్లలకు అనారోగ్యము. బుధుడున్న - క్రొత్త వ్యాపారము, కంట్రాక్టు వ్యాపారము, మంచి ఆదాయము, భార్య విరోధము, క్రొత్త పశువుల కొనుగోలు, తలంచని నష్టము. గురుడున్న - బిడ్డన శ్రేయస్సు, శత్రు నాశము, ఐశ్వర్యాభి వృద్ధి, రాజ్యాధినేతలతో స్నేహము, విలువైన వస్తు సంపాదన. శుక్రుడున్న - బంగారు రత్నముల ఆకస్మిక లాభము, అన్ని విషయములందు సామాన్య జయము, సంతాన వృద్ధి, శత్రుపరాజయము, స్నేహస్పర్శ, అభివృద్ధి. శనియున్న - భూమి, పశువుల కొనుగోలు, ధనలాభము, ఐశ్వర్య వృద్ధి, బిడ్డజల దురదృష్టము, ప్రజాదరణ. రాహువున్న - మంత్రితో సమాన గౌరవము, అరుదు సంపాదన, శత్రు పరాజయము, బిడ్డలతో అపార్థములు. కేతువున్న - అందమయిన గృహ నిర్మాణము, కామ సుఖము, శౌర్యము, అన్ని విధముల అభివృద్ధి గలుగును.

## 12. ద్వాదశ భావము

శత్రువులు, ఖర్చు, నష్టము, కీడు, రోగము, ఆకస్మిక మరణము, ఆస్తి విక్రయము, ప్రజాద్వేషము, కష్టము, ఆశాభంగము, విదేశ యాత్ర, నిద్రభంగము, అంద వికారము, చిత్తభ్రమ మొదలగు వానిని ద్వాదశ స్థానమును బట్టి విచారించ వలయును.

బలహీనుడైన లగ్నాధిపతి లేక వర్షేశ్వరుడు ద్వాదశ స్థానము నందున్న ఆ రాశికి సంబంధించిన వస్తువుల యందు జాతకునికి నష్టము గలుగును. అది జతుష్పాద జంతు రాశియైన పశు నష్టము, అది ద్విపాద జంతు రాశియైన నౌకర్లు, బంధువులు, స్నేహితుల నష్టము జరుగును. లగ్నాధిపతి లేక వర్షేశ్వరుడు సూర్యుడై ద్వాదశ స్థానము నందున్న జాతకుడు బర్తరపు చేయుట వలన తన ఉద్యోగమును పోగొట్టు కొనును. చంద్రుడు గూడ అదే ఫలితముల నివ్వగలడు గాని బలవంతుడై యున్న జాతకుడు తన స్వంత భూమి యందు బావిని త్రవ్వగలడు. అదే విధమున యున్న శని అన్ని పనుల యందు ఆశాభంగములు, నష్టములు గలుగ జేయును. దశమ స్థానాధిపతి బలహీనుడై వర్షేశ్వరుడు ద్వాదశ స్థానము నందున్న సంవత్సర కాలమంతయు విపత్తులు, దుఃఖములతో బాధపడ వలసి యుండును. వర్షేశ్వరుడు కుజుడు లేక శనియై చంద్రునితో కలిసి దశమ లేక ద్వాదశ స్థానము నందు పాపగ్రహములతో యున్న జాతకునికి పశు నష్టము, చిత్త భ్రమ గలుగును. వర్షేశ్వరుడు కేంద్రము నందు ఉచ్చస్థుడై యుండి, ద్వితీయాధిపతి ద్వాదశ స్థానమున ఉచ్చస్థుడై ఈ రెండు రాశులు ద్విస్వభావ రాశులైన జాతకుడు నౌకర్ల జీతములకు యెక్కువ ధనము హెచ్చించు వాడగును. దశమ, చతుర్థ స్థానాధిపతులు ద్వాదశ స్థానము నందున్న జాతకుని యొక్క పశువులకు

మరణము, విధ్వంసము సంభవించును. వర్షేశ్వరుడు ద్వాదశాధిపతితో లగ్నము నందున్న జాతకుడు శరీర సంబంధమైన సౌఖ్యములకు, ఆహారములకు యెక్కువ ధనమును వినియోగించును. వర్షేశ్వరుడు శనియై 6-8 లేక 12 స్థానము లందున్న జాతకుడు వనములు, చెరువులు మొదలగు వానిని నిర్మించును. బలహీనుడైన శని వర్షేశ్వరుడై దశమ స్థానము నందున్న జాతకుడు తలంపున లేని ఆకస్మిక ఆశా భంగములకు గురు యగును.

ద్వాదశ స్థానమున రవియున్న - పాదముల వాపు, భార్యలేక యితర స్త్రీలతో తగవువులు, ధన నష్టము, శిరస్సు, గర్భములో సంకటనలు, చిత్తభ్రమ, శత్రువులకు బాధలు. చంద్రుడున్న - అసత్య వాక్కులు, అర్థమైన పనులకు వ్యయము, నేత్ర రోగము, యితరులతో దగాదాలు, లేనిపోని కష్టములు, శ్లేష్మ రోగము, ప్లీహ రోగము. కుజుడున్న - కర్ణరోగము, నేత్ర రోగము, చోరుల వల్ల ధననష్టము, అపవాదులు, పెద్దవారితో తగవులు, భార్యకు రోగము. బుధుడున్న - శత్రువులతో ప్రాణాంతకమైన తగవులు, కర్ణవ్యాధి, మనోవ్యధ, శ్లేష్మ వ్యాధులు, కంటిలో పొరలు. గురుడున్న - అన్ని విధములైన సంకటనలు, కీర్తికి నష్టము గలుగునను భయము, గురుడు కారకత్వము గల వాని వల్ల దుఃఖము. శుక్రుడున్న - అవసరమైన పనులకు ధన వినియోగము, అగ్ని మాంద్యము, కీళ్ళ నొప్పులు, నేత్ర రోగములు, తగవులు పొడిగించు కొనుట, ప్రేమ కలాపములలో ఆశా భంగము, కళత్రముతో వేరుపడుట, జ్వరము, వాంతులు, మరణ భయము. శనియున్న - వ్యాపారములో యెక్కువ కష్టములు, తగవులు, వ్యాజ్యముల యందు ధన నష్టము, వలస పోవుట. రాహువున్న - ఉద్యోగము లేక గృహమార్పు, సాంఘిక మైన సదస్సులలో అమర్యాద, నమ్మిన నౌకర్ల మరణము, శిరస్సు, పొట్ట, కర్ణ వ్యాధులు, ధననష్టము, బంధు విరోధము, కులటలతో తగవులు. కేతువున్న - అధిక వ్యయము, నిషేధించబడిన మంత్రములలో చొరవ, భిన్న మతము, నీచ పనుల యందు ప్రవేశము మొదలగునవి గల్గును.

## రాశులు - వాని చిహ్నములను సూచించు పట్టిక

| వరుస నంబరు | రాశినామము | చిహ్నము |
|---|---|---|
| 1. | మేషము (Aries) | ♈ |
| 2. | వృషభము (Taurus) | ♉ |
| 3. | మిథునము (Gimini) | ♊ |
| 4. | కర్కాటకము (Cancer) | ♋ |
| 5. | సింహము (Leo) | ♌ |
| 6. | కన్య (Virgo) | ♍ |
| 7. | తుల (Libra) | ♎ |
| 8. | వృశ్చికము (Scorpio) | ♏ |
| 9. | ధనుస్సు (Sigattarius) | ♐ |
| 10. | మకరము (Capricorn) | ♑ |
| 11. | కుంభము (Aquarius) | ♒ |
| 12. | మీనము (Pisces) | ♓ |
| | గ్రహములు - వాని చిహ్నములను సూచించు పట్టిక | |
| 1. | సూర్యుడు (Sun) | ☉ |
| 2. | చంద్రుడు (Moon) | ☽ |
| 3. | కుజుడు (Mars) | ♂ |
| 4. | బుధుడు (Mercury) | ☿ |
| 5. | గురుడు (Jupiter) | ♃ |
| 6. | శుక్రుడు (Venus) | ♀ |
| 7. | శని (Saturn) | ♄ |
| 8. | రాహువు (Rahu-Ascending Node) | ☊ |
| 9. | కేతువు (Ketu-Decending Node) | ☋ |
| 10. | ఇంద్ర (ప్రజావతి) (Uranus or Herschel) | ♅ |
| 11. | వరుణ (Neptune) | ♆ |
| 12. | రుద్ర (యమ) (Pluto) | ♇ |
| 13. | భూమి (Earth) | ⊕ |

# గ్రహసంహిత

(జన్మ జాతకము)

# HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్ధము
## ద్వితీయ స్కంధము

ప్రశ్నతంత్రము, నానావిధ ప్రశ్నలకు సమాధానములు, జ్ఞాతుల పేర్లు, సంతాన సంఖ్య, జన్మతేది, వారమును తెలుపు విధానములు, గోచార విశేషములు, వివాహ పొంతనము, గ్రహముల నవరత్న విషయములు, పుట్టుమచ్చల ఫలములు మొదలగు అనేక విషయములతో గూడిన గ్రంథరాజము.

గ్రంథకర్త

ఆళ్ళ సుబ్బారావు

డెప్యూటీ కమర్షియల్ ట్యాక్సు ఆఫీసరు (రిటైర్డు)

Publishers

*A.S. Rao & Co.,*

Rama Krishna Santhi Samithi
5th Line, Nehru Nagar, GUNTUR - 1
Ph. No. 221861, 221699

వింశో త్తరి దశాపట్టిక (దశాభుక్తులు యొక్క కాలము)

| దశ | రవి | చంద్ర | కుజ | రాహు | గురు | శని | బుధ | కేతు | శుక్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| భుక్తి | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. | స.నె.ది. |
| రవి | 0 3 18 | | | | | | | | |
| చంద్ర | 0 6 0 | 0 10 0 | | | | | | | |
| కుజ | 0 4 6 | 0 7 0 | 0 4 27 | | | | | | |
| రాహు | 010 24 | 1 6 0 | 1 0 18 | 2 8 12 | | | | | |
| గురు | 0 9 18 | 1 4 0 | 011 6 | 2 4 24 | 2 1 18 | | | | |
| శని | 011 12 | 1 7 0 | 1 1 9 | 210 6 | 2 6 12 | 3 0 3 | | | |
| బుధ | 010 6 | 1 5 0 | 0 11 27 | 2 6 18 | 2 3 6 | 2 8 9 | 2 4 27 | | |
| కేతు | 0 4 6 | 0 7 0 | 0 4 27 | 1 0 18 | 011 6 | 1 1 9 | 0 11 27 | 0 4 27 | |
| శుక్ర | 1 0 0 | 1 8 0 | 1 2 0 | 3 0 0 | 2 8 0 | 3 2 0 | 2 10 0 | 1 2 0 | 3 4 0 |
| రవి | | 0 6 0 | 0 4 6 | 010 24 | 0 9 18 | 011 12 | 0 10 6 | 0 4 6 | 1 0 0 |
| చంద్ర | | | 0 7 0 | 1 6 0 | 1 4 0 | 1 7 0 | 1 5 0 | 0 7 0 | 1 8 0 |
| కుజ | | | | 1 0 18 | 011 6 | 1 1 9 | 0 11 27 | 0 4 27 | 1 2 0 |
| రాహు | | | | | 2 4 24 | 210 6 | 2 6 18 | 1 0 18 | 3 0 0 |
| గురు | | | | | | 2 6 12 | 2 3 6 | 0 11 6 | 2 8 0 |
| శని | | | | | | | 2 8 9 | 1 1 9 | 3 2 0 |
| బుధ | | | | | | | | 0 11 27 | 2 10 0 |
| కేతు | | | | | | | | | 1 2 0 |
| దశలు | 6 0 0 | 10 0 0 | 7 0 0 | 18 0 0 | 16 0 0 | 19 0 0 | 17 0 0 | 7 0 0 | 20 0 0 |

# గ్రహ సంహిత

సర్వజనుల భవిష్యత్ గ్రంథము

# HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్ధము

## ద్వితీయస్కంధము

## ప్రశ్న తంత్రము

## లగ్న నిర్ణయము

ప్రశ్న తంత్రము జ్యోతిష శాస్త్రములో అద్వితీయమైన యొక భాగమై యున్నది. ప్రాచీన జ్యోతిషశాస్త్రవేత్తలు వీనిపై ప్రశ్నచింతామణి, ప్రశ్నబిందు భవన దీపిక, ప్రశ్నమార్గ మొదలగు గ్రంథములను రచించియుండిరి. ప్రశ్నకాలమే పృచ్ఛకుని వాంఛ యొక్క జన్మగా భావించి లగ్న నిర్ణయము చేసి వాని గ్రహబలమును బట్టి ఫలనిరూపణ జేయవలెననిరి. కాన ప్రశ్న యడుగువారు ఫలపుష్ప దక్షిణ తాంబూలములను గొని దైవజ్ఞుని కడకేగి చేతబట్టుకొని దైవజ్ఞుని దేవునిగా నెంచికార్యసిద్ధి కావలెనని ప్రార్థించి యాదైవజ్ఞుని ముందట బెట్టి ప్రశ్న వేయవలయును. అంతట దైవజ్ఞుడురాశి, అంశ చక్రములను వ్రాసి ప్రశ్నకాలమునకు లగ్న నిర్ణయము జేసి వానివాని స్థానములందు గ్రహములను వ్రాసి, వాని బలాబలములను బట్టి భవిష్యత్ ఫలములను నిరూపించవలెను.

### ప్రశ్న క్రమము

దైవజ్ఞుడు ప్రశ్నఫలములను నాస్తికులకు గాని, నీచులకు గాని, మూర్ఖుల కు గాని, జ్యోతిష శాస్త్రము నందు నమ్మకము లేని వ్యక్తులకు గాని చెప్పరాదు.

ప్రశ్నలగ్నమునందు చంద్రుడున్నను, కేంద్రమున శనియుండి బుధుడు, అస్తంగతడైయున్నను, లగ్నమున చంద్రుడుండగా కుజ, బుధులు వానిని వీక్షించుచున్నను, లగ్నమున పాపగ్రహములు జేరియున్నను, సప్తమస్థానాధిపతికి గురుడు లేక బుధుడు శత్రుత్వము గలిగియున్నను, పృచ్ఛకుని యొక్క ప్రశ్న మోసముతో గూడినదని గ్రహించవలెను.

ప్రశ్నలగ్నము నందు శుభగ్రహమున్నను, లగ్నమును కుజ, గురు, పూర్ణ చంద్రులలో నెవరైన యొకరు వీక్షించుచున్నను, సప్తమ స్థానాధిపతిపై గురుడు లేక బుధుడు స్నేహ వీక్షణము గలిగియున్న పృచ్ఛకుని ప్రశ్న మంచి ఉద్దేశ్యము గలదని గ్రహించవలెను.

ఒక ప్రశ్నకు సమాధానము యెన్నటికిని తప్పదు. మొదటి ప్రశ్నకు ఫలము లగ్నమును బట్టియు, రెండవ ప్రశ్నకు చంద్రుడున్న రాశిని బట్టియు, మూడవ ప్రశ్నకు సూర్యుడున్న రాశిని బట్టియు, నాల్గవ ప్రశ్నకు గురుడున్న రాశిని బట్టియు ఐదవ ప్రశ్నకు బుధుడు లేక శుక్రుడున్న రాశిని బట్టి చెప్పవలెను. ఇందు బుధ, శుక్ర గ్రహములలో బలాధిక గ్రహమును గ్రహించి ఫలనిరూపణ జేయ వలయును.

## పృచ్ఛకుని మనస్సునందున్న ప్రశ్న చెప్పు విధానము

పృచ్ఛకుని మనస్సునందున్న ప్రశ్న తెలుసుకొనుటకు పూర్వము దైవజ్ఞుడును మఱియు వాని సహాయకుడు సప్తగ్రహములకు ఈ క్రింద నియమించిన సంఖ్యలను వానికి యిచ్చు దానములను మనస్సునందుంచుకొనవలెను.

రవి - 1. చంద్ర - 2. కుజ - 4. బుధ - 8. గురు - 16. శుక్ర - 32. శని - 64.

రవికి గోధుమలు, చంద్రునకు బియ్యము, కుజునకు కందులు, బుధునకు పెసలు, గురునకు శనగలు, శుక్రునకు అలసందలు, శనికి నువ్వులు దాన మొసగ వలయును.

ఆరూఢ ప్రశ్నలలో పృచ్ఛకుడు సామాన్యముగా అడుగబోవు ప్రశ్న 108లో యొకటై యుండును. సహాయకుడు ముందుగా ప్రశ్న అడుగవచ్చిన పృచ్ఛకుని రహస్యమైనటువంటి నిర్మల ప్రదేశమున కూర్చుండబెట్టి తా నడగబోవు ప్రశ్నను తెలుసుకొనవలెను.

ఉ-।। ఈ క్రిమినల్ కేసులో నేను జయమును పొందగలనా ? అని పృచ్ఛకుడు ప్రశ్నించినపుడు సహాయకుడు ఆరూఢ ప్రశ్నల లిష్టులో ఈ ప్రశ్న యెచ్చటయున్నది వెతకవలెను. లిష్టులో 82. ఈ క్రిమినల్ కేసులో నేను జయమును పొందగలనా ? చంద్ర - గురు - శని అని వ్రాసియున్నది. లోగడ చెప్పిన ప్రకారము చంద్రునకు - 2, గురునకు -16, శని - 64. ఈ మూడు గ్రహ సంఖ్యలు కలిపిన 2 + 16 + 64 = 82 వచ్చినది. ఇదియే ప్రశ్నయొక్క వరుస సంఖ్య అయినది.

పైన వుదహరించిన ప్రకారము చంద్రునకు బియ్యమును, గురునకు శనగలును, శనికి నువ్వులును దానములై యున్నవి. ఈ మూడు దానములను కొంచెము కొంచెము గ్రహించి విడివిడిగా పొట్లములు కట్టి పృచ్ఛకునికి యివ్వ వలయును. ధ్యానమందిరమునందున్న దైవజ్ఞుని కడకు సహాయకుడు పృచ్ఛకునిపైన సముదాయముతో పంపును. దైవజ్ఞుడు పైపొట్లములను పృచ్ఛకుని వద్దనుండి గ్రహించి అందున్న సముదాయమును పరిశీలించి బియ్యమునకు చంద్రునిగను, శనగలకు గురునిగను, నువ్వులకు శనిగను గ్రహించి, చంద్రునకు - 2, గురునకు - 16, శనికి - 64, అంకెలను మొత్తము జేసి (2 + 16 + 64) 82 లిష్టులో ప్రశ్న వరుస సంఖ్యగా గ్రహించి పృచ్ఛకునికి నీ ప్రశ్న - ఈ క్రిమినల్ కేసులో నేను జయమును పొందగలనా ? అని అడగపోవుచున్నావు అని చెప్పును ?

పై పద్ధతినే సహాయకుడు లేకుండగనే యింకొక విధముగా మార్చుకొన వచ్చును. ప్రశ్నాపత్రమును దైవజ్ఞుడు పృచ్ఛకుని చేతికిచ్చి తాను అడుగబోవు ప్రశ్న కెదురుగా యే గ్రహములున్నది చెప్పమనవలెను. చ - గు - శ గ్రహములున్నట్లు చెప్పును. చ - 2 గు - 16 శ - 64 = 82 వచ్చినది. నీ ప్రశ్న 82. ఈ క్రిమినల్ కేసులో నేను జయమును పొందగలనా? అని అడుగ బోవుచున్నావు అని పృచ్ఛకునికి చెప్పవలెను.

దీనికి సమాధానము ప్రశ్న కాలమును బట్టి లగ్న చక్రము, అంశ చక్రమును వేసి గ్రహబలమును బట్టి ఫలనిరూపణ చేయవలెను.

2. ప్రశ్నడుగదలచిన పృచ్ఛకుడు ఫలదక్షిణ తాంబూళాదులను చేతబూని దైవజ్ఞుని కడకేగి యాయనకు సమర్పించి 108 కధికముగాకుండ నొక సంఖ్యను ఆదైవజ్ఞునికి చెప్పవలెను. ఆ సంఖ్యకే ధ్రువాంకమని సంజ్ఞ చేయబడినది. లేదా ప్రశ్న వరుస సంఖ్యనే ధ్రువాంకముగా గ్రహించ వచ్చును. ఈ ధ్రువాంకమే ప్రశ్న ఖండమున ముఖ్యముగా గ్రహించదగిన విషయమైయున్నది. ఈ ధ్రువాంకమును 9 చే భాగించగావచ్చు లబ్దము మేషాది గత రాశులగును. ఆ మిగిలిన సంఖ్య వర్తమాన లగ్నమందలి నవాంశములగును. ఇట్లు తత్కాల ప్రశ్న లగ్నమును ఆ లగ్నమందలి తత్కాల నవాంశము నేర్పడును. కనుక రాశ్యాంశ చక్రములు వేసి దానియందు లగ్నము అంశలగ్నమును వేసి తదుపరి పంచాంగరీత్యా తత్కాలమునకు రవ్యాధి గ్రహముల రాశ్యంశలను దెలిపి యాచక్రములో వ్రాసి ఆ చక్రమువల్ల భావకారకాధు లను విచారించి నా పృచ్ఛకునికి శుభాశుభములు చెప్పవలయును.

ఉ॥ ఒక పృచ్ఛకుడు వచ్చి చెప్పిన సంఖ్య 67 అనుకొందము. దీనిని 9చే భాగించగా వచ్చిన లబ్దము 7. ఇది మేషాది గత రాశిసంఖ్య. అనగా మేషాదిగా 7 రాశులు గతమైనవి. అనగా తులారాశి వెళ్ళిపోయినది. వర్తమానము 8వ రాశి వృశ్చిక లగ్నము జరుగుచున్నది. ఇందు శేషము 4 గనుక వర్తమాన వృశ్చిక లగ్నములో 4 వ నవాంశయైనది. అనగా కర్కాటకము, వృశ్చికము, మీన రాశులు మూటి యందును నవాంశ గణమునకు కర్కాటకమే యాది గనుక కర్కాటాదిగ 4వ నవాంశము తుల నవాంశ యని యేర్పడినది. గనుక నీ ప్రశ్న యందు వృశ్చిక లగ్నమనియు, తుల నవాంశ యనియు నేర్పడినది. దీనివల్ల పూర్వపద్ధతినే ఫలములను చెప్పదగును.

## ఆరూఢ ప్రశ్నలు

| వ.నెం. | ప్రశ్న వివరము | ప్రశ్నాధిపతులు | గ్రహ సంఖ్య |
|---|---|---|---|
| 1. | నేను తలంచిన కార్యము త్వరలో సిద్ధించునా ? | ం | 1 |
| 2. | నాయొక్క భవిష్యత్తు ఈ వార్షికములో యెట్లుండును ? | చ | 1 |
| 3. | నా ఆరోగ్యము ఈ వార్షికములో యెట్లుండును ? | ర - చ | 2 |
| 4. | నాయొక్క కష్టములు తొందరలో ఈడేరునా ? | కు | 1 |
| 5. | నాయొక్క సోదరులు ఆరోగ్యవంతులై సుఖజీవనము చేయగలరా ? | ర - కు | 2 |

| | | | |
|---|---|---|---|
| 6. | నా సోదరులు నాతో సఖ్యతగలిగి యుండెదరా ? | చ - కు | 2 |
| 7. | నా సోదరుల వృత్తి, ఉద్యోగ, వ్యాపారములు వృద్ధియందుండునా? | ర - చ - కు | 3 |
| 8. | నా దరఖాస్తుకు అనుకూలమైన వార్త పొందగలనా ? | బు | 1 |
| 9. | నాయొక్క భూములు నాకు స్వాధీనము కాగలవా ? | ర - బు | 2 |
| 10. | నా స్వాధీనమునందున్న భూములను నేను సక్రమముగా పండించగలనా? | చ - బు | 2 |
| 11. | నా భూములు కౌలుకు యిచ్చుట వలన లాభము పొందగలనా ? | ర - చ - బు | 3 |
| 12. | నేను స్థిరాస్తికొనుగోలు జేసిన లాభదాయకముగా యుండునా ? | కు - బు | 2 |
| 13. | నేను చేయుచున్న వ్యాపారము నాకు లాభించునా? | ర - కు - బు | 3 |
| 14. | నేను భాగస్తులతో వ్యాపారము చేయవచ్చునా ? | చ - కు - బు | 3 |
| 15. | నేను చేయబోవు వ్యాపారము నాకు లాభించునా ? | ర - చ - కు - బు | 4 |
| 16. | ఈ సంవత్సరములో ధన లాభము యేమైన పొందగలనా ? | గు | 1 |
| 17. | నాయొక్క ఆర్థిక చిక్కులు యెప్పటితో అంతరించును ? | ర - గు | 2 |
| 18. | నా యొక్క వ్యాపారము వృద్ధి పొందుటకు అవకాశము లేమైనా యున్నవా? | చ - గు | 2 |
| 19. | నేను యిప్పుడున్న ప్రదేశము నుండి క్రొత్త ప్రదేశమునకు వ్యాపారము మార్చిన లాభదాయకముగా యుండునా ? | ర - చ - గు | 3 |

| | | | |
|---|---|---|---|
| 20. | విదేశ వ్యాపారము చేయుట వలన నేను ధనమార్జించగలనా ? | కు - గు | 2 |
| 21. | ఇల్లు విడిచిపోయినా నా సోదరుడు సౌఖ్యముగా యున్నాడా ? | ర - కు - గు | 3 |
| 22. | నాకు వాహనము లభించునా ? | చ - కు - గు | 3 |
| 23. | నేను క్రొత్త వాహనము కొనుట లాభకరముగా యుండునా ? | ర - చ - కు - గు | 4 |
| 24. | నేను తొందరలో గృహనిర్మాణము చేయగలనా ? | బు - గు | 2 |
| 25. | ఇప్పుడు చేయుచున్న గృహ నిర్మాణము తొందరలో ముగించగలనా ? | ర - బు - గు | 3 |
| 26. | అనుకున్న ఆస్తి కొనగలనా ? | చ - బు -గు | 3 |
| 27. | ఈ స్త్రీ వలన సంతానము పొందగలనా? | ర - చ - బు -గు | 4 |
| 28. | ఈ స్త్రీ గర్భవతియా ? | కు -బు - గు | 3 |
| 29. | ఈ స్త్రీ గర్భమునందున్న శిశువు జీవించునా ? చనిపోవునా? | ర - కు - బు -గు | 4 |
| 30. | ఈ స్త్రీ యొక్క ప్రసవము కష్టము లేక యుండునా? | చ - కు - బు - గు | 4 |
| 31. | ఈ స్త్రీ యెంతకాలములో ప్రసవించును? | ర - చ - కు- బు- గు | 5 |
| 32. | ఈ సంవత్సరము నాకు సంతానము గల్గునా? | శు | 1 |
| 33. | నాకు గలుగబోవు సంతానము పురుషుడా లేక స్త్రీయా ? | ర - శు | 2 |
| 34. | నేను రోగము నుండి విముక్తి పొందగలనా? | చ - శు | 2 |
| 35. | నేను యింకొక యజమానివద్ద నౌకరి చేయుదునా? | ర - చ - శు | 3 |

| | | | |
|---|---|---|---|
| 36 | నా యొక్క వృత్తిలో మార్పు యేమైనా పొందగలనా ? | కు - శు | 2 |
| 37. | నా యొక్క ఉద్యోగములో మార్పు యేమైనా గలుగునా ? | ర - కు - శు | 3 |
| 38. | నాకు స్థానచలనము యేమైనా యున్నదా? | చ - కు - శు | 3 |
| 39. | నా యొక్క హోదాలో అభివృద్ధి యేమైనా యున్నదా? | ర - చ - కు - శు | 4 |
| 40. | ఇప్పుడున్న యజమానివద్ద నాయొక్క స్వప్రయోజనములు సౌఖ్యముగా యుండునా? | బు - శు | 2 |
| 41. | నేను నౌకర్లను పొందగలనా? | ర - బు - శు | 3 |
| 42. | నేను పశువులను పొందగలనా? | చ - బు - శు | 3 |
| 43. | వివాహమునకు వధువును తొందరలో పొందగలనా? | ర - చ - బు - శు | 4 |
| 44. | వివాహమునకు వరుని తొందరలో పొందగలమా? | కు -బు - శు | 3 |
| 45. | నాకు వివాహము తొందరలో అగునా? | ర - కు - బు - శు | 4 |
| 46. | నాయొక్క భార్య అన్యోన్య స్నేహ ప్రేమలతో యుండునా? | చ - కు - బు - శు | 4 |
| 47. | ఈ వ్యాజ్యము లేక తగాదాలో జయించగలనా? | ర - చ - కు-బు- శు | 5 |
| 48. | నాయొక్క వ్యాపారములో భాగస్తులు సఖ్యతతో యుండెదరా? | గు - శు | 2 |
| 49. | కోపముతోయున్న నాభార్య మఱల తిరిగి రాగలదా? | ర - గు - శు | 3 |
| 50. | నాయొక్క భార్య విడాకులకు దారితీయునా? | చ - గు - శు | 3 |
| 51. | వధువుయొక్క గుణము మంచిదేనా? | ర - చ - గు - శు | 4 |

| | | | |
|---|---|---|---|
| 52. | ఈ స్త్రీ యొక్క గర్భము తన భర్త వలన గలిగినదేనా ? | కు - గు - శు | 3 |
| 53. | ఈ స్త్రీ కులటయా లేక సుగుణవతియా? | ర - కు - గు - శు | 4 |
| 54. | విడిపోయిన దంపతులు మఱల కలుచుకొనెదరా ? | చ - కు - గు - శు | 4 |
| 55. | ఈ స్త్రీ వ్యభిచరించుచున్నదా? | ర - ఛ - కు-గు-శు | 5 |
| 56. | ఈ స్త్రీ సంతానవతియేనా? | బు - గు - శు | 3 |
| 57. | ప్రసవించిన శిశువు తన తండ్రికి పుట్టినదేనా? | ర - బు - గు - శు | 4 |
| 58. | ఈ స్త్రీ యింటియందే వ్యభిచరించుచున్నదా? | చ - బు-గు-శు | 4 |
| 59. | ఈ రాజ్యాధిపతి యుద్ధమునందు జయించగలడా? | ర - చ - బు - గు - శు | 5 |
| 60. | శత్రువు యుద్ధము నందు జయమును పొందగలుగునా? | కు-బు-గు-శు | 4 |
| 61. | ఈ యుద్ధములో సంధి జరిగి యుద్ధము విరమించబడునా ? | ర - కు - బు-గు-శు | 5 |
| 62. | ఈ యుద్ధములో రాజ్యాధిపతి యితరుల సహాయము పొందగలడా? | చ - కు -బు-గు-శు | 5 |
| 63. | ఈ యుద్ధములో శత్రుసైన్యము నష్టమును పొందగలుగునా? | ర-చ-కు-బు-గు-శు | 6 |
| 64. | ఈ యుద్ధములో మన సైన్యమునకు అపారనష్టము గలుగునా? | శ | 1 |
| 65. | నేను దూరదేశమునకు ప్రయణము చేయుదునా ? | ర - శ | 2 |
| 66. | నాకు యాత్రా సుఖము గలుగునా ? | చ - శ | 2 |
| 67. | నేను పోయిన ప్రదేశములో సౌఖ్యము పొందగలనా? | ర - చ - శ | 3 |

| | | | |
|---|---|---|---|
| 68. | నాకు జరిగిన సమావేశ పరీక్షలో జయమును పొందగలనా? | కు - శ | 2 |
| 69. | నాకు విదేశయాత్ర యున్నదా? | ర - కు - శ | 3 |
| 70. | నేను అధికారము, లేక రాజ్యము సంపాదించగలనా ? | చ - కు - శ | 3 |
| 71. | ప్రభువు, మంత్రి ఈ వార్షికములో స్నేహభావము గలిగియుండెదరా? | ర - చ - కు - శ | 4 |
| 72. | ప్రభువు అనుకున్న వ్యవధిలో రాజ్యము ను శాశ్వితముగా పాలించగలడా? | బు - శ | 2 |
| 73. | ప్రభువు నన్ను ఆదరించునా? | ర - బు - శ | 3 |
| 74. | నేను తలంచిన పురుషుడు నాకు శత్రువా ? మిత్రుడా? | చ - బు - శ | 3 |
| 75. | నేను నాయొక్క రహస్య పథకములో జయించగలనా? | ర - చ - బు - శ | 4 |
| 76. | నేను ధనమును మంచి కార్యములకు హెచ్చించగలనా? | కు - బు - శ | 3 |
| 77. | ఈ యెలక్షనులో నేను జయమును పొందగలనా? | ర - కు - బు - శ | 4 |
| 78. | ఈ యెలక్షనులో నేను ప్రజాప్రతినిధిగా యెన్నుకొనబడుదునా? | చ - కు - బు - శ | 4 |
| 79. | నేను ఈ క్రొత్త ప్రభుత్వ పార్టీలో మంచి అధికారము పొందగలనా? | ర - చ - కు - బు - శ | 5 |
| 80. | నేను ప్రభుత్వ మిత్రపార్టీలో యుండగలనా? | గు - శ | 2 |
| 81. | నేను సివిల్ కేసులో జయమును పొందగలనా? | ర - గు - శ | 3 |
| 82. | నేను క్రిమినల్ కేసులో జయమును పొందగలనా? | చ - గు - శ | 3 |
| 83. | నేను ప్రభుత్వ ఉద్యోగము పొందగలనా? | ర - చ - గు - శ | 4 |

| | | | |
|---|---|---|---|
| 84. | నేను అధికారులతో సఖ్యత గలిగి యుందునా? | కు - గు - శ | 3 |
| 85. | దేశాంతరము పోయిన వ్యక్తి తిరిగి రాగలడా? వాని పరిస్థితి యేమిటి? తీసుకు పోయిన ధనము భద్రముగా యున్నదా? యెప్పుడు తిరిగి రాగలడు ? | ర - కు - గు - శ | 4 |
| 86. | తప్పిపోయిన బాలుడు మఱల తిరిగి రాగలడా ? వాని పరిస్థితి యేమిటి? | చ - కు - గు - శ | 4 |
| 87. | తప్పిపోయిన బాల మఱల తిరిగి రాగలదా ? ఆమె పరిస్థితి యేమిటి? | ర - చ - కు - గు - శ | 5 |
| 88. | చోరీలో పోయిన దుస్తులు తిరిగి పొందగలనా? | బు - గు - శ | 3 |
| 89. | చోరీలో పోయిన వస్తువులు తిరిగి పొందగలనా? దొంగ యెవరు? స్త్రీయా, పురుషుడా లేక బాలుడా? | ర - బు - గు - శ | 4 |
| 90. | నేను చెప్పినవాడు చోరుడా? చోరుడు కాడా? | చ - బు - గు - శ | 4 |
| 91. | చోరిలోపోయిన విగ్రహములు మఱల లభించునా? | ర - చ - బు - గు - శ | 5 |
| 92. | చోరీజేసిన వస్తువులు లేక ధనము తీసుకు పోయిన మాయింటి బాలుడు మఱల తిరిగి రాగలడా? వాని పరిస్థితి యేమిటి? | కు - బు - గు - శ | 4 |
| 93. | నేను పారవేసుకున్న వస్తువులు నాకు లభ్యమగునా? | ర - కు - బు - గు - శ | 5 |
| 94. | నేను పారవేసుకున్న ధనము నాకు లభ్యమగునా? | చ - కు - బు - గు - శ | 5 |
| 95. | మనస్సు స్థిమితములేక పోయిన స్త్రీ లేక వ్యక్తి మఱల తిరిగివచ్చునా? | ర - చ-కు-బు-గు-శ | 6 |
| 96. | జరిగిన పరీక్షలో నేను జయమును పొందుదునా? | శు - శ | 2 |

| | | | |
|---|---|---|---|
| 97. | నాయొక్క విద్య యింకా అభివృద్ధి జెందునా? | ర - శు - శ | 3 |
| 98. | నేను తలంచిన ప్రదేశములో నిధి నిక్షేపములు గలవా? | చ - శు - శ | 3 |
| 99. | నాకున్న భూములలో యే దిక్కున పంటలు బాగుగా పండును? | ర - చ - శు - శ | 4 |
| 100. | నాయొక్క ఆస్తికి అగ్నిపెట్టిన దెవరు? పురుషుడా? స్త్రీయా? | కు - శు - శ | 3 |
| 101. | నేను చేపట్టిన స్త్రీ నాతో సఖ్యతగా యుండునా? | ర - కు - శు - శ | 4 |
| 102. | దారితప్పిపోయిన పశువులు మఱల లభ్యమగునా వాని పరిస్థితి? యేమిటి ? యే దిక్కునకు పోయినవి ? | చ - కు - శు - శ | 4 |
| 103. | మైనరు ఆస్తి ధర్మకర్త నుండి వచ్చునా? | ర - చ - కు - శు - శ | 5 |
| 104. | స్పెక్యూలేషన్ వ్యాపారము నాకు అనుకూలముగా యుండునా? | బు - శు - శ | 3 |
| 105. | ఈ ఓడల వలన నాకు లాభము గలుగునా? | ర - బు - శు - శ | 4 |
| 106. | నాయొక్క మనిషి ప్రయాణము నందు పోయినవాడు యింటికి సుఖముగా చేరగలడా? వాని పరిస్థితి యేమిటి? | చ - బు - శు - శ | 4 |
| 107. | తాకట్టునందున్న ఆస్తి లేక సొమ్ము మఱల పొందగలనా? | ర - చ - బు - శు - శ | 5 |
| 108. | ఈ సంవత్సరము జేయు కంట్రాక్టులు నాకు లాభించునా? | కు - బు - శు - శ | 4 |

జాతకుని జన్మతేది తనకు గల స్త్రీ పురుష సంతాన సంఖ్య, తెలుగు లేక ఆంగ్లభాషలో తన యొక్క లేక జ్ఞాతుల పేర్లు యొక్క ప్రథమాక్షరములు తెలుపు రహస్య విధానములు.

**M.C - 1**

| ప్రథమ నామాక్షరము | | | రవి | చంద్ర | కుజ | బుధ | గురు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | అ | A | ర | | | | |
| 2 | ఆ | B | | చ | | | |
| 3 | ఇ | C | ర | చ | | | |
| 4 | ఈ | D | | | కు | | |
| 5 | ఉ | E | ర | | కు | | |
| 6 | ఊ | F | | చ | కు | | |
| 7 | ఋ | G | ర | చ | కు | | |
| 8 | ౠ | H | | | | బు | |
| 9 | ఎ | I | ర | | | బు | |
| 10 | ఏ | J | | చ | | బు | |
| 11 | ఐ | K | ర | చ | | బు | |
| 12 | ఒ | L | | | కు | బు | |
| 13 | ఓ | M | ర | | కు | బు | |
| 14 | ఔ | N | | చ | కు | బు | |
| 15 | క | O | ర | చ | కు | బు | |
| 16 | కా | P | | | | | గు |
| 17 | కి | Q | ర | | | | గు |
| 18 | కీ | R | | చ | | | గు |
| 19 | కు | S | ర | చ | | | గు |
| 20 | కూ | T | | | కు | | గు |
| 21 | కృ | U | ర | | కు | | గు |
| 22 | కె | V | | చ | కు | | గు |
| 23 | కే | W | ర | చ | కు | | గు |
| 24 | కై | X | | | | బు | గు |
| 25 | కొ | Y | ర | | | బు | గు |
| 26 | కో | Z | | చ | | బు | గు |
| 27 | కౌ | | ర | చ | | బు | గు |
| 28 | ఖ | | | | కు | బు | గు |
| 29 | ఖా | | ర | | కు | బు | గు |
| 30 | గ | | | చ | కు | బు | గు |
| 31 | గా | | ర | చ | కు | బు | గు |

## M.C - 2

| ప్ర.నా. 1 | | రవి 2 | చంద్ర 3 | కుజ 4 | బుధ 5 | గురు 6 | శుక్ర 7 |
|---|---|---|---|---|---|---|---|
| 32 | గి | | | | | | శు |
| 33 | గీ | ర | | | | | శు |
| 34 | గు | | చ | | | | శు |
| 35 | గూ | ర | చ | | | | శు |
| 36 | గృ | | | కు | | | శు |
| 37 | గె | ర | | కు | | | శు |
| 38 | గే | | చ | కు | | | శు |
| 39 | గై | ర | చ | కు | | | శు |
| 40 | గొ | | | | బు | | శు |
| 41 | గో | ర | | | బు | | శు |
| 42 | గౌ | | చ | | బు | | శు |
| 43 | ఘ | ర | చ | | బు | | శు |
| 44 | ఘా | | | కు | బు | | శు |
| 45 | చ | ర | | కు | బు | | శు |
| 46 | చా | | చ | కు | బు | | శు |
| 47 | చి | ర | చ | కు | బు | | శు |
| 48 | చీ | | | | | గు | శు |
| 49 | చు | ర | | | | గు | శు |
| 50 | చూ | | చ | | | గు | శు |
| 51 | చె | ర | చ | | | గు | శు |
| 52 | చే | | | కు | | గు | శు |

గమనిక :- ఈ పట్టికలలో ఉదహరించిన గ్రహములకు - రవి - 1 గను, చంద్ర - 2 గను, కుజ - 4 గను, బుధ - 8 గను, గురు - 16 గను, శుక్ర - 32 గను, శని - 64 గను, రాహు- 128 గను భావించవలెను.

## M.C - 3

| ప్ర.నా. 1 | | రవి 2 | చంద్ర 3 | కుజ 4 | బుధ 5 | గు.శు 6 | శని 7 |
|---|---|---|---|---|---|---|---|
| 53 | చొ | ర | | కు | | గు.శు | |
| 54 | చో | | చ | కు | | గు.శు | |
| 55 | చౌ | ర | చ | కు | | గు.శు | |
| 56 | జ | | | | బు | గు.శు | |
| 57 | జా | ర | | | బు | గు.శు | |
| 58 | జి | | చ | | బు | గు.శు | |
| 59 | జు | ర | చ | | బు | గు.శు | |
| 60 | జూ | | | కు | బు | గు.శు | |
| 61 | జె | ర | | కు | బు | గు.శు | |
| 62 | జే | | చ | కు | బు | గు.శు | |
| 63 | జొ | ర | చ | కు | బు | గు.శు | |
| 64 | జో | | | | | | శ |
| 65 | జ్యో | ర | | | | | శ |
| 66 | జ్వా | | చ | | | | శ |
| 67 | ఝ | ర | చ | | | | శ |
| 68 | జ్ఞా | | | కు | | | శ |
| 69 | ట | ర | | కు | | | శ |
| 70 | టా | | చ | కు | | | శ |
| 71 | టె | ర | చ | కు | | | శ |
| 72 | టే | | | | బు | | శ |
| 73 | టో | ర | | | బు | | శ |
| 74 | ఠ | | చ | | బు | | శ |
| 75 | ఠా | ర | చ | | బు | | శ |
| 76 | డ | | | కు | బు | | శ |
| 77 | డా | ర | | కు | బు | | శ |
| 78 | డి | | చ | కు | బు | | శ |

## M.C - 4

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గు | శు | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 79 | డీ | ర | చ | కు | బు | | | శ |
| 80 | డు | | | | | గు | | శ |
| 81 | డూ | ర | | | | గు | | శ |
| 82 | డె | | చ | | | గు | | శ |
| 83 | డే | ర | చ | | | గు | | శ |
| 84 | డొ | | | కు | | గు | | శ |
| 85 | డో | ర | | కు | | గు | | శ |
| 86 | త | | చ | కు | | గు | | శ |
| 87 | తా | ర | చ | కు | | గు | | శ |
| 88 | తి | | | | బు | గు | | శ |
| 89 | తీ | ర | | | బు | గు | | శ |
| 90 | తు | | చ | | బు | గు | | శ |
| 91 | తూ | ర | చ | | బు | గు | | శ |
| 92 | తె | | | కు | బు | గు | | శ |
| 93 | తే | ర | | కు | బు | గు | | శ |
| 94 | తొ | | చ | కు | బు | గు | | శ |
| 95 | తో | ర | చ | కు | బు | గు | | శ |
| 96 | త్యా | | | | | | శు | శ |
| 97 | త్రి | ర | | | | | శు | శ |
| 98 | ద | | చ | | | | శు | శ |
| 99 | ధ | ర | చ | | | | శు | శ |
| 100 | దా | | | కు | | | శు | శ |
| 101 | ది | ర | | కు | | | శు | శ |
| 102 | దీ | | చ | కు | | | శు | శ |
| 103 | దృ | ర | చ | కు | | | శు | శ |
| 104 | దై | | | | బు | | శు | శ |

## M.C - 5

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శు.శ |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 105 | దొ | ర | | | బు | | శు.శ |
| 106 | దో | | చ | | బు | | శు.శ |
| 107 | దౌ | ర | చ | | బు | | శు.శ |
| 108 | ద్రో | | | కు | బు | | శు.శ |
| 109 | ద్వా | ర | | కు | బు | | శు.శ |
| 110 | న | | చ | కు | బు | | శు.శ |
| 111 | నా | ర | చ | కు | బు | | శు.శ |
| 112 | ని | | | | | గు | శు.శ |
| 113 | నీ | ర | | | | గు | శు.శ |
| 114 | ను | | చ | | | గు | శు.శ |
| 115 | నూ | ర | చ | | | గు | శు.శ |
| 116 | నె | | | కు | | గు | శు.శ |
| 117 | నే | ర | | కు | | గు | శు.శ |
| 118 | నొ | | చ | కు | | గు | శు.శ |
| 119 | నో | ర | చ | కు | | గు | శు.శ |
| 120 | నౌ | | | | బు | గు | శు.శ |
| 121 | ప | ర | | | బు | గు | శు.శ |
| 122 | పా | | చ | | బు | గు | శు.శ |
| 123 | పి | ర | చ | | బు | గు | శు.శ |
| 124 | పీ | | | కు | బు | గు | శు.శ |
| 125 | పు | ర | | కు | బు | గు | శు.శ |
| 126 | పూ | | చ | కు | బు | గు | శు.శ |
| 127 | పృ | ర | చ | కు | బు | గు | శు.శ |

## M.C - 6

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | రాహు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 128 | పె | | | | | | రా |
| 129 | పే | ర | | | | | రా |
| 130 | పొ | | చ | | | | రా |
| 131 | పో | ర | చ | | | | రా |
| 132 | ప్ర | | | కు | | | రా |
| 133 | పౌ | ర | | కు | | | రా |
| 134 | ఫి | | చ | కు | | | రా |
| 135 | ఫీ | ర | చ | కు | | | రా |
| 136 | ఫ్రి | | | | బు | | రా |
| 137 | ప్రే | ర | | | బు | | రా |
| 138 | ప్రో | | చ | | బు | | రా |
| 139 | పః | ర | చ | | బు | | రా |
| 140 | ప్రౌ | | | కు | బు | | రా |
| 141 | ప్రా | ర | | కు | బు | | రా |
| 142 | బ | | చ | కు | బు | | రా |
| 143 | బా | ర | చ | కు | బు | | రా |
| 144 | భ్రా | | | | | గు | రా |
| 145 | భా | ర | | | | గు | రా |
| 146 | బి | | చ | | | గు | రా |
| 147 | బీ | ర | చ | | | గు | రా |
| 148 | భీ | | | కు | | గు | రా |
| 149 | భ | ర | | కు | | గు | రా |
| 150 | భ్ర | | చ | కు | | గు | రా |
| 151 | బు | ర | చ | కు | | గు | రా |
| 152 | బూ | | | | బు | గు | రా |
| 153 | బృ | ర | | | బు | గు | రా |

## M.C - 7

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 154 | భూ | | చ | | బు | గు | | శ |
| 155 | బై | ర | చ | | బు | గు | | శ |
| 156 | బొ | | | కు | బు | గు | | శ |
| 157 | బో | ర | | కు | బు | గు | | శ |
| 158 | బ్ర | | చ | కు | బు | గు | | శ |
| 159 | బ్రా | ర | చ | కు | బు | గు | | శ |
| 160 | భు | | | | | | శు | శ |
| 161 | భృ | ర | | | | | శు | శ |
| 162 | మ | | చ | | | | శు | శ |
| 163 | మా | ర | చ | | | | శు | శ |
| 164 | మి | | | కు | | | శు | శ |
| 165 | మీ | ర | | కు | | | శు | శ |
| 166 | ము | | చ | కు | | | శు | శ |
| 167 | మూ | ర | చ | కు | | | శు | శ |
| 168 | మృ | | | | బు | | శు | శ |
| 169 | మె | ర | | | బు | | శు | శ |
| 170 | మే | | చ | | బు | | శు | శ |
| 171 | మై | ర | చ | | బు | | శు | శ |
| 172 | మొ | | | కు | బు | | శు | శ |
| 173 | మో | ర | | కు | బు | | శు | శ |
| 174 | మౌ | | చ | కు | బు | | శు | శ |
| 175 | మ్లె | ర | చ | కు | బు | | శు | శ |
| 176 | య | | | | | గు | శు | శ |
| 177 | యా | ర | | | | గు | శు | శ |
| 178 | యి | | చ | | | గు | శు | శ |
| 179 | యీ | ర | చ | | | గు | శు | శ |

## M.C - 8

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శని | రా |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 180 | యు | | | కు | | గురు | | రా |
| 181 | యూ | ర | | కు | | గురు | | రా |
| 182 | యో | | చ | కు | | గురు | | రా |
| 183 | ర | ర | చ | కు | | గురు | | రా |
| 184 | రా | | | | బు | గురు | | రా |
| 185 | రి | ర | | | బు | గురు | | రా |
| 186 | రీ | | చ | | బు | గురు | | రా |
| 187 | రు | ర | చ | | బు | గురు | | రా |
| 188 | రూ | | | కు | బు | గురు | | రా |
| 189 | రె | ర | | కు | బు | గురు | | రా |
| 190 | రే | | చ | కు | బు | గురు | | రా |
| 191 | రై | ర | చ | కు | బు | గురు | | రా |
| 192 | రొ | | | | | | శ | రా |
| 193 | రో | ర | | | | | శ | రా |
| 194 | రౌ | | చ | | | | శ | రా |
| 195 | ఱ | ర | చ | | | | శ | రా |
| 196 | ఱా | | | కు | | | శ | రా |
| 197 | ల | ర | | కు | | | శ | రా |
| 198 | లా | | చ | కు | | | శ | రా |
| 199 | లి | ర | చ | కు | | | శ | రా |
| 200 | లీ | | | | బు | | శ | రా |
| 201 | లు | ర | | | బు | | శ | రా |
| 202 | లూ | | చ | | బు | | శ | రా |
| 203 | లె | ర | చ | | బు | | శ | రా |
| 204 | లే | | | కు | బు | | శ | రా |
| 205 | లై | ర | | కు | బు | | శ | రా |

## M.C - 9

| ప్ర.నా. | | రవి | చం[్ర]ద | కుజ | బుధ | గు | శు | శ.రా |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 206 | లో | | చ | కు | బు | | | శరా |
| 207 | లౌ | ర | చ | కు | బు | | | శరా |
| 208 | ళ | | | | | గు | | శరా |
| 209 | ళా | ర | | | | గు | | శరా |
| 210 | ళి | | చ | | | గు | | శరా |
| 211 | ళీ | ర | చ | | | గు | | శరా |
| 212 | ళు | | | కు | | గు | | శరా |
| 213 | ళూ | ర | | కు | | గు | | శరా |
| 214 | వ | | చ | కు | | గు | | శరా |
| 215 | వా | ర | చ | కు | | గు | | శరా |
| 216 | వి | | | | బు | గు | | శరా |
| 217 | వీ | ర | | | బు | గు | | శరా |
| 218 | వృ | | చ | | బు | గు | | శరా |
| 219 | వె | ర | చ | | బు | గు | | శరా |
| 220 | వే | | | కు | బు | గు | | శరా |
| 221 | వై | ర | | కు | బు | గు | | శరా |
| 222 | వొ | | చ | కు | బు | గు | | శరా |
| 223 | వో | ర | చ | కు | బు | గు | | శరా |
| 224 | శ | | | | | | శు | శరా |
| 225 | శా | ర | | | | | శు | శరా |
| 226 | శి | | చ | | | | శు | శరా |
| 227 | శ్రీ | ర | చ | | | | శు | శరా |
| 228 | శు | | | కు | | | శు | శరా |
| 229 | శృ | ర | | కు | | | శు | శరా |
| 230 | శె | | చ | కు | | | శు | శరా |
| 231 | శే | ర | చ | కు | | | శు | శరా |

## M.C - 10

| ప్ర.నా. | | రవి | చంద్ర | కుజ | బుధ | గు | శుశరా |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 232 | శై | | | | బు | | శుశరా |
| 233 | శ్యా | ర | | | బు | | శుశరా |
| 234 | శ్యే | | చ | | బు | | శుశరా |
| 235 | శ్రా | ర | చ | | బు | | శుశరా |
| 236 | ష | | | కు | బు | | శుశరా |
| 237 | షో | ర | | కు | బు | | శుశరా |
| 238 | షి | | చ | కు | బు | | శుశరా |
| 239 | స | ర | చ | కు | బు | | శుశరా |
| 240 | సా | | | | | గు | శుశరా |
| 241 | సి | ర | | | | గు | శుశరా |
| 242 | సీ | | చ | | | గు | శుశరా |
| 243 | సు | ర | చ | | | గు | శుశరా |
| 244 | సూ | | | కు | | గు | శుశరా |
| 245 | సె | ర | | కు | | గు | శుశరా |
| 246 | సే | | చ | కు | | గు | శుశరా |
| 247 | సొ | ర | చ | కు | | గు | శుశరా |
| 248 | సో | | | | బు | గు | శుశరా |
| 249 | హ | ర | | | బు | గు | శుశరా |
| 250 | హా | | చ | | బు | గు | శుశరా |
| 251 | హి | ర | చ | | బు | గు | శుశరా |
| 252 | హై | | | కు | బు | గు | శుశరా |
| 253 | క్ష | ర | | కు | బు | గు | శుశరా |
| 254 | క్షీ | | చ | కు | బు | గు | శుశరా |
| 255 | క్షే | ర | చ | కు | బు | గు | శుశరా |

గమనిక :- ఈ పట్టికలో ఉదహరించిన గ్రహములకు రవి - 1గను, చంద్ర - 2గను, కుజ - 4 గను, బుధ - 8 గను, గురు - 16 గను, శుక్ర - 32 గను, శని - 64 గను, రాహు - 128 గను, గురు శుక్రులు కలసియున్న - 48 గను, శుక్ర శనులు కలసియున్న - 96 గను, శని రాహువులు కలసియున్న - 192 గను, శుశరా కలిసియున్న 224 గను భావించవలెను.

జాతకుని జన్మతేదీ. తనకు గల స్త్రీ పురుష సంతాన సంఖ్య. తెలుగు లేక ఆంగ్లభాషలో తన యొక్క గాని. లేక జ్ఞాతుల పేర్ల ప్రథమాక్షరములు తెలుపు రహస్య విధానములు ఈ క్రింది విధముగా యుండును.

## జాతకుని జన్మతేది, తెలుపు విధానము

ఇందు ప్రధాన పత్రములు (M.C-1 నుండి M.C-10) 10 గలవు. ఇందు 1 నుండి 255 వరకు వరుస నంబర్లు గల్గి వానికి యెదురుగా తెలుగు భాషలో సామాన్యముగా వచ్చు ప్రథమాక్షరములు వ్రాయబడియున్నవి. అటులనే M.C-1 మొదటి పత్రములో 1 నుండి 26 వరకు ఇంగ్లీషు అక్షరములు వరుస క్రమమున వ్రాయబడి యున్నవి. జ్యోతిష్కుడైనవాడు జాతకుని మనస్సు నందున్న తన జన్మతేది మొదలగు విషయములు ఈ పత్రముల ద్వారా తెలుసుకొని బహిరంగ పరచవచ్చును.

1. జాతకుని జన్మతేది. మాసము. సంతాన సంఖ్య తెలుసుకొనుటకు M.C-1 మొదటి పత్రము చాలును.

2. జాతకుడు జన్మించిన సంవత్సరము తెలుసుకొనుటకు M.C-1 నుండి M.C-4 మొదటి 4 పత్రములను ఉపయోగించవలెను. ఇందు 1964 సంవత్సరము అయినప్పుడు 19 సంఖ్యను వదిలి 64 ను మాత్రమే లెక్కకు గ్రహించవలెను. ఇదే విధమున యితర సంవత్సరముల యందు గూడ గ్రహించవలెను.

ఉ. జాతకుని మనస్సునందున్న తన జన్మతేది 26 - 10 - 1974 ఇది కనుగొనుటకు జాతకునికి మొదటి 4 పత్రములు (M.C-1 నుండి M.C-4) చేతికిచ్చి పత్రముల యందు గల వరుస నంబర్లలో తన జన్మతేది. మాసము. సంవత్సరము గల పత్రములను తీయమని అడుగవలెను. జాతకుడు తన జన్మతేది సంఖ్య. మాస సంఖ్య గల M.C-1 పత్రమును. 74 సంవత్సరము గల M.C-3వ పత్రమును తీసి యిచ్చును.

1వ పత్రమును తన చేతికిచ్చి తన జన్మతేది సంఖ్యకు యెదురుగా యున్న 2 నుండి 6 కాలములలో యున్న గ్రహముల పేర్లు చెప్పమని అడుగవలెను. జన్మతేది 26 కాబట్టి దానికి యెదురుగా యున్న గ్రహములు చ - బు - గు అని చెప్పును. వానికి నిర్ణయించిన సంఖ్యలు చ - 2 + బు - 8 + గు - 16 = 26 సంఖ్య వచ్చినది. నీ జన్మతేది 26 అని చెప్పవలెను.

అదే విధముగా మాస సంఖ్య 10 యెదురుగా యున్న గ్రహములు చ - బు అని చెప్పును. వానికి నిర్ణయించిన సంఖ్యలు చ - 2 + బు - 8 = 10 సంఖ్య వచ్చినది. కాబట్టి జాతకుడు 10 వ నెలలో జన్మించినట్లు చెప్పవలెను. జాతకుడు జన్మించిన సం. 74 కాబట్టి M.C-3 పరికించి ఈ సంఖ్యకు యెదురుగా యన్న గ్రహములు చ - బు - శ అని చెప్పును. వానికి నిర్ణయించిన సంఖ్యలు చ - 2 + బు - 8 + శ - 64 ఇవి మొత్తము చేయగా 74 వచ్చినది. కాబట్టి జాతకునికి నీవు జన్మించిన సంవత్సరమి 1974 అని చెప్పవలెను.

## జాతకుని సంతాన సంఖ్య తెలుపు విధానము

ఏ జాతకునికైనను సంతాన సంఖ్య 15 కు మించి యుండదు. కాబట్టి 1 వ పత్రము M.C-1 మాత్రమే ఉపయోగించిన చాలును. జాతకునికి 1 వ పత్రము చేతికిచ్చి తన సంతాన సంఖ్యకు యెదురుగా యున్న గ్రహములను చెప్పమనవలెను. తన సంతాన సంఖ్య 9 యైయున్న దానికి యెదురుగా యున్న గ్రహములు ర - బు అని చెప్పును. వీనికి నిర్ణయించిన సంఖ్యలు ర - 1 + బు - 8 = 9 సంఖ్య వచ్చినది. నీ సంతాన సంఖ్య 9 అని చెప్పవలెను. ఇందులో పురుషులు 5 అనుకొందము. జాతకుని అడిగిన 5 కి .యెదురుగా యున్న గ్రహములు ర - కు అని చెప్పును. ర - 1 + కు - 4 కలిపిన 5 యైనది. నీ పురుష సంతానము 5 గురు అనియు. మొత్తము 9 లో 5 తీసివేయగా 4 స్త్రీలని చెప్పవలెను.

## జాతకుని మనస్సులో యున్న తన తాత యొక్క పేరు ప్రథమాక్షరము మాతృభాషయైన తెలుగులో చెప్పు విధానము

జాతకునికి ప్రథమ నామాక్షరములు గల పత్రములు 10 (M.C-1 నుండి M.C-10) ముందుగా యివ్వవలెను. ఇందు 1 నుండి 255 సంఖ్య వరకు వరుస క్రమమున నామాక్షరములు వ్రాయబడియున్నవి. అందు తనకు తోచిన నామాక్షరము తాత పేరు యొక్క ప్రథమాక్షరము యున్న పత్రమును విడదీసి అందు తన తాత పేరు ప్రథమాక్షరమునకు యెదురుగాయున్న 2 నుండి చివర వరకు యున్న కాలములలో గల గ్రహ పేర్లు చెప్పమని అడుగవలెను.

ఉ. జాతకుని తాత పేరు సూర్యనారాయణ అనుకొందము. 'సూ' అను ప్రథమాక్షరము యెందున్నది వెతకి M.C-10 పత్రమును తీస 244 'సూ' కు యెదురుగా యున్న గ్రహములు కు - గు - శుశరా అని చెప్పును. జ్యోతిష్కుడు వీనికి నిర్ణయించిన సంఖ్యలు కు - 4 + గు - 16 + శు - 32 + శ - 64 + రా - 128 = 244 మొత్తము కలిపి 244 సంఖ్య ప్రక్కనే యున్న 'సూ' ను జాతకుని తాత పేరు యొక్క ప్రథమాక్షరముగా చెప్పవలెను.

## జాతకుడు కోరిన పేరు ప్రథమాక్షరము ఆంగ్లభాషలో చెప్పు విధానము

ఆంగ్లభాషాక్షరములు మొత్తము 26 కాబట్టి, యివి M.C-1 పత్రము నందున్నందున యిందు 1 వ పత్రము ఉపయోగంచిన చాలును.

ఉ. జాతకుడు కోరిన తాత పేరు నందూరి వెంకట రత్నము అనుకొందుము. ఇంగ్లీషులో పొడి అక్షరములు N.V.R. అని పల్కుచున్నవి. మొదటి అక్షరమునకు యెదురుగా గల గ్రహముల పేర్లు చ - కు - బు అనియు, రెండవ అక్షరమునకు యెదురుగా యున్న గ్రహముల పేర్లు చ - కు - గు అనియు, మూడవ అక్షరమునకు యెదురుగా యున్న గ్రహముల పేర్లు చ - గు అనియు, జాతకుడు చెప్పును. వీనికి నిర్ణయించబడిన సంఖ్యలు ఈ క్రింది విధముగా యున్నవి. ఈ సంఖ్యలను బట్టి ప్రక్కనేయున్న యింగ్లీషు అక్షరములను నిర్ణయించవలెను.

1. చ - 2 + శు - 4 + బు - 8 = 14 - N
2. చ - 2 + శు - 4 + గు - 16 = 22 - V
3. చ - 2 + గు - 16 + = 18 - R

ఇంగ్లీషు అక్షరములు మొత్తము కలుపగా N.V.R. అయినది. ఇదియే జాతకుని యొక్క తాత యింటిపేరు, నామ ప్రథమాక్షరములు అయినవి.

## గ్రహ వీక్షణములు

ప్రతి గ్రహము తానున్న స్థానము నుండి యేడవ యింటిని, యందున్న గ్రహములను చూచును. ఇదియే గాక కుజుడు తానున్న యింటికి నాల్గవ యింటిని, యెనిమిదవ యింటిని, నందుండు గ్రహములను గూడ చూచును. గురుడు తానున్న యింటికి ఐదవ యింటిని, తొమ్మిదవ యింటిని, నందుండు గ్రహములను గూడ చూచును. శనితానున్న యింటికి మూడవ యింటిని పదియవ యింటిని, నందుండు గ్రహములను గూడ చూచును. గురునకు ఆచ్ఛాదన యను యింకొక దృష్టి గూడ గలదు. ఈ గ్రహము తానున్న యింటికి మూడవ యింటిని పదునొకండవ యింటిని, నందుండు గ్రహములను గూడ చూచును. ఈ దృష్టినే ఆచ్ఛాదన దృష్టి యందురు. గ్రహములు శుభస్థితి యందుండి చూచిన శుభఫలములను, పాప సంబంధము గలిగి చూచిన పాపఫలముల నిచ్చును.

### గ్రహములయొక్క స్వక్షేత్ర, ఉచ్చక్షేత్ర, మిత్రక్షేత్ర, నీచక్షేత్ర, శత్రుక్షేత్రములను తెలుపు పట్టిక

| వరుస నంబరు 1 | గ్రహ నామములు 2 | స్వ, ఉచ్చ, మిత్ర క్షేత్రములు 3 | నీచ, శత్రు క్షేత్రములు 4 |
|---|---|---|---|
| 1. | రవి | సింహము (స్వ)<br>మేషము (ఉచ్చ)<br>ధనుస్సు మీనము | తుల (నీచ) వృషభము<br>మిథునము కర్కాటకము<br>కన్య వృశ్చికము మకరము<br>కుంభము |
| 2. | చంద్రుడు | కర్కాటకము (స్వ)<br>వృషభము (ఉ)<br>మిధునము కన్య<br>ధనుస్సు, మీనము | వృశ్చికము (నీచ) మేషము<br>సింహము తుల మకరము<br>కుంభము |
| 3. | కుజుడు | మేషము (స్వ)<br>వృశ్చికము (స్వ)<br>మకరము (ఉ)<br>వృషభము మిధునము<br>కన్య తుల | కర్కాటము (నీచ)<br>సింహము ధనుస్సు<br>కుంభము మీనము |

| వరుస నంబరు | గ్రహ నామములు | స్వ, ఉచ్ఛ, మిత్ర క్షేత్రములు | నీచ, శత్రు క్షేత్రములు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 4. | బుధుడు | మిధునము (స్వ) కన్య (స్వ. ఉ.) మేషము వృషభము కర్కాటకము తుల వృశ్చికము ధనుస్సు మకరము కుంభము | మీనము (నీచ) సింహము |
| 5. | గురుడు | ధనుస్సు, మీనము (స్వ) కర్కాటకము (ఉ) వృషభము మిధునము సింహము కన్య తుల కుంభము | మకరము (నీచ) మేషము వృశ్చికము |
| 6. | శుక్రుడు | వృషభము, తుల (స్వ) మీనము (ఉ) మేషము మిధునము వృశ్చికము ధనుస్సు మకరము కుంభము | కన్య (నీచ) కర్కాటకము సింహము |
| 7. | శని | మకరము (స్వ) కుంభము (స్వ) తుల (ఉచ్ఛ) వృషభము మిథునము కన్య ధనుస్సు మీనము | మేషము (నీచ) కర్కాటకము సింహము వృశ్చికము |
| (పారా శరీహూర ప్రకారము రాహుకేతువులకు) | | | |
| 8. | రాహువు | కుంభము (స్వ) వృషభము (ఉ) మిథునము సింహము (మూ. త్రి) కన్య తుల ధనుస్సు మకరము | వృశ్చికము (నీచ) మేషము కర్కాటకము మీనము |
| 9. | కేతువు | సింహము (స్వ) వృశ్చికము (ఉ) కుంభము (మూ. త్రి) మిథునము తుల ధనుస్సు మకరము మీనము | వృషభము (నీచ) మేషము కర్కాటకము కన్య |

**ఏ తేదీకైనను వారమును కనుగొను అతి సులభమైన విధానము.**

జనవరి నుండి కావలసిన మాసము వరకు దిన సంఖ్యలను కూడి వారసంఖ్య 7 చే భాగించగా మిగిలిన శేషము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | జనవరి | 3 | 5. | మే | 4 | 9. | సెప్టెంబరు | 0 |
| 2. | ఫిబ్రవరి | 0 | 6. | జూన్ | 6 | 10. | అక్టోబరు | 3 |
| 3. | మార్చి | 6 | 7. | జూలై | 2 | 11. | నవంబరు | 5 |
| 4. | ఏప్రియల్ | 1 | 8. | ఆగష్టు | 5 | 12. | డిశంబరు | 1 |

సంవత్సరమునకు 365 దినములు. వారము యొక్క సంఖ్య 7చే భాగించి 365/7=52 వారముల 1 దినము పెరుగుచున్నది. లీపు సంవత్సరమునకు ఫిబ్రవరి 29 దినములు అగుట వలన 366 దినములు అగుచున్నవి. దీనిని వారము 7 చే భాగించుట వలన లీపు సంవత్సరమునకు 2 దినములు పెరుగుచున్నవి.

ఫిబ్రవరి నెలలో 28-29 తేదీలు రెండు యుండుటచే వీనిని వార సంఖ్యయైన 7చే భాగించగా వచ్చిన శేషమును లెక్కయందు గ్రహించరాదు. ఈ తేదీలకు పై పట్టికలో చూపిన జనవరి నెల శేషము 3 ను మాత్రమే గ్రహించవలెను.

**1 వ పద్ధతి : ఉ. 1. 28-2-1980 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

1980 పూర్తిగా లేనందున 1979 సంవత్సరము వరకే గ్రహించవలెను.

| | |
|---|---|
| సంవత్సరములు | 1979 |
| పై సంవత్సరములో లీపు సంవత్సరములు 1979/4 | 494 |
| ఫిబ్రవరి నెల 28 రోజులు | 28 |
| పై పట్టిక ప్రకారము జనవరి శేషము | 3 |
| వచ్చిన మొత్తమును 7 చే భాగించుము. | 7)2504(357 |
| | 2499 |
| ఆదివారము నుండి 5 గురువారము (28-2-1980) శేషము | 5 అయినది. |

**2 వ పద్ధతి : ఉ. 2. 28-2-1980 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

| | |
|---|---|
| 1979 సంవత్సరమును 7 చే భాగించగా శేషము | 5 |
| 1980 ఫిబ్రవరి పూర్తిగా లేనందున యిది లీపు సంవత్సరం కాదు. | |
| 1979 లీపు సం॥లు : 1979/4 = 494. దీనిని వారసంఖ్యచే | |
| భాగించిన 494/7 = శేషము | 4 |
| పై పట్టిక ప్రకారము జనవరి నెల శేషము | 3 |
| 28 రోజులను 7 చే భాగించగా వచ్చిన శేషము | 0 |
| | 7)12(1 |
| | 7 |
| ఆదివారము నుండి 5 గురువారము (28-2-1980) శేషము | 5 అయినది. |

ఉ.3. 22-2-1978 తేదీ యొక్క వారమును కనుగొనుము ?

22వ తేదీన 7 చే భాగించగా శేషము. 1

ఫిబ్రవరి నెల పూర్తిగా లేనందున జనవరినెల శేషము పై పట్టిక ప్రకారము. 3

ఫిబ్రవరి నెల పూర్తిగా లేనందున 1978 సం. లీపు సంవత్సరముగా గ్రహించరాదు.

1977 సం.ను 7చే భాగించిన శేషము 3

1977 లో లీపు సం॥లు 494 ను వార సంఖ్య 7చే భాగించగా 494 / 7 శేషము 4

-----

11 మొత్తమును 7చే భాగించుము 7)11(1

7

----

ఆదివారము నుండి 4 బుధవారము (22-2-1978) యైనది. శేషము 4

ఉ. 4. 20-9-1972 తేదీ యొక్క వారమును కనుగొనుము ?

20 వ తేదిని వార సంఖ్య యైన 7చే భాగించగా మిగిలిన శేషము 6

9 వ నెల పూర్తిగా లేనందున దానికి ముందున్న నెల ఆగష్టుకు

పై పట్టికలో యున్న శేషము 5

1972 పూర్తిగా లేనందున దాని ముందున్న సం. 1971 సం.ను

7చే భాగించిన శేషము 4

ఫిబ్రవరి మాసముతో కలిసియున్న లీపు సం॥లు (1972/4=493)

493 ని 7చే భాగించిన శేషము 3

-----

18 మొత్తమును వారసంఖ్య 7 చే భాగించుము. 7)18( 2

14

----

ఆదివారము నుండి 4 బుధవారము (20-9-1972) యైనది. శేషము 4

ఉ. 5. 25-1-1983 తేదీ యొక్క వారమును కనుగొనుము ?

25 వ తేదిని 7 చే భాగించగా శేషము 4

1983 ముందున్న సంవత్సరము 1982 ను 7చే భాగించగా శేషము 1

1983 సం॥లో లీపు సంవత్సరములు 495 ను 7చే భాగించగా

495 / 7 శేషము. 5

-----

10 మొత్తమును వారసంఖ్య 7 చే భాగించుము. 7)10 (1

7

----

ఆదివారము నుండి 3 మంగళవారము (25-1-1983) యైనది. శేషము 3

**ఉ. 6. 1-1-1994 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

1 వ తేదీని 7చే భాగించగా శేషము 1 గానే గ్రహించవలెను. 1

1993 సం॥ను 7చే భాగించగా శేషము 5

1993 సం॥లో లీపు సం.లు 498 ని 7చే భాగించగా 498/7 శేషము 1

-----

7 మొత్తమును వారసంఖ్య 7 చే భాగించుము. 7) 7(1

'0' శేషమును 7గా భావించవలెను. ఆదివారము నుండి 7 వరకు 7

లెక్కించగా శనివారము (1-1-1994) యైనది. శేషము 0

**ఉ. 7. 21-1-1980 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

21వ తేదీని 7 చే భాగించిన శేషము 0

1979 సం॥ను 7 చే భాగించగా శేషము. 5

1980 సం॥నకు ఫిబ్రవరి నెల లేనందున లీపు సం.గా గ్రహించరాదు.

1979 సం.ను 4 చే భాగించిన 494 లీపు సం.లను 7 చే భాగించగా శేషము 4

----

9 మొత్తమును 7 చే భాగించిన 2 శేషము. 7) 9 (1

7

ఆదివారము నుండి 2 సోమవారము (21-1-1980) యైనది. శేషము 2

**ఉ. 8. 31-10-1950 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

అక్టోబరు నెల పూర్తిగా యున్నందున పై పట్టిక ప్రకారము శేషము 3

1949 సం॥ను 7చే భాగించగా శేషము 3

1949 సం.లో లీపు సంవత్సరములు 1949/4 = 487. వీనిని 4

7చే భాగించగా శేషము

----

10 మొత్తమును 7 చే భాగించగా శేషము. 7)10 (1

7

ఆదివారము నుండి 3 మంగళవారము (31-10-1950) యైనది. శేషము 3

**ఉ. 9. 18-7-1923 తేదీ యొక్క వారమును కనుగొనుము ?**

18 వ తేదీని 7చే భాగించిన శేషము. 4

జులైనెల పూర్తిగా లేనందున జూన్ నెల యొక్క శేషము పై పట్టిక ప్రకారము. 6

1922 సం॥ను 7చే భాగించిన శేషము 4

1922 సం॥లో లీపు సంవత్సరములు 1922/4 =480 సంఖ్యను 7చే 4

భాగించిన శేషము.

----

18 మొత్తమును 7చే భాగించుము. 7) 18(2

14

ఆదివారము నుండి 4 బుధవారము (18-7-1923) యైనది. శేషము 4

## ఏ ప్రశ్నకైనను సమాధానము చెప్పు విధానము

జన్మజాతక చక్రము వలెనే ప్రశ్నకాలమునకు లగ్న, అంశ చక్రములను వేసి ఫలనిరూపణ చేయవలయును. ఇందు లగ్నస్థానము, లగ్నాధిపతి, చంద్రుని యొక్క బలము యెట్లున్నది గ్రహించవలెను. ఈ మూడును బలహీనమై యున్న ప్రశ్నయొక్క ఉద్దేశము నశించును. లగ్నాధిపతి లగ్నస్థానమునందున్న లేక శుభగ్రహ సంయోగముగాని, వీక్షణము గాని గలిగియున్న పృచ్ఛకుని వాంఛ నెరవేరును. ఇందు నవాంశ లగ్నము యొక్క బలమును కూడ గ్రహించవలెను. నవాంశ లగ్నము శుభగ్రహములతో చేరి, శుభగ్రహ వీక్షణము గలిగి యున్న పృచ్ఛకుడు అనుకూలమైన ఫలములను పొందగలడు. నవాంశ లగ్నము పాపగ్రహ సంయోగము గాని, పాపగ్రహ వీక్షణము గాని చెందియున్న పృచ్ఛకునికి ప్రతికూల ఫలములు సంభవించును.

లగ్నస్థానము పృచ్ఛకుని గురించి సూచించును. లగ్నాధిపతి ఏ భావమును భావాధిపతిని వీక్షించుచుండునో ఆ భావము వృద్ధిచెందును. లగ్నాధిపతి లగ్నమునందున్నను, లేక శుభగ్రహములచే సంయోగము చెందియున్నను, పృచ్ఛకుని సష్టములు శమించి ఆరోగ్యము పొందగలడు. లగ్నధనాధిపతులు చంద్రునితో కలిసియున్నను, లేక వీరలు, ధన, కేంద్రకోణముల యందుండి నొకరినొకరు వీక్షించుకొనుచున్నను, పృచ్ఛకునికి శీఘ్రముగా ధనలాభము గల్గును. తృతీయ స్థానమును తృతీయాధిపతి వీక్షించుచున్నను, లేక తృతీయ స్థానమును, తృతీయ స్థానాధిపతిని శుభ గ్రహములు వీక్షించుచున్న పృచ్ఛకుని యొక్క సోదరులు, ఆరోగ్యవంతులై సుఖజీవనము చేయుచుందురు. అట్లుగాక పాపగ్రహములు వీక్షించుచున్న పృచ్ఛకుని సోదరులు అనారోగ్యవంతులై సౌఖ్యము లేనివారుగా యుందురు. చతుర్థ స్థానమును బట్టి మాత, గృహము, భూమి, వాహనము మొదలగు వానిని విచారించవలెను. పంచమ స్థానమును బట్టి పుత్రులు, మనస్సు, శక్తి, యాత్ర, మంత్రము మొదలగు వానిని చర్చించవలెను. షష్టస్థానమును బట్టి శత్రువులు, రోగము, ఋణము, కారాగారము, చోరత్వము మొదలగు వానిని విచారించవలెను. సప్తమ స్థానమును బట్టి కళత్రము, వివాహము, వ్యభిచారము, వాణిజ్యమును, అష్టమ స్థానమును బట్టి ద్రవ్యనష్టము, యుద్ధకష్టమును, నవమ స్థానమును బట్టి భాగ్యము, పితృ, గురు, ధర్మము, దానము, ప్రయాణము, యాత్రయును, దశమ స్థానమును బట్టి ఉద్యోగము, వ్యాపారము, కర్మ, కీర్తి, రాజ్యమును, ఏకాదశ స్థానమును బట్టి లాభము, జయము, కన్యకలును, ద్వాదశ స్థానమును బట్టి త్యాగము, భోగము, అన్యదేశ గమనము, జారత్వము మొదలగువానిని విచారించవలెను.

శ్రీ కాళిదాస మహాకవి ఉత్తర కాలామృత ప్రశ్నఖండములో తత్కాల ప్రశ్న రాశ్యంశ చక్రమలు వేసి యా చక్రముల ద్వారా భావకారకాదులను విచారించి నా పృచ్ఛకునికి శుభాశుభములను జెప్పు విధానము ఈ క్రింది విధముగా తెలిపియున్నారు.

ప్రశ్న నడుగవచ్చిన పృచ్ఛకుని యొక్క జన్మజాతక చక్రములను గ్రహించి జన్మకాలిక లగ్నము గ్రహభావాధుల వలన సమస్తము నాలోచించి ఫలములను

చెప్పవలెను. ఒక వేళ జన్మజాతకము లేకుండిన దత్కాల ప్రశ్న లగ్నము వలన జాతకము వలెనే సమస్తమును చెప్పవలెను. జన్మజాతకమునకును దత్కాల ప్రశ్న లగ్నజాతకమునకును ఫలము నాలోచింపనింతుకంతయైనను భేదములేదు.

ప్రశ్న నడుగదలచిన వృచ్ఛకుడు ఫల దక్షిణ తాంబూళాదులను చేతబూని దైవజ్ఞుని కడకేగి యాయనకు సమర్పించి 108 కధికముగాకుండ నొకసంఖ్యను ఆ దైవజ్ఞునికి జెప్పవలెను. ఆ సంఖ్యకే ధ్రువాంకమని సంజ్ఞ చేయబడినది. ఈ ధ్రువాంకమే ప్రశ్న ఖండమున ముఖ్యముగా గ్రహించదగిన విషయమై యున్నది. దీనివలనే భూత భవిష్య ద్వర్తమాన కాలములు మూడింటి యందలి ఫలములు జెప్పదగును.

వృచ్ఛకుడు 108 సంఖ్యకు మించకుండ జెప్పిన సంఖ్యకు ధ్రువమనిపేరు. అట్టి ధ్రువాంకమును 9చే భాగించగావచ్చు లబ్ధము మేషాదిగత రాశులగును. ఆ మిగిలిన సంఖ్య వర్తమాన లగ్నములోని నవాంశము లగును. ఇట్లు తాత్కాల ప్రశ్నలగ్నమును ఆ లగ్నమందలి తత్కాల నవాంశము నేర్పడును. కనుక రాశ్యంశ చక్రములు వేసి దాని యందు లగ్నము నంశ లగ్నమును వేసి తదుపరి పంచాంగ రీత్యా తత్కాలమునకు రవ్యాది గ్రహములు రాశ్యంశలను దెలిపి యాచక్రములో వ్రాసి యా చక్రము వల్ల భావకారకాధులను విచారించి నా వృచ్ఛకునికి శుభాశుభములను జెప్పవలయును.

ఉ।। ఒక వృచ్ఛకుడు వచ్చి చెప్పిన సంఖ్య 67 అనుకొందము. దీనిని 9చే భాగించగా వచ్చిన లబ్ధము 7. అది మేషాదిగత రాశిసంఖ్య. అనగా మేషాదిగా 7 రాశులు గతమైనవి. అనగా తులరాశి వెళ్ళిపోయినది. వర్తమానము 8వ రాశి వృశ్చిక లగ్నము జరుగు చున్నది. ఇందు శేషము 4 గనుక వర్తమాన వృశ్చిక లగ్నములో 4వ నవాంశ యైనది. అనగా కర్కాటకము, వృశ్చికము, మీనరాశులు మూటియందు నవాంశ గణమునకు కర్కాటకమే యాది గనుక కార్కాటాదిగా 4వ నవాంశము తుల నవాంశయని యేర్పడినది. గనుక నీ ప్రశ్న యందు వృశ్చిక లగ్నమనియు, తులనవాంశ మనియు నేర్పబడినది. దీనివల్ల పూర్వ పద్ధతినే ఫలములను జెప్పదగును.

ప్రశ్నకాలమందు బలాదిక గ్రహమే ప్రశ్నకర్త యనబడును. ప్రశ్నకర్త యుచ్చయందున్న ఆకార్యము గడియల మీదనే యగును. స్వగృహ మందున్న దినముల మీద నగును. మిత్రగ్రహము నందున్న మాసములని చెప్పవలెను. సమ గృహము నందున్న సంవత్సరము లగును. నీచ శత్రుక్షేత్రాదుల యందున్న అకార్యము కానేకాదు. లగ్నము నందు పాపగ్రహము లుండినను, లగ్నము పాపగ్రహములచే వీక్షించబడినను నాకార్యము కాదు. కాని శనిపాపుడైనను, యుచ్చస్థుడై లగ్నమందుండెనేని యా కార్యము శీఘ్రముగనే యగును. మరియును లగ్నాధిపతి కార్యాధిపతులు బలవంతులగు శుభుల సంబంధము గలిగి యుండిరేని యా కార్యము శీఘ్రముగా నగును.

కేంద్రస్థాన గత గ్రహములు బలాధికములు. ఫణపరము లందున్న గ్రహములు మధ్యమ బలములు అఫోక్లిబముల యందున్న గ్రహములు బలహీనములు.

ప్రశ్నవేయు వృచ్ఛకుడు చెప్పిన సంఖ్య లేక ధ్రువాంకమును 5చే భాగించగా శేషము 1మొదలు 0సున్న వరకు యైదింటిలో నేదో యొక అంకె యుండును. అట్టి శేశములో 1మిగిలి నట్లయిన నా కార్యము గడియల మీద నగుననియు, 2మిగిలిన తిథులమీద నగుననియు, 3మిగిలిన వారముల మీద నగుననియు. 4మిగిలిన మాసముల మీద నగుననియు, సున్న లేక 5మిగిలిన సంవత్సరముల మీద నగుననియు, తెలుసుకొన వలెను. ఇప్పుడు తనకు ప్రస్తుతము యేదియై యుండునో అనగా ఆ కార్యమునకు గడియలు, వచ్చునో తిథులు వచ్చునో, వారము వచ్చునో, మాసము లేక సంవత్సరము వచ్చునో, వచ్చిన దానిని గుర్తుగా వ్రాసుకొని 5చే భాగించగా వచ్చిన లబ్దమును పై ధ్రువాంకములో కలిపి వెనుకటి శేషము వల్ల గడియలు ప్రస్తుతమైన 60చేతను భాగింపగా నెంత శేషముండునో అన్ని గడియలు, తిథులు, వారములు, మాసములు, సంవత్సరములు వానివాని భాగహార శేషములను బట్టి అంత యవధిలో నా కార్యమగునని తెలియదగును.

ఉ।। వృచ్ఛకునిచే చెప్పబడిన 108 లోపు సంఖ్య లేక ధ్రువాంకము 17. దీనిని 5చే భాగించగా వచ్చు లబ్దము 3. శేషము 2. కనుక 2శేషమైన తిథుల మీద కార్యమగునని చెప్పబడు చున్నది. అయితే యెన్ని తిథులు లేక దినముల మీద నగుననగా పైన వచ్చిన లబ్దము 3+17 ధ్రువాంకము 20. తిథులకు చెప్పబడిన భాగహారము 30చే భాగించగా 20 సంఖ్యయే మిగిలినది. కాన 20 దినములలో కార్యమగునని చెప్పవలెను.

వచ్ఛకునిచే చెప్పబడిన ధ్రువాంకము 24 అనుకొందము. దీనిని 5చే భాగించగా వచ్చిన లబ్దము4. శేషము 4. కనుక 4 శేషమైన మాసముల మీద నా కార్యమగునని చెప్పబడును. అయితే యెన్ని మాసముల మీద నగుననగా పైన వచ్చిన లబ్దము 4+24 ధ్రువాంకము =28 మాసములకు చెప్పబడిన భాగాహారము 12చే భాగించగా శేషము 28/12 = 4 కాన 4 మాసములలో కార్యమగునని చెప్పవలెను.

## ప్రశ్నఫలము

పూర్వము చెప్పినట్లు లగ్నాధిపతి కార్యాధిపతులు శుభగ్రహములై శుభ స్థానము నందుండి అయ్యిరు వురును 12 భాగలకు తక్కువగా నుండి ఒకరి నొకరు వీక్షించుచు ఉత్తమ మాద్యమాధికారములలో నేదోయొక యధికారము గలవారై యుండగా భావ భావాధిపతి కారకులను బట్టి యాలోచించి దానికి అనుగుణముగా ప్రశ్నను జెప్పవలయును. వెనుక జెప్పిన యవధి ప్రకారము కాలమును గూడ జెప్పవలయును. ప్రశ్నఫలమును జెప్పునపుడు మధ్యవర్తి గ్రహము వలన దాని తనిఖీలు గూడ చెప్పవలెను. మధ్యవర్తి గ్రహమనగా - లగ్నాధిపతి, కార్యాధిపతులకు జెప్పబడిన అన్ని లక్షణములు గల వేరొక శీఘ్రగ్రహము గాని లేక మందగతి గ్రహముగాని లగ్నాధిపతి కార్యాధిపతులను జూచుచు వారి యిరువురికిని 12 భాగలకు లోబడి యొక యధికారము గలిగి శుభగ్రహమైన యెడల అట్టివారు

మధ్యవర్తియని చెప్పవలెను. ఈ మధ్యవర్తి గ్రహము యెట్టివాడో అట్టి మనుష్యుడు ఈ పృచ్ఛకుని కార్యమును నెరవేర్చు వాడగును.

పృచ్ఛకునికి 108 లోపున నేదియైన ఒక సంఖ్యను చెప్పమనికోరి ఆ సంఖ్యను 12చే భాగించగా వచ్చిన శేషము ఉదయాధి లగ్నముగా నెంచి ఫలము జెప్పవలయును. శుభగ్రహ లగ్నమైన శుభము. పాపగ్రహ లగ్నమైన కార్యహాని. శుభాశుభ మిశ్రగ్రహ లగ్నమైన దూరముగా కార్యసిద్ధి కలుగు ననియు చెప్ప వలయును. వృషభ, మిధున, కర్కాటక, సింహములకు మేషము ఛత్రము, వృశ్చిక, ధనుస్సు, మకర, కుంభములకు మిధునము ఛత్రము. ఈ లగ్నములకు ఛత్రములందు బుధ, గురు, శుక్రులున్న యెడల ప్రశస్తము.

## కార్యసిద్ధి ఫలక్రమము

1. ఉదయరాశి, రాశ్యాధిపతిచే వీక్షించబడకున్నను, ఉదయరాశి శుభ గ్రహముచే వీక్షించ బడకున్నను కార్యము 25% ఫలించును.

2. లగ్నాధిపతిని శుభగ్రహములు వీక్షించుచున్న తలచిన కార్యము 50% ఫలించును.

3. లగ్నస్థానమును గాని, లగ్నాధిపతిని గాని ఒక గ్రహము వీక్షించు చున్నను దశమ స్థానమునందు ఉదయ రాశ్యాధిపతి గాని లేక 2-3 శుభగ్రహములు గాని యున్న యెడల తలచిన కార్యము 75% సఫల మగును.

4. లగ్నాధిపతి లగ్నమును వీక్షించుచున్నను, లగ్నము శుభగ్రహ వీక్షణము గల్గి, చంద్రుడు పాపగ్రహముల మధ్య లేకున్న తలచిన కార్యము 100% సఫల మగును.

## పాపగ్రహ కూటమి

రెండు గ్రహములు సమభాగలలో కలిసినప్పుడు యుద్ధము పొసగును. సూర్యునకు యిరుపార్శ్వము లందు ఆవరించి 12 భాగల యందు కుజుడున్నను, 8 భాగల యందు బుధుడును, 9 భాగల యందు గురుడును, 7 భాగల యందు శుక్రుడును, 9 భాగల యందు శనియున్న అస్తంగత దోషము సంభవించును.

అంగారకునితో బుధ, గురు, శుక్ర, శనులు కలిసిన యెడల గ్రహ యుద్ధము సంభవించును. అందు గ్రహములు పరాజితు లగుదురు. కుజుడున్న భాగలకు వెనుక భాగల యందున్న గ్రహము పరాజిత గ్రహము. ముందు భాగల యందున్న గ్రహము విజయ గ్రహము. ఇది బలాధిక గ్రహము.

పాపగ్రహములచే యుద్ధమున ఓడింప బడిన గ్రహములును, పాపగ్రహములతో కలిసియున్న గ్రహములును, పాపగ్రహముతో వీక్షించబడుచున్న గ్రహమును అస్తమించిన గ్రహములును బలహీనమై అశుభ ఫలముల నిత్తురు.

## జన్మ లేక ప్రశ్నలగ్నము

లగ్నము, హోర, తనవు, జన్మము, విలగ్నము, మూర్తి, కల్పము, ఉదయము, ఆద్యము అనునవి జన్మ లేక ప్రశ్నలగ్నములకు నామములు.

## ఛత్రము

వృషభ, మిధున, కర్కాటక, సింహ రాశులకు మేషము ఛత్రము. వృశ్చిక ధనుస్సు, మకర, కుంభములకు మిధునము ఛత్రము, మీన, తుల, కన్య, మేష లగ్నములకు వృషభము ఛత్రము. ఈ లగ్నములకు చత్రము లందు బుధ, గురు, శుక్రగ్రహములున్న యెడల ప్రశస్తము.

## భూత భవిష్యద్వర్తమాన కాల కార్యస్థితి క్రమము

తన్వాది భావముల వలన భూతకాల విషయమును, లగ్నము వలన వర్తమాన విషయములను, అంశ వలన భవిష్య ద్విషయమును, గ్రహములచే కార్యాకార్యస్థితుల నెరుంగ వలయును. మొదట ఉదయాది భావాధిపతులను తెలుసుకొని, అనంతరము అంశాధిపతులను నెరింగి, ఆ అంశాధిపతులు యేయే భావముల యందు నుందురో ఆ భావమును తెలుసుకొని, ప్రకృత కార్యమును నిర్ణయించ వలెను. భావము కార్యము, భావకార్య స్థానాధిపతులు. భావాధి వీక్షణములు చక్కగా నిర్ణయించి ఫలము చెప్పవలయును. భావ లగ్నమునుస దాని స్వభావమును గమనించి పిదప కార్యస్వరూపము నెరింగి గ్రహభావమును బట్టి కార్యమును జెప్పవలయును.

## జీవ నిర్జీవ ప్రశ్న చింతా క్రమము

నవాంశ చక్రములో తన స్వనవాంశ యందున్న గ్రహము యింకొక స్వక్షేత్రమైన తన నవాంశ లగ్నము. పంచమ లేక నవమ స్థానమును వీక్షించుచున్న పృచ్ఛకుని ప్రశ్న ధాతుచింతను గూర్చియని చెప్పవలెను. పోయిన వస్తువు మొదలగునవి ధాతుచింతను సూచించును. ఏ గ్రహమైనను తన స్వనవాంశ యందుండక నవాంశ చక్రములో యింకొక స్థానము నందుండి తన స్వనవాంశ క్షేత్రమైన నవాంశ లగ్నముగాని లేక పంచమ లేక నవమ స్థానమును గాని వీక్షించు చున్న పృచ్ఛకుని ప్రశ్న జీవచింతను గూర్చియని చెప్పవలెను. ఏ గ్రహమైనను తన స్వనవాంశ యందుండక నవాంశ చక్రములో యింకొక స్థానము నందుండి తన స్వనవాంశము కాని యింకొకరి క్షేత్రమైన నవాంశ లగ్నమునుగాని లేక పంచమ లేక నవమ స్థానమును గాని వీక్షించుచున్న పృచ్ఛకుని ప్రశ్న మూల చింతను గూర్చియని చెప్పవలెను.

ప్రశ్నలగ్న చక్రము నందు రవి కుజులు కేంద్ర స్థానమున కలసియున్న ప్రశ్న ధాతుచింతను గూర్చి యనియు, బుధ, శనులు బలవంతులై కేంద్ర స్థానము నందున్న ప్రశ్న మూలచింతను గూర్చి యనియు, చంద్ర, గురు, శుక్రులు బలవంతులై కేంద్ర స్థానము నందున్న ప్రశ్న జీవ లేక జంతు సంబంధ మైనదని చెప్పవలెను.

ప్రశ్నలగ్నము మేష, సింహ, వృశ్చిక రాశులలో నొకటియై అందు సూర్యకుజులు చేరియున్నను లేక వారిచే వీక్షించ బడుచున్న ప్రశ్న ధాతుచింతను గూర్చి యనియు, లగ్నము మిధున, కన్య, కుంభములలో నొకటియై అందు శని, బుధులు చేరియున్నను లేక వారిచే వీక్షించబడుచున్న ప్రశ్న మూలచింతను గూర్చి యనియు, లగ్నము వృషభ, తుల, సింహ, మీన, ధనుస్సు లేక కర్కాటక

రాశులలో నొకటియై అందు చంద్ర, గురు, శుక్రులు చేరియున్నను లేక వారిచే వీక్షించ బడుచున్న ప్రశ్న జీవచింతను గూర్చియని చెప్పవలెను.

బలాధిక గ్రహములైన చంద్రుడు, లగ్న, యేకాదశాధిపతులు కలిసి యున్న స్థానమును బట్టి పృచ్ఛకుని ప్రశ్న స్వభావమును చెప్పవచ్చును. అదే విధముగా జ్యోతిష్కుడైన వాడు బలాధిక గ్రహములైన లగ్నాధిపతి, చంద్రుడు కలిసి యున్న స్థానమును బట్టి పృచ్ఛకునికి యొక్క ప్రశ్న స్వభావమును చెప్పవచ్చును. వీనినిబట్టి లగ్న, యేకాదశాధిపతులు, చంద్రుడు సప్తమ స్థానము నందున్నను లేక బలాధికులైన లగ్నాధిపతి, చంద్రుడు సమస్థానము నందున్న ప్రశ్న భార్య లేక భాగస్వామిని గురుంచియని చెప్పవలెను. వీరల కలయిక ద్వితీయ స్థానము నందున్న ప్రశ్న ధనమునకు సంబంధించినదని చెప్పవలెను. వీరల కలయిక యేభావము నందుండునో ఆ భావమునకు సూచించు ఫలమునకు సంబంధించిన ప్రశ్నయని గ్రహించ వలెను.

బలాధిక గ్రహము లగ్నమునందున్న పృచ్ఛకుని ప్రశ్న తనకు సంబంధించిన దగ్గర వ్యక్తిని గురించి యనియును, తృతీయ స్థానము నందున్న ప్రశ్నసోదరులను గురించి అనియు, పంచమ స్థానము నందున్న ప్రశ్న బిడ్డలను గురించి యనియు, చతుర్ధ స్థానము నందున్న ప్రశ్న తల్లి లేక భార్యను గురించి యనియు, షష్టస్థానము నందున్న ప్రశ్న పృచ్ఛకుని శత్రువునకు సంబంధించి నదనియు, సప్తమ స్థానము నందున్న ప్రశ్న భార్యను గురించి యనియు, నవమ స్థానము నందున్న ప్రశ్న ధర్మప్రవర్తన గలవానికి సంబంధించినది యనియు, దశమస్థానము నందున్న ప్రశ్న గురువు లేక పురోహితుని గురించి యనియు చెప్ప వలెను. యెక్కువ గ్రహములు ఒకే స్థానము నందున్నను, యెక్కువ స్థానములు యెక్కువ గ్రహములచే ఆక్రమించి యున్న జ్యోతిష్కుడైన వాడు స్థాన భేదములను తెలుసుకొని బలవత్తరమైన స్థానమును గ్రహించి ఫలనిరూపణ చేయవలయును.

నవాంశ లగ్నాధిపతి లగ్నము నందున్న పృచ్ఛకుని ప్రశ్న తన స్వవిషయమై యుండును. నవాంశ లగ్నాధిపతి లగ్నాధిపతికి మిత్రుడై యున్న ప్రశ్న స్నేహితుని సంబంధమై యుండును. నవాంశ లగ్నాధిపతి లగ్నాధిపతికి మిత్రుడైయున్న ప్రశ్న స్నేహితుని సంబంధమై యుండును. నవాంశ లగ్నాధిపతికి శత్రువై యున్న ప్రశ్న పృచ్ఛకుని శత్రువునకు సంబంధించినదై యుండును.

లగ్నము చరరాశియై యుండి నవాంశ చక్రములో లగ్నస్థానము నుండి లెక్కించగా 6,7,8 లేక 9 స్థానములలో చరరాశి యందు నవాంశ లగ్నము యున్న యెడల ప్రశ్న విదేశములకు పోయిన వ్యక్తిని గురించి యని చెప్పవలెను.

ఉ।। లగ్నము కర్కాటకములో 22 భాగల యందున్నదని భావింతము. కార్కాటక లగ్నము చరరాశి యందున్నది లగ్నము కార్కాటకములో పై భాగల యందున్నపుడు నవాంశ లగ్నము మకరరాశి యందున్నది. నవాంశ చక్రములో లగ్నస్థానమైన కర్కాటకము నుండి మకరము వరకు లెక్కించగా నవాంశ లగ్నము 7వ స్థానము నందున్నది. ఈ మకర లగ్నము చరరాశి యైనది గాన యందున్న నవాంశ లగ్నము చరనవాంశ లగ్నమైనది. ఈ కాలమందు పృచ్ఛకుని ప్రశ్న విదేశములకు పోయిన వ్యక్తిని గురించి యని చెప్పవలెను.

ప్రశ్న లగ్నము నుండి సప్తమ స్థానాధిపతి వక్రించకున్న విదేశమునకు పోయిన వ్యక్తి తిరిగి రాగలడనియు, వక్రించి యున్న తిరిగిరాడని చెప్పవలయును.

## ముష్టిగత ప్రశ్న

ప్రశ్నించువాడు లోహములలో నేదో యొక దానిని గుప్పిలి యందుంచుకొని నాచేతిలో ఏమున్నదో చెప్పమన్నపుడు - బలవంతుడైన చంద్రుడు గాని, శుక్రుడుగాని లగ్నమందున్న వెండియు, బుధుడున్న బంగారము, గురుడున్న రత్నముతో కూడిన బంగారము, సూర్యుడున్న ముత్యము, కుజుడున్న రత్నము, శనియున్న లోహము, రాహుకేతువులైన ఎముకలు యున్నవని తెలుసుకొన వలెను.

ముష్టిగతమైన వస్తువు ప్రశ్న లగ్నము మేషమైన ఎర్రనిది, వృషభమైన తెల్లనిది, మిథునమైన ఆకుపచ్చనిది, కర్కాటకమైన తెలుపు + ఎరుపు వర్ణము, సింహమైన బూడిద రంగు, కన్యయైన విచిత్రవర్ణము, తులయైన నలుపు, వృశ్చికమైన పిశంశము, ధనుస్సు యైన పింగళ వర్ణము, మకరమైన కర్పూరము, కుంభమైన బభ్రువర్ణము, మీనమైన చేపవలె మిలమిల లాడునది గాన రాశిని బట్టి వర్ణము చెప్పవలెను.

## కార్యసిద్ధి ప్రశ్న

ప్రశ్న లగ్నమునకు కేంద్ర కోణముల యందు బుధ, గురు, శుక్ర చంద్రులలో అందరుగాని లేక కొందరు గాని యుండిరేని కార్యాను కూలమగునని కెలియదగును. ఉదయ రాశ్యాధిపతి అనగా ప్రశ్నలగ్నాధిపతి గురుశుక్రులతో గూడినను జూడబడినను శీఘ్రముగా దలంచిన కార్యము సిద్ధించును. ప్రశ్న లగ్నాధిపతి 1-10-11 రాశుల యందుండి గురునిచేత జూడబడినచో దలంచిన కార్యము అతిశీఘ్రముగా నగును. ప్రశ్న లగ్నాధిపతి త్రికోణ స్థానముల యందును లాభస్థానాధిపతి లగ్నము నందును యుండి చంద్రునిచే జూడబడినచో తలంచిన కార్యము సిద్ధించును.

## కార్యసిద్ధి గలుగు కాలము

ప్రశ్నలగ్నము పాపగ్రహములతో గూడియున్నను, జూడబడినను, లగ్నాధిపతి పాపగ్రహములతో గూడినను జూడబడినను కార్యహాని గలుగును. రాహువు లగ్నాధిపతియై యుండి స్వక్షేత్రము నందు శనిగ్రహముండి గురుశుక్రులు పంద్రెండవ యింట నుండిరేని కార్యహాని గలుగును. ప్రశ్నలగ్నము స్థిరరాశియై యుండి, పాపగ్రహ శుభగ్రహములతో గూడకయు, వీక్షింపబడకయు యుండి, శనిచే వీక్షించ బడినచో దలంచిన కార్యము ఆదియందు అనుకూలము లేకుండి అనంతరము యొక సంవత్సరమునకు కార్యసిద్ధి గలుగును. చంద్రుడు లగ్నాధిపతియై కేంద్ర కోణముల యందుండి కార్యస్థానాధిపతి చేత వీక్షించ బడినచో దలంచిన కార్యము రెండు దినములలో యగును. ప్రశ్నలగ్నాధిపతి అంగారకుడై ఏకాదశము నందున్న చంద్రునిచే వీక్షించ బడుచున్న యెడల తలంచిన కార్యము మూడు దినములలో జరుగును. బుధుడు లగ్నాధిపతియై స్వక్షేత్ర యుచ్చస్థానముల యందుండి శుక్రునిచే జూడబడు చుండినచో ఐదు దినములలో కార్యసిద్ధి గలుగును. గురుడు లగ్నాధిపతియై ద్వితీయ స్థానము నందుండి రవిచేత వీక్షింప బడినచో తొమ్మిది

దినములకు కార్యసిద్ధి యగును. లగ్నాధిపతి శుక్రుడై దశమ కేంద్రము నందుండి, బుధునిచేత వీక్షింపబడిన పండ్రెండు దినములకు కార్యము సిద్ధించును. లగ్నాధిపతి శనియై 3-6-11 స్థానముల యందుండి, శుక్రునిచే వీక్షించబడినచో పదమూడు దినములకు కార్యసిద్ధి గలుగునని యెరుంగవలెను.

లగ్నస్థానము నందు శుభగ్రహములు జేరియున్నను, లగ్నము శిర్షోదయ రాశియై యున్నను, లగ్నము స్వవర్గలు, మిత్రవర్గులతో యున్నను తనంచిన కార్యము సిద్ధించును.

లగ్నస్థానమున పాపగ్రహములు జేరియున్నను, లగ్నము పాపవర్గుల యందున్నను తలచిన కార్యము సిద్ధించదు. లగ్నస్థానము పాపశుభ గ్రహములతో సమముగా కూడి యున్నను, పాపశుభగ్రహ వీక్షణము గలిగి యున్నను, లగ్నమున పాప శుభవర్గులు సమముగా యున్నను తలచిన కార్యమునకు ఆదియందు ఆటంకము గలిగినను చివరలొ కార్యసిద్ధి గలుగును.

ప్రశ్న ధన, ఆస్తి సంబంధమై యున్నప్పుడు కార్యేసుడు ద్వితీయాధి పతిగను, వివాహ సంబంధమై యున్నప్పుడు కార్యేసుడు సప్తమాధి పతిగను గ్రహించవలెను.

లగ్నాధిపతి లగ్నమును వీక్షించు చున్నను, కార్యేసుడు కార్యస్థానమును వీక్షించుచున్నను, లేక లగ్నాధిపతి కార్యస్థానము వీక్షించుచుండి, కార్యేసుడు లగ్నమును వీక్షించు చున్నను, లేక లగ్నాధిపతి, కార్యేసుడు నొకరికొకరు పరస్పర వీక్షణము గల్గియున్నను, లేక చంద్రుడు లగ్నాధిపతిని, కార్యేసుని వీక్షించుచున్న వృచ్ఛకుని యొక్క కార్యము సంపూర్ణముగా సిద్ధించును.

ఏ భావమైతే తన స్వస్థానాధిపతి చేతగాని, శుభగ్రహముల చేతగాని గూడి యున్నను, లేక వీక్షించబడు చున్నను, ఆ భావము బలవత్తరమై యుండును. భావము నందు పాపగ్రహములు గూడియున్నను, పాపగ్రహములచే వీక్షింపబడు చున్నను ఆ భావఫలము చెడును.

## కార్యసిద్ధి యోగములు

ఈ క్రింది యోగ కాలములలో తలపెట్టిన యెటువంటి పనియైననూ జయప్రధ మగును.

1. లగ్నాధిపతియు, దశమాధిపతియు దశమ స్థానము నందున్ననూ,
2. లగ్నాధిపతి, దశమాధిపతి లగ్నము నందున్ననూ,
3. లగ్నాధిపతి లగ్నమును వీక్షించుచుండి, దశమాధిపతి దశమ స్థానమును వీక్షించు చున్ననూ,
4. దశమ స్థానాధిపతి లగ్నము నందుండి, లగ్నాధిపతిని వీక్షించు చున్ననూ
5. లగ్నాధిపతి దశమ స్థానము నందుండి, దశమాధిపతిని వీక్షించు చున్ననూ,
6. లగ్నాధిపతి దశమ స్థానమును వీక్షించు చుండి, దశమాధిపతి లగ్నమును వీక్షించు చున్ననూ
7. దశమాధిపతి లగ్నాధిపతిని వీక్షించు చుండి, లగ్నాధిపతి దశమ స్థానాధిపతిని వీక్షించు చున్ననూ తలపెట్టిన కార్యము సఫలమగును.

పై యోగములలో యే యోగము నైననూ చంద్రుడు వీక్షించుచున్న తలపెట్టిన కార్యము తప్పక సఫలమగును. పై యోగములలో యే యోగము లేకున్ననూ, దశమాధిపతి తన సామాన్య ప్రచారములో లగ్నమును చేరిన యెడల అట్టికాలము నందు తలపెట్టిన కార్యములు సఫల మగును.

## శుభులు, పాపులు, కార్య స్థానాధిపతుల వివరణ

ఇచ్చట శుభులు, పాపులనగా నైసర్గిక శుభలు, నైసర్గిక పాపులని గ్రహించ వలెను. లగ్నాధి పతియైన నైసర్గిక పాపికి లగ్నాధి పతియైన వెంటనే పాపత్వము గోల్పోయి శుభత్వము ప్రాప్తించును.

భావరాశిని లగ్నాధి పతియును, లగ్నమును కారకుడు వీక్షించు చున్నను, లగ్నము నందు కారక గ్రహముండి లగ్నాధిపతిని వీక్షించు చున్నను, కారక గ్రహము లగ్నముగాక యితర స్థానము నందుండి లగ్నాధిపతిని వీక్షించుచున్నను, లగ్నము లగ్నాధిపతి లేక చంద్రుని కారక గ్రహము వీక్షించుచున్నను, లగ్నము లేక భావరాశి యందు లగ్నాధిపతి, కారక గ్రహము గూడియున్నను కార్యసిద్ధి గలుగును.

లగ్నమును గాని, లగ్నాధిపతిగాని, కారకగ్రహము వీక్షింపకున్న కార్యసిద్ధి గలుగ నేరదు. జయాప జయములను గురించి ప్రశ్న అడిగినప్పుడు ప్రశ్నలగ్నమునే ప్రధానముగా గ్రహించి చర్చించ వలెను.

కార్యస్థానాధిపతి యనగా పృచ్ఛకుడు యే విషయమును గూర్చి ప్రశ్నలు నడుగునో ఆ స్థానాధిపతియే కార్యస్థానాధిపతి యగును. అనగా దేహసుఖమును గూర్చి యడిగెనేని లగ్నాధి పతియును, ధనమును గూర్చి యయ్యెనేని ద్వితీయాధి పతియును, సంతానమును గూర్చి యయ్యెనేని పంచమాధి పతియును, స్త్రీలాభమును గూర్చి యయ్యనేని సప్తమాధి పతియును కార్యస్థానా ధిపతులగుదురు. ఈ రీతిగా యే సంగతి గూర్చియైనను కారకత్వ ఖండమును బట్టి సకల కార్యస్థానములు నేర్పబడును.

### 1. లగ్నస్థానము

పృచ్ఛకుడు వచ్చి నాభూత, భవిష్యద్వర్తమాన కాలములు యెట్లుండును? అని ప్రశ్నించినపుడు లగ్నస్థానము, చంద్రుని యొక్క బలము యెట్లున్నది గ్రహించవలెను. ఈరెండును బలహీనమైయున్న ప్రశ్న యొక్క ఉద్దేశము నశించును.

యెప్పుడును నవాంశ లగ్నము యొక్క బలమును గ్రహించ వలెను. నవాంశ లగ్నము శుభగ్రహములతో చేరి, శుభగ్రహ వీక్షణము గలిగియున్న పృచ్ఛకుడు అనుకూలమైన ఫలములను పొందగలడు. నవాంశ లగ్నము పాపగ్రహ సంయోగముగాని, పాపగ్రహ వీక్షణము గాని చెందియున్న పృచ్ఛకునికి ప్రతికూల ఫలములు సంభవించును.

లగ్నాధిపతి లగ్నస్థానము నందున్నను లేక శుభగ్రహ సంయోగము గాని వీక్షణము గాని గలిగియున్న వాంఛనెరవేరి సౌఖ్యమును ఆరోగ్యమును గలుగ జేయును. లగ్నస్థానముగాని లేక లగ్నాధిపతిగాని పాపగ్రహములచే వీక్షించబడు చున్నను లేక వానిచే కూడియున్నను, లగ్న, లగ్నాధిపతులు బలహీనులై యున్నను పృచ్ఛకునికి శరీరపీడ ధన వ్యయము, దుఃఖము మొదలగునవి గలుగును.

జన్మజాతక చక్రమువలెనే ప్రశ్నచక్రము నందు గూడ లగ్నస్థానము ముఖ్యమై యున్నది. లగ్నస్థానము వృచ్ఛకుని గురించి సూచించును. లగ్నాధిపతియే భావమును, భావాధిపతిని వీక్షించు చుండునో ఆ భావము వృద్ధినొందును. లగ్న స్థానము, లగ్నాధిపతిని బట్టి వృచ్ఛకుని ఆకృతి, లక్షణము, దేహచ్ఛాయ, శరీర స్వరూపము, ఆరోగ్యము, జయాపజయములు మొదలగునవి గ్రహించ వచ్చును. లగ్నము లగ్నాధిపతి యొక్క బలాబలములను బట్టి శుభాశుభములు నిర్ణయించవలెను.

ప్రశ్న వృచ్ఛకుని యొక్క ఆరోగ్య సంబంధమై యున్న లగ్నాధిపతి బలవంతుడై షష్ట, అష్టమ, వ్యయాధి పతుల తోడను, పాపగ్రహములచే సంబంధ పడక, నీచ శత్రుస్థానముల యందు కూడక యున్న వృచ్ఛకుడు ఆరోగ్యవంతుడై యుండును. లగ్నాధిపతియును, చంద్రుడును యెంత బలవంతులై యందరో వృచ్ఛకుడు అంత ఆరోగ్యవంతుడై యుండును. లగ్న స్థానము పాపగ్రహములచే కూడి యుండరాదు.

లగ్నాధిపతి మూసరిపః యోగము నందుండి పాపగ్రహముచే యిధ్యషాల యోగము నందు ప్రవేశించ బోవుచున్న వృచ్ఛకుడు కొద్దికాలములో రోగగ్రస్తుడు కాగలడని గ్రహించవలెను. ప్రశ్నకాలమున వృచ్ఛకుడు రోగవంతుడై యుండి, నాయొక్క జబ్బు తొందరలో శమించి నేను ఆరోగ్యము పొందగలనా అని ప్రశ్నించినపుడు లగ్నాధిపతి కొద్దికాలములో శుభగ్రహముచే యిధ్యషాల యోగము పొందుచున్నను లేక తన యుచ్ఛస్థానమును జేరుచున్నను వృచ్ఛకుడు తొందరలో రోగ విముక్తుడై ఆరోగ్యము పొందగలడు. లగ్నస్థానమున శని లేక కుజుడు జేరియుండి, లగ్నాధిపతి పాపగ్రహము లేక అష్టమాధిపతితో ఈ సరిఫః యోగము నందున్న వృచ్ఛకుడు మరణమును పొందును.

వృచ్ఛకుడు నాయొక్క కష్టములు తొందరులో ఈడేరునా? అని ప్రశ్నించి నపుడు లగ్నాధిపతి, చంద్రుడు బలవంతులై యుండి, లగ్నము నవాంశ లగ్నము శుభగ్రహములతో జేరియుండి శుభగ్రహ వీక్షణము గలిగియున్న వృచ్ఛకుని యొక్క కష్టములు శీఘ్రముగా శమించి సుఫలములు గలుగును.

ఏ గ్రహమైనను లగ్నాధిపతితో మూసరిఫః యోగము నందున్న ప్రశ్నభూత కాలమును గురించి యనియు, ఏ గ్రహమైనను లగ్నాధిపతితో సంయోగము జెందియున్న ప్రశ్న వర్తమాన కాలమును గురించనియు, ఏ గ్రహమైనను లగ్నాధి పతితో యిధ్యషాల యోగమును పొందియున్న ప్రశ్న భవిష్యత్ కాలమును గురించని నిర్ణయించవలెను. ఇందు లగ్నాధిపతితో సంబంధించిన గ్రహముయొక్క స్వభావము, కారకత్వమును బట్టి ప్రశ్న స్వభావమును నిర్ణయించ వలెను.

లగ్నాధిపతి లగ్నము నందున్నను, లేక శుభగ్రహములచే సంయోగము చెందియున్నను వృచ్ఛకుని కష్టములు శమించి ఆరోగ్యము పొంద గలుగును. లగ్నాధిపతి పాపియైయున్న వృచ్ఛకుడు అనారోగ్యము, ధనవ్యయము, అశాంతి తగవులు పొంద గల్గుటయు, అదే లగ్నాధిపతి శుభుడై యున్న వృచ్ఛకునికి సౌఖ్యము ధనలాభము, మనశ్శాంతి గలుగును.

## 2. ద్వితీయ స్థానము

ఈ ద్వితీయ స్థానమునకు ధనస్థాన మనియు, కుటుంబరాశి యనియు, నేత్రరాశి యనియు, ద్రవ్యరాశి యనియు, వాక్స్థాన మనియు నామములు. ధనము, నేత్రము, సుఖము, విద్య, వాక్కు, కుటుంబము, బంగారము, లాభము, అదృష్టము, జాడ్యము, భాగ్యము మొదలగు వానిని ద్వితీయస్థానము వలన విచారింప వలయును.

ప్రశ్న ద్రవ్యసంబంధమై యున్న లగ్నాధిపతి లేక చంద్రునితో ధనాధిపతి యిధ్యషాల యోగమును పొందియున్నను, లేక ధనాధిపతి శుభగ్రహములతో జేరియున్నను, లేక వీక్షింప బడుచున్నను, వృచ్ఛకుడు ధనలాభము పొందును. పాపగ్రహములు ధనస్థానమును జేరియున్న వృచ్ఛకుడు దూరదేశము నుండి ధనమును ఆర్జించి కష్టముల నొందు వాడగును. పాపగ్రహములతో ద్వితీయాధిపతి సుధషిల యోగమును పొందియున్న వృచ్ఛకుడు మరణము చెందును. లగ్నధనాధిపతులు యిధ్యషాల యోగము నందుండి, వీరిరువురిలో మంద గమనము గల గ్రహము యేభావము నందుండునో ఆభావము ద్వారా వృచ్ఛకుడు ధనలాభము పొందు వాడగు చున్నాడు. బుధుడు లగ్నస్థానము నందుండి పాపగ్రహము లేక చంద్రునిచే వీక్షింప బడుచున్న వృచ్ఛకుడు ధనలాభము పొందగలడుగాని కష్టముల ననుభవించ వలసి యుండును.

లగ్న ధనాధిపతులు చంద్రునితో కలిసి యున్ననూ, లేక వీరలు ధన, కేంద్ర, కోణముల యందుండి నొకరి నొకరు వీక్షించు కొనుచున్నను వృచ్ఛకునికి శీఘ్రముగా ధనలాభము గల్గును. లగ్నాధిపతి శుభ షడ్వర్గలు గలిగి శుభగ్రహములు లగ్నము నందున్నను లేక లగ్నమును వీక్షించుచున్న వృచ్ఛకుడు శీఘ్రముగా ధనలాభమును పొందును. చంద్రుడు సప్తమ లేక చతుర్ధ స్థానము నందును, సూర్యుడు దశమ స్థానము నందును, ధనకారకుడైన గురుడు లేక శుభులు లగ్నము నందున్న వృచ్ఛకునికి శీఘ్రముగా ధనలాభము గల్గును.

ధనము, భాగ్యము, అదృష్టము, వడ్డీవ్యాపారము, వ్యాపార లాభములు మొదలగునవి ధనస్థానమును బట్టి చర్చించ వలెను. రోగసంబంధమైన ప్రశ్నలు చర్చించు నపుడు ద్వితీయ స్థానము కంఠమును సూచించును. లగ్నాధిపతి ద్వితీయ స్థానము నందున్న వృచ్ఛకుని ఆర్థిక సంబంధమైన చిక్కులు అంతరించును. లగ్నాధిపతి మరియు గురుని పరస్పర వీక్షణము భోగభాగ్యముల నిచ్చును. ద్వితీయ స్థానమున శని రాహువులున్న ధననాశము, ఋణబాధ, పేదరికము మొదలగు చిక్కులు సంభవించును. ఏభావాధిపతి ధనాధిపతితో కలిసి యుండునో ఆ భావాధిపతి వలన ధనలాభము గల్గును. సప్తమాధిపతి ధనస్థానము నందున్న వృచ్ఛకుని భార్య ద్వారా ధనలాభమును, దశమాధిపతి ధనస్థానము నందున్న వృచ్ఛకుని స్వవృత్తి వలన ధనలాభము గల్గును.

పాపగ్రహములు ధనస్థానము నందు జేరియున్నను లేక ధనాధిపతి పాపులతో కలిసియున్న వృచ్ఛకుని ధననాశము, కష్టనష్టములు, గల్గును. లగ్నధనాధిపతులు, గురుడు లగ్నము నందుగాని లేక ధనస్థానము నందుగాని లేక లాభ స్థానము నందుగాని లేక కేంద్రము నందుగాని కలిసి యున్నను లేక పరస్పర యిధ్యషాల యోగము పొందియున్న వృచ్ఛకునికి తప్పక భోగభాగ్యములు గల్గును.

ఈ గ్రహముల యొక్క పరస్పర వీక్షణ 90 భాగల యందుగాని లేక విరుద్ధముగా యున్న వృచ్ఛకునికి కష్టముపై ధనలాభము గల్గును. వీనికి మూసరిఫః యోగము సంభవించరాదు.

## 3. తృతీయ స్థానము

లగ్న స్థానమునకు మూడవరాశి భ్రాతృస్థానమనియు, సోదర స్థానమనియు జెప్పబడును. భ్రాతృ కారకుడు కుజుడు, సోదర, సోదరీ, మిత్రులు, భటులు, శాంతము, వుపాయము, ధైర్యము, పరాక్రమము, కంఠస్వరము, మైత్రి సాహసము, వీర్యము, కోపము, బలము, ఆభరణము, ఆయుస్సు, విషభక్షణము దాసదాసీజనము సొదలగునవి తృతీయ స్థానమును బట్టి విచారించ వలెను.

తృతీయస్థానమును తృతీయాధిపతి వీక్షించుచున్నను, లేక తృతీయ స్థానమును, తృతీయ స్థానాధిపతిని శుభగ్రహములు వీక్షించుచున్న వృచ్ఛకుని యొక్క సోదరులు ఆరోగ్యవంతులై సుఖజీవనము జేయుచుందురు. అట్లుగాకున్న అనారోగ్యము, అసౌఖ్యము గలుగును.

తృతీయస్థానము తన స్థానాధిపతిచే వీక్షించబడకున్న లేక తృతీయ స్థానముగాని తన స్థానాధిపతిగాని పాపగ్రహ సంయోగము పొందియున్నను లేక వీక్షించబడు చున్నను వృచ్ఛకుని యొక్క సోదరులు అనారోగ్యవంతులై సౌఖ్యము లేనివారుగా యండును. తృతీయాధిపతి షష్టస్థానము నందుండి షష్టాధిపతితో ముథషిల యోగము నందున్నను లేక షష్టస్థానాధిపతి తృతీయస్థానము నందున్నను లేక తృతీయాధిపతి పాపగ్రహ సంయోగము పొందియున్నను వృచ్ఛకుని యొక్క సోదరులు అనారోగ్యవంతులై యుందురు. తృతీయ స్థానాధిపతి అస్తమించియున్న వృచ్ఛకుని యొక్క సోదరుడు ప్రాణసంకటమైన జబ్బుతో బాధపడుచుండును. ఏ గ్రహమైనను షష్టాధిపతి లేక అష్టమాధిపతితో యిధ్యషాల యోగము పొందియున్న ఆగ్రహముయొక్క సంయోగము వలన అనారోగ్యము గలుగును.

ఏ భావాధిపతి షష్టస్థానము లేక అష్టమస్థానము నందుండునో ఆ భావము కష్టములను పొందును. ఈ విధమున అన్ని భావముల యొక్క శుభాశుభములను గ్రహించవలెను. ఏ స్థానాధిపతియైనను షష్టాధిపతి లేక అష్టమాధిపతితో గల్గియున్న అట్టిస్థానాధిపతి యొక్క భావము తప్పక చెడును. చతుర్థ స్థానాధుపతి షష్ట లేక అష్టమ స్థానాధిపతులతో సంబంధము గల్గియున్న మాతృభావము చెడును. పంచమ స్థానాధిపతి షష్ట లేక అష్టమ స్థానాధిపతులతో సంబంధము గల్గియున్న పుత్ర భావము చెడును. దీనిని బట్టి షష్ట, అష్టమ స్థానాధిపతులు క్రూరమైన పాపులని గ్రహించవలెను.

సోదర సోదరిణులు, దాపు ప్రయాణములు, యిరుగు పొరుగు వారి యొక్క ప్రశ్నలు తృతీయ స్థానమును బట్టి విచారించ వలయును. పాపగ్రహములు ముఖ్యముగా కుజుడు లేక రాహువు తృతీయ స్థానము నందున్న వృచ్ఛకునికి సోదరులతో విరోధము సంభవించును. వానియొక్క సంయోగము బలముగలదై యున్న వృచ్ఛకునికి సోదరులు బద్ధవిరోధులని గ్రహించ వలెను.

కనుపించకుండా దేశాంతరము పోయిన సోదరుల యొక్క జాడల ప్రశ్నలకు సమాధానములు తృతీయస్థానమును బట్టి చెప్ప వలయును. ఈ

సంబంధమైన ప్రశ్నలో యిల్లు వదలి పోయిన సోదరుని యొక్క సమాచారము విచారించునప్పుడు తృతీయ స్థానాధిపతి అష్టమ స్థానమున పాపగ్రహ సంయోగము జెందియున్న పృచ్ఛకుని యొక్క సోదరుడు ప్రాణ సంకటనములో యున్నట్లు గ్రహించ వలెను.

పైన వివరణ కంటె యింకొక సరియైన పద్ధతి ఈ క్రింది విధముగా యుండును. తృతీయ స్థానము సోదరుని యొక్క లగ్నముగా గ్రహించి ఆ స్థానమును బట్టి ఫలనిరూపణ జేయవలయును.

పృచ్ఛకుని యొక్క ప్రశ్న సోదరుని యొక్క వృత్తి ఉద్యోగము, వ్యాపారమునకు మంబంధించినదై యున్న తృతీయ స్థానాధిపతియును, తృతీయస్థానము నుండి లెక్కించగా వచ్చిన 10వ స్థానాధిపతి యొక్క పరస్పర సంబంధము, వీక్షణ, సంయోగము మొదలగు వానిని గ్రహించ వలెను. ఈ రెండు గ్రహములు యిథ్యషాల యోగము నందున్న సోదరుని యొక్క వృత్తి, ఉద్యోగము, వ్యాపారము మొదలగునవి వృద్ధియందుండి లాభదాయకముగా యుండును. ఈ యొక్క పద్ధతి సరియైన ఫలముల నిచ్చును.

తృతీయ స్థానమును బట్టి తంతి తపాల ద్వారా వచ్చు సమాచారములు, యితరములైన గాలి వార్తలకు సమాధానములు చెప్పవచ్చును. లగ్నస్థానము పృచ్ఛకునిదిగా గ్రహించ వలెను. పృచ్ఛకుని యొక్క ప్రశ్నను బట్టి పంచమ స్థానము పుత్రునిదిగను, నవమ స్థానము తండ్రిదిగను, తృతీయస్థానము సోదరునిదిగను చతుర్థ స్థానము తల్లిదిగను గ్రహించి. ఈ రెండు స్థానాధిపతులు యిథ్యషాల యోగమును పొంది వారు పాపులై పాపగ్రహవీక్షణము పొందియున్న అశుభవార్త లేక జవాబు పొంద గలరు. వారు శుభగ్రహములై అశుభ వీక్షణము గలిగియున్న కొన్నిదినముల వ్యవధిలో అనుకూలమైన జవాబు పొందగలరు. వారు శుభ గ్రహములై శుభగ్రహ వీక్షణము గలిగియున్న శీఘ్రముగా అనుకూలమైన వార్త పొందగలరు.

## 4. చతుర్థ స్థానము

మాత, గృహము, భూమి, వాహనము, వంశము, విద్య, కృషి, మిత్రులు, బంధువులు, జలము, వాపీ, కూప, తటాక, తోటలు, పశుసస్య, ఔషధ, సింహాసన, మంత్రము, కుటుంబాభి వృద్ధి, రాజ్యము, నిక్షేపములు మొదలగు వాని ప్రశ్నలు చతుర్థ స్థానమును బట్టి చర్చించ వలెను.

పృచ్ఛకుని ప్రశ్న నాయొక్క భూములు నాకు స్వాధీనము కాగలవా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి లగ్నము నందున్నను లేక చతుర్థ స్థానమున చంద్రునితో జేరి ముథషిల యోగము నందున్న పృచ్ఛకునికి తన భూములు స్వాధీనము కాగలవు. పై గ్రహకూటమిలో పాపగ్రహ సంయోగముగాని, పాపగ్రహ వీక్షణము గాని గలిగియున్న పృచ్ఛకునికి భూములు స్వాధీనమునకు రావు.

పృచ్ఛకుని ప్రశ్న నా స్వాధీనము నందున్న భూములను నేను సక్రమముగా పండించ గలనా ? అని అడిగి నప్పుడు లగ్నము పృచ్ఛకునిగను, చతుర్థ స్థానము భూములుగను, సప్తమ స్థానము వ్యవసాయముగను, దశమ స్థానము ఫలించు పంటగను భావించ వలెను. లగ్నము నందు పాపగ్రహములున్న పృచ్ఛకుడు దొంగలవల్ల కొంత పంట గోల్పోవును. లగ్న స్థానమున పాపగ్రహములు

వక్రము గాని లేక అతిచారముగాని పొందకున్న చోరులు లాభము పొందగలరు. లగ్నము నందు శుభగ్రహములున్న పృచ్ఛకుడు వ్యవసాయము వలన లాభము పొందగలడు. చతుర్థ స్థానమున పాపగ్రహములున్న పృచ్ఛకుడు వ్యవసాయము జేయుట మానుకొనుము. సప్తమ స్థానమున శుభగ్రహములున్న వ్యవసాయము వలన లాభము గల్గును. అదే స్థానము నందు పాపులున్న పంట నశించును. నవమ స్థానాధిపతి దశమ స్థానము నందుండి శుభగ్రహ సంయోగము గాని లేక శుభగ్రహ వీక్షణము గాని జెందియున్న పంట బాగా ఫలించును.

పృచ్ఛకుని ప్రశ్న తన భూములు కౌలుకు యిచ్చు సందర్భములలో అడిగి నప్పుడు, లగ్నస్థానము పృచ్ఛకునిగను, సప్తమ స్థానము కౌలుదారుడుగను, దశమ స్థానము ఉత్పత్తిచెందు పంటగను, చతుర్థ స్థానము అందుండు లాభము మొదలగు వానిగా భావించవలెను.

లగ్నముగాని లగ్నాధిపతిగాని శుభగ్రహ వీక్షణముగాని, శుభగ్రహ సంయోగము గాని పొంది యున్న పృచ్ఛకుడు తన భూములు కౌలుకు యిచ్చుట వలన లాభము పొందగలడు. లగ్నముగాని, లగ్నాధిపతిగాని పాపగ్రహ సంయోగము గాని లేక పాపగ్రహ వీక్షణము గాని పొందియున్న పృచ్ఛకుడు భూములు కౌలుకు యిచ్చుట వలన నష్టము పొందును. కౌలుదారు యెవరైనను సప్తమస్థానమున పాప గ్రహములున్న కష్టనష్టములను పొందును. దశమ స్థానమున పాపగ్రహములున్న ఫలించిన పంట తృప్తికరముగా యున్నను పృచ్ఛకుడు లాభము పొందజాలడు. చతుర్థస్థానమున పాపగ్రహములున్న తుది ఫలము ప్రతికూలముగా నుండును.

పై ప్రశ్నలు భూములకు సంబంధించినవైనను అవి స్థిరాస్తులకు గూడ వర్తింప జేయవచ్చును. స్థిరాస్థి కొను విషయములో ప్రశ్న ఉత్పన్నమైనపుడు లగ్నము పృచ్ఛకునిగను లేక కొనుగోలుజేయు వానిగను, సప్తమ స్థానము అమ్మువానిగను, దశమ స్థానము ఆస్తివిలువ లేక ఖరీదుగను, చతుర్థ స్థానము స్థిరాస్తిగను భావించ వలెను. చతుర్థ స్థానమున పాపగ్రహములున్న పృచ్ఛకుడు లేక కొనుగోలు జేయువాడు యెక్కువ లాభమును పొందజాలడు. దశమస్థానమున శుభ గ్రహములున్న పృచ్ఛకుడు కొన్న ఆస్తి యందు మంచి ఆదాయము పొందగలడు.

పృచ్ఛకుని ప్రశ్న - ఇప్పుడున్న ప్రదేశము నుండి క్రొత్త ప్రదేశమునకు నా యొక్క వ్యాపారము మార్చిన లాభదాయకముగా యుండునా అని అడిగి నప్పుడు లగ్నము పృచ్ఛకునిగను, చతుర్థ స్థానము పాతప్రదేశముగను, సప్తమ స్థానము క్రొత్త ప్రదేశముగా భావించువలెను. దశమ స్థానము పృచ్ఛకుడు చేయుచున్న వ్యాపారముగను, నాల్గవ స్థానము ప్రస్తుతము చేయుచున్న వ్యాపార స్థలముగా భావించ వలెను. సప్తమ స్థానము లేక సప్తమ స్థానాధిపతి దశమ స్థానాధిపతి యిర్థ్యశాల యోగము పొందియున్న పృచ్ఛకుడు వ్యాపారమును క్రొత్త ప్రదేశమునకు మార్చుకొనుట మంచిది.

వాహనములను చతుర్థస్థానమును బటి విచారించవలెను. పృచ్ఛకుని ప్రశ్న - నేను క్రొత్త వాహనము కొనుట లాభకరముగా యుండునా అని అడిగి నప్పుడు లగ్న చతుర్థాధిపతులకు అనుకూల వీక్షణము గలిగియున్న పృచ్ఛకుడు క్రొత్త వాహనము కొనుగోలు జేయుట మంచిది. కుజుడు పాపదృష్టి గలిగి నాల్గవ

స్థానాధిపతిని వీక్షించుచున్న పృచ్ఛకుడు క్రొత్తవాహనములను కొనుగోలు చేయువలెనను తలంపు విరమించు కొనవలెను. నాల్గవ స్థానమున శుక్రుడున్న మంచి వాహన ప్రాప్తి గలుగును. సుఖస్థానమైన నాల్గవ స్థానమందు శనియున్నను. సుఖస్థానాధిపతి నీచయందున్నను. శత్రుక్షేత్రము నందున్నను పృచ్ఛకునికి సౌఖ్యముండదు. మాతృ స్థానమున రాహువు నీచయందున్నను మాతృమరణము సంభవించును.

పృచ్ఛకుని ప్రశ్న - నేను తొందరలో గృహనిర్మాణము చేయగలనా ? అని అడిగినప్పుడు చతుర్థ స్థానాధిపతి కేంద్రము లేక కోణము నందు శుభులతో కలిసి యుండి లగ్నాధిపతితో సంబంధము గలిగియున్న పృచ్ఛకునికి గృహ లాభము గలుగును. దశమ స్థానాధిపతి పాపులతో గూడుకొని చతుర్థ స్థానము నందుండెనేని పృచ్ఛకునికి క్షేత్రవినాశ మగును.

## 5. పంచమ స్థానము

పుత్రులు. సంతతి. శక్తి. మనస్సు. బుద్ధి. యాత్ర. మంత్రము. రహస్యము. పాండిత్యము మొదలగునవి పంచమ స్థానమును బట్టి చర్చించ వలెను.

పృచ్ఛకుని ప్రశ్న - ఈ స్త్రీ వలన నేను సంతానము పొందగలనా ? అని అడిగినప్పుడు లగ్నముగాని లేక చంద్రుడు గాని పంచమ స్థానాధిపతితో ముథషిల యోగము నందున్న పృచ్ఛకుడు సంతానము పొందగలడని చెప్పవలెను. పంచమ స్థానము యొక్క అధిపతి లగ్నము నందుండి లగ్నస్థానాధిపతి. చంద్రుడు పంచమ స్థానము నందున్న పృచ్ఛకునికి తొందరలో సంతానము గలుగును. గ్రహములు సప్తయోగము నందున్న సంతానము ఆలస్యముగా గలుగును. లగ్నము ద్విస్వభావరాశియై శుభగ్రహములతో కలసి యున్న కవలపిల్లలు జనించెదరు. లగ్నము పంచమస్థానాధిపతి పురుష రాశుల యందున్న పురుష సంతానము గల్గును. చంద్రుడు బేసిరాశి యందుండి పురుష గ్రహముతో యిథ్యశాల యోగము నందున్న పురుష సంతానము గలుగును.

చంద్రుడు సూర్యునకు వెనుక భాగము నందుండి పృచ్ఛకుని ప్రశ్న సాయంకాలము నందైన జననము స్త్రీ యగును. హోరాధిపతి పురుషగ్రహమై పురుషరాశి యందున్న జననము పురుషుడగును. కృష్ణపక్షములో 7 దినములు గతించిన వెనుక చంద్రుడు సూర్యుని వెనుక భాగము నందుండును.

చంద్రుడు గాని లేక బుధుడు గాని పంచమ స్థానము నందుండినను లేక పంచమ స్థానాధిపతితో కలిసిగాని వీక్షించబడిగాని యున్నను లేక పంచమ స్థానాధిపతి యుచ్ఛయందున్నను పృచ్ఛకుడు న్యాయబద్ధమైన సంతానమును పొందును.

పృచ్ఛకుని ప్రశ్న - - ఈ స్త్రీ గర్భవతియేనా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతియును చంద్రుడు పంచమ స్థానమున స్త్రీ గర్భవతిగా యున్నదని చెప్పవలెను. చంద్రుడు గాని లేక లగ్నాధిపతిగాని ఆపోక్లిబములైన 3-6-9-12 స్థానముల యందుండి పంచమాధిపతిచే వీక్షించబడుచు. లగ్నము లేక పంచమ స్థానముతో యిథ్యశాల యోగము పొందియున్న స్త్రీ గర్భవతి కాదని చెప్పవలెను. లగ్నము చర రాశియై అందు పాపగ్రహముండి క్షీణచంద్రునితో ముథషిల యోగము పొంది

యున్నను లేక చంద్రుడు గాని లేక లగ్నాధిపతిగాని చరరాశి లగ్నము నందుండి వక్రించిన గ్రహముతో యిధ్యషాల యోగము నందున్న స్త్రీకి గర్భస్రావము గలుగును.

పృచ్ఛకుని ప్రశ్న - స్త్రీ గర్భములో యున్న శిశువు జీవించునా ? లేక మరణించునా? అని అడిగినప్పుడు ద్వాదశాధిపతి కేంద్రము నందుండి శుభ గ్రహములతో కలసియున్నను లేక వీక్షించ బడుచున్న శిశువు జీవించి యుండును. శుక్లపక్షమునందున్న చంద్రుడు శుభగ్రహములతో గూడి ద్వాదశ స్థానమునందున్న గర్భములో యున్న శిశువు జీవించి యుండును. ద్వాదశ స్థానాధిపతి పాపియై పాపగ్రహ సంయోగముగాని లేక పాపగ్రహ వీక్షణముగాని గలిగియున్నను లేక అపోక్లీబము లైన 3-6-9-12 స్థానముల యందుండి శుభగ్రహములతో సంయోగము చెందకుండినను లేక వీక్షించబడకున్నను శిశువు జనించిన వెంటనే మరణము పొందుటగాని లేక గర్భము నందుండగనే చనిపోవుటగాని సంభవించును.

పంచమ స్థానాధిపతి లగ్నము నందున్నను లేక లగ్నాధిపతి పంచమ స్థానము నందుండి పాపగ్రహ సంయోగముగాని లేక పాపగ్రహ వీక్షణముగాని లేకున్న శిశుజననము గలుగును. పంచమ స్థానము రాహువు లేక కుజునితో జేరీయున్నను లేక వీక్షింపబడకున్న గర్భధారణ లేదని చెప్పవలెను. లగ్నస్థానము నందు కుజుడున్నను లేక పంచమ స్థానము శని లేక రాహువుచే యిధ్యషాల యోగము పొందియున్న ప్రసవము కష్టతరముగా యుండును.

పృచ్ఛకుని ప్రశ్న - స్త్రీ యెంత కాలములో ప్రసవించును ? అని అడిగినప్పుడు భువన ప్రదీపికలో చెప్పినట్లు లగ్నస్థానము నుండి శుక్రగ్రహమున్న స్థానము వరకు లెక్కించగా యెన్ని స్థానము లుండునో అన్ని నెలలకు స్త్రీ ప్రసవించునని చెప్పవలెను. కాని శుక్రగ్రహము 10, 11 లేక 12 స్థానముల యందు న్నప్పుడు లగ్నము నుండిగాక పంచమ స్థానము నుండి శుక్రగ్రహమున్న స్థానము వరకు లెక్కించి యెన్ని స్థానములుండునో అన్ని నెలలకు స్త్రీ ప్రసవించునని చెప్పవలెను.

పృచ్ఛకుని ప్రశ్న - ఈ సంవత్సరములో నాకు సంతానము కలుగునా ? అని అడిగినప్పుడు లగ్న పంచమాధిపతులు యిధ్యషాలయోగము నందున్న సంతానము గలుగునని చెప్పవలెను. లగ్నాధిపతి పంచమ స్థానము నందుండి, పంచమ స్థానాధిపతి లగ్నము నందుండి శుభగ్రహ వీక్షణము గిలిగి యున్న సంతానము గలుగును. అట్లుగాకున్న సంతానము గలుగదు. పంచమ లేక షష్టస్థానాధిపతులు పాపగ్రహ సంయోగముగాని లేక వీక్షణము గాని లేకున్నను, లేక గురుడు బుధుడు, లేక శుక్రుడు లగ్నము నందున్న శిశు జననము గలుగును. లగ్న పంచమ స్థానాధిపతులు యిధ్యషాల యోగము నందున్న సంవత్సరమున స్త్రీకి సంతానము గలుగును. లగ్న పంచమాధిపతులు కోణస్థానము నందు ప్రవేశించినపుడు గాని లేక వీరు పరస్పర వీక్షణము గలిగి యున్న అట్టి కాలము నందు స్త్రీకి సంతానము గలుగును. గ్రహములు కోణస్థానము నందుండుట యనగా 1-5-9 రాశుల యందు సమాన డిగ్రీలు లేక భాగల యందుండుట అని యెరుంగ వలెను.

ఉ।। లగ్నాధిపతి పంచమ స్థానము నందు 10°లలో యున్నాడను కొందము. పంచమాధిపతి నవమస్థానములో 10° యందున్నపుడు రెండు గ్రహము లు కోణ స్థానము నందున్నట్లు గ్రహించవలెను.

అష్టమ స్థానమున గురుడు లేక శుక్రుడు జేరియున్న స్త్రీకి మృత శిశువు గలుగును. కుజ గ్రహము అష్టమ స్థానము నందున్న గర్భస్రావము గలుగును. అష్టమాదిపతి అష్టమ స్థానము నందున్న ప్రసవము కష్టతరముగా యుండును. అష్టమ స్థానమున సూర్యుడు లేక శుక్రుడు జేరియున్నను, లేక ద్వితీయ అష్టమ, ద్వాదశ స్థానములు పాపగ్రహ సంయోగము జెందియున్నను, మొదటి సంతానము నశించి తరువాత సంతానము అల్పాయువు గలిగి యుండును, ద్వాదశాధిపతి కేంద్రము నందుండి శుభగ్రహదృష్టి, శుభగ్రహ వీక్షణము గలిగియున్న పుట్టిన శిశువు జీవించును. పూర్ణచంద్రుడు కేంద్రము నందుండి శుభదృష్టి గలిగి యున్న పుట్టిన శిశువు దీర్ఘకాలము జీవించును.

ఉ।। వృచ్ఛకుని ప్రశ్న - స్త్రీ యెప్పుడు ప్రసవించును ? అని అడిగి యున్నాడు. ఇందు లగ్నాధిపతియైన కుజుడును పంచమాధిపతియైన గరుడు యిధ్యషాలయోగము నందున్న కాలము నందు స్త్రీ ప్రసవించును. గ్రహప్రసారములో కుజ, గురులు కోణము నందు సమభాగలలోనికి 30 దినములలో రాగలగుచున్నారు. కాబట్టి 30 దినములకు స్త్రీ ప్రసవించునని చెప్పవలెను.

| | | | |
|---|---|---|---|
| గు-25° | | | |
| | ప్రశ్న లగ్నము | | |
| | | | |
| | ల-20° కు-2° | | ర-28° |

## ప్రత్యేక విషయములు

వృచ్ఛకుని ప్రశ్న సంతాన విషయము చర్చించునపుడు లగ్నాధిపతి లేక చంద్రుడు పంచమాధిపతితో యిధ్యషాల యోగమును పొంది పంచమాధిపతి శుభ దృష్టి శుభగ్రహ సంయోగము గలిగియున్న వృచ్ఛకుడు సంతానము గలవాడగును. పంచమస్థానమును వీక్షించు శక్తి వంతుమైన పురుష స్త్రీ గ్రహములను బట్టి పురుష సంతానము నిరూపించ వలెను.

లగ్న పంచమాధిపతులకు పరస్పర వీక్షణము లేకున్నను లేక లగ్నాధిపతి పంచమ స్థానమును వీక్షించకున్నను లేక పంచమాధిపతి లగ్నమును వీక్షించకున్నను లేక పంచమాధిపతి పాపగ్రహములతో యిధ్యషాల యోగమును పొందియున్నను వృచ్ఛకుడు సంతానము లేని వాడగును. పంచమ స్థానము సింహ, వృషభ, వృశ్చిక లేక కన్యరాశియై యుండి ప్రశ్నలగ్నము లేక జన్మలగ్నము లేక జన్మచంద్రుని స్థానము నుండి పంచమ స్థానము పాపగ్రహ సంయోగము లేక పాపగ్రహ వీక్షణము గలిగియున్న వృచ్ఛకుడు స్వల్పసంతానము గలవాడగును.

రవి లేక శనిగ్రహము స్వక్షేత్రమైన అష్టమ స్థానము నందున్న వృచ్ఛకుని భార్య వంధ్య అగును. అష్టమ స్థానము నందు చంద్రుడు లేక బుధుడున్న

వృచ్ఛకునికి ఒక కుమార్తె మాత్రమే యుండును. లగ్నపంచమాధిపతులు బేసి రాశులందున్న మగసంతానమును, సమరాశుల యందున్న స్త్రీ సంతానము గల్గును. పంచమాధిపతి పురుషరాశి యందుండి, లగ్నాధిపతిగూడ పంచమ స్థానము నందుండి పురుష గ్రహములచే వీక్షించబడుచున్న పురుష సంతానము గల్గును. పంచమాధిపతి సరిరాశి యందుండి లగ్నాధిపతిగూడ సరిరాశి యందుండి, స్త్రీ గ్రహములచే వీక్షించబడుచున్న వృచ్ఛకునికి స్త్రీ సంతానము గలుగును. లగ్నము ద్విస్వభావరాశియై అంద శుభగ్రహములు జేరియున్న కవల శిశువులు జనించెదరు. లగ్నస్థానము నుండి లెక్కించగా శనియున్న స్థానము బేసిరాశియై యున్న వృచ్ఛకునికి పురుష సంతానము గల్గును. లగ్నస్థానము నుండి శనియున్న స్థానము సరిరాశియైన వృచ్ఛకునికి స్త్రీ సంతానము గల్గును.

ప్రశ్న లగ్నమునకు 3-5-7-9 స్థానముల యందు రవి, కుజ, గురులుండిరేని గర్భశిశువు పురుషుడుగా యుండును. ప్రశ్న లగ్నమునకు 2-4-6-8 స్థానముల యందు చంద్ర శుక్రులుండిరేని స్త్రీయని యెరుంగ వలెను. ఈ స్థానముల యందు శని, బుధులుండిరేని నపుంసకుడని చెప్పవలెను. ప్రశ్న లగ్నము ద్విస్వభావరాశియై ఆ లగ్నమునకు చతుర్ధ స్థానమునందు రెండు గ్రహములున్న కవలలు గల్గుదురు. ఈ గ్రహములు పురుష స్త్రీలై యున్న కవలలు స్త్రీ పురుషులుగా యుందురు. రెండు గ్రహములు స్త్రీలైన కవలలు స్త్రీలనియు, రెండు గ్రహమలు పురుషులైన కవలలు పురుషులుగా గ్రహించ వలెను.

## 6. షష్ట స్థానము

శత్రువులు, రోగము, ఋణము, కారాగృహము, ఆయుధము, విఘ్న, భీతి, అపవాద, చోరత్వ, పాపము మొదలగునవి షష్టస్థానమును బట్టి విచారించ వలయును.

వృచ్ఛకుని ప్రశ్న రోగ నివారణ మొదలగు వానిని గురించి యడిగి నప్పుడు లగ్నము వైద్యునిగను, సప్తమ స్థానము రోగముగను, దశమ స్థానము రోగిగను, చతుర్ధ స్థానము ఔషధము లేక చికిత్సగా భావించవలెను.

ప్రశ్న లగ్నస్థానము నందు పాపగ్రహములు జేరియున్నను లేక పాపగ్రహములు లగ్నస్థానమును వీక్షించుచున్నను వైద్యుడు రోగమును నివారించలేడు. దశమ స్థానమున పాపగ్రహములున్న రోగి అపథ్యము వలన, కాని అశ్రద్ధ వలన ఔషధము రోగమును శమించజాలదు. చతుర్ధ సప్తమ స్థానముల యందు పాపగ్రహములున్నను, పాపగ్రహ వీక్షణము గలిగియున్న రోగ సంకటనలు యెక్కువగును. పై స్థానముల యందు శుభగ్రహము లున్న రోగనివారణకు దారికల్పించును. ఈ శుభగ్రహములు వక్రించియున్న రోగి కోలుకొనుటకు అవకాశములు కల్పించి రోగము కొద్ది కాలములో శమించును. లగ్నాధిపతియును, చంద్రుడు శుభగ్రహములతో యిధ్యషాల యోగమును పొందియున్న రోగము నివారణ చెందును. పాపగ్రహములు చంద్రునితో యిధ్యషాల యోగమును పొందియున్న మరణము సంభవించును.

సప్తమ స్థానము రోగమును సూచించు చున్నది. కాని కొందరి అభిప్రాయములో రోగస్థానము సప్తమ స్థానమునకు బదులు షష్టస్థానమును గ్రహించ వలనను చున్నారు. వృచ్ఛకుని యొక్క రోగశుభాశుభ లక్షణములు లగ్నము, లగ్నాధిపతి, లగ్నస్థానము నందున్న గ్రహములు, షష్టస్థానము, షష్టస్థానాధిపతి, షష్టస్థానము

నందున్న గ్రహములు. వీని వలన గలుగు యోగములను బట్టి విచారించ వలెనని చెప్పి యున్నారు.

లగ్నాధిపతి షష్ఠస్థానాధిపతి చరరాశి యందున్న రోగి తొందరలో రోగ విముక్తుడై ఆరోగ్యము పొంద గలడు. అదే స్థిరరాశియై యున్న జబ్బు దీర్ఘ రోగముగా యుండును. అదే ద్విస్వభావరాశియైన రోగము మధ్యమముగా యుండును. లగ్నాధిపతి షష్ఠరాశియందున్నను. షష్ఠాధిపతి లగ్నమునందున్నను రోగి దీర్ఘరోగము చే కొంతకాలము బాధపడవలసి యుండును. షష్ఠాధిపతియును. అష్టమ స్థానాధి పతియును లగ్నమునందున్న రోగి మరణము నొందును. షష్ఠస్థానాధిపతియును. అష్టమ స్థానాధిపతియును పరివర్తన చెందియున్న రోగము తొందరలో శమించును.

రోగి ఈ క్రింది గ్రహసంయోగముల వలన మృతిచెందును.

(1) అష్టమాధిపతి లగ్నమునందున్నను. (2) లగ్నాధిపతి లేక అష్టమాధిపతి చంద్రుడున్న స్థానము నుండి అష్టమ స్థానము నందున్నను. (3) లగ్నాధిపతి రవియై. సప్తమాధిపతి షష్ఠస్థానము నందుండి చంద్రునితో యిధ్యషాల యోగము నందున్నను. (4) అష్టమస్థానాధిపతి లేక లగ్నాధిపతి కేంద్రము నందుండి వక్రించిన గ్రహముతో గాని లేక పాపసంయోగము గల గ్రహముతోగాని యిధ్యషాల యోగము నందున్న రోగి తప్పక మృతి చెందును.

లగ్నము చరరాశియై లగ్నాధిపతి సూర్యుని యొక్క ద్వాదశాంశను పొందియున్న రోగము శమించి మరల తిరుగబెట్టును. లగ్నము ద్విస్వభావ రాశియై యున్న రోగము అనుకున్నదిగాక వేరుగా యుండును. లగ్నము స్థిరరాశియై యున్న రోగము అనుకున్నదిగనే యుండును. చంద్రుడు వక్రించిన గ్రహముతో యిధ్యషాల యోగమును పొందియున్న రోగము దీర్ఘకాలముగా యుండును.

క్రిష్టినీయ పరిశీలనలను బట్టి షష్ఠ. అష్టమ స్థానములు పాపగ్రహములతో జేరియున్నను. లేక వీక్షింప బడుచున్న రోగి యెన్నటికి రోగ విముక్తుడు కాడు. ఈ రెండు స్థానములు శుభ పాపగ్రహ సంయోగము గలిగియున్న రోగము నిధానముగా ఉపశమించును. లగ్నాధిపతి కోణము నందుండి. నవమ స్థానము శుభగ్రహముచే వీక్షించబడుచున్న రోగి చికిత్సపొంది రోగవిముక్తుడగును. నవమ స్థానము నందు పాపగ్రహములున్న వృచ్ఛకుడు రోగము నుండి విముక్తి పొందజాలడు. షష్ఠ. అష్టమ స్థానములు శుభగ్రహములతో చేరియున్నను లేక శుభగ్రహములచే వీక్షించ బడుచున్న వృచ్ఛకుడు ఆరోగ్యము పొంద గలుగును.

లగ్నాధిపతి షష్ఠస్థానము నందుండి షష్ఠస్థానాధిపతి లగ్నము నందున్న దీర్ఘ రోగమునకు దారితీయును. లగ్నాధిపతి షష్ఠాధిపతిలో భవిష్యత్ యిధ్యషాల యోగము నందున్న రోగము యోగము విడుచునంత వరకు శమించదు. లగ్న షష్ఠాధిపతులు పరస్పర వీక్షణము పొందియున్నను లేక సంయోగము చెందియున్న రోగము కష్టముగా నయమగును. లగ్నాధిపతి కుజునితో చేరి అష్టమ స్థానము నందున్నను లేక లగ్న అష్టమాధిపతులు పరస్పర వీక్షణము గలిగి కుజుడు గైరకంబూల యోగమును పొందియున్న ప్రాణాంతకమై ఉపశమించును.

## నౌకరి యజమాని బాంధవ్యము

వృచ్ఛకుని ప్రశ్న - నేను యింకొక యజమాని వద్ద నౌకరి చేయుదునా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి కేంద్ర స్థానము నందుండి షష్టాధిపతి లేక వ్యయాధిపతితో ముధ్యషిల యోగమును పొందకున్న వున్న నౌకరీలో మార్పుయేమి యుండదు. లగ్నాధిపతి వక్రించి తృతీయ లేక నవమ స్థానము నందున్న యింకొక గ్రహముతో యిధ్యషిల యోగము పొందియున్న వృచ్ఛకుడు క్రొత్త యజమాని వద్దకు మార్పుచెందును. లగ్నాధిపతి కేంద్రస్థానము నందుండి పాపగ్రహముచే వీక్షించబడియున్న వృచ్ఛకుని జీవిత కాలములో యున్న యాజమాని వద్ద నుండి నౌకరిలో మార్పు చెందును.

వృచ్ఛకుని ప్రశ్న - నాకు నౌకరిలో మార్పుయేమైనా యున్నదా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి కేంద్రస్థానములైన 1-4-7-10 స్థానముల యందుండి షష్ట లేక ద్వాదశాధిపతులతో యిధ్యషిల యోగమును పొందకున్నను లేక లగ్నాధిపతి కేంద్రములైన 1-4-7-10 స్థానముల యందుండి పాపగ్రహ వీక్షణము గల్గియున్న వృచ్ఛకునికి నౌకరిలో మార్పు గలుగును. లగ్నాధిపతి వక్రించి తృతీయ నవమ స్థానాధిపతులతో యిధ్యషిల యోగమును పొందియున్న వృచ్ఛకునికి నౌకరిలో మార్పు గలుగును.

తాజక సిద్ధాంతరీత్యా తృతీయ, నవమ స్థానములు వృచ్ఛకుని ఉద్యోగము లో మార్పు, హోదాలో మార్పు, స్థానచలనము మొదలగు వానిని సూచించును.

వృచ్ఛకుని ప్రశ్న - ఇప్పుడున్న యజమాని వద్ద నాయొక్క స్వప్రయోజనములు సౌఖ్యముగా యుండునా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి చంద్రునితో కంబూల యోగము నందున్న వృచ్ఛకుని యొక్క స్వప్రయోజనములు యిప్పుడున్న యజమాని వద్ద సౌఖ్యముగా యుండును. సప్తమ స్థానాధిపతితో చంద్రుడు కంబూల యోగము నందున్న యింకొక క్రొత్త యజమాని వద్ద నౌకరి చేయుట మంచిది.

పైవిధముననే భూములు, భవనములు, కౌలు మొదలగు వానిపై ప్రశ్నలు ఉత్పన్నమైనపుడు గ్రహముల యొక్క శుభాశుభములను బట్టి నిర్దేశించ వలెను.

వృచ్ఛకుని ప్రశ్న - నౌకరిని లేక పశువును పొందగలనా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి చంద్రుడు షష్టస్థానము నందున్నను లేక లగ్నాధిపతి షష్టస్థానాధిపతితో యిధ్యషాల యోగమును పొంది యున్నను లేక షష్టస్థానాధిపతి లగ్నము నందున్నను వృచ్ఛకుడు నౌకర్లను, పశువులను పొందగలడు.

## 7. సప్తమ స్థానము

భార్య, వివాహము, భోగము, వ్యభిచారము, వాణిజ్య, క్రయ, విక్రయ, వ్యవహార, గమనా గమనములు మొదలగు వానిని గురించి విచారించ వలయును.

వృచ్ఛకుని ప్రశ్న - వివాహమునకు తొందరలో వధువును పొందగలడా ? అని అడిగినప్పుడు సప్తమ స్థానాధిపతితోగాని లేక చంద్రునితోగాని యిధ్యషాలయోగమును పొందిన వృచ్ఛకుడు వెతుక కుండగనే త్వరలో వధువును పొందగలడు. లగ్నాధిపతిగాని లేక చంద్రుడుగాని సప్తమ స్థానము నందున్న వృచ్ఛకునికి వధువు కష్టము మీద లభించును. లగ్నాధిపతి చంద్రునితో మానరిపః

యోగము నందున్నను, లేక లగ్నాధిపతి సప్తమాధిపతితో యిథ్యషాల యోగము నందున్న వృచ్ఛకుడు ప్రయత్నము లేకనే వధువును పొందగలడు. లగ్నాధిపతి సప్తమాధిపతితో యిథ్యషాల యోగము నందుండి, సప్తమాధిపతి పాపగ్రహములతో సంయోగము చెంది యున్నను లేక అస్తమించి యున్నను వృచ్ఛకుడు వధువును గ్రహించుటలో విఫలుడగును. తృతీయ స్థానాధిపతి లేక చతుర్థ స్థానాధిపతి పాపియై యున్న వృచ్ఛకుడు సోదరులు లేక తండ్రి మూలమున వధువును గ్రహించుటలో విఫలడగును. ఇందు చతుర్థ స్థానము తండ్రిని గురించి సూచించు చున్నది. కాని పరాశర మతములో నవమ స్థానము పితృస్థానముగా భావించబడుచున్నది.

లగ్నచక్రములో వివాహమునకు సంబంధించి నంతవరకు గ్రహ సంయోగమున యే శుభగ్రహములు శక్తివంతమై సాయ పడుచున్నవో ఆ గ్రహ సంబంధ మూలమున వృచ్ఛకుని వాంఛ నెరవేరునని గ్రహించవలెను.

ఉ।। వృచ్ఛకుని ప్రశ్న - నాకు తొందరలో వివాహమగునా ? అని అడిగెను. ఆ సమయమునకు కన్యాలగ్నమైనది. లగ్నాధిపతియైన బుధుడు వృషభ రాశిలో 15 భాగముల యందున్నాడు. కార్యాధిపతియనగా - ప్రశ్న స్త్రీ లాభప్రశ్న గనుక కార్యాధిపతి సప్తమాధిపతియైన గురుడగు చున్నాడు. గురుడు కర్కాటక రాశియందు 20 భాగల యందుండెను. ఇచ్చట లగ్నాధిపతి బుధుడు, కార్యాధిపతి గురుడుయై యుండిరి. మరియొకరు - అనగా శుక్రుడు వృషభరాశిలో 18 భాగల యందున్నాడు. బుధ శుక్రులు యొకే రాశి యందు 12 భాగల యెడమునకు లోగా యున్నారు. గురుడు గూడ అట్లే యున్నాడు. ఇచ్చట గురుడు ఉచ్చస్థానమైన కర్కాటక రాశి యందున్నాడు.

| | | | |
|---|---|---|---|
| శ | ర - 10 °<br>కు - 3 ° | బు - 15 °<br>శు - 18 ° | |
| | ప్రశ్న | | గు - 20 ° |
| చ - 17 ° | లగ్నము | | |
| | | | ల - 20 ° |

శుక్రుడు తన స్వక్షేత్రమైన వృషభరాశి యందున్నాడు. ఇచ్చట గురు శుక్రులు ఉత్తమాధికారముతో యున్నారు. లగ్నాధిపతియైన బుధుడు మిత్రక్షేత్రము నందుండుటచే మధ్యమాధికారము నందున్నట్లు గ్రహించ వలెను. గురుడు ఉచ్చస్తుడై అచ్ఛాదన దృష్టిచే 11వ స్థానము నందున్న బుధశుక్రులను వీక్షించు చుండుటచే పూర్ణయోగమగు చున్నది. ఇచ్చట మధ్యవర్తి శుక్రుడు గనుక మంచి సంపన్నుడైన యొక పురుషుని ద్వారా వృచ్ఛకునికి స్త్రీ లాభము గల్గును. ఈ విధముననే సకల ప్రశ్నల యొక్క ఫలములను చెప్పవలెను.

వృచ్ఛకుని జన్మ జాతకచక్రము ప్రకారము లగ్నమును, సప్తమాధిపతిని శోధించగా స్ఫుటరాశి యొక్కటియై ఆ రాశియందు గురుడు ప్రవేశించినప్పుడు

వివాహము చెప్పవలయును. చంద్రాధిష్టత రాశిని బట్టిగూడ యిటలనే విచారింప వలయును. కళత్రాధిపతియున్న రాశినాధుడు, కళత్రాదిపతియున్న అంశనాధురు శుక్రుడు, చంద్రుడు అనువారిలో నెవరు బలవంతులో వానియొక్క దశాంతర్దశల యందు వివాహమగునని తెలియ వలయును. సప్తమాధిపతి యున్న నవాంశరాశికి త్రికోణము నందు గురుడు ప్రవేశించినప్పుడైనను వివాహమగును. శుక్రునితో గూడుకొనిన కళత్రాధిపతియున్న రాశినాధుని యొక్క దశాంతర్దశల యందు వివాహము జరుగును. ధనాధిపతియున్న రాశినాధుని యొక్క దశాంతర్దశల యందు గూడ వివాహమగును. 10 - 11 స్థానముల కధిపతులగు వారియొక్క దశాంతర్దశల యందు గూడ వివాహమగును. సప్తమాధిపతితో గూడకొని కళత్ర స్థానమందున్న వాని యొక్క దశాంతర్దశల యందు గూడ వివాహ మగును. పాపరాశి యందున్న శుభగ్రహము దశామధ్యమందు వివాహాదికము సమకూర్చును.

లగ్నాధిపతియున్న నవాంశాధి పతియొక్క స్వక్షేత్రము నందు గోచారవశము చేత గురుచంద్రులు ప్రవేశించి యున్న కాలమునందు వివాహ మగును. సప్తమాధిపతి గోచారవశముచేత శుక్రుని గృహమునందు ప్రవేశించిన కాలమునందైనను, గోచారవశముచేత గురుచంద్రులు కేంద్రములయందున్న కాలము నందైనను వివాహ మగును. లగ్నాధిపతితోడను, సప్తమాధిపతితోడను కూడిన గ్రహముల యొక్క దశాంతర్దశల యందు మనోహరురాలగు భార్య లభించును.

సప్తమ స్థానములో సూర్యుడున్న గట్టి మనస్సున్నా, గర్వముగల భాగ స్వామి గలుగును. వివాహము ఆలస్యముగా జరుగును. సప్తమ స్థావములో చంద్రుడున్న చంచల మనస్సు, కనికర స్వభావము గల్గను. వివాహమును చర్చించునపుడు భార్య లేక భర్త క్కారకుడైన శుక్రుడు (కళత్రకారకుడు) కళత్ర స్థానమైన సప్తమస్థానము, సప్తమ స్థానాధిపతి విషయమై విచారించవలెను.

సప్తమ స్థానాధిపతికి మూల త్రికోణరాశి యందు గురుడు ప్రవేశించి నపుడు వివాహము జరుగును. కళత్రకారకుడైన శుక్రుని మూల త్రికోణరాశి యందు గురుడు ప్రవేశించినపుడు గూడ వివాహము జరుగును. (శుక్రుని మూలత్రికోణ రాశితుల 0-15°) జన్మలగ్నాత్తు. చంద్రలగ్నాత్తు సప్తమ స్థానమున గురుడు ప్రవేశించినపుడు వివాహము జరుగును.

వృచ్ఛకుని ప్రశ్న ప్రేమ సంబంధమై యున్న లగ్నాధిపతి సప్తమాధిపతితో ముధషిల యోగము నందున్న దంపతులు అన్యోన్య స్నేహప్రేమలతో యుందురు. లగ్న సప్తమాధిపతులు క్రూరదృష్టి యందున్న దంపతులు యెల్లప్పుడు కలహకారులై యుందురు. లగ్నాధిపతిగాని లేక సప్తమాధిపతిగాని చంద్రునితో కంబూల యోగము నందున్న వధువు సుగుణవతియై యుండును. లగ్నాధిపతిగాని లేక సప్తమాధిపతిగాని శనిగ్రహమై కేంద్రస్థానము నందున్న వరుడు లేక వధువు పైచేయి గా యుండును. లగ్నసప్తమాధిపతు లిరువురు యొకే స్థానము నందున్న దంపతు లిరువురు కలహించుటయు మణల సఖ్యత పడుటయు సంభవించును. రవిగాని శుక్రుడు లేక యిరువురు బలహీనులై యున్న వరుడు లేక వధువు యిరువురకు సుఖదాంపత్యము నశించును.

వృచ్ఛకుని ప్రశ్న - ఈ వ్యాజ్యము లేక తాగాదాలో జయించగలనా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి వృచ్ఛకునిగను, సప్తమాధిపతి భాగస్తునిగను లేక ప్రతివాదిగను గ్రహించ వలెను. లగ్నాధిపతి బలవంతుడై శుభదృష్టి గలిగి శుభ స్థానము నందుండి సప్తమాధిపతి బలహీనుడై షష్టస్థానము నందున్న వృచ్ఛకుడు దావా లేక తగాదా యందు జయమును పొందగలడు.

లగ్నాధిపతి సప్తమాధిపతితో ముథషిల యోగము నందున్న భాగస్తులు అన్యోన్య స్నేహ భావము గలిగి యుందురు. లగ్న సప్తమాధిపతులు క్రూరదృష్టి యందున్న భాగస్తులు కలహకారులై యుందురు. లగ్నాధిపతిగాని సప్తమాధిపతిగాని చంద్రునితో కంబూల యోగము నందున్న భాగస్తులు మంచి మనస్సు గలవారై యుందురు. లగ్నాధిపతిగాని, సప్తమాధిపతిగాని శనిగ్రహమై కేంద్రస్థానము నందున్న, శని లగ్నాధిపతిగా యున్నప్పుడు వృచ్ఛకుడును, సప్తమాధిపతిగా యున్న ప్పుడు భాగస్తులను, వ్యవహారకారకులై ఆధిఖ్యత పొంది యుండెదరు. లగ్న సప్తమాధి పతులిరువురు యొకే స్థానము నందున్న భాగస్తులు కలహములు గలిగి యుండుటయు మఱల వ్యాపారము నందు సఖ్యత పడుటయు సంభవించును. రవి లేక శుక్రుడు లేక యిరువురు బలహీనులై యున్న వృచ్ఛకుడు లేక భాగస్వాములు లేక అందరు సుఖసంతోషములు గల్గి యుందురు.

వృచ్ఛకుని ప్రశ్న - కోపముతో యున్న నాభార్య మరల తిరిగి రాగలదా ? అని అడిగినపుడు రవి, లగ్న, ద్వితీయ లేక తృతీయ స్థానము నందుండి, శుక్రుడు పంచమ, షష్ట లేక నవమ స్థానముల యందున్న కోపముతో యున్న తన భార్య మరల తిరిగిరాదు. శుక్రుడు వక్రించి యున్నను లేక అస్తమయము నుండి వీడ బడుచున్నను వృచ్ఛకుని భార్య మరల తిరిగి రాగలదు. శుక్రుడు వక్రగతిని పొందకున్నను లేక అస్తంగతుడై యున్నను తన భార్య యింటికి తిరిగిరాదు. చంద్రునికి కళలు తగ్గుచున్న తనభార్య కొంత కాలమునకు నిదానముగా తిరిగి రాగలదనియు, చంద్రునియొక్క కళలు పెరుగుచున్న తనభార్య వెంటనే తిరిగి రాగలదని చెప్పవలెను.

విడాకుల విషయములో ప్రశ్నవుత్పన్న మైనపుడు పైన ఉదయించిన గ్రహ సంయోగముల చేతనే జవాబులు చెప్పవచ్చును.

లగ్న సప్తమాధిపతులు పాపదృష్టి గల్గి పరస్పరము నొకరినొకరు వీక్షించు చుండి, రాహువు లేక కుజునిచే సంయోగము పొందియున్న తీరని విడాకులకు దారి తీయును. లగ్న సప్తమాధిపతులు పరస్పర పాపదృష్టిచే వీక్షించుచుండి గురు లేక శుక్ర సంయోగము చెందియున్న విడాకులు పొంద వలెనను యోచన శాంతించును. లగ్నాధపతి, రాహువు లేక కుజునితో సంయోగము చెందియున్న వృచ్ఛకునికి విడాకులు వాంఛగలును. సప్తమాధిపతి రాహువు లేక కుజునితో సంయోగము చెందియున్న సహభోగి విడాకులకు ప్రయత్నించును. లగ్నాధిపతి వక్రించి యుండి గురుడు లేక శుక్రునిచే వీక్షించ బడుచున్న దంపతుల యొక్క విడాకుల వాంఛ కోర్టు వివాదము నందున్నను విడిచిపెట్ట బడును.

వృచ్ఛకుని ప్రశ్న - వధువు యొక్క గుణము మంచిదేనా? అని అడిగి నప్పుడు లగ్నము స్థిరమై యున్నను, లగ్నాధిపతియును, చంద్రుడు స్థిరరాశుల

యందున్నను వధువు గుణవంతురాలుగా వుండును. లగ్నాధిపతిగాని. లగ్నము గాని మరియు చంద్రుడుగాని చరరాశుల యందున్న వధువు యొక్క గుణము దుర్గుణమని గ్రహించ వలెను. చంద్రుడు ద్విస్వభావరాశి యందుండి. లగ్నము చరరాశి యందున్న వధువు యొక్క గుణము అనుమానాస్పదముగా యుండును. కుజ చంద్రులు చర లేక ద్విస్వభావరాశి యందున్న వధువు రహస్యముగా వ్యభిచరించును. శని చంద్రులు లగ్నము నందున్న వధువు బహిరంగముగనే వ్యభిచరించును. శుక్రుడు చంద్రుని యొక్క ద్రేక్కారణము నందుండి శనికుజాలు కేంద్రస్థానము నందున్న వారలై చంద్రునిచే వీక్షించబడుచున్న వధువు తప్పక వ్యభిచరించును.

వృచ్ఛకుని ప్రశ్న - ఈ స్త్రీ యొక్క గర్భము తన భర్త వలన గలిగినదేనా? అని అడిగినప్పుడు లగ్న పంచమాధిపతులు శుభగ్రహములచే వీక్షించబడు చున్నను లేక సంయోగము చెందియున్నను స్త్రీయొక్క గర్భము తన భర్తవలననే గలిగిన దనియు కుజ శనులచే వీక్షించబడుచున్న గర్భము పరపురుషుల వలన గలిగిన దనియు గ్రహించవలెను.

ప్రశ్న - ఈ స్త్రీ కులటయా లేక సుగుణవతియా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి లేక చంద్రుడు కుజునకు యొకభాగలో కలిసి యున్నపుడు స్త్రీ తన సొంత గృహమునందే వ్యభిచరించునట్లుగా భావించ వలెను. రవితో సుధషిల యోగము నందు కుజుడుండి. కుజుడు తన స్వస్థానమును పొందియున్న స్త్రీ గొప్పవారితో పొందు గలిగి యుండును. కుజుడు తన స్వస్థానము నందుండి బుధునితో ముధషిలయోగము పొందియున్న స్త్రీయొక్క ప్రేమికుడు కవి లేక విలేఖరి. వ్యాపారము చేయువాడై యుండును. కుజుడు తన స్వస్థానము నందుండి శుక్రునితో ముధషిల యోగము నందున్న స్త్రీ తన గృహలైంగిక స్వభావము గల్గియుండును. ఇందుకు భిన్నముగా స్త్రీ సుగుణవతిగా యుండును.

కుజుడు తన స్వస్థానము నందుండి లగ్నాధిపతితో గాని లేక చంద్రునితో గాని ముధషిల యోగము నందున్నతనకు నచ్చిన ప్రేమకునితో వ్యభిచరించును. కుజుడు తన స్వస్థానము నందుండి గురునితో వీక్షించబడుచున్న స్త్రీ యితరుల పొందు గలిగి కుమారుని భయముతో మెలుగుచుండును. కుజుడు తన స్వస్థానము నందుండి రవితో వీక్షించబడుచున్న స్త్రీ యితరుల పొందు గలిగి అనాచారమునకు భయపడు చుండును. కుజుడు తన స్వస్థానము నందుండి శుక్రునిచే వీక్షించ బడుచున్న స్త్రీ యితరుల పొందు గలిగి తనపై యితర స్త్రీలవలన వచ్చు అపవాదునకు భయపడు చుండును. కుజుడు తన స్వస్థానము నందుండి యొకే స్థానము నందున్న బుధ. శుక్రులచే వీక్షించబడుచున్న ప్రేమికుడు ముసలి వాడగుటచే స్త్రీ తనపైగల అపవాదునకు భయపడు చుండును.

గమనిక:- భారతదేశ నాగరికతకు స్త్రీ వ్యభిచరించుట ఘోరమైన తప్పుగా భావించబడు చుండుటచే యిట్టి లోపాలోపములు బహిరంగ పరచుట వలన స్త్రీయొక్క భవిష్యత్తుకు. తన కుటుంబ భవిష్యత్తుకు విఘాతము గల్గును. గాని జ్యోతిష్కుడైన వాడు యిట్టి విషయములను బహిరంగ పరచరాదు.

## 8. అష్టమ స్థానము

దష్టశత్రు సంకటము, ద్రవ్యనష్టము, యుద్ధనష్టము, ఉత్తరదేశ గమనము మొదలగు వానిని అష్టమ స్థానమును బట్టి చర్చించ వలయును.

పృచ్ఛకుని ప్రశ్న యుద్ధసంబంధమైయున్న లగ్నము నందున్న గ్రహముగాని లగ్నాధిపతియున్న రాశి గ్రహముగాని చంద్రునితో ముసరిఫఃయోగము నందున్న పృచ్ఛకుని యొక్క ప్రభువు యుద్ధమునందు జయించగలడు. సప్తమ స్థానము నందున్న గ్రహముగాని లేక సప్తమాధిపతియున్న రాశిగ్రహముగాని చంద్రునితో ముథషిల యోగము పొందియున్న శత్రువు జయమును పొందును.

కుజ, గురు శనిగ్రహములు మేలైనవిగను, బుధ, శుక్ర, చంద్రులు తక్కువ అంతస్తు గ్రహములుగా భావింబడుచున్నవి. కుజ, గురు, శని గ్రహములు బలవంతులై హీనగ్రహములైన బుధ, శుక్ర, చంద్రగ్రహముల కంటె ముందున్న స్థానములను జేరియున్నను లేక చంద్ర, బుధ, శుక్రులు బలహీనులై మేలైన గ్రహములకు వెనుక భాగము నందున్న పృచ్ఛకుని ప్రభువు జయమును పొందువాడగును. తృతీయ, షష్ట, దశమ లేక ఏకాదశ స్థానముల యందున్న సప్తమాధిపతితో లగ్నాధిపతి ముథషిల యోగము పొందియున్న ప్రభువులకు సంధి జరిగి యుద్ధము విరమించ బడును. లగ్నస్థానము సప్తమ స్థానములకు నడుమ లగ్నాధిపతి జేరియున్న పృచ్ఛకుని ప్రభువు యుద్ధము నందు చంపబడును.

లగ్నసప్తమాధిపతులు ముసరిఫఃయోగము నందుండి, అందొక గ్రహము అస్తమించి యున్న చాలాకాలము వరకు యుద్ధము విరమించబడదు. మందగమనముగల లగ్నాధిపతియైన శని అధిక గమనము గల చంద్రుని ముందుండి కంబూలయోగము పొందియున్న పృచ్ఛకుని ప్రభువు జయమును గాంచును. లగ్నాధిపతి అస్తమించి యున్నను లేక సప్తమాధిపతి యొక్క నీచక్షేత్రమును జేరి యున్నను లేక సప్తమాధిపతి యున్న స్థానమునకు కేంద్రము నందున్నను, లేక సప్తమస్థానము నందున్న పృచ్ఛకుని ప్రభువు ఓడిపోవుటకు సిద్ధముగా యుండును. ఇందు శత్రువు జయమును పొందు చుండుటచే సప్తమాధిపతి బలవంతుడుగను, లగ్నాధిపతి బలహీనుడై యుండును.

లగ్నమునకు వెనుక శుభగ్రహములును, లగ్నమునకు మందు మందగమన గ్రహములున్న పృచ్ఛకుని ప్రభువు యింకొక గొప్పవాని సహాయము పొందును. లగ్నాధిపతి అష్టమ స్థానము నందుండి అష్టమాధిపతితో ముథషిల యోగము పొంది యున్న పృచ్ఛకుని ప్రభువు యుద్ధము నందు మరణము చెందును. సప్తమాధిపతి ద్వితీయస్థానము నందుండి, ద్వితీయాధిపతితో ముథషిల యోగము పొందిన శత్రువు తరిమి కొట్టబడు వాడగును. లగ్నాధిపతి దశమ స్థానాధిపతితో ముథషిల యోగము పొందిన పృచ్ఛకుని యొక్క ప్రభువు యుద్ధము నందు జయము గాంచును. చతుర్థ సప్తమాధిపతులు కలసియున్న శత్రువులకు విజయము సూచించును.

లగ్న సప్తమాధిపతులు కేంద్ర స్థానముల యందుండి పరస్పర యిధ్యషాల యోగము నందున్న బలగ్రహమునకు సంబంధించిన గ్రహము యొక్క ప్రభువు విజయము గాంచును. ఈ బలగ్రహమే చరరాశి యందున్న మొదట విజయము తరువాత పూర్తిగా ఓటమి గలుగును. లగ్నాధిపతి ద్వాదశ స్థానము

నందున్న వృచ్ఛకుని ప్రభు సైన్యము నష్టముల పాలగును. సప్తమాధిపతి షష్టస్థానము నందున్న శత్రువు యొక్క సైన్యము నష్టముల పాలగును. లగ్నాధిపతి దశమ స్థానమునందున్నను లేక చతుర్థ స్థానాధిపతి సప్తమ స్థానము నందున్న వృచ్ఛకుని ప్రభువు లేక శత్రు సైన్యములకు సహాయము చేకూరును. సైన్య సహకారము యొక్క స్వభావము రవి లేక చంద్రగ్రహముతో ముధషిల యోగము నందున్న గ్రహము యొక్క స్వభావమును బట్టి యుండును. ఇందు గ్రహములు మునరిఫః యోగమును పొందిన సహకారమునకు బదులు హాని సంభవించును.

## 9. నవమ స్థానము

నవమ స్థానము భాగ్యస్థానమనిగూడ అందురు. భాగ్యము, పితృ, గురు, దానము, ధర్మము, ప్రయాణము, యాత్ర, విద్య, వాహనము మొదలగునవి నవమ స్థానమును బట్టి విచారించ వలయును.

వృచ్ఛకుని ప్రశ్న - నేను ప్రయాణము చేయుదునా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి కేంద్రము నందుండి నవమాధిపతితో ముధషిల యోగము పొందియున్నను లేక నవమాధిపతి కేంద్రము నందుండి లగ్నాధిపతితో ముధషిల యోగము పొందినను వృచ్ఛకుడు దూర ప్రయాణము చేయగలడు.

నవమ స్థానము సామాన్యముగా దూరప్రయాణములు, యాత్రప్రదేశములు సూచించును. నవమాధిపతి లగ్నము నందుండి లగ్నాధిపతితో ముధషిల యోగము పొందియున్న దూరప్రయాణము సంభవించును. ఈ గ్రహములకు కోణదృష్టి గలిగి యున్న వృచ్ఛకుడు దూర ప్రయాణము చేయగలడు.

ఉదాహరణమునకు లగ్నస్థానము ధనుస్సురాశియై, నవమ స్థానాధి పతియైన సూర్యుడు లగ్నస్థానమున 2 భాగల యందుండి, లగ్నాధిపతియైన గురుడు నవమస్థానమైన సింహము నందు 9 భాగలలో యున్నాడను కొందము. ఇందు గ్రహములకు కోణదృష్టి ముధషిల యోగము సంభవించుటచే వృచ్ఛకుడు దూర ప్రయాణము చేయగలడు.

లగ్నాధిపతి కేంద్రస్థానము నందుండి తృతీయ స్థానమున పాపగ్రహ వీక్షణములేని గ్రహముతో ముధషిల యోగమును పొందిన వృచ్ఛకునికి యాత్రాసుఖము గలుగును. కేంద్రముల యందు పాపగ్రహములున్న వృచ్ఛకునికి యాత్రాసుఖము గలుగదు. సప్తమస్థానము నందు పాపగ్రహములున్న ప్రయాణము చేయు ఆలోచన తప్పిపోవును. దశమ స్థానము నందు పాపగ్రహములున్న ప్రయాణము కుటుంబ పెద్దల వలననో లేక అధికారుల వలననో తప్పిపోవును.

లగ్న నవమాధిపతులు ముధ్యషిల యోగము నందుండి పాపగ్రహ వీక్షణము గలిగియున్న వృచ్ఛకునికి ప్రయాణము నందు ప్రాణభయము, ధననష్టము గలుగును. లగ్న నవమాధిపతులయొక్క ముధషిల యోగము సప్తమ, అష్టమ స్థానములకు సంబంధించి యున్న వృచ్ఛకునికి ప్రయాణము నందు సంకటనలు గలుగును. పై యోగము లగ్నము నందున్న వృచ్ఛకుని యొక్క ప్రయాణము సౌఖ్యముగా యుండును.

ముథషిల యోగము లగ్న పంచమాధిపతులకు లగ్నము నందైన వృచ్ఛకుని ప్రయాణము సౌఖ్యముగా యుండుటయు, దశమ స్థానము నందైన వృచ్ఛకుని అభిమతము సిద్ధించుటయు, సప్తమ స్థానము నందైన అనుకున్న ప్రదేశము సౌఖ్యముగా జేరుటయు, చతుర్ధ స్థానము నందైన ప్రయాణము యొక్క అభిమతము నెరవేరుటయు గలుగును.

దశమస్థానము నందు శుభగ్రహములున్న వృచ్ఛకునికి ప్రయాణము వలన జయమును, సప్తమ స్థానమున శుభగ్రహములున్న వృచ్ఛకునికి పోయిన ప్రదేశమున సౌఖ్యమును, చుతుర్థ స్థానము నందున్న ప్రయాణ సంతృప్తి గలుగటయు సంభవించును.

పూర్వకాలములో ప్రయాణీకులు దొంగల వలనను, మృగజంతువుల వలనను తటాకములలో నీళ్ళ వల్లను అనేక బాధలు, చిక్కులు పడుచుండెడివారు. కొన్ని స్థానములలో లగ్నాధిపతి లేక చంద్రుడు పాపగ్రహ సంయోగము, పాపగ్రహ వీక్షణము గలవారై యుందురు. అట్టి స్థానము మనుష్య లేక ద్విపాదరాశియై యున్న వృచ్ఛకుడు ప్రయాణము నందు దొంగల వలనను, అవినీతిపరుల వలన కష్టములు పొంద వలసి యుండును. మిధున, కన్య, తులారాశులు ద్విపాద రాశులగును. పై స్థానములు జలరాశులైన కర్కాటకము, వృశ్చికము, మీనములైన వృచ్ఛకునికి చిక్కులు పెద్దచేపలు, తాబేళ్ళు, పాములు లేక సముద్రముపై ప్రయాణము చేయు ఓడ దొంగల వలన గలుగును. పై స్థానములు చతుష్పాద రాశులైన మేష, వృషభములైన భయము, పశువులు, గుర్రములు, గొర్రెలు మొదలగు వాని వలన గలుగును. పై స్థానములు ధనుస్సు, కుంభములైన భయము మొక్కలు మరియు చెట్లు వలన గలుగును. పై స్థానము సింహ రాశియై యున్న భయము అడవి జంతువుల వలన గలుగును.

కాలమాన పరిస్థితులనుబట్టి ఈ అపాయములు మార్పుచెంది యుండుటచే వీనిని మూడు విధములుగా విభజించ వచ్చును. 1. జలము 2. అగ్ని, 3. భూమి. లగ్నాధిపతి కుజునితో కలసి మిధున రాశియందున్న విమాన ప్రయాణము నందు అపాయమును సూచించును. లగ్నాధిపతి కుజునితో కలసి మేషరాశి యందున్న ప్రయాణము చేయుచున్న వాహనమునకు అగ్ని ప్రమాద భయము గలుగును.

వృచ్ఛకుని ప్రశ్న - నా యొక్క ప్రయాణము పట్టణము లేక స్థలమునకు లాభదాయకముగా యుండునా ? అని అడిగినప్పుడు ద్వితీయ స్థానాధిపతి వక్రించి లగ్నము నందున్న తలంచిన ప్రదేశమునకు చేయబడిన ప్రయాణము నిరుప యోగమగును. ద్వితీయాధిపతి శీఘ్రగమనము నందన్న ప్రయాణము నిలకడలేనిదై అంత ఉపయోగకరముగా యుండదు. ద్వితీయాధిపతి నవమ లేక తృతీయ స్థానమును చేరియున్న వృచ్ఛకుడు త్వరలో తన పనిని ముగించుకొని తిరిగి తన స్వగ్రామము చేరగలడు. ద్వితీయాధిపతి లగ్న, దశమ లేక యేకాదశ స్థానము చేరి యున్న వృచ్ఛకునికి వెళ్ళినపని సంపూర్ణముగా సిద్ధించును. ద్వితీయధిపతి పాపగ్రహ సంయోగము తో సప్తమ లేక చతుర్థ స్థానము నందున్న దారిప్రయాణము అనేక నిందలు కష్టములపాలై కార్యహాని గలుగును.

ప్రయాణము నందు జయాపజయములు ద్వితీయ స్థానాధిపతియొక్క బలాబలములను బట్టి చర్చించ వలెను. సాధారణముగా శుభదృష్టి, వీక్షణముగల ద్వితీయాధిపతి లగ్నము నందున్న ప్రయాణము జయప్రదమగును. ద్వితీయాధిపతి దశమ స్థానము నందున్న వృచ్ఛకుడు ప్రయాము నందు జయమును గాంచును. సప్తమ స్థానము నందు శుభగ్రహమున్న ప్రయామము జేసి వెళ్ళిన స్థలములో జయమును సూచించును. చతుర్థస్థానము నందు శుభుడున్న ప్రయాణము నుండి తిరిగి యిల్లు జేరి నప్పుడు జయమును సూచించును. ఈ పై అంశములు అన్నిటి యందు లగ్నము, ద్వితీయధిపతి శుభస్కరమై యుండవలెను.

నవమాధిపతి చరరాశి యందున్న వృచ్ఛకుడు వేగముగా ప్రయాణము జేసి యిల్లు జేరుటయు, చరరాశి యందున్న ఎక్కువ కాలము ప్రయాణము నందుండుటయు ద్విస్వభావ రాశియందున్న దారిమరలించి క్రొత్త స్థలములకు ప్రయాణము జేయుట సూచించును. ద్వితీయాధిపతి షష్టాధిపతి లేక అష్టమాధిపతి వలన గలుగు దుష్ఫలములను బట్టి వృచ్ఛకుడు రోగము లేక కష్టములకు గురి యగుట మొదలగు వానిని చర్చించవచ్చును. అంతిమఫలము చతుర్థస్థానము యొక్క శుభా శుభముల ను బట్టి నిర్ణయించవలెను.

## 10. దశమ స్థానము

రాజ్య, కీర్తి, కర్మ, ఉద్యోగ, కృషి, వ్యాపారము, జీవనము, దత్తపుత్రుడు, రాజసన్మానము, గొప్పవారి స్నేహము, గంగా స్నానము, మానము, ప్రభు దర్శనము, సాధుజన రక్షణము, పరోప కారాదులు, పురాణ శ్రవణాదులు మొదలగు వానిని ప్రశ్నలగ్నమునకు దశమ స్థానమును బట్టి విచారించ వలయును.

లగ్నాధిపతి లేక చంద్రుడు లగ్నము నందుండి శుభదృష్టి పొందుచున్న దశమాధిపతితో ముథషిల యోగము నందున్న వృచ్ఛకుడు ఆస్తి లేక రాజ్యమునకు వారసత్వపు హక్కుదారుడగును. ఈ గ్రహసంయోగము వృచ్ఛకుని యొక్క వృత్తి వ్యాపారము, ఉద్యోగము మొదలగు వాని విషయము నందు గూడ చర్చించ వచ్చును. పైగ్రహ సంయోగము గల్గినపుడు వృచ్ఛకునికి ఉద్యోగము సంక్రమించుట, ఆస్తి, గౌరవము, వృత్తిలో అభివృద్ధి మొదలగునవి గల్గును.

లగ్నదశమాధిపతులు శుభదృష్టి గలిగి పాపగ్రహ సంయోగము లేనివారై పరివర్తన చెందియున్న అప్రయత్నముగా రాజ్యము లేక భూస్థితి సంక్రమించును. దశమాధిపతి లగ్నము నందుండి శుభగ్రహముతో ముథషిల యోగము పొందియున్న పైన ఉదహరించిన సమరూప ఫలములనే పొందును. ఈ గ్రహసంయోగము నందు మంద గమనము గల గ్రహము బలహీనమై పాపగ్రహ వీక్షణము లేక పాపగ్రహ సంయోగము చెందియున్న వృచ్ఛకుడు పై ఫలములను పొందజాలడు.

ఉదాహరణకు కుజుడు దశమాధిపతియై బుధునితో ముథషిల యోగము నందున్నట్లు గ్రహించుము. కుజుడు మందగమనము గల గ్రహము. ఈ కుజ గ్రహము రవి, శని లేక రాహువుతో కలసియున్నను శుభయోగము బలహీనమై వృచ్ఛకుడు ఉద్యోగవృద్ధి, ఆస్తి, భూస్థితి, వ్యాపార లాభము పొందుటలో విఫలుడగును. మందగమనము గల గ్రహము శక్తివంతముగా చతుర్థ స్థానమున

ముధషిల యోగమునకు (90 భాగల దృష్టిలో) విరుద్ధముగా యున్న వృచ్ఛకుని గౌరవమునకు భంగము గల్గును. అట్లుగాక పైగ్రహము అనుకూలమైన ముధషిల యోగము (మూల త్రికోణము) నందుండి, పాపగ్రహ సంయోగము గాని లేక పాపగ్రహ వీక్షణము గాని పొందకున్న వృచ్ఛకుడు పేరు ప్రతిష్ట సంపాదించు వాడగును. చంద్రుడు బలహీనుడై మందగమనము గల గ్రహము శక్తివంతమైయున్న వృచ్ఛకుడు అనేక ప్రదేశములు సంచరించిన వెనుక రాజ్యమును సంపాదించును. లగ్నాధిపతి లగ్నము నందుండి కుజుడు ఉచ్చస్తుడై యున్న వృచ్ఛకుడు భూస్తితి లేక ఆస్తిని సంపాదించును. చతుర్ధ స్థానము పాపులచే వీక్షింప బడుచున్న వృచ్ఛకుని ప్రతిష్టకు భంగము గలుగును. చతుర్థస్థానము శుభులచే వీక్షింప బడుచున్న వృచ్ఛకునికి గౌరవ మర్యాదలు పెరుగును.

మందగమనము గల గ్రహము శక్తివంతముగా చతుర్థ స్థానము నందుండి సప్తమ, లగ్న లేక దశమ స్థానము నందున్న గ్రహముతో ముధషిలయోగము పొందిన విరుద్ధ ఫలములు గలుగును. చుతుర్థ స్థానమున పైన చెప్పబడిన గ్రహము అష్టమ, ఏకాదశ స్థానముల యందున్న గ్రహములతో ముధషిల యోగము పొందిన అనుకూల ఫలములు గల్గును.

లగ్న, దశమాధిపతులు కేంద్రము నందున్న చంద్రునితో ముధషిల యోగము పొంది కంబూల యోగము నందున్న వృచ్ఛకునికి రాజ్యము సంక్రమించును. ఇందు చంద్రుడు స్వరాశి యందున్న విశాలమగు రాజ్యమును సంపాదించును. ఇందు లగ్నాధిపతి, భావమును సూచించు దశమాధిపతి ముధషిల యోగము నందుండగా చంద్రుడు గూడ ఈ రెండు గ్రహములతో ముధషిల యోగము పొంది యుండుటచే కంబూల యోగ్యమైనది. ప్రస్తుత కాలములో ఈ యోగము నందు వృచ్ఛకునికి ప్రతిష్ట అధికారము, ఆస్తి మొదలగునవి సంక్రమించును.

లగ్నాధిపతియున్న రాశినాధుడు దుస్థానములయందున్న తలంచిన కార్యము నెరవేరుక పోవుటయు, కార్యభంగము గలుగుటయు మొదలగునవి సంభవించును. లగ్నాధిపతి అస్తమించి యున్న వృచ్ఛకుడు కష్టముల పాలగును. షష్ట, అష్టమ, ద్వాదశ స్థానములు దస్థానములై యున్నవి. లగ్నాధిపతియున్న రాశినాధుడు 6-8-12 స్థానముల యందుండి కేంద్ర 90° దృష్టితో యింకొక గ్రహముతో వీక్షింప బడుచున్న కార్యభంగము గల్గుటయేగాక తగవులు, అపార్థములు గలుగుచుండును. లగ్నాధిపతి బలహీనుడై పాపగ్రహ వీక్షణముగాని, సంయోగము గాని చెందియున్న భూస్థితి, ఆస్తి లేక రాజ్యము నశించును. ఇందు గ్రహములు అంబూల యోగము నందుండి, యోగకారక గ్రహము పాపగ్రహ దృష్టి లేక పాపగ్రహ సంయోగము చెందియున్న వృచ్ఛకుడు అధికారము నుండి పతనమగును.

లగ్నాధిపతియున్న రాశినాధుడు దుస్థానములైన 6-8-12 స్థానముల యందుండి 90° భాగల యందున్న యింకొక గ్రహముతో వీక్షించబడుచట అనగా ఈ గ్రహము షష్ట, అష్టమ లేక ద్వాదశ స్థానములకు 10వ స్థానమున యుండ వలయును. అట్లున్న అపజయము, తగవులు మొదలగు దుష్ఫలములు గలుగును.

వృచ్ఛకుని ప్రశ్న - నాకు జరిగిన సమావేశ పరీక్షలో నాకు ఉద్యోగము సంక్రమించునా ? అని అడిగినప్పుడు పై ప్రశ్న లగ్నచక్రములో లగ్నాధిపతియైన శుక్రుడు మీనరాశి యందున్నాడు. ఈ మీన రాశ్యాధిపతియైన గురుడు లగ్నమునకు దుస్థానమైన ద్వాదశ స్థానము నందున్నాడు. చంద్రుడు గురునకు దశమ స్థానము నందుండి కేంద్ర దృష్టి అనగా 90 భాగల దృష్టిగల్గి గురుని వీక్షించు చున్నాడు. ఇందు వృచ్ఛకునికి అపజయము గలిగి తనకు జరిగిన సమావేశ పరీక్షలో ఉద్యోగము పొందజాలడు.

| | | | |
|---|---|---|---|
| శ -28<br>రా -11<br>శు -7 | | | చ -29 |
| | ప్రశ్న లగ్నము | | |
| ర -20<br>బు -14 | | | |
| | | కు -26<br>ల -11 | కే -11<br>గు -14 |

వృచ్ఛకుని ప్రశ్న - నేను రాజ్యము లేక అధికారము సంపాదించుటకు అవకాశము గలదా? అని అడిగినప్పుడు లగ్నము స్వయంకృషిని సూచించను. సప్తమ స్థానము గృహము వద్ద ప్రయత్నములు. దశమ స్థానుము రాజ్యము లేక అధికారము వలన ప్రయోజనములు. చతుర్థ స్థానము స్నేహితుల వల్ల సహాయము. ద్వితీయ స్థానము ఆర్థిక సహాయమును. తృతీయ స్థానము తన వద్దనున్న నౌకర్ల సహాయము. షష్టస్థానము శత్రువుల మనస్సును సూచించును. ఈ స్థానముల యందు శుభ గ్రహములున్నను లేక వాని సంయోగము గాని వీక్షణముగాని పొందియున్న ఈ గ్రహములు సూచించు సుఫలములను పొందగల్గును. అట్లుగాక ఆ స్థానముల యందు పాపగ్రహములున్నను, పాపగ్రహ సంయోగము గాని లేక వీక్షణము గాని గల్గియున్న వృచ్ఛకుడు అశుభఫలములను పొందును. ద్వితీయాధిపతి కుజుడై నీచస్థానము నందున్న వృచ్ఛకుడు తన ప్రయత్నము సఫలమగుటకు భార్యలపై ధనమును వెచ్చించును.

పైన ఉదహరించిన గ్రహసంయోగములు ముఖ్యమైనవి అధికారములు, ఉద్యోగములు, వృత్తి మొదలగు వాని ప్రశ్నలకు జవాబులు చెప్పునపుడు వుపకరించును.

ద్వితీయధిపతి గురుడు, శుక్రుడు లేక బుధుడైనను, నవమ, ఏకాదశ లేక షష్ట స్థానము నందున్న వృచ్ఛకుడు నిధులను గురువులకు సహాయము చేయుట యందును, కామసుఖమునకును, వర్తక వాణిజ్యములకు వెచ్చించ బడును. చంద్రుడు యిధ్యషాల యోగమును పొందియున్న వృచ్ఛకుడు నిధులను వెచ్చించుటలో ఔదార్యముగా యుండును.

లగ్నాధిపతి బలహీనుడై పాపగ్రహ వీక్షణముగాని పాపగ్రహ సంయోగము గాని పొందియున్న వృచ్ఛకుని రాజ్యము పతనమగును. గ్రహములు కంబూల యోగము నందుండి యోగమునకు కారకుడైన గ్రహము పాపగ్రహ సంయోగము గాని లేక పాపగ్రహ వీక్షణముగాని పొందియున్న వృచ్ఛకుడు అధికారము నుండి పతనమగును.

వృచ్ఛకుని ప్రశ్న - ప్రభువు మంత్రికి స్నేహభావము గలదా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతి, సప్తమాధిపతి యిధ్యషాల యోగము పొందియున్న ప్రభువు, మంత్రి సఖ్యత గలిగి యుందురు.

లగ్నము ప్రభువు, అధ్యక్షుడు, లేక రాష్ట్రమునకు అధికారిని సూచించును. సప్తమ స్థానము మంత్రిని సూచించును. లగ్నచక్రములో లగ్నము, సప్తమ స్థానము యితర గ్రహసంయోగము వలన యిధ్యషాల యోగము నందుండి కంబూల యోగము పొందిన ప్రభువు, మంత్రి స్నేహభావము గలిగియుందురు.

| | | | |
|---|---|---|---|
| | కు -22 | | |
| చ -21 | లగ్న | | |
| | చక్రము | | |
| | | శు -18<br>ల | |

ముథషిల యోగము గాని, కంబూల యోగము గాని రాశ్యాధిపతుల వలన గలుగ వలెనేగాని స్థానముల వలన గలువ వని కొందరు జెప్పుచున్నారు.

తులాలగ్నము ప్రభువుగ నుండి లగ్నాధిపతి శుక్రుడు 18 భాగల యందున్నాడు. మంత్రియైన సప్తమాధిపతి కుజుడు మేషములో స్వక్షేత్రమును పొంది 22 భాగలయందున్నాడు. లగ్నాధిపతియు, సప్తమాధిపతియును యిధ్యషిల యోగము నందున్నారు. చంద్రుడు ఈ రెండు గ్రహములతో యిధ్యషిల యోగమును పొంది యుండుటచే కంబూల యోగము గల్గుచున్నది. దీనియొక్క ఫలము ప్రభువు, మంత్రి స్నేహభావము గల్గి సఖ్యతగా యుండెదరు.

వృచ్ఛకుని ప్రశ్న - ప్రభువు రాజ్యమును శాశ్వతముగా పాలించగలడా ? అని అడిగినప్పుడు లగ్న దశమాధిపతులలో మందగమనము గల గ్రహము కేంద్రము నందున్న ప్రభువు రాజ్యమును శాశ్వతముగా పాలించును. అట్లుగాకున్న పాలన తాత్కాలికముగా యుండును. కంబూల యోగమున గ్రహములుండి, అందు మందగమనము గల గ్రహము వక్రించి చతుర్థ స్థానము నందున్న వృచ్ఛకుని రాజ్యము తాత్కాలికముగా కొంత కాలము పరాధీనమై మరల తొందరలో తనకు సంక్రమించును. గ్రహములు ముషరిఫః యోగమును పొందిన రాజ్యము పరాధీనమై నష్టము శాశ్వతముగా యుండును.

## 11. ఏకాదశ స్థానము

లాభము, జయము, వృష్టము, విద్య, ధనము, దేవపూజ, ఆయువు, నష్టద్రవ్యము, దుర్లాభము, జ్యేష్టసోదరుడు, పినతండ్రి, పెదతండ్రులు, వాహనములు, పాత్రలు, పడక, బంగారము, కన్యకలు మొదలగునవి ఏకాదశ స్థానమును బట్టి విచారింప వలయును.

వృచ్ఛకుని ప్రశ్న - ప్రభువు నన్ను ఆదరించునా ? అని అడిగినప్పుడు లగ్న ఏకాదశ స్థానాధిపతులు స్నేహభావము నందుండి ముథషిల యోగము పొందియున్న వృచ్ఛకుడు ప్రభువు లేక అధికారిచే గౌరవించ బడును. వారివురు శత్రుభావము నందున్న ప్రభువు లేక అధికారిచే ఆదరణ ఆలస్యముగా జరుగును.కేంద్ర స్థానము నందున్న చంద్రునితో యేకాదశ స్థానాధిపతి కంబూల యోగము పొందిన వృచ్ఛకుడు తొందరలో ప్రభువు ఆదరణ పొందగలడు. ఏకాదశ స్థానాధిపతి కేంద్రము నందు చంద్రునితో కంబూల యోగము పొందిన పృచ్ఛకుడు ఆదరణ పొందుట లేక మనస్సు నందు సంకల్పించిన పని కార్యరూపము దాల్చుట లేక అనుకున్న స్నేహము పరిపూర్తి జెందుట, లేక ఆశ పెట్టుకున్న వస్తువు సంక్రమించుట మొదలగునవి గలుగును. పై కేంద్ర స్థానము చరరాశియై యున్న ప్రభు ఆదరణ లేక పొందిన స్నేహము, మొదలగునవి తాత్కాలికముగా యుండును. అదే స్థిరరాశియైయున్న ఫలము శాశ్విత రూపము దాల్చి సౌఖ్యము పొంద గలుగును. అదే ద్విస్వభావరాశియై యున్న కాలమును బట్టి ఫలస్వభావము మార్పు చెందును.

రెండు గ్రహములు యిథ్యసీల లేక ముథషిల యోగము నందుండి ఆ రెండు గ్రహములు కలసియున్నను, లేక కోణము నందున్నను లేక సప్తమ, దశమ లేక చతుర్థ స్థానము నందున్న వాని దృష్టిని బట్టి ఫలనిరూపణ జేయవలెను. గ్రహములు కలసియున్నను చతుర్థ, సప్తమదృష్టి విరుద్ధ రూపము దాల్చును. త్రికోణదృష్టి అనుకూలముగా యుండును. శీఘ్రగనమనము గల గ్రహము, మంద గమనము గల గ్రహమునకు వెనుక భాగము నందుండి వీక్షించుచున్న వాని వీక్షణ యొక్క స్వభావమును బట్టి భవిష్యత్తులో అనుకూల ప్రతికూల ఫలములు గలుగును.

| | | | |
|---|---|---|---|
| | | శ -14 | |
| | ప్రశ్న | | చ - 8 |
| ల -15 | లగ్నము | | |
| | | | కు -12 |

పై ప్రశ్న లగ్నచక్రములో లగ్నాధిపతియైన శని వృషభములో 14 భాగల యందును, ఏకాదశ స్థానాధిపతియైన కుజుడు కన్యలో 12 భాగలయందును యున్నారు. ఈ యిరువురు అధిపతులు అనుకూలమైన ముథషిల యోగము

నందున్నారు. అయితే చంద్రుడు యేకాదశ స్థానాధిపతియైన కుజునితో యిధ్యషాల యోగము పొందినను కుజుడున్న స్థానము చరరాశియైనది. కాబట్టి వృచ్ఛకుడు పొందిన ఆదరణ యెక్కువ కాలము యుండదు. చర, స్థిర, ద్విస్వభావరాశులు యేకాదశ స్థానమునకు సంబంధించినవే గాని చంద్రునకు సంబంధించినవి కావు.

రెండు గ్రహములైన లగ్నాధిపతియు, మందగమనము గల కార్యాధిపతియు, వీరిలో కార్యాధిపతి పాపగ్రహ సంయోగము, లేక పాపగ్రహ వీక్షణము పొందియున్న వృచ్ఛకుని వాంఛ సఫలమగునట్లు భ్రాంతి కలిగించునేగాని తుట్టతుదకు విఫలమగును. ఈ గ్రహమే శుభ సంయోగము, వీక్షణము పొందియున్న వృచ్ఛకుని వాంఛ ఫలించును.

లగ్నము వృచ్ఛకునిగను, యేకాదశ స్థానాధిపతి స్నేహితులను సూచించును.

వృచ్ఛకుని ప్రశ్న - నేను తలంచిన పురుషుడు నాకు స్నేహితుడుగా యుండునా ? అని అడిగినప్పుడు లగ్నాధిపతియు, యేకాదశ స్థానాధిపతియు అనుకూలమైన సుధషిల యోగము నందుండి యొకరికొకరు 3-5-8-11 స్థానముల యందున్న వృచ్ఛకుడు తలంచిన పురుషుడు తనతో యెక్కువ స్నేహభావముగా యుండును. పై అధిపతులే యొకరి కొకరు కేంద్రముల యందును, పణపరము లందున్న పై ఫలములనేపొంద గల్గును. వారు 3 - 6 - 9 - 12 ఆపోక్లీబములైన స్థానముల యందున్న గొప్ప స్నేహభావము గలిగి యుందురు. పణపరములనగా 2-5-8-11 స్థానములు.

ఉదాహరణకు యిద్దరు అధిపతులతో చంద్రుడు కర్కాటకములో 10 భాగల యందును, శుక్రుడు వృషభములో 15 భాగల యందున్నారను కొందము. ఇందు స్నేహభావము గల ముధషిల యోగము ప్రాప్తించినది. దీనివలన యిద్దరు మంచి స్నేహభవము నందుండి యొకరి యింటికి మరియొకరు వచ్చుచు పరస్పర అన్యోన్య స్నేహితులై యుందురు.

వృచ్ఛకుని ప్రశ్న - నేను నా యొక్క రహస్య పధకములో జయించ గలనా? అని అడిగినప్పుడు లగ్నాధిపతియును, చంద్రుడు అనుకూలమైన ముధషిల యోగములో కేంద్రము లేక పణపరము నందున్న వృచ్ఛకుని యొక్క వాంఛ నెరవేరును. ఈ ముధషిల యోగము ఆపోక్లీబ స్థానములైన 3-6-9-12 స్థానములకు సంబంధించియున్న వృచ్ఛకుని యొక్క పధకము లేక వాంఛ నెరవేరదు.

లగ్నాధిపతి యేకాదశస్థానము నందున్నను, లేక యేకాదశ స్థానాధిపతి లగ్నమునందుండి, యేకాదశ స్థానాధిపతియు, చంద్రుడు పరస్పర శుభదృష్టి యందున్నను, లేక యేకాదశ స్థానాధిపతి కోణము నందు లేక పణపరము నందుండి కంబూల యోగమును కలిసియున్న వృచ్ఛకునికి జయము గలుగును.

ద్వాదశ స్థానాధిపతి యేకాదశ స్థానము నందుండినను లేక యేకాదశ స్థానాధిపతిని క్రూరదృష్టితో పాపగ్రహములు వీక్షించుచున్న శత్రువు గూఢచారిగా యుండి వృచ్ఛకునితో స్నేహము చేయుచుండును.

గురు శుక్రులు తృతీయ స్థానము నందును లేక ద్వితీయ స్థానము నందున్న ప్రవాసితుడు త్వరలో తిరిగి రాగలడు. వీరిరువురు చతుర్థ స్థానము నందున్న ప్రవాసితుడు తన పని పూర్తిగావించుకొని యిల్లు జేరును. చంద్రుడు సప్తమ స్థానము నందున్నను లేక సప్తమ స్థానాధిపతి సప్తమ స్థానము యొక్క రెండవ అర్ధభాగము నందున్నను అనగా రెండవ హోరయందున్న ప్రవాసితుడు తిరుగుముఖమై దారిమధ్యము నందుండును. రవి, బుధ, గురు, శుక్రులలో నెవరైనను చతుర్థ లేక ఏకాదశ స్థానము నందున్న ప్రవాసితుడు తిరిగి రాగలడు. వీరిలో నెవరైనా ద్వాదశ స్థానము నందున్న ప్రవాసితుడు తిరిగి రాగలడు.

పాపగ్రహములు చతుర్థ దశమ స్థానముల యందున్న దేశాంతరము పోయిన వ్యక్తి తిరిగి రాగలడు. అదే స్థానములను శుభగ్రహమలు ఆక్రమించియున్న పోయిన వ్యక్తి తిరిగి రాజాలడు. లగ్నస్థానము నుండిగాని, లగ్నాధిపతియున్న స్థానము నుండి గాని నవమ లేక ద్వాదశ స్థానములందు యెన్ని పాపగ్రహము లుండునో ప్రవాసితుడు అన్నికష్టములను పొందగలడు. అదే స్థానములందు యెన్ని శుభ గ్రహములుండునో ప్రవాసితుడు అన్ని శుభఫలములను పొందగలడు. లగ్నాధిపతి లగ్నమును వీక్షింపక ద్వితీయ లేక అష్టమ స్థానముల యందుండి, షష్ట, సప్తమ స్థానము నందున్న గ్రహముతో ముధషిల యోగము నందున్న ప్రవాసితుడు తిరిగి రాడు.

తృతీయ స్థానమున పాపగ్రహములు జేరియున్న ప్రవాసితుడు సంచారము నందున్నట్లు గ్రహించ వలెను. కేంద్ర స్థానముల యందు పాపగ్రహములున్న అతని వద్దనున్న ధనము దొంగిలించ బడును. పాపక్షేత్రమైన కేంద్రము నందుగాని లేక కోణము నందుగాని శని జేరియుండి పాపగ్రహములచే వీక్షించ బడుచున్న పోయిన వ్యక్తి యితరులచే బంధింపబడినట్లు గ్రహించ వలెను. స్థిరలగ్నమై యున్న ప్రవాసితుడు స్థిరముగా బంధించబడి యుండుటయు, చరలగ్నమైన కొంత కాలము వరకు బంధించబడి యుండుటయు, ద్విస్వభావ లగ్నమైన ప్రవాసితుని బంధించ బడి విడువబడుటయు సంభవించును.

పాపగ్రహములు సప్తమ స్థానము నందుగాని లేక కోణముల యందుగాని యుండి లగ్నము పృష్టోదయ రాశియై పాపగ్రహములచే వీక్షించ బడుచున్న ప్రవాసితుడు చిక్కులు, కష్టముల యందున్నట్లు గ్రహించ వలెను. చంద్రునకు యిరు పార్శ్వములందు గ్రహములున్నపుడు దుర్ధర యోగమగును. ఈ యోగము యొక్క శుభాశుభములు చంద్రునకు యిరుప్రక్కల యందుగల శుభపాప గ్రహములను బట్టి గలుగును. చంద్రునకు యిరపార్శ్వము లందు శుభగ్రహము లున్న ప్రవాసితుడు సుఖమును పొందును. పాపులున్న శత్రువుల చేతను దొంగల చేతను కష్టముల పాలై యెచ్చటకు పోయి యుండునో అచ్చటనే యుండును. లగ్నము స్థిరరాశియై యున్న పోయిన వ్యక్తి పోయిన స్థలము నందే యుండును. శరీర జాడ్యము శమించదు. పోయిన ధనము మరల రాదు. నష్టఫలములు గలుగును. లగ్నము చరరాశియైయున్న పై అంశములు విరుద్ధముగా యుండును. లగ్నము ద్విస్వభావ రాశియైన మొదటి సగభాగ మందు స్థిరమువలెను రెండవ అర్ధభాగమున చరమువలె నుండును.

వృచ్ఛకుని ప్రశ్న - దేశాంతరము పోయిన వ్యక్తి చనిపోయినాడా? జీవించి యున్నాడా ? అని అడిగినప్పుడు లగ్నస్థానము పృష్టోదయ రాశియై శుభగ్రహ సంయోగము గాని వీక్షణము గాని లేనిదై పాపగ్రహములతో వీక్షించ బడుచుండి, షష్టస్థానమున బుధుడు పాపులతో కలసియున్న దేశాంతరము పోయిన వ్యక్తి చనిపోయినట్లు గ్రహించ వలెను. శుభగ్రహములు బలహీనులై 6-8-12 స్థానముల యందెందైనా యుండి పాపులతో వీక్షించ బడుచున్నను, లేక సూర్యచంద్రులు పాపగ్రహ సంబంధము గలిగి యున్నను ప్రవాసితుడు చనిపోయినట్లు గ్రహించ వలెను. లగ్నస్థానము పృష్టోదయ రాశియై పాపగ్రహములతో చేరియుండి, శుభగ్రహ సంబంధము లేని పాపగ్రహములు కేంద్రకోణముల యందున్నను లేక షష్టస్థానమును శుభగ్రహములు వీక్షింపకున్నను, ప్రవాసితుడు చనిపోయనట్లు గ్రహించ వలెను. నవమ స్థానమున రవియున్న ప్రవాసితుడు జబ్బుస్థితి యందున్నాడని చెప్పవలెను.

ప్రశ్న జేయబడిన లగ్నమునందు బుధ, చంద్ర, కేతువులున్న ప్రవాసితుడు మార్గమధ్యమందు న్నాడనియు, గురు శుక్రులున్న సమీపమునకు వచ్చియున్నాడనియు రవి కుజులున్న యధాస్థానము నందున్నాడనియు, శని రాహువులున్న వ్యాధి పీడితుడని చెప్పవలెను.

వృచ్ఛకుని ప్రశ్న - ప్రవాసితుడు జీవించి యున్న యెప్పుడు తిరిగి రాగలడు ? అని అడిగినప్పుడు లగ్నము నుండి బలమైన గ్రహమున్న స్థానము వరకు అనగా లగ్నరాశిని వదలి గ్రహమున్న రాశివరకు యెన్ని రాశులుండునో లెక్కించి అన్ని నెలలలో ప్రవాసితుడు తిరిగి రాగలడని చెప్పవచ్చును. ఈ గ్రహించబడిన కాలప్రమాణము బలగ్రహమున్న రాశి చరరాశియై యున్నపుడే సరిపోవును. బలమైన గ్రహము స్థిరరాశి యందున్నపుడు పైన సూచించిన కాలప్రమాణము రెండుచే హెచ్చించి ప్రవాసితుడు అన్ని నెలలలో తిరిగి రాగలడని చెప్పవలెను. బలగ్రహము ద్విస్వభావరాశి యందున్న చరరాశి కాలప్రమాణమును మూడుచే హెచ్చించి ప్రవాసితుడు అన్ని నెలలో తిరిగి రాగలడని చెప్పవలెను.

ఉ।। ప్రశ్న లగ్నము ధనుస్సు రాశియై బలమైన గ్రహము చంద్రుడై యుండి కర్కాటకరాశి యందున్నట్లు గ్రహించుము. లగ్నరాశిని వదలి కర్కాటకరాశి వరకు లెక్కించగా 7రాశులైనవి. కర్కాటకము చరరాశి యగుటచే ప్రవాసితుడు 7 నెలలలో తిరిగి రాగలడని చెప్పవలెను. బలమైన గ్రహము స్థిరరాశియైన వృషభము నందున్న లగ్నరాశి ధనుస్సును వదలి వృషభము వరకు లెక్కించగా 5 రాశులైనవి. కాబట్టి 5×2=10 నెలలలో ప్రవాసితుడు తిరిగి రాగలడని చెప్పవలెను. బలమైన గ్రహము ద్విస్వభావరాశియైన మిధున మందున్న లగ్నరాశి ధనుస్సును వదలి మిధునము వరకు లెక్కించగా 6 రాశులైనవి. కాబట్టి 6×3=18 నెలలలో ప్రవాసితుడు తిరిగి రాగలడని చెప్పవలెను.

ఇంకొక పద్దతిలో సప్తమ స్థానాధిపతి వక్రించు కాలమునకు ప్రవాసితుడు తిరిగి రాగలడు. ఇది పై పద్ధతికి సరిపోవు చున్నది.

ఉ॥ ప్రశ్నకాలమునకు సప్తమ స్థానాధిపతి కుజుడై వాని వక్రారంభము 30 దినములతో ప్రారంభించ గలదని పంచాంగమును బట్టి గ్రహించ గలిగితిమి. సప్తమ స్థానాధిపతియైన కుజుడు చరరాశి యందున్న ప్రవాసితుడు 30 దినములలో తిరిగి రాగలడని చెప్పవలెను. అదే కుజుడు స్థిరరాశి యందున్న (30×2)=60 దినములలో ప్రవాసితుడు తిరిగి రాగలడనియు, అదే కుజుడు ద్విస్వభావ రాశి యందున్న (30×3=90) దినములలో ప్రవాసితుడు తిరిగి రాగలడని చెప్పవలెను.

మరియొక పద్దతిలో వృచ్ఛకచేయబడిన సమయమునకు లగ్నము గట్టి ఆ లగ్నమునకు ఫలము ఈ క్రింది విధమగా జెప్పవలయును.

మేషయైన 10 దినములు, వృషభమైన 14 దినములు, మిధనమైన 1 మాసము, కర్కాటకమైన 100 దినములు, సింహమైన 20 దినములు, కన్యయైన 3 మాసములు, తులయైన 7 మాసములు, వృశ్చికమైన 7 మాసములు, ధనుస్సు యైన 105 దినములు, మకరమైన 7 మాసములు, కుంభమైన 20 దినములు, మీనమైన శీఘ్రముగా యిల్లుజేరునని చెప్పవలెను.

## వ్యాధి ప్రశ్నలు

షష్టస్థానాధిపతి లగ్నము నందుండి చంద్రుడు పాపగ్రహములచే వీక్షించబడుచున్న వృచ్ఛకుడు తన్ను పీడించుచున్న వ్యాధితో తప్పక మృతి చెందును. షష్టస్థానాధిపతి లేక పాపగ్రహములు లగ్నము నందుండి చంద్రుని వీక్షించుచున్న వృచ్ఛకుడు తప్పక మరణము చెందును, చతుర్ధ లేక అష్టమ స్థానము నందు చంద్రుడుండి, వాని యిరుపార్శ్వములందు పాపగ్రహములున్న రోగి రోగముతో చనిపోవును. చంద్రుడు బలవంతుడై శుభలచే వీక్షించబడుచున్న వృచ్ఛకుడు రోగము నుండి విముక్తి చెందును. చంద్రుడు లగ్నము నందుండి సప్తమస్థానమున సూర్యుడున్న వృచ్ఛకుడు రోగముతో మృతిచెందును. లగ్నము నందు పాపగ్రహములున్న వైద్యుని చికిత్స వలన రోగము క్లిష్టపరిస్థితి యందుండును.

షష్టస్థానమున చంద్రుడుండి పాపగ్రహా వీక్షణముగాని, పాపగ్రహ సంయోగము గాని పొందియున్న పృచ్ఛకుని రోగము శమించదు. లగ్నాధిపతి చంద్రుడు అష్టమస్థానమున పాపగ్రహ వీక్షణము పాపగ్రహ సంయోగము చెంది యున్న రోగి ఆరోగ్యము పొందుట అనుమానాస్పదముగా యుండును. పౌర్ణమి రోజున సూర్యాస్తమయమైన వెనుక పృచ్ఛకుడు రోగి ఆరోగ్య విషయము ప్రశ్నించునపుడు రోగి మృతినొందునని చెప్పవలెను.

లగ్నము నందు పాపగ్రహములున్న వైద్యులు రోగమునకు క్లిష్టతరము చేయుదురు. లగ్నము నందు శుభగ్రహములున్న వైద్యులయొక్క రోగనిర్ణయము సక్రమముగా యుండును. లగ్నము వైద్యుని సూచించును. సప్తమ స్థానము రోగస్వభావమును, దశమ స్థానము రోగిని, చతుర్ధ స్థానము చికిత్సను సూచించును.

లగ్న దశమాధిపతులు స్నేహభావము గలిగియున్న చికిత్స సక్రమమైనదై రోగము విముక్తి చెందును. అట్లుగాకున్న రోగము వుపశమించదు. లగ్నాధిపతి శుభుడై కేంద్రమున యుచ్ఛస్తుడై యున్నను లేక మూల త్రికోణము నందున్న రోగి

తప్పక ఆరోగ్యమును పొందును. ఒకే శుభగ్రహము శక్తివంతమై లగ్నము నందున్న రోగిని రక్షించును. శుభగ్రహములు తృతీయ, షష్ట, భాగ్య, లాభస్థానముల యందున్న రోగము వుపశమించును.

## ఉద్యోగ ప్రశ్నలు

తాజక సిద్ధాంతరీత్యా తృతీయ, నవమ స్థానములు ఉద్యోగము నందు మార్పు, స్థానచలనము మొదలగు వానిని సూచించును. లగ్నాధిపతి వక్రించి యుండి, తృతీయ లేక నవమాదిపతులతో యిధ్యషాల యోగమును పొందిన వృచ్ఛకునికి ఉద్యోగము నందు మార్పు గలుగును.

లగ్నాధిపతి లగ్న, చతుర్ధ, సప్తమ లేక దశమ స్థానము నందుండి, షష్ట లేక ద్వాదశ స్థానాధిపతులతో యిధ్యషాల యోగము పొందకున్నను లేక లగ్నాధిపతి లగ్న, చతుర్ధ, సప్తమ లేక దశమ స్థానము నందుండి, పాపగ్రహములచే వీక్షించబడిన వృచ్ఛకుడు ఉద్యోగము నందు మార్పు చెందుటగాని, యింకొక యాజమాన్యము నందు ఉద్యోగము కొరకు ప్రయత్నించుట గాని సంభవించును.

లగ్నాధిపతి చంద్రునితో కంబూల యోగము నందున్న ఇప్పుడున్న ఉద్యోగములో వృచ్ఛకుని స్వప్రయోజనములు కాపాడబడును. సప్తమాధిపతి చంద్రుడు కంబూల యోగము నందున్న వృచ్ఛకుడు క్రొత్త యజమాని వద్ద ఉద్యోగము చేయుట శ్రేయస్కరము. సప్తమ స్థానాధిపతి స్వక్షేత్రము నందుగాని లేక ఉచ్ఛక్షేత్రము నందుగాని యుండి కేంద్రగతుడై శుభగ్రహ వీక్షణముగాని, శుభగ్రహ సంయోగము గాని పొంది చంద్రునిలో యిధ్యషాల యోగము పొందియున్న క్రొత్త యాజమాన్యము నందు ఉద్యోగములో అధిక సుఫలములను పొందగలడు.

లగ్నాధిపతి కేంద్రస్థానమును పొంది యుచ్చస్తుడై గాని లేక స్వక్షేత్రగతుడై గానియుండి, పాపగ్రహ సంయోగమును పొంది పాపగ్రహ వీక్షణముగాని లేనివాడై చంద్రునితో ఇధ్యషాల యోగమును పొందియున్న వృచ్ఛకుడు ప్రస్తుతము తానున్న ఉద్యోగము నందు అభివృద్ధి చెందువాడగును.

లగ్నాధిపతి కేంద్రస్థానము నందుండి షష్ట లేక ద్వాదశ స్థానాధిపతులతో ఇధ్యషాల యోగము పొందియున్న వృచ్ఛకుడు క్రొత్త యజమాన్యములో ఉద్యోగము నందు లాభము పొందగలడు. పై గ్రహసంయోగము విరుద్దముగా యున్న క్రొత్త ఉద్యోగములో లాభము పొందజాలడు.

లగ్నాధిపతి చరరాశి యందున్న వృచ్ఛకునికి స్థానచలనము గల్గి యజమాన్యము మార్పు చెందును. లగ్నము శీర్షోదయ రాశియై శుభగ్రహములతో గూడియుండి లేక వీక్షింపబడుచుండి 2-7-8 స్థానములందు శుభులును. 3-6-11 స్థానముల యందు పాపగ్రహములు జేరియున్న వృచ్ఛకుడు యజమానితో ఉద్యోగము నందు స్నేహభావము గలిగి లాభమును పొందుచుండును. శీర్షోదయ రాశులనగా మిధనము, సింహము, కన్య, తుల, వృశ్చిక, కుంభములగును. పై గ్రహ సంయోగములో పాపగ్రహములు లగ్న, ద్వితీయ, సప్తమ లేక అష్టమ స్థానములను జేరియున్న వృచ్ఛకుడు ఉద్యోగము నందు యజమాని వలన కష్టనష్టములు, మతిభ్రమ, దుఃఖములను పొందును.

ఉద్యోగ విషయములో తృతీయ, షష్ట, దశమ స్థానములను వాని స్థానాధిపతులను చర్చించ వలెను. లగ్నాధిపతి తృతీయ లేక షష్టస్థానముల యందున్న పృచ్ఛకుడు ఉద్యోగము చేయువాడుగా యుండును తృతీయ లేక షష్ట స్థానాధిపతులు, దశమ లేక ఏకాదశ స్థానముల యందున్న పృచ్ఛకుడు ఉద్యోదము వలన లాభము పొందును. లగ్నము వృశ్చికరాశిగా యున్నను లేక చంద్రుడు వృశ్చిక రాశి యందున్నను పృచ్ఛకుడు ఉద్యోగముతో జీవించువాడుగా యుండును. భాగ్య, దశమ స్థానములును, భాగ్య, దశమాధిపతులును శక్తివంతమై యున్న పృచ్ఛకుడు మంచి అధికారమును పొందును. రాజకీయమైన అధికారమునకు సూర్యుడు గూడ బలము గలవాడై యుండ వలెను. ప్రజాప్రతినిధి అనగా ప్రజలతో యెలక్షన్‌లో యెన్నుకొనబడు వాడుగా యుండవలెననిన పృచ్ఛకుని ప్రశ్నలగ్నములో చంద్రుడు బలవంతుడై యుండవలెను. సూర్యుడు వివిధ తెగలకును, చంద్రుడు పామరజనులకు ప్రజాపత్యము వహించి యుండును.

ఇక్కడి నుండి నాకు ట్రాన్స్‌ఫర్ అగునా -

స్థిరరాశి లగ్నమై పాపగ్రహ దృష్టిగాని, యోగముగాని లేకున్న ట్రాన్స్‌ఫర్ జరుగదు. వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు లగ్నమైన వృద్ధి స్థాన సమాగమములుకావని చెప్పవలెను. ద్విస్వాభావము లగ్నమైన తదధిపతి శుభగ్రహ దృష్టిబలము వలన, పాపగ్రహదృష్టి తక్కువుగా నున్నందున జరుగదు.

## విదేశయాన ప్రశ్నలు

నవమ, ద్వాదశ స్థానములను బట్టి పృచ్ఛకుని యొక్క విదేశ యాను చర్చించ వలెను. భాగ్యస్థానము నందు శుభగ్రహములున్న పృచ్ఛకుడు విదేశముల నుంచి విదేశీయుల వలన భాగ్యము సంపాదించును. నవమాధిపతి ద్వాదశ స్థానము నందున్నను లేక ద్వాదశాధిపతి నవమ స్థానము నందున్న పృచ్ఛకుడు విదేశములకు పోవును. అష్టమ స్థానము నందు శుభగ్రహములుండి, శుభవీక్షణము గలిగి బలవంతులైయున్న పృచ్ఛకుడు సముద్రయానము వలన లాభము పొందును.

## చోర ప్రశ్నలు

చోరప్రశ్నవేయబడిన సమయమునకైన తిధివార నక్షత్రములు ప్రతిపదాదిగను, ఆదివారాదిగను, అశ్వానాదిగను,, లెక్కించి యా మూటిని గలిపి యా మొత్తమునకు నాలుగు గూడా కలిపి 8 చే భాగించగా చోరుని యొక్క స్థితిన్నీ పోయిన వస్తువు యొక్క సంగతిన్నీ ఈ క్రింది విధముగా తెలియబడు చున్నది మరియు తత్కాల లగ్నము మేషమైన శత్రువునిచే చేయబడినదనియు, వృషభమైన మ్లేచ్ఛుడనియు, మిథునమైన వైశ్యుడనియు. కర్కాటకమైన శూద్రుడనియు, సింహమైన బంధువే ననియు, కన్యయైన తన పుత్రీపుత్రులలో నొకరనియు, తుల యైన భార్యయేయనియు, వృశ్చికమైన యజమానియే యనియు, మకరమైన ఎలుకల చే హృతమైనదనియు, కుంభమైన దాసీ తీసినదనియు మీనమైన భూస్థాపితము చేయబడిన దనియు చెప్పవలెను.

మేషమైన గృహమధ్యమందే యున్నదనియు, వృషభమైన స్థానమందే యున్నదనియు, మిధనమైన గ్రామాంతరము గొనిపోబడిన దనియు, కర్కాటకమైన

నుత్తర దిశకు పోయెననియు, సింహమైన దక్షిణ దిశకు పోయెననియు, కన్యయైనవి దిక్కులలో నొకదాని దిశకు పోయెననియు, తులయైన గృహపృష్ఠ భాగమందున్న దనియు, వృశ్చికమైన నూతియందు బడవేయ బడెననియు, ధనుస్సుయైన మార్గమధ్యమున నున్నదనియు, మకరమైన కుండల మధ్య నుంచబడినదనియు కుంభమైన నీటికుండలో దాచబడినదనియు మీనమైన బురద యందు కుక్కబడి యున్నదనియు చెప్పవలెను.

చోరప్రశ్న కాలమునకు ఉదయ లగ్నము, అరూఢ లగ్నము, ఛత్రలగ్నము స్థిరరాశుల యందున్న పోయిన వస్తువు మరల లభ్యమగును. ఉదయ, అరూఢ, ఛత్రలగ్నములు ద్విస్వభావరాశుల యందున్న పోయిన వస్తువు మరల తిరిగి లభించదు. ఉదయ, ఆరూఢ, ఛత్రలగ్నములు చరరాశుల యందున్న పోయిన వస్తువు లభ్యమగును. ఉదయ, అరూఢ, ఛత్రరాశుల యందు పాపులు గాని లేక పాపక్రాంతము చెందిన గ్రహములు గానియున్న పోయిన సొమ్ము యితరులుకు లభ్యమగుటచే అది తిరిగి వచ్చు ఆశ యేమాత్రము యుండదు. పాపగ్రహముల స్థానములో శుభగ్రహములున్న పోయిన సొత్తు తిరిగి వచ్చునను ఆశగల్గు చున్నది. ఆరూఢ, ఉదయ, ఛత్రరాశులకు శుభగ్రహములు 5, 7 లేక 9 రాశుల యందున్న పోయిన వస్తువులు మరల పొందవచ్చును. ఉదయ, ఆరూఢ, చత్ర రాశుల యందున్న గ్రహముల బలాబలములను బట్టిన్నీ, పాప శుభత్వములను బట్టి పోయిన వస్తువు తిరిగి పొందగల్గునది, పొందలేనిది తెలుసుకొన వచ్చును. ఉదయ, అరూఢ, ఛత్రరాశులకు మూడవ స్థానమున పాపగ్రహముగాని లేక వానికి పంచమ స్థానమున శుభగ్రహముగాని యున్నయెడల పోయిన వస్తువును చోరీజేసినవాడు తనంతటతానే తిరిగి యివ్వగలడు.

ప్రశ్నకాలము నందు ఉపగ్రహమైన 'దూమ' పాప శుభగ్రహములలోనే యొక్క దానితోనైనా కలిసి యున్న చోరీ జరిగినదని చెప్పబడిన వస్తువు యింటియందే యుండును. ప్రశ్నకాల సమయము నందు చంద్రుడు వృష్ఠోదయ రాశి (మేష, వృషభ, కర్కాటక, ధనుస్సు మరియు మకరము) యంధున్న పోయన దనుకున్న వస్తువు యింటి యందే యుండును. అదేరాశిని శని వీక్షించుచున్న ఆ వస్తువు యెత్తు ప్రదేశము నందుండుటయు, ఆ రాశి కుజునితో సంబంధపడి యున్న ఆ వస్తువు యెత్తు ప్రదేశము నందుండదు. ఉదయ లగ్నము నందు గురుడున్న పోయినది బంగారు వస్తువుకాని అది నిజముగా పోయి యుండిలేదు. ఉదయ లగ్నము నుండి నాల్గవ స్థానమున శుక్రుడున్న పోయిన దనుకున్నది వెండి వస్తువు. కాని అది నిజముగా పోయి యుండలేదు. శని లేక కుజుడు సప్తమ స్థానము నందున్న పోయిన దనుకున్న ఇనుప వస్తువు పోయి యుండలేదు. ఉదయరాశి యందు బుధుడున్ననూ లేక వానికి నాల్గవ స్థానమందున్న పోయిన దనుకున్న వస్తువు టిన్ను లేక జింకుదై యుండును. కాని అది పోయి యుండలేదు. సప్తమ స్థానమున చంద్రుడున్న పోయిన దనుకున్న కంచు వస్తువు పోయి యుండలేదు. పంచమ స్థానమున రవియున్న పోయన దనుకున్న యిత్తడి వస్తువు పోయి యుండలేదు.

ఉదయ లగ్నము కర్కాటకము లేక వృశ్చికమై యున్న పోయిన వస్తువు యింటి యందే యుండును. ఉదయ లగ్నము మకరము లేక మీనరాశియై యున్న పోయన వస్తువు యింటి మధ్యభాగము నందుండును. ఉదయ లగ్నమున కుజుడున్న పోయిన వస్తువు కుండయందును, బుధుడున్న తప్పక కుండయందును. గురుడున్న యెర్రటి మట్టికుండ యందును, శుక్రుడై యున్న నీటికూజా యందును, శనియున్న బియ్యము కడుగు నీటియందును, చంద్రుడున్న పోయిన వస్తువు ఉప్పు జాడీయందు పెట్టబడి యుండును.

పురుష రాశులు పురుష గ్రహములచే వీక్షించ బడుచున్న చోరుడు పురుషుడనియు, స్త్రీ రాశులు స్త్రీ గ్రహములచే వీక్షించ బడుచున్న చోరీజేసినది స్త్రీ యని యెరుంగ వలయును. ఉదయ లగ్నము నుండి పురుష గ్రహము బేసిరాసి యందున్న చోరుడు పురుషుడనియు, ఉదయ లగ్నము నుండి స్త్రీ గ్రహము సమరాశి యందున్న చోరీజేసినది స్త్రీ అని యెరుంగ వలయును. పై విషయము లన్నియును ఉదయ, అరూఢ లగ్న బలాబములను బట్టి విచారించ వలెను.

కర్కాటకము, మకరము, కన్య అనెడి రాశులు ఉదయ లగ్నమైయున్న పోయిన సొమ్ము మరల లభించదు. తుల, వృషభ, కుంభ రాశులు, ఉదయ లగ్నమైయున్న పోయిన సొమ్ము మరల దొరుకును. గురుడు మినహా యితర గ్రహములన్నియు శత్రు క్షేత్రము నందున్న పోయిన సొమ్ము మరల దొరుకదు. అరూఢ లగ్నము యే దిశ యందుండునో చోరీ చేయబడిన సొమ్ము ఆ దిశయందుండును. చంద్రుడు వీక్షించుచున్న గ్రహము యొక్క స్వభావము, గుణము యెట్లుండునో చోరుని యొక్క స్వభావము, గుణము అదేవిధముగా యుండును. దొంగిలించబడిన వస్తువు యొక్క రూపము గూడ అదేవిధముగా యుండును. సంబంధిత గ్రహముల యొక్క కిరణములను బట్టి వస్తువు లభ్యమగు కాలము రోజులలో నిర్ణయించ వలెను. అరూఢ, ఉదయ, ఛత్రరాశులను వీక్షించు గ్రహములను పై అంశమును చర్చించునపుడు ఆలోచనలో గ్రహించ వలెను. చంద్రుడున్న రాశి మొదలు ఉదయరాశి వరకు గల రాశుల సంఖ్య కార్యసిద్ధిని దినములలో సూచించును. చంద్రుడున్న రాశి, ఉదయ లగ్నము చరరాశులై యున్న పై ఉదహరించిన దినములకు కార్యసిద్ధి గలుగును. అవియే స్థిర రాశులై యున్న ఆ దినములను మూడుచే పెంచవలెను.

పోయిన వస్తువును చోరులు యేదిశగా యెత్తుక పోయినారు ? అని అడిగినపుడు ప్రశ్నలగ్నమును గట్టుకొని ఈ క్రింది విధముగా నెరిగి చెప్పవలయును. ప్రశ్నలగ్నము మేషమైన తూర్పు, వృషభమైన దక్షిణము, మిధునమైన పశ్చిమము, కర్కాటకమైన నుత్తరము, సింహ ధనుస్సులైన నాగ్నేయము, కన్యా మకరములైన నైరుతి, తులాకుంభములైన వాయువ్యము, మీన వృశ్చికములైన ఈశాన్యము ఈ మార్గముగా చోరులు పోయిరని చెప్పవలయును.

చోరీలో పోయిన సొమ్ము తిరిగి పొందగలనా ? అని అడిగినప్పుడు చతుర్థ స్థానాధిపతి లగ్నము నందున్నను లేక చంద్రుడు లగ్నము నందుండి చతుర్థ స్థానాధిపతితో వీక్షించుచున్న పోయిన సొమ్ము అనుకున్న ప్రదేశము నందే లభ్యమగును. ద్వితీయ స్థానాధిపతి ద్వితీయ లేక చతుర్థ స్థానము నందున్న

పోయిన సొమ్ము లభ్యమగును. చతుర్థ స్థానము నందు పాపులున్న పోయిన సొమ్ము దొరకదు. కుజుడు సప్తమ లేక అష్టమ స్థానము నందున్న పోయిన సొమ్ము యితరులకు లభ్యమైనందున దొరకదు. లగ్నస్థానము నందు రాహువుండి, సూర్యుడు అష్టమ స్థానము నందున్న సొమ్ము లేక ఆస్తి మరల లభించదు.

చంద్రుడు లేక గురుడు, సప్తమ, అష్టమ, చతర్థ లేక దశమ స్థానాధి పతియై యున్న పోయిన సొమ్ము మరల దొరుకును. లగ్నాధిపత సప్తమ స్థానము నందుండి, సప్తమాధిపతి లగ్నము నందున్న పోయిన సొమ్ము మరల లభ్యమగును. సప్తమ స్థానమున పై రెండు గ్రహములు ముథషిల యోగము నందున్న పై ఫలములనే పొంద గలుగును. లగ్న, సప్తమాధిపతులు ముథషిల యోగము నందున్నపుడు సప్తమాధిపతి తన ప్రభావమును లగ్నాధిపతికి బదిలీ చేయుట వలన చోరునిచే దొంగిలించ బడిన వస్తువు తిరిగి వాపసు చేయబడును.

లగ్నము నందు రవి యుండి సప్తమ స్థానమున చంద్రుడున్న పోయిన సొమ్ము మఱల దొరకదు. పౌర్ణమి రోజున సూర్యోదయ సమయమందు పృచ్ఛకునిచే ప్రశ్నింపబడిన పోయన వస్తువు మఱల దొరకదని గ్రహించ వలెను. లగ్న. దశమాధిపతులు యిథషిల యోగము నందున్న పోయిన వస్తువు మఱల లభించును. సప్తమాధిపతి అస్తంగతుడై సూర్యచంద్రులు 12 భాగల లోపునందున్న చోరుడు సొత్తుతో గూడ వెంటనే పట్టుబడును. సప్తమాధిపతి కేంద్రము నందున్న చోరుడు నేరము జరిగిన ప్రదేశము నందే యుండును. సప్తమాధిపతి కేంద్రము నందుగాక యితర స్థానమున యందున్న చోరుని నేరము జరిగిన ప్రదేశము నందుండదు. సప్తమాధిపతి తృతీయ లేక నవమాధిపతులతో యిధషిల యోగము పొందియున్న చోరుడు గ్రామము వదలిపోయి యుండును. దశమాదిపతి లగ్నాధిపతితో యిధషిల యోగము నందున్న దొంగిలించ బడిన వస్తువులు పోలీసు అధికారుల ద్వారా లభ్యమగును.

తృతీయాధిపతి లేక నవమాధిపతి సప్తమాధిపతితో యిథషిల యోగము పొందియున్న పోయిన వస్తువు యితరుల స్థలములో లభ్యమగును. లగ్మ లేక దశమ స్థానము నందు చంద్రుడుండి మేలైన యిధషిల యోగమును పొందియున్న పోయన సొమ్ము తిరిగి పొందగలరు. పైన వుదహరించిన చంద్రుని సూర్యుడుగాని లేక మేలైన గ్రహముగాని స్నేహభావముతో వీక్షించుచున్న పోయిన సొమ్ము తిరిగి లభ్యమగును.

లగ్న, తృతీయ, పంచమ, సప్తమ స్థానములందు రాహువు, రవి, కుజ, శనులలో నొకరుండినను, ప్రశ్నలగ్నమున చంద్రుడును, ద్వితీయ స్థానమున రాహువును, ఏకాదశ స్థానమున శుక్రుడుండినను, పైన చెప్పబడిన లగ్న, ద్వితీయ ఏకాదశ స్థానముల యందు శుక్ర, శని గురులు వరుసగా యున్నను, నష్టద్రవ్య ప్రాప్తి గలుగునని చెప్పవలయును. ఈ ప్రశ్న లగ్నము చరమైన రెండు దినముల లోను, స్థిరమైన మాసములోనున్న, ద్విస్వభావ రాశియైన 15 దినములలో నష్ట ద్రవ్యము వచ్చునని చెప్పవలయును. లగ్నమునకు వ్యయ స్థానమున క్రూర గ్రహమున్న యెడల నష్టద్రవ్యము తిరిగి రానేరాదని చెప్పవలయును.

ప్రశ్నకాలమునకు లగ్నము స్థిరరాశియైనను లేక స్థిరనవాంశయైనను, లేక లగ్నము వర్గోత్తమాంశయైనను చోరుడు యజమాని యొక్క స్వంత మనిషియై యుండి సొమ్ము వానివద్దనే యుండును. ప్రశ్నలగ్న సమయమునకు ద్రేక్కాణము మొదటిదైన పోయిన వస్తువు తలుపు చాటునను, ద్వితీయమైన ఆవరణము లోపలను, తృతీయమైన యింటి వెనుక దొడ్డి యందు దాచబడినట్లు చెప్పవలెను.

ప్రశ్న ధనమును గుఱించి పృచ్ఛకుడు పరధ్యానములో యున్నపుడు పోయినట్లు చెప్పబడిన లగ్నాధిపతి సప్తమ స్థానము నందున్నను లేక సప్తమాధిపతి లగ్నము నందున్నను లేక యిరువురు అధిపతులు ముథషిల యోగము నందున్న పోయిన స్థలము నందే యున్నట్లు చెప్పవలయును.

పృచ్ఛకుని ప్రశ్న - పోయిన ధనము యేదిశ యందు దొరుకును ? అని అడిగినప్పుడు చంద్రుడు లగ్నము నందున్న తూర్పనియు, దశమ స్థానము నందున్న దక్షిణమనియు, సప్తమ స్థానము నందున్న పడమటయనియు, చతుర్థ స్థానము నందున్న ఉత్తర దిశయందు దొరుకునని చెప్పవలెను.

చంద్రుడు కేంద్రము నందు లేనియెడల, వాని స్థానము యే కేంద్రమునకు దగ్గరగా నున్నదో గ్రహించి దానిని బట్టి దిశ లేక దిక్కును నిర్ణయించ వలెను. లగ్నస్థానము తూర్పుగా గ్రహించి యచ్చట నుండి ప్రతి 45 డిగ్రీలు లేక భాగలకు వరుస క్రమముగా తూర్పు, ఆగ్నేయ, దక్షిణ, నైఋతి, పశ్చిమ, వాయవ్య, ఉత్తర, ఈశాన్యము యుండును, లేక దిశను రాశి స్వభావమును బట్టి నిర్ణయించ వలెను.

ఉ।। లగ్నము 12 భాగల యందు మేషములో యుండి చంద్రుడు 8 భాగల యందు కన్యలో యున్నాడనుకొందము. ఇచ్చట దగ్గర కేంద్రము సప్తమ స్థానము. చంద్రుడు 34 భాగలు వెనుక యున్నాడు. లగ్నము (మేషము 12°) తూర్పును సూచించు చున్నది. సప్తమ స్థానము (తుల 12°) పశ్చిమము అయినది. చతుర్థ స్థానము (కర్కాటకము 12°) ఉత్తరము అయినది. దశమ స్థానము (మకరము 12°) దక్షిణమైనది.

చంద్రుడు IV (ఉత్తరము) మఱియు VII (పశ్చిమము) 4 నుండి 45 భాగలు అతిక్రమించి యున్నాడు. కాబట్టి దిశ పడమరయైనది. చంద్రుడు 4 నుండి 45 భాగలకు సమానముగా యున్న దిశ వాయవ్యము అగును.

పోయిన లేక దొంగిలించబడిన వస్తువు యొక్క దిశ చంద్రుడు కేంద్రము లో లేనపుడు ఈ క్రింది విధముగా గూడ నిర్ణయించవచ్చును. ప్రశ్న లగ్నము లేక రాశి అగ్ని తత్త్వమైన పోయిన వస్తువు ఆగ్నేయ దిక్కున యున్నద నియు, పృధ్వీతత్త్వమైన నైఋతి దిక్కు నందున్నదనియు, వాయుతత్త్వమైన వాయవ్య దిక్కునందనియు, జలతత్త్వమైన ఈశాన్య దిక్కునందున్నదని చెప్పవలెను.

పోయిన లేక దొంగిలించ బడిన వస్తువు ప్రశ్న వచ్చినప్పుడు సప్తమ స్థానము దొంగగను, చతుర్థ స్థానము పోయిన వస్తువుగను, లగ్నము మఱియు చంద్రుని వస్తువు పోగొట్టుకొన్న యజమానిగా భావించ వలెను.

లగ్నాధిపతి సప్తమ స్థానము నందుండి సప్తమాధిపతితో యిధ్యషిల యోగము పొందియున్న పోయిన సొమ్ము దొరకును. అష్టమాధిపతి లగ్నము నందున్న చోరుడు తనంతటతాను సొమ్ము తిరిగి యిచ్చును. ద్వితీయ స్థానాధిపతి అస్తమించిన చోరుడు పట్టుబడును. లగ్నాధిపతి, దశమాధిపతి యిధ్యషిల యోగము నందన్న చోరుడు సొమ్ముతో సహా పట్టుబడును. ఈ గ్రహకూటమిలో లగ్నాధిపతి వీక్షణ లేనందున చోరుడు నేరము చేయుటకు మాత్రమే వచ్చి యున్నాడు. సప్తమాధిపతి అస్తమించిన చోరుడు పట్టుబడును. లగ్నసప్తమాధిపతులు యిధ్యషిల యోగము నందున్న చోరుడు అధికారులకు భయపడి సొమ్ము వాపసు జేయును. లగ్నాధిపతి బలహీనుడై యిధ్యషిల యోగము లేనియెడల చోరుడు సొమ్ముకు సంబంధించిన అధికారులకు వాపసు చేయును. లగ్న దశమాధిపతులు కలసియున్న దొంగిలించిన సొమ్ము పోలీసు అధికారుల ద్వారా వాపసు యివ్వబడును.

దొంగవాని సొమ్ము అష్టమ స్థానమును సూచించును. ద్వితీయ స్థానాధిపతి సప్తమ లేక అష్టమస్థానము నందున్న దొంగిలించిన సొమ్ము మఱల తిరిగిరాదు. ద్వితీయ నవమాధిపతులకు ముధషిల యోగమున్న పోయిన సొమ్ము తిరిగిరాదు. అష్టమ దశమాధిపతులకు ముధషిల యోగమున్న అధికారులు చోరుని యొక్క అభిమతమే సమర్థించెదరు. లగ్నాధిపతికి ద్వితీయాధిపతికి పరస్పర వీక్షణము లేనియెడల యజమాని సొమ్ముపోయిన సమాచారము తెలుసుకొన గలడు గాని పోయిన సొమ్ము పొందజాలడు.

వృచ్ఛకుని ప్రశ్న - దొంగ యెవరు ? అని అడిగినప్పుడు లగ్నము సూర్యునిచే గాని లేక చంద్రునిచే గాని వీక్షించబడుచున్న యింటియందున్న వారిలో యొకరై యుండవలెనని చెప్పవలెను. లగ్నమును సూర్య చంద్రులు యిరువురు వీక్షించుచున్న దొంగ తనయింటికి దగ్గర నివసించువాడని చెప్పవలెను. ఇది అమావాస్యకు ఒకరోజు ముందు వెనుకలుగా యుండును. లగ్నస్థానము నందు లగ్న సప్తమాధిపతులున్న దొంగ యింటి వారిలో యెకరై యుండును. సప్తమాధిపతి ద్వితీయ లేక ద్వాదశ స్థానము నందున్న దొంగ యజమాని సొంత సేవకుడై యుండును. సప్తమాధిపతి సప్తమ స్థానము నందున్నను లేక తన ఉచ్ఛక్షేత్రము నందున్నను దొంగ బాగుగా తెలిసిన వాడేయై యుండును. బలమైన గ్రహములు లగ్న, సప్తమ, దశమ స్థానమును చేరియున్న వాని స్వభావమును బట్టి దొంగకు సహకరించిన వారిని చెప్పవలెను. పై గ్రహసంయోగమును బట్టి సప్తమాధిపతి బలమును గ్రహించి ఆయొక్క గ్రహము నీచనొందిన సూర్యుడైన చోరుడు యజమాని తండ్రియై యుండును. ఈ విధమునే నీచపొందిన గ్రహము చంద్రుడైన దొంగిలించినది తల్లిగను, శుక్రుడైన భార్యగను, శనియైన కుమారుడుగను, గురుడు లేక కుజుడైన యింటిలో ముఖ్యమైన వారు లేక సోదరుడు లేక కుమారుడై యుండును. నీచపొందిన సప్తమాధిపతి బుధుడై యున్న చోరుడు బంధువు లేక స్నేహితుడై యుండును.

సప్తమాధిపతి కుజునితో ముసరిఫఃయోగము నందున్న చోరుడు యిదివరలో పట్టుబడి యుండడు. ఈ చోరుడు యిదివరలో నేరస్తుడై యుండిగాని

లేక చోరీలో పట్టుబడి గానియుండడు. సప్తమాధిపతి శనియై చంద్ర వీక్షణము గలిగియున్న చోరుడు మతిభ్రష్టుడు లేక భిన్న మతావలంబకుడై యుండును.

ముందుగా తెలియపరచి చోరీ చేయబడిన గురుని సూచించును. గుంటలో సొమ్ము దాచియుంచిన కుజునిగను, మారు తాళపు చెయ్యి వుపయోగించిన శుక్రునిగను, అతిధివల్ల నేరము జరిగిన బుధుని సూచించును. ఈ పైపనులు ఆయాగ్రహములు సప్తమాధిపతిని వీక్షించుచున్నపుడు జరుగును. ప్రధాన గ్రహము అనగా సప్తమాధిపతి శుక్రుడు, బుధుడు, గురుడు, కుజుడు, శని లేక రవియై యున్న చోరుడు యౌవనవంతుడు, పిల్లవాడు, మధ్యకారు మనిషి, చిన్నవాడు, పెద్దవాడు మఱియు చాలా ముసలివాడు యైయుండును. ద్వితీయ లేక ద్వాదశ స్థానము నందు రవియున్న చోరుడు చిన్నవాడై యుండును. లగ్నరాశి సింహమైన చోరుడు మధ్యకారు మనిషిగా యుండును. సప్తమ స్థానము నందు రవియున్న చోరుడు కారుమీరిన వాడుగను, చతుర్థమందు రవియున్న చోరుడు ముసలి వానిగా గ్రహించ వలెను.

చతుర్థస్థానము యొక్క రాశిని బట్టి దొంగలించిన సొమ్ము యెచ్చట పెట్టినది తెలుపును. 12 రాశులు భూతత్వము, అగ్నితత్వము, వాయుతత్వము, జలతత్వము గలవి. వృషభ, కన్య, మకరములు భూతత్వము: మేష, సింహ, ధనుస్సు రాశులు అగ్నితత్వము; మిధున, తుల, కుంభములు వాయుతత్వము; కటక, వృశ్చిక, మీనములు జలతత్వము గలవిగా యుండును. ఇందు భూతత్వము నేలగను, అగ్నితత్వము వంటశాల లేక నిప్పు ప్రదేశముగను, వాయుతత్వము యెచ్చటనో పై ప్రదేశముగను, జలతత్వము బావి, నీళ్ళు మొదలగు వానిని సూచించును.

చతుర్థ స్థానాధిపతిని బట్టిగాని లేక చతుర్థ స్థానమును ఆక్రమించిన గ్రహము యొక్క స్వభావమును బట్టిగాని దొంగిలించిన సొమ్ము పెట్టుబడిన ప్రదేశమును చెప్పవలెను. అట్టిగ్రహము శని, చంద్ర, గురు, కుజ, రవి, శుక్ర, బుధుడైయున్న చోరీ సొమ్ము మురుగు ప్రదేశము, బావి సమీపము, స్నానగది సమీపము, ప్రార్థన మందిరము లేక దేవాలయము, వంటశాల లేక నిప్పు ప్రదేశము, యజమాని కూర్చుండు ప్రదేశము, వడక, భోజనశాల, గ్రంధాలయము, ఖజానా లేక యినుప పెట్ట మొదలగు వాని యందు దాచబడి యుండును.

పృచ్ఛకుని ప్రశ్న - వాడు చోరుడా ? లేక చోరుడుకాడా ? అని అడిగినప్పుడు చంద్రుడు శుభగ్రహముతో ముధషిల యోగము పొందియున్న అనుమానించిన మనిషి చోరుడుకాడు చంద్రుడు పాపగ్రహముతో ముధషిల యోగము పొందియున్న అనుమానించిన మనిషియే చోరుడగును.

పృచ్ఛకుని ప్రశ్న - వాడు యేమైనా లోగడ నేరము చేసినాడా ? అని అడిగినప్పుడు చంద్రుడు గాని లేక లగ్నాధిపతిగాని సప్తమ స్థానాధిపతితో ముసరిఫః యోగము పొందియున్న పై వ్యక్తి లోగడ నేరము చేసినట్లు గ్రహించవలెను. సప్తమాధిపతి స్త్రీ గ్రహమైనను, సప్తమ స్థానము స్త్రీ రాశియైనను, సప్తమ స్థానము స్త్రీ గ్రహమున్నను, లేక సప్తమ స్థానమును స్త్రీ గ్రహము

వీక్షించుచున్న చోరుడు స్త్రీ యనియు, అట్లుగాకున్న పురుషుడని యెరుంగవలెను. బుధ, శుక్ర, శని, చంద్రులు స్త్రీ గ్రహములు. రవి, కుజ, గురులు పురుష గ్రహములు. బేసిరాశులు పురుషులుగను, సమరాశులు స్త్రీలుగా గ్రహించ వలెను. నవాంశ చక్రమందు నవాంశ లగ్నాధిపతిని బట్టి చోరుని యొక్క వయస్సు, జాతి, ఆకృతి మొదలగు వానిని నిర్ణయించవలెను.

## చోరుని యొక్క రూపురేఖలు

వరాహమిహిరుడు తన బృహత్ జాతకములో ప్రశ్నలగ్న ద్రేక్కాణములను బట్టి చోరుని యొక్క రూపురేఖలు ఈ క్రింది విధముగా యుండునని చెప్పియున్నారు.

ద్రేక్కాణమనగా 30 డిగ్రీలు లేక భాగలుగల లగ్నము లేక రాశిని మూడు సమభాగములు చేయగా భాగము యొకటికి 10 డిగ్రీలు లేక భాగలగును. ప్రథమ ద్రేక్కాణమునకు లగ్నాధిపతియు, ద్వితీయ ద్రేక్కాణమునకు పంచమాధిపతియు, తృతీయద్రేక్కాణమునకు నవమాధిపతియు, క్రమముగా ద్రేక్కాణాధిపతు లగుదురు.

1. మేషలగ్న ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు, గండ్రగొడ్డలి ధరించిన వాడు, నల్లనివాడు, రక్తనేత్రములు గలవాడు, రౌద్రుడు.
2. మేషలగ్న ద్వితీయ ద్రేక్కాణము - స్త్రీ, ఎర్రని వస్త్రము కట్టుకొన్నది, బలిసినది, దీర్ఘముఖము, కుంటిది.
3. మేషలగ్న తృతీయ ద్రేక్కాణము - పురుషుడు, క్రూరుడు, కపిల వర్ణము, ఎర్రని వస్త్రము, చేతిలో కఱ్ఱ గలవాడు.
4. వృషభ ప్రథమ ద్రేక్కాణము - స్త్రీ, చింపిరి జుట్టు, బలిసిన శరీరము, దీర్ఘపాదములు గలది.
5. వృషభ ద్వితీయ ద్రేక్కాణము - పురుషుడు, కళావేత్త, దున్నుట మొదలగు వ్యవసాయ కర్మలుచేయువాడు.
6. వృషభ తృతీయ ద్రేక్కాణము - పురుషుడు, లావుపాటివాడు.
7. మిథున ప్రథమ ద్రేక్కాణము - స్త్రీ, రూపవతి, సంతానము లేనిది.
8. మిథున ద్వితీయ ద్రేక్కాణము - పురుషుడు, సంతానము లేనివాడు, ఉద్యానమున ఉన్నవాడు, కవచము గలవాడు.
9. మిథున తృతీయ ద్రేక్కాణము - పురుషుడు, పండితుడు, రత్నభూషితుడు.
10. కర్కాటక ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు, పంది ముఖము, ఏనుగు వంటి శరీరము.
11. కర్కాటక ద్వితీయ ద్రేక్కాణము - పడుచు స్త్రీ, అడవిజాతి, బండది.
12. కర్కాటక తృతీయ ద్రేక్కాణము - పురుషుడు, బంగారు ఆభరణములు గలవాడు, పాములను పట్టువాడు, పడవమీద పనిచేయువాడు.
13. సింహ ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు, చిలుక, గ్రద్దవంటి ముఖము గలవాడు.

14. సింహ ద్వితీయ ద్రేక్కాణము - పురుషుడు. వంగిన ముక్కు గలవాడు.
15. సింహ తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. మెలికలు తిరిగిన జుట్టు గలవాడు. కళ్ళుగలవాడు.
16. కన్యా ప్రథమ ద్రేక్కాణము - స్త్రీ. తెల్లని బట్ట గలది. నిండు కుండతో గుర్తింపదగినది.
17. కన్యా ద్వితీయ ద్రేక్కాణము - పురుషుడు. చామనచాయ. కలము పుచ్చుకొన్నవాడు.
18. కన్యా తృతీయ ద్రేక్కాణము - స్త్రీ. దేవాలయమున పనిచేయునది. కుండచేతిలో యున్నది. గౌరవర్ణము.
19. తులా ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు. వీధి అంగడిలోనివాడు. పొడవు చేతులు గలవాడు. త్రాసుచేత నున్నవాడు.
20. తులా ద్వితీయ ద్రేక్కాణము - పురుషుడు. గ్రద్దముక్కు. ఆకలి దప్పికలు గలవాడు.
21. తులా తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. దీర్ఘముఖము.
22. వృశ్చిక ప్రథమ ద్రేక్కాణము - స్త్రీ. సుందరి. దిగంబరి. స్థానభ్రష్టురాలు.
23. వృశ్చిక ద్వితీయ ద్రేక్కాణము - స్త్రీ. విటుని కోరునది. శరీరము. ముఖము కప్పుకొన్నది. భర్తచే విటునికి అప్పగింప బడినది.
24. వృశ్చిక తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. ముతక బట్టలు ధరించిన వాడు.
25. ధనుస్సు ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు. విలుకాడు.
26. ధనుస్సు ద్వితీయ ద్రేక్కాణము - అందమైన స్త్రీ. గౌరవర్ణము.
27. ధనుస్సు తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. దండహస్తుడు.
28. మకర ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు. భయంకరమైన ముఖము గలవాడు. శరీరముపై రోమములు యెక్కువగా గలవాడు.
29. మకర ద్వితీయ ద్రేక్కాణము - స్త్రీ. పడుచుది. చామనచాయ. అలంకారములు గలది.
30. మకర తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. దీర్ఘముఖము గలవాడు. విలుకాడు.
31. కుంభ ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు. గ్రద్దముక్కు. కంబళి ధరించినవాడు.
32. కుంభ ద్వితీయ ద్రేక్కాణము - స్త్రీ. రక్తాంభరధారణి.
33. కుంభ తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. దిగంబరి. సర్పములు పట్టువాడు.
34. మీన ప్రథమ ద్రేక్కాణము - పురుషుడు. పడవలో నుండువాడు.
35. మీన ద్వితీయ ద్రేక్కాణము - స్త్రీ. గౌరవర్ణము. పడవలో నుండునది.
36. మీన తృతీయ ద్రేక్కాణము - పురుషుడు. దిగంబరుడు. పాముల వాడు.

## చోరుని వయస్సు

లగ్నాధిపతి చంద్రుడైన శిశువు; కుజుడైన నాలుగేండ్ల బాలుడు, బుధుడైన 12సం||ల బాలుడు, శుక్రుడైన 20సం||ల యువకుడు, గురుడైన 50సం||ల మధ్య వయస్సు గలవాడు, సూర్యుడైన 70సం||ల వృద్ధుడు, శనియైన 80సం||ల ముదుసలివాడు.

## చోరుని జాతి

లగ్నాధిపతి గురుడు లేక శుక్రుడైన విప్రుడు, రవి లేక కుజుడైన క్షత్రియుడు, చంద్రుడైన వైశ్యుడు, బుధుడైన శూద్రుడు, శనియైన సంకరుడు.

## నష్టద్రవ్యమున్న దిక్కు

లగ్నము మేష, సింహ, ధనుస్సులైన తూర్పునకు చేరినట్లును, వృషభ, కన్యా, మకరములైన దక్షిణ దిక్కునకు పోయినట్లును, మిధున, తూలా, కుంభములైన పడమర దిక్కునకు పోయినట్లును, కర్కాటక, వృశ్చిక, మీనములైన ఉత్తర దిక్కునకు పోయినట్లు నెరుంగ వలెను.

## ద్రవ్యము నష్టపడిన కాలము

మేష, వృషభ, మిధున, కర్కాటక, ధనుస్సు, మకరములు లగ్నమైన ద్రవ్యము రాత్రివేళ అపహరింప బడినదని, సింహ, కన్య, తుల, వృశ్చిక, కుంభ, మీనములలో నొకటి లగ్నమైన పగలు దొంగిలింపబడినదని చెప్పవలెను.

## నష్టద్రవ్యము లభించునా, లేదా ?

ప్రశ్నలగ్నముల పూర్ణచంద్రుడున్నను, లేదా శీర్షోదయరాశి లగ్నమై అందు శుభగ్రహమున్నను, ఆ గ్రహము శుభగ్రహములతో వీక్షించబడినను, నష్టద్రవ్యము త్వరగా లభించును. లేదా లగ్నాత్తు లాభస్థానమున బలవత్తరమైన శుభగ్రహము చేరినను త్వరగా లాభము గల్గును. ఈ యోగమేదియు లేకున్న నష్టద్రవ్యము దొరకదు.

## మైనరు ఆస్థి ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - మైనరు ఆస్తి ధర్మకర్త చేతినుండి వచ్చునా ? అని అడిగినప్పుడు కుజుడు సప్తమ లేక అష్టమ స్థానము నందున్న ధర్మకర్త మైనరు ఆస్తిని యితరులకు స్వాధీనము చేసియుండినను, మైనరు పెద్దవాడైనను సదరు ఆస్తి తిరిగి తనకు సంక్రమించదు. చంద్రుడుగాని లేక గురుడుగాని సప్తమ, అష్టమ, చతుర్థ లేక దశమ స్థానాధిపతియైన ధర్మకర్త స్వాధీనమందున్న ఆస్తి మైనరు పెద్దవాడైన వెంటనే సంక్రమించును.

గమనిక:- తాకట్టునందున్న ఆస్తి లేక సొమ్మునకు గూడపై అంశములే వర్తించును.

## వాణిజ్య ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - వ్యాపారము భాగస్తులతో కలిసి చేయవచ్చునా? అని అడిగినప్పుడు లగ్నములో సప్తమాధిపతి బలహీనుడై యున్నను లేక సప్తమ

స్థానము పాపగ్రహ సంయోగముగాని లేక పాపగ్రహ వీక్షణము గాని పొందియున్న వృచ్ఛకుడు భాగస్తులతో కలిసి వ్యాపారము చేయరాదు.

వృచ్ఛకునిప్రశ్న - నేను కొనుగోలు జేయు వస్తువులు నాకు లాభించునా? అని అడిగినప్పుడు లగ్నాధిపతి వస్తువులు కొనువానిగను, ద్వితీయ లేక ఏకాదశ స్థానాధిపతి అమ్మకము చేయు కారకునిగా సూచించును. లగ్నము శక్తివంతమై యున్న వస్తువులు వృచ్ఛకునికి లాభము గలుగ జేయును.

వృచ్ఛకుని ప్రశ్న - నేను అమ్మకము చేయు వస్తువులు నాకు లాభించునా ? అని అడిగినప్పుడు ఏకాదశ స్థానము శక్తివంతమై శుభగ్రహములు కూడియున్న వస్తువులు అమ్మకము జేసిన వృచ్ఛకుడు లాభము పొందును.

లగ్న, ఏకాదశాధిపతులు పరస్పర కోణములందు లేక కేంద్రము లందున్న వృచ్ఛకుడు తలంచిన వస్తువును కొనగలడు. వస్తువు యొక్క స్వభావమును బట్టి గ్రహముల సంయోగము కొంత మార్పు చెందును. గృహము లేక భూస్థితియైన కుజుడు పాపగ్రహ వీక్షణముగాని లేక సంయోగముగాని చెంది యుండరాదు. వాహనమైన శుక్రుడు శక్తివంతుడై యుండవలెను. వ్యాపారమునకు సంబంధించిన కంపెనీయై యున్న బుధుడు శక్తివంతుడై పాపగ్రహ సంయోగము గాని, పాపగ్రహ వీక్షణముగాని పొందియుండరాదు. కర్మాగారమైయున్న శని శక్తి వంతుడై పాపగ్రహ సంయోగముగాని, పాపగ్రహ వీక్షణముగాని పొందియుండరాదు.

## వివాద ప్రశ్నలు

లగ్నము నందు పాపగ్రహములున్న వృచ్ఛకుడు తగవునందు జయించగలడు. లగ్నాధిపతి నీచక్షేత్రము నందున్నను లేక అస్తమించి యున్నను వృచ్ఛకుడు శత్రువును జయించలేడు. లగ్న, సప్తమ స్థానములుగాక యితర స్థానములయందు పాపగ్రహమలు జేరియుండి, వానికి పరస్పర పాపగ్రహ వీక్షణము గలిగియున్న వివాదకులు ఘర్షణ పడి కొట్టుకొను చుందురు. లగ్న సప్తమస్థానములు పాప గ్రహములతో చేరి యున్న వివాదము తుది వరకు కొనసాగుచుండును.

లగ్నస్థానము నందు శక్తివంతమైన పాపగ్రహములున్న వృచ్ఛకుడు శత్రు జయమును పొందును. లగ్న, పంచమాధిపతులు కేంద్రముల యందు శుభగ్రహ ములతో గూడియున్న వివాదకులు తగవులను పరిష్కరించు కొనెదరు. షష్ఠ, సప్తమాధిపతులు శత్రువులైయున్న వివాదకులు పరస్పర విరోధము గలిగి యుందురు.

## ఓడల ప్రశ్నలు

వృచ్ఛకుని ప్రశ్న - ఈ ఓడల వలన నాకు లాభము గలుగునా ? అని అడిగినప్పుడు శుభగ్రహములు కేంద్రముల యందుండి, పాపులు బలహీనులై 3-6-11 స్థానముల యందున్న వృచ్ఛకుడు ఓడల వలన లాభము పొందగలడు. లగ్న, నవాంశాధిపతులు వక్రించి యుండి శుభ దృష్టి గలిగియున్న నావ సరకుతో సుఖముగా జేరగలదు. లగ్న, నవాంశాధిపతులు పాపగ్రహములచే వీక్షించబడుచున్న

నావ సరుకు లేనిదై ఖాళీగా జేరగలదు. లగ్న అష్టమాధిపతులు స్వస్థానముల యందున్న చేసిన వ్యాపారములో పృచ్ఛకుడు లాభము పొందగలుడు. అష్టమ స్థానమునందు శక్తివంతమైన శుభగ్రహములున్న పృచ్ఛకుడు నావల వలన లాభము పొందగలడు.

పృచ్ఛకుని ప్రశ్న - నావ సుఖముగా చేరగలదా ? అని అడిగినప్పుడు లగ్న అష్టమాధిపతులు వారి స్వస్థానములను వీక్షించుచున్న ప్రయాణము నందున్న నావ నీటిలో మునిగిపోవును. లగ్నస్థానాధిపతికిని చంద్రలగ్న స్థానాధిపతికిని పరస్పర శత్రువీక్షణము గలిగియున్న ఓడపై యున్న నావికునకు పరస్పర కలహములు సంభవించును. లగ్న అష్టమాధిపతులు సప్తమ స్థానము నందున్న ఓడయందున్న, సరుకు పోయి నావ సుఖముగా యిల్లు జేరును. అష్టమాధిపతి, లగ్నాధిపతిపై గాని లేక చంద్రుడున్న స్థానాధిపతిపైగాని లేక చంద్రునిపైగాని శత్రువీక్షణము గలిగియున్న నౌకాధిపతి సముద్రములో మునిగి పోవును.

## ప్రయాణీకుని ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - నామనిషి యొక్క మనిషి ప్రయాణము నందు పోయిన వాడు తిరిగి వచ్చునా లేదా ? లేక ఖైదులో పట్టబడినాడా లేక చంపబడి నాడా? అని అడిగినప్పుడు లగ్నము నందు పాపగ్రహములున్న ఖైదీగా లేడని, చంపబడలేదని చెప్పవలయును. చతుర్థ, పంచమ, సప్తమ, అష్టమ, నవమస్థానము నందు పాపగ్రహములుండి పాపులతో వీక్షించ బడుచున్న ప్రయాణీ కుడు నిర్బంధము నందుంచ బడినాడని చెప్పవలయును.

సప్తమ లేక అష్టమ స్థానము నందు పాపగ్రహములున్న పారిపోయిన మనిషి కొట్టబడి ఖైదీగా యుంచబడినాడని చెప్పవలెను. లగ్న, సప్తమ లేక అష్టమ స్థానముల యందు పాపగ్రహములున్న ప్రయాణీకుడు నిర్బంధించబడి కొట్టబడిన తరువాత విడువబడినాడని చెప్పవలయును. పాపగ్రహములు సప్తమ, అష్టమ లేక లగ్నము నందుండి మరియు సప్తమ లేక అష్టమ, లగ్నస్థానముల యందున్న ఖైదులోయున్న ప్రయాణీకుడు తొందరలో విడువబడును.

పృచ్ఛకుని ప్రశ్న - పట్టుబడిన ప్రయాణీకునికి యేమి సంభవించును ? అని అడిగినప్పుడు ప్రశ్న చక్రములో మృత్యుయోగమున్న నిర్బంధములో యున్న ప్రయాణీకుడు విడువబడును.

పృచ్ఛకుని ప్రశ్న - ప్రయాణీకుడు యెప్పుడు విడువబడును ? అని అడిగి నప్పుడు ప్రశ్నచక్రములో పాపయోగములున్న ప్రయాణీకుడు మరణము నొందును.

కేంద్రాధిపతులు కేంద్ర స్థానముల యందున్న ఖైదీగా యున్న ప్రయాణీకుడు విడువబడడు. అష్టమాధిపతి పాపియై, లగ్నాధిపతి నీచ క్షేత్రమున పాపగ్రహముతో కేంద్రమున కలిసియుండి పాపవీక్షణము గల్గి పతనమై యున్న ప్రయాణీకుడు యొక సంవత్సర కాలములో చనిపోవును. తృతీయ స్థానమున పాపగ్రహముతో చంద్రుడు కలసియున్నను లేక చంద్రుడు అష్టమాధిపతితో కలసి యున్న ప్రయాణీకుడు కారాగృహములో మరణించును. చంద్రుడు కేంద్ర స్థానమున

శని గ్రహముతో కలసియున్నను. లేక శనివీక్షణము పొందియున్నను ప్రయాణీకుడు దీర్ఘకాలము కష్టములు అనుభవించును. చంద్రుడు కేంద్రస్థానమున కుజునితో కలిసిగాని లేక వీక్షించబడిగాని యున్న ప్రయాణీకుడు కారాగారములో కొట్టబడును. లగ్నాధిపతి ద్రిష్యార్థము నందుండి ద్వాదశ స్థానాధిపతితో యిథ్యషిల యోగము నందున్న ప్రయాణీకుడు కారాగారము నుండి పారిపోవును. ద్రిష్యార్థ మనగా లగ్నము నుండి దశమక్షేత్రము వైపుగా సప్తమ స్థానము వరకు గల ఆరు స్థానములు. అనగా లగ్నము, ద్వాదశ ఏకాదశ, దశమ, నవమ, మరియు అష్టమ స్థానములు. ద్వాదశాధిపతి లగ్నమునందుండి, తృతీయ ద్వాదశాధిపతులు ద్వాదశ స్థానమున లగ్నాధిపతితో యిథ్యషిల యోగము నందున్న ప్రయాణీకుడు కారాగారము నుండి తప్పించుకొని పోవును.

ద్రిష్యార్థ స్థానమున చంద్రుడుండి, యే గ్రహముతోనైనను ముథషిల యోగము పొందియున్న ఖైదీగా యున్న ప్రయాణీకుడు కారాగారము నుండి విముక్తి జెందును. తృతీయ, నవమాధిపతులు శుభులై యున్న ప్రయాణీకుడు కారాగారము నుండి తొందరలో విడుదలగును. పాపక్రాంతమైన చంద్రుడు తృతీయ లేక నవమ స్థానము నందున్న గ్రహముతో యిథ్యషిల యోగము పొందినను ప్రయాణీకుడు కారాగారము నుండి విడుదల జేయబడును. తృతీయ లేక నవమ స్థానాధిపతి కేంద్రము నందుండి చంద్రునితో యిథ్యషాల యోగు పొందిన ప్రయాణీకుడు తొందరలో విడదలగును.

లగ్నస్థానమున శక్తివంతమైన శుక్రుడున్నంత కాలము అధికారుల వలన ప్రయాణీకుడు నిర్బంధములో యుంచబడును. శనిగాని శుక్రుడుగాని అస్తమించి యున్న ప్రయాణీకుడు విడుదలగుటకు మంచి అవకాశములు గల్గును. శనిగ్రహము గాని లేక కుజగ్రహముగాని మేష లేక తులారాశుల యందున్న కారాగార విముక్తి తొందరలో గల్గును. ఈ గ్రహములే కార్కాటకము నందుగాని లేక మకరము నందుగాని యున్న ప్రయాణీకుని యొక్క కారాగార విముక్తి చాలాకష్టము మీద జరుగును. శని లేక కుజుడు స్థిరరాశుల యందున్న ప్రయాణీకుని కారాగార విముక్తి ఆలస్యముగా జరుగును. వీరలు ద్విస్వభావ రాశుల యందున్న కారాగార విముక్తి అంత త్వరలో గాని లేక అంత ఆలస్యముగా గాని జరుగదు.

## స్పెక్యులేషన్ వ్యాపార ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - స్పెక్యూలేషన్ వ్యాపారము నాకు అనుకూలముగా యుండునా ? అని అడిగినప్పుడు పంచమస్థానము పంచమ స్థానాధిపతి బలము గలిగి పంచమస్థానమును శుభగ్రహములు వీక్షించుచుండి అందు జేరియుండుటయు, పంచమాధిపతి శుభగ్రహవీక్షణము గల్గి ద్వితీయ లేక ఏకాదశ స్థానమును జేరియున్న పృచ్ఛకునికి తలంచని లాభము చేకూరును. అందుకు విరుద్ధముగా యున్న అనగా పంచమస్థానమున పాపగ్రహములు జేరి పాపగ్రహములచే వీక్షించ బడుచుండి పంచమాధిపతి పాపగ్రహ సంయోగము పాపగ్రహ వీక్షణము గల్గి ద్వాదశ స్థానమును జేరియున్న పృచ్ఛకుడు స్పెక్యులేషన్ వ్యాపారములో నష్టము

పొందును. చంద్రుడు గాని లేక రాహువు గాని పంచమస్థానము నందున్న పృచ్ఛకునికి స్పెక్యులేషన్ వ్యాపారము చేయవలెనను వాంఛ గల్గును.

## పశుప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - నాయొక్క పశువు యేదిక్కునకు పోయినది ? అని అడిగినప్పుడు అరూఢ లగ్నము మేషమైన పశువు తూర్పునకు పోయినదనియు, వృషభమైన దక్షిణ దిశకు పోయినదనియు, మిధునమైన పశ్చిమ దిశకు పోయినదనియు, కర్కాటకమైన దుత్తర దిశకు పోయినదనియు, సింహ ధనుస్సులైన ఆగ్నేయ దిక్కునకు పోయినదనియు, కన్యామకరములైన నైఋతి దిశకున్న, కుంభ, తులలైన వాయువ్య దిశకున్న, వృశ్చిక మీనములైన ఈశాన్య దిశకు పోయినదని చెప్పవలయును. అరూఢ లగ్నమునకు దశమ స్థానమున పాప గ్రహములు చేరి యుండనచో చతుష్పాద జంతువు పోయినదనియు, రాహువు చతుష్పాద రాశియైన నైదవ స్థానమున నుండెనేని చతుష్పాద జంతువు పోయిన దనియు, నది దొరకు ననియు చెప్పవలెను.

## నష్టద్రవ్య ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - నష్టపోయిన ద్రవ్యము తిరిగి వచ్చునా ? ఎంత కాలములో రావచ్చును ? అని అడిగినప్పుడు ప్రశ్నకాల లగ్నచక్రములో లగ్న, తృతీయ, పంచమ, సప్తమ స్థానముల యందు రాహు, రవి, కుజ, శనులలో నొకరుండినను ప్రశ్నలగ్న మందైనను, స్థానము నందైనను చంద్రుడును, ద్వితీయ స్థానమున రాహువును, ఏకాదశ స్థానమున శుక్రుడుండినను, పైన చెప్పబడిన 1-2-11 స్థానముల యందు శుక్ర, శని, గురులు వరుసగా యున్నను, నష్టద్రవ్య ప్రాప్తిగలుగునని చెప్పవలయును. ఈ లగ్నము చరమైన రెండు దినములలోను, స్థిరలగ్నమైన మాసము దినములోను, ద్విస్వభావరాశియైన 15 దినములలోను నష్టద్రవ్యము వచ్చునని చెప్పవలయును. లగ్నమునకు వ్యయ స్థానమున క్రూర గ్రహమున్న యెడల నష్టద్రవ్యము తిరిగి రానేరాదని చెప్పవలయును.

## నిధి ప్రశ్నలు

ప్రశ్న లగ్నమునకు ద్వితీయ స్థానము శుక్రక్షేత్రముగా గాని చంద్రక్షేత్రము గాని అయి ఆ క్షేత్రములో శుక్రచంద్రులు గూడియుండిన భూమిలోపల ధనము యున్నదని చెప్పవలయును. ఆ శుక్ర చంద్రులు కుజ రాహువులతో గూడినను, వీక్షించబడినను ఆ ధనము లభించదు.ప్రశ్నలగ్నమునకు చతుర్థ స్థానము చంద్ర క్షేత్రమై యందు గురుడు, చంద్రుడు గూడియుండినను నిస్సంశయముగా భూమిలో ధనమున్నదని చెప్పవలయును.

## పైరు, పంటల ప్రశ్నలు

పృచ్ఛకుని ప్రశ్న - ఏ దిక్కు నందు పంటలు భాగుగా పండును ? ఏ దిక్కునందు పంటలు పండవు ? అని అడిగినప్పుడు శుభగ్రహములున్న కేంద్ర స్థానములు యే దిశను సూచించునో ఆ దిశయందు పంటలు బాగుగా పండునని చెప్ప వలయును. అన్ని కేంద్రముల యందు శక్తివంతమైన పాపగ్రహములున్న భూమి అంతయు వ్యవసాయమునకు నిరుపయోగముగా యుండును. శని మొదలగు

పాపగ్రహములు గూడియున్న లేక వీక్షించబడుచున్న కేంద్రస్థానము సూచించు దిక్కునందు పంటలు పంటక కరువు కాటకములు సంభవించును. యుద్ధ సమయములో రవి సూచించు దిక్కునందు శత్రురాజుల వలన పైరులు నాశనము చేయు ప్రమాదము గలదని గ్రహించ వలెను. కుజుడు సూచించు దిక్కునందు అగ్ని ప్రమాదము వలన పైరులు నశించును. శక్తివంతమైన శుభగ్రహములున్న కేంద్రములు సూచించు దిశ యందు పైరు పంటలు చక్కగా తేజరిల్లు చుండును. అన్ని కేంద్రముల యందు శక్తివంతమైన పాపగ్రహములు జేరియున్న మొత్తము భూమియంతయు సేద్యమునకు నిరుపయోగ మగును.

## సంతాన ప్రశ్నలు

శుభగ్రహ సంయోగము లేక శుభగ్రహ వీక్షణము గలిగి పంచమాధిపతి, లగ్నాధిపతితోగాని చంద్రునితోగాని యిధ్యషాల యోగము నందున్న పృచ్ఛకుడు సంతానము గలవాడగును. పంచమ స్థానమును శక్తివంతమైన యెన్ని పురుష స్త్రీ గ్రహములు వీక్షించుచుండునో అంతమంది పురుషులు స్త్రీల యొక్క సంతానం గలుగుననియు, లేక పంచమాధిపతిగాని లేక పంచమ స్థానముగాని శుభులతో కలిసియుండి యెన్ని నవాంశలు గలిగియుండునో అంత సంతానము గల్గునని చెప్పవలెను.

లగ్న పంచమాధిపతులకు పరస్పర వీక్షణము లేకున్నను, లేక పంచమాధిపతి లగ్నాధిపతిని వీక్షించకున్ననూ లేక పంచమాధిపతి పాపగ్రహములతో యిధ్యషాలయోగము పొందియున్నను పృచ్ఛకునికి సంతానము గలుగదు. పంచమ స్థానము వృషభ, సింహ, కన్య లేక వృశ్చికరాశుల యందుండి, ప్రశ్నలగ్నము నుండి గాని లేక జన్మలగ్నము నుండిగాని లేక జన్మచక్ర లగ్నము నుండిగాని, పంచమ స్థానము పాపగ్రహములచే కూడియున్నను లేక వానిచే వీక్షించబడుచున్న పృచ్ఛకుని కి స్వల్ప సంతానము మాత్రమే గలుగును. అష్టమ స్థానము వాని స్వస్థానమై అందు రవిగాని లేక శనిగానియున్న పృచ్ఛకుని భార్య వంధ్య యగును. బుధుడు గాని లేక చంద్రుడు గాని అష్టమ స్థానము నందున్న పృచ్ఛకునికి కుమార్తె గల్గును.

అష్టమ స్థానమున గురుడుగాని లేక శుక్రుడు గానియున్న పృచ్ఛకుని యొక్క భార్య మృతశిశువును కనును. అష్టమ స్థానము నందు కుజుడున్న పృచ్ఛకుని భార్యకు గర్భస్రావము గలుగును. అష్టమ స్థానములో శక్తివంతమైన వాని అధిపతి యున్న పృచ్ఛకుని భార్య అతికష్టముగా ప్రసవించును.

ప్రశ్న లగ్నమునకు 3,5,7,9,11 స్థానముల యందు శనియున్న పుత్రుడు కల్గును. అట్లుగాక శని 2,4,6,8,10,12 స్థానములయందున్న యెడల కన్యక పుట్టును.

అష్టమ స్థానమున రవిలేక శుక్రునితో కూడియున్నను, లేక ద్వితీయ, అష్టమ, ద్వాదశ స్థానములు పాపగ్రహములతో కూడియున్న మొదటి శిశువు నశించి తరువాత గలిగిన సంతతికి అల్పాయువు సంభవించును.

ద్వాదశ స్థానాధిపతి కేంద్రము నందుండి శుభగ్రహములచే గూడియున్నను లేక వీక్షింపబడుచున్న శిశువు జీవించును. పూర్ణచంద్రుడు కేంద్రము నందుండి

శుభగ్రహములచే వీక్షించ బడుచున్న జనించు శిశువు ధీర్ఘాయువు గలిగి యుండును. లగ్న పంచమాధిపతులు బేసిరాశుల యందున్న పురుష సంతానమును. సమరాశుల యందున్న స్త్రీ సంతానము లగును. పంచమ స్థానాధితి పురుష రాశియందుండి లగ్నాధిపతిగూడ పంచమ స్థానము నందుండి పురుష గ్రహములతో వీక్షించ బడుచున్న వృచ్ఛకుని సంతానము పురుషుడై యుండును. పంచమాధిపతి సమరాశి యందుండి. లగ్నాధిపతిగూడ సమరాశి యుందుండి స్త్రీ గ్రహములతో వీక్షించ బడుచున్న వృచ్ఛకునికి స్త్రీ సంతానము గలుగును. లగ్నము ద్విస్వభావ రాశియై శుభ గ్రహములతో గూడియున్న వృచ్ఛకునికి కవల పిల్లలు జనించెదరు. లగ్నము నుండి లెక్కించగా శని బేసిరాశి యందున్న వృచ్ఛకునికి పురుష సంతానము గలుగును. లగ్న స్థానము నుండి శని సమరాశి యందున్న వృచ్ఛకునికి స్త్రీ సంతానము గలుగును.

## వివాహ ప్రశ్నలు

ప్రశ్న సమయములో ఉదయ లగ్నము నందు రవి. కుజ. బుధులున్న వివాహము వెంటనే జరుగును. కాని వధువు కొద్దికాలమునకే వైదవ్యమును పొందును. ప్రశ్న లగ్నము నందు శనియున్న వివాహము చేసుకొనబోవు స్త్రీ పేదరాలును. పిల్లలు కలిగి త్వరలో చనిపోవును. ప్రశ్న లగ్నము నందు చంద్రుడున్న దంపతులు త్వరలో నశించెదరు. ప్రశ్నలగ్నము నందు గురు. శుక్ర. బుధులున్న దంపతులు సుఖసౌఖ్యములను పొందుచూ దీర్ఘాయువు గలిగి యుందురు. వరునకు కన్య దొరుకునా అను ప్రశ్న-

ప్రశ్న లగ్నమునకు శని 2,4,6,8,10,12 స్థానముల యందున్న కన్యలాభం గల్గును. లేనిచో విషమ స్థానములయందున్న కన్యాలాభము కాదని యెరుగ వలెను.

ప్రశ్నకాలమున కర్కాటక. తులా. వృషభములలో నొకటి ప్రశ్న లగ్నమై. చంద్ర యుక్తమై శుభగ్రహములచే చూడబడిన పురుషులకు కన్యాలాభము తప్పక జరుగును.

ప్రశ్నలగ్నము నుండి రెండవ స్థానమున చంద్రుడున్న వివాహము జరుగబోవు స్త్రీ అధిక సంతానవంతు రాలగును. ప్రశ్న లగ్నమునకు ద్వితీయ స్థానమున రవి. శని లేక కుజుడున్న వివాహమైన దంపతులు పేదరికము వలన దుఃఖితులగుదురు. ద్వితీయ స్థానమున రాహువున్న వివాహమైన స్త్రీ భర్తకు యిష్టములేని దగును. ద్వితీయ స్థానమున శుభగ్రహములున్న వివాహమై స్త్రీ భర్తతో దీర్ఘకాలము సుఖజీవనము గడుపుచూ సంతానము గలిగి యుండును.

ప్రశ్న లగ్నమునకు తృతీయ స్థానమున రాహువుగాని లేక గురుగ్రహము గానియున్న వివాహమైన స్త్రీ సంతానము లేనిదగును. ఇతర గ్రహములు తృతీయ స్థానము నందున్న స్త్రీ సుఖసౌఖ్యములు పొంది వృద్ధి యుందుండును. ప్రశ్న లగ్నమునకు నాల్గవ స్థానమున రవి చంద్రులుగాని లేక శనిగానియున్న స్త్రీ పిల్లలకు యిచ్చుటకు పాలులేని దగును. నాల్గవ స్థానమున రాపువున్న తన భర్తకు యితర స్త్రీతో సంబంధము గలిగి యుండును. నాల్గవ స్థానమున బుధ. శుక్ర. కుజ లేక

గురుడున్న స్త్రీ అల్పాయువు గలిగి యుండును. ప్రశ్నలగ్నమునకు పంచమ స్థానమున శనియున్న వివాహము చేసుకొనబోవు స్త్రీ రోగవంతరాలగును. అదే పంచమ స్థానమున శుక్ర, గురు లేక బుధుడున్న స్త్రీ యెక్కువ సంతానము గలిగి యుండును. పంచమ స్థానమున రవి లేక చంద్రుడున్న స్త్రీ సంతాన హీనురాలగును. పంచమ స్థానమున రాహువున్న పుత్రనాశము సంభవించి స్త్రీ సంతానము లేనిదగును. పంచమ స్తానమున కుజుడున్న స్త్రీకి పత్రనాశము సంభవించును.

ప్రశ్న లగ్నమునకు షష్టస్థానమున చంద్రుడున్న వివాహము కాబోవు స్త్రీ త్వరలో వైధవ్యమును పొందును. షష్టస్థానమున బుధుడున్న వివాహమైన స్త్రీ యింటి యందు కలహములకు కారకురాలగును. షష్టస్థానమున శుక్రుడున్న స్త్రీ భర్తతో సుఖసౌఖ్యములు పొందుచూ దీర్ఘాయువు గలిగి యుండును. చంద్రుడు, బుధుడు, శుక్రుడు మినహా యితర గ్రహములు షష్టస్థానము నందున్న వివాహము కాబోవు స్త్రీతో సకల సౌఖ్యములను పొందగలుగును.

ప్రశ్న లగ్నమునకు సప్తమ స్థానమున శనియున్న వివాహమైన కొద్ది కాలమునకే స్త్రీ విధవ యగును. సప్తమ స్థానమున రవియున్న స్త్రీ రోగవంతు రాలగును. సప్తమ స్థానమున చంద్రుడున్న వివాహ స్త్రీ జ్వరముతో బాధనొందును. సప్తమ స్థానమున కుజుడున్న స్త్రీ యితర పురుషునిచే తీసుకొని పోబడును. సప్తమ స్థానమున గురుడుగాని బుధుడుగాని యున్న స్త్రీ వివాహమైన వెంటనే వృద్ధిచెందును. సప్తమ స్థానమున రాహువున్న వివాహమైన స్త్రీ విధవయగును. ప్రశ్నలగ్నమునకు సప్తమ స్థానమున శుక్రుడున్న వివాహమైన వెంటనే స్త్రీ మరణించును.

ప్రశ్న లగ్నమునకు అష్టమ స్థానమున గురు శుక్ర రాహువులున్న సర్వ నాశనమునకు హేతువగును. అయితే బుధ శనులు అష్టమస్థానము నందున్న వివాహము కాబోవు స్త్రీకి సకల సంపత్తులు గలుగును. అష్టమ స్థానమున చంద్రుడున్న సర్వనాశనమునకు హేతువగును. అష్టమ స్థానమున రవిగాని లేక కుజుడు గాని యున్న యొకనితో వివాహమునకు స్థిరపరచుకొన్న స్త్రీ యింకొకనిని వివాహమాడును. ప్రశ్న లగ్నమునకు నవమ స్థానమున బుధుడున్న రోగవతిగా యున్న స్త్రీని వివాహమునకు స్థిరపరచుకొని మఱల వదిలివేయ బడును. ప్రశ్న లగ్నమునకు నవమస్థానము నందు గురుడు లేక చంద్రుడుండిరేని వివాహమునకు అనుకున్న స్త్రీ యెక్కువ సంతానవంతురాలగును. ప్రశ్న లగ్నము నకు నవమ స్థానమున రవి, కుజ, శుక్ర, శని, రాహు లేక కేతు గ్రహము లుండిరేని వివాహమునకు స్థిరపరచుకొన్న స్త్రీ సంతాన హీనురాలగును.

ప్రశ్న లగ్నమునకు దశమస్థానమున చంద్రుడున్న వివాహమునకు స్థిరపరచు కొన్న స్త్రీ సంతాన హీనురాలగును. దశమస్థానమున శుక్రుడున్న భర్తకు ఇష్టములేని స్త్రీ అగును. దశమ స్థానమున కుజుడు లేక శనియున్న స్త్రీ విదవయగును. దశమ స్థానమున గురుడున్న స్త్రీ పేదరాలగును. దశమ స్థానమున బుధుడుగాని లేక రవిగాని యున్న స్త్రీ సుఖసౌఖ్యములను పొందును. ప్రశ్నలగ్నమునకు యేకాదశ స్థానమున అన్ని గ్రహములున్న వివాహమునకు

స్థిరపరచుకున్న స్త్రీ సంతానము, సుఖము, సౌఖ్యము, భాగ్యము గలిగి యుండును. ద్వాదశస్థానమున చంద్రుడున్న వివాహమునకు స్థిరపరచుకొన్న స్త్రీ సర్వ నాశనమునకు హేతువగును. ప్రశ్న లగ్నమునకు ద్వాదశ స్థానమున శని కుజులున్నను, లేక ఈ గ్రహములు ద్వాదశస్థానమును వీక్షించుచున్న వివాహమునకు స్థిరపరచుకున్న స్త్రీ తాగుబ్రోతుదగును. ద్వాదశస్థానమున బుధుడున్న వివాహమునకు స్థిరపరచుకున్న స్త్రీకి పురుష సంతానము గలుగును ద్వాదశస్థానమున గురుడున్న స్త్రీ అధిక ధనము, భాగ్యము గలది యగును. ద్వాదశ స్థానమున రవి లేక రాహువున్న స్త్రీ సంతాన హీనురాలగును. ద్వాదశ స్థానమున శుక్రుడున్న స్త్రీ ధనసంపదలు, సౌఖ్యము గలిగియుండును.

వృచ్ఛకుని ప్రశ్న - వివాహ సంబంధమై యున్నపుడు లగ్నాధిపతి లగ్నమును వీక్షించుచుండి సప్తమాధిపతి సప్తమ స్థానమును వీక్షించుచున్నను లేక లగ్నాధిపతి లగ్నమును వీక్షించు చుండి సప్తమ స్థానాధిపతి లగ్నమును వీక్షించు చున్నను లేక లగ్నాధిపతి సప్తమ స్థానాధిపతిని వీక్షించుచున్నను, సప్తమాధిపతి లగ్నాధిపతిని వీక్షించుచుండి చంద్రుని యొక్క వీక్షణ గూడ గలిగియున్న వృచ్ఛకుని వివాహ వాంఛ నెరవేరును.

ప్రశ్న లగ్నము సింహరాశియైనప్పుడు యిందుకు సంబంధించిన పని లగ్నము, లగ్నాధిపతి రవి, కార్యస్థానమైన సప్తమ స్థానము కుంభరాశియు, వాని అధిపతి శని, లగ్నమును లగ్నాధిపతియైన రవి వీక్షించుచుండి, సప్తమ స్థానమును కార్యాధిపతియైన శని వీక్షించుచున్నను, లేక రవి సప్తమ స్థానమును వీక్షించుచుండి శని లగ్నమును వీక్షించుచున్నను, లేక రవి శనిగ్రహమును వీక్షించుచుండి, శని రవిగ్రహమును వీక్షించుచున్నను వృచ్ఛకుని యొక్క వాంఛ చంద్రుని యొక్క వేక్షణపై వానికి గల్గియున్న తప్పక సఫలమగును.

సప్తమాధిపతి లగ్నాధిపతితోగాని లేక చంద్రునితోగాని యిధ్యషాల యోగమును పొందియున్న వృచ్ఛకుడు వెతుక కుండగనే త్వరలో వధువును పొందగలడు. లగ్నాధిపతిగాని, చంద్రుడుగాని సప్తమ స్థానము నందున్న వృచ్ఛకుడు వధువు కష్టము మీద లభించును. లగ్నాధిపతి చంద్రునితో మూసరిఫః యోగము నందున్నను, లేక లగ్నాధిపతి సప్తమాధిపతితో యిధ్యషాల యోగము నందున్న వృచ్ఛకుడు ప్రయత్నము లేకనే వధువును పొందగలడు. లగ్నాధిపతి సప్తమాధిపతితో యిధ్యషాల యోగము నందుండి సప్తమాధిపతి పాపగ్రహములతో సంయోగము చెందియున్నను, లేక అస్తమించి యున్నను వృచ్ఛకుడు వధువుని గ్రహించుటలో విఫలుడగును. అష్టమ స్థానాధిపతి పాపియైనను వృచ్ఛకుడు వధువును గ్రహించుటలో విఫలుడగును. తృతీయ స్థానాధిపతి లేక చతుర్థ స్థానాధి పతి పాపియైయున్న వృచ్ఛకుడు సోదరులు లేక తండ్రి మూలమున వధువును గ్రహించుటకు విఫలుడగును.

ప్రశ్నలగ్నమునకు 3, 6, 11, 7, 5 స్థానముల యందు చంద్రుడుండి, రవి, బుధ, గురులచే చూడబడినా లేక లగ్నమునకు కేంద్ర త్రికోణములందు గురు, బుధ, శుక్ర, చంద్రులున్నా, లగ్న సప్తమాధిపతులు సప్తమ, లగ్నగతులైనా వివాహము త్వరలో జరుగును.

లగ్న అష్టమాధిపతులు ఒకే ద్రేక్కాణము నందున్న పృచ్ఛకుడు తప్పక జయమును పొందగలుగును. లగ్న. భావాధిపతులు యొకే భావములో యొకే ద్రేక్కాణము నందు కలసియున్న ఆ భావఫలములు యెక్కువగా వర్ధిల్లు చుండును. ప్రశ్న లగ్నము నందు యే భావాధిపతి షోడశ వర్గీయ బలము నందు యెక్కువ వర్గులు పొందియుండునో ఆ భావాధిపతికి సంబంధించిన భావము యెక్కువ సుఫలములు గల్గి యుండును.

ఉ।। ప్రశ్న కాలమున లగ్నము కన్యారాశిలో 5 భాగలయందున్నదని భావించెదము. ఈ లగ్నమున షోఢశ వర్గీయ బలము కనుగొన వలెను. ఇందు గురునకు యెక్కువ శుభవర్గులు వచ్చినట్లు గ్రహించెదము. ఇందు చతుర్థ, సప్తమ స్థానములకు గురుడు అధిపతియై యున్నాడు. కాబట్టి యీ స్థానముల యొక్క ఫలములు యెక్కువ వర్ధిల్లు చుండును.

లగ్న. యేకాదశాధిపతులు సుఫలముల నిచ్చువారగుచున్నారు. లగ్న. యేకాదశాధిపతులు యొక్క కలయిక యెప్పుడు సుఫలములు నిచ్చును. వీనిపై చంద్ర దృష్టి గలిగియున్న సుఫలములు వృద్ధి పొందును. ఏ యోగము నందైనను చంద్ర దృష్టి లేనియెడల యోగము బలహీనమగును.

దశమాధిపతి భాగ్యస్థానమును వీక్షించుచున్నను లేక భాగ్యస్థానము నందున్నను లేక భాగ్యస్థానాధిపతితో చేరియున్నను లేక ఏకాదశాధిపతి దశమాధిపతి ద్వాదశాధిపతి లేక అష్టమాధిపతితో చేరియున్న పృచ్ఛకునికి అధిక లాభము గలుగును. అష్టమ మరియు ద్వాదశ స్థానములు శుభగ్రహములతో వీక్షింపబడుచున్న సత్య లేక ధర్మప్రవర్తన మరియు మంచికార్యములు వృద్ధిచెందును. ఈ విధముననే యితర భావములను గూడ చూచుకొన వలెను. లగ్నాధిపతి షష్టస్థానము నందున్న పృచ్ఛకుని స్వంత ఆత్మయే వానికి విరోధియగును. లగ్నాధిపతి అష్టమస్థానము నందున్న పృచ్ఛకుని మరణము సూచించును. లగ్నాధిపతి ద్వాదశస్థానము నందున్న పృచ్ఛకునికి యెల్లప్పుడు నష్టములు సంభవించును. బుధుడు లగ్న స్థానము నందుండి చంద్రునితో గాని లేక యితరములైన పాపగ్రహములతో వీక్షించ బడుచున్న త్వరలో పృచ్ఛకునికి ధనలాభము గలుగును. కాని దీనితో పాటు పృచ్ఛకునికి కష్టములు సంభవించును.

స్థానములను చర్చించునపుడు చంద్రుని యెల్లప్పుడు బీజముగను, లగ్నమును పుష్పముగను, నవాంశ లగ్నమును ఫలముగను, రాశి స్థానమును రుజిగను గ్రహించ వలెను. లగ్నాధిపతి లగ్నమును వీక్షించుచుండి, కార్యాధిపతి కార్యస్థానమును వీక్షించుచున్నను లేక లగ్నాధిపతి కార్యస్థానమును వీక్షించుచుండి, కార్యాధిపతి లగ్నమును వీక్షించుచున్నను లేక లగ్నాధిపతి కార్యాధిపతిని వీక్షించుచుండి కార్యాధిపతి లగ్నాధిపతిని వీక్షించుచున్నను పృచ్ఛకుని యొక్క వాంఛ చంద్రుని యొక్క వీక్షణగూడ పైవానికి గలిగియున్న తప్పక సఫలమగును.

ఏదైనా యొక కార్యమును చర్చించునపుడు లగ్నము, లగ్నాధిపతి శక్తి వంతమై యుండవలయును. ఏదైనా యొక శుభగ్రహము లగ్నమును వీక్షించుచున్న వాని యొక్క సుఫలము 75 శాతము యుండుటచే కార్యము సిద్ధించునని చెప్ప

వచ్చును. లగ్నాధిపతిని మాత్రమే శుభగ్రహము వీక్షించుచున్న సుఫలము 50 శాతము మాత్రమే యుండుటచే కార్యసిద్ధికి అవకాశము గలదని చెప్పవలెను. లగ్నముపై యేగ్రహ వీక్షణలేకున్న ఫలము అనుకూలముగా లేనట్లు గ్రహించవలెను.

## స్త్రీ పురుష లైంగిక ప్రశ్నలు

కుజ, రవి, శుక్రులు సప్తమ స్థానము నందున్న వేరొక స్త్రీతో పృచ్ఛకునికి సంబంధము యున్నట్లు చెప్పవలెను. సప్తమ స్థానమున గురుడున్న భార్యతోను, బుధుడు లేక చంద్రుడున్న వ్యభిచార వృత్తి యందున్న స్త్రీతోను, శనియున్న తక్కువజాతి స్త్రీతోను సంబంధమున్నట్లు గ్రహించ వలెను. పృచ్ఛకునికి సంబంధమున్న స్త్రీ యొక్క వయస్సు చంద్రుని యొక్క వయస్సు పోలియుండును. సప్తమ స్థానమున చంద్రుడున్న పృచ్ఛకునికి సంబంధించిన స్త్రీ బాలయనియు, బుధుడున్నను బాలయనియు, శనియున్న వయస్సు మీరిన స్త్రీయనియు, రవి లేక గురుడున్న నిర్బంధములో యున్న స్త్రీ యనియు, కుజుడు మరియు శుక్రుడున్న గయ్యాళి స్త్రీ యనియు గ్రహించవలెను.

పృచ్ఛకుని ప్రశ్న - నాకు యేస్త్రీతో పొందు గల్గునని తలంచు చున్నాను ? అని అడిగినప్పుడు పైన సూచించిన అంశములను బట్టి జవాబు చెప్పవలెను. శుక్ల పంచమి అనగా చంద్రుడు సూర్యునకు 48 భాగల దూరము నందున్నపుడు చంద్రుడు బాలకుడుగా పరిగణింపబడును; పై ప్రశ్న స్త్రీ అడిగిన ఈమెకు సంబంధమున్నది. పురుషునిగా భావించి సమాధానము చెప్పవలయును. సప్తమ స్థానమున శనియున్న ఈ స్త్రీకి వృద్ధునితో పొందుయున్నట్లు గ్రహించ వలెను. ఇతర విషయములు గూడ పై అంశములను బట్టి చెప్పవలెను.

చంద్రుడు కేంద్రస్థానమున శుభులతో యిధ్యషిల యోగము పొందిన పృచ్ఛకుని దాంపత్యము సుఖసౌఖ్యములను పొందును. చంద్రుడు కేంద్రమున పాపులతో యిధ్యషిల యోగము పొందిన పృచ్ఛకునికి దాంపత్యసుఖము లేకపోవుటయే గాక భార్యాభర్తలు యెల్లపుడు తగవులు పోట్లాటలు గలిగి యుందురు. స్త్రీ యొక్క లైంగిక స్వభావము సప్తమ స్థానము యొక్క రాశిని బట్టి తెలుసుకొనవలెను. లగ్నమున గురుడును, సప్తమమున శుక్రుడును, చతుర్థ స్థానము న చంద్రుడున్న దంపతుల యొక్క కామసుఖము వారివురికి తృప్తికరముగా యుండును.

చంద్రుడు శుభగ్రహములతో కంబూల యోగము పొందియున్న పృచ్ఛకుని కి స్త్రీతో సాంగత్యము పుష్పమువలె పరిమళించును. చంద్రుడు స్వక్షేత్రము లేక ఉచ్చ క్షేత్రము నందున్న పృచ్ఛకునికి స్త్రీతో పొందు భవనము నందు జరుగును. చంద్రుడు ద్విస్వభావరాశి యందున్న పృచ్ఛకుని యొక్క పొందు తన సొంత భార్య తోనే యుండును. ప్రశ్నలగ్నము చరరాశియై యున్న పృచ్ఛకునికి తన సొంత భార్య గాక యితర స్త్రీతో పొందు గలుగును. చతుర్థ స్థానమున శనియున్న పృచ్ఛకునికి బహిష్టుయైన స్త్రీతో పొందుగలుగును. సింహ, కన్య, తుల, వృశ్చిక, కుంభ, మీన రాశులు పగటికాలమున బలవంతులనియు, మేష, వృషభ, మిధున, కర్కాటక, ధనుస్సు, మకరరాశులు రాత్రి కాలముల బలవంతులని చెప్పబడి యున్నది. పగలు బలము గల రాశ్యాధిపతి తృతీయ లేక నవమ స్థానము నందున్న

వృచ్ఛకుడు పగటి కాలము నందు కామసుఖము పొందువాడగును. రాత్రి బలము గల రాశ్యాధిపతి తృతీయ లేక అష్టమ స్థానము నందున్న వృచ్ఛకుడు రేయిపగలు కామసుఖము పొందు వాడుగ నుండును.

## ప్రయాణ ప్రశ్న

ప్రశ్నలగ్నము నుండి సప్తమ స్థానమున పాపగ్రహమున్న దేనికై వెళ్ళునో ఆకార్యము చెడును. ప్రయాణము కుదరదు. పాపగ్రహములు దశమ స్థానము నందున్న పెద్దవాడో రాజో నిషేదించినందున ప్రయాణము ఆగిపోవును. తృతీయ, ఏకాదశ, షష్ఠస్థానము లందు పాపులున్నచో వెనుకకు తిరిగి వచ్చును. ఎక్కువ గ్రహములు కేంద్రముల యందున్న యెడల కార్యసిద్ధి యగును.

లగ్నాధిపతి, దశమాధిపతియు, కేంద్రముల యందుగాని, ఏకాదశము నందుగాని యున్న యెడల ప్రయాణము వలన మంచి ఫలితము గల్గును. ద్వితీయమునగాని, స్థిరరాశి యందున్న ధనలాభము గల్గును. చతుర్థము స్థిరరాశియై దానియందున్న సుఖసంపదలు లాభించును. లగ్నమందు సుభగ్రహమున్న దేహ సుఖము, అర్థ లాభము, శుభకార్యసిద్ధి గల్గును. చతుర్థ మందు సౌఖ్యము, జయము, అర్థలాభము గల్గును. సప్తమమున శుభగ్రహమున్న సౌఖ్యజయములు, ధనలాభము గల్గును. కేంద్రములందుగాని, కోణములందుగాని శుభగ్రహములున్న కార్యసిద్ధి యగును.

## నష్టజాతక ప్రశ్న

ప్రశ్న నడుగదలచిన పృచ్ఛకునికి జన్మజాతకము లేకుండిన దత్కాల ప్రశ్నలగ్న అంశచక్రములను వేసి వానివల్ల జాతకము వలెనే సమస్తము జెప్ప వలెను. జన్మ జాతకమునకు దత్కాల ప్రశ్నలగ్న జాతకమునకు ఫలము నాలోచింప నించుకంతయైనను భేదములేదు.

ప్రశ్న నడుగదలచిన పృచ్ఛకుడు ఫలదక్షిణాదులకు చేతబూని దైవజ్ఞుని కడకేగి యాయనకు సమర్పించి 108 సంఖ్యకు అధికము గాకుండునట్లు నొక సంఖ్యను ఆ దైవజ్ఞునికి జెప్పవలెను. ఆ సంఖ్యకే ధ్రువాంకమని సంజ్ఞచేయబడినది. ఈ ధ్రువాంకమే ఈ ప్రశ్నఖండమున ముఖ్యముగా గ్రహించి యుండదగిన విషయమై యున్నది. దీనివలననే భూత భవిష్యత్తు వర్తమాన కాలములు మూడింటి యందలి ఫలములు జెప్పదగును.

పృచ్ఛకునిచే 108 లోపుగా చెప్పబడిన సంఖ్య లేక ధ్రువాంకమును 9చే భాగింపగా వచ్చు లబ్దము మేషాదిగత రాశులగును. అట్లు భాగించగా వచ్చిన శేషసంఖ్య ఆవర్తమాన లగ్నములోని నవాంశములగును. ఇట్లు తత్కాల ప్రశ్న లగ్నమును ఆ లగ్నమందలి తత్కాల నవాంశము నేర్పడును. వీనివలన రాశ్యాంశ చక్రములు వేసి దానియందు లగ్నము అంశలగ్నమును వేసి తర్వాత పంచాంగరీత్యా తత్కాలమునకు రవ్యాధి గ్రహముల రాశ్యాంశలను దెలిపి ఆ చక్రములో వ్రాసి యాచక్రమువల్ల భావకారకాదులను విచారించి ఆ చక్రమందు బలాధికుని వల్ల నా పృచ్ఛకునికి శుభాశుభములను జెప్పవలయును.

ఉ.. ఒక పృచ్ఛకుడు వచ్చి చెప్పిన సంఖ్య 67. దీనిని 9 చే భాగించగా వచ్చిన లబ్ధము 7. ఇది మేషాది గతరాశిసంఖ్య అనగా మేషాదిగా 7 రాశులు

గతమైనవి. అనగా తుల వెళ్ళిపోయినది. వర్తమానము 8వ రాశి వృశ్చికలగ్నము జరుగుచున్నది. పై భాగహార శేషము 4 గనుక వర్తమాన వృశ్చికలగ్నములో 4 వ నవాంశయైనది. అనగా కర్కాటక, వృశ్చిక, మీనరాశులు మూటికి నవాంశ గణమునకు కర్కాటకము ఆది గనుక కర్కాటాదిగా 4 వ నవాంశము తుల నవాంశమనియు యేర్పడెను. గనుక నీ ప్రశ్నయందు వృశ్చికలగ్నమనియు, తుల నవాంశమనియు నేర్పడెను. దీని వలన ఫలమును చెప్పవలెను.

నష్టజాతక మడుగవచ్చిన పృచ్ఛకునిచేత దైవజ్ఞునకు సమర్పింప బడిన దక్షిణ, పుష్పములు, ఫలములు మొదలగు వానిని మొత్తము సంఖ్యను పృచ్ఛకునిచే చెప్పబడిన ధ్రువాంకము చేత గుణించి 12 చే భాగించగా మిగిలిన సంఖ్య యెంత యుండునో మేషాదిగా అన్నవ రాశియందు జన్మకాలమునకు గురుడున్నాడని గ్రహించి, పిమ్మట నాపృచ్ఛకుని యొక్క దేహము జూచి యతని వయస్సు చూడగా గురుడెన్ని భగణములు తిరిగి యుండవచ్చునో ఆలోచించి అన్ని పన్నెండు లుంచుకొని ఆ జన్మకాల గురుస్థితి రాశి మొదలుకొని వర్తమాన ప్రశ్న కాల గురు రాశి వరకు అయిన సంఖ్య నందులో కూడగా నెంతయగునో అంత సంఖ్యను తత్కాల సంవత్సరము నుండి విలోమముగా లెక్కింపగా పృచ్ఛకుని యొక్క జన్మ సంవత్సరమగును. పిమ్మట ప్రశ్నకాల స్ఫుట గురునియొక్క రాశిస్థానమును తుడిచి వేసి ఆ క్రింది భాగాదికము వలన ద్వైరాశిరీత్యా మాసాధికము దెచ్చి ఆమాసాధిక మును ప్రశ్నకాల స్ఫుటరవి రాశ్యాదిలోకూడగా ఆ రాశ్యాదియే జన్మసంవత్సరములో అంత స్ఫుట రవి రాశ్యాది యేమాసము నేదిన మందెంత కాలమున కగునో అదియే జన్మకాలమని తెలియవలెను.

ఉ. పృచ్ఛకుని నష్టజాతక ప్రశ్నకాలము 14-6-1970 ఆదివారము ఉదయము గం. 5-30ని. లకు (సాధారణ నామ సం.) అట్టి కాలమందు స్ఫుట గ్రహములు ఈ క్రింది విధముగా యున్నవి.

| | | రా - భా - లి |
|---|---|---|
| రవి | .. | 01 - 29 - 05 |
| గురు | .. | 06 - 02 - 45 |

పృచ్ఛకుని ఆకృతి చూడగా 36సంవత్సరములకు అతిక్రమించినట్లు తోచినది. ఈ జాతకుడు దైవజ్ఞునికి సమర్పించినవి 4 రూపాయలు 9 ఆకులు 5 చెక్కలు 1 నారింజఫలము. వీనియొక్క సంఖ్య మొత్తము 19 అయినది. పృచ్ఛకుడు శాస్త్ర ప్రకారము తలచుకొన్న పిండసంఖ్య అను ధ్రువాంకము 75. సంఖ్య 19 ని ధ్రువాంకము 75 చే గుణింపగా అయినది 1425. దీనిని 12 చే భాగించగా మిగిలిన శేషము 9 గనుక మేషాదిగా 9వ రాశి ధనుస్సు గనుక యీ నష్టజాతక ప్రశ్న అడిగిన వాని జన్మకాలమున ధనూరాశియందు గురుడుండెనని తెలిసినది. ఇప్పుడు ప్రశ్నకాలమునకు గురుడు రా--6 భా--2 లి--45 అనగా తులారాశి యందున్నట్లు తేలినది. గనుక ధనుస్సు మొదలు తులారాశి వరకు నెంచగా 11 అయినవి. అయితే యీ పృచ్ఛకుని వయోమానము చేత గురుడు 3 భగణములు

(36/12=3) తిరిగినట్లు నిశ్చయించబడినది. గనుక 3 భగణములకు సంవత్సరములు 36 ను నీవ ర్తమాన భగణములో పైన వ్రాసిన 11 సంవత్సరములు కూడగా 36+11=47 అయినది. కాబట్టి యీ జాతకు నికి యిప్పుడు 47 వ సంవత్సరము వయస్సు జరుగుచున్నది. ప్రశ్న కాలమైన 14-6-1970 నుండి వెనుకకు తలక్రిందుగా గణింపగా 47 వ సంవత్సరము 1970-47=1923 సంవత్సరమైనది. (రుధిరోద్గారి) ఇక ఈ 1923 సంవత్సరములో నేమాసము, ఏదినము, యేకాలమున జనన మని తెలియవలెను. గనుక ప్రశ్నకాల గురునియొక్క రాశిస్థానమును తీసివేయగా ఆ క్రింది భాగలిప్తలు భా-2 లి-45. వీనినిబట్టి త్రైరాశి కము చేయవలెను. గురుడు ఒక రాశి తిరుగునప్పటికి ఒక సంవత్సర మగును. అనగా 30 భాగలకు 12 మాసములు సమానమైన పై భాగాధి 2-45 కి ఎంత? ఈ ప్రకారము గురుభాగాది 3-45 ని 12 చే గుణించి 30 చే భాగించవలెను. ఇట్లు గుణించగా 33-0 అయినది. దీనిని 30 చే భాగించగా లబ్ధము 1 నెల. శేషము 3-0. దీనిని 30 చే గుణించి 30చే భాగించగా లబ్ధము 3 దినములు. శేషము '0'వచ్చినది. (ఈ శేషమును 60 చే గుణించి 30 చే భాగించగా లబ్ధము ఘడియ లగును) అనగా 1 నెల 3 దినములు వచ్చినది. ఈ మసాదికమును పైన వ్రాసిన ప్రశ్నకాల స్ఫుటరవి రాశ్యాధికము 1-29-05 లో కూడగా (1-29-05+1-3-0) 3-2.5 అయినది. 1923 సంవత్సరములో స్ఫుటరవి రాశ్యాధి రా 3-2-5 ఏమాసములో, ఏదినమున, ఏవేళ్ళకు వచ్చునో అదియే ఆ పృచ్ఛకుని యొక్క జన్మ జన్మకాలమని తెలిసి, దానివలన చంద్రామాస తిథ్యాధికమును తెలియవచ్చును. (ఒకవేళ స్ఫుటరవి రాశ్యాధికము కూడగా 3-2-5 బదులు 13-2-5 వచ్చినదను కొందము. ఇది రాశ్యాది గనుక రాశిస్థానములో 12 ను తీసివేయగా

శేషరాశ్యాది 1-2-5. ఈ రాశిస్థానము చక్రము దాటిపోయినది. గనుక 1 సంవత్సరమును పెంచగా వెనుక వచ్చిన 1923 దాటిపోయి 1924 జన్మ సంవత్సర మగును) పంచాంగరీత్యా పైన వివరించిన 1923 సంవత్సరములో స్ఫుటరవి రాశ్యాధి 3-2-5 తేది 18-7-1923 బుధవారము సాయంత్రము X. 6-18 ని.ల (P.M.) కాలముగా గ్రహించబడినది. ఇదియే జాతకుని జన్మకాలముగా గ్రహించవలెను. ఈ కాలమునకు జాతకమును సులభముగా నుద్ధరింపవచ్చును. ఈ ప్రశ్న జాతకమును బట్టి చెప్పెడి ఫలమునకును జన్మజాతకమువల్ల చెప్పెడి ఫలమునకును యించుకంతయు భేదముండదని శ్రీ కాళిదాస మహాకవి ఉత్తర కాలామృతములో వ్రాసియున్నారు. కాని పై కాలమునకు జాతకుని యొక్క రాశి అంశచక్రములను వేసి గ్రహ ములయొక్క దశాంతర్దశలను వ్రాసి ఫలనిరూపణ జేయవలయును.

# గ్రహ సంహిత
(జన్మ జాతకము)

# HUMAN ASTROLOGY FOR ALL

## ఉత్తరార్ధము
## ద్వితీయస్కంధము
## గోచారభావ లక్షణములు

గోచార మనగా సూర్యాది సప్తగ్రహములు ఆయా రాశులలో సంచరించుట వలన ఆయా కాలములలో మనుజులకు సంభవించు శుభా శుభ ఫలములని అర్థము. అనేక జాతక చక్రములలో చక్రము మాత్రమే వ్రాసియుండి గ్రహములయొక్క దీర్ఘింశలు, మహాదశలు, అంతర్దశలు మొదలగు వివరములు యుండవు. అట్టి సందర్భములలో సూక్ష్మ పద్ధతిలో ఆయా కాలములందు గ్రహ సంచారమును బట్టి ఫలములను నిర్దేశించవచ్చును. జాతక చక్రములో పూర్తి వివరములు గోచరించుచున్నను భవిష్యత్ ఫలములను నిర్దేశించునపుడు సరియైన ఫలములు గ్రహించుటకు గ్రహ సంచారముగూడ గ్రహింపు నందుంచుకొనవలెను.

గ్రహ సంచార మనగా యేమిటి ? భవిష్యత్తులో గ్రహచారా చక్రమునందు గ్రహములు సంచరించువపుడు ఆయా కాలములలో యే నక్షత్రము యే రాశి యందు యేగ్రహమున్నది తెలుసుకొనుట అని అర్థము. జన్మచక్రము నందు గ్రహములు యెప్పుడు యొకే విధముగా యుండును. జాతకుడు జన్మించినపుడు గ్రహములు యెచ్చట ఏఏ స్థానముల యందున్నది జాతక చక్రమునందు వివరించబడి యుండును. అయితే గ్రహములు యెప్పుడు ఆకాశములో నిలకడగా యుండవు. అవి యెల్లపుడు వాని కక్ష్యల యందు సంచరించుచుండును. ఏ కాలమునకు గోచార ఫలము కావలయునో ఆ కాలమునందు రాశి చక్రములో గ్రహములను నిర్ణయించి వీనిని జాతక చక్రముతో సమన్వయపరచి ఫలములను నిర్దేశింపవలెను.

ఉదాహరణకు 1989 డిశంబరు నెల గోచార ఫలములు విచారించవలెనని ఆ సంవత్సరము పంచాంగము లేక యఫెమెరీసు కావలెను. హిందూ జ్యోతిష్యము యెప్పుడు నిరయనకాల చక్రమునే అనుసరించి యుండునుగాన యిందుకు సంబంధించిన యన్.సి.లాహిరీ మొదలగు వారు వ్రాసిన యెఫెమెరీనునే గ్రహించ వలెను. డాక్టరు బి. వి. రామన్ ప్రొఫెసర్ కె. యన్. క్రిష్ణమూర్తి మొదలగువారు వ్రాసిన యెఫెమెరీను సాయనకాల చక్రమును సూచించును గాన వానిలో ఆ సమయమునకు సంబంధించిన అయనాంశలను తీసివేయవలసి యుండును.

హిందూ శాస్త్రపద్ధతిలో గ్రహ సంచారమును జన్మకాల సమయమునకు చంద్రుడున్న నక్షత్రము లేక రాశి నుండి సామాన్యముగా చర్చించుట ఆచారము యందున్నది. మీరు జన్మించినప్పుడు చంద్రుడు మీనరాశి యందున్నాడను కొందము. ఇప్పుడు గ్రహ సంచారములో కుజుడు అష్టమస్థానము నందున్నాడు

అని నప్పుడు గ్రహచార చక్రములో మీనరాశి అనగా చంద్రుడున్న రాశి నుండి లెక్కించగా యెనిదవ స్థానము తులారాశి యందు కుజుడున్నాడని భావించవలెను. కాబట్టి ఇందు లగ్న. ద్వితీయ. తృతీయ మొదలగు స్థానములన్నియు జన్మరాశి అనగా జన్మకాలమునందు చంద్రుడున్న రాశి స్థానము నుండి లెక్కించవలెను. ఇచ్చట లగ్నమనగా చంద్ర లగ్నమని భావించవలెను. జన్మరాశి చక్రమునందున్న సూర్యునకు జన్మరాశి సూర్యుడనియు. గోచార చక్రమునందున్న సూర్యునకు గోచార చక్రమునందున్న సూర్యుడని చెప్పవలయును. ఈ విధమననే యితర గ్రహములను గూడ పేర్కొనవలెను.

## రవి సంచారము

జన్మలగ్న చక్రమునందు చంద్రుడున్న రాశి స్థానము నుండి గోచార చక్రములో సంచారమునందున్న రవియున్న రాశి వరకు లెక్కించగా

1) 3-6-10-11స్థానముల యందున్న రవి శుభఫలములనిచ్చును.

2) 1-2-5-7-9 స్థానముల యందున్న రవి అశుభఫలములనిచ్చును.

3) 4-8-12 స్థానముల యందున్న రవి పాపియై కీడు చేయును.

జన్మరాశి అనగా జన్మచక్రములో చంద్రుడున్న రాశి లగాయితు సూర్యుడు సంచరించునపుడు వానికి శని గ్రహము తప్ప కొన్ని యితర రాశుల యందున్న గ్రహములు వేధ లగుచున్నవి. ఈ గ్రహ వేధల వలన సూర్యుని యొక్క ప్రభావము కొంత క్షీణించుచున్నది. జ్యోతిష్య శాస్త్ర రీత్యా శని సూర్యుని కుమారు డగుటచే సూర్య సంచారములో శని యే స్థానమునందున్నను సూర్యునికి వేధా దోషము లేదని చెప్పబడియున్నది.

### వేధలు

| | | | |
|---|---|---|---|
| 3 | 6 | 10 | 11 |
| 9 | 12 | 4 | 5 |

(1) 3-9 (2) 6-12 (3) 10-4 (4) 11-5 యివి నాలుగు జతలుగా యేర్పడినవి. జన్మచక్రమున చంద్రుడున్న రాశి నుండి సూర్యుడు మూడవ రాశి యందు సంచరించుచుండగా అదే చంద్రస్థానము నుండి నవమ స్థానము లేక రాశి యందు మినహా యే గ్రహమున్నను సూర్యునకు వేధాదోషము సంభవించును. దీనివలన సూర్యుడు కొంత శక్తిని గోల్పోవును. అదే విధముగా నవమస్థానములో సూర్యుడుండి శని మినహా మూడవస్థానములో ఏ గ్రహమున్నను సూర్యునకు పై విధముననే వేధాదోషము సంభవించును. ఇదే విధముగా పైన వుదహరించిన యితర స్థానములయందు గూడ సూర్యునకు వేధాదొషములు సంభవించుచున్నవి.

## చంద్ర సంచారము

చంద్రుడు తన కక్ష్యలో 27 దినములలో 12 రాశులను తిరిగివచ్చు చున్నాడు. కాబట్టి చంద్రుడు తన సంచారములో యొక రాశిస్థానమును అతి క్రమించుటకు షుమారుగా 2 దినముల 6 గంటల కాలము పట్టుచున్నది. చంద్రుని యొక్క గోచారము చర్చించునపుడు అప్పటి కాలమునకు జన్మనక్షత్రమునందున్న

చంద్రుని యొక్క రాశి స్థానమునుండి సంచారమునందున్న చంద్రుడు యెన్ని రాశి స్థానములు యెడముగాయున్నది గ్రహించవలెను.

1) సంచారమునందున్న చంద్రుడు జన్మరాశి యందున్న చంద్రుని స్థానమునుండి 1-2-3-5-6-7-9-10-11 స్థానములయందున్న శుభఫలములనిచ్చును.

2) 4-8-12 స్థానముల యందున్న చంద్రుడు కీడుచేయు వాడై అశుభ ఫలముల నిచ్చును.

వేధలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 3 | 6 | 7 | 10 | 11 |
| 5 | 9 | 12 | 2 | 4 | 8 |

(1) 1-5 (2) 3-9 (3) 6-12 (4) 7-2 (5) 10-4 (6) 11-8 యివి ఆరు జతలుగా యేర్పిడినవి. జన్మచక్రమున చంద్రుడున్న స్థానములో అనగా చంద్రలగ్నములో సంచారమునందున్న ప్రస్తుత చంద్రుడుండి అచ్చట నుండి 5 వ స్థానములో బుధుడు తప్ప యితర గ్రహములు యేవి యున్నను చంద్రుని యొక్క ప్రభావము క్షీణించును. ఈ విధముననే పంచమస్థానమున చంద్రుడుండి చంద్రలగ్నమున బుధుడు మినహా యితర గ్రహములు యేవియున్నను సంచారము నందున్న చంద్రునకు వేధాదోషము సంభవించి తన శక్తిని కొంత గోల్పోవునాచ్నుడు. పైన వివరించిన యితర జతలు గల స్థానములందు గూడ చంద్రునకు సంచారమునందు వేధాదోషములు సంభవించుచున్నవి. హిందూ పురాణములను బట్టి బృహస్పతి భార్యయైన తారకు చంద్రునితో సంబంధము యున్నట్లును వీరి సంబంధము వలన బుధుడు జన్మించినట్లు చెప్పబడి యున్నవి. బుధుడు చంద్రుని కుమారుడగుటచే బుధుడు యే స్థానము నందున్నను చంద్రునకు వేదాదోశము సంభవించదు.

కుజ సంచారము

చంద్ర లగ్నమునుండి సంచారమునందున్న కుజుని స్థానము వరకు లెక్కించగా

1) 3-7-10-11 స్థానములయందున్న కుజుడు మంచి ఫలముల నిచ్చును.

2) 1-2-5-7-9 స్థానములయందున్న కుజుడు అశుభ ఫలముల నిచ్చువాడ గుచున్నాడు.

3) 4-8-12 స్థానములయందున్న కుజుడు పాపియై కీడుచేయు వాడగుచున్నాడు.

వేధలు

| | | |
|---|---|---|
| 3 | 6 | 11 |
| 12 | 9 | 5 |

1) మూడవస్థానమున కుజుడుండి ద్వాదశ స్థానమున యే గ్రహమున్నను, ద్వాదశస్థానమున కుజుడుండి తృతీయ స్థానమున యే గ్రహమున్నను, 2) షష్టమ స్థానమున కుజుడుండి నవమస్థానమున యే గ్రహమున్నను లేక నవమస్థానమున కుజుడుండి షష్టమస్థానమున యే గ్రహమున్నను, 3) ఏకాదశస్థానమున కుజుడుండి

పంచమ స్థానమున యే గ్రహమున్నను లేక పంచమస్థానమున కుజుడుండి ఏకాదశ స్థానమున యేగ్రహమున్నను కుజునియొక్క ప్రభావమునకు అంతరాయము గల్గి తానున్న స్థానమునుబట్టి శుభాశుభములు గలుగును. స్థానములను లెక్కించునపుడు జన్మ చక్రములో చంద్రుడున్న స్థానము నుండి ప్రారంభించవలెను.

## బుధ సంచారము

జన్మరాశి చక్రములో చంద్రుడున్న స్థానము నుండి సంచారచక్రములో బుధుడున్న స్థానము వరకు లెక్కించగా....

1) 2-6-10-11 స్థానముల యందు బుధుడున్న శుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

2) 1-3-5-7-9 స్థానముల యందున్న బుధుడు అశుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

3) 4-8-12 స్థానముల యందున్న బుధుడు పాపియై జాతకునికి కీడుచేయువాడగుచున్నాడు.

### వేధలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2 | 4 | 6 | 8 | 10 | 11 |
| 5 | 3 | 9 | 1 | 8 | 12 |

జన్మచక్రమున చంద్రుడున్న స్థానము నుండి రెండవ స్థానమున బుధుడుండి పంచమస్థానమున చంద్రుడు మినహా యితర గ్రహములు యేవియున్నను బుధునకు వేధాదోషము గలుగుచున్నది. అదేవిధమున బుధుడు పంచమస్థానమునందుండి ద్వితీయస్థానమున చంద్రుడు మినహా యితర గ్రహములు యేవియున్నను బుధునకు వేధాదోషము సంభవించుచున్నది. అదేవిధమున పైన చూపబడిన యితర స్థానముల జతలయందుగూడ బుధునకు వేధాదోషములు సంభవించును. చంద్రుడు బుధునియొక్క తండ్రి యగుటచే చంద్రుడు యేస్థానమునందున్నను బుధునకు వేధాదోషము గలుగును. స్థానముల లెక్క యెప్పుడును జన్మ లగ్నమున చంద్రుడున్న రాశివద్ద నుండి గ్రహించవలెను.

## గురు సంచారము

జన్మరాశి చక్రములో చంద్రుడున్న స్థానమునుండి గోచారరాశి చక్రములో గురుడు సంచరించుచున్న రాశి స్థానము వరకు లెక్కించగా.....

1) 2-5-7-9-11 స్థానముల యందు గురుడున్న శుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

2) 1-3-6-10 స్థానముల యందు గురుడున్న అశుభ ఫలముల నిచ్చువాడగుచున్నాడు.

3) 4-8-12 స్థానముల యందున్న గురుడు పాపియై జాతకునికి కీడుచేయువాడగుచున్నాడు.

### వేధలు

| | | | | |
|---|---|---|---|---|
| 2 | 5 | 7 | 9 | 11 |
| 12 | 4 | 3 | 10 | 8 |

జన్మ చంద్రుడున్న స్థానమునుండి ద్వితీయస్థానమున గురుడుండి ద్వాదశ స్థానమున యేగ్రహమున్నను గురునకు వేధాదోషము సంభవించి జాతకునికి శుభఫలములు యివ్వలేని వాడగుచున్నాడు. అదేవిధముగా ద్వాదశస్థానమున గురుడుండి ద్వితీయస్థానమున యేగ్రహమున్నను గురుడు కీడు కలిగించు వాడగుచున్నాడు.

## శుక్ర సంచారము

జన్మరాశి చక్రములో చంద్రడున్న స్థానమునుండి గోచారరాశి చక్రములో శుక్రుడు సంచరించుచున్న రాశిస్థానము వరకు లెక్కించగా......

1) 1-2-3-9-11 స్థానముల యందు శుక్రుడున్న మంచి శుభఫలముల నిచ్చును.

2) 5-6-7-10 స్థానముల యందు శుక్రుడున్న అశుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

3) 4-8-12 స్థానముల యందున్న శుక్రుడు కీడుచేయు వాడగుచున్నాడు.

### వేధలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 8 | 9 | 11 | 12 |
| 8 | 7 | 1 | 10 | 9 | 5 | 11 | 6 | 3 |

జన్మరాశి చక్రములో చంద్రుడున్న రాశి యందు శుక్రుడుండి దానికి అష్టమ స్థానమున యేగ్రహమున్నను శుక్రునకు వేధాదోషము సంభవించుచున్నది. ఈ విధముననే అష్టమస్థానమున శుక్రుడుండి చంద్రలగ్నమున యే గ్రహమున్నను శుక్రునకు వేధాదోషము సంభవించును. ఇదేవిధమున పైజతల స్థానములయందు శుక్రునకు వేధాదోషము గలుగుచున్నది.

## శని సంచారము

జన్మరాశి చక్రములో చంద్రుడున్న స్థానము నుండి గోచార రాశి చక్రములో శనియున్న స్థానము వరకు లెక్కించగా....

1) 3-6-10-11 స్థానముల యందు శనియున్న శుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

2) 1-2-5-7-9 స్థానముల యందున్న శనియున్న అశుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

3) 4-8-12 స్థానముల యందున్న శనియున్న జాతకునికి కీడుచేయు వాడగుచున్నాడు.

### వేధలు

| | | |
|---|---|---|
| 3 | 6 | 11 |
| 12 | 9 | 5 |

జన్మరాశి చక్రములో చంద్రుడున్న స్థానమునుండి మూడవ స్థానమున శని యుండి ద్వాదశ స్థానమున రవి మినహా యితర గ్రహములు యేవియున్నను శనికివేధాదోషము సంభవించును. ఈ విధముననే జన్మచంద్రుడున్న స్థానమునుండి సంచారమునందున్న శని ద్వాదశస్థానము నందుండి జన్మచంద్రునికి మూడవ స్థానమున రవి మినహా యితర గ్రహములు యేవియున్నను శనికి వేధాదోషము

సంభవించును. అదేవిధమున 6-9 మరియు 11-5 జతల స్థానములయందున్న స్థానములకు గూడ వర్తించును. రవియును, శనియు తండ్రి కుమారులై యుండుటచే వారికి వేధాదోషము గలుగదు.

## రాహుకేతువుల సంచారము

జన్మచంద్రుడున్న స్థానమునుండి సంచారము నందున్న రాహువు వరకు లెక్కించగా....

1) 3-6-10-11 స్థానముల యందున్న రాహువు శుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

2) 1-2-5-7-9 స్థానముల యందున్నరాహువు అశుభఫలముల నిచ్చువాడగుచున్నాడు.

3) 4-8-12 స్థానముల యందున్న రాహువు జాతకునికి కీడుచేయు వాడగుచున్నాడు.

### వేధలు

| | | |
|---|---|---|
| 3 | 6 | 11 |
| 12 | 9 | 5 |

జన్మరాశి చక్రమున చంద్రుడున్న స్థానమునుండి మూడవ స్థానమున రాహువుండి ద్వాదశస్థానమున యితర గ్రహములు యేవియున్నను రాహువునకు వేధాదోషము సంభవించును. అదే విధముగా జన్మచంద్రుడున్న స్థానమునుండి సంచారమునందున్న రాహువు ద్వాదశస్థానము నందుండి జన్మచంద్రునికి మూడవ స్థానమున యేగ్రహమున్నను రాహువునకు వేధాదోషము సంభవించును. మిగిలిన యితర జతల స్థానములకు గూడ పై విధముననే వేధాదోషము గలుగుచుండును.

కేతువునకు గూడ రాహువునకు వర్తించు నిబంధనలే వర్తించును. రాహువునకు యెల్లప్పుడు సప్తమస్థానమున కేతువు సంచరించుచుండును. కాన రాహు కేతువులకు సప్తమ స్థానము వేధాదోషముగా పరిగణింపబడును.

ఒక్కొక్క రాశిలో సూర్యుడు యొక్కొక్క నెలయును, చంద్రుడు 2 దినములు 6గంటలును, కుజుడు 1½ మాసములు, బుధుడు యొక్క నెలయు ను, గురుడు ఒక సంవత్సరము, శుక్రుడు ఒక నెలయును, శని 2½ సంవత్సరములు, రాహుకేతువులు 1½ సంవత్సరములు నివసించుచుందురు. జన్మ నక్షత్రము యేది యగునో దానిని బట్టి జన్మరాశిని నిర్ణయించవలెను. ఈ జన్మరాశియే చంద్రుడున్న రాశియ ఏచున్నది. జన్మకాలమున చంద్రుడున్న రాశియే లగ్నముగా భావించి ఈ చంద్రలగ్నము లగాయితు గోచార ఫలము చూచు దినమునకు ఆయా గ్రహములు ఏ స్థానముల యందున్నదిరాశి చక్రమును వ్రాసి చూచుకొనవలెను.

తమోగ్రహములైన రాహుకేతువులు తప్ప తక్కిన సప్తగ్రహములు ఏఏ భావములను పొందిగాని ఏఏ భావనాధుల బలసంయోగము పొందిగాని యుందురో వారు నాయాభావముల ఫలములను గాని లేక నాయారాశినాధులిచ్చు ఫలములను గాని యిచ్చుచుందురు. జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రమును బట్టి

లగ్నరాశిని నిర్ణయించి ఫలములను నిర్దేశించుట గూడ సాంప్రదాయము గలదు. కాని నామ నక్షత్రమును బట్టి అంతగా రుజువియ్యదు.

ప్రాచీనకాలపు శాస్త్రవేత్తలలో కొందరికి గ్రహవేధల విషయములో భేదాభిప్రాయములు గలిగి వేధాదోషములను ఉపేక్షించి గ్రహముల యొక్క స్థానబలమును బట్టియే ఫలములను నిర్ధేసించుచున్నారు. ఈ ఫలములు గూడ జాతకుని యొక్క జన్మచక్రము వలన గలుగు దశాంతర్థశాఫలములతో సమన్వయపరచి నిరూపించిన చాలా యధార్థమైనవిగా యుండును. గోచారములో సరియైన ఫలములను పొందుటకు ఈ క్రింది నిబంధనలు గూడ మనస్సునందుంచుకొని పాటించవలెను.

గ్రహసంచారములో గ్రహములు జన్మచక్రమునందున్న చంద్రుని స్థానము నుండిగాని లేక లగ్నస్థానము నుండిగాని ద్వాదశస్థానము నందుండగా జాతకునికి అధిక ధనవ్యయము గలిగించును. ద్వాదశ స్థానము నందుండగా జాతకునికి అధిక ధనవ్యయము గలిగించును. ద్వాదశ స్థానమున యొకే సమయములో రెండు మూడు గ్రహములు సంచరించునపుడు ధనవ్యయము అధికమై ప్రత్యేకత చెందియుండును. అవి పాపగ్రహములై యున్న పై ఫలములు బలవత్తరమగును.

ఏ గ్రహమైనను జన్మరాశి చక్రములో స్థానమునందు గాని లేక రాశి క్షేత్రమునందుగాని శక్తివంతమైయుండి జన్మలగ్నస్థానము నుండిగాని లేక చంద్రుడున్న జన్మరాశి క్షేత్రమునుండిగాని 3-6-10-11 స్థానములలో జన్మరాశి చక్రము నందున్న అట్టిగ్రహము గోచారచక్రములో సంచారమున అశుభస్థానమున యున్నను చెడుఫలముల నీయజాలదు.

జన్మచక్రమున యోగకారకుడై శుభస్థానములకు స్వరాశ్యాధిపతియై యున్న గ్రహము గోచారచక్రములో దుస్స్థానముల యందున్నను చెడుఫలముల నీయజాలదు.

ఏ గ్రహమైనను జన్మచక్రములో స్థానబలము, రాశిబలము గలిగి జన్మచక్రలగ్నము నుండిగాని లేక చంద్రలగ్నము నుండిగాని ప్రత్యేకముగా 3-6-10-11 స్థానములయందుండి గోచారచక్రములో సంచారము నందు అదే గ్రహము శుభస్థానముల యందున్న మంచి శుభఫలముల నిచ్చును.

ఏ గ్రహమైనను జన్మచక్రమునందుగాని నవాంశచక్రమునందు గాని నీచక్షేత్రమును గాని లేక శత్రుక్షేత్రమునుగాని పొందియుండి బలహీనుడై పాపగ్రహ వీక్షణము గాని సంయోగముగాని చెందియుండి గ్రహవీక్షణముగాని సంయోగముగాని లేకయుండి లగ్నస్థానము నుండిగాని జన్మచంద్ర లగ్నము నుండి గాని లెక్కించిన దుస్స్థానములకు అధిపతియై యున్న అట్టి గ్రహము గోచార చక్రములో మంచి స్థానముల యందు సంచరించుచున్నను శుభఫలముల నియ్యజాలదు.

ఏ గ్రహమైనను గోచారచక్రములో సంచరించునపుడు ఆ గ్రహము పాపగ్రహముతో సంయోగము చెందినను, పాపగ్రహ వీక్షణము గలిగియున్న ఆ గ్రహము చేయు మేలు కొంతవరకు నశించి కీడుచేయు శక్తి కొంతవరకు వృద్ధి చెందును. గ్రహము సంచరించునపుడు దానికి అస్తంగతదోషము సంభవించినను లేక నీచక్షేత్రమును చేరినను ఆ గ్రహమిచ్చు శుభఫలములు కొంతవరకు నశించి అశుభ ఫలములు వృద్ధిచెందును.

ఏ గ్రహమైనను సంచారము నందున్నపుడు శుభగ్రహములతో సంయోగము చెందినను లేక వానిచే వీక్షించబడినను అట్టి గ్రహము యొక్క శుభత్వము శక్తివంతమై అశుభత్వము క్షీణించును. ఏ గ్రహమైనను తన స్వరాశిని గాని లేక ఉచ్చస్థానమునుగాని చేరినప్పుడు ఆ గ్రహమిచ్చు శుభఫలములుగాని లేక పాపఫలములు గాని వృద్ధిచెందును.

సంచారమునందు శుభగ్రహము వక్రించిన శుభఫలములును పాపగ్రహము వక్రించిన పాపఫలములు వృద్ధిచెందును. గోచారములో రెండు లేక యెక్కువ గ్రహములు యొకే విధమైన ఫలములు గలుగుజేయు చున్నపుడు అ ఫలముల యొక్క ప్రభావము హెచ్చుగా నుండును. గోచారమునందున్న గ్రహమును చర్చించునపుడు ఆ గ్రహముయొక్క పరిస్థితి జన్మచక్రమునందు యెట్లున్నది గ్రహించవలెను.

ఏ పాపగ్రహమైనను జన్మచక్రములో దుస్స్థానము నందుండి సంచారములో ఆ గ్రహము ఆ స్థానమును చేరినప్పుడు తానిచ్చు పాపఫలములు వృద్ధి చెందును. ఆ గ్రహమునకు సంచారమునందు మందకొడి గలిగిన తానిచ్చు పాప ఫలములు బలవత్తర మగును. ఏ శుభగ్రహమైనను జన్మచక్రములో శుభస్థానము నందుండి సంచారములో ఆ గ్రహము ఆ స్థానమును జేరినపుడు తానిచ్చు శుభ ఫలములు వృద్ధిచెందును. ఆ గ్రహమునకు సంచారమునందు మందకొడి గలిగిన తానిచ్చు శుభఫలములు బలవత్తర మగును.

జన్మచక్రములో ఏ స్థానమునకైనను శుభవీక్షణము గల్గియున్న ఆ స్థానమును సంచారములో పాపగ్రహములు చేరియున్న అవి చేయగల్గినంత అశుభమును చేయ జాలవు. అవియే శుభగ్రహములై యున్న శుభఫలములు శక్తి వంతమగును. జన్మచక్రమునందు ఏ స్థానమునకైనను పాపవీక్షణము గలిగియుండి ఆస్థానమును సంచారములో పాపగ్రహములు చేరియున్న అస్థానము పొందు పాప ఫలములు శక్తివంతమై యుండును. అవియే శుభగ్రహములై యున్నను బలహీనమై ఆ స్థానమునకు మేలు చేయజాలవు.

సూర్యునియొక్క కదలిక సగటున రోజుకు 1 భాగయు. చంద్రుని కదలిక రోజుకు 13భాగల 10లిప్తలుండును. బుధ. శుక్రులు యొక్క సంవత్సర కాలములో భూచక్రమునంతను తిరిగి వచ్చుచున్నారు. వీరి యొక్క గమనము రోజుకు 59 లిప్తల 8 విలిప్తలకంటె యెక్కువ యున్న వారియొక్క గమనము అతివేగముగా యున్నట్లు భావించవలెను. కుజునియొక్క గమనము రోజుకు సగటున 33 లిప్తల 28 విలిప్తలుండును. అదేవిధముగా గురుడు 5 లిప్తలు. శని 2 లిప్తలు సగటున రోజు ప్రయాణము చేయుచుందురు. రాహు కేతువులు యెల్లప్పుడు సమానమైన గమనము గలిగియుందురు.

ఏ గ్రహమైనను జన్మలగ్నమునందున్నదై. ఆ గ్రహము 12 రాశులను సంచరించునపుడు అదియున్న రాశి జన్మలగ్నము నుండియే లెక్కించబడి దాని ప్రభావము చూపుచున్నది. జన్మరాశి యందున్న గ్రహములయొక్క శుభత్వముగాని పాపత్వము గాని ఆ గ్రహములు జన్మలగ్న స్థానమునందు సంచరించునపుడు

యెక్కువగా ప్రసాదించును. రవి కుజులు సంచారమునందు యే స్థానము నందున్నను '0' నుండి 10 భాగల యందున్నపుడు. వాని ప్రభావము బలవత్తరముగా యుండును. గురు శుక్రులు వాని సంచార స్థానములో 10 నుండి 20 భాగల మధ్య కాలములో వీర్యవంతులై యుండెదరు. శని చంద్రులు వాని సంచారము లో ఏ స్థానమునందైనను చివర 10 భాగల యందు ప్రభావంతులై యుందురు. బుధ రాహుకేతువుల యే స్థానమునందైనను వాని సంచార కాలములో మొత్తము స్థానము నందు 0° నుండి 30 భాగలు సమానముగా వాని ప్రభావమును చూపెదరు.

గ్రహసంచారములో గ్రహములు గలుగజేయు శుభాశుభములు జన్మరాశి చక్రములో అవియున్న స్థానబలముపైనను. అవియున్న స్వక్షేత్రములపైనను. వానియొక్క కారకత్వముపైనను. సంచారము నందున్న జన్మరాశిచక్రములో చంద్రుడున్న స్థానము నుండియు. జన్మ లగ్నము నుండియు ఆ గ్రహమున్న స్థానముపై ఆధారపడియుండును.

సంపత్సర ఫలములను శని. గురు. రాహుకేతువులను బట్టిన్ని. మాసఫలములను రవి. శుక్ర. కుజాలను బట్టిన్నీ చూచుకొనవలెను. ముందుగా సంవత్సర ఫలములను తరువాత మాసఫలములను చూచుకొవలెను.

## గోచారమునుబట్టి మాసఫలములు

జన్మరాశి లగాయితు 1-8-12 స్థానములయందు రవి. కుజ. గురు. శని గ్రహములున్న జాతకునికి శరీరపీడ. స్థానచలనము. ధనవ్యయము మొదలగు దుష్ఫలములు గలుగును. కేతువుకంటె రాహువు బలమైన గ్రహము గనుకరాహువు గూడ 1-8-12 స్థానములయందుండరాదు. అట్లున్న కీడు సంభవించును. బుధ. గురు శుక్రులు శుభగ్రహములు. రవి. కుజ. శని. రాహుకేతువులు పాపగ్రహములు. శుభగ్రహములు 1-8-12 స్థానములయందున్న స్వల్పముగా కీడు చేయును. ఈ స్థానముల యందు పాపగ్రహములున్న విశేషముగా కీడు చేయును. శని గ్రహము 1-8-12 స్థానములయందున్న అన్ని గ్రహముల కంటె 10 రెట్లు అపకారము చేయును. జన్మరాశి లగాయితు ఏకాదశ స్థానమందు ఏ గ్రహమున్నను ఉపకారమే చేయును. జన్మరాశి లగాయితు 3,6 స్థానముల యందు పాపగ్రహములును. 2, 5, 7, 9, 10 స్థానములయందు శుభగ్రహములున్న విశేష సుఖము నిచ్చును. లగ్నము లగాయితు చతుర్థ స్థానమునకు అర్థాష్టమ స్థానమని పేరు 1-8-12 స్థానములతో పాటు యీ స్థానము గూడ మంచిదికాదు. ఈ నాల్గవ స్థానమునందు శుభగ్రహము గాని పాపగ్రహముగాని యున్న కీడు సంభవించును. ద్వితీయస్థానము గూడ పాప గ్రహములకు మంచిదికాదు. 5, 7, 9, 11 స్థానములయందున్న పాపగ్రహములు సామాన్యఫలము నిచ్చును. అపకారముగాని ఉపకారముగాని జరుగదు. 8 గ్రహములలోను 4 గ్రహములు మంచి ఫలములను. 2 గ్రహములు సామాన్య ఫలములను. 2 గ్రహములు చెడు ఫలములను యిచ్చుచున్నపుడు గోచారఫలము మొత్తము మీద బాగుగా యున్నట్లే చెప్పవలెను. 8 గ్రహములలోను బుధ. శుక్ర. రాహువు మంచిఫలములను రవి. కుజ. కేతువులు సామాన్యఫలములను. గురుడు.

శని పూర్తిగా చెడు ఫలములను యిచ్చుచున్నపుడు గోచారఫలము జబ్బుగా యున్నట్లే చెప్పవలెను.

## గోచారమునుబట్టి సంవత్సర ఫలములు

సంవత్సర గోచారఫలములను తెలుసుకొను నపుడు శని, గురు, రాహువులను బట్టి తెలుసుకొనవలెను. ఏ సంవత్సరమునకు గోచారఫలము కావలయునో నా సంవత్సర పంచాంగమును బట్టి రాశిచక్రమును నిర్ణయించి గ్రహములను వాని వాని స్థానములలో వ్రాసుకొనవలెను. గురుడు బాగుగా నున్నను, శని జబ్బుగానున్న యెడల గోచారఫలము జబ్బుగనే యుండును. గురుడు జబ్బుగా యుండి శని బాగుగాయున్న యెడల గోచాలఫలము బాగుగనే యుండును.

గురుడు జబ్బుగా యున్న ధనవిషయము చిక్కుగా నుండును. శని జబ్బుగా నున్నపుడు ధనవిషయమే గాక శరీరవిషయము గూడ చిక్కులుగనే యుండును. గురుడు ఏకాదశమందున్న ఉపకారము చేసిన చేయవచ్చును లేక చేయక పోవచ్చును. కాని శని జన్మరాశి యందుగాని ద్వాదశమందుగాని యున్నయెడల విశేష ఛిక్కులు గలుగును. సంవత్సర ఫలము శని గురులను బట్టియు, మాస ఫలములు రవి కుజులను బట్టియు చూచుకొనవలెను.

## గోచారమునందు గ్రహఫలము

**1. సూర్యుడు** :- సూర్యుడు లగ్నరాశియందున్న దేహపీడ, హృదయ దౌర్బల్యము అకాలభోజనము, బంధు మిత్ర విరోధము; ద్వితీయమందున్న నైచ్యము, దుష్టసహవాసము, మనస్తాపము, శిరోవ్యాధి, వ్యాపార నష్టము., తృతీయ స్థానము నందున్న దేహారోగ్యము, నిత్యసంతోషము, బంధు మిత్ర సమాగమము, ధనప్రాప్తి, పుత్ర సౌఖ్యము, యిష్టకార్య సిద్ధియును., చతుర్థమందున్న అంతఃకలహములు, అకాల భోజనము, సౌఖ్యహీనము, ప్రయాణ విఘ్నములు గలుగును. సూర్యుడు లగ్నరాశి లగాయితు పంచమస్థానమందున్న దేహమాంద్యము మనస్తాపము, ధన వ్యయము, సుహృత్క్లేశము, బుద్ధిచాంచల్యము., షష్ఠమమందున్న సౌఖ్యము, కార్య సిద్ధి, దేహారోగ్యము, ధన ధాన్యలాభము, వస్త్రాలంకారము మొదలగునవి లభించును.

సూర్యుడు లగ్నరాశి లగాయితు సప్తమరాశియందున్న సామంత జన ద్వేషము, జన కళత్రపీడయు, పుత్రులకనారోగ్యము, కార్యములందు నిరుత్సాహ మును., అష్టమ స్థానమునందున్న దుర్దోషములు, శత్రువివాదము, ప్రయాణ కష్టములు, దుఃఖవార్తలును., నవమస్థానమునందున్న నిందాపరాధ కలహములు, తప్పులేకనే ధననష్టము, పుణ్యాలాభార్థనాశనము, దుఃఖమును., దశమస్థానము నందున్న ధనలాభము, ఆరోగ్య సిద్ధి, బంధుమిత్ర సంయోగము, రాజసందర్శనము, ప్రభుసల్లాపము, మంచి సౌఖ్యమును., ఏకాదశస్థానమునందున్న ద్రవ్యప్రాప్తి, ఆచారము, నిత్యమంగళము, సదా మధురపదార్థ భోజనమును, ద్వాదశస్థానము నందున్న స్వస్థాన నాశనము, బంధువ్యాధి, ధనవ్యయము, ప్రాణనష్టము మొదలగు ఆపదలు గలుగును.

**2. చంద్రుడు** :- జన్మరాశియందున్న శరీరసౌఖ్యము, ఆరోగ్యము, సంతోషము, ధనప్రాప్తి, గౌరవము, మృష్టాన్నభోజనము, చక్కని స్త్రీలతో పొందు,

ప్రజాసన్మానమును., ద్వితీయమందున్న అంతఃక్లేశము, ధననష్టము, దేహజాడ్యము, భోజన అసౌఖ్యము, పెక్కుదోషములును., తృతీయమందున్న ధనలాభము, వస్త్ర లాభము, మన్సంతోషము, ధైర్యము, స్త్రీసల్లాప సౌఖ్యమును., చతుర్థస్థానము నందున్న మతిభ్రంశము, బంధువైరము, చలిచిత్తము, అస్థిరత్వము, కార్యభంగము., పంచమ స్థానమునందున్న వాతాధిక్యము, సర్వదా ఆలస్యము, మనోవ్యధ, భయము, కార్యనాశమును., షష్టస్థానమునందున్న స్వస్థానప్రాప్తి, ఆరోగ్యము, ద్రవ్యలాభము, యసస్సు, సంతోషము, స్త్రీసల్లాప సౌఖ్యమును గలిగించును.

చంద్రుడు జన్మరాశి లగాయితు సప్తమస్థానము నందున్న మనస్సౌఖ్యము, కీర్తి, అభివృద్ధి, సౌభాగ్యము, ద్రవ్యలాభము, స్త్రీసౌఖ్యము, శరీరసౌఖ్యము, అష్టమ స్థానమునందున్న అజీర్ణబాధ, కీళ్ళబాధ, ధాన్యక్షయము, భోజనసౌఖ్య హీనము, దేహ జాడ్యము, వేదనయును., నవమస్థానము నందున్న వస్త్రనాశము, పుత్రవైరము, ప్రవాస గమనము, వ్యాధిబాధ, ఉద్యోగ భంగము, కలహమును., దశమస్థానము నందున్న యిష్టార్థసిద్ధి, ఆయురారోగ్యము, బంధుప్రాప్తి, సంతోషము, భోజన సౌఖ్యము, కార్యసిద్ధియును., ఏకాదశ స్థానమునందున్న మనశ్శాంతి, ఆనందము, మిత్రగృహములలో భోజనప్రాప్తి, ధనధాన్యలాభమును., ద్వాదశ స్థానము నందున్న చిత్తచాపల్యము, మానహాని, బంధువిరోధము, ధనవ్యయము, శరీరమాంద్యము మొదలగునవి గలుగును.

3. **కుజుడు** :- అంగారకుడు లగ్నరాశి యందున్న జ్వరము, ఖడ్గముల ద్వారా గాయములును, భార్యావిరోధము, బంధువిరోధము, యక్షరాక్షస పీడయును, ద్వితీయమందున్న బలహాని, సర్వదాక్లేశము, సర్వకార్య విఘ్నము, దుర్జన సహవాసము, భయమును, తృతీయమందున్న ద్రవ్యలాభము, ఆరోగ్యము, యిష్టకార్యసిద్ధి, సుఖప్రాప్తి, వస్త్ర లాభము, ధనార్జనమును, చతుర్థమందున్న భాగ్య క్షయము, అతి ఘోరమగు భయమును, పంచమస్థానము నందున్న శరీరభోగము, సంతాపము, కాలాతిక్రమ భోజనము, పాపము, అలవిగాని పనులు సంభవించుటయును, షష్టమందున్న వస్త్రలాభము., ధాన్యలాభము, కీర్తి, యుల్లాసము, ధర్మసిద్ధియును గలిగించును.

అంగారకుడు లగ్నరాశి లగాయితు సప్తమ స్థానమునందున్న అన్నవస్త్రాది దారిద్ర్యము, బంధువిరోధము, దుర్భాషణములు వినుట, భ్రాతృపుత్రక్రోధమును., అష్టమమందున్న దేశాంతరవాసము, కార్యహాని, కాసరోగము, స్థానభ్రంశము, ఋణ దాతయును, నవమమందున్న అన్నవస్త్రాది దారిద్య్రము, అనారోగ్యము, స్థాన భ్రష్టత్వము, విరోధము, కృశించుటయును, దశమమందున్న సర్వదాక్లేశము, వ్యాధి, అల్ప భోజనము, యెడ తెగక సంచారముజేయు యుద్యోగమును, ఏకాదశ స్థానము నందున్న ఆరోగ్యము, ద్రవ్యలాభము, సంతోషము, వస్త్రలాభము, కార్యాను కూలత్వము, ధైర్యమును., ద్వాదశరాశియందున్న దేశాంతరవాసము, వ్యాధిబాధ, బంధు విరోధము, ధననాశము, దేశసంచారము గలిగించును.

4. **బుధుడు** :- బుధగ్రహము లగ్నరాశియందున్న మతిచాంచల్యము, బంధువిరోధము, అకాలభోజనము, దుస్సహవాసము, వివాదములు సంభవించును. ద్వితీయస్థానమునందున్న మనోవైకల్యము, మణిమాలార్థలాభము, ఆరోగ్యము,

సౌఖ్యము, సద్గోష్ఠియును., తృతీయ స్థానమందున్న ద్రవ్యవ్యయము, రాజభయము, దాయాదులతో విరోధము, బుద్ధిమాంద్యము; మనస్తాపమును., చతుర్థస్థానమందున్న మాతృ సౌఖ్యము, సంతోషము, ధనధాన్యవృద్ధి, కార్యసిద్ధియును పంచమ స్థానము నందున్న సర్వాంగసంతాపము, పిత్తవాతాది దోషములవల్ల., హఠాత్తు మరణము., షష్ట స్థానము నందున్న వస్త్రలాభము, ధనలాభము, ధాన్యలాభము, మనోధైర్యము, విద్యాగోష్టిచే సుఖమును గలుగును.

బుధుడు లగ్నరాశి లగాయితు సప్తమస్థానము నందున్న దురదృష్టము, ధనహాని, రాజకోపము, కురూపము, సర్వాంగ స్తంభనమును., అష్టమమునందున్న అనారోగ్యము, హృదయ సంతాపము, మనోవ్యాకులము, అల్పభోజనమును., నవమ స్థానము నందున్న శరీరమాంద్యము, అపకీర్తి, తన పనులవలన తానే చెడి పోవుట, అరోచక భోజనము, పైత్యమును., దశమస్థానము నందున్న అపవాదములు, పర దూషణములు, భోజన అసౌఖ్యము, అలసత్వము, సంతాపమును., యేకాదశ స్థాన మందున్న ఆరోగ్యము, అర్ధప్రాప్తి, మనస్సంతోషము, సుఖము, బంధుప్రీతి, యశోభివృద్ధి యును., ద్వాదశస్థానమందున్న సౌఖ్యహాని, మనఃక్లేశము, కృషి భోజనము, వివాదము, దారిద్ర్యమును సంభవించును.

**5. గురుడు :-** గురుడు జన్మరాశి యందున్న రాజభీతి, అపకీర్తి, ఉద్యోగహాని, మతిచాంచల్యము, భాగ్యనాశమును., ద్వితీయ స్థానము నందున్న మనస్సంతుష్టి, సుకీర్తి, సౌభాగ్యము, ధర్మప్రాప్తి., ధర్మకార్యమువల్ల ధనవ్యయము, మనస్సు సంతృప్తియును., తృతీయస్థానమునందున్న అతిక్లేశము, బంధువిరోధము, దారిద్ర్యము, శరీరబాధ, ఉద్యోగ భంగము, కలహమును., చతుర్థ స్థానమునందున్న యాచన, మనశ్చాంచల్యము, తేజోహాని, ధనవ్యయము, స్వదేశ పరిత్యాగము, కలహమును., పంచమస్థానము నందున్న ధనలాభము, ఐశ్వర్యము, స్వకర్మ బంధుజన సౌఖ్యమును., షష్టస్థానము నందున్న ధారాపుత్ర విరోధము, స్వబంధు కలహము, రాజ చోరాగ్ని భీతియును గల్గును.

గురుడు జన్మరాశి లగాయితు సప్తమస్థానమునందున్న రాజసందర్శనము, ఆరోగ్యము, గాంభీర్యము, శరీరపోషణము, కార్యసిద్ధియును., అష్టమస్థానమునందున్న రాజ చోరాగ్ని భయము, గాత్రగాంభీర్యనాశనము, నిష్ఠురోక్తులు, సాహసకార్యములు కోపమును., నవమమందున్న ధనప్రాప్తి, స్వవంశాచారము, గృహలోభము, మంచి భోజనము, స్త్రీజన సాంగత్యమును., దశమస్థానము నందున్న ధనధాన్యనాశనము, వృథా సంచారము, స్వజన దూషణమును., యేకాదశస్థానమునందున్న యశోభివృద్ధి మంచి బలము, తేజస్సు, బలప్రాప్తి, విజయము, శత్రునాశము, మంత్రసిద్ధియును ద్వాదశ స్థానము నందున్న శుభకార్యములవల్ల ధనవ్యయము, ప్రాణి విక్రయ దూషణము, స్థానభ్రంశము, దారిద్ర్యములు సంభవించును.

**6. శుక్రుడు :-** శుక్రుడు జన్మరాశియందున్న ద్రవ్యలాభము, చిత్తసౌఖ్యము, పరస్త్రీ గమన ప్రయత్నము, కార్యసిద్ధియును. ద్వితీయమందున్న కుటుంబసౌఖ్యము, ఆరోగ్యము, స్త్రీసల్లాప సౌఖ్యము, యశస్సు శరీర సౌఖ్యము, వస్త్రాలంకారమును., తృతీయ స్థానము నందున్న వాణిజ్యభంగము, ధనవ్యయము, నిరంతర దేశ సంచారము, జీవన రాహిత్యహీనమును., చతుర్థస్థానము నందున్న స్వబుద్ధి, బంధు

సన్మానము, స్త్రీసల్లాపభాగ్యము, పుత్ర, మిత్ర, కళత్రసౌఖ్యము, విద్యాగోష్ఠియును., పంచమ స్థానమునందున్న దాస దాసీజన లాభము, నిత్యము మృష్టాన్న భోజనము, ధనధాన్య లాభము, ఇష్టసిద్ధియును., షష్టస్థానమునందున్న సర్వజన విరోధము, శత్రుబాధ, జ్ఞాతిజన విరోధము, ధారాపుత్రులవల్ల ప్రయాసమును సంభవించును.

శుక్రుడు లగ్నరాశి లగాయితు సప్తమస్థానము నందున్న సంతానము, కోపము, మహాభయము, క్లేశజీవనము, స్త్రీలవల్ల సుఖరోగములు, మేషరోగమును అష్టమ స్థానమునందున్న దుఃఖనాశము, మహాసౌఖ్యము బంధు మిత్ర సమాగమము ప్రభు సందర్శన ప్రాప్తియును., నవమ స్థానమునందున్న అమూల్య వస్త్రాలంకారము ఆరోగ్యము, గురుజనభక్తి, ధర్మ నిర్వహణము, చిత్తశుద్ధి, మనోరధసిద్ధియును., దశమ స్థానమునందున్న మనోవ్యాకులము, దుర్భలత్వము, ద్రవ్యనాశము, శత్రు బాధ, స్త్రీసౌఖ్యహానియును, యేకాదశస్థానమునందున్న మంచి శరీర పుష్టి, కాంతి, యశస్సు, మనోరధసిద్ధి, క్షీరాన్న భోజనప్రాప్తియును., ద్వాదశస్థానమునందున్న శస్త్రబాధ, చోరబాధ, అత్యంతక్లేశము, మహాభయము, కృష్యాది కార్యవిఘ్నమును సంభవించును.

7.శని :- శని గ్రహము జన్మరాశియందున్న తేజోహాని, మతిచాంచల్యము, హృదయసంకటము, వ్యాధిబాధ, బంధువైరము, దుఃఖమును., ద్వితీయస్థానము నందున్న సర్వదాక్లేశము, వృధావిరోధము, కార్యభంగము, దేశ భ్రమణము, స్వజనవిరోధము, పాపకార్యాసక్తియును., తృతీయస్థానము నందున్న స్త్రీసంభోగము, మనస్సౌఖ్యము, కార్యసిద్ధి, స్వస్థానలాభము, ఆరోగ్యమును, చతుర్థస్థానము నందున్న వాతశూల, మనఃక్లేశము, భయము, స్థానభ్రంశము, ప్రసూతిబాధ, దేహ బాధయును., పంచమస్థానమునందున్న కార్యహాని మనస్తాపము. జ్ఞాతిజనులతో వ్యాజ్యము, హీనజాతి స్త్రీలపొత్తు, సంతోషమును., షష్టస్థానమునందున్న ధన ధాన్యాభివృద్ధి, బంధుసంతోషము, స్త్రీ సౌఖ్యము, గృహనిర్మాణమును గలుగును.

శని గ్రహము లగ్నరాశి లగాయితు సప్తమస్థానమునందున్న వ్యాధివేదన, ప్రవాసప్రాప్తి, అంతఃక్లేశము, భయము, ద్రవ్యనాశనము, మనస్తాపమును, అష్టము స్థానము నందున్న సర్వకార్య విఘ్నము, వ్యాధి, ధనక్షయము, సంతాపము, అప మృత్యు ప్రాప్తియును., నవమ స్థానమునందున్న దుఃఖము, రోగము, మహ ద్వ్యసనము, ద్రవ్యనాశము, స్వల్పసౌఖ్యము, దారాపుత్ర క్లేశమును, దశమ స్థానము నందున్న వ్యాకుల శోకసంతాపములు, ఉద్యోగభంగము, కృష్యాదిభంగమును., యేకాదశ స్థానమునందున్న ఆరోగ్యము, అర్థప్రాప్తి, దారాపుత్రాభివృద్ధి, మనోరధ సిద్ధియును., ద్వాదశస్థానము నందున్న మానహాని, మనఃక్లేశము, కృషి భోజనము, నిత్యకలహములును సంభవించును.

## ఏడున్నర యేండ్ల శని

శని ప్రతిరాశియందును 2½ సంవత్సరము లుండును. శనిలగ్నము లగాయితు ద్వాదశరాశి యందుండి మహానష్టమును, జన్మ లగ్నస్థానమునకు వచ్చి 2½ సంవత్సరము లుండి మహావిపత్తును, ద్వితీయస్థానమునకు వచ్చి 2½ సంవత్సరములుండి ద్రవ్యహాని, క్లేశమును గలిగించును. జన్మకాలమునకు యుచ్చ

త్రికోణ స్వక్షేత్రములందుండి మేలుజేయువాడైనను సామాన్యముగా యీ 7½ సంవత్సరములు నడచును. జన్మకాలమునకు దుష్టఫలమిచ్చువాడై ననేక విధముల ద్రవ్యనాశ మొనరించి దేహపీడగలుగజేసి ముందు మంచి ఫలమిచ్చిన తుదకు మిక్కిలి కష్టనష్టముల పాలిజేసిన్ని ముందు కష్టఫలమిచ్చిన తుదకు మేలు కనపరిచిన్నీ విడుచును. చారవశంబున శని 1-2-12 స్థానములు జేరినపుడు బహు పాపఫల ప్రచుండగును.

## దుష్ట గోచారము

చారవశంబున శని అంగారక గురులు 1-8-12 స్థానములకు వచ్చినపుడు ప్రాణ సందేహము గలిగించి జాడ్యమును, స్థానభ్రష్టమును, ధనక్షయమును విశేషముగా జేయుదురు.

గురుడు చారవశంబున జన్మలగ్నమునకు జేరి శ్రీరామునికిని నలునకును దేశత్యాగ మొనరింపజేసి మహాకష్టముల పాలుజేసెను. తృతీయస్థానము నందుండి దుర్యోధనునకు సమస్తసేనను రాజ్యమును పోగొట్టి మరణము నొందించెను. చతుర్థస్థానము నందుండి పాండవులకు సర్వసామ్రాజ్యమును పోగొట్టి కానలపాలు జేసి మహాకష్టముల బొందించెను. షష్టస్థానమునందుండి బలిచక్రవర్తికి సమస్త రాజ్యమును పోగొట్టి బంధనప్రాప్తిని గలిగించి క్లేశము పాలుజేసెను. అష్టమ స్థానమునకు వచ్చి వానికి మరణము గలిగించెను. దశమస్థానము నందుండి తారకాసురుని మహారణంబున జంపెను. ద్వాదశస్థానము నందుండి రావణుని పుత్రమిత్ర బంధు వర్గముతో నాశనము జేసెను. మహాసత్వ సంపన్నులగు వారినే యిక్కట్లు బడజేసిన గురునకు మనుష్య మాత్రులెంత? కుజ గురు శనులు చారవంశంబున దుష్టస్థానమునకు వచ్చినపుడు బలవత్తరమైన దుష్ఫలములను గలుగ జేయుచుందురు.

## మూర్తి నిర్ణయము

ఏ గ్రహమునకు గోచారము కనుగొనవలసియున్నచో ఆ గ్రహము ప్రవేశించిన రోజున నిత్యనక్షత్ర మేది యగునో ఆ నక్షత్రమును బట్టి యే రాశి యగునో ఆ రాశి నిత్యరాశియగును. జన్మరాశి లగాయితు నిత్యరాశి యెన్నవరాశి యగునో ఆ సంఖ్యనుబట్టి మూర్తిని నిర్ణయించవలెను. జన్మరాశి లగాయితు నిత్య రాశి వరకు లెక్కించగా 1-6-11 అయ్యేనేని నాగ్రహము సువర్ణ మూర్తియనియు, 2-5-9 అయ్యేనేని రజిత మూర్తియనియు, 3-7-10 అయ్యేనేని తామ్రమూర్తి యనియు, 8-4-12 అయ్యేనేని లోహమూర్తియనియు చెప్పబడును. సువర్ణమూర్తి బహులాభము గలుగజేయును. రజితమూర్తి శుభము గలుగజేయును. తామ్రమూర్తి స్వల్పదుఃఖము గలుగజేయును. లోహమూర్తి విశేష దుఃఖము గలుగజేయును. సువర్ణ రజిత మూర్తులగు గ్రహములు యెట్టి స్థానములందున్నను శుభప్రదులగుదురు. తామ్ర లోహమూర్తులగు గ్రహములెట్టి శుభస్థాన గతులైనను దుఃఖప్రదులేయగుదురు.

గురుడు కొందరికి యేకాదశమందుండి రోజులు జబ్బుగా నుండటయు, మరికొందరికి శని అష్టమస్థానము నందుండి రోజులు బాగుగానుండుటయు గలుగుచున్నది. అట్లుండుటకు యిదియే కారణము.

ఉదాహరణము :- శ్రీ సౌమ్యనామ సంవత్సర బాద్రపద శుద్ధ షష్టి బుధ వారము (17-9-1968) ఉదయం గం.5-56 ని. లకు సూర్యుడు మఘా నక్షత్ర ప్రథమ చరణమందు అనగా సింహరాశియందు ప్రవేశించును. అనగా యీర్కోజు లగాయితు ఒక నెలదినముల వరకు సూర్యుడు సింహరాశి యందుండును. పునర్వసు 4 వ పాదమందును, పుష్యమి నక్షత్రమందును అశ్లేష నక్షత్రమందును జననమైన వారికి కర్కాటకము జన్మరాశి యగును. కర్కాటకము జన్మరాశియైన వారికి యీ నెలలో సూర్యుడు ద్వితీయ మందుండును.

సూర్యుడు సింహరాశిని ప్రవేశించు సమయమునందు అనూరాధ నిత్య నక్షత్రమైనది. దీనిని బట్టి వృశ్చికము నిత్యరాశి యగును. జన్మరాశి లగాయితు

| | | | |
|---|---|---|---|
| | | | |
| | | | జన్మరాశి |
| | | | ర |
| | నిత్యరాశి | | |

నిత్యరాశి వరకు లెక్కించగా 5 వచ్చినది. 2-5-9 వీనిలో నేదియైనను రజిత మూర్తియగును. రజితమూర్తి శుభమునిచ్చును. సూర్యుడు జన్మరాశికి ద్వితీయ మందుండుట మంచిదికాదు. అయినప్పటికి రజితమూర్తియగుటచే శుభఫలముల నిచ్చును. ఇవ్విధముననే యితర గ్రహములకు గూడ మూర్తి నిర్ణయమొనర్చి ఫలములు జెప్పుచుండవలెను.

## శనిసంచారము - నక్షత్రఫలములు

**అశ్వినీ** :- అశ్వినీ నక్షత్రమున జన్మించిన వారికి సింహ కన్యరాశులయందు శనియున్న ఉద్యోగమువల్ల ధనప్రాప్తి, క్రయవిక్రయ మూలమున ఆదాయము, యెల్లకార్యముల యందు జయము గలుగును. ధనుస్సులో శని సంచరించునపుడు జీవనహాని, బుద్ధివినాశము, వ్యాపారమువల్ల ధననష్టము, మానభంగము, దేశ త్యాగము, బ్రాహ్మణ ద్వేశము, దారిద్ర్యము లభించును. మిథున, కర్కాటక రాశులయందు శని సంచరించుచున్న గృహమందు తిల సంబంధములైన కర్మలు, ఋణబాధ, సొత్తులు కుదువబెట్టుట, గొప్పవాచాలము లభించును. మిగిలిన రాశులు సమ ఫలములు. పైన చెప్పబడిన స్థానములలో శని యున్నపుడు జన్మము కలిగినను లేక నాయాస్థానము లందున్నపుడు శనిదశ సంప్రాప్తించినను శనికి నాయారాశులయందు సంచారము వలన గలిగిన ఫలములే తప్పక సంభవించును.

**భరణి**:- భరణి నక్షత్రమున జన్మించిన వారికి మిథునములో శని సంచరించునపుడు వర్తకము లేక వ్యవహారమూలమున విశేష ధనలాభము, ఇతర కుటుంబ సంరక్షణము, పరిపూర్ణజయము కలుగును. మేషవృషభరాశులలో శని యున్నపుడు కర్మసంబంధమైన దుఃఖము గలుగును, తులకు వచ్చెనేని జీవనహాని, స్త్రీ మూలమున ద్రవ్యనష్టము, ఋణబాధ, దేహజాడ్యము, స్థానభ్రంశము,

మనోవ్యాకులత, దారిద్ర్యము గలుగును. కర్కాటకములో శని సంచరించునపుడు సహోదర నష్టము గలుగును. తక్కిన రాశులలో యున్నపుడు సమఫలము. ఇదిగాక జననకాలములో పైరాశులలో శనియుండి శనిదశ వచ్చినపుడు పై ఫలములే కలుగును.

కృత్తిక:- కృత్తికానక్షత్రమున జన్మించిన వారికి మేషములో శని సంచరించు నపుడు ప్రభువు, రాళ్ళు, ఉద్యోగమూలమున విశేష ధనలాభము గలుగును. కుంభములో శని సంచరించుచున్న కర్మసంబంధము, ఋణము, వ్యాకులము, కారా గృహ వీక్షణము గలుగును. సింహములోయున్న జీవనహాని, రాజకీయ వ్యవహారము వల్ల మానభంగము, పలాయనము, వ్యాకులము, దారిద్ర్యము, మహాకష్టములు గలుగును. తక్కిన రాశులలో యున్న సమఫలము గలుగును. పైన జెప్పబడిన స్థానములలో శనియుండి శని దశాభుక్తి వచ్చిన పై ఫలములే తప్పక జరుగును.

**రోహిణి** :- రోహిణి నక్షత్రములో జన్మించిన వానికి శని కుంభములో సంచరించునపుడు నీచులు, చోరులు, సేవకావృత్తి మూలమున విశేష ధనము, సంతోషము, భాగ్యము గలుగును. ధనుస్సులో శని యున్నపుడు కర్మసంబంధముల ఋణ మూలమున వ్యాకులము గలుగును. మిధున వృషభములలో సంచరించు నపుడు జీవనహాని, క్రూర కృత్యములు గలుగును. యితర రాశులలో సమ ఫలములు. అదిగాక పైనజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక జరుగును.

మృగశిర :- మృగశిరా నక్షత్రములో జన్మించిన వానికి ధనుస్సులో శని సంచరించునపుడు బ్రాహ్మణమూలకముగను, దేవతా నిర్మాణ మూలకముగను, ధన లాభము, ఉద్యోగము గలుగును. కన్యాతులలో సంచరించునపుడు కర్మ సంబంధ ఋణ మూలకముగను, వ్యాపార మూలకముగను నష్టము గలుగును. మీనములో శని సంచరించునపుడు జీవనహాని, జలగండము, విరోధము, మహాక్రౌర్యము గలుగును. తక్కిన రాశులు సమఫలముల నిచ్చును. ఇవిగాక పైన జెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులు వచ్చినపుడు పై ఫలములే తప్పక జరుగును.

ఆర్ద్ర :- ఆర్ద్రానక్షత్రములో జన్మించిన వారికి శని కన్యాతులలో సంచ రించునపుడు వ్యాపారమువల్ల ధనప్రాప్తి, సంతోషమును., కర్కాటకములో నున్నపుడు జ్ఞాతినాశము, ఋణమూలక వ్యాకులము., సింహములో సంచరిం చునపుడు కర్మసంబంధము., మకరములో జీవనహాని, ఆస్తినాశము, మానభంగము, మహిషము వల్ల గండము, జలగండము, గలుగును. మిగిలిన రాశులయందు శని యున్నపుడు సమఫలము. ఇదిగాక పై జెప్పిన స్థానములలో శనియుండి దశ విదశా భుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక జరుగును.

పునర్వసు :- పునర్వసు నక్షత్రములో జన్మించిన వారికి శని కర్కాటకము లో సంచరించునపుడు జలసంబంధ కార్యముల వలన విశేష ధనలాభము., వృషభములో సంచరించునపుడు జలసంబంధ కర్మము, దాయాధినాశము, ఋణ బాధ, వ్యాకులము, వృశ్చికములో నున్నపుడు జీవనహాని, రాజకీయ వ్యవహారముల వల్ల మానభంగము, దేహజాడ్యము గలుగును. తక్కిన రాశులు సమఫలములు.

ఇదిగాక పైన జెప్పబడిన స్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చిన ఈ ఫలములే తప్పక జరుగును.

పుష్యమి :- పుష్యమి నక్షత్రములో జన్మించిన వానికి శని వృషభములో సంచరించునపుడు స్త్రీలవల్లను, భార్యాదృష్టమువల్ల ధనప్రాప్తి, శుభకార్యమువల్ల ఉల్లాసము, సింహ, కన్యలలో శని సంచరించునపుడు జీనపహాని, పొత్తు నాశము., మీనములో సంచరించునపుడు తిలసంబంధ కర్మ, బంధునాశనము, ఋణము, క్రూరకార్యములు గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పన రాశులలో శనియుండి శని దశాభుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక జరుగును.

ఆశ్లేష :- ఆశ్లేష నక్షత్రములో జన్మించిన వానికి శని మీనములో సంచరించుచున్న జీవనదుల వద్ద శుఖజీవనము, వాని మూలముగ ధనలాభము, దేవీసంబంధములైన కార్యములు., మిధునకర్కాటకములలో తిరుగునపుడు జీవనహాని, పరదేశములో విశేష సంచారము, దేహసౌఖ్యము., ధనుర్మకరములలో సంచరించునపుడు విశేష కర్మములు జేయించుట, ఋణవిశేషము, వ్యాకులత్వము, జలభీతి, దారిద్ర్యము కలుగును. తక్కిన రాశుల సమఫలములు. ఇదిగాక పై స్థానములలో శనియుండి శనిదశాభుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక జరుగును.

మఖ :- మఖ నక్షత్రములో జన్మించిన వానికి శని ధనుర్మకరములలో సంచరించునపుడు, బ్రాహ్మణ, నీచ, ఉద్యోగమూలమున ధనలాభము, సంతోషము., తులావృశ్చికములలో సంచరించునపుడు ఋణ వ్యాకులము, తిలసంబంధ కర్మము., శత్రుత్వము, మహాక్రూరత., మేషములో సంచరించునపుడు జీవనము లేకపోవుట, మానహాని, మహాదారిద్ర్యము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. యిది కాక పైన జెప్పిన స్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక జరుగును.

పుబ్బ :- పుబ్బా నక్షత్రములో జన్మించిన వానికి శని తులా వృశ్చికముల లో తిరుగునపుడు ప్రభు, స్త్రీ ఉద్యోగము వల్ల ధనలాభము., సింహకన్యలలో తిరుగు నపుడు ఋణమువల్లను, తిలసంబంధమగు కర్మవల్ల వ్యాకులము.,మిధునములో శని యున్న బంధునాశము., కుంభములో నున్న జీవనహీనము, భాగ్యహీనము, దారి ద్ర్యము గలుగును. తక్కిన రాశులలో సమఫలము. ఇవిగాక పైన జెప్పిన స్థానము లలో శని యుండి శని దశాభుక్తులు వచ్చన యీ ఫలములే తప్పక జరుగును.

ఉత్తర :- ఉత్తర నక్షత్రములో జన్మించిన వానికి శని వృషభములో తిరుగునపుడు చతుష్పాజ్జీవవశముగ మంచి ధనలాభము గలుగును. మిధున కర్కాటకములో శని సంచరించునపుడు బంధు సంకటము, కర్మము, ఋణము., ధనుస్సులో తిరుగునపుడు జీవననాశము, హీనజీవనము గలుగును. తక్కిన రాశులు సమ ఫలములు. పైన జెప్పిన స్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

హస్త :- హస్త నక్షత్రములో జన్మించిన వానికి శని మిధనములో సంచరించుచున్నపుడు వర్తకమూలముగా వైశ్య శూద్రులద్వారా మంచి యుద్యోగ లాభము, సర్వకార్య జయము, కన్యా, తులలలో తిరుగునపుడు జీవన హాని, సొత్తుల

కుదువ, స్త్రీ మూలముగా ప్రాణసంకటము, బుద్ధినాశము, స్థానభ్రంశము., మేషములో తిరుగునపుడు ఋణబాధ, బంధునాశము, తిలసంబంధకర్మ, మనోవ్యాకులత గలుగును. తక్కిన రాశులు సమఫలములు, ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**చిత్త** :- చిత్త నక్షత్రములో జన్మించిన వానికి శని మేషములో తిరుగునపుడు వాక్సహాయము బొంది భూములు, ఆరణ్యము, కొండల సమీపములో ధన లాభము, ఉద్యోగము, సంతోషము గలుగును. కర్కాటకములో శని యున్నపుడు జీవన హాని, క్రూరజీవనము., మకర కుంభములలో దాయాధినాశము, ఋణబాధ, పైత్యకర్మ గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇవిగాక పైన జెప్పిన స్థానముల లో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

స్వాతి :- స్వాతి నక్షత్రములో జన్మించిన వానికి శని మకర కుంభములలో నుండెనేని జీవనదీ సమీపమున నీచులు, శూద్రులు, ఉద్యోగము ద్వారా మంచి ధనలాభము., వృశ్చికములో తిరుగునపుడు ఋణబాధ, వ్యాకులము, బంధు నాశము., వృషభములో సంచరించునపుడు బుద్ధివినాశము, చతుష్పాజ్జీవములనాశము, జీవన హాని గలుగును. ధనుస్సులో సంచరించునపుడు పైతృక కర్మ గలుగును. తక్కిన రాశులు సమఫలములు. యివి గాక పైన జెప్పిన స్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చిన యీ ఫలములే తప్పక గలుగును.

విశాఖ :- విశాఖ నక్షత్రములో జన్మించిన వానికి శని వృశ్చికములో సంచరించు చున్నపుడు ప్రభువుల వాక్సహాయము వలన యెట్టి భూములు గల స్థానముల వద్ద యుద్యోగము వలన లాభము. కన్యా తులలలో నుండునపుడు ద్రవ్య నష్టము, జలగండము, సత్కర్మల ద్వారా విశేష ద్రవ్యహాని గలుగును. తక్కిన రాశులు సమఫలములు, ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

అనూరాధా :- అనురాధా నక్షత్రములో జన్మించిన వానికి శని మకరములో సంచరించు చున్నపుడు జల సమీపమున మంచి జీవనము, ధన లాభము., ధనుస్సులో యున్నపుడు జీవనహాని, మహాకష్టము., కర్కాటకములో యున్నపుడు జలగండము. వ్యవహారస్థానములో మానభంగము, ఋణబాధ, బంధునాశము, కర్మ, శత్రుత్వము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పిన స్థానము లలో శనియుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీఫలములే తప్పక జరుగును.

**జేష్ఠ** :- జేష్ఠా నక్షత్రములో జన్మించిన వానికి శని కర్కాటములో సంచరించు చున్నపుడు పరిపూర్ణ జీవనదీ తీరమునందు వ్యవహారము ద్వారా మంచి ధన లాభము, ధనవ్యయము, వ్యాకులము, ఋణము, స్థానభ్రంశము, చతుష్పాదజీవముల నాశము., తులావృశ్చికములలో నుండునపుడు జీవనము దొరక కుండుట, స్త్రీల వలన మానభంగము, సొమ్ము కుదువలు గలుగును. తక్కిన

రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శనిదశా భుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**మూల** :- మూల నక్షత్రములో జన్మించిన వానికి శని మేష వృషభములలో సంచరించునపుడు ప్రభువులవల్ల, చతుష్పాదజీవములవల్ల, భూములవల్ల మంచి ధన లాభము, అధికారము వలన పరిపూర్ణ సంతోషము., సింహములో నున్నపుడు జీవనము లేకపోవుటయు, సొత్తునాశము, శత్రుత్వము, కష్టమైన జరుగుబాటు., కుంభ మీనముల యందున్న దాయాదినాశము, ఋణబాధ, వ్యాకులము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**పూర్వాషాఢ** :- పూర్వాషాఢ నక్షత్రములో జన్మించిన వానికి కుంభ మీనములలో శని యున్న దాసవర్గము వలన మంచి ధనలాభము, వ్యవహారము వలన లాభము., మిధునములో సంచరించునపుడు చిక్కులెక్కల వలన వ్యాకులము, జీవనహాని., ధనుస్సులో యున్నపుడు కర్మ, ఋణము, వ్యసనము, బంధునాశము గలుగును. తక్కిన రాశులు సమఫలములు, ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**ఉత్తరాషాఢ** :- ఉత్తరాషాఢ నక్షత్రములో జన్మించిన వానికి శని ధనుస్సులో సంచరించుచున్నపుడు బ్రాహ్మణుల ద్వారా మంచి ధన లాభము, వ్యవహారము., మేషములో సంచరించునపుడు దేహజాడ్యము, కష్టజీవనము, సొత్తు నాశము., సింహములో సంచరించునపుడు దాయాదినాశము., తులా వృశ్చికములలో సంచరించు నపుడు ఋణము, వ్యాకులము, కర్మగలుగును. తక్కిన రాశులు సమ ఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**శ్రవణ** :- శ్రవణా నక్షత్రములో జన్మించిన వానికి శని తులారాశిలో సంచరించు చున్నపుడు పెట్టుబడిచే విశేష ధనలాభము., సింహమునందు సంచరించునపుడు కర్మ, ఋణము, వ్యాకులత్వము., మకర కుంభముల యందు సంచరించునపుడు పూర్ణ జలప్రవాహము వద్ద నుండెని యుబ్బలో దిగబడి తప్పించుకొనుట, జీవనహాని, దారిద్ర్యము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**ధనిష్ఠ** :- ధనిష్టా నక్షత్రములో జన్మించిన వానికి శని సింహములో సంచరించుచున్నపుడు రాజ్యద్వారమున మంచి ధనలాభము., వృషభ మిధునములలో దిరుగునపుడు చెడుఋణము, మహావ్యాకులము, దాయాదినష్టము., కర్కాటకములో తిరుగునపుడు కర్మ., వృశ్చికములో యున్నపుడు జీవనహాని, దండన, వ్యవహార కార్యములందు మాననష్టము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**శతభిషము** :- శతభిషా నక్షత్రములో జన్మించిన వానికి శని వృషభములో సంచరించుచున్నపుడు చతుష్పాద జీవులవల్ల మంచి ధనవాభము., మేషములో సంచరించునపుడు జీవనహాని, దేశత్యాగము., మీనములో నున్నపుడు బంధునాశము, ఋణము వలన వ్యాకులము గలుగును. తక్కిన రాశులు సమ ఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**పూర్వాభాద్ర** :- పూర్వాభాద్ర నక్షత్రములో జన్మించిన వానికి శని మీనములో సంచరించుచున్నపుడు దివ్యస్థలములందు, జీవనదీ ప్రదేశము లందు మంచి ధనప్రాప్తి, వ్యవహారము., కర్కాటకములో సంచరించునపుడు జలభీతి, సొత్తునష్టము, దేశత్యాగము, జీవనహాని, మకరములో సంచరించునపుడు కర్మ, ఋణవ్యాకులము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**ఉత్తరాభాద్ర** :- ఉత్తరాభాద్ర నక్షత్రములో జన్మించిన వానికి శని మకరములో సంచరించుచున్నపుడు నీచుల సహాయము వలన జలప్రదేశముల యందు జలముమీద సంచరించెడి వస్తువుల వలన మంచి ధనలాభము, మేష వృషభములలో సంచరించునపుడు జీవనము కొరకు దేశము విడచి మరియొక దేశము ప్రవేశించుట, అచ్చటను, కష్టజీవనము., మీనములో సంచరించునపుడు బంధు దాయాధినాశము., వృశ్చికములో నుండునపుడు కర్మజేయుట, ఋణవ్యాకులము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

**రేవతి** :- రేవతి నక్షత్రములో జన్మించిన వానికి శని వృశ్చికములో సంచరించు చున్నపుడు అధికారుల వలన రాళ్ళవలన మంచి ధనలాభము, కుంభ మీనములలో సంచరించునపుడు జీవనహాని, కష్టము, కన్యయందు సంచరించనపుడు కర్మజేయుట., సింహమునందు సంచరించునపుడు ఋణము, దాయాదినాశము గలుగును. తక్కిన రాశులు సమఫలములు. ఇదిగాక పైన జెప్పినస్థానములలో శని యుండి శని దశాభుక్తులు వచ్చినపుడు యీ ఫలములే తప్పక జరుగును.

నవగ్రహములు




నవగ్రహ ధ్యాన శ్లోకములు

| | | జపసంఖ్య |
|---|---|---|
| రవి | 1 జపాకుసుమ సంకాశం కాశ్య పేయం మహాద్యుతిమ్<br>తమోరిం సర్వ పాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్. | 6 వేలు |
| చంద్ర | 2 దధిశంఖ తుషారాభం క్షీరోదార్ణవ సముద్భవమ్<br>నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం. | 10 వేలు |
| కుజ | 3 ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్<br>కుమారం శక్తిహస్తం తం మంగళమ్ ప్రణమామ్యహమ్. | 7 వేలు |
| బుధ | 4 ప్రియంగుకలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్<br>సౌమ్యం సౌమ్యగుణోపేతం బుధం ప్రణమామ్యహమ్. | 17 వేలు |
| గురు | 5 దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభమ్<br>బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్. | 16 వేలు |
| శుక్ర | 6 హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుమ్<br>సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్. | 20 వేలు |
| శని | 7 నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్<br>ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్. | 19 వేలు |
| రాహు | 8 అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనమ్<br>సింహికాగర్భ సంభూతంతం రాహుం ప్రణమామ్యహమ్. | 18 వేలు |
| కేతు | 9 ఫలాశ పుష్ప సంకాశం తారకా గ్రహమస్తకమ్<br>రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్. | 7 వేలు |

## గ్రహములకు ప్రీతిదానములు

జాతకదశలయందుగాని, గోచారమునందుగాని, అష్టకవర్గునందుగాని, గ్రహములు దుష్టఫలప్రదులైరేని ఆ గ్రహములు జపముచేతను, దానము చేతను, శాంతి చేతను ప్రసన్నులగుదురు.

సూర్యుడు పాపఫలప్రదుడగునేని ఆదోషశాంతికి మాణిక్యము, గోవు, గోధుమలు, సువర్ణము, తామ్రము, బెల్లము, పద్మము, చందనము, రక్తవర్ణ వస్త్రములు దానమియ్యవలెను.

చంద్రునకు దోషశాంతికై ముత్యములు, చెక్కర, రాగి, వెండి, శంఖము వెదురు బియ్యము, కర్పూరము, గోమిధునము, రత్నము., సజల కుంభమును దానమొసగవలయును.

కుజుడు పాపఫలప్రదుడైనచో ప్రవాళము, సువర్ణము, గోధుమ, ధాన్యము, రక్తవర్ణవస్త్రములు, రక్తవర్ణవృషభమును, గన్నేరు పూవులన, బెల్లము, రాగి, చిరి శనగలు దానమొసగవలయును.

బుధుడు పాపఫలప్రదుడగునేని కంచు, నీలివస్త్రము, బంగారము, గజ దంతము, గారుత్మకమణి, పెసలు, నెయ్యి, దుత్తూరపుష్పములు దాన మియ్య వలయును.

గురుడు పాపఫలప్రదుడగునేని పచ్చని గుర్రమును, పంచదారను, బంగారము, పచ్చని ధాన్యము, పచ్చని వస్త్రములు, లవణము, పుష్యరాగ మణిని బానమియ్య వలయును.

శుక్రుడు పాపఫలప్రదుడగునేని ధనుస్సును, నానావర్ధములు గల వస్త్రమును, నెయ్యిని, తెల్లని గుఱ్ఱమును, సువర్ణమును, తండులంబులును, వెండిని, వజ్రమును, దానమొసగవలయును.

శని గ్రహము పాపఫలప్రదుడగునేని తిలలు, తైలము, మినుములు, ఇంద్ర నీలమాణిక్యము, నల్లని వర్ణముగల వస్త్రము, వల్లని గోవు, నల్లని మహిషము, సువర్ణము దానమియ్యవలయును.

రాహువు పాపఫలప్రదుడగునేని గోమేధికము, నల్లనిగుర్రము, నీలివస్త్రము, కంబళము, శస్త్రము, చాగము, వైఢూర్యము, సువర్ణము, తిలలు, తైలము, దానమొసగ వలయును.

కేతువు పాపఫలప్రదుడగునేని అతని ప్రీతికొకరు కస్తూరి, కంబళము, శస్త్రము చాగము, వైఊర్యము, సువర్ణము, తిలలు, తైలము దానమొసగవలయును.

## గ్రహముల యొక్క లోహములు, నవరత్నములు

మాణిక్యమునకు రవియును, ముత్యమునకు చంద్రుడును, పగడమునకు కుజుడును, మరకతమణి లేక గారుత్మతపచ్చకు బుధుడును, పుష్యరాగమునకు గురుడును, వజ్రము లేక రవ్వకు శుక్రుడును, ఇంద్రనీలమునకు శనియును, గోమేధికమునకు రాహువును, వైఢూర్యమునకు కేతువును అధిపతులగుచున్నారు.

రవికి రాగియును. చంద్రునకు వెండియును. కుజునకు రాగి బంగారును. బుధునకు తగరము రాగి మొదలగు లోహమిశ్రమము. బంగారును. గురునకు బంగారును. శుక్రునకు వెండియును. శనికి యినుమును. రాహువునకు సీసము బంగారును. కేతువునకు రాగి తగరము మొదలగు లోహమిశ్రమము. బంగారును వాని లోహములై యున్నవి.

గ్రహములకు సంబంధించిన లోహములను గాని లేక రత్నములను గాని ధరించుట వలన వాని ప్రభావము శక్తివంతమై శుభఫలముల నిచ్చును. లోహముల కంటె రత్నములయొక్క ప్రభావము హెచ్చుగా యుండును. ఏ గ్రహమైనను బలహీనమై జాతకునికి దుష్ఫలములు గలుగజేయుచున్న అట్టి గ్రహమునకు సంబంధించిన రత్నమును వానికి సంబంధించిన లోహపు వుంగరములో క్రింది భాగము చర్మమును తాకునట్లును. పైభాగము పైకి కనుపించునట్లు పొదిగి ధరించిన వాని ప్రభావము శక్తివంతమై సుఫలముల నిచ్చును. ఏ రత్నమునైనను ధరించిన వెనుక మూడుదినముల వరకు పరీక్షించి దాని వలన దుష్ఫలములు గలుగుచున్న దానిని త్యజించి కొన్ని దినముల వెనుక వేరొక దానిని ధరించి పరీక్షించవలెను. సుఫలములు గలుగుచున్న దానినే స్థిరముగా ధరించుకొనవలెను.

జాతకచక్రములో యేగ్రహమైనను జాతకునికి ప్రతికూలముగా లేకున్నను ఆ గ్రహమునకు సంబంధించిన రత్నమును ధరించుట వలన వాని ప్రభావము శక్తివంతమై యెక్కువ సుఫలముల నిచ్చును. కాబట్టి జాతకునికి సరిపడు రత్నములను ధరించుట యెల్లప్పుడు శుభకరముగనే యుండును. ఈ రత్నములను జన్మకాలమునందు గల గ్రహములయొక్క సుభాశుభములను బట్టి ధరించుటయేగాక వాని దశాంతర్దశల కాలములందు గల బలాబలములను బట్టి సరిపడు వానిని ఎన్నుకొని ధరించవచ్చును.

## నవగ్రహ పీడాహరణ నవరత్న ముద్రికాలక్షణము

రవిప్రీతికై మధ్యను మాణిక్యమును. శుక్రునకు తూర్పున వజ్రమును. చంద్రునచు ఆగ్నేయమున ముత్యమును. కుజునకు దక్షిణమున ప్రవాళమును. రాహువునకు నైరుతిని గోమేధికమును. శనికి పశ్చిమమున యింద్రనీలమును. కేతువునకు వాయువ్యమున వైఢూర్యమును. గురుప్రీతికై యుత్తరమున పుష్యరాగమును. బుధప్రీతికై ఈశాన్యమున గారుత్మతపచ్చను బెట్టి యధావిధిగా జేయించిన అంగుళీకమును సదా ధరించుచున్న గ్రహపీడా ప్రశమనము గలిగి ఆయురారోగ్యైశ్వర్యములు బొందుదురు.

## శిశు జనన నక్షత్ర గండములు

అశ్వని మొదటిపాదమునందు శిశువు జననమైన పితృగండము. ఈ దోషము మూడు మాసముల వరకుండును. సువర్ణదానము వలన నిది నివారణ ముగును. భరణి మూడవ పాదమునందు జననమైన శిశువునకు 27 దినముల వరకు దోషము. రోహిణి నక్షత్ర ప్రథమ పాదమునందు పుత్రుడు జనించిన మేనమామ కును. రెండవ పాదము నందు జనించిన తండ్రికిని. మూడవ పాదము నందు జనించిన తల్లికిని దోషము గలుగును. పుష్యమి నక్షత్రము కర్కటక లగ్నమందు

పగలు పుత్రజనన మగునేని పితృగండము. పుష్యమి నక్షత్రము కర్కట లగ్నము నందు రాత్రి పుత్రికా జననమగునేని మాతృదోషము. పుష్యమి మొదటి పాదములో జననమైన మేనమామకు దోషము, రెండవ పాదము మధ్యములో జనన మైన మాతాపితృలకు గండము. ఇది మూడు నెలలవరకుండును. గంధపుచెక్క దానము చేసిన యిది శ్రమించును.

అశ్లేష మొదటి పాదములో జననమైన శుభము. రెండవ పాదములో జననమైన శిశువుకు గండము. మూడవ పాదములో జననమైన మాతృ గండము. నాల్గవ పాదమునందైన పితృగండము. ఈ దోషము 3 నెలల వరకుండును. ఇది అన్నదానము వలన నివర్తించును. అశ్లేషాంతము రెండు ఘడియలు, మఖా ప్రథమమున రెండు ఘడియలు, జ్యేష్టాంతమున రెండు ఘడియలు, అశ్వని మొదట రెండు ఘడీయులు. ఇవి దోషఘడియలనియు, వీనియందు పుట్టినవారికి గ్రహశాంతి చేయవలయునని జ్యోతిష్యశాస్త్రవేత్తలు వచించియున్నారు.

మఖ మొదటిపాదములో జననమైన అయిదుమాసములవరకు పితృ దోషము. ఇది అశ్వదానము వలన నివర్తించును. తక్కిన మూడు పాదములు శుభము. ఉత్తర మొదటి పాదములోను, నాల్గవపాదములోను జననమైన మాతృపితృ సహోదరులకు మూడుమాసముల వరకు దోషము. తిలపాత్రదానము వలన నిది నివర్తించును. చిత్త మొదటి పాదములోను, రెండవపాదములోను, మూడవ పాదములోను, జననమైన మాతాపితృ సహోదరులకు ఆరునెలలవరకు దోషము. ఇది వస్త్రదానము వలన నివర్తించును.

జ్యేష్టా నక్షత్రము యొక్క అద్యంత ఘడియలను పదిభాగములు చేసి, వానిలో మొదటిభాగమున జననమైన జాతకునియొక్క మాతామహికి దోషము, రెండవ భాగమునందైన పితామహికి దోషము, 3వ భాగమునందైన తల్లిదండ్రుల కును, తల్లితోడబుట్టిన వానికి దోషము, నాల్గవ భాగము నందైన సహోదరులకు దోషము, ఐదవ భాగము నందైన సజాతకుని దోషము, ఆరవ భాగము నందైన యెవ్వరికి దోషము లేదు. యేడవ భాగమునందైన కళత్రవర్గమునకు దోషము. యెనిమిదవభాగమునందైన జాతకునికి నాశము, తొమ్మిదవభాగమునందైన తండ్రికి దోషము, పదవభాగము నందైన తల్లికి దోషము అని జ్యేష్టానక్షత్రమునకు ఫలము చెప్పబడినది. మరియు జ్యేష్టా నక్షత్ర నాల్గవ పాదమునందు జననమైన తొమ్మిది మాసముల వరకు తండ్రికి దోషము. ఇది గోదానమువలన నిశ్చయముగా శాంతి పొందును. జ్యేష్ట్యాంతమున పాతిక ఘడియ, మూలా నక్షత్రము మొదటి పాతిక ఘడియ వెరశి అరఘడియకు అంత రాళమని పేరు. దీనియందు మగశిశువు పుట్టిన శిశువుకు దోషము కలుగును. ఆడ శిశువు పుట్టిన దోషములేదు.

మూలా నక్షత్రము యొక్క ఆద్యంత ఘడియలను పంద్రెండు భాగములు జేసి, వానిలో 1--వ భాగమునందు జననమైన పితృదోషము, 2--వ భాగమునందు జననమైన తల్లికి దోషము, 3--వ భాగమునందు జననమైన భ్రాతకుదోషము, 4--వ భాగమునందు జననమైన భగినికి దోషము, 5--వ భాగమునందు జననమైన పిల్లనిచ్చినమామగారికి దోషము, 6--వ భాగమున జననమైన తండ్రితోడబుట్టినవారికి దోషము, 7--వ భాగమున జననమైన తల్లి తోడబుట్టిన వారికి దోషము, 8--వ

భాగమునందు ధన నాశము, 9--వ భాగమున జీవననాశము, 10--వ భాగమున దారిద్ర్యము, 11--వ భాగమున భృత్యులకు దోషము, 12--వ భాగమున జాతకునికి దోషము. ఇవిమూడు నెలలవరకు. దీని నివర్తికి మహిషదానము, మరియు మూలా నక్షత్రము మొదటిపాదములో జననమైన తండ్రికి గండము, 2--వ పాదము నందైన తల్లికి గండము, 3--వ పాదమునందైన ద్రవ్యనాశము, నాల్గవపాదమునందైన శుభము.

పూర్వాషాఢ ధనుర్లగ్నమందు పగలు పుత్రజనన మగునేని పితృనాశము, పుర్వాషాఢ ధనుర్లగ్నమందును, పుష్యమి, కర్కాటలగ్నమునందును, సూర్యోదయకాల సూర్యాస్తమయకాలముల యందును, అర్ధరాత్రియందును పుత్రజననమైన ఆ శిశువుకు దోషము. పూర్వాషాఢ ధనుర్లగ్నమందుగాని., పుష్యమికటక లగ్నమందుగాని శిశువు జనించిన తండ్రికి అరిష్టము. రేవతీ నాల్గవ పాదమునందు జననమైన మూడు మాసముల వరకు పితృగండము. సువర్ణదానము వలన నదినివర్తించును.

## అరిష్టభంగ యోగములు

లగ్నాధిపతి బలవంతుడై యున్నను, కేంద్రకోణముల యందున్నను, పై అరిష్టయోగములయందు బుట్టిన బాలురు బ్రతుకుదురు. పూర్వోక్తారిష్టయోగములు బాధింపవని భావము.

ఒక గ్రహము సమస్తబలములు గలదై కేంద్ర త్రికోణములను పొందియుండెనేని, తక్కిన గ్రహముల వలన గలిగిన దోషములను బోగొట్టి యా జాతకునికి దీర్ఘాయుష్యము గలుగజేయును. బుధ, శుక్ర, గురులలో నొకరు కేంద్ర త్రికోణములను బొందెనేని తత్కాల మరణ యోగములకు భంగము గలుగును.

గురు, శుక్ర, బుధులు--జన్మలగ్న, దశమ, పంచమ, నవమమున్ను బొంది యుండిరేని, లక్షదోషములున్నను సూర్యోదయమున చీకట్లు తొలగిపోవునట్లు తొలగిపోవును. గురుడుగాని, శుక్రుడుగాని, రాహువుగాని కేంద్రమునందుండెనేని యా నరుడు నూరు సంవత్సరములు జీవించును. చంద్రుడు కేంద్రమున నుండెనేని పూర్వోక్త గ్రహముల దోషములను పోగొట్టును.

కృష్ణపక్షమునందు మధ్యాహ్నమునను, శుక్లపక్షమందు రాత్రియందును జన్మము గలిగి, చంద్రుడు 6-8 యిండ్లయందుండి పాపగ్రహముల చేతగాని, బుధుని చేతగాని చూడబడెనేని సమస్త దోషములు హరించును.

లగ్నాధిపతి బలవంతుడై కేంద్రముల యందుండెనేని సమస్తదోషములను నశింపజేయును. గురు, బుధ, శుక్రులలో రెండు గ్రహములు పరిపూర్ణబలవంతులై కేంద్రమును బొందెనేని సమస్త దోషములను పొగొట్టును. ఈ గ్రహములు తాత్కాలికముగా క్రూరత్వము జెందియున్నను, పరమోచ్చమును బొందియుండెనేని యా ఫలముల నిచ్చును.

ప్రాణులకు పండ్రెండు సంవత్సరములగు పర్యంతము ఆయుస్సు తెలిసి కొనుట వీలుపడదుగాన, బాలురను జపహోమ చికిత్సాదుల చేత రక్షించుకొనవలయును.

## వివాహ పొంతనము

వివాహ సందర్భములలో కన్యావర మాతాపితలకు యిదియొక గొప్ప సమస్యగా పరిగణించ బడుచున్నది. వధూవరుల జాతకచక్రములు సమన్వయ

పరచి పరీక్షించునపుడు యిరుప్రక్కల గల జ్యోతిష్కులకు భిన్నాభిప్రాయములు గలుగుటయు, దాని వలన వివాహ సంబంధము చెడిపోయి వధువు తల్లిదండ్రులు యింకొక వరునికొరకు వెతుకు కొనుట సహజముగా జరుగుచున్నది. ఒక జాతక చక్రము మనము పరీక్షించునపుడు మనవద్దకు తేబడిన యింకొక జాతకచక్రము యెంత వరకు సరియైనదో గమనించవలసిన విషయమైయున్నది. జాతకుని యొక్క అనుబంధము యిదివరలోనే నిర్ణయించి యున్నను వధూవరులకై అన్వేషించి వారి జాతకచక్రములను పరీక్షించుట పరిపాటియై యున్నది. అనేక కుటుంబములలో జ్యోతిష్య పరిజ్ఞానము తెలియని తన కుటుంబ పురోహితునే దైవముగా భావించి తాను చెప్పినదే వేదవాక్కుగా గ్రహించుచున్నారు. ఒకే చక్రమును ప్రత్యేకముగా పరీక్షించినపుడు జాతకునియొక్క స్వరూపము, విద్య, ధన, విజ్ఞాన విషయములే గాక కళత్రభావ విషయములను గూడ తెలుసు కొనగలుగుచున్నాము. పరభాగ స్వామి యొక్క జాతక చక్రము యెంతవరకు సరియైనదో తెలుసుకొనక దానిపై ఆధారపడి వివాహము నిర్ణయించుకొనుట కంటె వానియొక్క యోగ్యత, విద్య, ధన, తను, గుణ, కుటుంబ, స్వరూప, విజ్ఞానము మొదలగు వానిని యితరత్రా వోర్పుతో విచారించుకొని నిర్ణయించుకొనుట మంచిది.

కన్య జన్మనక్షత్రము మొదలు వరుని జన్మనక్షత్రము వరకు గణనచేసి ఆ సంఖ్యను 7చే గుణించి 28చే భాగించగా శేషించిన సంఖ్య కన్యాధ్రువకమగును. మరల వరుని నక్షత్రము మొదలు కన్యానక్షత్రము వరకు గణనచేసి అసంఖ్యను పూర్వరీతిని గుణించి భాగించగా శేషించిన సంఖ్య వరధ్రువకమగును. కన్యావర ధ్రువకములలో నేది చిన్నదో వారు రెండవవారికన్నా మొదట మరణింతురు. రెండును సమానములైనచో నొకదినమందే దంపతులకు మరణమని చెప్పవలయును. కన్య జన్మచక్రములో అష్టమస్థానమున పాపగ్రహముండి, ద్వితీయ స్థానమున శక్తివంతమైన శుభగ్రహమున్న వరునికంటె వధువు ముందుగా మరణించును.

స్త్రీజాతకములో ఆమెయొక్క మాంగల్యము అష్టమస్థానమును బట్టిన్ని, సంతానము నవమస్థానము వలనను, స్నేహము, శీలము చతుర్ధ స్థానము వలనను, భర్త విషయము మామూలుగానే సప్తమ స్థానము వలన గ్రహించవలెను. ఈ స్థానముల యందు శుభులున్న మంచి ఫలములను, పాపులున్న దుష్ఫలముల నిచ్చువారగుచున్నారు.

స్త్రీజాతకచక్రములో 1-2-4-7-8 లేక 12 స్థానములయందు కుజుడున్న అంగారక దోషము సంభవించి స్త్రీ మాంగల్యమునకు అంతరాయము గల్గి భర్త త్వరలో చనిపోవునట్లు భావించబడుచున్నది. ఇందులోని రహస్యము భర్తకు సంబంధించిన సప్తమ స్థానముగాని లేక మాంగల్యమునకు సంబంధించిన అష్టమ స్థానమున గాని కుజుని వలన సంయోగము చెందినను లేక వీక్షించబడినను దుష్ఫలములు గలుగుచున్నవి. 7-8 స్థానములు కుజవీక్షణ పొందవలెననిన కుజుడు లగ్నము నందుండవలెను. రెండవస్థానము నందున్న కుజుడు అష్టమ స్థానమును,

నాల్గవస్థానము నందున్నవాడు సప్తమస్థానమును, ద్వాదశ స్థానము నందున్న వాడు సప్తమ స్థానమును వీక్షించు చుండుటచే పై స్థానములయందు కుజుడున్నపుడు వాని యొక్క పాపదృష్టి 7-8 స్థానములకే యెక్కువగా యుండి వాని దోషము సంభవించుచున్నది. కాని కొన్ని సందర్భములలో కుజుడు గూడ యోగ కారకుడగు చున్నాడు. సింహ లగ్నమునకు నాల్గవస్థానమైన వృశ్చికరాశియందు కుజుడుండి యోగకారకుడగు చున్నాడు. అంగారకదోషము యొక్క ఫలములు వాని దశాకాలము నందే సంభవించును. ఈ దశాకాలము వివాహమునకు పూర్వమే ముగిచినను లేక స్త్రీ వయస్సు 70 సంవత్సరములకు మిగిలిన తరువాత సంభవించినను స్త్రీ మాంగల్యమునకు కష్టములు గలుగుటగాని లేక తన భర్త వయస్సునకు అంతరాయము గలుగదనే చెప్పవలెను. కాబట్టి పై స్థానములలో కుజుడున్నంత మాత్రముననే జాతక చక్రమును చర్చించక యిందు అంగారక దోషమున్నదని వ్రోసి వేయరాదు. కొందరి అభిప్రాయములో కన్యావరులు యిరువురి జన్మ చక్రములలో అంగారక దోషమున్న సుఖదాంపత్యము గల్గి సజీవులై యుందురని చెప్పుచున్నారు. ఇట్టి జ్యోతిష్కులు యొకరి మరణమునకు యిష్టపడక యిరువురి మరణమునకు కారకులగుదురనియే చెప్పవలయును.

స్త్రీ జాతకములో శుక్రకుజులకు యేవిధమైన సంబంధమున్నను స్త్రీ యొక్క పవిత్రతకు భంగము వాటిల్లును. పురుషజాతకములో సప్తమ స్థానమునందు శుక్రుడున్న జారుడగును. ఏ జాతకమునందైనను లగ్నాధిపతియును, సప్తమాధి పతియు శత్రుత్వము గలిగి యేకస్థానము నందున్నను, లేక యొకరినొకరు వీక్షించు చున్న భార్యభర్తలకు భేదాభిప్రాయములున్నను యిరువురును కలిసి యుండెదరు. లగ్నాధిపతికి సప్తమాధిపతి విరోధియైయున్న జాతకునికి తనయొక్క భాగస్తుడు విరోధిగా యుండును. సప్తమాధిపతి లగ్నమును వీక్షించుచున్నను, లేక లగ్నాధి పతితో కలిసియున్నను భార్యాభర్తలు సఖ్యతగలిగి యుందురు. ఈ విధముగా చర్చించునపుడు జాతకునియొక్క స్వభావము తన జన్మచక్రముయొక్క దానివల్లనే గ్రహించవచ్చును.

రెండు జాతకచక్రములను చర్చించునపుడు వాని లగ్నాధిపతులు యెట్లున్నది గ్రహించవలెను: ఈ లగ్నాధిపతులు మిత్రువులైనను యే యొక్క జాతక చక్రము నందు కలిసియున్నను, లేక యొకరినొకరు వీక్షించుచున్నను భార్యభర్తలు కలిసి జీవించుచుందురు. ఇట్లు వధూవరుల జాతకచక్రములను పరికించి వానికి సఖ్యత గలిగియున్న వివాహము నిశ్చయించుకొనవలెను.

# నక్షత్ర స్వభావ సారణి

## నక్షత్ర గణ, యోని, రజ్జు, కూటములను తెలుపు పట్టిక

| వరుస నెంబరు | నక్షత్రనామము | గణము | యోని | రజ్జు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. | అశ్వని | దేవ | అశ్వము | పాద |
| 2. | భరణి | మానుష | గజము | ఊరు |
| 3 | కృత్తిక | రాక్షస | మేషము | నాభి |
| 4 | రోహిణి | మానుష | సర్పము | కంఠ |
| 5 | మృగశిర | దేవ | సర్పము | శిరో |
| 6 | ఆరుద్ర | మానుష | శ్వానము | కంఠ |
| 7 | పునర్వసు | దేవ | మార్జాలము | నాభి |
| 8 | పుష్యమి | దేవ | మేషము | ఊరు |
| 9 | ఆశ్రేష | రాక్షస | మార్జలము | పాద |
| 10 | మఖ | రాక్షస | మూషక | పాద |
| 11 | పుబ్బ | మానుష | మూషక | ఊరు |
| 12 | ఉత్తర | మానుష | గోవు | నాభి |
| 13 | హస్త | దేవ | మహిష | కంఠ |
| 14 | చిత్త | రాక్షస | వ్యాఘ్ర | శిరో |
| 15 | స్వాతి | దేవ | మహిష | కంఠ |
| 16 | విశాఖ | రాక్షస | వ్యాఘ్ర | నాభి |
| 17 | అనూరాధ | దేవ | మృగ | ఊరు |
| 18 | జ్యేష్ట | రాక్షస | మృగ | పాద |
| 19 | మూల | రాక్షస | శ్వానము | పాద |
| 20 | పూర్వాషాఢ | మానుష | మర్కటము | ఊరు |
| 21 | ఉత్తరాషాఢ | మానుష | నకులము | నాభి |
| 22 | శ్రవణము | దేవ | మర్కటము | కంఠ |
| 23 | ధనిష్ఠ | రాక్షస | సింహము | కంఠ |
| 24 | శతభిషము | రాక్షస | అశ్వము | కంఠ |
| 25 | పూర్వాభాద్ర | మానుష | సింహము | నాభి |
| 26 | ఉత్తరాభాద్ర | మానుష | గోవు | ఊరు |
| 27 | రేవతి | దేవ | గజము | పాద |

## వధూవరులకు పొంతనము జూడవలసిన విధము

సతిపతుల కిరువరులు జన్మనక్షత్రములకు వివాహము చేయుట మహాఉత్తమము. సతిపతుల నామనక్షత్రములకు వివాహము చేయుటము మధ్యమము. సతిపతులలో జననకాలమును బట్టి వుంచిన నామ నక్షత్రము యొకరిది పురుషులకు వుండి స్త్రీకి జననకాల నామనక్షత్రము లేక వేరుగాపెట్టిన నామనక్షత్రమైన ఈ యిరువురికి వివాహము చేయుట అధమము. సతిపతులలో జన్మనక్షత్రము యొకరిదినామనక్షత్రము యొకరిది జేర్చి వివాహము చేయరాదు. దశవిధ పొంతనములైన దిన, గణ, యోని, రాశి, రజ్జు, మహేంద్ర, స్త్రీదీర్ఘ, వశ్య, నాడి, వేధాపొంతనములలో దినము, గణము, యోని, రాశి, రజ్జు యివి ముఖ్యములు. వీనిలో దినమున్ను, రజ్జున్ను బహుముఖ్యములు, బ్రాహ్మముఖ్యములు. బ్రాహ్మణులకు దినకూటమును, క్షత్రియులకు గణకూటమును, వైశ్యులకు రాశి కూటమును, శూద్రులకు యోనికూటమును ముఖ్యము. ఏ పొంతనము యెట్లున్నను రజ్జు పొంతనము సరిలేనియెడల వివాహము దూష్యము

### 1. దినకూటము

స్త్రీనక్షత్రము మొదలుకొని పురుషనక్షత్రము వరకు లెక్కించి 9 చే భాగించగా శేషము సమసంఖ్యయైన శుభము. బేసిసంఖ్య అశుభము. తారాబలము వలెనే దీని శుభాశుభములు గ్రహించవలెను. 1. మృత్యు 2. ముదము 3. బెడద 4. సుఖము 5. మనఃపీడ 6. పశులాభము 7. రోగము 8. సంతానము 9. శాత్రవప్రాప్తి.

### 2. గణకూటము

నక్షత్ర స్వభావసారణియందు నక్షత్రములు దేవ,మానుష, రాక్షసములని 3విధములుగా విభజింపబడినవి. దంపతుల నక్షత్రములు యేకగణమునందున్న యుత్తమము. ఇరువురిలో యొకరిది రాక్షసగణమును, యొకరిది దేవణమైయుండి వివాహము జేసిన యెల్లప్పుడు శత్రుత్వముగా యుండును. దేవగణము యొకరిది మానుషగణము యొకరిదై వివాహముజేసిన యెడల సమముగా యుండును. పురుషునిది మానుషగణము స్త్రీది రాక్షసగణముయై వివాహముజేసిన దోషము లేదు. స్త్రీది మానుషగణము పురుషునిది రాక్షస గణముయై వివాహము జేసిన యెడల పూర్ణ దోషము గల్గును. సతిపతులు యిరువురికి దేవగణమై వివాహము జేసిన మహా వుత్తమము. స్త్రీ పురుషులిరువురిది మానుష గణముయై వివాహము జేసినయెడల మధ్యమము. సతిపతులు యిరువురికి రాక్షస గణముయై వివాహము జేసిన యెడల అధమము.

### 3. యోని కూటము

నక్షత్ర స్వభావసారణియందు నక్షత్రములకు యోనివిభాగము దెలుపబడి యున్నది. ఇవి యేనుగులు, సర్పములు, కుక్కలు, ఎలుకలు, ఎనుములు, పులులు,

మృగములు, గోవులు, నకులములు, సింహములు, మర్కటములని 11 విధములు. అభిజిత్తు, ఉత్తరాషాఢలు నకులములు. ఈ విభజనయందు రెండేసి నక్షత్రములు యొక్కొక్క జాతివై యున్నవి. ఇందు మొదటినక్షత్రము పురుషుడుగను, రెండవ నక్షత్రము స్త్రీ అనియు గ్రహించవలెను. ఇట్లే ఒక జాతి దంపతులకు పొంతనము కుదురుట యుత్తమము. అట్లు కుదరక భిన్నజాతి నక్షత్రములు గలిగివప్పుడు ఈ క్రింది జంతుద్వయములకు నైసర్గిక విరోధముగాన విరోధకూటము వర్ణింప వలయును. గోవ్యాఘ్రములు, గజసింహములు, అశ్వమహిషములు, మూషిక మార్జాల ములు, శ్వానహరిణములు, మర్కటమేషములు.

### 4. రాశి కూటము

వధూవరుల జన్మరాశ్యాధిపతులు మిత్రులైనను, సములైనను వివాహము చేయవచ్చును. పరస్పర శత్రువులుగాయున్న వివాహము జేయరాదు.

### 5. రజ్జు కూటము

నక్షత్ర స్వభావ సారణిలో నక్షత్రములకు రజ్జుభాగము దెలిపియున్నది. ఇది యైదు విధములు. శిరో, కంఠ, నాభి, ఊరు, పాద, రజ్జులు. దంపతులు నక్షత్రములు భిన్నరజ్జుగా యుండుట వివాహమునకు శుభము. సతీపతులకు శిరోరజ్జు యొకటిగా యున్న పతికి దోషము. కంఠరజ్జు యొకటిగా యున్న స్త్రీకి దోషము నాభిరజ్జు యిరువురికి యొకటిగాయున్న పుత్రులకు దోషము. ఊరురజ్జు యొకటి యైన సస్యాది నాశము, పాదరజ్జు యిరువురికి యొకటిగాయున్న సతిపతులు కూడ కుండ విడువబడుదురు. దిన, మహేంద్ర, రాశి పొంతనములు సరిగా గూడిన రజ్జు దోషముండినను దోషములేదు.

### 6. మహేంద్ర కూటము

స్త్రీనక్షత్రము మొదలు పురుషనక్షత్రము వరకు లెక్కించగా 4-7-10-13-16-19-22-25 అయిన శుభము. అట్లుకానిది అశుభము.

### 7. స్త్రీ దీర్ఘ కూటము

స్త్రీనక్షత్రము మొదలుకొని పురుషనక్షత్రము పదమూడవ నక్షత్రమునకు తరువాత యుండిన సుభము.మహేంద్రకూటమునందు 13లోపున 4-7-10 శుబకరములే యని చెప్పబడినది.

### 8. వశ్య కూటము

మిధునమునకు కన్య, కర్కాటకమునకు వృశ్చిక ధనుస్సులు, సింహమునకు తుల, కన్యకు ధుర్మీనములు, తులకు మకరకన్యలు, వృశ్చికమునకు కర్కాటకము, ధనుస్సునకు మీనము, మకరమునకు మేషకుంభములు, కుంభమునకు మేషము, మీనమునకు మకరమున్ను వశ్యరాశులు. స్త్రీ పురుషుల జన్మ లగ్నములు మీన తులలుగా నుండినను, మిధున వశ్చికములుగానున్నను, కుంభ కర్కాటకములుగా యున్నను, మేషకన్యలుగాయున్నను, వృషభ ధనుస్సులుగా నుండినను, మకర సింహములుగా నుండినను వివాహము జేయగూడదు.

## 9. నాడీ కూటము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| కృ | రో | ఆ | మ | స్వా | వి | ఉ | శ్ర | రే |
| భ | మృ | పు | పు | చి | అ | పూ | ధ | ఉ |
| అ | ఆ | పు | ఉ | హ | జ్యే | మూ | శ | పూ |

నడిమిరేఖలలో సతిపతి నక్షత్రములు యొకచోట నిలిచి నట్లయైన నాడీ పొంతనములేదు. గనుక వివాహము చేయగూడదు. సతిపతి నక్షత్రములు నిడివి లేఖలలోకూర్చి యున్న యెడల సంపత్తు వొశోషించి యుండును. ఉత్తమము. ఇది జన్మనక్షత్రములకు తప్పక ఫలించును.

## 10. వేధా కూటము

ఈ క్రింది నక్షత్రముల జంటలు పరస్పర వేధలుగలవి. కావున సతిపతుల నక్షత్రములకు వెధలుగలిగియుండరాదు. అశ్వనికి జ్యేష్ట. భరణికి అనూరాధ. కృత్తికకు విశాఖ. రోహిణికి స్వాతి. మఖకు రేవతి. పుబ్బకు ఉత్తరాభాద్ర., ఉత్తరకు పూర్వాభాద్ర. హస్తకు శతభిషము. మూలకు ఆశ్లేష. పూర్వాషాఢకు పుష్యమి. ఉత్తరాషాఢకు పునర్వసు. శ్రవణకు ఆరుద్ర. ద్విపాద నక్షత్రములగు చిత్త. మృగశిర. ధనిష్టలు పరస్పర వేధలు గలవి.

### జాతకుని వయస్సును బట్టి ఫలములను తెలుపు స్థిరమైన చిత్తు పద్ధతులు

| వరుస నెంబరు | జాతకుని వయస్సు | అధికారము పొందిన గ్రహములు |
|---|---|---|
| 1 | జననము నుండి 4సంవత్సరముల వరకు | చంద్రుడు |
| 2 | 5 నుండి 14సంవత్సరముల వరకు | బుధుడు |
| 3 | 15 నుండి 22సంవత్సరముల వరకు | శుక్రుడు |
| 4 | 23 నుండి 41 సంవత్సరముల వరకు | సూర్యుడు |
| 5 | 42 నుండి 56సంవత్సరముల వరకు | కుజుడు |
| 6 | 57 నుండి 68 సంవత్సరముల వరకు | గురుడు |
| 7 | 69 సంవత్సరముల పై నుండి మరణము వరకు | శని |

39 సంవత్సరముల వయస్సుగల జాతకుడు వచ్చి తన జాతకచక్రమును చూపించినపుడు అందు రవి ధృగ్యోగాదిసంబంధముగలవాడై పాపగ్రహవీక్షణము పాపగ్రహసంయోగము చెందియుండి కుజుడు బలవంతుడైయున్న జాతకునికి 41

సంవత్సరము తో అన్నివిధములైన బాధలు తప్పుననియు, 42 నుండి 56 సంవత్సరాంతమువరకు మంచికాలముగా యుండునని చెప్పవలెను. పైన ఉదహరించిన గ్రహముల యొక్క దశాకాలములు అందరికి యొకే విధముగా యుండును. జాతకుని యొక్క జన్మరాశిచక్రమును పరికించి ముందురాబోవు దశాకాలములో గ్రహము శుభప్రదుడై శక్తివంతుడై యున్న జరుగబోవు దశాకాలము శుభప్రదమై యుండునని చెప్పవలెను. జాతకచక్రమునందు యేగ్రహమైనను బలహీనుడై అశుభప్రదుడై యున్న అట్టివాని కాలమున కష్టనష్టములు గలుగునని చెప్పవలెను.

## రెండవ విధానము

ఒక్కొక్క సంవత్సరము యొక్కొక్క గ్రహమునకు నిర్ణయించబడినది. రవి--22, చంద్రుడు--24, కుజుడు--28, బుధుడు--32, గురుడు--16, శుక్రుడు--25, శని--36, రాహువు--42, కేతువు--48.

జాతకుడు 20 వ సంవత్సరము వయస్సునందు వచ్చి నేను ఉద్యోగములో యెప్పుడు ప్రవేశించగలను అని అడిగినప్పుడు తన జాతకచక్రములో రవి సింహరాశిలో దశమస్థానమునందున్న తనకు 22వ సంవత్సరములో (రవి సంవత్సరము 22) మంచి ఉద్యోగము ప్రాప్తించునని చెప్పవలెను. అదే రవి బలహీనుడై దృగ్యోగాధి సంబంధముగలవాడై పాపగ్రహసంయోగము పాపగ్రహ వీక్షణము గల్గియున్న జాతకుని 22 సంవత్సరము అశుభప్రదమైయుండును.

ఉదాహరణము 2 : ఒక బాలిక 23 వ యేట వచ్చినా వివాహము యెప్పుడు జరుగును అని అడిగినపుడు ఆమె జన్మచక్రములో చంద్రుడు బలవంతుడై సప్తమ స్థానమునందుండి గురునిచే వీక్షించ బడుచున్న ఆమెకు 24 సంవత్సరములో వివాహము జరుగునని చెప్పవచ్చును. ఇందుకు కారణము చంద్రుడు వివాహ రాశియైన సప్తమ స్థానమునందుండి గురునిచే వీక్షించబడుచుండుటచే వివాహము జరుగును.

ఈ సంవత్సరముల యొక్క ప్రాముఖ్యతను యింకొక విధముగా వుపయోగించవచ్చును. నవమస్థానాధిపతి రవియై రాశిచక్రములో యేదో యొక మంచి స్థానము నందున్నాడనుకొందము. ఈ నవమస్థానము భాగ్యరాశియై మంచి అదృష్టము గలదియై యుండుటచే జాతకునికి 23 వ సంవత్సరము శుభప్రదమై యుండునని చెప్పవలెను.

ఉదాహరణము 3 : మకర రాశి లగ్నమైయున్న సప్తమస్థానమునకు చంద్రుడు అధిపతియగును. రాశిచక్రములో మంచిస్థానము నందైననూ చంద్రుడు యున్న యెడల 24 వ సంవత్సరములో జాతకునికి వివాహము జరుగునని చెప్పవలయును.

## మూడవ విధానము

జాతకచక్రమునందు గల స్థానములకును జాతకునియొక్క వయస్సునకు గల సాదృశ్యము.

| వరుస నెంబరు 1 | స్థానము యొక్క నామము 2 | వయస్సు సం.ములలో 3 |
|---|---|---|
| 1 | సప్తమస్థానము | 1 నుండి 24 |
| 2 | దశమ స్థానము | 25 నుండి 26 |
| 3 | ఏకాదశ స్థానము | 27 నుండి 38 |
| 4 | ద్వాదశ స్థానము | 29 నుండి 30 |
| 5 | లగ్న స్థానము | 31 నుండి 33 |
| 6 | ద్వితీయ స్థానము | 34 నుండి 36 |
| 7 | తతీయ స్థానము | 37 నుండి 39 |
| 8 | చతుర్థ స్థానము | 40 నుండి 45 |
| 9 | పంచమ స్థానము | 46 నుండి 51 |
| 10 | షష్ట స్థానము | 52 నుండి 57 |
| 11 | సప్తమ స్థానము | 58 నుండి 65 |
| 12 | అష్టమ స్థానము | 66 అంతకుపైన |

38 సంవత్సరముల వయస్సుగల జాతకుడు వచ్చి తన జాతక చక్రము చూపించి నపుడు 37 నుండి 39 సంవత్సరమువరకు తృతీయస్థానమును సూచించు చుండుటచే తృతీయస్థానమును బట్టి ఫలములను చెప్పవలెను. తృతీయ స్థానము నందున్న గ్రహములు బలహీనులై పాపగ్రహసంయోగము పాపగ్రహవీక్షణము గల్గి యుండుట చేతను, నాల్గవస్థానాధిపతి బలవంతుడై నాల్గవ స్థానమునందుండి శుభగ్రహ వీక్షమము గల్గి యుండుచేటే 30 వ సంవత్సరాంతములో తన కష్టము లన్నియు యీడేరి 40 నుండి 45 సంవత్సరము ఆఖరు వరకు శుభప్రదమై సుఖసౌఖ్యముల పొందగలడని చెప్పవలెను.

## నిత్యనక్షత్ర దశాఫలములు

జన్మనక్షత్రము లేనియెడల నామనక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు, లెక్కించిన సంఖ్యను 7 చే గుణించి 9 చే భాగించగా మిగిలిన సంఖ్యలచే రవ్యాధి గ్రహక్రమముగా 1. సూర్యుడు 2. చంద్రుడు 3. కుజుడు 4. బుధుడు 5. బృహస్పతి 6. శుక్రుడు 7. శని 8. రాహువు 9. కేతువు ఈ క్రమముగా నిత్య దశాధిపతులగుదురు.

1. రవిఫలము : సూర్యుడు నిత్యదశాధిపతియయిన శిరోవ్యాధి, మనోవ్యాధి, శత్రుసముదాయమునందు సంచారము, అధికారులయందు కలహము, అకాలమందు భోజనము, శూరత్వము, కోపము, మనస్సునందు విచారము, మరణవార్తా శ్రవణము, శరీరాయాసము, కార్యవిఘ్నము జరుగును.

2. చంద్రఫలము : చంద్రుడు నిత్యదశాధిపతియయిన అధికారులయొక్క దర్శనము వలన లాభము, పుష్పవస్త్రముల యొక్క దర్శనము, దేవ బ్రాహ్మణుల యందు భక్తి, స్త్రీ ధరించు శస్త్రము దొరకుట, దూరవార్తయొక్క శ్రవణము, శీతల పదార్థ సంప్రాప్తి, మనస్సునందు విష్ణు భక్తి, మిత్ర దర్శన లాభము, సుఖ భోజన ప్రాప్తి సంభవించును.

3. కుజఫలము : కుజుడు నిత్యదశాధిపతి యయిన ధనము విషయమై కఠినముగా ఆలోచించుట, ధనలుబ్ధత, కఠినమనస్సు, విచారము, అధిక కోపము, దూర వార్తలు వినుట, రాజభయము, శత్రుభయము, ప్రయాణము, విశేషకలహము, బ్రహ్మద్వేషము యొక్క సంప్రాప్తి కలుగును.

4. బుధఫలము : బుధుడు నిత్యదశాధిపతియయిన బంధుదర్శన లాభము, విద్యాప్రాప్తి, ధనాగమము, రాజవృత్తాంత శ్రవణము, శుభవార్తలు వినుట, పరగృహనివాసము, బ్రహ్మజ్ఞానము, కుశాగ్రబుద్ధి, మంత్రసిద్ధి, మిత భోజనము, జ్యోతిశ్శాస్త్రమందు వ్యాసంగము సంభవించును.

5. గురుఫలము : బృహస్పతి నిత్యదశాధిపతి యయిన వేద విద్యా గోష్ఠి, దేవ బ్రాహ్మణులయందు భక్తి గలుగును. మనస్సునకు ఉత్సాహకార్యము, స్నానము, వస్త్రము మొదలుగాగల అలంకారములు, సౌఖ్య భోజన లాభము కలుగును.

6. శుక్రఫలము : శుక్రుడు నిత్యదశాధిపతియయిన తాంబూలాది సౌఖ్యము, సువర్ణలాభము, వస్త్రలాభము, కందమూల ఫలాదులయొక్క సంప్రాప్తి, రాజసన్నిధియందు స్వాతంత్ర్యమును, సుఖమును, సౌఖ్యభోజన ప్రాప్తి, స్నేహితుల దర్శనమువలన లాభము కలుగును.

7. శనిఫలము : శని నిత్యదశాధిపతి యయిన లభించిన కార్యము యొక్క వినాశమును, మనోవికలము, అధిక నిద్ర, మంద బుద్ధియు, యత్నించిన కార్యము చెడిపోవుట, శూద్రునితో కలహము, మనోవిచారము, అధికాయాసము నిచ్చును.

8. రాహుఫలము : రాహువు నిత్యదశాధిపతియయిన మ్లేచ్ఛజనులవల్ల భయము, ఋణమిచ్చిన వారివలన బాధ, శత్రు బాధయును, భోజనమందు రుచిలేక పోవుట, దుర్మార్గబుద్ధి, దుస్టాచారము, సర్పదర్శనము సంభవించును.

9. కేతుఫలము : కేతువు నిత్యదశాధిపతియయిన నౌకరులయందు కోపము కలుగుట, ప్రతి మనుష్యునితో కలహము, మనస్సునకు భీతి, భయము, దుష్ట సంభాషణము, ప్రయాణము, రాజభయము సంభవించును.

## ఇంద్రధనుస్సు లక్షణములు

1. ఇంద్రధనుస్సు వర్షములు పడినపుడు కన్పించిన వర్షము తగ్గును. వర్షములు లేనప్పుడు కన్పించిన వర్షించును. పడమర దిక్కున ఇంద్రధనుస్సు

పడిన అవిచ్ఛిన్నముగా వర్షములు కురియును. రాత్రివేళ తూర్పుదిక్కున ఇంద్రధనుస్సు కనుపించెనేని రాజులకు పీడకల్గును.

2. సూర్యునికి గాని చంద్రునికిగాని చుట్టూ గిరిగీచినట్లు తెల్లని రేఖ కన్పించును. దీనినే పరివేషమందురు. అట్టి పరివేషము మొదటి జామునయైన పీడ, 2వ జామున గాలివాన, 3వ జామున ధాన్యనాశము, 4వ జామున భూకంపమును సూచించును.

## అనావృష్టి యోగములు

స్వాతీశ్లేషా ఉత్తరయందు కుజుడు ప్రవేశించుట, రవికి బుధుడు పురోచారమునందుండుట, బుధ శుక్రులకు రవిమధ్య బడుట, శుక్రుని యెదుట శని సంచారము గలుగుట, పురోఅంగారక రూపదోషము, రవి, గురులసమసప్తకస్థానస్థితి, శుక్రునకుముందు, బుధ సంచారము గలుగుట, గురు శుక్రులకు సమసప్తక స్థానస్థితి, స్వాతి, విశాఖ, అనూరాధలయందు శుక్రుడు సంచరించుట, యిత్యాదులు అనావృష్టి యోగములలో కొన్నిగా నెరుగవలయును.

## దుర్భిక్ష యోగములు

రెండు గ్రహములు శత్రుగృహమునయున్న రాజులకు క్షోభ గల్గుజేయుదురు. మూడు గ్రహములు కూడిన రాజవినాశము గల్గును. నాల్గు గ్రహములు శత్రుగృహమున చేరిన రాజ్యనాశమగును. పంచగ్రహములు చేరిన ముల్లోకములు నాశనమగును.

పుష్యమాసమున ఐదు శనివారములు వచ్చినను, మాఘమాసమున ఐదు ఆదివారములు వచ్చినను, పాల్గుణమాసమున ఐదు మంగళవారములు వచ్చినను భూమి నాశనమగును. అనగా ఉపద్రవములు గల్గునని భావము.

ధనుర్మీన రాశులయందు శని, మకర కుంభరాశులయందు గురు సంచారమున్నపుడు జనులకు దుర్భిక్షాది భయము కల్గును.

చైత్ర, వైశాఖ, జేష్ఠ, ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర మాసములందు ఐదు ఆదివారములొకే మాసమున వచ్చిన యెడల రాజులు నశించురు. జనులు దుర్భిక్షపీడితులగుదురు.

రాహువు, శని, కుజ, రవి, చంద్ర, శుక్ర, గురు, బుధులు యెప్పుడైననూ ఒకే లగ్నమున కలిసినచో భూమి అంతయూ హహాకారములతో నిండి పోవును రాజ్యము నశించును. మంచు పడును, భూకంపములు వచ్చును. అది సర్వ సంహార కారియగును.

## పుట్టుమచ్చల యొక్క ఫలములు

నుదుటి యొక్క కుడిభాగమందైన, కుడికణత మీదనైనయున్న ధనము, సంపద కలుగును. కుడిచెవియొక్క చివరనున్న నీటిగండము కలుగును. కుడిచెవి మీద గాని, యెడమచెవిమీదగాని యున్నవారు ధనవంతులు, గౌరవనీయులు, కండ్ల

యొక్క యెడమ కొలుకులయందున్న మనస్తాపము గలవారగుదురు. కనుబొమ్మల పైనున్న వివాహము త్వరగానగును. ముక్కు రంధ్రములక్రింద భాగము ననున్న అదృష్టవంతులగుదురు. ముక్కుపైనున్న ప్రయాణాలు చాలాచేయుదురు. కుడి బుగ్గపైనున్న వయసు వచ్చుసరికి వివాహమగును. గడ్డముపైనున్న గొప్ప వారగుదురు. పైదవులపైనున్న తిండిపోతులగుదురు. మెడపైనున్న భాగ్యవతియైన భార్య దొరుకును. మెడవైపు కుడిప్రక్కనున్న చాలా గొప్పవారగుదురు. భుజము పైనున్న బాధ పొందుదురు. ఎడమ భుజముపైనున్న జగడము లాడుదురు. కుడి చేతిపైగాని, కుడిభుజము పైగాని యున్న బుద్ధిమంతులును, దూరదృష్టి గలవారునుఅగుదురు. చంకకును, గుండెకును దగ్గరనున్న ధనవంతులును, గౌరవనీయులును అగుదురు. చేతిమీద నున్నవారు ఐశ్వర్యము కలిగి పిల్లలవలన సుఖమును, సంతోషమును పొందుదురు. కుడిరొమ్ముపై నున్నవారు మంచి తెలివితేటలు గలవారై కష్టపడి పనిచేయువారై యుందురు. రొమ్ముయొక్క యెడమ భాగముననున్న దారిద్ర్యముచే బాధింపబడుదురు. గుండెకెడమ భాగముననున్న దుర్మార్గులు, మోటుగా మాట్లాడువారు, తొందర స్వభావము కలవారునగుదురు. కడుపుపైనున్న తిండిపోతులగుదురు. కడుపుకు క్రిందభాగమున నున్న సాధారణముగా జబ్బులతో బాధపడుదురు. కడుపుకెడమ ప్రక్కలో యున్న సంతోషమును, మితిమీరినసౌఖ్యమును కోరుదురు. కడుపుకు మధ్యభాగమునున్న జబ్బుతో బాధపడుదురు. మొలమీదనున్న వారు దరిద్రులగుదురు. ఎడమ తొడమీదనున్న సుఖసంబంధమైన జబ్బుతో బాధపడుదురు. కుడితొడపై కాని అండత్రయము మీదగాని యున్న చాలా ధనమును కలిగియుందురు. లేదా వివాహము మూలముననగానీ, వివాహానంతరము గానీ గొప్ప ధనవంతు లగుదురు. మోకాలిపైనున్న స్త్రీ మంచి నడవడి కలిగి, ప్రేమగల భర్తను కలిగియుండును. కుడిపాదముమీద గలవారు మంచి తెలివి గలవారును, మంచి వాచలతాగలవారై యుందురు. కాళ్ళగుత్తుల మీదను, పాదాల మీదనున్న పురుషులు స్త్రీ స్వభావులుగను స్త్రీలు పురుష స్వభావులుగా నుందురు.



# A. S. RAO'S LITERATURE IN ASTROLOGY

1. దత్తనాడి-ప్రథమ స్కంధము:- నిరయనపద్ధతి-నష్టజాతకము-నక్షత్రనాడి గ్రహదశాభుక్తి ఫలములు-ద్వాదశ భావములు-భృగుసూత్రములు-అనేక నాడీ విశేషములు-యోగావయోగములు, 742 పేజీలు. - రూ. 150-00

2. దత్తనాడి - ద్వితీయ స్కంధము - సాయన పద్ధతి - సర్వజనుల భవిష్యత్ గ్రంథము - గ్రహములు వివిధ రాశులు, డిగ్రీల యందున్న పుడు జాతకుని జన్మ లక్షణము - 306 పేజీలు లిమ్ బైండు — రూ. 75-00

3. గ్రహసంహిత పూర్వార్థము - ప్రథమ ద్వితీయ స్కంధములు - లగ్న, అంశ, భావ మొదలగు చక్రములు వేయు విధానములు - ద్వాదశ భావ ఫలములు - అనేకనాడీ విశేషములు - 600 గ్రహ యోగములు 616 పేజీలు ఆఫ్ సెట్ ప్రింటు — రూ. 180-00

4. గ్రహసంహిత - ఉత్తరార్థము - ప్రథమ స్కంధము గ్రహదశాభుక్తి అంతర్దశా ఫలములు - సౌర సంవత్సర ఫలములు — రూ. 75-00

5. గ్రహసంహిత - ఉత్తరార్థము - ద్వితీయ స్కంధము - ప్రశ్నతంత్రము గోచార ఫల విశేషములు — రూ. 50-00

6. నాడీ రహస్యాలు - జాతకుని జన్మ తేది, వారము, తిథి, నక్షత్రమును కనుగొను విధానము - లగ్న, అంశ, భావ చక్రములు వేయు విధానము వాని పట్టికలు — రూ. 45-00

7. గృహ సృష్టి - పూర్వార్థము - ముహూర్త, వాస్తు భాగములు - ఏకవింశతి మహాదోషములు - గృహ వాస్తు సర్వవిషయములు - 103 గృహవేధలు పద్య తాత్పర్యములతో — రూ. 80-00

8. గృహ సృష్టి - ఉత్తరార్థము - నిర్మాణ భాగము - గృహ నిర్మాణ పద్ధతులు - ఫెర్రో కాంక్రీటు - శ్లాబులు, బీములు - అనేక బిల్డింగు ప్లానులతో — రూ. 75-00

9. వాస్తు కవచము - సర్వవాస్తు సమీక్ష - 103 గృహ వేధలు - భూ, వన, కూప, ద్వార, కవాట, గృహ లక్షణములు — రూ. 20-00